

# బృహదారణ్యకోపనిషత్

పదవిభాగ ప్రతిపదార్థ తాత్పర్యసహితము


రచయిత :

బ్రహ్మశ్రీ సోమయాజుల వేంకటశివశాస్త్రిగారు

సంపాదకులు

శ్రీ దువ్వూరి రామకృష్ణరావుగారు బి.ఏ.,



ప్రకాశకులు :

శ్రీవ్యాసాశ్రమము

శ్రీవ్యాసాశ్రమము పోస్టు, ఏర్పేడు మార్గము

చిత్తూరు జిల్లా, (ఆ. ప్ర. ), ఫోన్ : 08578 - 68528

2001

| | | | |
|---|---|---|---|
| ప్రథమ ముద్రణ | - | 1960 సం॥ | 1000 ప్రతులు |
| ద్వితీయ ముద్రణ | - | 1981 సం॥ | 1000 ప్రతులు |
| తృతీయ ముద్రణ | - | 2001 సం॥ | 2000 ప్రతులు |

వెల :- రూ.100-00

ఓం

## ప్రకటన



శ్రీవ్యాసాశ్రమము, ఇట్లు
2-8-1960. మేనేజరు.

ప్రతులకు :-
మేనేజరు - శ్రీవ్యాసాశ్రమము,
వ్యాసాశ్రమం పోస్టు, (వయా) ఏర్పేడు,
చిత్తూరు జిల్లా, (ఆం.ప్ర.), 517 621
ఫోన్ నెం: 08578- 68528

ముద్రణ:-
శ్రీ పారాశర్య ముద్రాక్షరశాల, శ్రీ వ్యాసాశ్రమము.

ఓమ్

# సంపాదకీయము

---

ప్రాణో హ్యేష యస్సర్వభూతైర్విభాతి విజానన్ విద్వాన్భవతే,
నాతివాదీ, ఆత్మక్రీడఆత్మరతిః క్రియావానేష బ్రహ్మవిదాం వరిష్ఠః॥
ముండక 3.1.4.

బ్రహ్మనిశ్వసితమనబడియెడి ప్రతీతితో నలరారు వేదములలో శుక్లయజుర్వేదాంతర్గతశతపథబ్రాహ్మణభాగమునందంతిమభాగమునందలి ఆరు అధ్యాయములు బృహదారణ్యకోపనిషత్తు అను నామమున ప్రసిద్ధమై యున్నది. ఈయుపనిషత్తునందు ఉపదేశప్రధానమైన మొదటి రెండుఅధ్యాయములకు మధుకాండమని పేరు. తృతీయ చతుర్థాధ్యాయములు రెండును ఉపపత్తిప్రధానమైనవి. దీనికి యాజ్ఞవల్క్యకాండము లేక మునికాండమని పేరు. ఉపాసనావిషయకమైన చివర రెండధ్యాయములను ఖిలకాండమనియెదరు. బృహదారణ్యకోపనిషద్గ్రంథమంతయు మొత్తమున 47 బ్రాహ్మణములుగ విభక్తమైయున్నది. బృహత్తను శబ్దము సూచించునటుల ఉపనిషత్తులలోకెల్ల గ్రంథవిస్తృతికేమి, బ్రహ్మవిద్యావిషయమునకేమి ఇది బృహత్తరమైనది ఇక అరణ్యశబ్దమును చూతము. అరమణం భవతి ఇత్యరణ్యమ్. జనులిందు రమింపరు గనుక అరణ్యము (ప్రతిషేధపూర్వకమగు రముక్రీడాయామ్ అను ధాతువునుండి). అట్టి అరణ్యమునందు ఏకాంతవాసముచే, అంతర్ముఖులైన ఋషులచే దర్శింపబడి శిష్యపరంపరకు శ్రవణ, మనన, నిదిధ్యాసనపూర్వకముగ పొందదగిన విషయము ఇందు గలదు గాన దీనికి ఆరణ్యకమని పేరు. ఉపనిష

చ్ఛబ్దము ఉప, ని, పూర్వకమగు సద్ ధాతువునుండి కల్గినది. ఇందు ప్రతిపాదింపబడిన యే బ్రహ్మవిద్యచే జరామరణాద్యనర్థజాతము నాశనమగునో, అవిద్యాసంసారాది కారణములు పటాపంచలగునో, పరబ్రహ్మము పొందనగునో అట్టి విషయముగల గ్రంథమునకు ఉపనిషత్తందురు.

భిద్యతే హృదయగ్రంథి-శ్ఛిద్యంతే సర్వసంశయాః,
క్షీయంతే చాస్య కర్మాణి తస్మిన్ దృష్టే పరావరే॥

ముండక. 2.2.8.

యదా సర్వే ప్రభిద్యన్తే హృదయస్యేహ గ్రన్థయః,
అథ మర్త్యోఽమృతో భవత్యేతావ దనుశాసనమ్

కఠ 2.3.15,

పై రెండు శ్రుతులు పలుకుచున్న జ్ఞానబోధ బృహదారణ్యకోపనిషత్తునందు కడువిపులముగ గలదు. అందులకే శ్రీమచ్ఛంకర భగవత్పాదులు ఉపనిషద్భాష్యములలోకెల్ల బృహదారణ్యకభాష్యమున వారి పాండిత్యప్రకర్షను చూపించియుండిరి. సురేశ్వరాచార్యులవారు ఈగ్రంథమునకు బ్రహ్మాండమైన వార్త్తికమును వ్రాసియున్నారు. ఇట్టి యుపనిషద్రాజమునగల మోక్షవిషయమును అవగతము చేసికొనుటకు నావంటివానికి సుబోధమగునట్టి ఆంధ్రమున పదవిభాగ, ప్రతిపదార్థ, తాత్పర్యసహితమైన బృహదారణ్యకోపనిషత్తు ఇదితప్ప ప్రస్తుతమున మరియొకటి కనబడుటలేదు. ఈగ్రంథము సం॥ 1898 రం॥న బ్రహ్మశ్రీ సోమయాజుల వేంకటశివశాస్త్రిగారిచే వ్రాయబడి, శ్రీమన్నవ బుచ్చయ్య పంతులుగారిచే సరిచూడబడి, తెలుగు తెలిసిన ప్రజల యుపయోగార్థమై ముద్రింపబడినది. సుబోధమై, తేలికయై, అతిరమణీయమైన ఇందలి శైలిని జూచియు జూడగనే ముగ్ధుడనైతిని.

# ఈ గ్రంథమునందలి షడ్లింగముల సూచిక

ఒక ప్రకరణమునందలి గూఢార్థమునకు జ్ఞాపకములగు (పొందింపజేయునట్టి) సూచనలకు లింగములని పేరు. ప్రతిగ్రంథము ఇట్టి లక్షణము లారింటిని గల్గియుండవలెను. వీనినే షడ్లింగములందురు. (1) ప్రకరణ ప్రతిపాద్యవిషయప్రారంభవర్ణనము ఉపక్రమము. అంతిమవర్ణనము ఉపసంహారము. ఏకార్థబోధకములయినపుడు, ఇవి రెండునుచేరి ఉపక్రమోపసంహారరూపలింగమగును

(1) ఆ యర్థమె పునరావృత్తమైనచో నభ్యాసమగును.

(2) ప్రత్యక్షానుమానాది ప్రమాణాంతరములకు గోచరముకాని యర్థము అపూర్వము. అట్టి యర్థబోధకత్వము అపూర్వత.

(3) అమృతత్వము లేక మోక్షప్రాప్తి మున్నగు సిద్ధి, లేక ప్రయోజనమునకు ఫలమని పేరు.

(4) ప్రకరణప్రతిపాద్యవిషయ ప్రశంసగాని తద్విపరీతమగు నట్టి దానిని నిందించుటనుగాని అర్థవాదమందురు.

(5) ప్రతిపాద్యవిషయమును స్పష్టముచేయుటకై దృష్టాంతాదికము లగు అనేకరూపములగు యుక్తులను తెల్పుట ఉపపత్తియందురు.

ఈ విధముగ షడ్లింగవిచారణచే ఈగ్రంథమునందలి తత్త్వమును వివేకవైరాగ్యములతో నిర్ణయముచేసికొన జ్ఞానప్రతిబంధకములగు సంశయాంశములు నశించి (నిరుపాధికమైన) నిర్గుణపరమైన ఆత్మజ్ఞానమే వేదాంతరహస్యముగ ఎఱుకయగుచున్నది. ఈసందర్భమున ఈగ్రంథమునందలి (పుటలు 556, 557, 563, 567) 4 4.21 నుండి 25 వఱకునుగల బ్రాహ్మణభాగములు ముఖ్యముగ పఠనీయములు.

## ఖి ల కాం డ ము.

బృహదారణ్యకమునందలి తుదిరెండధ్యాయములను ఖిలకాండమనియెదరు. ఖిలమను పదమునకు అనుబంధమనియు, కాండమను పదమునకు గ్రంథములోని భాగమనియు అర్థము. మొదటి నాలుగు

అధ్యాయములయందు నిర్గుణపరబ్రహ్మబోధ నిర్ధారణ కాబడినది. ఇంతవఱకు చెప్పబడని, సగుణబ్రహ్మోపాసన ఇందు ప్రతిపాదింపబడినది. ఈ రెండు అధ్యాయములందు లోగడ చెప్పబడని, కర్మకాండమునకు విరుద్ధముగాని, అన్యమైన అభ్యుదయశ్రేయోదాయకములగునట్టియు, క్రమముక్తిద్వారమున బ్రహ్మలోకావాప్తికి సాయపడునట్టియు, ఉపాసనలిందు తెలుపబడినవి. ఇటుల నీగ్రంథమునందలి ఆరు అధ్యాయములు పూర్వోత్తర సంబంధమునుగల్గియున్నవి.

షడ్లింగసూచిక.

1 తృతీయాధ్యాయము

(1) ఉపక్రమము- ఆత్మేత్యేవోపాసీత. (పుట 72; 1.4.7)

ఉపసంహారము- ఆత్మానమేవ లోకముపాసీత. (పుట 93; 1.4.15)

(2) అభ్యాసము- (అ) తదేతత్పదనీయమస్య సర్వస్య యదయమాత్మా (పుట 72; 1.4.7)

(ఆ) తదేతత్ప్రేయః (పుట 8; 1.4.8) నుండి అహంబ్రహ్మాస్మీతియను మహావాక్యము (పుట 80; 1-4-10) వఱకు.

(3) అపూర్వత- తదాహుర్యద్బ్రహ్మవిద్యయా సర్వం భవిష్యంతో మనుష్యా మన్యన్తే (పుట 79; 1.4.9)

(4) ఫలము- య ఏవం వేదాహంబ్రహ్మాస్మీతి స ఇదగ్ సర్వంభవతి (పుట 80; 1.4.10)

(5) అర్థవాదము- (అ) స్తుతి- తస్య హ న దేవాశ్చ నాభూత్యా ఈశతే ఆత్మా హ్యేషాగ్ స భవతి (పుట 80; 1.4.10)

(ఆ) నింద- అథ యోఽన్యాం దేవతాముపాస్తేఽన్యోఽసావన్యోఽహమస్మీతి న స వేద, యథా పశురేవగ్ (పుట 80; 1.4.10)

(6) ఉపపత్తి- (అ) ఆత్మైవేదమగ్ర ఆసీదేకఏవ (పుట 99; 1.4.17)
(ఆ) సః ఏష ఇహః ప్రవిష్టః ఆనఖాగ్రేభ్యః (పుట 72; 1.4.7)

## చతుర్థాధ్యాయము.

(1) ఉపక్రమము- (అ) బ్రహ్మ తే బ్రవాణీతి (పుట 158; 2.1.1
(ఆ) వ్యేవ త్వా జ్ఞాపయిష్యామీతి (పుట 183; 2.1.15)

ఉపసంహారము- (అ) య ఏష విజ్ఞానమయః పురుషః (పుట 185; 2.1.16)
(ఆ) తదేతద్బ్రహ్మా పూర్వమనపరం . . . . . ఇత్యను శాసనమ్. (పుట 271; 2.5.19)

(2) అభ్యాసము (అ) అథాత ఆదేశో నేతి నేతి ... సత్యస్య సత్యమితి (పుట 215; 2.3.6)
(ఆ) స యో౽యమాత్మే దమమృతమిదం బ్రహ్మేదగ్ం సర్వమ్ (పుట 244; 2.5.1)

(3) అపూర్వత- విజ్ఞాతారమరే కేన విజానీయాదితి (పుట 241; 2.4.14)

(4) ఫలము- యత్ర వా అస్యసర్వమాత్మైవాభూత్తత్కేన కంజిఘ్రేత్ ఇత్యాది (పుట 241; 2.4.14)

(5) అర్థవాదము-(అ)స్తుతి-ఆత్మనో వాఅరేదర్శనేన శ్రవణేన, మత్యా విజ్ఞానే నేదగ్ం సర్వం విదితమ్ (పుట 222; 2.4.5)
(ఆ) నింద- బ్రహ్మ తం పరాదాద్యో౽న్యత్రాత్మనో బ్రహ్మ వేద (పుట 226; 2 4.6)

(6) ఉపపత్తి- స యథోర్ణనాభిస్తన్తు నోచ్చరేద్యథాగ్నేః క్షుద్రా విస్ఫులిఙ్గా వ్యుచ్చరన్త్యేవ (పుట 192; 2.1 20)

III పంచమాధ్యాయము.

(1) ఉపక్రమము- యత్సాక్షాదపరోక్షాద్బ్రహ్మ (పుట 421; 3.4 1)
ఉపసంహారము- విజ్ఞానమానన్దం బ్రహ్మ (పుట 424; 3.9.28)

(2) అభ్యాసము- ఏష త ఆత్మాన్తర్యామ్యమృతః (పుట 348; 3.7.3 నుండి 3 7.23 వఱకు)

(3) అపూర్వత- తన్త్వౌపనిషదం పురుషం పృచ్ఛామి (పుట 4 8; 3.9 26)

(4) ఫలము- పరాయణమ్ । తిష్ఠమానస్య తద్విద ఇతి(పుట424;3 9.28

(5) అర్థవాదము- (అ) స్తుతి- యో వై తత్సూత్రం విద్యాత్తం చాన్తర్యామిణమితి స బ్రహ్మవిత్ (పుట 339; 3 7.1)

(ఆ) నింద- యో వా ఏతదక్షరం గార్గ్యవిదిత్వాఽస్మిల్లోకే జుహోతీత్యాది (పుట 375; 3.8.10)

(6) ఉపపత్తి- ఏతస్య వా అక్షరస్య ప్రశాసనే గార్గి సూర్యాచన్ద్రమసౌ విధృతౌ తిష్ఠతః (పుట 372; 3.8 9)

IV షష్ఠాధ్యాయము.

(1) ఉపక్రమము- (అ) ఇన్ధో హ వై నామ (పుట 463; 4 2.2)

(ఆ) కింజ్యోతిరేవాయం పురుష ఇతి(పుట475;4.3.2

ఉపసంహారము (అ) అభయం వై జనక ప్రాప్తోఽసీతి (పుట 468; 4.2.4)

(ఆ) స వా ఏష మహానజ ఇత్యాది(పుట567;4.4 25

(ఇ) యత్ర త్వస్య సర్వమాత్మైవాభూత్ (పుట 589; 4.5.15)

(2) అభ్యాసము- తద్దేవా జ్యోతిషాం జ్యోతిరాయుర్హోపాసతేఽమృతమ్. (పుట 552; 4.4.16)

(3) అపూర్వత- (అ) అగృహ్యో న హి గృహ్యతే ఇత్యాది (పుట 557; 4.4.22)

(ఆ) న తం పశ్యతి కశ్చనేతి (పుట 492; 4.3.14)

(ఇ) విజ్ఞాతారమరే కేన విజానీయాత్ (పుట 589; 4.5.15)

(4) ఫలము- అథాకామయమానో యోఽకామో ఇత్యాది (పుట 540; 4.4.6)

(5) అర్థవాదము- (అ) స్తుతి- ఏతము హైవైతే న తరత ఇతి (పుట 557; 4.4.22)*

(ఆ) నింద- మృత్యోస్సమృత్యుమాప్నోతి య ఇహనానేవపశ్యతి (పుట 554; 4.4.19)

(6) ఉపపత్తి- (అ) యద్వై తన్న పశ్యతి (పుట 509; 4.3.23)

(ఆ) ప్రాణస్య ప్రాణముత (పుట 553; 4.4.18)

(ఇ) న వా అరే పత్యుః కామాయ పతిః ప్రియోభవ త్యాత్మనస్తు కామాయ పతిః ప్రియో భవతి (పుట 573; 4.5.6)

* గ్రంథమునందలి బ్రాహ్మణభాగములందు పెక్కు-తావుల ఇట్టి లింగములు సూచితములయి యున్నవి.

ఇక నాస్వవిషయము నొకింత చెప్పతగియున్నది. నాకండ్ల ముందర నాతలిదండ్రులును, మా పెద్దలును వారల అంతిమఘటిక లందు తారకనామస్మరణముతో దేహత్యాగమును జేసిరి. తరతర ములనుండియు మాగృహంబున పండితగోష్ఠి అనుదినము జరిగెడిది. ఇట్టి విషయము నెఱింగియు, బహిర్ముఖుడనై లౌకికులుపల్కు-నిష్కామ కర్మలయందు కాలహరణముచేసితిని. ఇటీవలనే, నాకు అరువది యవ పడిరాగా ప్రస్థానత్రయము నొకింత చవిజూచి, అందు బృహదార ణ్యకమునందలి (4.4.5-7) విషయగ్రహణమువలన, యింతదనుక, నేనుకాలమును వృథాపుచ్చితినని తలంచితిని. పెద్దలవలన బ్రహ్మ విద్యకై మొదట ఉపనిషత్తులను, పిమ్మట ఉపనిషత్సారమగు భగవ

ద్గీతయును, తదుపరి బ్రహ్మసూత్రములను పఠించుట క్రమపద్ధతియని, వినుచుంటిని, ఈవిషయము నాకు బాగుగ నచ్చుబడియైనది. సంస్కృత మెంతపాటియు రాదు, లిపియైనను తెలియదు. తను, మానస, ధనము లన్యాక్రాంతమైయున్న ఈ సమయమున ఉపనిషద్విజ్ఞానార్థమై నేను పొందిన వ్యథ వర్ణనాతీతము. ఉపనిషత్తులను నాకు బోధించువార లకై గాలించితిని. నాకట్టివారులభ్యులుగాకైరి. దూరముగానున్న యొక ప్రఖ్యాతపురుషుని సన్నిధిని ఉపనిషత్తులలోకెల్ల చిన్నదియగు ఈశావాస్యమును చదువప్రారంభించితిని. రెండుమాసములు వారి యొద్ద చదివినను నాకు అందలి ప్రథమమన్త్రార్థమైనను గ్రహించుశక్తి లేకపోయినది. ఇంతలో క్షేత్రమునందు మహత్తు గలదను ప్రతీతిగల హిమాలయమునందలి ఉత్తర కాశికి వేసవి గడపుటకు చేరితిని. అచ్చట సుప్రసిద్ధపురుషులగు శ్రీమత్ బ్రహ్మస్వరూపానందస్వామీజీ మహ రాజ్ వారును, ఇటీవలనే సిద్ధిపొందిన జ్ఞానాత్మయగు తపోవనస్వామీజీ మహారాజ్ వారును నాకు ఉపనిషత్తులందుగల వస్తువును కాన లేని ఆవే దనతో సదా నా మనస్సు కుములుచున్న ఉన్మాదావస్థను గ్రహిం చిరి వారిద్దరు నాపై అవ్యాజమైనకరుణతో నాకై ప్రత్యేకించి శంకరభాష్యానుసారముగ దశోపనిషత్తులను ప్రతిపదార్థతాత్పర్య సహితముగ ఆంగ్లమున బోధించిరి. ఇటుల నాకృపామయులిద్దరు బ్రహ్మవిద్యయందు నాకభిరుచిని గల్గించిరి. వేదమునందు నాకు గాఢ మైన అనురాగముదయించినది. శ్రీమత్ బ్రహ్మస్వరూపానంద స్వాములవారిచే బోధచేయబడిన బృహదారణ్యకమును సరిగ అవ లోడనముచేసికొని, తదనుగుణముగ చరియించినచో తప్పక నేను, (పుట 567), "అభయ"మున ప్రతిష్ఠింపబడుదునని విశ్వసించితిని.

ఇంతియగాదు. నాశక్తివంచన లేకుండ కృషిచేసి, విజ్ఞులచే తెలుగున ప్రతిపదార్థతాత్పర్యములతో నీ గ్రంథమొక్కటియైనను ఆంధ్రమహాజనులకు సమర్పింపగల్గినచో, నీకృషియందు ఈ గ్రంథస్థ

మైన భావములు నాయునస్సున మఱపురాని గుర్తుగ నుండగలవనియు, శ్రీకృష్ణపరమాత్మ భగవద్గీతయందు (4.28) ప్రవచనముచేసినటుల వేదార్థనిశ్చయమను జ్ఞానయజ్ఞమునొనర్చుచున్నాడననియు, ఈ గ్రంథమునందే (1.4.16) శ్రుతిపలుకుచున్న ఋషిఋణమును తీర్చుకొనుట యనునది ఇంతకుమిన్న యుపాయాంతరము నాకులేదనియు, నావంటివారలకు నాకృషి మిక్కిలి ఫలదాయకమనియు, తదభీష్టసిద్ధికై చేయు పరిశ్రమలో నాకీగ్రంథరాజము పురుగులచే కొట్టబడి, ముట్టిన నుసియగుచున్న కాగితములుగల ప్రతి యొకటి లభించినది. దీనిని పునరుద్ధరించుటయే నా ప్రథమకర్తవ్యముగ తలంచితిని.

మాతృఋణమెటులనో అటులనే శ్రీవెంకటశాస్త్రిగారికి ఆంధ్రలోకము ఋణబడియున్నది. కొలదిప్రతులనుమాత్రమే అచ్చొత్తించి శ్రీశాస్త్రిగారిని, వారి యీ గ్రంథమును ప్రకాశింపజేసిన శ్రీబుచ్చయ్యపంతులుగారిని, నేనెట్టివిధముగను తెలిసికొనగలకున్నను, వీరుభయులకు నేను చేయగలిగిన దేమియా యని యోచించ, ఈ గ్రంథము నచ్చొత్తించుట సర్వతోముఖో పాయమని, వెంటనే దీనినచ్చొత్తించుటకు పూనుకొంటిని.

ఈ గ్రంథమునందలి బృహత్తర తత్వమును, నా ఆవేదనమును గుర్తెరింగిన పెద్దలు నాకృషితో సహకరింతుమనిరి. విద్వాంసులైన (1) "కళ్యాణి" యను గీతావివరణమును రచించిన బ్ర. శ్రీ. చెఱుకుపల్లి బుచ్చిరామయ్యశర్మగారికి (2) గౌతమీవిద్యాపీఠకళాశాలకు ప్రిన్సిపల్ గానున్న బ్ర. శ్రీ. కొల్లి అనంతపద్మనాభశాస్త్రిగారికి (3) గవర్నమెంటు విద్యాశాఖయందు పనిచేయుచున్న డాక్టర్. వేలూరి సుబ్బారావు ఎమ్.ఎ; పి. హెచ్,డి; బి.ఓ.ఎల్; బి.ఇడి గారికి; ఈ కార్యమునందు నాకు తోడ్పడుటకై శ్రీసుబ్బారావుగారికి అనుజ్ఞనొసంగిన

ఆంధ్రప్రదేశ్ విద్యాశాఖమంత్రిగారికి, తదధికారులకు నా హృదయపూర్వకకృతజ్ఞతాభివందనములు.

లోగడ ముద్రితమైన మాతృక చిన్నిలిపియందున్నది. చదువరులకు శ్రమలేకుండుటకై, ఇప్పుడీపొత్తమునచ్చొత్తించుటయందు లిపి పెద్దదిగను, పదములమధ్యసరియగు నెడమును, చిన్నివిషయసూచికతో పీఠికలో నంతలో ముఖ్యముగ ఉపనిషత్తునందలి మూలమునందు అచ్చుతప్పులు లేకుండగ గ్రంథమును శ్రద్ధాభక్తులతో అచ్చొత్తించి ప్రచురించినాడను. అచ్చువేయుటలో ముద్రాక్షరశాలాధిపతులైన శ్రీపోతాప్రగడ సూర్యనారాయణగారు తగు శ్రద్ధను వహించి తగువారినీకూర్పుయందు నియోగించి నాకుచేదోడువాదోడుగ నుండిరని తెలుపుచున్నాను.

గృహప్రవేశసమయమునకెటుల గృహనిర్మాణము అసంపూర్ణముగనుండునో, అటుల నీ గ్రంథము కొలదిపుటలింకను అచ్చువేయుట మిగిలియుండగనే అచ్చుపడినంతవఱకు పుస్తకమును నిష్కామకర్మయోగులైన జనకాదులశ్రేణికి చెందినట్టియు, రసజ్ఞులైనట్టియు, జగత్ప్రఖ్యాతినిగాంచినట్టియు, గౌరవనీయులగు డాక్టర్. సర్వేపల్లి రాధాకృష్ణగారికి సమర్పించుచు, ఈ బృహదారణ్యకమునకు ఆవిష్కరణముచేయుటకు, మున్నుడిని వ్రాయుటకు అంగీకరింపుమని లేఖనొకదానిని శ్రీవారికి పంపితిని. విషయము గ్రహింపగనే, తిరుగుటపాలో తమ అంగీకారమును తెలియజేసిరి. వీరికి నా హృదయపూర్వకమైన కృతజ్ఞతాభివందనములు.

అచిరకాలములో, ఈగ్రంథమున (3.8.9) వర్ణింపబడిన అక్షరపరబ్రహ్మముయొక్క ఆజ్ఞయైనచో, బ్రహ్మవిద్యయందాదరాభి

మానముగలవారి సహకారముతో నొక ధర్మసంస్థనుస్థాపించి, ఈ గ్రంథమునకువలెనే ఛాందోగ్యోపనిషత్తును ప్రచురించెదను. ఇంతియు గాదు. శ్రీమచ్ఛంకరభగవత్పాదుల సమకాలికులై, తత్ప్రశిష్యులుగ ప్రశస్తినిగాంచిన సర్వజ్ఞముని యనువారిచే రచియింపబడిన సంక్షేప శారీరకమను గ్రంథమును ఆంధ్రమున ప్రతిపదార్థతాత్పర్యసహిత ముగ ప్రచురింపవలెననియు, ఇటుల నీధర్మసంస్థద్వారమున సదా బ్రహ్మవిద్యాప్రకాశకములగు గ్రంథములు ఆంధ్రప్రజానీకమునకు సమర్పింపనుత్సహించుచున్నాడను.

వీరభద్రపురము,
రాజమహేంద్రవరము,
15—1—1960.

దువ్వూరి రామకృష్ణారావు,
సంపాదకుడు

ఓమ్.

# శ్రీ బృహదారణ్యకోపనిషద్విషయసూచిక

ప్రథమ, ద్వితీయాధ్యాయములు కర్మాంగములగు ప్రవర్గ్యోప సత్తులను నిరూపించుటచే ఇందు చేరలేదు.

మార్గ గమనము- కేవల కర్మఠులకు దక్షిణమార్గకథనము - ఉభయ విహీనులకు క్రిమి, కీటకాది జననకథనము,



ప్రాణోపాసకునకు మహత్త్వప్రాప్తికై మంథనకర్మ విధానము.



స్త్రీ మంథనపూర్వక పుత్రమంథన విధానము- మైథున కర్మమున వాజపేయత్వ దృష్టి- తత్ఫల కథనము- అవిద్వన్నింద- ప్రాయశ్చిత్తవిధులు- భార్యవశీకరణోపాయకథనము- పురుషద్వేషముకల స్త్రీలకు ప్రీతినుత్పాదించుట- గర్భధారణేచ్ఛయందు కర్తవ్యము- జారులకై చేయదగిన యభిచారకర్మ- రజస్వలా నియమములు- సద్గుణ సంపన్న పుత్రోదయమునకై చేయదగు కర్మములు- అట్టి కూతురు కలుగుటకై చేయదగు కర్మము- పండితుడైన కుమారుని కాంక్షించుచో చేయదగు కర్మము- అన్నాదుల పచనమునకు కాల నియమము-ప్రసవసమయమున సుఖప్రసూతికై యుపాయముల నిర్దేశించుట- స్తన్యప్రదానము- జాతకర్మ- నామకరణము- మాత్రభిమంత్రణమస్త్రి నిరూపణము- అట్టి పితాపుత్రుల సంస్తుతి.



కాండములకన్నిటికిని ఆచార్యపరంపరనుపదేశించుట.

---

శ్రీ

శు॥ యజుర్వేదీయ - కాణ్వశాఖాయామ్.

# బృహదారణ్యకోపనిషత్.

## తృతీయాధ్యాయః.

హరిః ఓమ్॥ పూర్ణమదః పూర్ణమిదం పూర్ణాత్పూర్ణముదచ్యతే (చ్యతే)।
పూర్ణస్య పూర్ణమాదాయ పూర్ణమేవావశిష్యతే.

ఓమ్ శాన్తిః శాన్తిః శాన్తిః (చూ. 7. 1-1.)

హరిః ఓమ్॥ ఉపనిషత్॥ ఉషా వా అశ్వస్య మేధ్యస్య శిరః। సూర్యశ్చక్షుర్వాతః ప్రాణో వ్యాత్తమగ్నిర్వైశ్వానరః సంవత్సర ఆత్మాశ్వస్య మేధ్యస్య ద్యౌః పృష్ఠమన్తరిక్షముదరం పృథివీ పాజస్యం దిశః పార్శ్వమవాన్తరదిశః పర్శవ ఋతవోఽఙ్గాని మాసాశ్చార్ధమాసాశ్చ పర్వాణ్యహోరాత్రాణి ప్రతిష్ఠా నక్షత్రాణ్యస్థీని నభో మాంసాని। ఊవధ్యం సికతాః సిన్ధవో గుదా యకృచ్చ క్లోమానశ్చ పర్వతా ఓషధయశ్చ వనస్పతయశ్చ లోమాని ఉద్యన్పూర్వార్ధో నిమ్లోచన్ జఘనార్ధో యద్విజృంభతే తద్విద్యోతతే యద్విధూనుతే తత్ స్తనయతి యన్మేహతి తద్వర్షతి వాగేవాస్య వాక్ ॥౧॥

పదవిభాగమ్॥ ఉషాః - వై - అశ్వస్య - మేధ్యస్య - శిరః - సూర్యః - చక్షుః - వాతః - ప్రాణః - వ్యాత్తం - అగ్నిః - వైశ్వానరః - సంవత్సరః - ఆత్మా - అశ్వస్య - మేధ్యస్య - ద్యౌః - పృష్ఠం - అన్తరిక్షం - ఉదరం - పృథివీ - పాజస్యం - దిశః - పార్శ్వం - అవాన్తరదిశః - పర్శవః - ఋతవః - అఙ్గాని - మాసాః - చ - అర్ధమాసాః - చ - పర్వాణి - అహోరాత్రాణి - ప్రతిష్ఠాః - నక్షత్రాణి - అస్థీని - నభః - మాంసాని - ఊవధ్యం - సికతాః - సిన్ధవః - గుదాః - యకృత్ - చ - క్లోమానః - చ - పర్వతాః - ఓషధయః - చ - వనస్పత

యః - చ - లోమాని - ఉద్యన్ - పూర్వార్థః - నిమ్లోచన్ - జఘనార్థః - యత్ - విజృంభతే - తత్ - విద్యోతతే - యత్ - విధూనుతే - తత్ - స్తనయతి - యత్ - మేహతి - తత్ - వర్షతి - వాక్ - ఏవ - అస్య - వాక్.

ప్రతిపదార్థమ్॥ మేధ్యస్య = పవిత్రమైనయజ్ఞసంబంధమగు, అశ్వస్య = అశ్వముయొక్క, శిరః = శిరస్సు, ఉషా వై = బ్రాహ్మముహూర్తము. మేధ్యస్య = పవిత్రమగుయజ్ఞసంబంధమగు, అశ్వస్య = అశ్వముయొక్క, (మేధ్యస్యఅశ్వస్య అనుపదములు రెండుసార్లు చెప్పినందున ఈ మంత్రమునందలి వాక్యములయందంతట ప్రత్యేకముగా చెప్పుకొనవలయునని భావము.) చక్షుః = నేత్రము, సూర్యః = సూర్యుడు. ప్రాణః = ప్రాణము, వాతః = వాయువు. వ్యాత్తం = తెఱవఁబడినముఖము, వైశ్వానరః = వైశ్వానరుఁడనుపేరుగల, అగ్నిః = అగ్ని. ఆత్మా = శరీరము, సంవత్సరః = సంవత్సరము. (పంద్రెండుమాసములుగాని లేక అధికమాసముతోఁ గూడినయెడల పదమూడు మాసములుగాని). పృష్ఠం = వీపు, ద్యౌః = ద్యులోకము. ఉదరం = కడుపు, అన్తరిక్షం = ఆకాశము. పాజస్యం = పాదాసనస్థానము, పృథివీ = భూమి. పార్శ్వే = పార్శ్వములు, దిశః = దిక్కులు. పర్శవః = ప్రక్కలయందలి యెముకలు, అవాన్తరదిశః = ఆగ్నేయాదిమూలదిక్కులు. అఙ్గాని = అవయవములు, ఋతవః = వసంతాది ఆఱుఋతువులు. పర్వాణి = సంధులు, మాసాశ్చ = మాసములును, అర్ధమాసాశ్చ = పక్షములును, ప్రతిష్ఠాః = పాదములు. అహోరాత్రాణి = అహోరాత్రములు, (రాత్రిపగళ్లు), అస్థీని = ఎముకలు. నక్షత్రాణి = నక్షత్రములు, మాంసాని = మాంసములు, నభః = ఆకాశమునందుండెడి మేఘములు. ఊవధ్యం = కడుపునందుండు సగముజీర్ణమైన అశనము, సికతాః = సికతములు, (ఇసుక). గుదాః = నాడులు, సిన్ధవః = నదులు. యకృచ్చ = (హృదయమునకు క్రిందుగా దక్షిణభాగమున నుండు), మాంసపిండమును, క్లోమానశ్చ = (హృద

యమునకు(క్రిందుగా నుత్తరభాగమునందు) మాంసపిండమును, (క్లోమానః అనునది నిత్యబహువచనము అయినను ఇక్కడ ఏకవచనార్థముకలది). పర్వతాః=పర్వతములు, లోమాని=వెంట్రుకలు, ఓషధయశ్చ=తరుగుల్మలతలున్ను, వనస్పతయశ్చ=పూయక కాయునట్టి వృక్షములున్ను. పూర్వార్ధః=పూర్వభాగముగానుండు సగము, ఉద్యన్=ఉదయించినసూర్యుడు, (అశ్వముయొక్క పూర్వభాగము ఉదయము మొదలుకొని మధ్యాహ్నమువఱకుండు సూర్యుడు.) జఘనార్ధః=ఉత్తరభాగముగానుండు సగము, నిమ్లోచన్=అస్తమయమునుపొందుచున్న సూర్యుడు. (అశ్వముయొక్క యుత్తరభాగము మధ్యాహ్నము మొదలుకొని అస్తమయమువరకుండు సూర్యుడు). యద్విజృంభతే=అంగములను విస్తరింపఁజేయుట ఏదియో, తత్=అది, విద్యోతతే=ప్రకాశించుట (మెఱుపు). యద్విధూనుతే=అంగములనుకంపింపచేయుట ఏదియో, తత్=అది, స్తనయతి=ధ్వనిచేయుట (ఉఱుము). యన్మేహతి=మూత్రమును ఏదిచేయుచున్నదో, (మూత్రమునువిడుచుట), తద్వర్షతి=అదియే వర్షించుట, (వర్షము). అస్య=ఈఅశ్వముయొక్క, వాగేవ=శబ్దమే, వాక్ = వాక్కు, (ఈ వాక్కునందు మాత్రము సాదృశ్యమునుకల్పింపలేదు).

తాత్పర్యమ్॥ బుద్ధివిక్షేపములు లేక బ్రహ్మవిద్యాప్రాప్తికలుగుటకు అరణ్యమునందు అధ్యయనము చేయబడుటవలన ఆరణ్యకమనియును, పరిమాణమువలన బృహత్స్వరూపమగుటవలన బృహదారణ్యకమనియును, వ్యవహరింపబడుచున్నది. ఇది యెనిమిది అధ్యాయములుకలది. అందు ప్రథమ ద్వితీయాధ్యాయములు రెండును కేవల కర్మాంగములుగానుండెడి ప్రవర్గ్యోపసత్తులను ప్రతిపాదించునవగుటవలన వానిని ఉపేక్షించి బ్రహ్మవిద్యాప్రాప్తికొఱకు తక్కిన యధ్యాయములు మాత్రము వ్యాఖ్యానముచేయబడినవి. వానికిమాత్రమే తెలుగులోనును అర్థము వ్రాయఁబడుచున్నది. దానియందు అశ్వ

మేధయాగము చెప్పబడినది. అది అనేక పశువులు కలదియైనను ప్రధానముగు ప్రజాపతి దేవతాకమైన అశ్వాంగవిషయమైన ఉపాసనలు చెప్పుచు ఆ అశ్వమునకు ప్రజాపతి రూపమును నిరూపించుచున్నాడు. ఆయజ్ఞసంబంధమైన అశ్వమునకు శిరస్సు శాస్త్రలౌకికములయందు ప్రసిద్ధముగానుండు బ్రాహ్మముహూర్తము. నేత్రముసూర్యుడు. ప్రాణము వాయువు. తెఱవఁబడిన ముఖము అగ్ని. శరీరము సంవత్సరము. వీపు ద్యులోకము. కడుపు అంతరిక్షము (ఆకాశము). పాదాసన ప్రదేశము భూమి. పార్శ్వములు ప్రాగాది దిక్కులు. పక్కటెముకలు ఆగ్నేయాదిమూలదిక్కులు. అవయవములు వసంతాది ఋతువులు. దేహసంధులు మాసములు పక్షములును. నిలుచుటకాధారములైన పాదములు రాత్రిపగళ్ళు. ఎముకలు నక్షత్రములు. మాంసములు ఆకాశమునందలి మేఘములు. అరగని అన్నము సైకతములు. నాడులు నదులు. హృదయమందు దక్షిణోత్తర భాగములయందలి మాంసపిండములు పర్వతములు. వెంట్రుకలు ఓషధులు. ఈ అశ్వముయొక్క దేహపూర్వభాగము ఉదయముమొదలు పండ్రెండుఘంటలవఱకుండెడి సూర్యుడు. ఈ అశ్వముయొక్క దేహోత్తరభాగము మధ్యాహ్నము మొదలు అస్తమయమువరకుండెడి సూర్యుడు. ఈ అశ్వదేహవిజృంభణమే ప్రకాశము. ఈ అశ్వదేహకంపమే ఉఱుము. దీనిమూత్రోత్సర్జనమే వర్షము. దీనిశబ్దమే వాక్కు. దీని (వాక్కు) విషయమందు మాత్రము ప్రజాపతికి సమానకల్పన లేదు.

ఉ॥ అహర్వా అశ్వంపురస్తాన్మహిమాన్వజాయత తస్య పూర్వేసముద్రే యోనీరాత్రి రేనంపశ్చాన్మహిమాన్వజాయత తస్యాపరేసముద్రే యోని రేతౌవా అశ్వం మహిమానావభితస్సంబభూవతుః హయోభూత్వా దేవానవహ ద్వాజీ గన్ధర్వానర్వాసు రానశ్వోమనుష్యా సముద్రఏవాస్యబన్ధుః సముద్రోయోనిః. ॥౨॥

ఇతి తృతీయాధ్యాయే ప్రథమం బ్రాహ్మణమ్.

ప॥ అహః - వై - అశ్వం - పురస్తాత్ - మహిమా - అన్వజాయత - తస్య - పూర్వే - సముద్రే - యోనిః - రాత్రిః - ఏనం - పశ్చాత్ - మహిమా - అన్వజాయత - తస్య - అపరే - సముద్రే - యోనిః. ఏతౌ - వై - అశ్వం - మహిమానౌ - అభితః - సంబభూవతుః - హయః - భూత్వా - దేవాన్ - అవహత్ - వాజీ - గన్ధర్వాన్, అర్వా - అసురాన్ - అశ్వః - మనుష్యాన్ - సముద్రః - ఏవ - అస్య - బన్ధుః - సముద్రః - యోనిః.

ప్ర॥ (ఈ అశ్వమునకు ముందు వెనుకలయందు బంగారు వెండితోఁ జేయఁబడిన పాత్రవిశేషములున్నయవి. వాటిలో) అశ్వం= అశ్వమునుగూర్చి, పురస్తాత్ = ముందరనుండెడి, మహిమా = మహిమయను పేరుగల సువర్ణపాత్రవిశేషము, అహర్వై = పగలుగానే, అన్వజాయత = కలిగెను. (అనగా పగలు బంగారువలెనే పచ్చనగుట వలన ఆ పాత్రవిశేషమును పగటినిగా భావన చేయవలయును). తస్య = ఆ సువర్ణపాత్రమునకు, పూర్వేసముద్రే = తూర్పుసముద్రము, (వేదమగుటవలన విభక్తిభేదము). యోనిః = ఉండెడిస్థానము, (ఆ సువర్ణపాత్రమునుండెడిస్థానమును తూర్పుసముద్రదృష్టితో ధ్యానింపఁదగినది). (తథా = ఆప్రకారము), రాత్రిః = రాత్రి, ఏనం = ఈ అశ్వమును గూర్చి, పశ్చాత్ = వెనుకనుండెడి, మహిమా = మహిమయను పేరుగల రజతపాత్రవిశేషముగా, అన్వజాయత = కలిగెను. (అనగా రాత్రి వెన్నెలచేత వెండికిసాదృశ్యమగుటవలన ఆవెండిపాత్రను రాత్రి దృష్టితో ధ్యానించవలయును). తస్య = ఆవెండిపాత్రమునకు, అపరేసముద్రే = పశ్చిమసముద్రము, యోనిః = ఉండెడిస్థానము, (ఆ వెండిపాత్రమునుండెడి స్థానమును పశ్చిమసముద్రదృష్టితో ధ్యానించవలయును). ఏతౌవై మహిమానౌ = ఈమహిమములను పేరుగల సువర్ణరజత పాత్రలు రెండును, అశ్వం = అశ్వమునుగూర్చి, అభితః = పూర్వపశ్చిమభాగములయందు, సంబభూవతుః = కలిగినవి. (ఇట్లుతిరిగి చెప్పుట ఈఅశ్వము

గొప్పమహిమతోగూడినదని తెలియుటకు) (సః=ఆ అశ్వము), హ యః భూత్వా=హయజాతియై, దేవాన్ = దేవతలను, వాజీ = వాజియను జాతియై,గన్ధర్వాన్ =గంధర్వులను, అర్వా = అర్వయనుజాతియై, అసురాన్ =అసురులను, అశ్వః=అశ్వజాతియై, మనుష్యాన్ =మనుష్యులను, అవహత్ =వహించెను. (హయ వాజి అర్వ అశ్వములను నాలుగుజాతులై దేవగంధర్వ అసుర మనుష్యులను నలుగురిని వహించెను). అస్య = ఈఅశ్వమునకు,సముద్రఏవ=సముద్రుడే, బన్ధుః=బంధువు. (సముద్రమును బంధుదృష్టితో ధ్యానించవలయును). సముద్రః =సముద్రుడు, యోనిః = కారణము, (ఈఅశ్వమునకు సముద్రుడుత్పాదకుడగుటవలన వానిని కారణునిగా ధ్యానించవలయును).

తా॥ ఈ అశ్వమునకు పూర్వపశ్చిమ భాగములయందుండెడి బంగారు వెండిపాత్రములను అహోరాత్రములనుగాను, ఆపాత్రములుంచెడి స్థానములను పూర్వపశ్చిమ సముద్రములనుగాను, ధ్యానించవలయును. ఇట్లు ప్రజాపత్యంగసదృశముగా ధ్యానింపఁబడిన అవయవములుగలఅశ్వమునకు సముద్రముత్పత్తి స్థానమగుటవలన ఆసముద్రమును బంధువునుగా ధ్యానించవలయును.

ఇట్లు తృతీయాధ్యాయమునందు ప్రథమబ్రాహ్మణము సమాప్తము.

---

హరిః ఓమ్॥ ఉ॥ నైవేహకించనాగ్రఆసీన్మృత్యునైవేదమావృతమాసీదశనాయయా అశనాయాహిమృత్యుస్తన్మనోకురుతాత్మన్వీస్యామితిసోర్చన్నచరత్తస్యార్చత ఆపోజాయన్తార్చతేవైమేకమభూదితి తదేవార్కస్యార్కత్వం। కగ్ంహవాఅస్మైభవతి య ఏవ మేతదర్కస్యార్కత్వం వేద. ॥౧॥

ప॥ న - ఏవ - ఇహ - కించన - అగ్రే - ఆసీత్ - మృత్యునా - ఏవ - ఇదం - ఆవృతం - ఆసీత్ - అశనాయయా - అశనాయా - హి - మృత్యుః - తత్ - మనః - అకురుత - ఆత్మన్వీ - స్యాం - ఇతి - సః -

అర్చన్ - అచరత్ - తస్య - అర్చతః - ఆపః - అజాయన్త - అర్చతే-వై - మే - కం - అభూత్ - ఇతి - తత్ - ఏవ - అర్కస్య - అర్కత్వం - కం - హవై - అస్మై - భవతి - యః - ఏవం - ఏతత్ - అర్కస్య - అర్కత్వం - వేద.

ప్ర॥ ఇహ = ఈసంసారమండలమునందు, అగ్రే=సృష్టికిపూర్వము, కించన=కొంచెమున్ను, (నామరూపములచేత వేఱుపఱచబడిన విశేషముకొంచెమున్ను), నైవాసీత్ = లేనేలేదు. అశనాయయా =భక్షించుటకు కోరుటచేతనైన, మృత్యునైవ=మృత్యుశబ్దవాచ్యుడగు హిరణ్యగర్భునిచేతనే, (ఎవడుభక్షించుటకుకోరునో వాడు అట్టి కోరికకలిగినతరువాత జంతువులను చంపుచున్నాడు గనుక ఆకోరిక బుద్ధ్యాత్మకు కలుగుటవలన ఆబుద్ధ్యవస్థగల హిరణ్యగర్భుడు మృత్యుశబ్దవాచ్యుడని చెప్పబడుచున్నది). ఇదం = ఈ కార్యజాతమగు సమస్తజగత్తు, ఆవృతం = ఆవరింపబడినదై, ఆసీత్ = ఉండెను. అశనాయా = భక్షించుటకుకోరుట, మృత్యుర్హి = మృత్యువుగదా!(మృత్యుః = మృత్యుశబ్దవాచ్యుడైనహిరణ్యగర్భుడు), (అహం = నేను), ఆత్మన్వీ = మనస్సుగలవాడను, స్యామితి=అగుదునుగాకయని, తన్మనః = ఆమనస్సును, అకురుత = చేసెను. (ప్రకృతమునందలి ఆ మృత్యువు ముందు చెప్పఁబోయెడి కార్యమగు ప్రపంచమును సృష్టించవలెనను కోరిక చేత ఆకార్యాలోచన సమర్థమగునంతఃకరణమును చేసెను.) సః = ఆ హిరణ్యగర్భుడు, (ఆత్మానమేవ = తన్నునే), అర్చన్ = పూజించుకొనువాడై, (కృతార్థోస్మీతి = ధన్యుడనని), అచరత్ = తలంచెను. అర్చతః = పూజించుచున్న, తస్య = ఆ హిరణ్యగర్భునకు, ఆపః = ఉదకములు, అజాయన్త = పుట్టినవి. అర్చతేవై = పూజను చేయుచున్న, మే = నాకొఱకు, కం = ఉదకము, అభూదితి = కలిగెనని, (అమన్యత = తలంచెను). తదేవ = ఆకారణమువలననే, అర్కస్య = అశ్వమేధయాగమునకుపయోగమైనఅగ్నికి, అర్కత్వం = అర్కశబ్దవాచ్యత్వమని,

(సుఖకారణమగు పూజాసాధనమునకు ఉదకసంబంధమువలన అగ్నికి అర్కుడను పేరు గుణనిమిత్తమువలనకలిగినది). ఏవం=ఈప్రకారము, యః=ఎవడు, అర్కస్య=అశ్వమేధాగ్నికి. ఏతత్=ఈ, అర్కత్వం=అర్కశబ్దవాచ్యతను, వేద=తెలిసికొనుచున్నాడో, అస్మై=వీనికొఱకు, కంహవై=ఉదకమే, (లేక నామసామ్యమువలన సుఖమైనను), భవతి=కలుగుచున్నది.

తా॥ ఈ పూర్వోక్తప్రకారము అశ్వమేధయాగమునకు ప్రధాన పశువైన అశ్వమును విరాట్స్వరూపునిగా ధ్యానించి అనంతరము అశ్వమేధోపయోగమైన అగ్న్యుత్పత్తి చెప్పబడుచున్నది. సంసారమండలమునందు సృష్టికి పూర్వముఅసత్స్వరూపమైన కార్యజాతమగు ప్రపంచమేమియును లేదు. సర్వకారణమగు పరబ్రహ్మముమాత్రముండెను. అట్టిసత్స్వరూపమైన పరబ్రహ్మము సృష్టిసంకల్ప కామనతోఁగూడుకొనుటవలన మృత్యుశబ్దవాచ్యుడైన హిరణ్యగర్భుడాయెను. ఆహిరణ్యగర్భుడు ముందుచెప్పఁబోయెడి కార్యమగు ప్రపంచమును సృష్టించవలెననుకోరికచే నేను ఆకార్యాలోచనమునందు సమర్థమైన అంతఃకరణముగలవాడనగుదునుగాక యని తలంచుచు తన్నే పూజించుకొనువాడై ధన్యుడనైతినని తలంచెను. అట్లు పూజించుకొనుచుండెడి ఆ హిరణ్యగర్భునకు ఉదకములుకలుగగా పూజచేయు తనకు ఉదకము కలిగెనని తలంచెను. ఇట్లు తలంచుటచేతనే అశ్వమేధయాగోపయోగమైన అగ్నికి సుఖహేతు పూజాకరణ ఉదకసంబంధమువలన అర్కుడను పేరుకలిగినది. ఈ విధముగా ఎవడు ఈ అశ్వమేధాగ్నికి అర్కశబ్దవాచ్యతను తెలిసికొనుచున్నాడో, వీనికి ఉదకమే (సుఖమైనను) కలుగుచున్నది.

ఉ॥ ఆపోవాఅర్కస్తద్యదపాగ్ శరఆసీత్తత్సమహన్యత సాపృథివ్యభవత్తస్యామ శ్రామ్యత్ తస్యశ్రాన్తస్య తప్తస్య తేజోరసోనిరవర్తతాగ్నిః. ॥ ౨॥

ప॥ ఆపః - వా - అర్కః - తత్ - యత్ - అపాం - శరః - ఆసీత్ - తత్ - సమహన్యత - సా - పృథివీ - అభవత్ - తస్యాం - అశ్రామ్యత్ - తస్య - శ్రాన్తస్య-తప్తస్య- తేజోరసః-నిరవర్తత-అగ్నిః.

ప్ర॥ ఆపోవా = ఉదకములును, అర్కః = అర్కస్వరూపము. (ఇక్కడ ఉదకములు అర్కశబ్దవాచ్యములగుటవలన అగ్నికి అర్కశబ్దత్వము లేదని శంక చేయగా ప్రకరణమును ఆశ్రయించి ఔపచారికముగా నుదకములకు అర్కత్వము చెప్పబడినదేగాని అగ్నియే. అర్కశబ్దవాచ్యుడని చెప్పి అగ్నిస్వరూపమును చెప్పుచున్నాడు.) తత్ = ఆనీటియందు, యత్ = ఏది, అపాం = నీటియొక్క, శరః = మీగడవంటిరూపము, ఆసీత్ = ఉండెనో, తత్ = అది, సమహన్యత = కూడుకొనెను. (బాహ్య తేజస్సుచేత లోపల పచనము చేయబడినదై కూడుకొనెను.) సా = అది, పృథివీ = భూమి, అభవత్ = ఆయెను. తస్యాం = ఆభూమియందు, (సః = పూర్వము చెప్పిన మృత్యుశబ్దవాచ్యుడైన హిరణ్యగర్భుడు,) అశ్రామ్యత్ = శ్రమనుపొందినవాడైయుండెను. (ఆ ప్రజాపతి కార్యభూతమైన సమస్తలోకమును చేసి బడలికపొందియుండెను.) తప్తస్య = సంతాపమునుపొందినవాడును, శ్రాంతస్య = బడలికను పొందినవాడునగు, తస్య = ఆహిరణ్యగర్భునియొక్క, తేజోరసః = తేజస్సేసారముగాఁగల, అగ్నిః = అగ్ని, నిరవర్తత = కలిగెను.

తా॥ ఈ పూర్వము చెప్పబడిన అర్కుడెవడనగాఁ జెప్పఁబడుచున్నది. ఉదకములును అర్కస్వరూపములని ఈ మంత్రమునందు చెప్పుటవలన పూర్వము చెప్పినప్రకారము అగ్నికి అర్కత్వము లేదని శంక చేయగా ప్రకరణమును ఆశ్రయించి ఉదకములకు నౌపచారికముగా నర్కత్వము చెప్పఁబడినదేగాని రూఢిగా అగ్నికే అర్కత్వమని చెప్పి అగ్నిప్రకరణమును చెప్పుచున్నాడు. ఆనీటియందు వెలుపలనుండెడి తేజస్సుచేత పచనము చేయఁబడి పెరుగుయొక్క మీగడవంటిదట్టమైన ఆ ఉదకములయొక్క ఘనీభావము భూమిఆయెను. ఆ భూమియందు

పూర్వము చెప్పియుండెడి హిరణ్యగర్భుడు కార్యభూతమైన ప్రపంచమును సృష్టించి శ్రమనుపొందియుండెను. అట్లు శ్రమపొంది సంతాపము గలవాడగు ఆ హిరణ్యగర్భునియొక్క శరీరమునుండి తేజస్సారమగు అగ్ని బైలువెడలెను.

ఉ॥ స త్రేధాత్మానం వ్యకురుతాదిత్యం తృతీయంవాయుంతృతీయగ్ స ఏవ ప్రాణస్త్రేధా విహితఃతస్య ప్రాచీదిక్ఛిరోసాచాసాచేర్మా అథాస్య ప్రతీచీదిక్పుచ్ఛమసౌచాసౌ చ సక్థ్యౌదక్షిణాచోదీచీ చపార్శ్వేద్యౌః పృష్ఠమన్తరిక్షముదరమియమురస్సఏషోప్సుప్రతిష్ఠితో యత్రక్వచైతితదేవప్రతితిష్ఠత్యేవంవిద్వాన్. ॥3॥

ప॥ సః – త్రేధా – ఆత్మానం – వ్యకురుత – ఆదిత్యం – తృతీయం – వాయుం – తృతీయం – సః – ఏషః – ప్రాణః – త్రేధా – విహితః – తస్య – ప్రాచీ – దిక్ – శిరః – అసౌ – చ – అసౌ – చ – ఈర్మా – అథ – అస్య – ప్రతీచీ – దిక్ – పుచ్ఛం – అసౌ – చ – అసౌ – చ – సక్థ్యౌ – దక్షిణా – చ – ఉదీచీ – చ – పార్శ్వే – ద్యౌః–పృష్ఠం – అన్తరిక్షం – ఉదరం – ఇయం – ఉరః – సః – ఏషః – అప్సు – ప్రతిష్ఠితః – యత్ర – క్వ – చ – ఏతి – తత్ – ఏవ – ప్రతితిష్ఠతి – ఏవం – విద్వాన్.

ప॥ సః = ఆప్రజాపతి, ఆత్మానం = తన్ను, తృతీయం = మూడవవాడగు, ఆదిత్యం = సూర్యునిగాను, (అగ్ని వాయువులతోగూడ మూడవవాడైన సూర్యునిగాను,) తృతీయం = మూడవవాడగు, వాయుం = వాయువునుగాను, (అగ్న్యాదిత్యులతోగూడ మూడవవాడైన వాయువునుగాను), (అగ్నిం = మొదటిస్వరూపమైన అగ్నిని), తృతీయం = మూడవవానినిగాను, (వాయురాదిత్యులతో మూడవవానినిగాను,) త్రేధా = మూడువిధములుగా, వ్యకురుత = చేసెను. ఏషః = ఈ, ప్రాణః = ప్రాణరూపమైన, (పటకారణములైన దారములు పటమైన విధముగా సమస్తభూతములయొక్క ప్రాణరూపమైన), సః = ఆపరమాత్మ, (మృత్యునా = మృత్యురూపమైన హిరణ్యగర్భుడగు, స్వేనైవ = తనచేతనే), త్రేధా

=మూడువిధములుగా, (అగ్న్యాదిత్యవాయురూపములుగా,) విహితః =చేయబడెను. (వేఱుపఱచబడెను.) తస్య=ఆ పరమాత్మస్వరూపమైన అగ్నికి, ప్రాచీదిక్=తూర్పుదిక్కు, శిరః=శిరస్సు; అసౌచ=ఈ ఈశాన్యపుమూలయున్ను, అసౌచ=ఈ ఆగ్నేయపుమూలయున్ను, (ఇవి రెండును,) ఈర్మౌ=భుజములు; అథ=అనంతరము, అస్య=ఈఅగ్నికి, ప్రతీచీదిక్=పశ్చిమదిక్కు, పుచ్ఛం=క్రిందిభాగము; అసౌచ=ఈవాయవ్యమూలయును, అసౌచ=నైరృతిమూలయును, (ఈరెండును,) సక్థినీ=తొడలు; (సక్థ్యౌఅని వేదప్రయోగము;) దక్షిణాచ=దక్షిణపుదిక్కును, ఉదీచీచ=ఉత్తరపుదిక్కును, పార్శ్వే=పక్కలు. ద్యౌః=ద్యులోకము, పృష్ఠం=వీపు; అన్తరిక్షం=ఆకాశము, ఉదరం=కడుపు; ఇయం=ఈభూమి, ఉరః=వక్షస్థలము; సఏషః=ఆపరమాత్మస్వరూపమైన ఈ అగ్ని, అప్సు=ఉదకములయందు, ప్రతిష్ఠితః=ఉంచబడినది. ఏవం=ఈప్రకారము, విద్వాన్=అగ్నిస్వరూపస్థితిని తెలిసినవాడు, యత్రక్వచ=ఎక్కడెక్కడను, ఏతి=స్థితినిపొందుచున్నాడో, తదేవ=అక్కడక్కడనే, ప్రతితిష్ఠతి=అగ్న్యుపాసనస్థితిని పొందుచున్నాడు.

తా॥ హిరణ్యగర్భస్వరూపమైన పరమాత్మచేత తనస్వరూపము విరాట్స్వరూపముయొక్క కూడికలేకయే అగ్న్యాదిత్యవాయురూపములతో మూడువిధములుగా వేరుపఱచబడెను. అట్లువేరుపఱచబడిన అగ్న్యాదిరూపములలో మొదటిదియును అశ్వమేధయాగోపయోగికమునగు అగ్నికి ఆయాగమునకు ప్రధానపశువగు అశ్వమునకువలెనే స్వరూపనిదర్శనము చెప్పబడుచున్నది. ఇట్లు వేరుపఱచబడిన పరమాత్మస్వరూపమైన ఆ అగ్నికి తూర్పుదిక్కు శిరస్సును, ఈశాన్యాగ్నేయములు రెండును బాహువులును, పశ్చిమదిక్కు దేహముయొక్క క్రిందిభాగమును, వాయవ్యనైరృతులు రెండును తొడలును, దక్షిణోత్తరములు రెండును పార్శ్వములును, ద్యులోకము వీపును, ఆకాశము కడుపును, భూమి వక్షస్థలమును. ఇట్లులోకాత్మకమును ఆపరమాత్మ

స్వరూపమునగు ఈ అగ్ని ఉదకములయందుంచబడి యున్నది. ఇట్లు అగ్నిస్థితిని తెలిసికొని ఉపాసించువాడు ఎక్కడెక్కడ పొందునో అక్కడక్కడనే అగ్న్యుపాసనాఫలమును పొందుచున్నాడు.

ఉ॥ సోఽకామయత ద్వితీయో మ ఆత్మా జాయేతేతి స మనసా వాచం మిథునగ్ం సమభవత్ అశనాయా మృత్యుస్తద్యద్రేత ఆసీత్స సంవత్సరోఽభవత్ న హ పురా తతస్సంవత్సర ఆస తమేతావన్తం కాలమబిభః। యావాన్ సంవత్సరస్తమేతావతః కాలస్య పరస్తాదసృజత। తం జాతమభివ్యాదదాత్ స భాణకరోత్సైవ వాగభవత్. ॥ 4॥

ప॥ సః - అకామయత - ద్వితీయః - మే - ఆత్మా - జాయేత- ఇతి - సః - మనసా - వాచం - మిథునం - సమభవత్ - అశనాయా మృత్యుః - తత్ - యత్ - రేతః - ఆసీత్ - సః - సంవత్సరః - అభవత్ - న - హ - పురా - తతః - సంవత్సరః - ఆస - తం - ఏతావన్తం- కాలం - అబిభః - యావాన్ - సంవత్సరః - తం - ఏతావతః - కాలస్య - పరస్తాత్ - అసృజత - తం - జాతం - అభి - వ్యాదదాత్ - సః - భాణకరోత్ - సా - ఏవ - వాక్ - అభవత్.

ప్ర॥ సః = ఆమృత్యుశబ్దవాచ్యుడైన హిరణ్యగర్భుడు, మే = నాకు, ద్వితీయః = రెండవదియైన, ఆత్మా = శరీరము, జాయేతేతి = కలుగునుగాకయని, అకామయత = కోరెను. (ఇట్లుకోరి), అశనాయా మృత్యుః = భక్షణేచ్ఛచేత లక్షితమైన మృత్యుశబ్దముగల, సః = ఆహిరణ్యగర్భుడు, మనసా = (ముందుపుట్టియున్న) మనస్సుతో, వాచం = వేదలక్షణమైనవాక్కును, మిథునం = ద్వంద్వభావమునుగా, సమభవత్ = సంభావనముచేసెను.(ఆలోచించెను). తత్ = ఆమిధునమునందు, యత్ = ఏ, రేతః = రేతస్సు, ఆసీత్ = ఆయెను, (పూర్వము చెప్పబడినఅగ్నియే ప్రథమశరీరముగాఁగల ప్రజాపతికి వేదవాక్కును ఆలోచించుటయందుత్పత్తికారణమైనజ్ఞానకర్మరూపమగు ఏ రేతస్సుకలిగెనో), సః = ఆ రేతోరూపమైన ప్రజాపతి, సంవత్సరః = సంవత్సరస్వరూపుడు, అభవత్ = ఆ

యెను. (ఆప్రజాపతిజన్మాంతరమున చేయఁబడిన దానిని భావన చేయుచు ఉదకములనుసృష్టించి ఆఉదకములయందు పూర్వము చెప్పిన ఆ రేతో రూపముతో ప్రవేశించి అండరూపముతో గర్భముగలవాడై కాలము నిర్మించెడి సంవత్సరాత్మకమగు ప్రజాపతి ఆయెను). తతః = కాలమును నిర్మించెడి ఆ ప్రజాపతికంటె, పురా = పూర్వము, సంవత్సరః = సంవత్సరరూపమైన ప్రజాపతి, నాసహ = లేకపోయెను. యావాన్ = ఎంత కాలము, సంవత్సరః = సంవత్సరమో, (సః = ఆసంవత్సరాత్మక ప్రజాపతి), ఏతావన్తం = ఇంతయైన, (సంవత్సరపరిమాణమగు), కాలం = కాలమునుగూర్చి, తం = ఆఅండరూపమైనగర్భమును. అబిభః = భరించెను. ఏతావతః = ఇంతయైన. (సంవత్సర పరిమితిగల), కాలస్య = కాలము యొక్క, పరస్తాత్ = అనంతరమునందు, (సః = ఆప్రజాపతి), తం = ఆగర్భమును, అసృజత = సృష్టించెను. (ఆ అణ్డమును భేదించెను). జాతం = పుట్టిన, తం = ఆ కుమారుని, అభివ్యాదదాత్ = (భక్షించుటకు) నోరు తెఱచెను. సః = ఆ పుత్రుడు, భాణకరోత్ = భాణఅనుశబ్దమును చేసెను. (ఆప్రజాపతి ఇట్లుపుట్టిన పుత్రుడగుఅగ్నిని భక్షించుటకు నోరు తెఱవగా స్వాభావికమైన అవిద్యతోఁగూడుకొనినవాడై భయపడి ఆపుత్రుడు భాణయనుశబ్దమును చేసెను). సైవ = అదియే, వాక్ = శబ్దము, అభవత్ = ఆయెను.

తా॥ భక్షణేచ్ఛచేతమృత్యుశబ్దవాచ్యుడైన ఆ హిరణ్యగర్భుడు తనకు రెండవదియగు శరీరముకలుగునుగాకయనికోరి వేదవాక్కును మిథునమునుగా ఆలోచించెను. ఇట్లు ఆలోచించగా నుత్పత్తికారణమైన జ్ఞానకర్మరూపమగు రేతస్సుకలిగెను. తరువాత జన్మాంతరకర్మాలోచనచే భావనచేయువాడై సృజింపఁబడిన ఉదకములయందు ఆరేతస్సుతోను ప్రవేశించి అండరూపముతో గర్భముగలవాడై సంవత్సరాత్మక ప్రజాపతిఆయెను. ఉంతకుపూర్వము ఆ ప్రజాపతి లేకయేఇట్లు ఉండు ఎంతపరిమితికాలము సంవత్సరమగునో అంతకాలము ఆగర్భ

మును భరించెను. ఇట్లు భరించి సంవత్సర కాలమైనతరువాత విరాజస్వ రూపమైన అగ్నిని సృజించెను. (అండమునుభేదించెను.) ఇట్లు ఆప్రజాపతి సృజించి ఆ పుట్టినపుత్రుని భక్షించుటకు నోరు తెఱచెను. ఆపుత్రుడు స్వాభావికమైన అవిద్యతోఁగూడుకొనినవాడై భయముతో భాణ యని ధ్వనిచేసెను. అది యే భూరాదివ్యాహృతిరూపమైనవాక్కు ఆయెను.

ఉ॥ స ఐక్షత యది వా ఇమమభిమగ్ంస్యే కనీయో న్నంకరిష్యఇతి స తయావాచా తేనాత్మనేదగ్ం సర్వమసృజత యదిదంకిఞ్చ ఋచోయజూగ్ంషి సామాని ఛన్దాగ్ంసి యజ్ఞాన్ప్రజాఃపశూన్ । సయద్యదేవాసృజత తత్తదత్తుమధ్రియత సర్వం వా అత్తీతి తదది తేరదితిత్వగ్ం సర్వస్యై తస్యాత్తా భవతిసర్వమస్యాన్నంభవతి యఏవ వేఁతదది తేరదితిత్వం వేద. ॥5॥

ప॥ సః – ఐక్షత – యది – వై – ఇమం – అభిమంస్యే – కనీయః – అన్నం – కరిష్యే – ఇతి – సః – తయా – వాచా – తేన – ఆత్మనా – ఇదం – సర్వం – అసృజత – యత్ – ఇదం – కించ – ఋచః – యజూంషి – సామాని – ఛన్దాంసి – యజ్ఞాన్ – ప్రజాః – పశూన్ – సః – యత్ – యత్ – ఏవ – అసృజత – తత్ – తత్ – అత్తుం–అధ్రియత – సర్వం – వై – అత్తి – ఇతి – తత్ – అదితేః – అదితిత్వం – సర్వస్య – ఏతస్య – అత్తా – భవతి – సర్వం – అస్య – అన్నం – భవతి – యః – ఏవం – ఏతత్ – అదితేః – అదితిత్వం – వేద.

ప్ర॥ సః = అమృత్యుశబ్దవాచ్యుడైన పరమాత్మ, ఇమం = ఈరోదనమును చేయుచున్న పుత్రుని, యదివా = ఎప్పుడైనను, అభిమస్యే = హింసించగలను, కనీయః = అల్పమైన, అన్నం = అన్నమును, కరిష్యఇతి = చేసెదనని, ఐక్షత = ఆలోచించెను. సః = ఆపరమాత్మ, తయా = ఆపూర్వోక్తమైన, వాచా = వాక్కుతోడను, తేన = ఆపూర్వోక్తమైన, ఆత్మనా = మనస్సుతోడను, (మిథునీభా

వం=మిధునభావమును, ఉపగమ్య = పొంది), యదిదంకించ=ఈ స్వల్పమైన ఏదైనను, ఇదం=ఈ, సర్వం=సమస్తమును, అసృజత =సృజించెను. (ఈస్వల్పమగున దేదనిన), ఋచః=ఋగ్వేద మంత్రములను, యజూంషి=యజుర్మంత్రములను, సామాని = సామ మంత్రములను, ఛన్దాంసి=గాయత్ర్యాది ఛందస్సులను, యజ్ఞాన్= యజ్ఞములను, ప్రజాః=ప్రజలను, పశూన్=పశువులను, సః=ఆ పరమాత్మ, యద్యదేవ=దేనిదేనినైనను, అసృజత=సృష్టించెనో, తత్తత్=ఆయాసమస్తమును, అత్తుం = భక్షించుటకు, (మనః= మనస్సును), అధ్రియత=ధరించెను. సర్వం=సృజింపబడిన సమస్తమును, అత్తీతి=భక్షించుచున్నాడనే, తత్ = ఆకారణమువలన, అదితేః=అదితియను పేరుగల ఆపరమాత్మకు, అదితిత్వం=అదితి నామము కలుగుట, (భవతి = అగుచున్నది). ఏతస్య=ఈ, సర్వస్య =సమస్తమునకు, అత్తా=భక్షించువాడు, భవతి=అగుచున్నాడు. (సర్వస్వరూపముతో పరమాత్మ సమస్తమునకు భక్షకుడగుచున్నాడు). సర్వం=సమస్తము, అస్య=ఈ పరమాత్మకు, అన్నం=అన్నముగా, భవతి=అగుచున్నది. యః=ఎవడు, ఏవం=ఈప్రకారము, అదితేః=అదితి యను పేరుగల పరమాత్మకు, అదితిత్వం=అదితినామము కలుగుటను, వేద=తెలిసికొనుచున్నాడో, (తస్య=వానికి), ఏతత్=ఈఫలము, (భవతి=అగుచున్నది).

తా॥ ఆపరమాత్మ ఇట్లు సృజింపబడిన పుత్రుని భక్షించినయెడల బీజభక్షణయందు సస్యము లేకపోయినట్లు అన్నము స్వల్పమగునని తలంచి వీనినిఎప్పుడైనను భక్షించగలను గనుక దీర్ఘకాలము భక్షణకొఱకు విస్తారమగు అన్నమును చేయఁదగినదని యోచించి ఆ పుత్రభక్షణనువిడిచి పూర్వము చెప్పియుండెడి వాఙ్మనస్సులతో మిధున భావమునుపొంది, ఋగ్యజుస్సామమంత్రములను గాయత్ర్యాది ఛందస్సులను యజ్ఞములను ఆయజ్ఞకర్తలగు ప్రజలను తత్సాధనము

త్తైన గ్రామీణారణ్యకములగు పశువులను ఇంకాసమస్తములైన క్రియలను క్రియాఫలములను సృజించెను. ఇట్లు ఆపరమాత్మ దేనిదేనిని సృజించెనో దానిదానినంతయు తినుటకు తలంచెను. ఇట్లు తలంచుట వలననే ఆపరమాత్మకు నదితిత్వము కలిగెను. గనుక ఈ సృజింపబడిన సమస్తజగత్తునకా పరమాత్మ భక్షకుఁడాయెను. ఆపరమాత్మకు సమస్త జగత్తును అన్నమాయెను. ఇట్లు పరమాత్మకు సర్వాత్మభావములోఁ గలిగిన అదితి భావమును తెలిసికొనినవాడు ఈ పరమాత్మకు కలిగిన ఫలమును తాను సర్వాత్మకుఁడై పొందుచున్నాఁడు.

ఉ॥ సోఽకామయత భూయసా యజ్ఞేన భూయో యజేయేతి సోఽశ్రామ్యత్సతపో తప్యత తస్య శ్రాన్తస్య తప్తస్య యశో వీర్య ముదక్రామత్ । ప్రాణా వై యశో వీర్యం తత్ప్రాణేషూత్క్రాన్తేషు శరీరగ్‌శ్వయితుమ్ ధ్రియత తస్య శరీర ఏవ మన ఆసీత్. ॥6॥

ప॥ సః - అకామయత - భూయసా - యజ్ఞేన - భూయః - యజేయ - ఇతి - సః - అశ్రామ్యత్ - సః - తపః - అతప్యత - తస్య - శ్రాన్తస్య - తప్తస్య - యశః - వీర్యం - ఉదక్రామత్ - ప్రాణాః - వై - యశః - వీర్యం - తత్ - ప్రాణేషు - ఉత్క్రాన్తేషు - శరీరం - శ్వయితుం - అధ్రియత - తస్య - శరీరే - ఏవ - మనః - ఆసీత్.

ప్ర॥ సః = ఆప్రజాపతి, భూయసా = గొప్పదియగు, యజ్ఞేన = యజ్ఞముచేత, భూయః = తిరిగి, యజేయేతి = (అశ్వమేధమను) యాగముచేయవలయునని, అకామయత = కోరెను. సః = ఆప్రజాపతి, అశ్రామ్యత్ = శ్రమనుపొందెను. సః = ఆప్రజాపతి, తపః = తపస్సును, అతప్యత = చేసెను. శ్రాన్తస్య = శ్రమనుపొందినవాడును, తప్తస్య = తపించువాడునగు, తస్య = ఆప్రజాపతికి, యశః = కీర్తియును, వీర్యం = బలమును, ఉదక్రామత్ = వెలువెడలెను. యశః = కీర్తియును, వీర్యం = బలమును, ప్రాణావై = చక్షురాదీంద్రియములే, ప్రాణేషు

=ప్రాణములు, ఉత్క్రాన్తేషు సత్సు=బైలువెడలుచుండగా, తత్=ఆప్రజాపతిసంబంధమైన, శరీరం=దేహము, శ్వయితుం=ఉచ్ఛూనభావమును పొందుటను, (అపవిత్రమగుటను), అధ్రియత=ధరించెను. తస్య = ఆప్రజాపతికి, శరీర ఏవ = దేహమునందే, మనః=మనస్సు, ఆసీత్=ఉండెను.

తా॥ ఆపూర్వము చెప్పబడిన హిరణ్యగర్భస్వరూపుడైన పరమాత్మ గొప్పయజ్ఞముతో తిరిగి యాగమును చేయవలయునని ఈ మహాత్కార్యమునుకోరి మిక్కిలి శ్రమనుపొంది తపించెను. ఇట్లు శ్రమతో తపమునుచేయునట్టి ఆపరమాత్మకు చక్షురాదీంద్రియ సాధ్యములగు యశోబలములు బైలువెడలెను. ఆచక్షురాదీంద్రియములు ముఖ్య కారణములుగాఁగలయశో వీర్యములు ఆప్రాణస్వరూపములైన చక్షురాదులుగానే ఉండెను. ఇట్టి ప్రాణస్వరూపములగు చక్షురాదు లుత్క్రమణమును పొందగా నాప్రజాపతి దేహము బలహీనమై యపవిత్రమాయెను. ఇట్లుకాగా ఆయనకు మనస్సు అటువంటి తన దేహమునందే మిక్కిలి ప్రేమగలదై యుండెను.

ఉ॥ సోఽకామయత మేధ్యం మ ఇదగ్ స్యాదాత్మన్వ్యనేనస్యామితి। తతోఽశ్వ స్సమభవ ద్యదశ్వత్తన్మేధ్యమభూదితి తదేవాశ్వమేధస్యాశ్వమేధత్వం। ఏష హ వా అశ్వమేధం వేద య ఏనమేవం వేద।తమనవరుధ్యైవా మన్యత తగ్ సంవత్సరస్య పరస్తాదాత్మన ఆలభత। పశూన్ దేవతాభ్యః ప్రత్యౌహత్।తస్మాత్సర్వదేవత్యం ప్రోక్షితం ప్రాజాపత్యమాలభన్తే। ఏషహ వా అశ్వమేధో య ఏష తపతి తస్యసంవత్సరఆత్మా అయ మగ్నిరర్క స్తస్యే మే లోకా ఆత్మానస్తావే తావర్కాశ్వమేధౌ సో పునరేకైవ దేవతా భవతి మృత్యురేవ అప పునర్మృత్యుంజయతి నైనం మృత్యురాప్నోతి మృత్యురస్యాత్మా భవతి ఏతాసాం దేవతానామేకో భవతి ॥7॥

ఇతి తృతీయాధ్యాయే ద్వితీయబ్రాహ్మణమ్.

ప॥ సః - అకామయత - మేధ్యం - మే - ఇదం - స్యాత్ - ఆత్మన్వీ - అనేన - స్యాం - ఇతి - తతః - అశ్వః - సమభవత్ - యత్ - అశ్వత్ - తత్ - మేధ్యం - అభూత్ - ఇతి - తత్ - ఏవ - అశ్వమేధస్య - అశ్వమేధత్వం - ఏషః - హవై - అశ్వమేధం - వేద - యః - ఏనం - ఏవం - వేద - తం - అనవరుధ్య - ఏవ - అమన్యత - తం - సంవత్సరస్య - పరస్తాత్ - ఆత్మనే - ఆలభత - పశూన్ - దేవతాభ్యః - ప్రత్యౌహత్ - తస్మాత్ - సర్వదేవత్యం - ప్రోక్షితం - ప్రాజాపత్యం - ఆలభన్తే - ఏషః - వై - అశ్వమేధః - యః - ఏషః - తపతి - తస్య - సంవత్సరః - ఆత్మా - అయం - అగ్నిః - అర్కః - తస్య - ఇమే - లోకాః - ఆత్మానః - తౌ - ఏతౌ - అర్కాశ్వమేధౌ - సా - ఉ - పునః - ఏకా - ఏవ - దేవతా - భవతి - మృత్యుః - ఏవ - అప - పునర్మృత్యుం - జయతి - న - ఏనం - మృత్యుః - ఆప్నోతి - మృత్యుః - అస్య - ఆత్మా - భవతి - ఏతాసాం - దేవతానాం - ఏకః - భవతి.

ప్ర॥ సః = ఆప్రజాపతి, మే=నాయొక్క, ఇదం=ఈశరీరము, మేధ్యం=యజ్ఞసంబంధమైనదిగా, స్యాత్=అగునుగాకయని, అకామయత=కోరెను. యత్=ఏకారణమువలన (ఇదం= ఈశరీరము, మద్వియోగాత్ = నాయొక్కవియోగమువలన, గతయశోవీర్యంసత్ = పోయినకీర్తిబలములుకలదియై), అశ్వత్ =అపవిత్రమాయెనో, అనేన = ఈశరీరముచేతనే, (అహం = నేను), ఆత్మన్వీ = శరీరముగలవాఁడను, స్యామితి = అగుదునుగాకయని, (ఇదం = ఈశరీరమును, ప్రవివేశ = ప్రవేశించెను). తతః = అందువలన, అశ్వః = అశ్వము, సమభవత్ = కలిగెను. తత్ = ఆశరీరము, ఇతి = ఈప్రకారము, మేధ్యం = యజ్ఞసంబంధమై పవిత్రమైనదిగా, అభవత్ =ఆయెను. తదేవ = ఆకారణమునుండియే, అశ్వమేధస్య=అశ్వమేధమనుయాగమునకు, అశ్వమేధత్వం=అశ్వమేధమనుపేరుకలుగుట. యః=ఎవఁడు, ఏవం=

ఈ పూర్వము చెప్పిన ప్రకారము, ఏనం = ఈఅశ్వమునున్ను, (ఏనం = అర్కమను పేరుగల అగ్నినిన్ని), వేద = తెలిసికొనుచున్నాడో, ఏష హ వై = వీఁడే, అశ్వమేధం = అశ్వమేధమను క్రతువును, వేద = తెలిసికొనుచున్నాడు. (సః = ఆ ప్రజాపతి), తం = ఆఅశ్వమును, అనవరుధ్యైవ = ప్రతిబంధించకయే, (అనేన = దీని చేతనే, యక్ష్య ఇతి = యాగము సు చేయుదుమని), అమన్యత = తలంచెను. తం = ఆ అశ్వమును, సంవత్సరస్య = సంవత్సరముయొక్క, పరస్తాత్ = అనంతరము, (సంవత్సర మైన తరువాత), ఆత్మనే = తనకొఱకు, ఆలభత = ఛేదించుకొనెను. దేవతాభ్యః = అగ్నీంద్రాది దేవతలకొఱకు, పశూన్ = పశువులను. (ఇతరములైన గ్రామీణారణ్య పశువులను, ప్రత్యౌహత్ = పొందించెను). (యస్మాత్ = ఏ కారణమువలన, ప్రజాపతిః = ప్రజాపతి, ఏవం = ఈప్రకారము, అమన్యత = తలంచెనో), తస్మాత్ = ఆ కారణమునుండి, (యాజ్ఞికాః = యాగము చేయువారలు,) సర్వదేవత్యం = సమస్త దేవతాస్వరూపమును, ప్రోక్షితం = ప్రోక్షింపఁబడిన, (ప్రోక్షణపర్యగ్నికరణము మొదలైనవాని చేత సంస్కారముగలదిగాఁ జేయబడిన), ప్రాజాపత్యం = ప్రజాపతి దేవతాకమైన అశ్వమును, ఆలభన్తే = ఛేదించుచున్నారు. య ఏషః = ఏ ఈసూర్యుఁడు, (జగత్ = లోకమును, తేజసా = తేజస్సు చేత), తపతి = ప్రకాశింపఁజేయుచున్నాఁడో, ఏష వై = ఈసూర్యుడే, అశ్వమేధః = అశ్వమేధయాగ స్వరూపుఁడు. (ఈ సూర్యుఁడు ఈ పూర్వోక్తమైన ,పశుసాధకమగు క్రతువుయొక్క ఫలస్వరూపమైనవాడు). తస్య = ఆ క్రతుఫలరూపమైన సూర్యునకు, సంవత్సరః = సంవత్సరమను కాలవిశేషము, ఆత్మా = శరీరము. అయం = ఈ, (ఈపృథివీసంబంధమైన) అగ్నిః = అగ్ని, అర్కః = పూర్వోక్తమైన అర్కస్వరూపము. (యజ్ఞసాధనభూతమైన అర్కుఁడను పేరుగల పరమాత్మస్వరూపము గు అగ్ని). తస్య = ఆ అగ్నికి, ఇమే = ఈ లోకాః = లోకములు, (మూఁడులోకములు.) ఆత్మానః = శరీరావయవ

వములు. తే = అసాధ్యసాధన భూతములైన, ఏతే = ఈ; (అగ్న్యా దిత్యు లిద్దఱును, అర్కాశ్వమేధౌ = అర్కాశ్వమేధములు. సాఊ = ఆదేవతాస్వరూపమైతే, పునః = తిరిగి, ఏకైవదేవతా = ఒకటి యగు దేవతగానే, భవతి=అగుచున్నది. (సా కా = అవేదియనఁగా), మృత్యురేవ = మృత్యుశబ్దవాచ్యమైన ఆ హిరణ్యగర్భ స్వరూపమగు పరమాత్మయే. (యఃపునః = ఎవఁడైతే, ఏవం = ఈ చెప్పినప్రకారము, ఏనం= ఈ అశ్వమేధమును, (ఏక దేవతాస్వరూపమైన అశ్వమేధమును మృత్యుశబ్దవాచ్యమైన పరమాత్మనుగా, వేద = తెలిసికొనుచున్నాఁడో, సః = వాఁడు) పునర్మృత్యుం = పునర్మరణమును, అపజయతి = జయించుచున్నాఁడు. (ఒకసారిచచ్చి తిరిగి మరణముఁకొఱకు పుట్టఁడు). మృత్యుః = మృత్యువు, ఏనం= వీనిని, (ఈ తెలిసినవానిని,) నాప్నోతి = పొందదు. అస్య = వీనికి, మృత్యుః = మృత్యువు, ఆత్మా =ఆత్మస్వరూపముగా, భవతి = అగుచున్నాఁడు. ఏతాసాం = ఈ, దేవతానాం = అగ్నీంద్రాది దేవతలలో, ఏకః - ఒకడుగా, భవతి =అగుచున్నాఁడు.

తా॥ మృత్యుశబ్దవాచ్యుఁడైన ఆ హిరణ్యగర్భుడు ఆ దేహము నందు ప్రేమయుక్తమైన మనస్సుగలవాఁడై నేను విడుచుటచే కీర్తి బలములులేనిదై అపవిత్రమైనదగు నీ శరీరము పవిత్రమైనదై యజ్ఞ సంబంధమైనదగును గాక యనిన్ని ఈ శరీరము చేతనే నేను దేహము గలవాడనగుదునుగాక యనిన్ని కోరి దానియందే ప్రవేశించెను. అందు వలన పవిత్రమైనదియును యజ్ఞసంబంధమైనదియునగు అశ్వముకలిగెను. అప్పుడా దేహము యజ్ఞసంబంధమై పవిత్రమాయెను. అందు వల్లనే ఈ యజ్ఞమునకు అశ్వమేధమను పేరుగఁలిగెను. ఎవడిట్లు ఈ యజ్ఞసంబంధమైన అశ్వమునున్ను పూర్వము చెప్పియుండెడిఅర్కమను పేరుగల ఈఅశ్వమేధయాగసంబంధమైనఅగ్నినిన్ని తెలిసికొనుచున్నాఁడో, వీడే అశ్వమేధక్రతువును తెలిసినవాఁడు. ఆ హిరణ్య

గర్భాత్మకుఁడగు ప్రజాపతి ఈ అశ్వముచేతనే యాగమును చేయుదు ననితలంచి ఒక సంవత్సరమైనతరువాత అశ్వమును తనకొఱకు ఛేదించెను. అనంతరము అగ్నీంద్రాది దేవతలకొఱకు ఇతరములగు గ్రామీణారణ్య పశువులను విభజించిపొందించెను. ప్రజాపతి ఇట్లు తలఁచుటవల్లనే ఇప్పటి యాజ్ఞికులును సమస్తదేవతాస్వరూపమును పర్యగ్నికరణాదులచే సంస్కారముకలదిగాఁ జేయబడినదియును ప్రజాపతిదేవతాకమునగు అశ్వమును ఛేదించుచున్నారు. ఇట్లు ప్రజాపతి స్వరూపమైన అశ్వమే సాధనముగాగల యాగస్వరూపమే ఈ లోకములను ప్రకాశింపఁజేయునట్టి ఈ సూర్యుఁడు. ఇట్టి యజ్ఞస్వరూపమగు సూర్యునకు కాలవిశేషమగు సంవత్సరమే శరీరము. ఈ యజ్ఞసాధనమైన అగ్ని పూర్వము చెప్పియుండెడి అర్కమను పేరుగలది. దీనికి ఈ స్వర్గమర్త్యపాతాళములను మూఁడులోకములు శరీరములు. ఇట్లు క్రతుఫలభూతులును సాధ్యసాధనములునగు అగ్న్యాదిత్యులిద్దఱును అర్కాశ్వమేధములనబడుదురు. ఈ ప్రకారము భయాత్మకమగు దేవత ఒక్కటరై మృత్యుశబ్దవాచ్యుఁడైన ప్రజాపతియేయగుచున్నది. ఈవిధముగా నేక దేవతాస్వరూపమైన అశ్వమేధమును ప్రజాపతిస్వరూపముగాఁ దెలిసికొనువాఁడు మరణమునుపొంది తిరిగిపుట్టఁడు. వీనిని తిరిగి మృత్యువున్ను పొందదు. ఇట్టివానికి ఆ మృత్యుశబ్దవాచ్యమైన పరమాత్మ ఆత్మస్వరూపమగుచున్నాఁడు. ఇట్లు పరమాత్మస్వరూపుఁడగుటయేగాక వాని యభీష్టప్రకారము ఇంద్రాది దేవతలలో నొకఁడుగానున్ను అగుచున్నాఁడు.

ఇట్లు తృతీయాధ్యాయమునందు ద్వితీయబ్రాహ్మణము సమాప్తము.

---

ఉ॥ ద్వయా హ ప్రాజాపత్యాః దేవాశ్చాసురాశ్చ। తతః కానీయసా ఏవ దేవాః జ్యాయసా అసురాః త ఏషు లోకేష్వస్పర్ధన్త తే హ దేవా ఊచుర్హన్తాసురాన్యజ్ఞ ఉద్గీథేనాత్యయామేతి. ॥1॥

ద్వయాః - హ - ప్రాజాపత్యాః - దేవాః - చ - అసురాః - చ - తతః - కానీయసాః - ఏవ - దేవాః - జ్యాయసాః - అసురాః - తే - ఏషు - లోకేషు - అస్పర్ధన్త - తే - హ - దేవాః - ఊచుః - హన్త - అసురాన్ - యజ్ఞే - ఉద్గీథేన - అత్యయామ - ఇతి.

ప్ర॥ ద్వయాః=రెండువిధములుగా నుండెడి, దేవాశ్చ=దేవతలున్ను, అసురాశ్చ = రాక్షసులున్ను, ప్రాజాపత్యాహ=ప్రజాపతి సంబంధమైనవారలే. (ఆ ప్రజాపతియొక్క ప్రాణశబ్దవాచ్యములైన వాగాదులే శాస్త్రమువలనపుట్టిన జ్ఞానకర్మభావనచేసి ప్రకాశించునవియై దేవతలగుచున్నవి. అవియే స్వభావసిద్ధములైన ప్రత్యక్షానుమానములవలనఁబుట్టిన దృష్టమైన ప్రయోజనమే ఫలముగాఁగల కర్మజ్ఞానమును భావనచేయుచు అసురులగుచున్నవి.) తతః=అందువలన, దేవాః=దేవతలు, కానీయసాఏవ=అల్పమైనవారు. అసురాః= రాక్షసులు, జ్యాయసాః=అధికమైనవారు. (అథవర్ = అయిరి). తే= ఆ దేవాసురులు, ఏషులోకేషు=ఈలోకములవిషయమై(స్వాభావికేతర కర్మజ్ఞాన సాధ్యములైన లోకములవిషయమై,) అస్పర్ధన్త=కలహించిరి. (దేవాసురులకు జ్ఞానాజ్ఞానవృత్తులయొక్క జన్మములను తిరస్కరించుటయే స్వరూపముగాఁగల విరోధము కలిగెను.) తేదేవాః=ఆ దేవతలు, హన్త=ఇప్పుడు, యజ్ఞే=యాగమునందు, ఉద్గీథేన=ముఖ్య ప్రాణమును స్తోత్రముచేయుటచేత, (వాగాదీంద్రియములను నిందించుటచే ముఖ్యప్రాణస్తుతి, లేక వాక్కు మొదలైనవాటికి అగ్న్యాది భావము. లేక ప్రాణముయొక్క యుపాసన. లేక ఉద్గీథమను కర్మ పదార్థమునకు కర్తయగు ప్రాణస్వరూపమును ఆశ్రయించుటచేత.) అసురాన్=రాక్షసులను, అత్యయామేతి=అతిక్రమించెదమని, ఊచుః =పలికిరి.

తా॥ కర్మజ్ఞానములయొక్క పుట్టుకను ప్రకాశింపఁజేయుటకు నీ ఉద్గీథబ్రాహ్మణ ముపక్రమింపఁబడుచున్నది. దేవతలును రాక్షసు

లును వీరుభయులును ఆ ప్రజాపతియొక్క వాగాదీంద్రియములే. ఆ వాగాదీంద్రియములు శాస్త్రజనిత జ్ఞానకర్మభావితములై ప్రకాశించుచు దేవతలుగాను, స్వాభావికమైన ప్రత్యక్షానుమానములవలనఁ బుట్టినదృష్టప్రయోజనముగల కర్మజ్ఞానము చేత భావితములై అసురులుగాను అగుచున్నవి. ఇట్లు వాగాదీంద్రియములకు దృష్టప్రయోజనము కలిగినదియును స్వాభావికమైనదియును శాస్త్రజనితమైనదియునగు కర్మజ్ఞానప్రవృత్తి అధికమగుటవల్లను, అత్యన్తప్రయత్న సాధ్యమైన శాస్త్రజనితమునగు జ్ఞానప్రవృత్తి స్వల్పమగుటవల్లనున్ను రాక్షసులు అధికులుగాను దేవతలు స్వల్పులుగాను అయిరి. ఈ ప్రకారము ప్రజాపతి శరీరమందుండెడి ఆ దేవాసురులుభయులును స్వాభావికేతరమైన కర్మజ్ఞానసాధ్యములగు ఈలోకముల విషయమై కలహించిరి. (ఒకానొకప్పుడు వాగాదీంద్రియముల కెప్పుడు శాస్త్రమువలనపుట్టిన ఆకర్మజ్ఞానభావరూపమగు వృత్తిపుట్టుచున్నదో అప్పుడు దృష్టప్రయోజనమైన ప్రత్యక్షానుమానజనితకర్మజ్ఞానభావనారూపమగు ఆవాగాదీంద్రియములయొక్క ఆసురవృత్తి తిరస్కరింపబడుచున్నది. అదియే దేవతలకుజయము. అసురులకు అపజయము. ఒకానొకప్పుడు వ్యత్యాసముగా దేవతలయొక్క వృత్తితిరస్కరింపబడుచున్నది. ఇదియే అసురులజయము. దేవతలకపజయము. ఇట్లు దేవతలకు జయమందు ధర్మబాహుళ్య మగుటవలన ప్రజాపతిత్వముయొక్క ప్రాప్తివరకు నుత్కర్షముకలుగుచున్నది. అసురులకు జయమందు అధర్మ బాహుళ్యమగుటవలన స్థావరత్వముయొక్క ప్రాప్తివరకు నపకర్షము కలుగుచున్నది. రెంటను సమానమగుటయందు మనుష్యత్వము కలుగుచున్నది). ఈ సిద్ధముగా దేవవృత్తి అతిప్రయత్నసాధ్యమగుటవలన దేవతలు అల్పులై రాక్షసులచే తిరస్కరింపఁబడిరి. ఇట్లు తిరస్కరింపఁబడిన ఆ దేవతలు యజ్ఞమునందిప్పుడే ముఖ్యప్రాణమును స్తుతించిప్రాణస్వరూపమును ఆశ్రయించుటచేత అసురులను జయించెదమనిపలికిరి.

ఉ॥ తే హ వాచమూచుస్త్వం న ఉద్గాయేతి తథేతి తేభ్యో వాగుదగాయత్ యో వాచి భోగస్తం దేవేభ్య ఆగాయత్ యత్కల్యాణం వదతి తదాత్మనే తే విదురనేన వై న ఉద్గాత్రాఽత్యేష్యన్తీతి తమభిద్రుత్య పాప్మనావిధ్యన్ స యస్స పాప్మా యదేవేదమప్రతిరూపం వదతి స ఏవ స పాప్మా. ॥2॥

ప॥ తే - హ - వాచం - ఊచుః - త్వం - నః - ఉద్గాయ - ఇతి - తథా - ఇతి - తేభ్యః - వాక్ - ఉదగాయత్ - యః - వాచి - భోగః - తం - దేవేభ్యః - ఆగాయత్ - యత్ - కల్యాణం - వదతి - తదాత్మనే - తే - అవిదుః - అనేన - వై - నః - ఉద్గాత్రా - అత్యేష్యన్తి - ఇతి - తం - అభిద్రుత్య - పాప్మనా - అవిధ్యన్ - సః - యః - సః - పాప్మా - యత్ - ఏవ - ఇదం - అప్రతిరూపం - వదతి - సః - ఏవ - సః - పాప్మా.

ప్ర॥ తేహ = ఆదేవతలే. వాచం = వాగభిమానదేవతనుగూర్చి, త్వం = నీవు, నః = మాకొఱకు, ఉద్గాయేతి = గానముచేయుమాయని (ఔద్గాత్రకర్మమును చేయుమాయని,) ఊచుః = పలికిరి. వాక్ = వాగభిమానదేవత, తథేతి = అప్రకారమేయని, (సరేనని,) తేభ్యః = ఆదేవతలకొఱకు, ఉదగాయత్ = మిక్కిలిగానముచేసెను. వాచి = వాక్కునందు. యః = ఏది, భోగః = ఫలమో, తం = అఫలమును, దేవేభ్యః = దేవతలకొఱకు, ఆగాయత్ = గానముచేసెను. యత్ = ఏ, కల్యాణం = శుభము, (వాక్సంబంధమును బుత్వోక్సంబంధమునగు ఫలమును), వదతి = పలుకుచున్నదో, తదాత్మనే = ఆవాగ్దేవతాస్వరూపమైన తనకొఱకే, (అగాయత్ = గానముచేసికొనెను). అనేనఉద్గాత్రావై = ఈగానముచేతనే, నః = మనలను, అత్యేష్యన్తీతి = అతిక్రమించగలరని, తే = ఆ అసురులు, అవిదుః = తెలిసికొనిరి. (తే = ఆ అసురులు,) తం = ఆ ఉద్గాతనుగూర్చి, అభిద్రుత్య = పరుగెత్తిపోయి, పాప్మనా = పాపముచేత, అవిధ్యన్ = కొట్టిరి. (పాపముతోఁగూర్చిరి). సః = ఆకూర్చ

బడినది, యః = ఏదియో, సః = అది, పాప్మా = పాపము. య దేవ = ఏది, ఇదం = ఈ, అప్రతిరూపం = తగనిదానిని, (శాస్త్రనిషిద్ధమైనదానిని,) వదతి = పలుకుచున్నదో, సఏవ = అదియే, సపాప్మ = ఆపాపము.

తా॥ ఆ దేవతలు ఈప్రకారము నిశ్చయించుకొని వాగభిమాన దేవతనుగూర్చి నీవు మాకొఱకు నీయజ్ఞమునందు ఔద్గాత్రకర్మను చేయుమాయని పలికిరి. ఆవాగభిమాన దేవతయును అట్లేప్రకారము చేయుదునని పలికి వాఙ్నిమిత్తకమైన సుఖానుభవము నుద్దేశించి దేవతలకొఱకును ఆ వాగ్దేవతాస్వరూపమైన తనకొఱకును గానము చేసెను. ఇట్లుచేయఁగా నా రాక్షసులు ఈ ఔద్గాత్రకర్మచే దేవతలు మనల నతిక్రమించెదరని ఆ ఉద్గాతనుగూర్చి శీఘ్రముగాఁబోయి పాపముతో హతముచేసిరి. (ఆ వాక్కును అసురసంబంధమైన పాపముతోఁ గూర్చిరి). శాస్త్రప్రతిషిద్ధమైన ఏపాపముతో నాకర్మను అసురులు హతము చేసిరో అట్టి శాస్త్రనిషిద్ధరూపమగు పాపము ప్రజాపతి కార్యభూతములైన ప్రజలయొక్క వాక్కునందును అనుసరించి బీభత్సానృతాది రూపమైయుండుచున్నది.

ఉ॥ అథ హ ప్రాణమూచు స్త్వం న ఉద్గాయేతి తథేతి తేభ్యః ప్రాణ ఉదగాయద్యః ప్రాణే భోగ స్తం దేవేభ్య ఆగాయత్ యత్కల్యాణం జిఘ్రతి తదాత్మనే తే విదుర నేన వైన ఉద్గాత్రా త్యేష్య న్తీతి తమభిద్రుత్య పాప్మనావిధ్యన్ స యస్సపాప్మా యదేవేదమప్రతిరూపం జిఘ్రతి స ఏవ స పాప్మా. ॥3॥

ప॥ అథ - హ - ప్రాణం - ఊచుః - త్వం - నః - ఉద్గాయ - ఇతి - తథా - ఇతి - తేభ్యః - ప్రాణః - ఉదగాయత్ - యః - ప్రాణే - భోగః - తం - దేవేభ్యః - ఆగాయత్ - యత్ - కల్యాణం - జిఘ్రతి - తదాత్మనే - తే - అవిదుః - అనేన - వై - నః ఉద్గాత్రా - అత్యేష్యన్తి - ఇతి - తం - అభిద్రుత్య - పాప్మనా -

అవిధ్యన్ - సః - యః - సః - పాప్మా - యత్ - ఏవ - ఇదం - అప్రతిరూపం - జిఘ్రతి - ఏవ - సః పాప్మా.

ప్ర॥ అథహ = అనంతరమునందు, (తే = దేవతలు,) ప్రాణం = ప్రాణమునుగూర్చి, (ప్రాణశబ్దవాచ్యమైన ఘ్రాణమునుగూర్చి), త్వం = నీవు, నః = మాకొఱకు, ఉద్గాయేతి = గానమును చేయుమూయని, (ఔద్గాత్రకర్మను చేయుమూయని,) ఊచుః = పలికిరి. పాణః = ప్రాణము, తథేతి = సరేయని, తేభ్యః = ఆ దేవతలకొఱకు, ఉదగాయత్ = గానము చేసెను. ప్రాణే = ప్రాణశబ్దవాచ్యమగు ఘ్రాణమునందు. యః = ఏ, భోగః = భోగమో, తం = దానిని, దేవేభ్యః = దేవతలకొఱకు, అగాయత్ = గానముచేసెను. యత్ = ఏ, కల్యాణం = శుభమును, జిఘ్రతి = ఆఘ్రాణించుచున్నదో, తదాత్మనే = ఆ ఘ్రాణదేవతాస్వరూపమైన తనకొఱకు, (అగాయత్ = గానముచేసెను). తే = ఆ అసురులు, అనేన ఉద్గాత్రావై = ఈ ఔద్గాత్రకర్మచేతనే, (ఏతే = ఈ దేవతలు,) నః = మనలను అత్యేష్యన్తీతి = అతిక్రమించగలరని, అవిదుః = తెలిసికొనిరి. (ఆ అసురులు ఇట్లు తెలిసికొని), తం = ఆఘ్రాణమునుగూర్చి, అభిద్రుత్య పరుగెత్తుకొనిపోయి, పాప్మనా = పాపముతో, అవిధ్యన్ = కొట్టిరి. (ఘ్రాణమును పాపముతోఁగూర్చిరి.) సః = అది, యః = ఏదియో, సః = అది, పాప్మా = పాపము. యదేవ = ఏది, ఇదంఅప్రతిరూపం = ఈ శాస్త్రప్రతిషిద్ధగంధమును, జిఘ్రతి = ఆఘ్రాణించుచున్నదో, సఏవ = అదియే, సపాప్మా = ఆపాపము.

తా॥ అసురులువాక్కును శాస్త్రనిషిద్ధమైన అనృతరూపమగు పాపముతోఁజేర్చి ఔద్గాత్రకర్మకసమర్థముఁగాఁజేయఁగా దేవతలప్పుడు ఘ్రాణాత్మకమగు దేవతనుఁగూర్చిపోయి నీవు మాకు నీయజ్ఞమునందు నౌద్గాత్రకర్మను చేయుమూయని అనఁగఁగా అనేకవిధమున చేసెదనని ఆఘ్రాణదేవత ఘ్రాణనిమిత్తకమగు సుఖానుభవము నుద్దేశించి దేవతలకొఱకును ఆఘ్రాణదేవతా స్వరూపమైన తనకొఱకును గానము

చేసెను. ఇట్లు చేయఁగా నా రాక్షసులు ఈయౌద్గాత్రకర్తచేత దేవతలు మనలను అతిక్రమింతురని ఆఘ్రాణదేవతనుగూర్చి శీఘ్రముగాఁ బోయి శాస్త్రనిషిద్ధమైన అసురసంబంధమగు పాపముతో నాఘ్రాణదేవతను చేర్చి అపరిశుద్ధముచేసిరి. ఈశాస్త్రనిషిద్ధమును అననురూపమును (తగనిరూపమును)అసురసంబంధమునైన యాఘ్రాణకర్మవదియో అదియె ఆపాపస్వరూపము.

ఉ॥ అధ హ చక్షురూచు స్త్వం న ఉద్గాయేతి తథేతి తేభ్యశ్చక్షురుదగాయత్ యశ్చక్షుషి భోగ స్తం దేవేభ్య ఆగాయద్యత్కల్యాణం పశ్యతి తదాత్మనే తే విదురనేన వై న ఉద్గాత్రాత్యేష్య న్తీతి తమభిద్రుత్య పాప్మనావిధ్యన్ స యస్సపాప్మా యదేవేదమప్రతిరూపం పశ్యతి స ఏవ స పాప్మా. ॥4॥

ప॥ అధ - హ - చక్షుః - ఊచుః - త్వం - నః - ఉద్గాయ - ఇతి - తథా - ఇతి - తేభ్యః - చక్షుః - ఉదగాయత్ - యః - చక్షుషి - భోగః - తం - దేవేభ్యః - ఆగాయత్ - యత్ - కల్యాణం- పశ్యతి - తదాత్మనే - తే - అవిదుః - అనేన - వై - నః - ఉద్గాత్రా- అత్యేష్య న్తి - ఇతి - తం - అభిద్రుత్య - పాప్మనా - అవిధ్యన్ - సః - యః - సః - పాప్మా - యత్ - ఏవ - ఇదం - అప్రతిరూపం - శ్యతి - సః - ఏవ - సః—పాప్మా.

ప్ర॥ అథహ=అనంతరము, (తే=ఆ దేవతలు), చక్షుః=నేత్రమునుగూర్చి, త్వం=నీవు, నః=మాకొఱకు, ఉద్గాయేతి=గానమును చేయుమాయని, (ఔద్గాత్రకర్మను చేయుమాయని), ఊచుః=పలికిరి. చక్షుః=నేత్రము, తథేతి=సరేయని, తేభ్యః = ఆ దేవతలకొఱకు, ఉదగాయత్=గానముచేసెను. చక్షుషి=నేత్రమునందు, యః=ఏ, భోగః=భోగమో, తం=దానిని, దేవేభ్యః=దేవతలకొఱకు, ఆగాయత్=గానముచేసెను. యత్=ఏ, కల్యాణం=శుభమును, పశ్యతి =చూచుచున్నదో, తదాత్మనే=ఆస్వరూపమైన తనకొఱకు, (ఆగా

యత్ = గానముచేసెను). తే = ఆ అసురులు, అనేన ఉద్గాత్రా వై = ఈయౌద్గాత్రకర్మచేతనే, (ఏతే = ఈ దేవతలు), నః = మనలను, అత్యేష్యన్తీతి = అతిక్రమించగలరని. అవిదుః = తెలిసికొనిరి. (ఆఅసురులు ఇట్లు తెలిసికొని), తం = ఆచక్షుస్సునుగూర్చి, అభిద్రుత్య = పరుగెత్తి పోయి, పాప్మనా = పాపముచేత, అవిధ్యన్ = కొట్టిరి. (నేత్రమును పాపములో(గూర్చిరి). సః = అది, యః = ఏదియో, సః = అది, పాప్మా = పాపము. యదేవ = ఏది, ఇదం అప్రతిరూపం = ఈ శాస్త్ర ప్రతిషిద్ధమైన రూపాదికమును, పశ్యతి = చూచుచున్నదో, సఏవ = అదే, సపాప్మా = ఆపాపము.

తా॥ అసురులు ఘ్రాణమును శాస్త్రప్రతిషిద్ధమైన దుర్విషయమగు గంధాదికములో(గూర్చగా దేవతలప్పుడు నేత్రాత్మకమగు దేవతనుగూర్చిపోయి నీవుమాకు నీయజ్ఞమునందు నౌద్గాత్రకర్మను చేయుమా అనియడుగ(గా నదేవిధముగా( జేసెదననిపలికి చక్షుర్నిమిత్తకమైన సుఖానుభవమునుద్దేశించి దేవతలకొఱకును నాచక్షుర్దేవతాస్వరూపమైన తనకొఱకున్ను గానముచేసెను. ఇట్లుచేయుగా నాఅసురులు ఈయౌద్గాత్రకర్మచేత దేవతలు మనలనతిక్రమించగలరని ఆ చక్షుర్దేవతను గూర్చిపోయి శాస్త్రనిషిద్ధమైన అసురసంబంధమగు పాపములో నాచక్షుస్సును గూర్చి అపరిశుద్ధముచేసిరి. ఆశాస్త్రనిషిద్ధమును అధమరూపమును అసురసంబంధమునైన ఆనేత్రకర్మయేదియో అదియే ఆపాపము.

మూ॥ అథ హ శ్రోత్రమూచుస్త్వం న ఉద్గాయేతి తథేతి తేభ్యఃశ్రోత్రముదగాయత్ యశ్శ్రోత్రే భోగస్తం దేవేభ్య ఆగాయద్యత్కల్యాణగ్ శృణోతి తదాత్మనే తే విదురనేన వై న ఉద్గాత్రాత్యేష్యన్తీతి తమభిద్రుత్య పాప్మనావిధ్యన్ స యస్సపాప్మా యదేవేదమప్రతిరూపగ్ శృణోతి స ఏవ స పాప్మా. ॥5॥

ప॥ అథ - హ - శ్రోత్రం - ఊచుః - త్వం - నః - ఉద్గాయ

- ఇతి - తథా - ఇతి - తేభ్యః - శ్రోత్రం - ఉదగాయత్ - యః - శ్రోత్రే - భోగః - తం - దేవేభ్యః - ఆగాయత్ - యత్ - కల్యాణం - శృణోతి - తదాత్మనే - తే - అవిదుః - అనేన - వై - నః - ఉద్గాత్రా - అత్యేష్యన్తి - ఇతి - తం - అభిద్రుత్య - పాప్మనా - అవిధ్యన్ - సః - యః - సః - పాప్మా - యత్ - ఏవ - ఇదం - అప్రతిరూపం - శృణోతి - సః - ఏవ - సః - పాప్మా.

ప్ర॥ అథహ=అనంతరమునందు, (తే=ఆ దేవతలు), శ్రోత్రం =శ్రోత్రమునుగూర్చి, త్వం=నీవు, నః=మాకొఱకు, ఉద్గాయేతి= గానముచేయుమాయని, (ఔద్గాత్రకర్మను చేయుమాయని), ఊచుః =పలికిరి. శ్రోత్రం=శ్రోత్రము, తథేతి=సరేయని, తేభ్యః=ఆ దేవతలకొఱకు, ఉదగాయత్=గానముచేసెను. శ్రోత్రే=శ్రోత్రమునందు యః=ఏది, భోగః=భోగమో, తం=దానినిగూర్చి. దేవేభ్యః=దేవతలకొఱకును, ఆగాయత్=గానముచేసెను. యత్=ఏ, కల్యాణం =శుభమును, శృణోతి=వినుచున్నదో, తదాత్మనే=ఆ స్వరూపమైన తనకొఱకును, (ఆగాయత్=గానముచేసికొనెను). తే=ఆ అసురులు, అనేనఉద్గాత్రావై=ఈ యూద్గాత్రకర్మచేతనే, (ఏతే=ఈ దేవతలు), నః=మనలను, అత్యేష్యన్తీతి=అతిక్రమించగలరని, అవిదుః =తెలిసికొనిరి. (ఆ అసురులిట్లు తెలిసికొని), తం=ఆ శ్రోత్రాధిష్ఠాన దేవతనుగూర్చి, అభిద్రుత్య=పరుగెత్తుకొనిపోయి, పాప్మనా=పాపముతో, అవిధ్యన్=కొట్టిరి. (శ్రోత్రమును పాపముతోఁగూర్చిరి), సః=అది, యః=ఏదియో, సః=అది, పాప్మా=పాపము. యదేవ =ఏది, ఇదంఅప్రతిరూపం=ఈశాస్త్రప్రతిషిద్ధమైన శబ్దమును, శృణోతి=వినుచున్నదో, సఏవ=అదియే, సపాప్మా=ఆ పాపము.

తా॥ అసురులు నేత్రమును శాస్త్రప్రతిషిద్ధమైన దుర్విషయముతోఁగూర్చగా దేవతలప్పుడు శ్రోత్రాధిష్ఠాన దేవతనుగూర్చి పోయి నీవు మాకొఱకు నీయజ్ఞమునందు నౌద్గాత్రకర్మను చేయు

మాయని అడుగఁగా న దేవిధముగాఁ జేసెదనని పలికి శ్రోత్రము శ్రోత్ర నిమిత్తకమైన సుఖానుభవము నుద్దేశించి దేవతలకొఱకును ఆ శ్రోత్రాత్మకమైన తనకొఱకును గానము చేసెను. ఇట్లు చేయగా ఆ అసురులు ఈ యౌద్గాత్ర కర్మచేత దేవతలు మనల నతిక్రమించగలరని ఆ శ్రోత్ర దేవతనుగూర్చి పోయి శాస్త్రనిషిద్ధమైన అసురసంబంధమగు పాపముతో నా శ్రోత్రముఁగూర్చి అపరిశుద్ధము చేసిరి. ఆ శాస్త్రనిషిద్ధమును అననురూపమును అసురసంబంధమునైన శ్రోత్రకర్మ యేదియో అదియే ఆ పాపము.

ఉ॥ అథ హ మనఊచుస్త్వం న ఉద్గాయేతి తథేతి తేభ్యో మన ఉదగాయత్ యో మనసి భోగస్తం దేవేభ్య ఆగాయద్యత్కల్యాణగ్ సఙ్కల్పయతి తదాత్మనే తే విదురనేన వై న ఉద్గాత్రాత్యేష్య న్తీతి తమభిద్రుత్య పాప్మనావిధ్యన్ స యస్స పాప్మా య దేవేద మప్రతిరూపగ్ సఙ్కల్పయతి స ఏవ సపాప్మైవము ఖల్వేతా దేవతాః పాప్మభిరుపాసృజన్నేవమేనాః పాప్మనావిధ్యన్. ॥6॥

ప॥ అథ – హ – మనః – ఊచుః – త్వం – నః – ఉద్గాయ – ఇతి – తథా – ఇతి – తేభ్యః – మనః – ఉదగాయత్ – యః – మనసి – భోగః – తం – దేవేభ్యః – ఆగాయత్ – యత్ – కల్యాణం – సఙ్కల్పయతి – తదాత్మనే – తే – అవిదుః – అనేన – వై – నః – ఉద్గాత్రా – అత్యేష్యన్తి – ఇతి – తం – అభిద్రుత్య – పాప్మనా – అవిధ్యన్ – సః – యః – సః – పాప్మా – యత్ – ఏవ – ఇదం – అప్రతిరూపం – సఙ్కల్పయతి – సః – ఏవ – సః – పాప్మా – ఏవం – ఉ – ఖలు – ఏతాః – దేవతాః – పాప్మభిః – ఉపాసృజన్ – ఏవం – ఏనాః – పాప్మనా – అవిధ్యన్

ప్ర॥ అథహ = అనంతరమునందు, (తే = ఆ దేవతలు), మనః = మనస్సునుగూర్చి, త్వం = నీవు, నః = మాకొఱకు, ఉద్గాయేతి = గానము చేయుమాయని, (ఔద్గాత్రకర్మను చేయుమాయని), ఊచుః

=పలికిరి. మనః=మనస్సు, తథేతి=ఆప్రకారమేయని, ఆ దేవతలకొఱకు, ఉదగాయత్=గానముచేసెను. మనసి=మనస్సునందు, యః=ఏ, భోగః=భోగమో, తం=వానినిగూర్చి, దేవేభ్యః=దేవతలకొఱకు, ఆగాయత్=గానముచేసెను. యత్=ఏ, కల్యాణం=శుభమును, సఙ్కల్పయతి=సంకల్పించుచున్నదో, తదాత్మనే=ఆ స్వరూపమైన తనకొఱకును, (ఆగాయత్=గానముచేసికొనెను). తే=ఆ అసురులు, అనేనఉద్గాత్రావై=ఈఔద్గాత్రకర్మచేతనే, (ఏతే=ఈ దేవతలు), నః=మనలను, అత్యేష్యన్తీతి=అతిక్రమించగలరని, అవిదుః=తెలిసికొనిరి. (ఆ అసురులిట్లు తెలిసికొని), తం=ఆ మనోధిష్ఠాన దేవతనుగూర్చి, అభిద్రుత్య=పరుగెత్తుకొనిపోయి, పాప్మనా=పాపముతో, అవిధ్యన్=కొట్టిరి. సః=అది, యః=ఏదియో, సః=అది, పాప్మా=పాపము. యదేవ=ఏది, ఇదంఅప్రతిరూపం=ఈశాస్త్రప్రతిషిద్ధరూపమైన సంకల్పమును, సఙ్కల్పయతి=తలంచుచున్నదో, సఏవ=అదియే. సపాప్మా=ఆపాపము. ఏవముఖలు=ఈప్రకారముగానే, ఏతాః=ఈ, దేవతాః=త్వగాదిదేవతలు, పాప్మభిః=శాస్త్రప్రతిషిద్ధరూపములైన పాపములతో. ఉపాసృజన్=కూర్పఁబడినవి. ఏవం=ఈప్రకారము, (తే=ఆ అసురులు), ఏనాః=ఈ వాగాదులను, పాప్మనా=పాపముతో, అవిధ్యన్=కొట్టిరి.

తా॥ అసురులు శ్రోత్రమును శాస్త్రప్రతిషిద్ధమైన దుర్విషయముతోఁ గూర్చఁగా దేవతలప్పుడు మనోధిష్ఠానదేవతనుగూర్చి పోయి నీవు మాకొఱకు నీ యజ్ఞమునందు నౌద్గాత్రకర్మను చేయుమాయని యడుగగా నదేవిధముగాఁ జేసెదనని పలికి మనస్సు మనోనిమిత్తకమైన సుఖానుభవము నుద్దేశించి దేవతలకొఱకును ఆమనోధిష్ఠాన దేవతాత్మకమగు తనకొఱకును గానముచేసెను. ఇట్లుచేయగా ఆ అసురులు ఈ ఔద్గాత్రకర్మచేత దేవతలు మనలనతిక్రమించగలరని మనోధిష్ఠాన దేవతనుగూర్చి పోయి శాస్త్రనిషిద్ధమైన అసురసంబంధమగు

పాపముతో నామనస్సును అపరిశుద్ధము చేసిరి. శాస్త్రనిషిద్ధమును అనను రూపమును ఆసురసంబంధమునైన మనోవ్యాపార మేదియో అదియే ఆ పాపము. ఇదేప్రకారము సర్వేంద్రియములను దేవతలు ప్రార్థించగా నాయాయింద్రియముల నన్నిటిని రాక్షసులు ఔద్గాత్ర కర్మకనర్హమైన పాపముతోఁగూర్చిరి.

ఉ॥ అథ హేమమాసన్యం ప్రాణమూచు స్త్వం న ఉద్గాయేతి తథేతి తేభ్య ఏష ప్రాణ ఉదగాయత్తే విదురనేన వై న ఉద్గాత్రా త్యే ష్య న్తీతి తమభిద్రుత్య పాప్మనావివ్యత్సన్ స యథాశ్మాన మృత్వా లోష్టో విధ్వగ్ సేతైవగ్ హైవ విధ్వగ్సమానావిష్వఞ్చో వినే శు స్తతోదేవా అభవన్ పరాసురాఃభవత్యాత్మనా పరాస్య ద్విషన్ పాప్మా భ్రాతృవ్యో భవతి య ఏవం వేద. ॥7॥

ప॥ అథ – హ – ఇమం – ఆసన్యం – ప్రాణం – ఊచుః – త్వం – నః – ఉద్గాయ – ఇతి – తథా – ఇతి – తేభ్యః – ఏషః – ప్రాణః – ఉదగాయత్ – తే – అవిదుః – అనేన – వై – నః – ఉద్గాత్రా – అత్యేష్యన్తి – ఇతి – తం – అభిద్రుత్య – పాప్మనా – అవివ్యత్సన్ – సః – యథా – అశ్మానం – ఋత్వా – లోష్టః – విధ్వంసేత – ఏవం – హ – ఏవ – విధ్వంసమానాః – విష్వఞ్చః – వినేశుః – తతః – దేవాః – అభవన్ – పరా – అసురాః – భవతి – ఆత్మనా – పరా – అస్య – ద్విషన్ – పాప్మా – భ్రాతృవ్యః – భవతి – యః – ఏవం – వేద.

ప్ర॥ అథహ=అనంతరము, (తే=ఆ దేవతలు), ఆస్య=ముఖమందైన, (అనఁగాముఖమధ్యమునందలి బిలమందున్న), ఇమం=ఈ, ప్రాణం=ప్రాణమునుగూర్చి, త్వం=నీవు, నః=మాకొఱకు, ఉద్గాయేతి=గానము చేయుమా యని, (ఔద్గాత్రకర్మను చేయుమాయని), ఊచుః=పలికిరి. ఏషః ప్రాణః=ఈప్రాణము, తేభ్యః=దేవతలకొఱకు, తథేతి=అట్లప్రకారము చేసెదననిపలికి, ఉదగాయత్=గానము చేసెను. తే=ఆ అసురులు, అనేనఉద్గాత్రావై=ఈఔద్గాత్రకర్మచేతనే, (ఏతే

=ఈ దేవతలు), నః=మనలను, అత్యేష్యన్తీతి=అతిక్రమించగలరని, అవిదుః=తెలిసికొనిరి. (తే=ఆ అసురులు, ఇట్లు తెలిసికొని), తం=ఆ ప్రాణమును గూర్చి, అభిద్రుత్య = పరుగెత్తికొనిపోయి, పాప్మనా=పాపముతో. అవిత్సన్=కొట్ట నిచ్ఛయించినవారై, (ఆఅసురులు తమ దోషముతో అసంగుఁడగు ముఖ్యప్రాణమును పొందలేక పూర్వపు నాడుక ప్రకారము వాగాదులయందు వ్యాపించి, వినేశుః=నాశనమును పొందిరి). సయథా=అదెట్లనఁగా, (లోకే=లోకమునందు), లోష్టః=మట్టిగడ్డ, అశ్మానం=పాషాణమును, ఋత్వా = పొంది, యథా=ఏ ప్రకారము, విధ్వంసేత=శిథిలమగునో, (నశించునో), ఏవంహైవ=ఈ ప్రకారముగానే, (తే=ఆ అసురులు), విధ్వంసమానాః=మిక్కిలి కొట్టబడినవారై, విష్వఞ్చః = నానావిధములైన గతులుగలవారై, వినేశుః=నశించిరి. తతః=అందువలన, (వాగాదయః=వాగాదీంద్రియములు), దేవాః=దేవతలుగా, అభవన్=అయినవి. (అగ్న్యాది స్వరూపములైన వాగాదీంద్రియములు స్వాభావికమైన పాపముచేత తిరస్కరింపబడిన విజ్ఞానముగలవై పిండమాత్రములైన వాగాదిగోళములయందభిమానముగలవై తిరిగి ఆపాపముపోవుటవలన దేహమందలి యభిమానమును విడిచి అగ్న్యాదిస్వరూపాభిమానముగలవాయెను). అసురాః=రాక్షసులు, పరాభవన్ = పరాభవమునుపొందిరి. (అపజయమును పొందిరి). (అయం=ఈ యజమానుఁడు, తేనైవవిధినా=అవిధిచేత నే), ఆత్మనా=ప్రజాపతి స్వరూపముతో, భవతి=అగుచున్నాఁడు. అస్య = ఈ ప్రజాపతిరూపమునుపొందిన యజమానునికి, ద్విషన్ = శత్రువైన, భ్రాతృవ్యః=సహోదరసంబంధమగు. పాప్మా=పాపము, పరాభవతి=తిరస్కారమును పొందుచున్నది. యః=ఎవఁడు, ఏవం=ఈ ప్రకారము, వేద = తెలిసికొనుచున్నాఁడో, (తేన = వానిచేత, ప్రాణం=ప్రజాపతి స్వరూపమైన ప్రాణమును, ఆత్మత్వేన=ఆత్మస్వరూపముతో, ప్రతిపద్యతే=పొందబడుచున్నది).

తా॥ అసురులు మనస్సును శాస్త్రప్రతిషిద్ధమైన పాపముతోఁ గూర్చి అపరిశుద్ధముచేసిరి. ఇదేప్రకారము ఇంద్రియములనన్నిటిని అపరిశుద్ధముచేయగా దేవతలప్పుడు వదనగుహాయందుండెడి ప్రాణ స్వరూపమునుగూర్చిపోయి, ఓ ప్రాణమా! నీవు మాకొఱకు నీ యజ్ఞమునందు ఔద్గాత్రకర్మను చేయుమాయని ప్రార్థించిన నా ప్రాణమట్లు చేసెదనని చెప్పి గానముచేయగా నాయసురులు ఈఔద్గాత్రకర్మచే దేవతలు మనలను అతిక్రమించగలరని తలంచి ఆప్రాణమును తమ సంబంధమైన పాపముతోఁగొట్ట నిచ్ఛయించిపోయి అసంగమైన ప్రాణ స్వరూపమును పొందలేక పూర్వపు వాడుకప్రకారము వాగాదుల యందు నానావిధములైన గతులుగలవారలై పాషాణమును కొట్ట వలయునని వేయబడిన మట్టిపెళ్ల ఆపాషాణమును కొట్టలేక దాని దెబ్బ కెట్లు భిన్నమై నశించునో ఆవిధముగానే శిథిలమైపోయిరి. అట్లు శాస్త్ర నిషిద్ధములగు పాపములతోఁగూడ ఆ అసురులు నశించుటతోడనే వాగాదీంద్రియములు పిండమాత్రమైన దేహమునందలి ఇంద్రియ గోళములయందు స్వాభిమానమును వదిలి అగ్న్యాదిస్వరూపముగా నుండెడి దేవత్వమును పొందినవి. ఈ ప్రకారము దేవతలు జయించిరి. అసురులు అపజయమును పొందిరి. ఇట్లు యాగముచేయువాడు దేహాభిమానమువిడిచి ప్రజాపతిత్వమును పొందుచున్నాడు. ఇట్లు తెలిసి కొనువాడును ఆ యాజకుడువలెనే ఫలమును పొందుచున్నాడు.

ఉ॥ తే హోచుః క్వ ను సోఽభూద్యో న ఇత్థమసక్తేత్యయమాస్యేఽ
న్తరితి సోఽయాస్య ఆఙ్గిరసోఽఙ్గానాఀ హి రసః ॥8॥

ప॥ తే - హ - ఊచుః - క్వను - సః - అభూత్ - యః - నః - ఇత్థం - అసక్త - ఇతి - అయం - ఆస్యే - అన్తః - ఇతి - సః - అయాస్యః - ఆఙ్గిరసః - అఙ్గానాం - హి - రసః.

ప్ర॥ యః=ఏప్రాణము, నః=మనలను, ఇత్థం=ఈప్రకారము, అసక్త=దేవభావమును పొందించెనో, సః=ఆప్రాణము, క్వను=

ఎక్కడ, అభూత్ = ఉండెను. ఇతి = ఈప్రకారము, తేహ = ఆ దేవతలు, ఊచుః = పలికిరి. (దేవైః = దేవతలచేతను), అయం = ఈ ప్రాణము, ఆస్యే = ముఖమునందు. అన్తః = మధ్యను, (వర్తతే = ప్రత్యక్షముగా నున్నాడు). ఇతి = ఈ ప్రకారము, (ఉపలబ్ధః = ఏకారణమువలన పొందబడెనో, అందువలన), సః = ఆ ప్రాణము, అయాస్యః = అయాస్యమనియును, అఙ్గానాం = కార్యకారణములగు సర్వావయవములలో, ససోహి = సారమైన ఆత్మ గనుక ఆఙ్గిరసః = ఆఙ్గిరసమనియును, (ప్రసిద్ధః = ప్రసిద్ధమైనది).

తా॥ ఈ పూర్వము చెప్పినప్రకారము ఇంద్రియములు ప్రాణరూపమై ప్రజాపతియొక్క ఆశ్రయమువలన, తమకు శరీరగోళములయందలి స్వాభిమానమునువిడిచి నిజమగు అగ్న్యాదిస్వరూపమైన తమ దేవత్వమును పొంది ఇట్లు మనలను దేవత్వమునుపొందించిన ప్రాణస్వరూపము ఎక్కడయున్నదని విచారించి ప్రత్యక్షముగా ముఖమధ్యమునందున్న ప్రాణమును పొందిరి. ఇందువలననే ఆప్రాణము అయాస్యమనియును, కార్యకారణములగు సర్వావయవములలో శ్రేష్ఠమగునాత్మయగుటవలన ఆఙ్గిరసమనియును, ప్రసిద్ధికెక్కియున్నది.

ఉ॥ సా వా ఏషా దేవతా దూర్నామ దూరగ్ హ్యస్యా మృత్యుర్దూ
రగ్ హ వా అస్మాన్మృత్యుర్భవతి య ఏవం వేద. ॥9॥

ప॥ సా - వై - ఏషా - దేవతా - దూః - నామ - దూరం -హి - అస్యాః మృత్యుః - దూరం - హ వై - అస్మాత్ - మృత్యుః - భవతి - యః - ఏవం - వేద.

ప్ర॥ హి = ఏ కారణమువలన, మృత్యుః = మృత్యువు, అస్యాః = ముఖ్యప్రాణరూపమైన ఈ దేవతకు, దూరం = దవ్వైనదో, (తస్మాత్ = ఆ కారణమువలన), సా వా = అప్రసిద్ధమగు, ఏషా దేవతా = ఈముఖ్యప్రాణరూపమైన దేవత, దూర్నామ = దూరని ప్రసిద్ధమైనది. యః = ఎవడు, ఏవం = ఈప్రకారము, వేద = తెలిసికొనుచున్నాడో,

అస్మాత్ = ఈ తెలిసికొనినవానినుండి, మృత్యుః = మృత్యువు, దూరం హవై = దూరమైనదై, భవతి = అగుచున్నది.

తా॥ రాక్షసులు పరాజయమును పొందిన ఆ ప్రాణదేవతకు మృత్యువు మిక్కిలి దూరమైయున్నది. గనుక ప్రాణదేవతదూరని ప్రసిద్ధికెక్కియున్నది. ఇట్లు పరిశుద్ధమగు ముఖ్యప్రాణమును తెలిసికొని యుపాసించెడి వానివలననున్ను మృత్యువు దూరమగుచున్నది.

ఉ॥ సా వా ఏషా దేవతైతాసాం దేవతానాం పాప్మానం మృత్యు
మపహత్య యత్రాసాం దిశామన్తస్తద్గమయాఞ్చకార తదాసాం
పాప్మనో విన్యదధాత్తస్మాన్న జనమియాన్నాన్తమియాన్నేత్పా
ప్మానం మృత్యుమన్వవాయానీతి ।10॥

ప॥ సా - వై - ఏషా - దేవతా - ఏతాసాం - దేవతానాం - పాప్మానం - మృత్యుం - అపహత్య - యత్ర - ఆసాం - దిశాం - అన్తః - తత్ - గమయాఞ్చకార - తత్ - ఆసాం - పాప్మనః - విన్యదధాత్ - తస్మాత్ - న - జనం - ఇయాత్ - న - అన్తం - ఇయాత్ - నేత్ - పాప్మానం - మృత్యుం - అన్వవాయాని - ఇతి.

ప్ర॥ సావాఏషాదేవతా = ఆ ప్రసిద్ధమగుముఖ్యప్రాణరూపమైన ఈ దేవత, ఏతాసాం = ఈ, దేవతానాం = దేవతలయొక్క, పాప్మానం = పాపస్వరూపమైన, మృత్యుం = మరణమును, అపహత్య = పోఁగొట్టి, యత్ర = ఎక్కడ, ఆసాం = ఈ, దిశాం = తూర్పుమొదలైన దిక్కులకు, అన్తః = అంతమో, (నాశమో), తత్ = అక్కడికి, గమయాఞ్చకార = పొందించెను. తత్ = అక్కడికి, (గమయిత్వా = పొందించి), ఆసాం = ఈ దేవతలయొక్క, పాప్మనః = పాపములను, (ప్రాణాత్మాభిమానములేనివారలయందు), విన్యదధాత్ = తిరస్కారభావముతోనుంచెను. తస్మాత్ = అందువలన, జనం = ప్రాణోపాసకుడగుజనుని, (మృత్యుః = మృత్యువు), నేయాత్ = పొందదు, అంతం = ఆప్రాణోపాసకుడుండెడి దేశమునున్ను, నేయాత్ =

పొందదు. పాప్మానం = పాపరూపమగు, మృత్యుం = మృత్యువును, అన్వవాయాసీతి = అనుసరించి పొందుదునని, (భీతః = భయము, అప్రాణోపాసకుని, ఆప్రాణోపాసకుండుండెడి దేశమును), నేత్ = పొందదు.

తా॥ ఈ ప్రాణదేవత వాగాదీంద్రియరూపమైన దేవతలయొక్క మృత్యురూపమగు ఇంద్రియవిషయసంసర్గమువలనఁ బుట్టినపాపమును పోఁగొట్టి ఆదేవతలను ప్రాగాదిదిగ్భేదములు లేని ప్రదేశమును పొందించి ఆపాపమును ప్రాణమే ఆత్మస్వరూపమను అభిమానములేని ఇంద్రియసంసర్గముగలవారియందుంచి నాశనమును పొందించెను. గనుక మృత్యుస్వరూపమగు పాపము ప్రాణోపాసకుని (ప్రాణాత్మాభిమానముగలవానిని), పొందదు. అట్టి వాఁడుండెడి దేశమును పొందదు ఈపాపమును పొందుదుననుభయమును ఆప్రాణోపాసకుని, అతడుండెడి ప్రదేశమును, పొందదు.

ఉ॥ సా వా ఏషా దేవతైతాసాం దేవతానాం పాప్మానం మృత్యుమపహత్యాథైనా మృత్యుమత్యవహత్. ॥11॥

ప॥ సా - వై - ఏషా - దేవతా - ఏతాసాం - దేవతానాం - పాప్మానం - మృత్యుం - అపహత్య - అథ - ఏనాః - మృత్యుం_ అత్యవహత్.

ప్ర॥ సావావేషా దేవతా = అప్రసిద్ధమగు ఈ ప్రాణదేవత, ఏతాసాం = ఈ, దేవతానాం = వాగాది దేవతలయొక్క, పాప్మానం = పాపరూపమైన, మృత్యుం = మృత్యువును, అపహత్య = పోఁగొట్టి, అథ = అనంతరము, ఏనాః = ఈ వాగాది దేవతలను, మృత్యుం = మృత్యువును, అత్యవహత్ = అతిక్రమించి అగ్న్యాది స్వరూపమును పొందించెను.

తా॥ ఆ ప్రాణదేవత వాగాదీంద్రియములకు విషయసంసర్గము వలనఁ బుట్టిన పాపరూపమైన మృత్యువును పోఁగొట్టి ఈ వాగాదీంద్రి

యములను అపరిచ్ఛిన్నమగు స్వకీయమైన అగ్న్యాద్యాత్మతను పొందించెను.

ఉ॥ స వై వాచమేవ ప్రథమామత్యవహత్సా యదా మృత్యుమత్య
ముచ్యత సోఽగ్నిర భవత్సోఽయమగ్నిః పరేణ మృత్యుమతి
క్రాన్తో దీప్యతే. ॥12॥

ప॥ సః - వై - వాచం - ఏవ - ప్రథమాం అత్యవహత్ - సా - యదా - మృత్యుం - అత్యముచ్యత - సా - అగ్నిః - అభవత్ - సః - అయం - అగ్నిః - పరేణమృత్యుం - అతిక్రాన్తః - దీప్యతే.

ప్ర॥ సవై = ఆప్రాణము, ప్రథమాం = ప్రాధాన్యమైన, వాచమేవ = వాక్కునే, అత్యవహత్ = మృత్యువునతిక్రమించివహించెను. సా = ఆవాక్కు, యదా = ఎప్పుడు, మృత్యుం = మృత్యువును, అత్యముచ్యత = అతిక్రమించి విడిపింపఁబడెనో, (తదా = అప్పుడు), సా = ఆ వాక్కు, అగ్నిః = అగ్ని, అభవత్ = ఆయెను. మృత్యుం = మృత్యువును, అతిక్రాన్తః = అతిక్రమించిన, సః = ఆప్రసిద్ధమగు, అయమగ్నిః = ఈ అగ్ని, పరేణమృత్యుం = మృత్యువులేకనే, దీప్యతే = ప్రకాశించుచున్నది.

తా॥ ఆ ప్రాణము ఉద్గీథకర్మయందు మిక్కిలి ప్రధానమైన వాక్కును మృత్యువు నతిక్రమింపఁజేసి వహించెను. ఇట్లు ప్రాణముచేత మృత్యువునతిక్రమింపఁ జేయఁబడిన ఆ వాక్కు పూర్వము అగ్నియైనదైనను మృత్యువు నతిక్రమించుటయందెప్పుడు అగ్నిఆయెనో, అప్పుడాయగ్ని మృత్యువులేకుండానే ప్రకాశించెను. అనగా వాక్కు ప్రాణోపాసనవలన విషయసంసర్గరూపమైన మృత్యువు నతిక్రమించి తన స్వరూపమైన అగ్నిగానే ప్రకాశించెనని భావము.

ఉ॥ అథ ప్రాణమత్యవహత్స యదా మృత్యుమత్యముచ్యత స వాయు
రభవత్సోఽయం వాయుః పరేణ మృత్యుమతిక్రాన్తః పవతే.॥13॥

ప॥ అథ – ప్రాణం – అత్యవహత్ – సః – యదా – మృత్యుం – అత్యముచ్యత – సః – వాయుః – అభవత్ – సః – అయం – వాయుః – పరేణమృత్యుం – అతిక్రాన్తః – పవతే.

ప్ర॥ (సః=ఆప్రాణము), అథ=అనంతరము, ప్రాణం=ప్రాణవాయువును, అత్యవహత్=మృత్యువునతిక్రమించి వహించెను. సః=ఆప్రాణవాయువు, యదా=ఎప్పుడు, మృత్యుం=మృత్యువును, అత్యముచ్యత=అతిక్రమించి విడిపింపఁబడెనో, (తదా=అప్పుడు), సః=ఆ ప్రాణవాయువు, వాయుః=వాయువు, అభవత్=ఆయెను. సః=ఆప్రసిద్ధమగు, అయం=ఈ. వాయుః=వాయువు, పరేణమృత్యుం=మృత్యువులేకనే, అతిక్రాన్తః=అతిక్రమించినదై, పవతే=వీచుచున్నది.

తా॥ ప్రాణవాయువు ఆ ప్రాణదేవతోపాసనవలన మృత్యుస్వరూపమునువిడిచి వాయుస్వరూపమైమృత్యువులేకనే వీచుచున్నది.

ఉ॥ అథ చక్షురత్యవహత్తద్యదా మృత్యుమత్యముచ్యత స ఆదిత్యోఽభవత్సోఽసావాదిత్యః పరేణ మృత్యుమతిక్రాన్తస్తపతి.14

ప॥ అథ – చక్షుః – అత్యవహత్ – తత్ – యదా – మృత్యుం – అత్యముచ్యత – సః – ఆదిత్యః – అభవత్ – సః – అసౌ – ఆదిత్యః – [పరేణమృత్యు]ం – అతిక్రాన్తః – తపతి.

ప్ర॥ అథ – అనంతరము, (సః=ఆప్రాణము). చక్షుః=నేత్రమును, అత్యవహత్=మృ[త్యు]వునతిక్రమించి వహించెను. తత్=ఆ నేత్రము, యదా=ఎప్పుడు, మృత్యుం=మృత్యువును, అత్యముచ్యత=అతిక్రమించి విడిపింపబడెనో, (తదా=అప్పుడు), సః=ఆ నేత్రము, ఆదిత్యః=సూర్యుఁడు, అభవత్=ఆయెను. సః=ఆప్రసిద్ధమైన, అసౌ=ఈ, ఆదిత్యః=సూర్యుఁడు, అతిక్రాన్తః=మృత్యువు నతిక్రమించినవాఁడై, పరేణమృత్యుం=మృత్యువునకు పరముగా, తపతి = ప్రకాశించుచున్నాడు.

తా॥ నేత్రము ఆ ప్రాణదేవతోపాసనవలన మృత్యుస్వరూపమును విడిచి సూర్యస్వరూపమై మృత్యువులేకుండానే ప్రకాశించుచున్నది.

ఉ॥ అథ శ్రోత్రమత్యవహత్తద్యదా మృత్యుమత్యముచ్యత తా దిశోఽభవగ్ స్తా ఇమా దిశః పరేణ మృత్యుమతిక్రాన్తాః. ॥15॥

ప॥ అథ - శ్రోత్రం - అత్యవహత్ - తత్ - యదా - మృత్యుం - అత్యముచ్యత - తాః - దిశః - అభవన్ - తాః - ఇమాః - దిశః - పరేణమృత్యుం - అతిక్రాన్తాః.

ప్ర॥ అథ=అనంతరము, (సః=ఆప్రాణము), శ్రోత్రం=కర్ణమును, అత్యవహత్=మృత్యువునతిక్రమించి వహించెను. తత్=ఆశ్రోత్రము, యదా=ఎప్పుడు, మృత్యుం=మృత్యువును, అత్యముచ్యత=అతిక్రమించి విడిపించెనో, (తదా=అప్పుడు, తత్=ఆ శ్రోత్రము), తాఃదిశః=ఆ దిక్కులు, అభవన్=అయినవి. తాఃఇమాఃదిశః=ఆ ఈ దిక్కులు, మృత్యుం=మృత్యువును, అతిక్రాన్తాః=అతిక్రమించినవై, పరేణమృత్యుం=మృత్యువునకు పరముగా, (అభవన్=అయినవి).

తా॥ శ్రోత్రము ఆ ప్రాణదేవతోపాసనవలన మృత్యుస్వరూపమును విడిచి దిగ్దేవతా స్వరూపమై మృత్యువులేకనే యుండెను.

ఉ॥ అథ మనోఽత్యవహత్తద్యదా మృత్యుమత్యముచ్యత స చన్ద్రమా అభవత్సోఽసౌ చన్ద్రః పరేణ మృత్యుమతిక్రాన్తో భాత్యేవగ్ హ వా ఏనమేషా దేవతా మృత్యుమతివహతి య ఏవం వేద. ॥16॥

ప॥ అథ - మనః - అత్యవహత్ - తత్ - యదా - మృత్యుం - అత్యముచ్యత - సః - చన్ద్రమాః - అభవత్ - సః - అసౌ - చన్ద్రః - పరేణమృత్యుం - అతిక్రాన్తః - భాతి - ఏవం - హవై ఏనం - ఏషా - దేవతా - మృత్యుం - అతివహతి - యః ఏవం - - వేద.

ప్ర॥ అథ=అనంతరము, (స:=ఆప్రాణము), మన:=మనస్సును, అత్యవహాత్=మృత్యువు నతిక్రమించి వహించెను. తత్=ఆమనస్సు, యదా=ఎప్పుడు, మృత్యుం=మృత్యువును, అత్యముచ్యత=అతిక్రమించి విడిపించెనో, (తదా=అప్పుడు), స:=ఆమనస్సు, చన్ద్రమా:=చంద్రుడు, అభవత్=ఆయెను. సోసౌచన్ద్ర:=ఆ ఈ చంద్రుడు, మృత్యుం=మృత్యువును, అతిక్రాన్త:=అతిక్రమించినవాడై పరేణమృత్యుం = మృత్యువునకు పరముగా, భాతి = ప్రకాశించుచున్నాడు. ఏవం=ఈప్రకారము, య:=ఎవడు, వేద=తెలిసికొనుచున్నాడో, ఏనం=ఈ యజమానుని, ఏషాదేవతా=ఈప్రాణదేవతా, ఏవంహ వై=ఈప్రకారము ప్రసిద్ధముగా, మృత్యుం=మృత్యువును, అతివహతి=అతిక్రమించి వహించుచున్నది.

తా॥ మనస్సు ఆ ప్రాణదేవతోపాసన వలన మృత్యుస్వరూపమును విడిచి చంద్రస్వరూపమై మృత్యువులేకనే, ప్రకాశించుచున్నది. ఇట్లు తెలిసికొని యుపాసించెడి యజమానుని ఈ ప్రాణదేవత మృత్యువు నతిక్రమించి పొందుచున్నది.

ఉ॥ అథాత్మనేఽన్నాద్య మాగాయద్యద్ధి కిఞ్చాన్నమద్యతేఽనేనైవ తదద్యతఇహ ప్రతితిష్ఠతి. ॥17॥

ప॥ అథ - ఆత్మనే - అన్నాద్యం - ఆగాయత్ - యత్ - హి - కించ - అన్నం - అద్యతే - అనేన - ఏవ - తత్ - అద్యతే - ఇహ - ప్రతితిష్ఠతి.

ప్ర॥ అథ=అనంతరము, (ప్రాణ:=ప్రాణము), ఆత్మనే=తనకొఱకు, అన్నాద్యం=భక్షణార్హమైన శరీరమునుగూర్చి, ఆగాయత్=గానము చేసెను. యద్ధి=ఏకారణమువలన, (ప్రాణైభి:=ప్రాణుల చేత), యత్కించాన్నం=సామాన్యమగు ఏ అన్నము, అద్యతే=భక్షింపబడుచున్నదో, తత్=ఆ అన్నము, అనేనైవ=ప్రాణము చేతనే, అద్యతే=భక్షింపఁబడుచున్నది (ప్రాణ:=ప్రాణము), ఇహ

=శరీరాకారముగా పరిణమించిన ఈ అన్నాద్యమునందు, ప్రతిష్ఠతి =ఉంచున్నది.

తా॥ ఉపాసన చేయదగిన ప్రాణమునకు దేహేంద్రియాది సముదాయమును ధరించుటయనెడి పేరొక గుణమును చెప్పుచున్నాడు. ప్రాణులచేత భక్షింపబడెడి ఆ అన్నమంతయు ప్రాణముచేతనే, తిన బడుచున్నది. ఇట్లు ప్రాణము తినుచు శరీరాకృతిగా పరిణమించి యున్న అన్నమునందుండి భక్షణార్హమైన శరీరమునుగూర్చి గానము చేసెను.

ఉ॥ తే దేవా అబ్రువన్నేతావద్వా ఇదగ్ సర్వం యదన్నం తదాత్మన ఆగాసీరను నోఽస్మిన్నన్న ఆభజస్వేతి తే వై మాఽభిసంవిశతేతి తథేతి తగ్ సమన్తం పరిణ్య విశన్త తస్మాద్యదనేనాన్నమత్తి తేనైతా స్తృప్యన్త్యేవగ్ హ వా ఏనగ్ స్వా అభిసంవిశన్తి భర్తా స్వానాగ్ శ్రేష్ఠః పుర ఏతా భవత్యన్నాదోఽధిపతిర్య ఏవం వేద య ఉ హైవం విదగ్ స్వేషు ప్రతిప్రతిర్బుభూషతి నహైవాలం భార్యేభ్యో భవత్యథ య ఏవైత మను భవతి యో వైత మను భార్యాన్ బుభూర్షతి సహైవాలం భార్యేభ్యో భవతి. ॥18॥

ప॥ తే - దేవాః - అబ్రువన్ - ఏతావత్ - వై - ఇదం - సర్వం - యత్ - అన్నం - తత్ - ఆత్మనే - ఆగాసీః - అను - నః - అస్మిన్ - అన్నే - ఆభజస్వ - ఇతి తే - వై - మా - అభి సంవిశత - ఇతి - తథా - ఇతి - తం - సమన్తం - పరి - న్యవిశన్త - తస్మాత్ - యత్ - అనేన - అన్నం - అత్తి - తేన - ఏతాః - తృప్యన్తి - ఏవం - హవై - ఏనం - స్వాః - అభిసంవిశన్తి - భర్తా - స్వానాం - శ్రేష్ఠః - పురః - ఏతా - భవతి - అన్నాదః - అధి పతిః - యః - ఏవం - వేద - యః - ఉ - హ - ఏవం - విదం - స్వేషు - ప్రతిప్రతిః - బుభూషతి - న - హ - ఏవ - అలం - భార్యే భ్యః - భవతి - అథ - యః - ఏవ - ఏతం - అను - భవతి - యః

_ నా - ఏతం - అను - భార్యాః - బుభూర్షతి - సః - హ - ఏవ - అలం - భార్యేభ్యః - భవతి.

ప్ర॥ తే దేవాః = ఆవాగాది దేవతలు, (ముఖ్యప్రాణం = ముఖ్య ప్రాణమునుగూర్చి), అబ్రువన్ = పలికిరి. ఇదం = ఈ, సర్వం = సమస్తము, ఏతావద్వై = ఇంతమాత్రమె. (ఆ ఈ చెప్పబడినదంతయు ఇంతమాత్రమేగాని దీనికధికము కాదు). యత్ = ఏది, అన్నం = అన్నమో, తత్ = ఆ అన్నమునుగూర్చి. ఆత్మనే = నీకొఱకే, ఆగాసీః = గానము చేసికొంటివి. (దానిని మిక్కిలి గానము చేత స్వాధీనము చేసికొంటివిగనుక). అను = అనంతరము, నః = మమ్మును, అస్మిన్ = ఈ, అన్నే = అన్నమునందు, ఆభజస్వేతి = పొందింపఁజేయుమాఅని, (అబ్రువన్ = పలికిరి.) (యూయం = మీరు,) తేవై = అట్టివారలైతి రేని, (మీరు అన్నమును కోరినవారలైతిరేని), మా = నన్ను, అభిసంవిశత = అంతటను అభిముఖముగా ప్రవేశించుఁడీ! ఇతి = ఈప్రకారము ప్రాణముపలుకగా, తథేతి = సరేఅని, తం = ఆప్రాణమునుగూర్చి, పరిసమన్తం = అంతటను, న్యవిశన్త = నిశ్చయముగా ప్రవేశించిరి. (వాగాదీంద్రియములు ప్రాణము చెప్పినప్రకారము సరేఅనిపలికి ఆ ప్రాణమందంతటను నిశ్చయముగా ప్రవేశించినవి.) తస్మాత్ = అందువలన, (లోకః = లోకము,) అనేన = ప్రాణముచేత, యత్ = ఏ, అన్నం = అన్నమును, అత్తి = భక్షించుచున్నదో, తేన = ఆఅన్నముచేత, ఏతాః = ఈవాగాది దేవతలు, తృప్యన్తి = తృప్తినిపొందుచున్నారు. ఏవంహవై = ఈప్రకారముగానే, స్వాః = జ్ఞాతులు, ఏనం = ఈప్రాణోపాసకుని, అభిసంవిశన్తి = ప్రవేశించుచున్నారు. (పొందుచున్నారు.) (అనగా జ్ఞాతులకాశ్రయించఁదగినవాఁడగుచున్నాఁడు), యః = ఎవడు, ఏవం = ఈపూర్వము చెప్పినప్రకారము, (ప్రాణం = ప్రాణమును), వేద = తెలిసికొనుచున్నాఁడో, (సః = వాడు), స్వానాం = జ్ఞాతులకు, భర్తా = భరించువాఁడును, (తథా

=ఆప్రకారము), శ్రేష్ఠః = శ్రేష్ఠుఁడును, పురః = ముందుగా, ఏతా = పోవువాఁడును, అన్నాదః = రోగములేనివాఁడును, అధిపతిః = అధిష్టించి, పరిపాలించువాఁడును, భవతి = అగుచున్నాఁడు. య ఉ వా = ఎవఁడైతే, స్వేషు = జ్ఞాతుల మధ్యమునందు, ఏవంవిదం = ఈపూర్వోక్తప్రకారము ప్రాణమును తెలిసికొనినవానిగూర్చి, ప్రతి ప్రతిర్బుభూషతి = ప్రతికూలుఁడగుటకు కోరుచున్నాఁడో, (సః = వాడు), భార్యేభ్యః =భరించఁదగినవారలకొఱకు, నహైవాలం=అస మర్థుఁడుగానే, భవతి=అగుచున్నాఁడు. అథ=తిరిగి, య ఏవ=ఎవడు, (జ్ఞాతులలోపల), ఏతం=ఈ పాణమును తెలిసికొనినవానిగూర్చి, అను =అనుసరించిపొందినవాఁడు, భవతి=అగుచున్నాఁడో, యోవా= ఎవఁడైనను, ఏతం=ఈప్రకారము ప్రాణమును తెలిసినవానినిగూర్చి, అను=అనుసరించియున్నవాఁడై, (ఆత్మీయాన్=తనసంబంధులగు), భార్యాన్=భరించఁదగినవారలను, బుభూర్షతి=భరించుటకు ఇచ్ఛ యించుచున్నాఁడో, సః=వాఁడు, భార్యేభ్యః=భరించఁదగినవారల కొఱకు, అలమేవ=సమర్థుఁడుగానే, భవతి=అగుచున్నాఁడు.

తా॥ పూర్వము చెప్పినప్రకారము అన్నమునుగూర్చి గానము చేయుచున్న ప్రాణమునుగురించి వాగింద్రియము మొదలైన దేవ తలు ఓ ప్రాణమా! నీవు అన్నమును మిక్కిలి గానముచేత స్వాధీన పఱచుకొంటివి. గనుక తరువాత మమ్మునున్ను ఈ అన్నమునందు పొందింపఁజేయుమాయని పలికిరి. మరల ప్రాణము వాగింద్రియము మొదలైన ఓ దేవతలారా! మీరును అన్నమును కోరితిరేని నన్ను అంతటను అభిముఖముగా ప్రవేశించుఁడని చెప్పగా అట్లు ఒప్పుకొని వాగాది దేవతలు ఆప్రాణమును అంతటను నిశ్చయముగా ప్రవేశించిరి. ఇట్లు ప్రవేశించిన ఆ వాగాదీంద్రియ దేవతలకు ప్రాణముచేత భక్షింప బడిన అన్నము ప్రాణమునకు స్థితిని కలుగఁజేయుచు ప్రాణాజ్ఞచేత తృప్తిని చేయుచున్నది. గనుక ఈ వాగాది దేవతలు ఆ ప్రాణముచే

భక్షింపబడిన అన్నముచేత తృప్తిని పొందుచున్నారు. ఈప్రకారము ప్రాణస్వరూపమును తెలిసికొనినవానిని తన సంబంధులైన జ్ఞాతులు వాగాదిదేవతలు ప్రాణమునువలెనే పొందుచున్నారు. వాఁడు ఇట్లు పొందిన జ్ఞాతులకు వాగాదిదేవతలకు ప్రాణమువలెనే తన సంబంధమగు అన్నముచేత భరించువాఁడును ఆ జ్ఞాతులలో శ్రేష్ఠుఁడును, ముందు నడుచువాఁడును, రోగము లేనివాఁడును, పరిపాలకుఁడును, అగుచున్నాఁడు. ఇట్లు ప్రాణమును తెలిసికొనినవానికి జ్ఞాతులలో అనుకూలుఁడు కానివాఁడు తన సంబంధమైన జ్ఞాతులను భరించుటకు నసమర్థుఁడగుచున్నాఁడు. ఇట్లు ప్రాణమును తెలిసికొనినవానికి జ్ఞాతులలో అనుకూలుఁడైనవాఁడు తాను భరింపఁదగినవారలను భరించుటకు సమర్థుఁడగుచున్నాఁడు.

ఉ॥ సోఽ యాస్యఆఙ్గిరసోఙ్గానాగ్ హి రసః । ప్రాణో వా అఙ్గానాగ్
రసః ప్రాణో హి వా అఙ్గానాగ్ రసస్తస్మాద్యస్మాత్కస్మాచ్చాఙ్గాత్ప్రాణ
ఉత్క్రామతి తదేవ తచ్ఛుష్యత్యేష హి వా అఙ్గానాగ్ రసః ॥19॥

ప॥ సః - అయాస్యః - ఆఙ్గిరసః - అఙ్గానాం - హి - రసః - ప్రాణః - వా - అఙ్గానాం - రసః - ప్రాణః - హి - వా - అఙ్గానాం - రసః - తస్మాత్ - యస్మాత్ - కస్మాత్ - చ - అఙ్గాత్ - ప్రాణః - ఉత్క్రామతి - తత్ - ఏవ - తత్ - శుష్యతి - ఏషః - హి - వా - అఙ్గానాం - రసః.

ప్ర॥ అయాస్యః = ఈదేహమును పొందియుండెడి, సః = ఆప్రాణము, అఙ్గానాం = అవయవములకు, రసోహి = రసరూపమైనదిగనుకనే, ఆఙ్గిరసః = ఆఙ్గిరసము. (అవయవముల సంబంధమైన రసముగా, భవతి = అగుచున్నది.) ప్రాణోవా = ప్రాణము, అఙ్గానాం = అవయవముల యొక్క, రసః = రసస్వరూపమగుట, (కథం = ఎట్లు.) ప్రాణోహివా = ప్రసిద్ధముగా ప్రాణమే. అఙ్గానాం = అవయవములకు, రసః = రసస్వరూపమైనది. ప్రాణః = ప్రాణము, యస్మాత్కస్మాత్ = ఏదోఒకటియగు,

అఙ్గాచ్ఛ=అవయవమునుండి, ఉత్క్రామతి=పోవుచున్నదో, తదేవ =అక్కడనే, తత్=ఆ అంగము, శుష్యతి= ఎండిపోవుచున్నది. తస్మాత్=అందువలన, ఏషహివా=ఈ ప్రసిద్ధమగుప్రాణమే, అఙ్గానాం=అవయవములకు, రసః=రసస్వరూపమైనది.

తా॥ ఇట్లు ప్రాణముయొక్క గుణ విజ్ఞాన ఫలమునంతయు చెప్పి ఆ ప్రాణమును దేహేంద్రియాదుల కాత్మస్వరూపమునుగా ప్రతిపాదించుటకు ప్రాణమున కాంగిరసత్వము చెప్పఁబడుచున్నది. ప్రాణము సమస్త అవయవములకు రసస్వరూపముగానున్నది. ఏ అవయవమువల్లనైనను ప్రాణము పోయెనేని అక్కడనే ఆ అవయవము ఎండిపోవుచున్నది. ఆ కారణమునుండియే ఈ ప్రాణము అవయవములకు రసస్వరూపమైనది. ఇట్లు ప్రాణము అంగములకు రసరూపమగుట వలన ఆంగిరమని చెప్పఁబడుచున్నది.

ఉ॥ ఏష ఉ ఏవ బృహస్పతి ర్వాగ్వై బృహతీ తస్యా ఏష పతి స్తస్మాదు బృహస్పతిః. ॥20॥

ప॥ ఏషః - ఉ - ఏవ - బృహస్పతిః - వాక్ - వై - బృహతీ - తస్యాః - ఏషః - పతిః - తస్మాత్ - ఉ - బృహస్పతిః.

ప్ర॥ ఏషఉఏవ=ఈప్రాణమే, బృహస్పతిః=బృహస్పతిరూపమైన ఋగ్వేదమునకు పతి. వాగ్వై=వాక్కే, బృహతీ = ముప్పదియాఱు అక్షరములుగల బృహతీఛన్దస్సు. తస్యాః=ఆ బృహతీ ఛందోరూపమైన ఋగ్వేదమునకు, ఏషః=ఈప్రాణము, పతిః=ప్రభువు. తస్మాదు=ఆ కారణమునుండియే, (ప్రాణః=ప్రాణము,) బృహస్పతిః =బృహస్పతి, (భవతి=అగుచున్నది.)

తా॥ బృహస్పత్యాది ధర్మముగల ప్రాణోపాసనను చెప్పుచు ఆ ప్రాణమునకే బృహస్పతి స్వరూపమును చెప్పుచున్నాఁడు. అనుష్టుప్ఛందోరూపమైన వాక్కు ముప్పదియాఱు అక్షరములు గల బృహతీ ఛందస్సునందంతర్భూతమైనది. అట్టి బృహతీ ఛందోరూప

మైన ఋగ్వేదమునకు ఈ ప్రాణమధిపతియగుటవలన బృహస్పతిరూప మగుచున్నది.

ఉ॥ ఏష ఉ ఏవ బ్రహ్మణస్పతిర్వాగ్వై బ్రహ్మ తస్యా ఏష పతి స్తస్మాదు బ్రహ్మణస్పతిః. ॥21॥

ప॥ ఏషః - ఉ - ఏవ - బ్రహ్మణస్పతిః - వాక్ - వై - బ్రహ్మ - తస్యాః - ఏషః - పతిః - తస్మాత్ - ఉ - బ్రహ్మణస్పతిః.

ప్ర॥ ఏషఉఏవ = ఈప్రాణమే, బ్రహ్మణస్పతిః = యజుర్వేద స్వరూపమయిన బ్రహ్మకధిపతి. వాగ్వై = వాక్కే, బ్రహ్మ = యజస్సు. తస్యాః = ఆ వాగ్రూపమయిన యజుర్వేదమునకు, ఏషః = ఈప్రాణము, పతిః = ప్రభువు. తస్మాదు = ఆ కారణమునుండియే,(ప్రాణః = ప్రాణము), బ్రహ్మణస్పతిః = యజుర్వేదాధిపతియగు బ్రహ్మయగుచున్నది.

తా॥ ఈప్రాణము వాగ్రూపమయిన యజుర్వేదమున కధిపతి యగుటవలన బ్రహ్మస్వరూపమగుచున్నది.

ఉ॥ ఏష ఉ ఏవ సామ వాగ్వై సా మ ఏష సా చామశ్చేతి తత్సా మ్నస్సామత్వమ్ । యద్వేవ సమః ప్లుషిణా సమో మశకేన సమో నాగేన సమ ఏభిస్త్రిభిర్లోకైస్సమోఽనేన సర్వేణ తస్మాద్వేవ సామాశ్నుతే సామ్నస్సాయుజ్యగ్ సలోకతాం జయతి యఏవమే తత్సామ వేద. 22

ప॥ ఏషః - ఉ - ఏవ - సామ - వాక్ - వై - సామ - ఏషః - సా చ - అమః - చ - ఇతి - తత్ - సామ్నః - సామ త్వం - యత్ - ఉ - ఏవ - సమః - ప్లుషిణా - సమః - మశకేన- సమః - నాగేన - సమః - ఏభిః - త్రిభిః - లోకైః - సమః - అనేన - సర్వేణ - తస్మాత్ - వా - ఏవ - సామ - అశ్నుతే - సామ్నః - సాయుజ్యం - సలోకతాం - జయతి - యః - ఏవం - ఏతత్ - సామ - వేద.

ప్ర॥ ఏషఉఏవ=ఈప్రాణమే, సామ=సామవేదము, వాగ్వై వాక్కే, సామ=సామవేదము. (యస్మాత్=ఏకారణమువలన). సాచ =ఆవాక్కును, ఏషఅమశ్చ=ఈప్రాణమున్ను, ఇతి=ఇట్లు సామవేద మాయెనో, తత్=ఆకారణమువలన, సామ్నః = సామవేదమునకు, (స్వరాది సముదాయమాత్రమైన గానమగు సామవేదమునకు), సామ త్వం=వాక్ప్రాణ స్వరూపముకలుగుట, తత్=ఆ, సామ=గానరూప మయిన సామవేదము), యద్వేవ=ఏకారణమునుండి, ప్లుషిణా=తేనె టీగయొక్క శరీరముతోడను, సమః=సమానమైనదియో, మశకేన =దోమయొక్క శరీరముతోడను, సమః=సమానమైనదియో, నాగేన =ఏనుఁగుశరీరముతోను, సమః = సమానమైనదియో, ఏభిః = ఈ, త్రిభిర్లోకైః = మూడులోకములతోను, సమః = సమానమైనదియో, అనేన = ఈ జగద్రూపమయిన హైరణ్యగర్భునితోను, సర్వేణ = చెప్పఁబడిన సమస్తముతోను, సమః=సమానమైనదియో, తస్మాద్వేవ =ఆకారణమునుండియే, సామ్నః=ప్రాణముయొక్క, సాయుజ్యం= సమానభోగమును, సలోకతాం=సాలోక్యమును, అశ్నుతే=పొందు చున్నది. యః=ఎవఁడు, ఏవం = ఈ పూర్వము చెప్పినప్రకారము, ఏతత్=ఈ,సామ=సామవేదస్వరూపమైన ప్రాణమును, వేద=తెలిసి కొనుచున్నాఁడో, (సః=వాడు, తత్=ఆ ప్రాణసాయుజ్య సాలో క్యాదిఫలమును), జయతి=పొందుచున్నాఁడు.

తా॥ ఇంతకు పూర్వము ప్రాణమునకు ఋగ్వేద యజుర్వేద స్వరూపము కలుగుట చెప్పి సామవేదరూపమును చెప్పుచున్నాఁడు. స్వరాది సముదాయమాత్రమగు గానరూపమైన సామవేదము ప్రాణ వాక్కులవలన నిర్వర్తింపఁదగినదై వాక్ప్రాణ స్వరూపమగుటవలన ఈచెప్పఁబడిడి తేనెటీగలు మొదలైనవానితోను, ఈ జగదాత్మకమైన హైరణ్యగర్భునితోను, తుల్యమై ప్రాణసాయుజ్య సాలోక్యములను పొందుచున్నది. ఇట్లు పొందుటచేత సామరూపమైన ప్రాణమును

తెలిసికొని యుపాసించువాఁడు ఆ ప్రాణసాయుజ్య సాలోక్యాది ఫలమునే పొందుచున్నాఁడు.

ఉ॥ ఏష ఉ వా ఉద్గీథః ప్రాణో వా ఉత్ప్రాణేన హీదగ్ సర్వముత్తబ్ధం వాగేవ గీథోచ్చ గీథా చేతి స ఉద్గీథః. 23

ప॥ ఏషః - ఉవా - ఉద్గీథః - ప్రాణః - వా - ఉత్ - ప్రాణేన - హి - ఇదం - సర్వం - ఉత్తబ్ధం - వాక్ - ఏవ - గీథా - చ - ఇతి - సః -

ప్ర॥ ఏషఉవా - ఈవాక్ప్రాణ సముదాయమే, ఉద్గీథము. (ఔద్గాత్రకర్మయందు ప్రయోగింపఁబడెడి సామశబ్దముచేఁ జెప్పబడిన ప్రాణము. అదెట్లనఁగా). యత్ = ఏకారణమువలన), ప్రాణేనహి = ప్రాణముచేతనే, ఇదంసర్వం = ఈ సమస్తజగత్తు, ఉత్తబ్ధం = పైకి ఎత్తఁబడినదో, (అనఁగాధరించఁబడినదో,) ఉత్ = ఉత్తబ్ధార్థమును తెలియఁజేసెడి ఉచ్ఛబ్దము, ప్రాణోవా = ప్రాణస్వరూపమైనది. (ప్రాణగుణమును చెప్పుచున్నది). వాగేవ = వాక్కే, గీథా = గీథాయనుశబ్దము, ఉచ్చ = ప్రాణమున్ను, గీథాచ = ప్రాణాధీనమయిన వాక్కును, ఇతి = ఇట్లగుటవలన, సః = అ వాగ్విశిష్టమైన ప్రాణము, ఉద్గీథః = ఉద్గీథము. (సామావయవమగు, భక్తివిశేషము),

తా॥ ఇప్పుడుఔద్గాత్రకర్మయం దుపయోగపరచుచుండెడి సామావయవభక్తి విశేషమగు ఉద్గీథశబ్దమునకు వాక్ప్రాణములను చెప్పుచున్నాఁడు. ఈఉద్గీథశబ్దమునందలి ఉచ్ఛబ్దమునకు ప్రాణమును గీథాశబ్దమునకు వాక్కును అర్థముగనుక ఈసమస్తజగద్ధారణోపయోగమైన ఆవాగ్విశిష్టమగు ప్రాణమే ఉద్గీథ మనఁబడుచున్నది.

ఉ॥ తద్ధాపి బ్రహ్మదత్తశ్చైకితానేయో రాజానం భక్షయన్నువాచాయం త్యస్య రాజా మూర్ధానం విపాతయతాద్యదితోఽయాస్య ఆఙ్గిరసోఽన్యేనోదగాయ దితి వాచా చ హ్యేవ స ప్రాణేనచోద గాయదితి.

ప॥ తత్ - హ - అపి - బ్రహ్మదత్తః - చైకితానేయః - రాజానం - భక్షయన్ - ఉవాచ - అయం - త్యస్య - రాజా - మూర్ధానం - విపాతయతాత్ - యత్ - ఇతః - అయాస్యాఙ్గిరసః - అన్యేన - ఉదగాయత్ - ఇతి - వాచా - చ - హి - ఏవ - సః - ప్రాణేన - చ - ఉదగాయత్ - ఇతి.

ప్ర॥ తద్ధాపి= పూర్వము చెప్పబడిన ఆ అర్థమునందు. (ఆఖ్యాయికా= ప్రసిద్ధమగు కథ, శ్రూయతే= వినఁబడుచున్నది) చైకితానేయః= చైకితాయనునికి సంతానమగు, బ్రహ్మదత్తః = బ్రహ్మదత్తుఁడనువాఁడు, రాజానం = రాజునుగూర్చి, (యజ్ఞే= యజ్ఞమునందు, సోమం= సోమమును), భక్షయన్ = భక్షించుచు. (తినుచు), ఉవాచ = పలికెను. యత్ = ఏ కారణమువలన, ఇతః= ఈ, అయాస్యాఙ్గిరస = వాక్కుతోఁగూడుకొనిన ముఖ్యప్రాణముకంటె, అన్యేన= అన్యమగు దేవత చేత, (పూర్వర్షీణాం = పూర్వఋషులయొక్క, సత్రే = యాగమునందు), ఉదగాయత్ = గానము చేయఁబడియుండెనేని, (తతః = అందువలన, అహం= నేను, అనృతవాదీ= అబద్ధముపలికినవాఁడను, స్యాం = అగుదును). త్యస్య = అటువంటి, (మమ = నాయొక్క), మూర్ధానం = శిరస్సును, అయం= ఈ భక్షించుచున్న, రాజా= రాజు, విపాతయతాత్ = పడఁగొట్టునుగాక. ఇతి = అని, (శపథం = శపథమును, చకార = చేసెను). వాచాచ = ప్రాణప్రధానమైనవాక్కుతోనున్న, ప్రాణేన హ్యేవచ = ప్రసిద్ధమగు తనకాత్మభూతమైన ప్రాణముతోనున్న, సః = అయాస్యాఙ్గిరసశబ్దములచేఁ జెప్పఁబడెడి ఆ ముఖ్యప్రాణము, ఉదగాయత్ = గానముచేసెను, ఇతి= ఇట్లని. (శపథముతో బ్రహ్మదత్తుని చేత నిశ్చయింపఁబడినది).

తా॥ ఒకయాగమునందు బ్రహ్మదత్తుఁడను ఋషి సోమమును భక్షించుచు, పూర్వపుఋషులయొక్క యాగమునంతయు ఔద్గాత్ర కర్మను చేయువాఁడు ముఖ్యప్రాణమే, అట్లుకాదేని ఈ యజ్ఞక ర్తయై,

సోమమునుభక్షించెడి ఈరాజు నాశిరస్సును ఖండించుగాక యని శపథ మును చేసి ప్రాణప్రధానమైన వాక్కుతోఁగూడుకొనిన తన కాత్మ భూతమగు ప్రాణముతో ఆ ముఖ్యప్రాణమే ఔద్గాత్రకర్మను చేసె నని నిశ్చయించెను. ఈ పూర్వము చెప్పిన అర్థమునందు ప్రసిద్ధమైన ఈకథ వినఁబడుచున్నది.

ఉ॥ తస్య హైతస్య సామ్నో యః స్వం వేద భవతి హాస్య స్వం తస్య వై స్వర ఏవ స్వంతస్మాదార్త్విజ్యం కరిష్యన్వాచి స్వరమిచ్ఛేత తయా వాచా స్వరసమ్పన్నయార్త్విజ్యం కుర్యాత్తస్మాద్యజ్ఞే స్వరవన్తందిదృక్షన్త ఏవ । అథో యస్య స్వం భవతి భవతి హాస్య స్వం య ఏవమేతత్సామ్నః స్వం వేద. ॥25॥

ప॥ తస్య - హ - ఏతస్య - సామ్నః - యః - స్వం - వేద - భవతి - హ - అస్య - స్వం - తస్య - వై - స్వరః - ఏవ - స్వం - తస్మాత్ - ఆర్త్విజ్యం - కరిష్యన్ - వాచి - స్వరం - ఇచ్ఛేత - తయా - వాచా - స్వరసమ్పన్నయా - ఆర్త్విజ్యం - కుర్యాత్ - తస్మాత్ - యజ్ఞే - స్వరవన్తం - దిదృక్షన్తే - ఏవ - అథో - యస్య - స్వం - భవతి - భవతి - హ - అస్య - స్వం - యః - ఏవం - ఏతత్ - సామ్నః - స్వం - వేద.

ప్ర॥ ఏతస్య= ఈ, సామ్నః=సామశబ్దవాచ్యమైన, తస్యహ = ఆప్రాణముయొక్క, స్వం=ధనమును, యః=ఎవఁడు, వేద=తెలిసి కొనుచున్నాఁడో, అస్యహ=వీనికే, స్వం=ధనము, భవతి=కలుగు చున్నది. తస్యవై=ఆసామశబ్దవాచ్యమైన ప్రాణమునకు, స్వరఏవ= స్వరమే, (కంఠమునుపొందియున్న మాధుర్యధ్వనియే), స్వం=ధనము, (భవతి=అగుచున్నది.) తస్మాత్ = ఆకారణమువలన, ఆర్త్విజ్యం= ఋత్విక్కర్మయగు ఉద్గానమును, కరిష్యన్ = చేయనిచ్ఛయించెడి వాఁడు, వాచి=వాక్కునందు, స్వరం=స్వరమును, ఇచ్ఛేత=కోరవల యును, తయా = అటువంటి, స్వరసమ్పన్నయా=స్వరసమృద్ధిగల,

వాచా = వాక్కుచేతను, ఆర్త్విజ్యం = ఋత్విక్కర్మయగు ఉద్గానమును, కుర్యాత్ = చేయవలయును. తస్మాత్ = అందువలన, యజ్ఞే = యాగమునందు, స్వరవన్తం = మాధుర్యమైన కంఠధ్వనికలవానికే, (జనాః = జనులు,) దిదృక్షన్తేఏవ = చూచుచున్నారు. (అది లోకమునందు సహజమైన దేగదా ? ఎట్లనగా,) అథో = అనంతరము, (లోకే = లోకమునందు,) యస్య = ఎవనికి, స్వం = ధనము, భవతి = కలుగుచున్నదో, (తం = వానిని, లోకాః = జనులు), దిదృక్షన్తే = చూచుచున్నారు.) యః = ఎవడు, ఏవం = ఈప్రకారము, సామ్నః = సామశబ్దవాచ్యమగు ప్రాణముయొక్క, (ఉద్గీథముయొక్క), ఏతత్ = ఈ, స్వం = ధనమును, వేద = తెలిసికొనుచున్నాఁడో, అస్య = వీనికి, స్వం = ధనము, భవతిహ = ప్రసిద్ధముగ కలుగుచున్నది.

తా॥ ఇంతకుపూర్వము ప్రాణమే ఉద్గీథదేవతగా నిశ్చయించి ఆ ప్రాణమునకు స్వర సువర్ణ ప్రతిష్ఠాగుణములను చెప్పుచున్నాఁడు. ఉద్గీథారూపమైన ప్రాణస్వరూపమగు సామమునకు కంఠమునుపొంది యున్న మాధుర్యధ్వనియే ధనముగనుక ఋత్విక్కర్మయగు ఉద్గానమును చేయనిశ్చయించెడివాఁడు వాక్కునందు మాధుర్యధ్వనిరూపమైనధనమును కోరవలయును. అటువంటి స్వరసంపదగల వాక్కుతో యజ్ఞమునందు సామగానమును చేయవలయును. ఇట్లు స్వరసంపదగలిగి యజ్ఞమునందు గానముచేయువానిని జనులు లోకమునందు ధనముగలవానిని వలెనేమిక్కిలి యాదరణతో చూచుచున్నారు. ఈ పూర్వము చెప్పినప్రకారము సామమునకు మధురస్వరమే ధనముగాఁ దెలిసికొనువానికి ప్రసిద్ధముగ ధనముకలుగుచున్నది.

ఉ॥ తస్య హైతస్య సామ్నో యస్సువర్ణం వేద భవతి హాస్య సువర్ణం తస్య వై స్వర ఏవ సువర్ణం భవతి హాస్య సువర్ణం య ఏవమేతత్సామ్నస్సువర్ణం వేద. ॥26॥

ప॥ తస్య హ - ఏతస్య - సామ్నః - యః - సువర్ణం - వేద-భవతి - హ - అస్య - సువర్ణం - తస్య - వై - స్వరః - ఏవ - సువర్ణం - భవతి - హ - అస్య - సువర్ణం - యః - ఏవం - ఏతత్ - సామ్నః - సువర్ణం - వేద.

ప్ర॥ ఏతస్య = ఈ, సామ్నః = సామశబ్దవాచ్యమైన, తస్యహ = ఆప్రాణముయొక్క, సువర్ణం = భూషణమును, (ఈవర్ణముకంఠ్యమని ఈవర్ణముదన్త్యమని తెలిసికొనునటుల బాగుగవర్ణముల నుచ్చరించుటను), యః = ఎవఁడు, వేద = తెలిసికొనుచున్నాఁడో, అస్య = వీనికి, సువర్ణం = భూషణము, భవతిహ = ప్రసిద్ధముగ కలుగుచున్నది. తస్యవై = ఆసామశబ్దవాచ్యమైనప్రాణమునకు, స్వరఏవ = స్వరమే, సువర్ణం = భూషణము, భవతి = కలుగుచున్నది. యః = ఎవఁడు, ఏవం = ఈప్రకారము, సామ్నః = సామశబ్దవాచ్యమైన ప్రాణముయొక్క, (ఉద్గీథముయొక్క), ఏతత్ = ఈ, సువర్ణం = భూషణమును. వేద = తెలిసికొనుచున్నాఁడో, అస్య = వీనికి, సువర్ణం = భూషణము, భవతిహ = ప్రసిద్ధముగఁగలుగుచున్నది.

తా॥ ఆసామశబ్దవాచ్యమగు ప్రాణమునకు స్వరమే భూషణమగుచున్నది. ఇట్లు ఉద్గీథారూపమైన ప్రాణస్వరూపమగు సామమునకు స్వరాంతర్గతమగు కంఠ్యదన్త్యరూపమైన వర్ణవివేకమే భూషణమునుగాఁదెలిసికొనువానికి భూషణము ప్రసిద్ధముగఁగలుగుచున్నది.

ఉ॥ తస్య హైతస్య సామ్నో యః ప్రతిష్ఠాం వేద ప్రతి హ తిష్ఠతి తస్యవై వాగేవ ప్రతిష్ఠావాచి హి ఖల్వేష ఏతత్ప్రాణః ప్రతిష్ఠితో గీయతేఽన్న ఇత్యుహైక ఆహుః. ॥27॥

ప॥ తస్య - హ - ఏతస్య - సామ్నః - యః - ప్రతిష్ఠాం - వేద - ప్రతి - హ - తిష్ఠతి - తస్య - వై - వాక్ - ఏవ - ప్రతిష్ఠా - వాచి - హి - ఖలు - ఏషః - ఏతత్ - ప్రాణః - ప్రతిష్ఠితః - గీయతే - అన్నే - ఇతి - ఉ - హ - ఏకే - ఆహుః.

ప్ర॥ ఏతస్య = ఈ, సామ్నః = సామశబ్దవాచ్యమైన, తస్యహ = ఆప్రాణముయొక్క, ప్రతిష్ఠాం = స్థితిని, యః = ఎవఁడు, వేద = తెలిసికొనుచున్నాఁడో, (సః = వాడు), ప్రతిహతిష్ఠతి = ప్రసిద్ధముగ తిరిగి స్థితినిపొంది యుంచున్నాఁడు. తస్యవై = ఆసామశబ్దవాచ్యమైన ప్రాణమునకు, వాగేవ = వాక్కే, (అష్టౌస్థానాని వర్ణానా మురః కణ్ఠం శిరస్తథా। జిహ్వామూలంచ దన్తాశ్చ నాసికౌష్ఠౌచ తాలుచ॥ ఈయెనిమిదిస్థానములును, వాక్కని చెప్పఁబడుచున్నవి.) ప్రతిష్ఠా = స్థితి, (భవతి = అగుచున్నది). వాచిహి = జిహ్వామూలీయము మొదలైన యెనిమిదిస్థానములయందును, ప్రతిష్ఠితస్సన్ = స్థితినిపొందినదై, ఏషః = ఈ, ప్రాణఃఖలు = ముఖ్యప్రాణమున్ను, ఏతత్ = ఈసామమును, గీయతే = గానముచేయుచున్నది. ఉహైకే = ఇంకకొందఱును, అన్నే = దేహమునందు, (ఇక్కడ అన్నశబ్దముచే అన్నపరిణామమగు దేహము చెప్పఁబడినది. దానియందు ప్రాణము, ప్రతిష్ఠితస్సన్ = స్థితినిపొందినదై, గీయతే = గానముచేయుచున్నది.) ఇతి = అని, ఆహుః = చెప్పిరి.

తా॥ ఆసామశబ్దవ్యాప్యమగు ముఖ్యప్రాణమునకు వక్షస్థలమును కంఠమును శిరస్సును జిహ్వామూలమును దంతములును ముక్కును పెదవులును దవుడలును ఈ ఎనిమిది స్వరూపముగాఁగల వాక్కే ఉనికి పట్టగుచున్నది. అటువంటివాక్కునందు ఈ ముఖ్యప్రాణము ఉనికి గలదై ఈసామగానమును చేయుచున్నది. ఇంక కొందఱు ఈప్రాణము అన్నపరిమాణమగు దేహమునందుండి సామగానమును చేయుచున్నదియనియునుకూడా చెప్పిరి. ఇట్లు సామశబ్దవాచ్యమైన ముఖ్యప్రాణముయొక్క యునికిని తెలిసికొనినవాఁడు ప్రసిద్ధముగ తిరిగి యునికిని పొందినవాఁడగుచున్నాఁడు.

ఉ॥ అథాతః పవమానానామేవాభ్యారోహః స వై ఖలు ప్రస్తోతా సామ ప్రస్తౌతి స యత్ర ప్రస్తుయాత్తదేతాని జపేత్ అసతో మా

సద్గమయ తమసో మాజ్యోతిర్గమయ మృత్యోర్మామృతంగమయేతి స యదాహాసతో మా సద్గమయేతి మృత్యుర్వా అసత్సదమృతం మృత్యోర్మామృతం గమయామృతం మా కుర్విత్యేవైతదాహ తమసో మా జ్యోతిర్గమయేతి మృత్యుర్వై తమో జ్యోతిరమృతం మృత్యోర్మామృతం గమయామృతం మా కుర్విత్యేవైతదాహ మృత్యోర్మామృతం గమయేతి నాత్ర తిరోహితమివాస్తి అథ యానీతరాణి స్తోత్రాణి తేష్వాత్మనేఽన్నాద్యమాగాయేత్తస్మాదు తేషు వరం వృణీత యం కామం కామయేత తగ్ం స ఏష ఏవం విదుద్గాతాత్మనే వా యజమానాయ వా యం కామం కామయతే తమాగాయతి తద్ధైతల్లోకజిదేవ న హైవాలోక్యతాయా ఆశాస్తి య ఏవమేతత్సామ వేద. ॥28॥

ఇతి తృతీయాధ్యాయే తృతీయబ్రాహ్మణమ్.

ప॥ అథ – అతః – పవమానానాం – ఏవ – అభ్యారోహః – సః – వై – ఖలు – ప్రస్తోతా – సామ – ప్రస్తౌతి – సః – యత్ర – ప్రస్తుయాత్ – తదా – ఏతాని – జపేత్ – అసతః – మా – సత్ – గమయ – తమసః – మా జ్యోతిః – గమయ – మృత్యోః – మా – అమృతం – గమయ – ఇతి – సః – యత్ – ఆహ – అసతః – మా – సత్ – గమయ – ఇతి – మృత్యుః – వై – అసత్ – సత్ – అమృతం – మృత్యోః – మా – అమృతం – గమయ – అమృతం – మా – కురు – ఇతి ఏవ – ఏతత్ – ఆహ – తమసః – మా – జ్యోతిః – గమయ – ఇతి – మృత్యుః – వై – తమః – జ్యోతిః – అమృతం – మృత్యోః – మా – అమృతం – గమయ – అమృతం – మా – కురు – ఇతి – ఏవ – ఏతత్ – ఆహ – మృత్యోః – మా అమృతం – గమయ – ఇతి – న – అత్ర – తిరోహితం – ఇవ – అస్తి – అథ – యాని – ఇతరాణి – స్తోత్రాణి – తేషు – ఆత్మనే – అన్నాద్యం –

ఆగాయేత్ - తస్మాత్ - ఉ - - వరం - వృణీత - యం - కామం - కామయేత - తం - సః - ఏవః - ఏవం - విత్ - ఉద్గాతా - ఆత్మనే - వా - యజమానాయ - వా - యం - కామం - కామయతే - తం - ఆగాయతి - తత్ - హ - ఏతత్ - లోకజిత్ - ఏవ - న - హ - ఏవ - అలోక్యతాయై - ఆశా - అస్తి - యః - ఏవం ఏతత్ - సామ - వేద.

ప్ర॥ అథ = అనంతరము, అతః = ఆ కారణమువలన, పవమానానామేవ = పవమానములను యజుర్వేదమంత్రములయొక్కయే, (జపకర్మ = జపకర్మము), అభ్యారోహః = అభ్యారోహమని, (ఈ పూర్వము చెప్పిన ప్రాణస్వరూపము తెలిసినవాఁడు పవమానమంత్రములయొక్క జపకర్మచేతను అభిముఖముగా ఆత్మను దేవభావము పొందించుచున్నాఁడు. గనుక జపకర్మమునకు అభ్యారోహమని, సంజ్ఞా = పేరు, భవతి = కలుగుచున్నది). (యః = ఎవఁడు), సామ = సామమును, ప్రస్తౌతి = మిక్కిలి యుపక్రమించి చెప్పుచున్నాఁడో, సవై ఖలు = వాఁడే, ప్రస్తోతా = ప్రస్తోతయని చెప్పఁబడుచున్నాఁడు. (యజ్ఞమునందలి పదియాఱుమంది ఋత్విక్కులలోనొకఁడు). సః = ఆప్రస్తోతా, యత్ర = ఏకాలమునందు, (సామ = సామమును), ప్రస్తుయాత్ = ఉపక్రమించునో, తదా = అప్పుడు, ఏతాని = ఈ యజుర్వేద మంత్రములగు పవమానములను, (యజమానః = యజమానుఁడు) జపేత్ = జపము చేయవలయును. (ఆమంత్రము లేవియనిన), అసతః = అసత్కర్మమునుండి, (అజ్ఞానమునుండి), మా = నన్ను, సత్ = శాస్త్రీయకర్మవిజ్ఞానములను, గమయ = పొందించుమూ. (దేవభావమును పొందుటకు సాధనమైన ఆత్మభావమును కలుగఁజేయుమూ యనిభావము). తమసః = అపరణాత్మకమైన అజ్ఞానమునుండి, (ఆ అజ్ఞానమె మరణమునకు కారణమగుట వలన మృత్యువనఁబడును. అట్టిమృత్యువునుండి), మా = నన్ను జ్యోతిః = జ్ఞానమును, (అజ్ఞానము దైవస్వరూపమును ప్రకాశింపఁజేయు

నడగుటవలన అమృతమనఁబడును. అట్టి అమృతభావమును, గమయ =పొందింపుమా! మృత్యోః=మృత్యువువలన, మాం=నన్ను, అమృతం=అమృత స్వరూపమును, గమయ=పొందింపుమా! (ద్వైవస్వరూపమగు ప్రజాపతిత్వఫలమును కలుగఁజేయుమా యని భావము). ఇతి=ఇట్లని, సః=ఆమంత్రము. అసతః = అసత్కర్మమునుండి లేక అజ్ఞానమునుండి, మా=నన్ను, శాస్త్రీయకర్మ విజ్ఞానములను, గమయేతి = పొందింపుమాయని, యత్ =ఏఅర్థమును, ఆహ= చెప్పెనో, (ఆ అర్థము తిరోహితము కాకుండ శ్రుతియె ఇక్కడ వివరించుచున్నది). అసత్ =స్వాభావిక కర్మ విజ్ఞానములు, (అజ్ఞానము మిక్కిలి అధోగతికి కారణమగుటవలన), మృత్యుర్వై=మృత్యు వే; సత్ =శాస్త్రీయ కర్మ విజ్ఞానములు, (అమరణహేతువగుట వలన), అమృతం = అమృత స్వరూపము. (తస్మాత్ =అందువలన), మృత్యోః=మృత్యువునుండి, మా=నన్ను, అమృతం=అమృతస్వరూపమును, గమయ=పొందింపుమా. అమృతం=అమృత స్వరూపమును, మా = నన్నుగూర్చి, కుర్వి త్యేవ= చేయుమా అనియె, ఏతత్ =ఈమంత్రము, ఆహ= చెప్పెను. (సః=ఆమంత్రము), తమసః = ఆవరణాత్మకమైన అజ్ఞానము నుండి, మా=నన్ను, జ్యోతిః=జ్ఞానమును, గమయేతి = పొందింపుమాయని, (యత్ =ఏఅర్థమును, ఆహ= చెప్పెనో, ఆ అర్థమునున్న శ్రుతియె ఇక్కడ వివరించుచున్నది). తమః = ఆవరణాత్మకమయిన అజ్ఞానము, మృత్యుర్వై=మృత్యు వే; జ్యోతిః=జ్ఞానము, అమృతం= అమృతస్వరూపము. (తస్మాత్ =అందువలన), మృత్యోః=మృత్యువు నుండి, మా=నన్ను, అమృతం=అమృతస్వరూపమును, గమయ= పొందింపుమా. అమృతం = అమృతస్వరూపమును, మా = నన్ను గూర్చి, కుర్వి త్యేవ= చేయుమాఅనియె, ఏతత్ =ఈమంత్రము, ఆహ = చెప్పెను. (సః=ఆమంత్రము), మృత్యోః=మృత్యువునుండి, మా =నన్ను. అమృతం=అమృతస్వరూపమును, గమయేతి=పొందించు

మాయని, (యత్=ఏఅర్థమును, ఆహ=చెప్పెనో), అత్ర=ఈ అర్థము నందు, తిరోహితం=మఱుగైన అర్థము, నాస్త్యేవ=లేనేలేదు. అథ అనంతరము, యాని=ఏ, ఇతరాణి = అన్యములగు, స్తోత్రాణి = స్తోత్రములో, తేషు=వానియందు, (ఉద్గాతా=మిక్కిలి దేవతలను గూర్చి స్తోత్రముచేయునట్టి ఋత్విక్కు), ఆత్మనే=తనకొఱకు, అన్నాద్యం=అన్నాదికమునుగూర్చి, ఆగాయేత్ =గానముచేయవల యును. (యస్మాత్=ఏకారణమునుండి), సఏషఉద్గాతా=ఆ ఈ ఉద్గా తయను ఋత్విక్కు, ఏవంవిత్ = ఈ ప్రకారము ప్రాణమును తెలి సినవాడో, తస్మాదు = ఆకారణమునుండియే, (యజమానః=యజ మానుఁడు), తేషు=ఆస్తోత్రప్రయోగములయందు, యంకామం = ఏకోరికను, కామయేత=కోరునో, తం=ఆకోరికరూపమైన, వరం= వరమును, వృణీత=ప్రార్థింపవలయును. (సః=ఆ ఉద్గాతయను ఋత్వి క్కుఁడు), ఆత్మనేవా=తనకొఱకైనను, యజమానాయవా=యజ మానునికొఱకైనను, యంకామం=ఏకోరికను, కామయతే=కోరు చున్నాడో, తం=ఆ కోరికనుగూర్చి, ఆగాయతి=గానముచేయుచు న్నాఁడు. (ఆకోరికను గానముచే సాధించుచున్నాఁడు). తద్ధైతత్= ఆ ఈ ప్రాణదర్శనము, (మిక్కిలి కర్మరహితమైన జ్ఞానము) లోకజి దేవ=లోకమును జయించుటయే. యః=ఎవఁడు, ఏవం=ఈ ప్రకా రము, ఏతత్సామ=ఈసామశబ్దవాచ్యమైన ప్రాణమును, వేద=తెలిసి కొనుచున్నాఁడో, (ఉపాసించుచున్నాఁడో, తస్య=వానికి), అలోక్య తాయై=అలోకమగు పరబ్రహ్మత్వముకొఱకు, ఆశా=ప్రార్థించుట, నైవాస్తిహ=లేనేలేదు.

తా॥ ఈ పూర్వము చెప్పినప్రకారము ప్రాణమును తెలిసి కొనిన తరువాత ఇట్లు తెలిసికొనుటవలన పవమానములను పేరుగల సామజపమంత్రములయొక్క జపకర్మముచే, యజమాని తన ఆత్మను

దైవభావమును పొందించుచున్నాఁడు. అటువంటిమంత్రములయొక్క జపమునుచేయుటకు తగినకాలమేదియనిన, యజ్ఞమునందుద్గాత సామగానము నుపక్రమించునపుడు యజమానుడు అసతోమాసద్గమయేత్యాది యాజుషమంత్రములను మూటినిజపింపవలయును. ఇట్లు జపింపఁబడిన మంత్రముల మూటియందలి యర్థ మేమనిన, మంత్రార్థము తిరోహితము గాకుండునటుల శ్రుతియందే వివరింపఁబడియున్నది. ఎట్లనఁగా, అసత్స్వరూపమైన దేహేంద్రియాది స్వాభావిక కర్మవిజ్ఞానము అత్యంతమున్నా అధోగతి కారణమగుటవలన మృత్యుస్వరూపమైనది. సత్స్వరూపమైన శాస్త్రీయకర్మవిజ్ఞానము అమరణహేతువగుటవలన అమృతస్వరూపమైనది. కనుక నన్ను మృత్యువునుండి అమృతస్వరూపమును పొందించుమూ యనియు, నన్నుఁగూర్చి అమృతస్వరూపమునే చేయుమూఁయనియు, మొదటి మంత్రభావము. రెండవ మంత్రార్థమెట్లనఁగా, ఆవరణాత్మకమై అజ్ఞానస్వరూపమైన తపస్సు మరణ హేతువగుటవలన మృత్యుస్వరూపమైనది. ప్రకాశాత్మకమగు జ్ఞానస్వరూపమయినజ్యోతి అమరణ హేతువగుటవలన అమృతస్వరూపమైనది. కనుక అట్టిమృత్యువునుండినన్ను అమృత స్వరూపమును పొందించుమూయనియు, నన్నుగూర్చి అమృతస్వరూపమునే చేయుమూఅని దేవభావమును పొందుటకు సాధనమైన ఆత్మభావమును గలుగఁజేయుమూ యనియు, రెండవమంత్రాభిప్రాయము. ఇట్లు ఈరెండు మంత్రార్థములను చెప్పి మఱుగుపడక ప్రసిద్ధమగు నర్థముగల మూడవ మంత్రార్థమును సాధారణముగానన్ను మృత్యువునుండి అమృతస్వరూపమును పొందించుమూ యని ఇట్లు ఈమూడు మంత్రములయొక్క అర్థము నందలి ఫలరూపమగు పరబ్రహ్మస్వరూపమును కోరెడి యజమాని యభీష్టము సామగానముచే నెరవేర్చునట్టి ఉద్గాత ఇంకా ఇతరములగు స్తోత్రములయందు తనకొఱకును అన్నాదికములను సామగానముచే సిద్ధింపచేసికొనవలయును. ఇదిగాక

ఆ ఉద్గాత ఇట్లు ప్రాణస్వరూపమును తెలిసికొనుటచేతను సర్వసాధకమైన ప్రాణమే యగుటవలన ఆప్రాణమువలెనే సమస్తకోరికలను తనకొఱకును యజమానుని కొఱకును సామగానముచే సాధించుచున్నాఁడు. ఇట్లు ప్రాణస్వరూపమును తెలిసికొనుటవలన తానే ప్రాణస్వరూపమగుట, సమస్తలోక జయము. ఇట్లుఆప్రాణమును తెలిసికొని యుపాసించువానికి బ్రహ్మస్వరూపావాప్తికి అన్యముగ ప్రార్థించుటయే కలుగదు. (బ్రహ్మస్వరూపియగుచున్నాఁడని భావము).

ఇట్లు తృతీయాధ్యాయమునందు తృతీయబ్రాహ్మణము సమాప్తము.

---

## తృతీయాధ్యాయము, చతుర్థబ్రాహ్మణము.

ఉ॥ హరిః ఓమ్॥ ఆత్మైవేదమగ్ర ఆసీత్ పురుషవిధః సోఽనువీక్ష్య నాన్యదాత్మనోఽపశ్యత్ సోఽహమస్మీత్యగ్రే వ్యాహరత్తతోఽహన్నామాభవత్ తస్మాదప్యేతర్హ్యామన్త్రితోఽహమయమిత్యేవాగ్ర ఉక్త్వాథాన్యన్నామ ప్రబ్రూతే యదస్య భవతి స యత్పూర్వోఽస్మాత్సర్వస్మాత్సర్వాన్ పాప్మన ఔషత్తస్మాత్పురుషః ఔషతి హ వై స తం యోఽస్మాత్పూర్వో బుభూషతి య ఏవం వేద. ॥1॥

ప॥ ఆత్మా - ఏవ - ఇదం - అగ్రే - ఆసీత్ - పురుషవిధః - సః - అనువీక్ష్య - న - అన్యత్ - ఆత్మనః - అపశ్యత్ - సః - అహం - అస్మి - ఇతి - అగ్రే - వ్యాహరత్ - తతః - అహం - నామ - అభవత్ - తస్మాత్ - అపి - ఏతర్హి - ఆమన్త్రితః - అహం - అయం - ఇతి - ఏవ - అగ్రే - ఉక్త్వా - అథ - అన్యత్ - నామ - ప్రబ్రూతే - యత్ - అస్య - భవతి - సః - యత్ - పూర్వః - అస్మాత్ - సర్వస్మాత్ - సర్వాన్ - పాప్మనః - ఔషత్ - తస్మాత్ - పురుషః - ఔషతి - హ - వై - సః - తం - యః - అస్మాత్ - పూర్వః - బుభూషతి - యః - ఏవం - వేద.

ప్ర॥ ఇదం = ఈశరీరభేదజాతమంతయు, అగ్రే = శరీరాన్తరో

త్పత్తికంటె పూర్వము, (వేరొక శరీరముకలుగుటకు పూర్వము), ఆత్మైవ=ప్రజాపతిస్వరూపముగానే, ఆసీత్=ఉండెను. సః=అటువంటి, పురుషవిధః = పురుషప్రకారమైనవిరాట్టు, (శిరస్సు పాణిమొదలైన లక్షణములుగల విరాట్టు), అనువీక్ష్య=అనుసరించి ఆలోచనను చేసి, (నేను ఎవరు? ఎట్టిలక్షణముగలవాఁడను అని ఆలోచించి), ఆత్మనః=తనకంటె, (కార్యకరణరూపమైన ప్రాణపిణ్డస్వరూపముకంటె), అన్యత్ = వేరొకవస్తువును, నాపశ్యత్ =చూడపోయెను, (మిక్కిలి తన్నే సర్వస్వరూపమునుగాఁజూచెను. ఇట్లుచూచి), అహం = నేను, సః =ఆప్రజాపతిస్వరూపుఁడను, అస్మీతి = అయితినని, అగ్రే =ముందు, వ్యాహరత్ =పలికెను. తతః=అందువలన, అహన్నామా = అహమను పేరు, అభవత్ = కలిగెను. తస్మాత్ = అందువలన, ఏతర్హ్యపి=ఈ కాలమునందున్న, (కార్యభూతేషు ప్రాణిషు= కార్యరూపములైన ప్రాణులయందు), ఆమన్త్రితః = అడుగఁబడినవాఁడై, (నీ వెవరవని ఒకానొక పురుషునిచేతఁబలుకఁబడినవాఁడై); అహం = నేను, అయమిత్యేవ = ఈ ప్రజాపతిస్వరూపమేయని, అగ్రే= ముందు, ఉక్త్వా=పలికి, అథ=అనంతరము, (తిరిగి విశేషనామమును తెలిసికొన కోరువానికొఱకు), అన్యత్ =ఇతరమగు, నామ=పేరును, ప్రబ్రూతే = చెప్పుచున్నాఁడు. అస్య=ఈబ్రహ్మాకృతియైన ప్రజాపతికి, యత్ =(మాతాపితరులచేతఁజేయఁబడిన) ఏనామము, భవతి=అగుచున్నదో, (దానిని చెప్పుచున్నాఁడు). సః=ఆప్రజాపతి. యత్= ఏ కారణమువలన, (ప్రజాపతిత్వమునుపొందుటకు నిచ్ఛగలవారలకు), పూర్వస్సన్=మొదటివాఁడై, అస్మాత్=ఈ, సర్వస్మాత్=సమస్తమునుండి, (ప్రజాపతిత్వమును పొందనిశ్చయించిన ఈ జనసముదాయమునుండి). సర్వాన్=సమస్తములైన, పాప్మనః=పాపములను, ఔషత్ =దహింపఁజేసెనో. తస్మాత్=అందువలన, పురుషః=పురుషుఁడు, (అభవత్ = ఆయెను). యః=ఎవఁడు, ఏవం=ఈప్రకారము, వేద=

తెలిసికొనుచున్నాఁడో, సః=వాఁడు, యః=ఎవఁడు, అస్మాత్=ఈజ్ఞానమునుండి, పూర్వః=మొదటివాఁడుగా, (శ్రేష్ఠుఁడుగా), బుభూషతి =అగుటకు కోరుచున్నాఁడో, తం=వానిని, ఓషతిహవై=ప్రసిద్ధముగ దహింపఁజేయుచున్నాఁడు.

తా॥ ఇంతకుపూర్వము జ్ఞానకర్మములవలన మిక్కిలి ప్రాణదర్శనముచేత ప్రజాపతిత్వప్రాప్తి చెప్పఁబడినది. ఇప్పుడు ఫలభూతుఁడైన ప్రజాపతికి జగత్తుయొక్క సృష్టిస్థితి సంహారములయందు స్వాతంత్ర్యము మొదలైనవిభూతిని వర్ణించుటచేత వైదికములగు జ్ఞానకర్మముల యొక్క ఫలోత్కర్ష వర్ణించఁదగినదని ఈ గ్రంథమారంభింపఁబడు చున్నది. ఈ శరీరాదిభేద జాతమంతయు ప్రజాపతిస్వరూపముగానే యున్నది. కరచరణాద్యవయవములు కలిగి పురుషస్వరూపముగానున్న ఆ ప్రజాపతియగు విరాట్టు తన స్వరూపానుసరణచే, నేను ఎవరు? ఎట్టిలక్షణముగలవాఁడనని ఆలోచించి దేహాదియాత్మకమైన ప్రాణపిణ్డస్వరూపమగు తనకంటె నన్యమగు వేరొకవస్తువునుచూడక తన్నే సర్వస్వరూపమును గాఁజూచెను. ఇట్లుచూచి ఆ విరాట్పురుషుఁడు ముందుగా, నేను ఆ ప్రజాపతిస్వరూపుఁడనైతినని, పలికెను. అందువలన అహం అనుపేరుగల అహంకారయుక్తమయిన చతుర్ముఖ బ్రహ్మకలిగెను. అందువలన ఈ సమయమునందు కార్యరూపములైన ప్రాణులయందు ఒకానొక పురుషునిచేత నీవెవరవని అడుగఁబడిన వాఁడై నేను ఈ ప్రజాపతిస్వరూపమేయని ముందుగాఁబలికి అనంతరము తిరిగి విశేషనామము తెలిసికొనకోరువానికొఱకు అన్యమగు పేరును చెప్పుచున్నాఁడు అప్రజాపతి ప్రజాపతిత్వమును పొందనిచ్ఛ గలవారలలో మొదటివాఁడై ప్రజాపతిత్వముపొంద నిచ్ఛయించిన జనసముదాయమునుండి సమస్తపాపములను దహింపఁజేయుటవలన పురుషుఁడాయెను. ఈ చెప్పఁబడినప్రకారము ప్రజాపతిస్వరూపమును తెలిసికొని యుపాసించువాఁడు మిక్కిలి శ్రేష్ఠుఁడై ఈప్రజాపతి జ్ఞానము

నుండి శ్రేష్ఠుఁడగుటకు కోరువానిని ప్రసిద్ధముగఁ దిరస్కరించుచున్నాఁడు.

ఉ॥ సోఽబిభేత్తస్మాదేకాకీబిభేతిసహాయమీక్షాఞ్చక్రే యన్మదన్య న్నాస్తి కస్మాన్నుబిభేమీతి తత ఏవాస్య భయం వీయాయ కస్మాద్ధ్యభేష్యత్ ద్వితీయాద్వై భయం భవతి ॥2॥

ప॥ సః - అబిభేత్ - తస్మాత్ - ఏకాకీ - బిభేతి - సః - హ - అయం - ఈక్షాఞ్చక్రే - యత్ - మదన్యత్ - న- అస్తి - కస్మాత్ - ను - బిభేమి - ఇతి - తతః - ఏవ - అస్య - భయం - వీయాయ- కస్మాత్ - హి - అభేష్యత్ - ద్వితీయాత్ - వై - భయం - భవతి.

ప్ర॥ సః=ఆప్రజాపతి, అబిభేత్ = భయపడెను. తస్మాత్= అందువలన నుండి, ఏకాకీ = ఒంటరిగాఁడు బిభేతి = భయపడు చున్నాఁడు. సః=అ, అయం=ఈప్రజాపతి, ఈక్షాఞ్చక్రేహ=ఈప్ర కారమాలోచించెను. యత్=ఏకారణమువలన, మదన్యత్=నాకంటె వేరైనది, నాస్తి=లేదో, (అందువలన, అహం=నేను), కస్మాత్= ఎందువలన, బిభేమీతి=భయపడుదునని, (ఆలోచించెను). తతఏవ= అందువలననే, అస్య=ఈప్రజాపతికి, భయం = భయము, వీయాయ = స్పష్టముగపోయెను. కస్మాద్ధి=ఎందువలనను, అభేష్యత్ = భయ పడుదును. (పరమార్థస్వరూప నిరూపణయందు భయము యుక్తము కాదు). ద్వితీయాద్వై=రెండవదియుండుటవలననే, భయం=భయము భవతి=కలుగుచున్నది.

తా॥ ఇంతకుపూర్వము స్తుతింపఁబడిన కర్మకాణ్డవిహితమైన జ్ఞానకర్మఫలము సంసారవిషయము నతిక్రమింపదు. ఈయర్థమునే చూపించుచు చెప్పెను. దేహేంద్రియాదికముగల ఆ ప్రజాపతి ఆత్మ నాశ విపరీతదర్శనము కలుగుటవలన భయమునుపొందెను. ఆకార ణమునుండియే, లోకమందును ఒంటరిగాఁడు భయమునుపొందు చున్నాఁడు. ఆ ప్రజాపతి ఇట్లు భయమునుపొంది ప్రశ్నపూర్వ కముగా నాకన్యమైనదేదియును వేరొకటిలేదుగనుక నాకేలభయము

కలుగునని ఆలోచించెను. ఈవిచారమువల్లనైన అద్వయజ్ఞానము నుండియే ఈ ప్రజాపతికి భయముపోయెను. భయకారణమైన రెండవ వస్తువేదియు లేకపోవుటవలన అద్వయుఁడై నిర్భయముగానుండెను.

ఉ॥ స వై నైవ రేమే తస్మాదేకాకీ న రమతే స ద్వితీయమైచ్ఛత్। స హైతావానాస యథా స్త్రీపుమాంసౌ సంపరిష్వక్తౌ స ఇమమేవాత్మానం ద్వేధాపాతయత్తతః పతిశ్చ పత్నీ చాభవతాం తస్మాదిదమర్థబృగలమివ స్వ ఇతి హ స్మాహ యాజ్ఞవల్క్యస్తస్మాదయమాకాశః। స్త్రియా పూర్యత ఏవ తాం సమభవత్తతో మనుష్యా అజాయన్త. ॥3॥

ప॥ సః వై - న - ఏవ - రేమే - తస్మాత్ - ఏకాకీ - న - రమతే - సః - ద్వితీయం - ఐచ్ఛత్ - సః - హ - ఏతావాన్ - ఆస - యథా - స్త్రీపుమాంసౌ - సంపరిష్వక్తౌ - సః - ఇమంఏవ - ఆత్మానం - ద్వేధా - అపాతయత్ - తతః - పతిః - చ - పత్నీ - చ - అభవతాం - తస్మాత్ - ఇదం - అర్థబృగలం - ఇవ - స్వః - ఇతి - హ - స్మ - ఆహ - యాజ్ఞవల్క్యః - తస్మాత్ - అయం - ఆకాశః - స్త్రియా - పూర్యతే - ఏవ - తాం - సమభవత్ - తతః - మనుష్యాః - అజాయన్త.

ప్ర॥ సవై=ఆప్రజాపతియే, నైవరేమే=రతినిపొందకపోయెను. (ఇష్ట వస్తువుయొక్క కూడకవలన పుట్టిన క్రీడనుపొందలేదు). తస్మాత్=అందువలన, ఏకాకీ = ఒంటరివాఁడు, నరమతే=క్రీడనుపొందఁడు, సః=ఆ ప్రజాపతి, ద్వితీయం=రెండవవస్తువును, (స్త్రీరూపమైన రెండవవస్తువును), ఐచ్ఛత్=కోరెను. యథా=ఏప్రకారము, (లోకే = లోకమునందు), స్త్రీపుమాంసౌ=స్త్రీపురుషులిద్దఱును, సంపరిష్వక్తౌ= కౌగలించుకొనినవారై, (యత్పరిమాణకౌ = ఎంతపరిమాణముగల వారు, స్యాతాం=అయిరో), సః=ఆప్రజాపతియును, ఏతావాన్= ఇంతపరిమాణముగలవాఁడుగా, ఆస=ఉండెను. సః=ఆప్రజాపతి, ఇమ

మేవాత్మానం=ఈ తననే, ద్వేధా=రెండువిధములుగా, అపాతయత్ =పడవేసెను. తతః=అందువలన, పతిశ్చ=పెనిమిటియును, పత్నీ చ= భార్యయును, అభవతాం=అయిరి. తస్మాత్ = అందువలన, యాజ్ఞవల్క్యః=యాజ్ఞవల్క్యుఁడు, స్వః=ఆత్మయొక్క, ఇదం=ఈశరీరము, అర్ధబృగలమివేతిహ=సగము విడిపోయినదివలెనే యున్నదని, ఆహస్మ =పలికెను. (యస్మాత్ = ఏకారణమువలన), అయం=ఈపురుషుని యొక్క సగముభాగము, ఆకాశః=ఆకాశమో, (వివాహముకంటె పూర్వము స్త్రీయొక్క సగముభాగముతో శూన్యమైనదియో), తస్మాత్=అందువలన, స్త్రియా=స్త్రీతో, పూర్యత ఏవ=సంపూర్ణమగుచున్నది. (సః = మనువను పేరుగల ఆ ప్రజాపతి), తాం = ఆ స్త్రీని, (శతరూపయను తన కుమార్తెను), సమభవత్ = మైథునమును పొందెను. తతః=అందువలన, మనుష్యాః=మనుష్యులు, అజాయన్త= పుట్టిరి.

తా॥ ఆ ప్రజాపతికి భయప్రవేశము కలుగుటచేత సంసారాంతర్భూతత్వము చెప్పఁబడినది. ఆ ప్రజాపతి, వేరొకటి లేక ఒంటరిగా నుండుటవలన ఇష్టవస్తువుయొక్క కూడికవల్లనైన ప్రీతి లేకపోవుటచేత రెండవదియగు స్త్రీరూపమైన వస్తువునుకోరి. లోకమునందు స్త్రీపురుషులు ఆ ప్రీతిని పోఁగొట్టుకొనుటకు ఆలింగనముచేసి కొనినవారై, ఎంత పరిమితిగలవారైరో, అట్టి పరిమాణముగలవాఁడాయెను ఆ ప్రజాపతి ఇట్టి పరిమితిగల తన దేహమును రెండువిధములుగా పడవేసెను. అట్లు పడవేయుటవలన పెనిమిటియును భార్యయును పుట్టిరి. ఆకారణమునుండియే యాజ్ఞవల్క్యుఁడు ఆ జాయాపురుషభావమును పొందిన ఆత్మయొక్క ఈ శరీరమును సగము విడిపోయినదిగా నుండెనని పలికెను. ఇట్లు విడిపోయిన స్త్రీ పురుషులలో పురుషభాగము ఆకాశము. ఇది స్త్రీరూపరహితమైన సగము భాగముగా నుండుటవలన స్త్రీరూపములోఁ బూర్ణమగుచున్నది. ఆపురుషుఁడే మనువను పేరు

గల ప్రజాపతి. ఆ స్త్రీయే ఆ ప్రజాపతి కుమార్తెయగు శతరూపయను నది. ఇట్లు ఆపురుషుఁడు తనకుమార్తెయగు శతరూపయను స్త్రీతోఁజేరి పూర్ణుఁడగుటవలన ఆ స్త్రీనిగూర్చియే మైథునమును పొందెను. ఇట్లు పొందుటవలననే మనుష్యులు పుట్టిరి.

ఉ॥ సో హేయమీక్షాంచక్రే కథం ను మాత్మన ఏవ జనయిత్వా సమ్భవతి హన్త తిరోఽసానీతి సా గౌరభవదృషభ ఇతరస్తాగ్ం సమేవాభవత్తతో గావోఽజాయన్త బడబేత రాభవదశ్వ వృష ఇతరో గర్ధభీతరా గర్దభ ఇతస్తాగ్ం సమేవాభవత్తత ఏకశఫమజాయతాఽజేతరాభవద్బస్త ఇతరోఽవిరితర మేష ఇతరస్తాగ్ం సమేవాభవత్తతోఽజావయోఽజాయన్తైవమేవ యదిదం కించ మిథునమాపిపీలికాభ్యస్తత్సర్వమసృజత. 4

ప॥ సా – ఉ – హ – ఇయం – ఈక్షాంచక్రే – కథంను – మా – ఆత్మనః – ఏవ – జనయిత్వా – సమ్భవతి – హన్త – తిరో సాని – ఇతి – సా – గౌః – అభవత్ – ఋషభః – ఇతరః – తాం – సమా – ఇవ – అభవత్ – తతః – గావః – అజాయన్త – బడబా – ఇతరా – అభవత్ – అశ్వవృషః – ఇతరః – గర్దభీ – ఇతరా – గర్దభః – ఇతరః – తాం – సమా – ఇవ – అభవత్ – తతః – ఏకశఫం – అజాయత – అజా – ఇతరా – అభవత్ – బస్తః – ఇతరః – అవిః – ఇతరా – మేషః – ఇతరః – తాం – సమా – ఇవ – అభవత్ – తతః – అజావయః – అజాయన్త – ఏవం – ఏవ – యత్ – ఇదం – కించ – మిథునం – ఆపిపీలికాభ్యః – తత్ – సర్వం – అసృజత.

ప్ర॥ సో హేయం = ఆ ఈ ప్రసిద్ధురాలైన శతరూపయను స్త్రీ, ఈక్షాంచక్రే=చిన్తించెను. కథంను = ఎట్లుగా, మా=నన్ను, ఆత్మన ఏవ = తనవల్లనుండియే, జనయిత్వా = పుట్టించి, సమ్భవతి = పొందు చున్నాఁడు. (ఇది మిక్కిలి నిందితమైనదని చిన్తించి), హన్త=ఆశ్చర్యము! (అహం=నేను), తిరోసాని=మఱియొక జాతి చేత తిరస్కృతు

కాలనగుదును. ఇతి = ఈప్రకారమాలోచించి, సా=ఆశతరూపయను స్త్రీ, గౌః=గోవు, అభవత్=ఆయెను. ఇతరః=రెండవవాఁడగు పురుషుఁడైనమనువు, ఋషభః=వృషభము, (అభవత్=ఆయెను. ఆ వృషభము), తాం = ఆగోవును, సమేవాభవత్ = మైథునమునుపొందెను. తతః=అందువలన, గావః=గోవులు, అజాయన్త=పుట్టెను. ఇతరా=స్త్రీయైన శతరూప, బడబా=బడబయను ఆడుగుఱ్ఱముగాను, ఇతరః=పురుషుఁడగుమనువు, అశ్వవృషః=మగ గుఱ్ఱముగాను, అభవత్=ఆయెను. ఇతరా=స్త్రీయైన శతరూప, గర్దభీ=ఆఁడుగాడిదెగాను, ఇతరః=పురుషుఁడగు మనువు, గర్దభః=మగగాడిదెగాను, (అభవత్=ఆయెను. అప్పుడు మనువు ఆయారూపుఁడై) తాం=ఆయారూపమైన శతరూపను, సమేవాభవత్=మైథునమును పొందెను. తతః=అందువలన, ఏకశఫం =ఒకగొరిజెగలదియను పేరుగల అశ్వము, అశ్వతరము, గర్దభమను ఈజాతి. అజాయత=కలిగెను.(పుట్టెను). ఇతరా=ఆడుదియగుశతరూప, అజా=ఆడుమేకగాను, ఇతరః = పురుషుఁడగు మనువు, బస్తః=మేకపోతుగాను, ఇతరా=ఆడుదియగు శతరూప, అవిః=ఆడుగొఱ్ఱెగాను, ఇతరః=పురుషుఁడగు మనువు, మేషః=గొఱ్ఱెపోతుగాను, అభవత్=ఆయెను. (ఆయా రూపములుపొందిన మనువు), తాం=ఆరూపములను పొందిన శతరూపయనుస్త్రీని. సమేవాభవత్=మైథునమును పొందెను, తతః=అందువలన, అజావయః=మేకలు గొఱ్ఱెలును, అజాయన్త=పుట్టెను. ఏవమేవ=ఈ ప్రకారముగానే, యదిదంకించ=ఇంకా సమస్తముగు, మిథునం=స్త్రీపురుషుల జంట, (భూత్వా=అయి), తత్సర్వం=ఆ సమస్తమును, అసృజత=సృష్టించెను.

తా॥ ఆ స్త్రీపురుషులిద్దఱిలో రెండవదియగు శతరూపయనుస్త్రీ ఈప్రజాపతియగు మనువు కుమార్తెనగు నాతోటి ఎట్లు మైథునభావమును పొందునని ఆలోచించి ఇది కేవలము నిందితమైనదని తలంచి దీనికి వేరొకయుపాయమును యోచింపగా ఆశ్చర్యమగు ఘటుల తన

స్వరూపమును, జాత్యంతరమగు గవాదిరూపముగా మార్చుట శ్రేష్ఠమైనదనితోచిన అట్లు నిశ్చయించి గవాశ్వాదిరూపములను పొందెను. ఆమనువు తానును అదేప్రకారము ఆయారూపములను పొంది పిపీలికముల పర్యంతము సృష్టిచేసెను.

ఉ॥ సోఽహం వావ సృష్టిరస్మ్యహగ్ హీదగ్ సర్వమసృక్షీతి తతః సృష్టిరభవత్సృష్ట్యాగ్ హాస్యైతస్యాం భవతి య ఏవం వేద. ॥5॥

ప॥ సః - అవైత్ - అహం - వావ - సృష్టిః - అస్మి - అహం - హి - ఇదం - సర్వం - అసృక్షి - ఇతి - తతః - సృష్టిః - అభవత్ - సృష్ట్యాం - హ - అస్య - ఏతస్యాం - భవతి - యః - ఏవం - వేద.

ప్ర॥ సః=ఆప్రజాపతి, (సర్వం=సమస్తమైన, ఇదంజగత్ = ఈ జగత్తును, సృష్ట్వా=సృజించి), అవైత్=రక్షించెను. (యత్=ఏకారణమువలన), అహంహి=నేనే, ఇదంసర్వం=ఈసమస్తజగత్తును, అసృక్షి =సృజించితిని. ఇతి=గనుక, అహంవావ=నేనే, సృష్టిః=సృజింపఁబడిన జగత్తు, అస్మి=అగుచున్నాను. తతః = అందువల్లనే, సృష్టిః=జగత్తు, (సృష్టి), అభవత్=అయెను. యః=ఎవఁడు ఏవం = ఈప్రకారము, (ప్రజాపతివలెనే తనకంటె వేరగు సమస్త జగత్తు నేనే అగుచున్నానని), వేద=తెలిసికొనుచున్నాఁడో, (సః=వాఁడు), అస్య=అప్రజాపతి యొక్క, సృష్ట్యాంహ=సృష్టియగు, ఏతస్యాం=ఈజగత్తునందు, (ప్రజాపతివత్=ప్రజాపతివలెనే, స్రష్టా = సృష్టిచేయువాఁడు, సృష్టికర్త), భవతి=అగుచున్నాఁడు.

తా॥ ప్రజాపతి ఈ సమస్తజగత్తును సృజించి రక్షించెను. ఎట్లనఁగా, నాచేతసృజింపఁబడిన ఈజగత్తు నాకు వేరుకానిదగుటవలన నేనే అగుచున్నాను. సమస్తజగత్తును నేనే సృజించుచున్నాను. గనుక ఇదినాకు వేరుకాదని. ఈప్రకారము ప్రజాపతిసృష్టిని తన్నుగాఁ జెప్పెను. అందువల్లనే సృష్టి అగుచున్నది. ఇట్లు తెలిసికొనినవాఁడు ప్రజాపతి వలెనే ఈజగత్తునందు సృష్టికర్త యగుచున్నాడు.

ఉ॥ అథేత్యభ్యమన్థత్సముఖాచ్చ యోనేర్హస్తాభ్యాం చాగ్నిమసృజత తస్మాదేతదుభయమలోమకమన్తరతోఽలోమకా హి యోనిరన్తరతః తద్యదిదమాహురముం యజాముం యజేత్యేకైకం దేవమేతస్యైవ సా విసృష్టిరేష ఉ హ్యేవ సర్వే దేవాః । అథ యత్కించేదమార్ద్రం తద్రేతసోఽసృజత తదు సోమః ఏతావద్వా ఇదగ్ం సర్వమన్నంచైవా న్నాదశ్చ సోమ ఏవాన్న మగ్నిరన్నాదః సైషా బ్రహ్మణోఽతిసృష్టిః । యచ్ఛ్రేయసో దేవాన సృజతాథ యన్మర్త్యస్సన్నమృతానసృజత తస్మాదతిసృష్టిరతి సృష్ట్యాగ్ం హాస్యైతస్యాం భవతి య ఏవం వేద. 6

ప॥ అథ – ఇతి – అభ్యమన్థత్ – సః – ముఖాత్ – చ – యోనేః – హస్తాభ్యాం – చ – అగ్నిం – అసృజత – తస్మాత్ – ఏతత్ – ఉభయం – అలోమకం – అన్తరతః – అలోమకా – హి – యోనిః – అన్తరతః – తత్ – యత్ – ఇదం – ఆహుః – అముం – యజ – అముం – యజ – ఇతి – ఏకైకం – దేవం – ఏతస్య – ఏవ – సర్వే – దేవాః – అథ – యత్ – కించ – ఇదం – ఆర్ద్రం – తత్ – రేతసః – అసృజత – తత్ – ఉ – సోమః – ఏతావత్ – వై – ఇదం – సర్వం – అన్నం – చ – ఏవ – అన్నాదః – చ – సోమః – ఏవ – అన్నం – అగ్నిః – అన్నాదః – సా – ఏషా – బ్రహ్మణః – అతిసృష్టిః – యత్ – శ్రేయసః – దేవాన్ – అసృజత – అథ – యత్ – మర్త్యః – సన్ – అమృతాన్ – అసృజత – తస్మాత్ – అతిసృష్టిః – అతిసృష్ట్యాం – హ – అస్య – ఏతస్యాం – భవతి – యః – ఏవం – వేద.

ప్ర॥ అథ=అనంతరము, సః=ఆప్రజాపతి, ఇతి=ఈప్రకారము, అభ్యమన్థత్=మథించెను. ముఖాచ్చ=ముఖమనెడి, యోనేః=యోని నుండిన్ని, (అనఃగాళగమునుండి), హస్తాభ్యాంచ=చేతులవలన నుండిన్ని, అగ్నిం=అగ్నిని, అసృజత=సృష్టించెను. తస్మాత్=అందువలన,

ఏతదుభయం = ఈ ముఖహస్తములు రెండును, అన్తరతః=లోపల, అలోమకం=వెండ్రుకలు లేనివి. యోనిః=భగము, అన్తరతః=లోపల, అలోమకాహి=వెండ్రుకలు లేనిదిగదా! తత్ = ఆకర్మప్రకరణము నందు, (ఆయాగకాలమునందు, యాజ్ఞికాః=యాజ్ఞికులు), అముం= ఈ అగ్నినిగూర్చి, యజ = యాగముచేయుము. (పూజింపుము). అముం=ఈ ఇంద్రునిగూర్చి, యజ=యాగముచేయుము. ఇతి=అని, ఏకైకం దేవం=ఒక్కొక దేవునిగూర్చి, యత్=ఏ ఇదం = ఈవాక్యమును, ఆహుః=పలికిరో, (తత్ = దానిని, తథా=ఆ ప్రకారముగా, నవిద్యాత్ = తెలిసికొనఁగూడదు). ఏతస్య = ఈ ప్రజాపతియొక్క. సావిసృష్టిః=అవిశేషసృష్టియగు, సర్వేదేవాః = సమస్తదేవతలును, ఏషఉహ్యేవ=ఈ ప్రజాపతియె. అథ=అనన్తరము. యత్కించేదం = ఈ సమస్తమయిన, ఆర్ద్రం=ద్రవరూపమయిన వస్తువు, తద్రేతసః= ఆ తన రేతస్సునుండి, (ప్రజాపతిః=ప్రజాపతి), అసృజత=సృష్టించెను. తదు=ఆ ద్రవవస్తువే, సోమః=చంద్రుఁడు, ఇదంసర్వం=ఈ ఈసమస్తమును, ఏతావద్వై = ఇంతియె. (ఇంతకుమించినదికాదు. అదివేది యనిన), అన్నంచైవ=అన్నమును, అన్నాదః=అన్నాదమును, (ఆ అన్నాన్నాదములు నిశ్చయింపఁబడుచున్నది). సోమఏవ=చంద్రుఁడే, అన్నం=అన్నము, అగ్నిః=అగ్ని, అన్నాదః=అన్నమును భక్షించువాఁడు. (ఏదిభక్షింపఁబడుచున్నదో అదియే చంద్రుడు. ఏది తినుచున్నదో అదియేఅగ్ని). సైషా=ఆ ఇది, బ్రహ్మణః=ప్రజాపతి యొక్క, విసృష్టిః=అతిశయముగుసృష్టి. యత్ = ఏకారణమువలన, శ్రేయసః=ప్రశస్తులగు, దేవాన్=దేవతలను అసృజత = సృజించెనో, అథ=అనంతరము. యత్ = ఏకారణమువలన, (సః=ఆప్రజాపతి), మర్త్యస్సన్=మరణధర్మముగలవాఁడై, అమృతాన్ = మరణరహితమైన దేవతలను, అసృజత=సృష్టించెను. తస్మాత్ = ఆ కారణమునుండి ,అతిసృష్టిః=అతిశయమైనసృష్టి, (భవతి=అగుచున్నది). యః=

ఎవఁడు, ఏవం= ఈ ప్రకారముగా, వేద= తెలిసికొనుచున్నాఁడో; (సః =వాఁడ), అస్య = ఈప్రజాపతియొక్క, ఏతస్యాంసృష్ట్యాంహ = ఈ సృష్టియందే, (ప్రజాపతిరివ=ప్రజాపతివలెనే, స్రష్టా = సృజించు వాఁడు), భవతి=అగుచున్నాఁడు.

తా॥ ఇట్లు ప్రజాపతి మిథునాత్మకమైన సమస్తజగత్తును సృష్టించి బ్రాహ్మణాది వర్ణములను నియమించెసి దేవతలను సృజించ నిచ్ఛగలవాఁడై అనంతరము ముఖమునందు హస్తములనుంచి మథించి బ్రాహ్మణజాతికి అనుగ్రహమును జేయునట్టి అగ్నినిసృజించెను. ఇట్లు అగ్నికి కారణములైన ముఖహస్తములు రెండును అగ్న్యుత్పత్తి స్థానములగుటవలన లోకమునందు యోనిలోపల ఎట్లు వెంట్రుకలు లేవో, అదేప్రకారము వెంట్రుకలులేనివాయెను. యాజ్ఞికులు యజ్ఞ కర్మయందు యజమానునిగూర్చి ఈఅగ్నినిపూజించుము! ఈ ఇంద్రునిపూజించుము! యని ఏవాక్యమును పలికిరో దానిని అగ్నీంద్రాత్మకముగా అట్లు తెలిసికొనిన ఈప్రజాపతిసంబంధమగు అగ్న్యాది సమస్తదేవతారూపమైన విశేషసృష్టి యంతయు ఈప్రజాపతియేయని తెలిసికొనవలయును. అత్తృత్వాది లక్షణముగలఅగ్నిత్వాదికము ఒక్కఁడగు ప్రజాపతికేవివక్షచేయఁబడినది. అదియెట్లనఁగా, ద్రవస్వరూపమైనదంతయు ఆప్రజాపతియొక్క రేతస్సు; దానివలన సృజింపఁబడిన ఈ సమస్తమయిన అన్నమును చంద్రుఁడు. ఈ అన్నమును భక్షించువాఁడుఅగ్ని. ఇట్లు అగ్నీషోమాత్మకమయిన జగత్తును ఆత్మస్వరూపముగాఁజూచువాఁడు ఏదోషమునకుఅంటక ప్రజాపతి స్వరూపుఁడగుచున్నాఁడు. ఏకారణమువలన ప్రజాపతిమర్త్యస్వరూపుఁడై మరణరహితమైన దేవతలను కర్మజ్ఞానవహ్నిచేత తన సంబంధమగు సమస్త పాపములను దహింపఁజేసి సృజించెనో, అందువల్లనే ఈ సృష్టి అతిశయమైనది. అట్టి అతిశయమగుప్రజాపతియొక్క సృష్టిని ఆత్మస్వరూపమైన దానినిగాఁదెలిసికొనువాఁడు ఈ ప్రజాపతిసంబంధమైన ఈ అతి

సృష్టియందు ప్రజాపతివలెనే సృజించువాఁడగుచున్నాఁడు, (ఇట్లు తెలిసికొని ప్రజాపతియే నేనని యుపాసించువాఁడు ప్రజాపతియై సృష్టి ఫలమును పొందుచున్నాఁడు).

ఉ॥ తద్ధేదం తర్హ్యవ్యాకృతమాసీత్ తన్నామరూపాభ్యామేవ వ్యాక్రియతాసౌనామాయమిదగ్ం రూప ఇతి తదిదమప్యేతర్హి నామరూపాభ్యామేవ వ్యాక్రియతే ఽసౌనామాయమిదగ్ం రూప ఇతి స ఏష ఇహ ప్రవిష్టః ఆ నఖాగ్రేభ్యో యథా క్షురః క్షురధానే ఽవహితః స్యాద్విశ్వంభరో వా విశ్వంభరకులాయే తన్న పశ్యన్త్యకృత్స్నో హి స ప్రాణన్నేవ ప్రాణో నామ భవతి వదన్వాక్పశ్యగ్ంశ్చక్షుః శృణ్వన్ శ్రోత్రం మన్వానో మనస్తాన్యస్యైతాని కర్మనామాన్యేవ స యోఽత ఏకైకముపాస్తే న స వేదాకృత్స్నో హ్యేషోఽత ఏకైకేన భవత్యాత్మేత్యేవోపాసీతాత్ర హ్యేతే సర్వ ఏకం భవన్తి తదేతత్పదనీయమస్య సర్వస్య యదయమాత్మా నేన హ్యేతత్సర్వం వేద। యథా హ వై పదేనానువిన్దేదేవం కీర్తిం శ్లోకం విన్దతే య ఏవం వేద. ॥7॥

ప॥ తత్ - హ - ఇదం - తర్హి - అవ్యాకృతం - ఆసీత్ - తత్ - నామరూపాభ్యాం - ఏవ - వ్యాక్రియత - అసౌనామా - అయం - ఇదం - రూపః - ఇతి - తత్ - ఇదం - అపి - ఏతర్హి - నామరూపాభ్యాం - ఏవ - వ్యాక్రియతే - అసౌనామా - అయం - ఇదంరూపః - ఇతి - సః - ఏషః - ఇహ - ప్రవిష్టః - ఆనఖాగ్రేభ్యః - యథా - క్షురః - క్షురధానే - అవహితః - స్యాత్ - విశ్వంభరః - వా - విశ్వంభరకులాయే - తం - న - పశ్యన్తి - అకృత్స్నః - హి - సః - ప్రాణన్ - ఏవ - ప్రాణోనామ - భవతి - వదన్ - వాక్ - పశ్యన్ - చక్షుః - శృణ్వన్ - శ్రోత్రం - మన్వానః - మనః - తాని - అస్య - ఏతాని - కర్మనామాని - ఏవ - సః - యః అతః - ఏకైకం - ఉపాస్తే - న - సః - వేద - అకృత్స్నః - హి

- ఏషః - అతః - ఏకైకేన - భవతి - ఆత్మా - ఇతి - ఏవ - ఉపాసీత - అత్ర - హి - ఏతే - సర్వే - ఏకం - భవన్తి - తత్ - ఏతత్ - పదనీయం - అస్య - సర్వస్య - యత్ - అయం - ఆత్మా - అనేన-హి - ఏతత్ - సర్వం - వేద - యథా - హ్యైవై - పదేన - అనువిన్దేత్ - ఏవం - కీర్తిం - శ్లోకం - విన్దతే - యః - ఏవం - వేద.

ప్ర॥ తద్ధేదం=ఆ ఇది, (లోకోత్పత్తికంటె పూర్వము, బీజ వస్థను పొందియుండెడి జగత్తు), తర్హి=ఆసమయమునందు, (సృష్టికి పూర్వమునందు), అవ్యాకృతం = వ్యక్తముగాని నామరూపాత్మక మయిన వస్తువుగా, ఆసీత్=ఉండెను, తత్=ఆజగత్తు, (వ్యక్తముగాని నామారూపాత్మకమయిన ఆజగత్తు), నామరూపాభ్యామేవ = నామ రూపములచేతనే, వ్యాక్రియత=స్ఫుటమైన నామరూపములు కలది ఆయెను. అయం=వీడు, అసౌనామా=యజ్ఞదత్తుడని గాని దేవదత్తుండనిగాని పేరుగలవాడు, ఇదంరూపఇతి=ఈ శుక్లకృష్ణాది రూపము గలవాడని, తత్=ఆ అవ్యక్త స్వరూపమైన, ఇదమపి = ఈవస్తువు, ఏతర్హి=ఈ కాలమునందు, నామరూపాభ్యాం=నామరూపములచేత, వ్యాక్రియతే=స్ఫుటమగుచున్నది. అయం=వీడు, అసౌనామా = ఈపేరుగలవాడని, ఇదంరూపఇతి=ఈ రూపముగలవాడని, (ఇట్లు నామరూపములతో వ్యక్తమగుచున్నది). (యః = ఏపరమాత్మ, తాభ్యాం = ఆనామరూపములకంటె, విలక్షణః = వేరైనవాడును, స్వతః=స్వకీయముగా, నిత్యశుద్ధబుద్ధముక్తస్వభావః=నిత్యుడును పరిశుద్ధుడును జ్ఞానస్వరూపియును, దేనిని అంటకవిడిచియుండునట్టి స్వభావముగలవాడునై, భవతి=అగుచున్నాడో), సః=అటువంటి, ఏషః =ఈపరమాత్మ, ఇహ=బ్రహ్మాదిస్తంబ పర్యంతముండెడి దేహముల యందు, ఆనఖాగ్రేభ్యః=గోటికొనలపర్యంతము, (సమస్తశరీరముల యందంటను). క్షురః=మంగలకత్తి, క్షురధానే=పొదియందు, (మం

గలకత్తి పొదియొక్క ఏకదేశమునందు), యథా=ఏప్రకారము, అవహితః=ప్రవేశపెట్టబడినది, స్యాత్=అగునో, విశ్వంభరోవా = అగ్నియును, విశ్వంభరకులాయే=అగ్నియొక్క గూడైన దారువునందును, (యథా = ఏప్రకారము, అవహితః= లోపల ప్రవేశించియుండునది, స్యాత్ = అగునో, తథా = ఆప్రకారము), ప్రవిష్టః = ప్రవేశించియున్నాఁడు. తం=అటువంటిపరమాత్మను, నపశ్యన్తి=చూచుట లేదు. (లోకులు అంతఃకరణాద్యుపాధులయందు ప్రవేశించియున్న ఆత్మను చూచుచున్నవారైనను వ్యాకృతనామరూపాత్మకమైన దేహాదులను వేఱుపఱిచి పరమాత్మ స్వరూపమునుగాఁజూడలేరు). సః = ఆ పరమాత్మ, అకృత్స్నోహి=అసంపూర్ణుఁడై, (పరమాత్మ దేహముల యందు ప్రవేశించి అసంపూర్ణుఁడై), ప్రాణన్నేవ=ప్రాణన వ్యాపారమును చేయుచునే, (దేహమునందు ప్రాణవాయువుయొక్క ఊర్ధ్వగమనాది వ్యాపారమునుచేయుచు), ప్రాణోనామా = ప్రాణమను పేరుగలవాఁడును, వదన్=పలుకుచు, (వాగ్వ్యాపారమునుచేయుచు), వాక్=వాక్కను పేరుగలవాఁడును, పశ్యన్=చూచుచు (ఈక్షణ వ్యాపారమునుచేయుచు), చక్షుః = నేత్రమను పేరుగలవాఁడును, శృణ్వన్=వినుచు, (శ్రవణేంద్రియవ్యాపారమునుచేయుచు), శ్రోత్రం =శ్రోత్రమను పేరుగలవాఁడును, మన్వానః=తలంచువాఁడై, (మనోవ్యాపారములుచేయువాఁడై), మనః=మనస్సను పేరుగలవాఁడును, భవతి=అగుచున్నాఁడు. అస్య=దేహములయందు ప్రవేశించియున్న ఈ పరమాత్మకు, తాని=ఆ ప్రసిద్ధములగు, ఏతాని = ఈపేర్లు, కర్మనామాన్యేవ=కర్మవలనపుట్టిన పేర్లే. సః=అటువంటి, యః = ఎవఁడు, (వ్యక్తమైన నామరూపములుగల యేజీవాత్మ), అతః=ఈప్రాణనాది క్రియాసముదాయమునుండి, ఏకైకం=ఒక్కొకదానిని, ఉపాస్తే=ఉపాసించుచున్నాఁడో, సః = వాఁడు, (అజీవుఁడు, బ్రహ్మ = పరబ్రహ్మమును), నవేద=తెలిసికొనఁడు. ఏషః=ఈ జీవాత్మ, అకృత్స్నోహి=

అసంపూర్ణుఁడై, అతః = ఈప్రాణనాదిక్రియాసముదాయమునుండి, ఏకైకేన=ఒక్కొక్కటియగు ప్రాణము చక్షుస్సు మొదలైన విశేషణ ములతో, (విశిష్టః =కూడుకొనినవాఁడు), భవతి = అగుచున్నాఁడు. (ఈజీవుఁడెంతవఱకు నేను చూచుచున్నాను వినుచున్నాను తాఁకు చున్నానని స్వభావప్రవృత్తితో గూడిన దానిని తెలిసికొను చున్నాఁడో, అంతవఱకు శీఘ్రముగా సంపూర్ణమగు ఆత్మను తెలిసి కొనఁడు. ఎప్పుడు ఆప్రాణనాది వ్యాపారములతోఁగూడిన జీవాత్మ స్వభావప్రవృత్తితోఁగూడిన, చూచు' వినుట మొదలైన వ్యాపారము లనువిడిచి తన్ను ఆత్మస్వరూపముగానే చూచుచున్నాఁడో అప్పుడు సంపూర్ణాత్మ యగుచున్నాఁడు. గనుక), ఆత్మేత్యేవ=ఆత్మస్వరూప మేయని, ఉపాసీత=ఉపాసన చేయవలయును. (ధ్యానించవలయును). అత్రహి = ఈఆత్మయందే, ఏతే=ఈపూర్వము చెప్పఁబడిన. సర్వే= సమస్తమైనవియును (ప్రాణనాదికర్మలవలన పుట్టిననామములన్నియు), ఏకం=అభిన్నతను, భవన్తి=పొందుచున్నవి. తదేతత్=ఆ ఈఆత్మ, పదనీయం=పొందఁదగినది. యత్ = ఏకారణమువలన, అస్యసర్వస్య = ఈసమస్తమునకు, అయం = ఇది, ఆత్మా=ఆత్మస్వరూపము. అనే నహి = ఈఆత్మస్వరూపము చేతనే, ఏతత్సర్వం = ఈసమస్తమును, వేద = తెలిసికొనుచున్నాఁడు. లోకే=లోకమునందు), యథాహావై = ఏప్రకారముగాను, ప్రదేన=ప్రదేశము చేత, (చోరులచేత అపహ రింపఁబడిన ఆవులు మొదలైనవాటిని వానిఖురములతో గుఱుతుగాఁ జేయఁబడిన ప్రదేశము చేత వానిని వెదకెడుజనుఁడెట్లు), అనువిన్దేత్ =తెలిసికొనునో, ఏవం=ఈప్రకారము, (ఆత్మని = ఆత్మస్వరూపము, లబ్ధేసతి=పొందఁబడుచుండగా, సర్వం=సమస్తమున్ను, ఉపలభతే= పొందఁబడుచున్నది). యః=ఎవఁడు, ఏవం=ఈప్రకారము, వేద= తెలిసికొనుచున్నాఁడో, (సః=వాడు), కీర్తిం=ఖ్యాతినిన్ని, శ్లోకంచ= ప్రాణాదిసమూహముయొక్క కూడికనున్ను, విన్దతే=పొందుచున్నాఁడు,

తా॥ జ్ఞానకర్మలక్షణమును, కర్త్రాద్యనేక కారకాపేక్షిత మును, వేదసంబంధమైన సాధనమునగు ఇంతకు పూర్వము చెప్పిన సమస్తకర్మమును, సాధించఁదగిన ప్రజాపతిస్వరూపమువుటయొక్క ఫలమే అంతముగాఁగలది. ఈఫలము కర్మచేత సాధించఁదగినది. సర్వ కారణమైన బీజావస్థ పరబ్రహ్మము. ఇది జ్ఞానసాధ్యము. ప్రత్యక్ష ముగ స్ఫుటమైన నామరూపములుగలజగత్తే సంసారము. ఇటువంటి సాధ్యసాధనలక్షణమగు వ్యక్తమైన నామరూపములుగల జగత్తు యొక్క వ్యక్తీభావముకంటే పూర్వముండెడి సమస్త జగత్కారణ మైన బీజావస్థను అంకురము మొదలైన కార్యములచేత ఊహింపఁబడిన వృక్షముయొక్క బీజావస్థనువలెనే నిర్దేశించి చూపించుచున్నాఁడు. కర్మమే బీజముగాఁగలదియును, అజ్ఞానమే క్షేత్రముగాఁగలదియు నగు సంసారమను వృక్షము పేరుతోఁగూడఁ బెఱికివేయఁదగినదని యును, అట్లుచేయుటయే సమస్తమైన ధర్మాదిపురుషార్థములసమాప్తి యనియును తలంచి, జగత్కారణమగు బీజావస్థచూపింపఁబడుచున్నది. ఈ బీజావస్థయే సర్వథా ము కిస్వ[illegible] పరబ్రహ్మము. నామ రూపములచే వ్యక్తమైయుండెడి ఈ ప్రపంచమంతయు సృష్టికి పూర్వము సర్వకారణమై సమస్తమునకు బీజావస్థగానుండెడి అవ్యక్త మగు పరబ్రహ్మముగానే యుండెను. ఇట్లు వ్యక్తనామరూపములు లేక అవ్యక్తముగానుండెడి ప్రపంచము, సృష్టియైనతరువాత యజ్ఞదత్త దేవదత్తాది నామములతోను, శుక్ల నీల పీతాది రూపములతోను, జంగమ స్థావరాత్మకముగా స్ఫుటమై వ్యక్తమగుచున్నది. ఇట్లు నామ రూపములచేత వ్యక్తమగు ప్రపంచమునందలి బ్రహ్మాది స్తంబపర్యంత ముండెడి సర్వదేహములయందు నామరూపములు లేక దేనినిఅంటక, సర్వకారణమై బీజావస్థగానుండు ఆపరబ్రహ్మము గోటికొనలు మొదలుకొని కేశాంతముదనుక పాదియుంచు మంగలకత్తివలెను, దారువునందుఅగ్నివలెను, పూర్ణముగాఁబ్రవేశించి యున్నాడు. ఇట్లు

అంతఃకరణాద్యుపాధులయందుఁ బ్రవేశించియున్న ఆత్మను లోకులు చూచుచున్న వారైనను వ్యాకృతనామ రూపాత్మకములైన దేహాదులకు వేఱుపఱిచి పరమాత్మ స్వరూపమునుగాఁ జూడలేరు. అవ్యక్తమగు సర్వకారణమైన ఆపరమాత్మయే దేహములయందు ప్రవేశించి అసంపూర్ణుఁడై దేహమునందు ప్రాణవాయువుయొక్క ఊర్ధ్వగమనాది వ్యాపారమును చేయుచు ప్రాణమను పేరుగల వాఁడును, వాగ్వ్యాపారమును చేయుచు వాక్కను పేరుగల వాఁడును, ఈక్షణవ్యాపారమును చేయుచు నేత్రమను పేరుగలవాఁడును, శ్రవణవ్యాపారమును చేయుచు శ్రోత్రమను పేరుగలవాఁడును, మనోవ్యాపారమును చేయుచు మనస్సను పేరుగలవాఁడును ఈ పేర్లన్నియు దేహములయందు ప్రవేశించియున్న ఈఆత్మకు ఆయా కర్మల వలన పుట్టుచున్నవి. ఇట్లు వ్యక్తమైన నామరూపములుగల జీవాత్మ, ఈ ప్రాణానాది వ్యాపారముల సముదాయమునుండి ఒక్కొకదానిని వేఱుగా నుపాసించెడివాఁడైన పరబ్రహ్మమును తెలిసికొనలేఁడు. ఇట్లు అసంపూర్ణుఁడగు ఈజీవుఁడెంతవరకు ఒక్కొకటియగు ప్రాణము చక్షుస్సు మొదలైన విశేషములతోఁ గూడుకొని, నేను నిట్టూర్పించుచున్నాను, చూచుచున్నాను, వినుచున్నాను, తాకుచున్నాను అను పట్టి ఈస్వభావప్రవృత్తితోఁ గూడినదానినిఁగాఁ తెలిసికొనుచున్నాడో అంతవఱకు శీఘ్రముగా సంపూర్ణమగు ఆత్మను తెలిసికొనఁడు. ఎప్పుడు ప్రాణవాది వ్యాపారములతోఁగూడిన జీవాత్మ, స్వభావప్రవృత్తితోఁ గూడిన చూచుట వినుట మొదలైన వ్యాపారములను విడిచి తన్ను ఆత్మస్వరూపమునుగానే చూచుచున్నాఁడో, అప్పుడు సంపూర్ణాత్మయగుచున్నాఁడు. గనుక, సర్వము ఆత్మస్వరూపమేయని యుపాసించవలయును. ఇట్లుపాసించుటవలన ప్రాణనాదికర్మలవలన పుట్టిననామములన్నియు పరబ్రహ్మాభిన్నతను పొందుచున్నవి. అటువంటి ఈఆత్మయే పొందఁదగినది. ఇదియే సర్వమునకు ఆత్మయైయున్నది. గనుక దీనిచేతనే

నామరూపాత్మకమైన సమస్తము తెలియుచున్నది. లోకమునందు జనుఁడు గవాదిపాదములతో చిహ్నితమైన మార్గప్రదేశముద్వారా చోరులచే నపహరింపఁబడిన ఆగవాదులను తెలిసికొనినట్లు అసంపూర్ణ మగు జీవాత్మద్వారా పరమాత్మ పొందఁబడుచుండగా సర్వమును పొందఁబడుచున్నది. ఇట్లు తెలిసికొనువాఁడు ఖ్యాతిని ప్రాణాది సముదాయముయొక్క కూడికను పొందుచు పరమాత్మైక్యజ్ఞానమును, ముక్తిని పొందుచున్నాఁడు.

ఉ॥ తదేతత్ప్రేయః పుత్రాత్ప్రేయో విత్తాత్ప్రేయోఽన్యస్మాత్సర్వస్మాద న్తరతరం యదయమాత్మా స యోఽన్యమాత్మనః ప్రియం బ్రువాణం బ్రూయాత్ ప్రియగ్ రోత్స్యతీతీశ్వరో హ తథైవ స్యాదాత్మానమేవ ప్రియముపాసీత స య ఆత్మానమేవ ప్రియముపాస్తే న హాస్య ప్రియం ప్రమాయుకం భవతి. ॥8॥

ప॥ తత్ - ఏతత్ - ప్రేయః - పుత్రాత్ - ప్రేయః - విత్తాత్ - ప్రేయః - అన్యస్మాత్ - సర్వస్మాత్ - అన్తరతరం - యత్ - అయం - ఆత్మా - సః - యః - అన్యం - ఆత్మనః - ప్రియం - బ్రువాణం - బ్రూయాత్ - ప్రియం - రోత్స్యతి - ఇతి - ఈశ్వరః - హ - తథా - ఏవ - స్యాత్ - ఆత్మానం - ఏవ - ప్రియం - ఉపాసీత - సః - యః - ఆత్మానం - ఏవ - ప్రియం - ఉపాస్తే - న - హ - అస్య - ప్రియం - ప్రమాయుకం - భవతి.

ప్ర॥ తదేతత్ = ఈ ఆత్మతత్త్వము, పుత్రాత్ = పుత్రునికంటె, ప్రేయః = మిక్కిలి ప్రియమైనది. విత్తాత్ = ధనముకంటె, (బంగారము మొదలైనదానికంటె), ప్రియం = మిక్కిలి ప్రియమైనది. అన్యస్మాత్ = ఇతరమైన, సర్వస్మాత్ = సమస్తముకంటె, ప్రేయః = మిక్కిలి ప్రియమైనది. యదయమాత్మా = ఈ ఆత్మతత్త్వము, (సర్వస్మాత్ = సమస్తమగు ప్రాణాదికముకంటె), అన్తరతరం = మిక్కిలి అంతరమైనది. (గనుకనే ఈ ఆత్మతత్త్వము మిక్కిలి ప్రియమైయున్నది), సయః = ఖ్యా

నొకఁడగు నీయాత్మతత్త్వముఁ దెలిసినవాఁడు, ఆత్మనః=ఆత్మస్వరూపము కంటె, అన్యం=ఇతరమైనదానిని, ప్రియం = ప్రేమస్వరూపమునుగా, బ్రువాణం=పలికెడి వానినికూర్చి, ఈశ్వరః = ఈశ్వరుఁడు, (తవ=నీ యొక్క), ప్రియం=ప్రేమను, రోత్స్యతీతి=అడ్డగించగలఁడని, హ= ప్రసిద్ధముగా, బ్రూయాత్=పలుకును. తథైవ = ఆ ప్రకారముగానే, స్యాత్=అగును. (తస్మాత్=అందువలన), ఆత్మానమేవ=ఆత్మస్వరూపమునే, ప్రియం=ప్రియమైనదానినిగా, ఉపాసీత=ఉపాసించవలయును. (ధ్యానించవలయును). సయః=ఇట్లు తెలిసికొనిన ఒకానొకఁడగు ఆత్మవేత్త, ఆత్మానమేవ=ఆత్మమునే, ప్రియం=ప్రేమరూపమునుగా, ఉపాస్తే =ఉపాసించుచున్నాఁడు, అస్యహ=ఇట్లు తెలిసికొనిన ఆత్మవేత్తయొక్క, ప్రియం = ప్రేమ, ప్రమాయుకం = మరణశీలమైనది. (మరణమును పొందునది). నభవతి=కాదు.

తా॥ ఆత్మయే ఇతరములగు నన్నిటిని పరిత్యజించి తెలిసికొనఁ దగినదని ఈయుపనిషద్వాక్యము తెలియఁబఱుచుచున్నది. ఏలననఁగా, ఈ ఆత్మతత్త్వము సర్వాంతరమగు ప్రాణమునకంటె ఆం[illegible]మైనది గనుక, బాహ్యములై మరణస్వరూపములగు పుత్రవిత్తాది సమస్త ప్రేమలకంటె మిక్కిలి ప్రియమైనది. ఇట్లు సర్వప్రేమాస్పదమైన ఆత్మతత్త్వమును తెలిసినవాఁడు, ఆత్మకంటె నితరమై నశ్వరమగు పుత్రవిత్తాదకమును ప్రేమస్వరూపమునుగాఁ బలికెడి అనాత్మజ్ఞునిగూర్చి, "ఓయీ! నీప్రేమను ఈశ్వరుఁడు నశింపఁజేయును. గనుక ఆత్మస్వరూపమునే సర్వప్రేమాస్పదమునుగా నుపాసించవలయును" అని చెప్పవలయును. ఈ చెప్పినప్రకారము తెలిసిన ఆత్మవేత్త, ఆత్మస్వరూపమునే సర్వప్రేమాస్పదమునుగా నుపాసించుచున్నాఁడు. ఇట్లుపాసించెడి ఆత్మవేత్తయొక్క ప్రేమ బాహ్యమైన నశ్వరమగు పుత్రవిత్తాది ప్రేమవలెనే మరణశీలమైనది కాదు.

ఉ॥ తదాహుర్యద్బ్రహ్మవిద్యయా సర్వం భవిష్యన్తోమనుష్యామన్యన్తే।
కిము తద్బ్రహ్మావై (వే)ద్యస్మా త్తత్సర్వ మభవ దితి. 9

తత్ - ఆహుః - యత్ - బ్రహ్మవిద్యయా - సర్వం భవిష్యన్తః - మనుష్యాః - మన్యన్తే - కిము - తత్ - బ్రహ్మ - అవైత్ - యస్మాత్ - తత్ - సర్వం - అభవత్ - ఇతి.

ప్ర॥ మనుష్యాః=మనుష్యులు, బ్రహ్మవిద్యయా = పరబ్రహ్మ విద్యచేత, సర్వం = సమస్త స్వరూపము, భవిష్యన్తః=కాఁగలమని, యత్=దేనిని, మన్యన్తే=తలంచుచున్నారో, తత్ = దానినిగూర్చి, ఆహుః=పలికిరి. (అడిగిరి). తత్=బ్రహ్మ, కిము=ఏది? (తత్ =ఆ బ్రహ్మము కిం=దేనిని), అవైత్=తెలిసికొనెను. యస్మాత్=ఏవిజ్ఞానము వలన, తత్సర్వం=ఆ సమస్తమును, అభవదితి = కలిగినదని, (పప్రచ్ఛుః = అడిగిరి.)

తా॥ పరబ్రహ్మస్వరూపమును విశేషముగాఁ దెలిసికొన నిచ్ఛయించెడి మనుజులు జన్మజరామరణములయొక్క సంబంధముగల సంసారచక్ర భ్రమణమును చేయుటవలన కలిగిన దుఃఖములనెడి యుదకములుగల మహాసముద్రమును దాటించుటకు తెప్పవలె నుండెడి సద్గురువును పొంది, ఓస్వామీ! మేము ఏపరబ్రహ్మమును తెలిసికొనుటచేత సర్వస్వరూపులమగుదుమో, అట్టి పరబ్రహ్మమేది? అది మొదట దేనినీ తెలిసికొనెను? అట్లు తెలిసికొనిన పరమాత్మయొక్క ఏ విజ్ఞానమువలన ఆ సమస్తము కలిగెను? అని అడిగిరి.

ఉ॥ బ్రహ్మ వా ఇద మగ్ర అసీత్తదాత్మానమేవావై (వే) త్।అహం బ్రహ్మాస్మీతి తస్మాత్తత్సర్వమభవత్ తద్యో యో దేవానాం ప్రత్యబుధ్యత స ఏవ తదభవత్తథా ఋషీణాం తథా మనుష్యాణాం తద్ధైతత్పశ్యన్నృషిర్వామదేవః ప్రతిపేదేఽహం మనురభవగ్ సూర్యశ్చేతి తదిదమప్యేతర్హి య ఏవం వేదాహం బ్రహ్మాస్మీతి స ఇదగ్ సర్వం భవతి తస్య హ న దేవాశ్చ నాభూత్యా ఈశతే ఆత్మా హ్యేషాగ్ స భవతి అథ యోఽన్యాం దేవతాముపాస్తేఽన్యోఽసావన్యోఽహమస్మీతి న స వేద యథా పశురేవగ్ స దేవా

నాం యథా హ వై బహవః పశవో మనుష్యం భుఞ్జ్యురేవ మేకై కః పురుషో దేవాన్ భునక్త్యేకస్మిన్నేవ పశావాదీయమా నేఽ ప్రియంభవతి కిము బహుషు తస్మాదేషాం తన్న ప్రియం య దేతన్మనుష్యా విద్యుః. ॥10॥

ప్ర॥ బ్రహ్మ – వై – ఇదం – అగ్రే – ఆసీత్ – తత్ – ఆత్మా నం – ఏవ – అవైత్ – అహం – బ్రహ్మ – అస్మి-ఇతి – తస్మాత్ – తత్ – సర్వం – అభవత్ – తత్ – యః – యః – దేవానాం – ప్రత్యబుధ్యత – సః – ఏవ – తత్ – అభవత్ – తథా – ఋషీణా – తథా – మనుష్యాణాం – తత్ – వై – ఏతత్ – పశ్యన్ –, ఋషిః – వామదేవః – ప్రతిపేదే – అహం – మనుః – అభవం – సూర్యః – చ – ఇతి – తత్ – ఇదం – అపి – ఏతర్హి – యః – ఏవం – వేద – అహం – బ్రహ్మ – అస్మి – ఇతి – సః – ఇదం – సర్వం – భవతి – తస్య – హ – న – దేవాః – చన – అభూత్యై – ఈశతే – ఆత్మా – హి – ఏషాం – సః – భవతి – అథ – యః – అన్యాం – దేవతాం – ఉపాస్తే – అన్యః – అసౌ – అన్యః – అహం – అస్మి – ఇతి – న – సః – వేద – యథా – పశుః – ఏవం – సః – దేవానాం – యథా – హవై – బహవః – పశవః – మనుష్యం – భుఞ్జ్యుః – ఏవం – ఏకై కః – పురుషః – దేవాన్ – భునక్తి – ఏకస్మిన్ – ఏవ – పశౌ – అదీయమానే – అప్రియం – భవతి – కిము – బహుషు – తస్మాత్ – ఏషాం – తత్ – న – ప్రియం – యత్ – ఏతత్ – మనుష్యాః – విద్యుః.

ప్ర॥ ఇదం=ఈసమస్తము, అగ్రే = పరబ్రహ్మజ్ఞానముకంటె పూర్వము, బ్రహ్మవై=పరబ్రహ్మముగానే, ఆసీత్=ఉండెను. తత్= ఆపరబ్రహ్మము, అహం = నేను, బ్రహ్మాస్మీతి = పరబ్రహ్మమైతినని, ఆత్మానమేవ=తన్నే, అవైత్=తెలిసికొనెను. (అప్పుడు అజ్ఞానాధ్యా రోపణముయొక్క నివృత్తియే పరబ్రహ్మము. అది నేనైతినని తన్నుం

దెలిసికొనుట). తస్మాత్=అట్లు తెలిసికొనుటవలన, తత్=ఆపరబ్రహ్మము, సర్వం=సర్వస్వరూపము, అభవత్=ఆయెను. దేవానాం=దేవతలలోపల, యః యః=ఎవఁడెవఁడు, తత్=ఆ పరబ్రహ్మమును, ప్రత్యబుధ్యత=తెలిసికొనెనో, సఏవ=వాఁడే, తత్=ఆపరబ్రహ్మము, అభవత్=ఆయెను. ఋషీణాం=ఋషులలోపలను, తథా=అప్రకారమే, మనుష్యాణాం=మనుష్యులలోపలను, తథా=అప్రకారమే, వామదేవః=వామదేవుఁడను పేరుగల, ఋషిః=ఋషి, తదేతత్ద్వై=ఆ ఈ బ్రహ్మస్వరూపమునే, పశ్యన్=చూచుచు, అహం=నేను, మనుః=మనువు, అభవం=అయితిని. సూర్యశ్చ = సూర్యుఁడను, (అభవం=అయితిని). ఇతి=ఈప్రకారము,(సర్వాత్మభావం=సర్వస్వరూపమును), ప్రతిపేదే=పొందెను. తదిదమపి=అటువంటి ఈ పరబ్రహ్మమును, (సమస్త భూతములయం దనుసరించి ప్రవేశించియున్న దర్శనక్రియాది లిఙ్గముగల ప్రకృతమందలి బ్రహ్మమును), ఏతర్హి = ఈవర్తమానకాలమునందు, యః=ఎవఁడు, ఏవం=ఈప్రకారము, అహం=నేను, బ్రహ్మాస్మీతి=పరబ్రహ్మమైతినని, వేదః=తెలిసికొనుచున్నాఁడో, సః=వాఁడు, ఇదం సర్వం=ఈసమస్తము, భవతి=అగుచున్నాఁడు. తస్యహ=అట్టిపరబ్రహ్మవేత్తకు, దేవాశ్చన=దేవతలును, అభూత్యై = కలుగఁజేయకపోవుటకొఱకు, (బ్రహ్మసంబంధమైన సర్వాత్మభావమును కలుగఁజేయకపోవుటకు), నేశతే=సమర్థులుకారు. సః=ఆపరబ్రహ్మవేత్త, ఏషాం=ఈ దేవతలకు, ఆత్మా=ఆత్మస్వరూపముగా, భవతిహి = అగుచున్నాఁడు గదా! అథ=అనంతరము, యః=ఎవఁడు, (బ్రహ్మవేత్తకాని ఒకానొక పురుషుఁడు), అసౌ=ఉపాసనచేయఁబడెడి ఈదైవము, అన్యః=ఉపాసించెడి నాకంటె వేఱు. అస్మీతి=అగుచున్నానని, దేవతాం=ఉపాస్యమైన దేవతను, అన్యాం=ఉపాసించెడి తనకంటెవేఱుగాను, ఉపాస్తే=ఉపాసించుచున్నాఁడో (ధ్యానించుచున్నాఁడో), సః = అట్టిఅజ్ఞాని, (తత్త్వం=పరబ్రహ్మతత్త్వమును), నవేద=తెలిసికొనఁడు. యథా=ఏ

ప్రకారము, పశుః=గవాశ్వాదికము, (వాహనదోహనాద్యుపకారైః= వాహనము పితుకుట మొదలైన యుపకారములచేతను, ఉపభుజ్యతే= అనుభవింపఁబడుచున్నదో), ఏవం=ఈప్రకారము, సః=ఆ అజ్ఞాని, దేవానాం=అగ్నీంద్రాది దేవతలకు, (ఇజ్యాద్యనేకోపకారైః=యాగము మొదలైన అనేకోపకారములచేతను, భోజ్యః = అనుభవించఁదగిన వాఁడు), యథా=ఏప్రకారము, హవై =ప్రసిద్ధముగా, బహవః=అనేకములగు, పశవః=గవాశ్వాదిపశువులు, మనుష్యం=మనుజుని, (తమకు ప్రభువైన మనుజుని), భుఞ్జ్యుః=పాలించునో, ఏవం=ఈప్రకారము, ఏకైకః=ఒక్కొకఁడగు, పురుషః=పురుషుఁడు, దేవాన్=దేవతలను, భునక్తి=పాలించుచున్నాఁడు. (తత్ర=దానివిషయమై, లోకే=లోకమునందు, బహుపశుమతః=అనేకపశువులుగలవానికి, యథా=ఏ ప్రకారము), ఏకస్మిన్నేవ=ఒక్కటియగు, పశౌ=పశువు, (వ్యాఘ్రాదినా= పులి మొదలైనదానిచేత), అదీయమానేసతి=అపహరింపఁబడుచుండగా, అప్రియం=అనిష్టము, భవతి=కలుగుచున్నదో, (తథా=ఆప్రకారము, బహుషు=అనేకములగు పశుస్థానీయుఁగా నుండెడి, ఏకస్మిన్నేవపురుషే =ఒక్కఁడగు పురుషుఁడు, పశుభావాత్=పశుభావమునుండి, ఉత్తిష్ఠతి సతి=లేచుచుండగా, అజ్ఞానమునుండి విడుచుచుండగా, దేవానాం= దేవతలకు, అప్రియంభవతీతి = అనిష్టమగుచున్నదని), కిము=ఏమిచెప్ప వలయును? మనుష్యాః=మనుజులు, యదేతత్=ఏ ఈ బ్రహ్మాత్మత్వ మును, (కథంచన=అతికష్టముతో), విద్యుః=తెలిసికొందురో, తత్= అది, ఏషాం=ఈ దేవతలకు, తస్మాత్=ఆ అప్రియమను కారణము నుండి, ప్రియం=ఇష్టమయినది, న=కాదు.

తా॥ పూర్వశ్లోకమునందలి ప్రశ్నలకుత్తరమును సద్గురువు చెప్పుచున్నాఁడు. ఓ మనుజులారా! ఈ కనుపడెడి సర్వము పర బ్రహ్మజ్ఞానముకంటె పూర్వము పరబ్రహ్మముగానే ఉండెను. అట్టి పరబ్రహ్మము మాయాస్వరూపములగు బ్రహ్మాదిశరీరములయందు

ను ప్రవేశించి ఆయా శరీరసంబంధములైన నామరూపాదులచేత నేను, నాసంబంధమైనది, నీవు, నీ సంబంధమైనది, యనుచు స్వస్వరూప విస్మృతివల్లనైన భ్రమజ్ఞానముచేనగు దేహాద్యధ్యారోపణములు గలదై సద్గురుకటాక్షాదులను నిమిత్తముద్వారా ఆ అజ్ఞానాగతములైన దేహాద్యధ్యారోపములుపోగా, తాను పరబ్రహ్మమాత్రమై నేను పరబ్రహ్మమైతినని శేషించుచున్నది. అట్లుండుటయే తన్నుతాను చూచుకొనుట యను వ్యవహారము. అట్లు తెలిసికొనుటవలన సర్వము తానగుచున్నది. ఈప్రకారము దేవతలలోపలనైనను, ఋషులలోపలనైనను, మనుజులలోపనైనను తెలిసికొనువాఁడు అపరబ్రహ్మమగుచున్నాఁడు. అందుకు దృష్టాంతమేమనఁగా, వామదేవుఁడను ఋషి ఈదేహమునందు ప్రవేశించియున్న ఆ పరబ్రహ్మస్వరూపమును చూచుచు నేను మనువును, నేను సూర్యుడను, ఆయితినని సర్వాత్మభావమునుపొందెను. ఈప్రకారము సమస్తభూతములయందు దనుసరించి ప్రవేశించియున్న దర్శనక్రియాది లిఙ్గములుగల ప్రకృతమునందలి పరబ్రహ్మమును ఎవఁడు నేను పరబ్రహ్మమునైతినని తెలిసికొనుచున్నాఁడో వాఁడు సర్వాత్మభావమును పొందుచున్నాఁడు. అట్టి బ్రహ్మవేత్తయొక్క సర్వాత్మభావమును భంగపఱుచుటకు దేవతలును సమర్థులుకారు. అట్టి బ్రహ్మవేత్తయే దేవతలకును ఆత్మయగుచున్నాఁడు. ఇట్లు బ్రహ్మవేత్తస్వరూపమును చెప్పి, తిరిగి బ్రహ్మవేత్త కాని వానిస్వరూపమును చెప్పుచున్నాఁడు. బ్రహ్మవేత్త కానివాఁడు ఉపాస్యయగుదేవతను ఉపాసించుతన్ను వేఱుగాఁదలంచుచున్నాఁడు. అట్లు తలంచెడివాఁడు పరబ్రహ్మతత్త్వమును తెలిసికొనఁడు. అట్టివాఁడు, లోకమునందు జనులచేత గవాశ్వాదిపశువులు వాహనదోహనాద్యుపకారములచేత అనుభవింపఁబడినట్లు దేవతలకు యాగాద్యుపకారములతో అనుభవించఁదగిన వాఁడగుచున్నాఁడు. ఇట్లు కర్మయందధికృతుఁడైన వీఁడు శాస్త్రవిహితకర్మగలవాఁడై

మనుష్యత్వము మొదలుకొని బ్రహ్మాంతమువఱకు ఉత్కర్ష గలవాఁడును, శాస్త్రవిహితమైన కర్మలేనివాఁడై మనుష్యత్వము మొదలుకొని స్థావరాంతమువఱకు అపకర్ష గలవాఁడు నగుచున్నాఁడు. ఒక్కొకఁడగు ఇట్టి అవిద్వాంసుఁడైన పురుషుఁడు, లోకమునందు గవాశ్వాది పశువులు తమపరిపాలకుఁడగు మనుజుని క్షీర ప్రదానవాహనాద్యుపకారముల చేత పాలించునట్లు, ఇంద్రాది దేవతలు నాకు ప్రభువులు వీరికి నేను భృత్యునివలెనే స్తుతినమస్కార పూజాదులచేత ఆరాధనచేసి అభ్యుదయ నిశ్శ్రేయసరూపములైన ఫలములనుపొందఁగలనని అభినివేశము గలవాఁడై ఆ దేవతలను పాలించుచున్నాఁడు. ఇట్టిపురుషుఁడు విజ్ఞాన సంపదగలవాఁడై కర్మనువిడిచెనేని అది, లోకమునందనేక పశువులు గలవానికి ఒకపశువు వ్యాఘ్రము మొదలైన క్రూరజంతువులచేత అపహరింపఁబడుచుండగా ప్రియముకానియట్లు దేవతలక ప్రియమగుచున్నది. గనుకనే మనుజులు పరబ్రహ్మతత్త్వమును తెలిసికొనుట దేవతలకిష్టమైనది కాదు.

ఉ॥ బ్రహ్మ వా ఇదమగ్ర ఆసీదేకమేవ తదేకగ్ సన్న వ్యభవత్
తచ్ఛ్రేయోరూపమత్యసృజత క్షత్రం యాన్యేతాని దేవత్రా క్షత్రాణీన్ద్రో వరుణః సోమో రుద్రః పర్జన్యో యమో మృత్యురీశాన
ఇతి తస్మాత్క్షత్రాత్పరం నాస్తి తస్మాద్బ్రాహ్మణః క్షత్రియమధస్తాదుపాస్తే రాజసూయే క్షత్ర ఏవ తద్యశో దధాతి సైషా క్షత్రస్య యోనిర్యద్బ్రహ్మ తస్మాద్యద్యపి రాజా పరమతాం గచ్ఛతి బ్రహ్మైవాన్తత ఉపనిశ్రయతి స్వాం యోనిం య ఉ ఏనగ్ హినస్తిస్వాగ్ స యోనిమృచ్ఛతి స పాపీయాన్ భవతి యథా శ్రేయాగ్ సగ్ హిగ్ సిత్వా. ॥11॥

ప॥ బ్రహ్మ - వై - ఇదం - అగ్రే - ఆసీత్ - ఏకం - ఏవ తత్ - ఏకం - సత్ - న - వ్యభవత్ - తత్ - శ్రేయోరూపం అత్యసృజత - క్షత్రం - యాని - ఏతాని దేవత్రా - క్షత్రాణి -

ఇన్ద్రః - వరుణః - సోమః - రుద్రః-పర్జన్యః - యమః - మృత్యుః-
- ఈశానః - ఇతి - తస్మాత్ - క్షత్రాత్ - పరం - న - అస్తి -
తస్మాత్ - బ్రాహ్మణః - క్షత్రియం - అధస్తాత్ - ఉపాస్తే - రాజ
సూయె - క్షత్రే - ఏవ - తత్ - యశః - దధాతి - సా - ఏషా-
క్షత్రస్య - యోనిః - యత్ - బ్రహ్మ - తస్మాత్ - యది - అపి -
రాజా - పరమతాం - గచ్ఛతి - బ్రహ్మ - ఏవ - అన్తతః - ఉపని
శ్రయతి - స్వాం - యోనిం - యః - ఉ - ఏనం - హినస్తి - స్వాం-
సః - యోనిం - ఋచ్ఛతి - సః - పాపీయాన్ - భవతి - యథా -
శ్రేయాంసం - హింసిత్వా.

ప్ర॥ ఇదం = ఈక్షత్రాదిజాతము, అగ్రే = ఈక్షత్రాదిసృష్టికి పూర్వము, ఏకమేవ=ఒక్కటేయగు, (అభిన్నమగు), బ్రహ్మవై= అగ్నిస్వరూపమును పొందియున్న బ్రహ్మముగానే, ఆసీత్=ఉండెను. (అగ్నిబ్రాహ్మణ జాత్యభిమానమువలన బ్రహ్మయని చెప్పఁబడు చున్నది). తత్ = ఆబ్రహ్మము, ఏకంసత్ = క్షత్రాదిపాలయిత్రాది శూన్యమై, (క్షత్రియులు మొదలైన వారిపరిపాలనాదులులేనిదై కర్మ కొఱకు), నవ్యభవత్=సమర్థముకాకపోయెను. తత్ = ఆబ్రహ్మము, (నేను బ్రాహ్మణుఁడనైతిని నాకీప్రకారము చేయఁదగినదని బ్రాహ్మణ జాతిచేత నెరవేర్చఁదగినకర్మనుచేయ నిచ్ఛయించుటచేత తనకు కర్మ కర్తృత్వవిభూతికొఱకు), శ్రేయోరూపం=ప్రశస్తరూపమగు, క్షత్రం =క్షత్రియజాతిని, అత్యసృజత=మిక్కిలిసృజించెను. ఏతానిక్షత్రాణి= ఈక్షత్రియజాతియందు ప్రసిద్ధికెక్కిన స్వరూపములు, దేవత్రా=దేవ తలయందు, యాని=ఎవియో, (తాని=అవి), ఇన్ద్రః=ఇంద్రుఁడును, వరుణః=వరుణుఁడును, సోమః=చంద్రుఁడును, రుద్రః = రుద్రుఁడును, పర్జన్యః=పర్జన్యుఁడును, యమః=యముఁడును, మృత్యుః = మృత్యు వును, ఈశానః = ఈశానుఁడును, ఇతి = ఇవి; (దేవతలకును, జల జంతువులకును, బ్రాహ్మణులకును, పశువులకును, మెఱుపు మొదలైన

వాటికిని, పితరులకును, రోగాదులకును, కాంతులకును, ఈ చెప్పఁబడిన ఇంద్రాదులు క్రమముగా పట్టాభిషేకమును పొందిన ప్రభువులు. ఇట్లు ఏ కారణమువలన బ్రాహ్మణజాతికంటె నతిశయముగా క్షత్రియజాతి సృజింపఁబడినదో), తస్మాత్=ఆ కారణమువలన, క్షత్రాత్=క్షత్రియ జాతికంటె. పరం=శ్రేష్ఠమైనది, నాస్తి=లేదు. తస్మాత్=అందువల్లనె, బ్రాహ్మణః = బ్రాహ్మణుఁడు, రాజసూయే = రాజసూయయాగము నందు, అధస్తాత్ =క్రిందనుండువాఁడై, క్షత్రియం=క్షత్రియుని, (ఉపరి స్థితం = మీఁదనుండువానినిగా), ఉపాస్తే = ఉపాసించుచున్నాఁడు. క్షత్రఏవ = క్షత్రియునియందే, తత్=ఆ తనసంబంధమైన. యశః= ఖ్యాతిని, దధాతి = ఉంచుచున్నాఁడు. (రాజసూయయాగమునందభి షిక్తుఁడైన రాజుచేత బ్రహ్మన్ అని పిలువఁబడిన ఋత్విక్కు తిరిగి ఆ రాజునకు నూర్చి, ఓ రాజా ! నీవు బ్రహ్మవైతివని పలుకుచున్నాఁడు. గను కనే రాజసూయమందు బ్రాహ్మణుఁడు తనసంబంధమైన యశస్సును క్షత్రియునియందుంచుచున్నాఁడని చెప్పఁబడినది). యత్ = ఏ కార ణమునుండి, క్షత్రస్య = క్షత్రియునకు, సైషా=ఆ ఈ ప్రకృతమగు, యోనిః=ఉత్పత్తిస్థానము, బ్రహ్మ=బ్రాహ్మణుఁడో, తస్మాత్=ఆ కార ణమునుండి, యద్యపి = విచారించగా, రాజా = క్షత్రియుఁడు, పర మతాం=శ్రేష్ఠతను, గచ్ఛతి=పొందుచున్నాఁడు. అన్తతః = కర్మ సమాప్తియందు, స్వాం యోనిం = తనదియగు నుత్పత్తిస్థానమైన, బ్రహ్మైవ=బ్రాహ్మణునే, (బ్రాహ్మణజాతినే) ఉపనిశ్రయతి=ఆశ్రయించు చున్నాఁడు. యఉ=ఎవడైతే, ఏనం=ఈ బ్రాహ్మణజాతిని, (బ్రాహ్మ ణుని), హినస్తి = హింసించుచున్నాఁడో, (తిరస్కారభావము తోఁ జూచుచున్నాఁడో), సః=వాఁడు, స్వాం = తన సంబంధ మగు, యోనిం = ఉత్పత్తి స్థానమును, ఋచ్ఛతి = నశింపఁజేయు చున్నాఁడు. (ఇట్లుచేసి), సః = వాఁడు, లోకే=లోకమునందు, జనః= జనుఁడు), శ్రేయాంసం = మిక్కిలి ప్రశస్తమైనవానిని, హింసిత్వా=

హింసించి, యథా=ఏప్రకారము, (పాపతరః=మిక్కిలి పాపాత్ముఁడు, భవతి=అగుచున్నాఁడో, తద్వత్=ఆప్రకారమే) పాపీయాన్=మిక్కిలి పాపాత్ముఁడు, భవతి=అగుచున్నాఁడు.

తా॥ ఇంతకుపూర్వము ప్రజాపతియొక్క సృష్టిపూరణము కొఱకు అగ్నియొక్క సృష్టి చూపింపఁబడినది. ఈ ఇంద్రాదిసృష్టియును అక్కడనే చూచుకొనఁదగినది. ఇది దానికి శేషమగుటవలన అవిద్వాంసునికి కర్మాధికార హేతువును చూపించుటకు ఆ ఇంద్రాదిసృష్టియే ఇక్కడ చెప్పఁబడుచున్నది, క్షత్రాదిసృష్టికిముందీక్షత్రజాతము అభిన్నమై అగ్నిస్వరూపమును పొందియున్న బ్రహ్మముగానే యుండెను. (అనఁగా అగ్నియే బ్రహ్మము). అట్టి బ్రహ్మము క్షత్రియులు మొదలైన వారి పరిపాలనాదులు లేనిదై కర్మచేయుటకు సమర్థము కాకపోయెను. ఇట్టి బ్రహ్మము, నేను బ్రాహ్మణుడనై తిని, నాకిట్లు చేయఁదగినదని బ్రాహ్మణజాతిచే నెరవేర్పఁదగిన కర్మనుచేయ నిచ్ఛయించుటచేత తనకు కర్మనుచేయుటకు తగిన ఐశ్వర్యముకొఱకు ప్రశస్తమగు క్షత్రియజాతిని మిక్కిలి సృజించెను. ఆ క్షత్రియజాతియందు దేవతలలోఁ బ్రసిద్ధులగువారలెవరనిన, దేవతలకు ప్రభువైన ఇంద్రుఁడును, జలజంతువులకు ప్రభువైన వరుణుఁడును, బ్రాహ్మణులకు ప్రభువగు చంద్రుఁడును, పశువులకు ప్రభువగు రుద్రుఁడును, మెఱుపులు మొదలైనవానికి ప్రభువైన పర్జన్యుఁడును, పితరులకు ప్రభువగు యముఁడును, రోగాదులకు ప్రభువగు మృత్యువును, తేజస్సులకు ప్రభువగు ఈశానుఁడును, ఇట్లు వీరలు బ్రాహ్మణజాతికంటె నతిశయముగా క్షత్రియజాతియందు సృజింపఁబడిరి. గనుకనే క్షత్రియజాతికంటె శ్రేష్ఠమగునది లేదు. అందువలననే బ్రాహ్మణుఁడు రాజసూయయాగమునందు క్షత్రియునికి తగ్గినవాఁడై క్షత్రియుని అధికునిగా నెంచి సేవించుచు ఆ రాజుచేత తాను, ఓ బ్రహ్మన్ అని పిలువఁబడియును, ఓ రాజా! నీవు బ్రహ్మస్వరూపివైతివని తన సంబంధమగు ఖ్యాతిని ఆ

రాజానం దుంచుచున్నాఁడు. అట్టి బ్రాహ్మణుని రాజు కర్మాన్తమునందు మిక్కిలి హీనతతో నాశ్రయించువాఁడై శ్రేష్ఠతను పొందుచున్నాఁడు. ఇటువంటి బ్రాహ్మణుని ప్రమాదమువల్ల నైనను తిరస్కారభావముతోఁ జూచెడిరాజు, తనసంబంధమగు నుత్పత్తిని నశింపఁజేయువాఁడై లోకమునందలి జనుఁడు మిక్కిలి ప్రశస్తమగువారిని హింసించి యెట్లు పాపాత్ముఁడగునో ఆ విధముగానే, మిక్కిలి పాపాత్ముఁడగుచున్నాఁడు.

ఉ॥ స నైవ వ్యభవత్ స విశమసృజత యాన్యేతాని దేవజాతాని గణశ
అఖ్యాయన్తే వసవో రుద్రా ఆదిత్యా విశ్వేదేవా మరుత ఇతి.॥12॥

ప॥ సః – న – ఏవ – వ్యభవత్ – సః – విశం – అసృజత – యాని – ఏతాని – దేవజాతాని – గణశః – ఆఖ్యాయన్తే – వసవః – రుద్రాః – ఆదిత్యాః – విశ్వేదేవాః-మరుతః – ఇతి.

ప్ర॥ సః=ఆపురుషుఁడు, (నేను బ్రాహ్మణుఁడనైతి ననెడి అభిమానముగల ఆ పురుషుఁడు క్షత్రియసృష్టియందును కర్మచేయుటకు), నైవవ్యభవత్=సమర్థుఁడే కాకపోయెను. సః=ఆ పురుషుఁడు, విశం=వైశ్యజాతిని, అసృజత=సృజించెను. ఏతాని=ఈ, దేవజాతాని=దేవతలయందు త్పన్నములైన, యాని=ఏ రూపములుగలవో, (తాని=అవి), గణశః=గణముల ప్రకారము, వసవః=అష్టవసువులును, రుద్రాః=ఏకాదశ రుద్రులును, ఆదిత్యాః=ద్వాదశాదిత్యులును, విశ్వేదేవాః=పదుముగ్గురు విశ్వేదేవులును, మరుతః=ఏడుగురు మరుత్తులును, ఇతి=అని, ఆఖ్యాయన్తే=చెప్పఁబడుచున్నవి.

తా॥ ఆ పరమాత్మ క్షత్రియసృష్టిని చేసియును క్షత్రియసృష్టికి పూర్వము వలెనే ధనము నార్జించువారు లేకపోవుటవలన కర్మచేయుటకు సమర్థుఁడు కానివాఁడై వైశ్యజాతిని సృష్టించెను. ఆ వైశ్యజాతి ఏర్పడినది, దేవతలయందు ఎనిమిదిమంది వసువులును, పదునొకండుగురు రుద్రులును, పండ్రెండుగురు ఆదిత్యులును, పదుముగ్గురు విశ్వేదేవులును, ఏడుగురు మరుత్తులును, వీరలు వైశ్యగణములుగాఁ జెప్పఁ

బడుచున్నారు. ఈ వైశ్యులు గణములుగాఁ జెప్పుటకు కారణమేమనిన, ఇప్పటికిని లోకమునందు వైశ్యుల సముదాయమే ప్రాధాన్యముగాఁ గలవారు గనుక అట్లు చెప్పఁబడినది.

ఉ॥ స నైవ వ్యభవత్ స శౌద్రం వర్ణమసృజత పూషణమియం వై పూషేయగ్ హీదగ్ సర్వం పుష్యతి యదిదం కించ. ॥13॥

ప॥ సః - న - ఏవ - వ్యభవత్ - సః - శౌద్రం - వర్ణం - అసృజత - పూషణం - ఇయం - వై - పూషా - ఇయం - హి - ఇదం - సర్వం - పుష్యతి - యత్ - ఇదం - కించ.

ప్ర॥ సః=ఆ పురుషుఁడు, (కర్మచేయుటకు); నైవవ్యభవత్=సమర్థుఁడే కాకపోయెను. సః=ఆ పురుషుఁడు, పూషణం=వృద్ధిపొందించునట్టి, శౌద్రంవర్ణం=శూద్రజాతిని, అసృజత=సృష్టించెను. (ఈ వృద్ధిపొందించెడి పూషయనునది యేదియనిన), ఇయంవై=ఈ భూమియే, పూషా=పూషా అని చెప్పఁబడుచున్నది. ఇయంహి=ఈ భూమియే, యదిదంకించ = ఈ చూడఁబడెడి, సర్వమిదం = ఈ సమస్తమును, పుష్యతి=వృద్ధి పొందించుచున్నది.

తా॥ ఆ పరమాత్మ ధనపరిపాలకమగు శూద్రజాతి లేకపోవుట వలన కర్మచేయుట కసమర్థుఁడై సర్వమును పరిపాలించి వృద్ధిపొందించునట్టి శూద్రజాతిని సృజించెను. సర్వమును వృద్ధిపొందించి, శూద్రజాతియై పూషయను పేరును పొందునది యేదియనిన, ఈ చూడఁబడెడి సర్వమును వృద్ధిపొందించునట్టి ఈ భూమియే. ఇదియే శూద్రజాతియై పూషయను పేరుతో వ్యవహరింపఁబడుచున్నది.

ఉ॥ స నైవ వ్యభవత్తచ్ఛ్రేయోరూపమత్యసృజత ధర్మం తదేతత్క్షత్రస్య క్షత్రం యద్ధర్మస్తస్మాద్ధర్మాత్పరం నాస్త్యథో అబలీయాన్ బలీయాగ్ సమాశగ్ సతే ధర్మేణ యథా రాజ్ఞైవం యో వై స ధర్మః సత్యం వై తత్తస్మాత్సత్యం వదన్తమాహుర్ధర్మం వదతీతి ధర్మం వా వదన్తగ్ సత్యం వదతీత్యేతద్ధ్యేవైతదుభయం భవతి ॥14॥

ప॥ సః - న - ఏవ - వ్యభవత్ - తత్ - శ్రేయోరూపం - అత్యసృజత - ధర్మం - తత్ - ఏతత్ - క్షత్రం - యత్ - ధర్మః - తస్మాత్ - ధర్మాత్ - పరం - న - అస్తి - అథో - అబలీయాన్ - బలీయాంసం - ఆశంసతే - ధర్మేణ - యథా - రాజ్ఞా - ఏవం - యః - వై - సః - ధర్మః - సత్యం - వై - తత్ - తస్మాత్ - సత్యం - వదన్తం - ఆహుః - ధర్మం - వదతి - ఇతి - ధర్మం - వా - వదన్తం - సత్యం - వదతి - ఇతి - ఏతత్ - హి - ఏవ - ఏతత్ - ఉభయం - భవతి.

ప్ర॥ సః=ఆపరమాత్మ, నైవవ్యభవత్=సమర్థుఁడు కాకపోయెను. (చతురః=నాలుగైన, వర్ణాన్=వర్ణములను, సృష్ట్వాపి=సృజించియును, క్షత్రియజాతి నియామకమగు వేరొకదాని భయము లేకపోవుటచే నుగ్రమగుటవలన ఆ క్షత్రియజాతికి నియామకమగు), తత్ = ఆ, శ్రేయోరూపం=ప్రశస్తరూపమగు, ధర్మం=ధర్మమును, అత్యసృజత=మిక్కిలి సృజించెను. క్షత్రస్య=క్షత్రియజాతికి, క్షత్రం=నియామకమగు, తదేతత్=ఆ ఈప్రశస్తమైన, ధర్మః = ధర్మము, యత్ = ఏదియో, తస్మాత్=అటువంటి, (ఆ క్షత్రియజాతికి నియామకమగు), ధర్మాత్=ధర్మముకంటె, పరం=శ్రేష్ఠమగునది, నాస్తి=లేదు. (లోకే=లోకమునందు, కుటుంబికః జనః=కుటుంబవంతుఁడగు జనుఁడు), రాజ్ఞా=రాజుచేత, యథా=ఏ ప్రకారమో, ఏవం=ఈప్రకారము, అబలీయానథో=బలములేనివాఁడును, బలీయాంసం = బలము గలవానిని, ధర్మేణ = ధర్మబలముచేత, (జేతుం=జయించుటకు), ఆశంసతే=కోరుచున్నాఁడు. సః=ఆ, ధర్మః=ధర్మము, యో వై=ఏదియో, తత్=అది, సత్యం వై = సత్యమే, (సత్యమనఁగా శాస్త్రోక్తమైనఅర్థము. అదిజనులచేత ననుష్ఠింపఁబడినదై ధర్మమనుపేరుగల దగుచున్నది. శాస్త్రార్థముగాఁ దెలియఁబడినదే సత్యమగుచున్నది). తస్మాత్ = ఆకారణమువలన, సత్యం=సత్యమును, వదన్తం=చెప్పుచున్న వానిని, ధర్మం=ధర్మమును, వదతీతి=పలుకుచున్నాఁడనిన్ని, ధర్మంవా=ధర్మమునైనను, వదన్తం=

చెప్పుచున్నవానిని, సత్యం = సత్యమును, వదతీతి = చెప్పుచున్నాఁడని, (ఈరెంటిని తెలిసిన సమీపమందుండు జనులు), అహుః = చెప్పిరి, ఏతత్ = ఈసత్యధర్మలక్షణమగు, ఉభయం = ఉభయరూపమును, ఏతద్ధ్యేవ = ఈధర్మమే, భవతి = అగుచున్నది. (అనఁగా ఆమొదట చెప్పిన ధర్మమే అగుచున్నది).

తా॥ ఆపరమాత్మ ఇట్లు బ్రాహ్మణాది నాలుగుజాతులను సృజించియును అత్యుగ్రమైన క్షత్రియజాతికి నియామకమగు నదిలేక పోవుటచేతను కర్మచేయుట కసమర్థుఁడై, ఆక్షత్రియజాతిని నియమించునట్టి ప్రశస్తమగు ధర్మమును సృజించెను. ఇట్టి ధర్మముకంటె శ్రేష్ఠమైనది లేదు. లోకమునందు కుటుంబియగుజనుఁడు, బలవంతునిచే భార్యాదుల నపహరింపఁబడినవాఁడై రాజబలముచే నెట్లుజయించునో, ఆప్రకారము బలహీనుఁడును బలవంతుని ఈ పూర్వము చెప్పిన ధర్మబలముచే జయించుటకు కోరుచున్నాఁడు. అట్టి ధర్మమే యథాశాస్త్రీయమైన అర్థము. (అనఁగా సత్యము). ఇదియే జనులచే నమష్ఠింపఁబడినదై ధర్మమను పేరుగల దగుచున్నది. గనుకనే లోకమునందు, సత్యధర్మములను రెంటిని తెలిసికొని సమీపమందుండువారు, సత్యమును చెప్పెడివానిని ధర్మము చెప్పువాఁడనియును, ధర్మమును చెప్పెడివానిని సత్యమును చెప్పువాఁడనియును, చెప్పుచున్నారు. సత్యధర్మ లక్షణోభయరూపమగు నిదియే పరమాత్మచేత సృజింపఁబడిన క్షత్రియజాతిని నియమించునట్టి ధర్మము.

ఉ॥ తదేతద్బ్రహ్మ క్షత్రం విట్చూద్రస్తదగ్నినైవ దేవేషు బ్రహ్మభవద్బ్రాహ్మణో మనుష్యేషు క్షత్రియేణ క్షత్రియో వైశ్యేన వైశ్యః శూద్రేణ శూద్రస్తస్మాదగ్నావేవ దేవేషు లోకమిచ్ఛన్తే బ్రాహ్మణే మనుష్యేష్వేతాభ్యాగ్ హి రూపాభ్యాం బ్రహ్మాభవత్ అథ యో హ వా అస్మాల్లోకాత్స్వం లోకమదృష్ట్వా ప్రైతి స ఏనమ విదితో న భునక్తి యథా వేదో వా ఉనమా

క్తోన్యద్వా కర్మాకృతం యదిహ వా అప్యనేవం విన్మహత్పుణ్యం కర్మ కరోతి తద్ధాస్యాన్తతః క్షీయత ఏవాత్మానమేవ లోకము పాసీత స య ఆత్మానమేవ లోకముపాస్తే న హాస్య కర్మక్షీయతే అస్మాద్ధ్యేవాత్మనో యద్యత్కామయతే తత్తత్సృజతే. ॥15॥

ప॥ తత్ - ఏతత్ - బ్రహ్మ - క్షత్రం - విట్ - శూద్రః- తత్ - అగ్నినా - ఏవ - దేవేషు - బ్రహ్మ - అభవత్ - బ్రాహ్మణః - మనుష్యేషు - క్షత్రియేణ - క్షత్రియః - వైశ్యేన - వైశ్యః - శూద్రేణ - శూద్రః - తస్మాత్ - అగ్నౌ - ఏవ- దేవేషు - లోకం- ఇచ్ఛన్తే - బ్రాహ్మణే - మనుష్యేషు - ఏతాభ్యాం - హి - రూపాభ్యాం - బ్రహ్మ - అభవత్ - అథ - యః - హవై - అస్మాత్ - లోకాత్ - స్వం - లోకం - అదృష్ట్వా - ప్రైతి - సః - ఏనం - అవిదితః - న - భునక్తి - యథా - వేదః - వా - అననూక్తః - అన్యత్ - వా - కర్మ - అకృతం - యత్ - ఇహ - వై - అపి- అనేవంవిత్ - మహత్ - పుణ్యం - కర్మ-కరోతి - తత్ - హ - అస్య - అన్తతః - క్షీయతే - ఏవ ఆత్మానం - ఏవ లోకం - ఉపాసీత - యః - ఆత్మానం - ఏవ - లోకం - ఉపాస్తే - న - హ - అస్య - కర్మ - క్షీయతే - అస్మాత్ - హి - ఏవ - ఆత్మనః - యత్ - యత్ - కామయతే - తత్ - తత్ - సృజతే.

ప్ర॥ ఏతత్=ఈ, బ్రహ్మ = బ్రాహ్మణజాతియును, క్షత్రం= క్షత్రియజాతియును, విట్=వైశ్యజాతియును, శూద్రః = శూద్రజాతియును, (ఈసృజింపఁబడిననాలుగుజాతులును), తత్=ఆపరబ్రహ్మమే. తత్=ఆపరబ్రహ్మము, దేవేషు=దేవతలమధ్యమునందు, అగ్నినైవ= అగ్నిస్వరూపముతోనే, బ్రహ్మ=బ్రాహ్మణజాతి, అభవత్=ఆయెను. మనుష్యేషు=మనుష్యులయందు, (బ్రాహ్మణేన = బ్రాహ్మణస్వరూపముతో), బ్రాహ్మణః = బ్రాహ్మణజాతిగాను, క్షత్రియేణ=క్షత్రియస్వరూపముతో, క్షత్రియః=క్షత్రియజాతిగాను, వైశ్యేన=వైశ్యస్వరూ

పముతో, వైశ్యః = వైశ్యజాతిగాను, శూద్రేణ = శూద్రస్వరూప
ముతో, శూద్రః=శూద్రజాతిగాను, (అభవత్=ఆయెను). తస్మాత్
=అందువలన, దేవేషు=దేవతలలోపల, అగ్నావేవ=అగ్నియందే,
లోకం=ఫలమును. ఇచ్ఛన్తే = కోరుచున్నారు. (దేవతలనిమిత్తమై
అగ్నియందు కర్మచేసి కర్మఫలమును కోరుచున్నారు). మనుష్యేషు
=మనుష్యులలోపల, బ్రాహ్మణే=బ్రాహ్మణత్వమునందు, (లోకం=
కర్మఫలములను, ఇచ్ఛన్తి = కోరుచున్నారు). ఏతాభ్యాంహిరూపా
భ్యాం=ఈ బ్రాహ్మణాగ్నిరూపములతోనే, బ్రహ్మ = పరబ్రహ్మము,
(స్రష్టృరూపమైనబ్రహ్మము, సాక్షాత్ = ప్రత్యక్షము), అభవత్=
ఆయెను. అథ = మఱియును, యః = ఎవఁడు, హవై=ప్రసిద్ధముగా,
అస్మాల్లోకాత్=ఈలోకమునుండి, (అవిద్యాకామకర్మ హేతుకమును
సంసారాత్మకమును, పిండాత్మకమును అగ్న్యధీనకర్త్రాభిమానత్వేన
ఆగన్తుకమును బ్రాహ్మణత్వరూపమునైన ఈలోకమునుండి), స్వం
లోకం = ఆత్మయనుపేరుగల లోకమును, అదృష్ట్వా = చూడకయే,
(నేను = బ్రహ్మనైతినని చూడకయే), ప్రైతి = మరణమునుపొందు
చున్నాఁడో, ఏనం=వీనిని, అవిదితః = తెలియఁబడని, సః=ఆ ఆత్మ
లోకము, అననూక్తః=అధ్యయనము చేయఁబడని, వేదః=వేదమున్ను,
అన్యత్=ఇతరమగు, అకృతః=చేయఁబడని, కర్మవా =కృషి మొద
లైన కర్మయును, యథా=ఏప్రకారమో, (అధ్యయనము చేయఁబడని
వేదముకర్మమును తెలియఁజేయుటచేతను, తాను చేయని కృష్యాది
కర్మఫలమును ఇచ్చుటచేతనున్ను జనుని ఎట్లుపాలించదో), (తథా=
ఆప్రకారము), నభునక్తి=పరిపాలించదు. యద్యపి=మఱియును, అనే
వంవిత్ = ఈపూర్వోక్తప్రకారము ఆత్మస్వరూపమును తెలియని
వాఁడు, హవై ప్రసిద్ధముగా, మహత్=అధికమైన, పుణ్యంకర్మ =
పుణ్యకర్మను (విస్తారమగు అశ్వమేధాదికర్మను), కరోతి = చేయు
చున్నాఁడు. అస్య = ఈ అవిద్వాంసునియొక్క, తత్=ఆ పుణ్యకర్మ

యును, అన్తతః=అంతమునందు, (ఫలోపభోగముయొక్క అంతము నందు), క్షీయత ఏవ=నశించునదే. (అతః=అందువలన), ఆత్మానమేవ లోకం=ఆత్మలోకమునే, ఉపాసీత = ఉపాసింపవలయును. (ధ్యానించ వలయును). సయః=అటువంటివాఁడెవఁడు, ఆత్మానమేవలోకం = ఆత్మ లోకమునే, ఉపాస్తే = ఉపాసించుచున్నాఁడో, అస్య = వీనియొక్క, కర్మహ=కర్మయును, నక్షీయతే = నశించదు. (ఉపాసకః = ఉపాస కుఁడు), యద్యత్=దేనిదేని, కామయతే=కోరుచున్నాఁడో, తత్తత్ =దానిదాని, అస్మాద్ధ్యేవాత్మనః=ఈ ఆత్మనుండియే, సృజతే=సృజించు చున్నది. (ఆ ఆత్మ లోకమునుండియే ఇష్టమయిన సమస్తమును గలుగుచున్నది).

తా॥ ఈ చెప్పఁబడిన బ్రహ్మక్షత్రియ వైశ్యశూద్రాత్మక మయిన చాతుర్వర్ణ్యము అపరబ్రహ్మము. అపరబ్రహ్మ దేవతలలో అగ్నిరూపముతో బ్రాహ్మణజాతిగాను, మనుష్యులలో బ్రాహ్మణ స్వరూపముతో బ్రాహ్మణజాతిగాను దేవతలలో ఇంద్రాద్యధిష్ఠితమైన క్షత్రియజాతియై మనుష్యులయందు క్షత్రియస్వరూపముతో క్షత్రియ జాతిగాను, దేవతలలో వస్వాద్యధిష్ఠితమైన వైశ్యజాతియై మనుష్యుల యందు వైశ్యస్వరూపముతో వైశ్యజాతిగాను, దేవతలలో సర్వవస్తు పోషకమగు పృథివీరూపమైన శూద్రజాతియై మనుష్యులయందు శూద్ర స్వరూపముతో శూద్రజాతిగాను అయినది. ఇట్లు పరబ్రహ్మము దేవతల లోను మనుష్యులలోను మొదట అగ్ని బ్రాహ్మణ స్వరూపముతోఁ బ్రత్యక్షమాయెను. గనుకనే బ్రాహ్మణులు దేవతల నిమిత్తమై అగ్ని యందుకర్మను చేసి కర్మఫలమునుకోరుచున్నారు. బ్రాహ్మణత్వమునందు తపోరూపాదికర్మఫలములను కోరుచున్నారు. మఱియు అవిద్యాకామ కర్మహేతుకమును, సంసారాత్మకమును, కరచరణాది దేహాకృతియైన పిండాత్మకమునగు ఈ లోకమునుండి నేను పరబ్రహ్మస్వరూపమైతి ననియెడి ఆత్మలోకమును చూడకయే మరణముపొందువానిని తెలియఁ

బడని ఆ ఆత్మలోకము, చదువుకొనని వేదము కర్మను తెలియజేయుట చేతనున్ను, తాను చేయని కృష్యాదికర్మ, ఫలమును ఇచ్చుటచేత నున్ను, ఎట్లు జనుని వృద్ధి పొందించదో, ఆ విధముగానే శోకమోహ భయాది దోషమును పోగొట్టుటచేత పరిపాలించదు. ఈ పూర్వోక్త ప్రకారము ఆత్మస్వరూపమును తెలిసికొనక అధికమగు అశ్వమేధాది పుణ్యకర్మను చేయువానియొక్క ఆ పుణ్యకర్మము, ఫలోపభోగానంతరము నశించుచునే యున్నది గనుక జనుఁడు నేను పరబ్రహ్మస్వరూపినైతినని ఆత్మలోకమునే యుపాసించవలెను. అట్లుపాసించెడి వాని కర్మ నశించకయే నిత్యమగు పరబ్రహ్మమై యుపాసకుఁడు కోరెడి సర్వమును సర్వాత్మభావముతో ఆ యాత్మనుండియే సృజించుచున్నది.

ఉ॥ అథో అయం వా ఆత్మా సర్వేషాం భూతానాం లోకః స యజ్జుహోతి యద్యజతే తేన దేవానాం లోకోఽథ యదనుబ్రూతే తేన ఋషీణామథ యత్పితృభ్యో నిపృణాతి యత్ప్రజామిచ్ఛతే తేన పితౄణామథ యన్మనుష్యా న్వాసయతే యదేభ్యోఽశనం దదాతి తేన మనుష్యాణాం అథ యత్పశుభ్య స్తృణోదకం విన్దతి తేన పశూనాం యదస్య గృహేషు శ్వాపదా వయాగ్ స్యా పిపీలికాభ్య ఉపజీవ న్తి తేన తేషాం లోకోయథా హ వై స్వాయ లోకాయారిష్టిమిచ్ఛేదేవగ్ హైవంవిదే సర్వాణి భూతాన్యరిష్టిమిచ్ఛన్తి తద్వా ఏతద్విదితం మీమాంసితమ్. ॥16॥

ప॥ అథ - అయం - వై - ఆత్మా - సర్వేషాం - భూతానాం - లోకః - సః - యత్ - జుహోతి - యత్ - యజతే - తేన - దేవానాం - లోకః - అథ - యత్ - అనుబ్రూతే - తేన - ఋషీణాం - అథ - యత్ - పితృభ్యః - నిపృణాతి - యత్ - ప్రజాం - ఇచ్ఛతే - తేన - పితౄణాం - అథ - యత్ - మనుష్యాన్ - వాసయతే - యత్ - ఏభ్యః - అశనం - దదాతి - తేన - మను

ష్యాణాం - అథ - యత్ - పశుభ్యః - తృణోదకం - విన్దతి-తేన-పశూనాం - యత్ - అస్య - గృహేషు - శ్వాపదాః - వయాంసి-ఆపి ః - ఉపజీవన్తి - తేన - తేషాం - లోకః - యథా - హవై - స్వాయ - లోకాయ - అరిష్టిం ఇచ్ఛేత్ - ఏవం - హ - ఏవంవిదే - సర్వాణి - భూతాని - అరిష్టిం - ఇచ్ఛన్తి - తత్ - వై-ఏతత్ - విదితం - మీమాంసితం.

ప్ర॥ అథ=మఱియును, అయంవాఆత్మా=ఈ ఆత్మయే. (కర్మయందు అధికృతమై గృహస్థాశ్రమముగల అజ్ఞానముగల శరీరేంద్రియ సంఘాతములు మొదలైనవాటిలో. గూడుకొనినజీవాత్మ), సర్వేషాం=సమస్తములైన, భూతానాం=భూతములకు, లోకః=లోకము. (అనుభవించఁదగిన ఆత్మ). సః=ఆ ఆత్మ, యత్=దేనిని, జుహోతి=హోమము సేయుచున్నాఁడో, యత్ = దేనిని, యజతే = యాగము చేయుచున్నాఁడో, తేన = అటువంటి హోమయాగలక్షణమైన కర్మచేత, దేవానాం = దేవతలయొక్క. లోకః = లోకము, అథ = మఱియు, (సః=ఆ ఆత్మ), యత్=దేనిని, అనుబ్రూతే = అధ్యయనము చేయుచున్నాఁడో, తేన=దానిచేత, ఋషీణాం = ఋషులయొక్కయును, అథ=మఱియు, యత్=దేనిని, పితృభ్యః=పితృదేవతలకొఱకు), నిపృణాతి=ఇచ్చుచున్నాఁడో, యత్=దేనిని, ప్రజాం=సంతానమునుగూర్చి ఇచ్ఛతే=కోరుచున్నాఁడో, (సంతానము కొఱకు ప్రయత్నము చేయుచున్నాఁడో), తేన=దానిచేత, పితౄణాం=పితృదేవతలయొక్కయు, అథ=మఱియు, మనుష్యాన్=మనుష్యులను, యత్ = దేనినిగూర్చి, వాసయతే=నివసింపఁజేయుచున్నాఁడో, ఏభ్యః=ఈమనుష్యులకొఱకు, యత్=ఏ, అశనం=అన్నమును, దదాతి=ఇచ్చుచున్నాఁడో. (మనుష్యులను భూమ్యుదకాదులయొక్క దానముచేత నిలిపి నివసించియున్న ఆ మనుజులకొఱకు ఏ అన్నమును ఇచ్చుచున్నాఁడో), తేన=దానిచేతను, మనుష్యాణాం = మనుష్యులయొక్కయు, అథ = మఱియు,

పశుభ్యః=పశువులకొఱకు, యత్=ఏ, తృణోదకం=గడ్డిని ఉదకమును, విన్దతి=పొందించుచున్నాఁడో, తేన=దానిచేత, పశూనాం=పశువుల యొక్కయు, అస్య=గృహస్థగు ఈ జీవునియొక్క, గృహేషు=గృహములయందు, యత్ = బలి మొదలైనవానిని గూర్చి, శ్వాపదాః= కుక్కలు మొదలైనవియును, వయాంసి=కాకాదిపక్షులును, ఆపిపీలికాభ్యః=చీమలు మొదలైన వాటితోఁగూడ, ఉపజీవన్తి = జీవించుచున్నవో, తేన=దానిచేత, తేషాం = ఆ జంతువులయొక్కయును, లోకః=లోకముగా, (భవతి=అగుచున్నాఁడు). యథాహవై=ఏ ప్రకారముగానైతే, (లోకే = లోకమునందు), స్వాయలోకాయ = తన దేహముకొఱకు, అరిష్టిం=నాశనము లేకపోవుటను, ఇచ్ఛేత్=కోరునో, ఏవంహ=ఈ ప్రకారముగానే, ఏవంవిదే=ఇట్లు తెలిసికొనినవానికొఱకు, సర్వాణిభూతాని=సమస్త భూతములును, అరిష్టిం=నాశనము లేకపోవుటను, ఇచ్ఛన్తి=కోరుచున్నవి. తద్వాఏతత్=ఆ ఇదియే, విదితం= తెలియఁబడినది. (పంచమహాయజ్ఞప్రకరణమునందు చేయఁదగినదిగాఁ తెలియబడినది). మీమాంసితం=విచారింపఁబడినది. (అగ్నియందు హోమము చేయుచున్నాఁడు అనునది మొదలైన అవదాన ప్రకరణమందు విచారింపబడినది).

తా॥ ఇంతకుపూర్వము వర్ణాశ్రమాద్యభిమానముగల అజ్ఞాని, ధర్మముచేత నియమింపఁబడినవాఁడై పశువు వలెనే పరాధీనుఁడై దేవాదికర్మ చేయఁదగినదిగాఁ జెప్పఁబడినది. అదియే ఇక్కడ వివరింపఁబడుచున్నది. అజ్ఞానియును గృహస్థుఁడును కర్మయందధికృతుఁడునునై దేహేంద్రియాది సముదాయముతోఁ గూడుకొనిన ఈ జీవుఁడు, దేవతలు మొదలుకొని పిపీలికాన్తము వఱకుండెడి అన్ని భూతములకును అనుభవించఁదగిన ఆత్మస్వరూపిమై యున్నాడు. గృహస్థగు ఆ జీవుఁడు ఏయే కర్మ విశేషములచేత ఏయే భూతవిశేషముల కుపకారమును చేయుచున్నాఁడనిన, హోమయాగ లక్షణమైన కర్మచేత దేవతల

కును, ప్రతిదినమును స్వాధ్యాయమును అధ్యయనమును చేయుటచేత ఋషులకును, పిండోదకాదులను ఇచ్చుచు సంతానమునకు ప్రయత్నించుటచేత పితృదేవతలకును, గృహమునందతిథులగు వారలకు చోటును ఉదకమును మొదలైన వానిని ఇచ్చి అన్నమును ఇచ్చుటచేత, మనుష్యులకును, గడ్డిని ఉదకమును ఇచ్చుటచేత పశువులకును, బలియు భాండక్షాళనము మొదలైన కర్మలచేత పిపీలికములతోఁగూడ శ్వానములు మొదలైన వాటికిని, కాకాది పక్షులు మొదలైనవాటికిని, ఈ చెప్పఁబడిన హోమాదికర్మలచేత దేవతలు మొదలైన సమస్త భూతములకును, అజ్ఞానియై కర్మయం దధికృతుఁడైన జీవుఁడుపకారమును చేయుచున్నాడు. ఈ ప్రకారము ఋణముగలవాఁడు వలెనే ముఖ్యముగా దేవాది సమస్త భూతములకును ప్రత్యుపకారము చేయవలయునని తన స్వరూపమును కల్పించుకొని యుండెడి గృహస్థగు ఈ జీవుని సమస్త భూతములును, లోకమునందు జీవుఁడు తన దేహము కొఱకు నాశనరహితమును కోరినట్లు, నాశనము లేకపోవుటను కోరుచు, గృహస్థులు, తమ పశువులవలెనే అంతటను ఆ జీవుని రక్షించుచున్నవి. గనుకనే దేవతలకు, మనుష్యులు జ్ఞానులై కర్మత్యాగమును చేయుట కిష్టము లేదని చెప్పఁబడినది. దీనినే దేవ ఋషి పితృ మనుష్య భూతములను పంచయజ్ఞముల ప్రకరణమునందు తెలియఁజేయఁబడుచున్నది. ఇదియే అగ్నియందు హోమము చేయుచున్నాఁడు అనునది మొదలైన అవదాన ప్రకరణమునందును విచారింపఁబడినది.

ఉ॥ ఆత్మైవేదమగ్ర ఆసీదేక ఏవ సోఽకామయత జాయా మే స్యాదథ ప్రజాయేయాథ విత్తం మే స్యాదథ కర్మ కుర్వీయేత్యేతావాన్ వై కామో నేచ్ఛంశ్చనాతో భూయో విన్దేత్తస్మాదప్యేతర్హ్యేకాకీ కామయతే జాయా మే స్యాదథ ప్రజాయేయాథ విత్తం మే స్యాదథ కర్మ కుర్వీయేతి స యావదప్యేతేషామేకైకం న ప్రాప్నోత్యకృత్స్న ఏవ తావన్మన్యతే తస్యో కృత్స్నతా

మన ఏవాస్యాత్మా వాగ్జాయా । ప్రాణః ప్రజా చక్షుర్మానుషం విత్తం చక్షుషా హి తద్విన్దతే శ్రోత్రం దైవగ్ శ్రోత్రేణ హి తచ్ఛృణోత్యాత్మైవాస్య కర్మాత్మనా హి కర్మ కరోతి స ఏష పాఙ్క్తో యజ్ఞః పాఙ్క్తః పశుః పాఙ్క్తః పురుషః పాఙ్క్త మిదగ్ సర్వం యదిదం కించ తదిదగ్ సర్వమాప్నోతి య ఏవం వేద. ॥17॥

ఇతితృతీయాధ్యాయే చతుర్థం బ్రాహ్మణమ్.

ప॥ ఆత్మా - ఏవ - ఇదం - అగ్రే - ఆసీత్ - ఏకః - ఏవ - సః - అకామయత - జాయా - మే - స్యాత్ - అథ - ప్రజాయేయ - అథ - విత్తం - మే - స్యాత్ - అథ-కర్మ - కుర్వీయ - ఇతి - ఏతావాన్ - వై - కామః - న - ఇచ్ఛన్ - చ - న - అతః - భూయః-విన్దేత్ - తస్మాత్ - అపి - ఏతర్హి - ఏకాకీ - కామయతే - జాయా - మే - స్యాత్ - అథ - ప్రజాయేయ - అథ - విత్తం - మే - స్యాత్ - అథ - కర్మ-కుర్వీయ - ఇతి - సః - యావత్ - అపి - ఏతేషాం - ఏకైకం - న - ప్రాప్నోతి - అకృత్స్నః - ఏవ - తావత్ - మన్యతే - తస్య - ఉ - కృత్స్నతా - మనః - ఏవ - అస్య - ఆత్మా - వాక్ - జాయా - ప్రాణః - ప్రజా - చక్షుః - మానుషం - విత్తం - చక్షుషా - హి - తత్ - విన్దతే- శ్రోత్రం - దైవం - శ్రోత్రేణ - హి - తత్ - శృణోతి - ఆత్మా - ఏవ - అస్య - కర్మ - ఆత్మనా - హి - కర్మ - కరోతి - సః - ఏషః - పాఙ్క్తః - యజ్ఞః - పాఙ్క్తః - పశుః - పాఙ్క్తః - పురుషః - పాఙ్క్తః - ఇదం - సర్వం - యత్ - ఇదం - కించ - తత్ - ఇదం - సర్వం - ఆప్నోతి - యః-ఏవం - వేద.

ప్ర॥ ఇదం=జాయాది భేదముగలసర్వమును, అగ్రేః=ఈ జాయాది సృష్టికంటెపూర్వము, ఏక ఏవ=ఒక్కడే యుగు, ఆత్మైవ = జాయాది కమునకోరెడి యాత్మస్వరూపుఁడుగానే, (భార్య మొదలయినవానిని

కోరుటకు బీజమైన అవిద్యగలఆత్మ), ఆసీత్=ఉండెను. సః=ఆ అజ్ఞానముగలఆత్మ, మే=నాకు, జాయా=భార్యా, స్యాత్=కలుగునుగాక, అథ=అనంతరము, (అహం = నేను), ప్రజాయేయ = సంతానమును పుట్టించుదునుగాక. అథ=అనంతరము, మే=నాకు, విత్తం=ధనము, స్యాత్=కలుగునుగాక. అథ = అనంతరము, కర్మ = కర్మను, కుర్వీయేతి=చేయుదునుగాకయని, అకామయత=కోరెను. ఏతావాన్ వై = ఇంతయే, కామః=కోరిక. (సః = ఆ ఆత్మ, యస్మాత్ = ఏకారణము వలన), ఇచ్ఛంశ్చన=కోరియును, అతః=దీనికంటె, (జాయారూపాది ఫలసాధనలక్షణమగు దీనికంటె), భూయః=అధికమైనదానిని, నవిన్దేత్ =పొందదు. తస్మాదపి = ఆకారణమునుండియు, ఏతర్హి = ఈకాలము నందే, ఏకాకీ=ఒక్కటియై, మే=నాకు, జాయా=భార్య, స్యాత్= కలుగునుగాక. అథ=అనంతరము, (అహం = నేను), ప్రజాయేయ= సంతానమును పుట్టించుదునుగాక. అథ=అనంతరము, మే = నాకు, విత్తం=ధనము, స్యాత్=కలుగునుగాక. అథ = అనంతరము, కర్మ= కర్మను, కుర్వీయేతి=చేయుదునుగాకయని, కామయతే=కోరుచున్నది. సః=ఆ ఆత్మ, యావత్=ఎంతవఱకు, ఏతేషాం=ఈ జాయాపుత్రాదు లలో, ఏకైకమపి=ఒకొక్కదానినైనను, నప్రాప్నోతి = పొందదో, తావత్ = అంతవఱకు, అకృత్స్న ఏవ = అసంపూర్ణమయినదిగానే, మన్యతే=తలంచుచున్నది. తస్యఉ = అసంపూర్ణత్వాభిమానముగల ఆ ఆత్మకే, కృత్స్నతా=సంపూర్ణత, (ఏవమేవ=ఈప్రకారముగానే, భవతి=అగుచున్నది) అస్య=ఈఅసంపూర్ణాత్మస్వరూపుడగు పురుషునికి, మనఏవ=మనస్సే, ఆత్మా=ఆత్మ, వాక్=వాక్కు, జాయా= భార్య, ప్రాణః=ప్రాణము, ప్రజా=సంతానము, చక్షుః = నేత్రము, మానుషం=మనుష్యసంబంధమయిన, విత్తం=ధనము, చక్షుషాహి= నేత్రముచేతనే, తత్=ఆమానుషధనమును, విన్దతే=పొందుచున్నది. శ్రోత్రం=చెవి, దైవం = దేవసంబంధమయినధనము, శ్రోత్రేణహి=

శ్రోత్రము చేతనే, తత్ = ఆదైవధనమును, శృణోతి = వినుచున్నది. అస్య=ఈఅసంపూర్ణాత్మకు, ఆత్మైవ=శరీరమే, కర్మ=కర్మను. ఆత్మనాహి=శరీరము చేతనే, కర్మ=కర్మ, కరోతి=చేయుచున్నది. సః= ఆప్రసిద్ధమగు, ఏషః=ఈసముదాయము, పాఙ్క్తః=పాఙ్క్తస్వరూపమయిన, (జాయాపుత్రమానుషవిత్త, దైవవిత్తకర్మలను ఈయయిదింటిచేతను, నెఱవేర్పఁదగినది గనుక పాఙ్క్తస్వరూపమనఁబడుచున్నది). యజ్ఞః =యజ్ఞము. పశుః=యజ్ఞసంబంధమైనగవాది పశువును, పాఙ్క్తః= పాఙ్క్త స్వరూపము. (గవాదిపశువులు పంచభూతములవలన పుట్టినవి గనుక పాఙ్క్తములనఁబడును). పురుషః = పురుషుఁడు, పాఙ్క్తః= పాఙ్క్తస్వరూపము, ఇదంసర్వం=ఈసమస్తమును, పాఙ్క్తం=పాఙ్క్తస్వరూపము. (ఈసమస్తమును పంచభూతములవలనఁ బుట్టినదిగనుక పాఙ్క్తమనఁబడును.) ఏవం=ఈప్రకారము, యః=ఎవఁడు, యదిదం కించ=ఏ ఈసమస్తమును, వేద=తెలిసికొనుచున్నాఁడో, (సః = వాఁడు), తదిదంసర్వం = ఆ ఈసమస్తమును, ఆప్నోతి = పొందుచున్నాఁడు.

తా॥ అవిద్య, పరమాత్మస్వరూపమును ఆవరించుకొనియుండఁగా అట్టి అవిద్యగల ఆత్మకు సమస్తప్రవృత్తి హేతువగు కామము పుట్టుచున్నది. ఇట్లు సమస్తకర్మప్రవృత్తియు కామహేతుకమైనదే అగుచున్నది. ఈ యర్థమే ఈ అధ్యాయాంతమువఱకు నిరూపింపఁబడుచున్నది. అవిద్యాస్వరూపమగు భార్యాపుత్రాది భేదముగల ఈ సమస్తమును, భార్యాపుత్రాది సృష్టికంటెపూర్వము అవిద్యావంతుఁడై భార్యాపుత్రాదులను కోరెడి ఒక్కటియగు ఆత్మయై యుండెను. ఇట్లు భార్యమొదలగువానిని కోరుటకు బీజభూతమయిన అవిద్యగల ఆయాత్మయే నాకు భార్యయును సంతానమును గోవులు మొదలయిన మానుషధనమును దైవవిత్తమగు విజ్ఞానమును, యజ్ఞాది కర్మయును కలుగునుగాక యనికోరి, ఆయాత్మ ఈ భార్యాపుత్రాది

కముకంటె అధికమైన దానిని తెలిసికొనక పోవుటవలన ఆ భార్యా పుత్రాదులనే కోరుచు ఎంతవఱకు ఆ కోరఁబడిన భార్యాపుత్రాదులలో నొకదానిని సైతము పొందదో అంతవఱకు నేను అసంపూర్ణ స్వరూపమైతినని తన్ను తాను తలంచుకొనుచున్నయది. ఇట్లు సంపూర్ణతను తలంచెడి యాత్మస్వరూపమునకు సంపూర్ణత ఎట్లగుననిన, అవిద్యకలిగి కామహేతుకమయిన భార్యాపుత్రాదికము కలుగకపోవుటచే అసంపూర్ణమగు నీ ఆత్మకు, సంకల్పవికల్పాత్మకమయిన మనస్సే స్వరూపము. ఆమనస్సునకు భార్యవంటిది వాక్కు. ఈ వాఙ్మనస్సుల రెంటివలన కర్మకొఱకు సంతానమువంటి ప్రాణము పుట్టుచున్నది. ఆ ప్రాణచేష్టాదిలక్షణమైన కర్మ, మానుష దైవవిత్తములచే సాధింపఁదగినది. వానిలో గవాదిరూపమైన మానుష విత్తము నేత్రముచే చూచి సాధింపఁదగినది గనుక నేత్రమే మానుష విత్తమగు గవాదిరూపమైన ధన మగుచున్నది. విజ్ఞానరూపమైన దైవ విత్తము శ్రోత్రముచేత విని సాధింపఁదగినది గనుక శ్రోత్రమే దైవ విత్తమగు విజ్ఞాన రూపమయిన ధనమగుచున్నది. ఈ చెప్పఁబడిన భార్యాపుత్రాదులచే నెఱవేర్పఁదగిన సమస్త కర్మయును శరీరముచే సాధింపఁదగినది గనుక శరీరమే కర్మయగుచున్నది, ఈ ప్రకారముగా అసంపూర్ణతను తలంచిన ఆ యాత్మకు బాహ్యమునందలి భార్యా పుత్రాదికముతోఁ గూడుకొనుటచేతను వలెనే సంపూర్ణత కలుగుచున్నది. ఈ చెప్పిన వాక్చక్షుశ్శ్రోత్రాది రూపమైన భార్యాపుత్రాది సముదాయమగు పంచత్వముయొక్క సంపదచేత పశుపురుష సాధ్యమగు బాహ్యయజ్ఞము లనెడి అయిదింటిచేత నెఱవేర్పఁదగి, పాఙ్క్తమను పేరుగల యజ్ఞ మగుచున్నది, బాహ్య యజ్ఞ సాధకములగు పశుపురుషు లిద్దఱును పంచభూతములనుండి పుట్టుటవలన పాఙ్క్తములే యగుచున్నవి. ఈ కనుపడెడి సమస్తమును భార్యాపుత్రాది పంచకముచేత యజ్ఞమువలెనే భూతములయొక్క పంచకముచేత

నెఱవేరుసది గనుక పాఙ్క్తస్వరూప మనఁబడుచున్నది. ఇట్లు సర్వ మును పాఙ్క్తస్వరూపమయిన యజ్ఞముగా తెలిసికొని యుపాసించెడి వాడు జగత్తుయొక్క స్వరూపముతో ఈ సమస్తమును పొందుచు న్నాఁడు. (సాధ్యసాధనమగు పాఙ్క్తస్వరూపమును సూత్రాత్మనుగా తెలిసికొని దానిని తన స్వరూపమునుగా అను సంధానమును చేసెడి వాఁడు ఆ సూత్రాత్మయే యగుచున్నాఁడు).

ఇట్లు తృతీయాధ్యాయమునందు చతుర్థబ్రాహ్మణము సమాప్తము

## తృతీయాధ్యాయము.

## పంచమ బ్రాహ్మణము.

ఉ॥ యత్సప్తాన్నాని మేధయా తపసాజనయత్పితా ఏకమస్య సాధా రణం ద్వే దేవాన భాజయత్త్రీణ్యాత్మనేఽకురుత పశుభ్య ఏకం ప్రాయచ్ఛత్తస్మిన్సర్వం ప్రతిష్ఠితం యచ్చ ప్రాణితి యచ్చ న కస్మాత్తాని న క్షీయన్తేఽద్యమానాని సర్వదా యో వై తామ క్షితిం వేద సోఽన్నమత్తి ప్రతీకేన స దేవానపిగచ్ఛతి స ఊర్జ ముపజీవతీతి శ్లోకాః. ॥1॥

ప॥ యత్ - సప్త - అన్నాని - మేధయా - తపసా - అజన యత్ - పితా - ఏకం - అస్య - సాధారణం - ద్వే - దేవాన్ - అభాజయత్ - త్రీణి - ఆత్మనే - అకురుత - పశుభ్యః - ఏకం - ప్రాయచ్ఛత్ - తస్మిన్ - సర్వం - ప్రతిష్ఠితం - యత్ - చ - ప్రాణితి - యత్-చ-న - కస్మాత్ - తాని - న - క్షీయన్తే - అద్యమానాని - సర్వదా - యః - వా - ఏతాం - అక్షితిం - వేద- సః - అన్నం - అత్తి - ప్రతీకేన - సః - దేవాన్ - అపి - గచ్ఛతి- సః - ఊర్జం - ఉపజీవతి - ఇతి - శ్లోకాః.

ప్ర॥ పితా = హిరణ్యగర్భుఁడు. (కాఁగల జీవస్వరూపుఁడగు బ్రహ్మ), మేధయా=ప్రజ్ఞచేతను, తపసా=కర్మచేతను, సప్త=ఏడైన,

అన్నాని = అన్నములను, అజనయదితియత్ = పుట్టించె ననునది యేదియో; (తత్ర = అన్నములలో), సాధారణం = సామాన్యమగు, ఏకం=ఒక్కటియైన అన్నము, (ప్రాణులచేత సాధారణముగా తినఁ బడెడి అన్నమును), అస్య=ఈ భోక్తృసముదాయమునకు, (భక్షించెడి జీవులయొక్క సముదాయము కొఱకు, అకల్పయత్=నిర్మించెను). దేవాన్=దేవతలను గూర్చి, ద్వే=రెండైన హుతప్రహుతము లనెడి యన్నములను, (హుతమనఁగా అగ్నియందు హోమము చేయఁబడి నదియును, ప్రహుతమనఁగా బలిహరణమును), (శ్రౌతకర్మయందు దర్శపౌర్ణమాసములే హుతప్రహుతము లనఁబడును). అభాజయత్= పొందించెను. త్రీణి=మూడైన మనోవాక్ప్రాణములను అన్నములను, ఆత్మనే=తనకొఱకును, అకురుత=చేసెను. పశుభ్యః=పశువులకొఱకు, ఏకం=ఒక్కటియైన పయస్సును (పాలను), ప్రాయచ్ఛత్=ఇచ్చెను. యచ్చ=ఏది, ప్రాణితి = ప్రాణము గలదియో; యచ్చ = ఏది, న= ప్రాణములేనిదియో; (తత్=అ), సర్వం=సమస్త జగత్తును, తస్మిన్= ఆ పయస్సునందు, (పశువులయొక్క అన్నమగు పయస్సునందు), ప్రతిష్ఠితం=ఉంచఁబడినది. కస్మాత్=ఎందువలన, తాని = ఆ అన్నములు, సర్వదా=ఎల్లప్పుడు, అద్యమానాని=భక్షింపఁబడినవయ్యును, నక్షీయన్తే=క్షీణింపవు. యోవై=ఎవఁడైతే, ఏతాం=ఈ, అక్షితిం= నాశనము లేకపోవుటను, వేద=తెలిసికొనుచున్నాఁడో, సః=వాఁడు, ప్రతీకేన=ముఖముచేత, అన్నం = అన్నమును, అత్తి = భక్షించుచున్నాఁడు. సః=వాఁడు, దేవానపి=దేవతలను సయితము, గచ్ఛతి= పొందుచున్నాఁడు. సః=వాఁడు, ఊర్జం=అమృతమును,(మోక్షమును), ఉపజీవతి=అనుభవించుచున్నాఁడు. ఇతి=ఈ ప్రకారము, శ్లోకాః= మంత్రములు, (భవంతి=అగుచున్నవి).

తా॥ హిరణ్యగర్భుఁడు విజ్ఞానముతో పూర్వము చెప్పిన శాస్త్ర స్వరూపమగు కామ్యకర్మచేత ఆత్మకు భోజ్యముగా జగత్తును సృష్టిం

చెను. ఆ సృజింపఁబడిన జగత్తు ఏడు విధములైన అన్నములుగా విభజింపఁబడి యున్నది. అదియే ఇక్కడ చెప్పఁబడుచున్నది. హిరణ్య గర్భుఁడు ఏడు విధములయిన అన్నములను సృజించి వానిలో సాధా రణముగా జీవులచేత ననుభవింపఁబడెడి అన్నమును ఈ జీవసముదా యమునకును హుతప్రహుతము లనెడి హోమ బలిహరణములను రెంటిని దేవతలకును, మనోవాక్ప్రాణములను మూఁటిని తనకును, పయ స్సును పశువులకును ఇట్లు విభజించి ఇచ్చెను. ఈ పశువులకు ఇచ్చిన అన్నమునందే స్థావర జంగమాత్మకమయిన సమస్త జగత్తు ఉంచఁ బడినది. ఏ కారణమువలన ఆ సృజింపఁబడిన అన్నములు భక్షింపఁ బడినవయ్యును ఎప్పుడును నశింపవు? ఇట్లు నశింపకపోవుటను తెలిసి కొనువాఁడు ముఖముతో అన్నమును భక్షించుచున్నాఁడు. వాఁడే దేవతలను పొందుచున్నాఁడు. మోక్షమును పొందినవాఁడు నగు చున్నాఁడు. వీనిని ప్రకాశింపఁజేసెడి ఈ మంత్రము లగుచున్నవి.

ఉ॥ యత్సప్తాన్నాని మేధయా తపసాఽజనయత్పితేతి మేధయా హి తపసా జనయత్పితైకమస్య సాధారణమితీదమేవాస్య తత్సాధారణ మన్నం యదిదమద్యతే । సయ ఏతదుపాస్తే న స పాప్మనో వ్యా వర్తతే మిశ్రగ్ హ్యేతత్ । ద్వే దేవానభాజయదితి హుతం చ ప్రహుతం చ తస్మాద్దేవేభ్యో జుహ్వతి (చ) ప్ర చ జుహ్వత్యథో ఆహుర్దర్శ పౌర్ణమాసావితి తస్మాన్నేష్టియాజుకస్స్యాత్పశుభ్య ఏకం ప్రాయచ్ఛదితి తత్పయః । పయో హ్యేవాగ్రే మనుష్యాశ్చ పశవ శ్చోపజీవన్తి తస్మాత్కుమారం జాతం ఘృతం వైవాగ్రే ప్రతిలేహ యన్తి స్తనం వానుధాపయన్త్యథ వత్సం జాతమాహురతృణాద ఇతి తస్మిన్సర్వం ప్రతిష్ఠితం । యచ్చ ప్రాణితి యచ్చ నేతి పయసి హీదగ్ సర్వం ప్రతిష్ఠితం యచ్చ ప్రాణితి యచ్చ న । తద్యదిదమాహుః సంవత్సరం పయసా జుహ్వదప పునర్మృత్యుం జయతీతి న తథా విద్యాద్యదహరేవ జుహోతి తదహః పునర్మృత్యుమపజయత్యేవం

విద్వాన్సర్వగ్ హి దేవేభ్యోఽన్నాద్యం ప్రయచ్ఛతి కస్మాత్తాని న క్షీయన్తేఽద్యమానాని సర్వదేతి పురుషో వా అక్షితిః స హీదమన్నం పునః పునర్జనయతే। యో వై తామక్షితిం వేదేతి పురుషో వా అక్షితిః స హీదమన్నం ధియా ధియా జనయతే కర్మభిర్యద్ధైతన్న కుర్యాత్క్షీయేత హ సోఽన్నమత్తి ప్రతీకేనేతి ముఖం ప్రతీకం ముఖేనేత్యేతత్స దేవానపిగచ్ఛతి స ఊర్జముపజీవతీతి ప్రశగ్ సా. ॥2॥

ప్ర॥ యత్ - సప్త - అన్నాని - మేధయా - తపసా - అజనయత్ - పితా - ఇతి - మేధయా - హి - తపసా - అజనయత్ - పితా - ఏకం అస్య - సాధారణం - ఇతి - ఇదం - ఏవ - అస్య - తత్ - సాధారణం - అన్నం - యత్ - ఇదం - అద్యతే- సః - యః - ఏతత్ - ఉపాస్తే - న - సః - పాప్మనః - వ్యావర్తతే మిశ్రం - హి - ఏతత్ - ద్వే - దేవాన్ - అభాజయత్ - ఇతి - హుతం - చ - ప్రహుతం - చ - తస్మాత్ - దేవేభ్యః - జుహ్వతి- ప్రచజుహ్వతి - అథో - ఆహుః - దర్శపౌర్ణమాసౌ - ఇతి - తస్మాత్ - న - ఇష్టియాజుకః - స్యాత్ - పశుభ్యః - ఏకం - ప్రాయచ్ఛత్ - ఇతి - తత్ - పయః - పయః - హి - ఏవ - అగ్రే - మనుష్యాః- చ - పశవః - చ - ఉపజీవన్తి - తస్మాత్ - కుమారం - జాతం - ఘృతం - వా - ఏవ - అగ్రే - ప్రతిలేహయన్తి - స్తనం - వా - అనుధాపయన్తి - అథ - వత్సం - జాతం - ఆహుః - అతృణాదః- ఇతి - తస్మిన్ - సర్వం - ప్రతిష్ఠితం-యత్ - చ - ప్రాణితి - యత్ - చ - న - ఇతి - పయసి - హి - ఇదం - సర్వం - ప్రతిష్ఠితం - యత్ - చ - ప్రాణితి - యత్ - చ - న - తత్ - యత్ - ఇదం - ఆహుః - సంవత్సరం - పయసా - జుహ్వత్ - అప - పునః - మృత్యుం - జయతి - ఇతి - న - తథా - విద్యాత్ - యత్ - అహః - ఏవ - జుహోతి - తత్ - అహః - పునః - మృత్యుం

- అపజయతి - ఏవం - విద్వాన్ - సర్వం - హి - దేవేభ్యః - అన్నాద్యం - ప్రయచ్ఛతి - కస్మాత్ - తాని - న - క్షీయన్తే - అద్యమానాని - సర్వదా - ఇతి - పురుషః - వై - అక్షితిః - సః - హి - ఇదం - అన్నం - పునః - పునః - జనయతే - యః - వా - ఏతాం - అక్షితిం - వేద - ఇతి - పురుషః - వై - అక్షితిః - సః - హి - ఇదం - అన్నం - ధియా - ధియా - జనయతే - కర్మభిః - యత్ - హి - ఏతత్ - న - కుర్యాత్ - క్షీయేత - హ - సః - అన్నం - అత్తి - ప్రతీకేన - ఇతి-ముఖం - ప్రతీకం - ముఖేన-ఇతి - ఏతత్ - సః - దేవాన్ - అపి - గచ్ఛతి - సః - ఊర్జం - ఉప జీవతి - ఇతి - ప్రశంసా.

ప్ర॥ పితా=హిరణ్యగర్భుఁడు, మేధయా=ప్రజ్ఞచేతను, తపసా =కర్మచేతను, సప్త=ఏడైన, అన్నాని=అన్నములను, అజనయదితి యత్=సృష్టించెననునవిఏవియో, ఇతి = వీనిలో, పితా = హిరణ్య గర్భుఁడును, మేధయాహి=ప్రసిద్ధమగు ప్రజ్ఞచేతను, తపసా = కర్మ చేతను, అస్య=ఈ భోక్తృసముదాయమునకు. సాధారణం=సామాన్య మైన, ఏకం = ఒకటియైనఅన్నమును, అజనయదితి = సృష్టించెనని, (చెప్పినమంత్రములోని సాధారణమైన అన్నమేదియనిన, అహాన్య హాని=ప్రతిదినమునందు, ప్రాణిభిః = ప్రాణులచేతను), యదిదం= ఏ ఈయన్నము, అద్యతే = భక్షింపఁబడుచున్నదో; తదిదమేవ=ఆ యిదియే, అస్య = ఈ భోక్తృసముదాయమునకు, సాధారణం= సామాన్యమైన, అన్నం=అన్నముగా, (అకల్పయత్=సృష్టించెను). సయః=ఎవఁడు, ఏతత్=ఈసాధారణమైన అన్నమును, ఉపాస్తే= ఉపాసించుచున్నాఁడో; (శరీరస్థితికొఱకై = అన్నమందాసక్తిగలవాఁ డగుచున్నాఁడో); సః=వాఁడు, పాప్మనః=పాపమునుండి, (అధర్మము నుండి), నవ్యావర్తతే = విడువఁబడఁడు. ఏతత్=ఈ సాధారణమైన అన్నము, మిశ్రంహి=ధర్మాధర్మయుక్తమైనది. ద్వే=రెండుఅన్నము

లను, దేవాన్ = దేవతలనుగూర్చి, అభాజయదితి = పొందించెనని (చెప్పిన అన్నములు రెండేవి యనిన), హుతంచ = అగ్నియందు హోమము చేయఁబడినదియు, ప్రహుతంచ=బలిహరణము వేయఁ బడినదియు; తస్మాత్ =ఆ కారణమునుండి, దేవేభ్యః=దేవతలకొఱకు, జుహ్వతి=హోమములను చేయుచున్నారు. ప్రచజుహ్వతి=బలిహరణమును వేయుచున్నారు. అథో=ఇంకను, (అన్యే=కొందఱు), దర్శపౌర్ణమాసావితి=దర్శపౌర్ణమాసములని, (దర్శపౌర్ణమాసములే హుత ప్రహుతములని), ఆహుః=చెప్పిరి. తస్మాత్ =అందువలన, ఇష్టియాజుకః =కామ్యయాగమే ప్రధానముగాఁగలవాఁడు, నస్యాత్ = కాఁడు. పశుభ్యః=పశువులకొఱకు, ఏకం=ఒకవిధమగు అన్నమును, ప్రాయచ్ఛదితి=ఇచ్చెనని (చెప్పినఅన్నమేది యనిన), తత్ =అది, పయః= పయస్సు; మనుష్యాశ్చ = మనుష్యులును, పశవశ్చ = పశువులును, అగ్రే=ముందుగా, పయోహ్యేవ=పయస్సునే, ఉపజీవన్తి = అనుభవించుచున్నవి. (అనఁగాక్షీరములను త్రాగుచున్నవి). తస్మాత్ =అందువలన,జాతం=జాతకర్మసంస్కారముగల, కుమారం=బాలుని, అగ్రే= ముందుగా, ఘృతంవైవ=క్షీరవికారమగునేతినే, ప్రతిలేహయన్తి= నాకించుచున్నారు. స్తనంవా=స్తనమునైనను, అనుధాపయన్తి=కుడిపించుచున్నారు. (పానముచేయించుచున్నారు. అథ = మఱియు, జాతం=పుట్టిన, వత్సం = బాలుని, (బాలుఁడెంత ప్రమాణముగల వాఁడని యడగఁబడినవారై), అతృణాదఇతి = గడ్డినితినఁనేరఁడని, (ఇప్పటికిని, గడ్డినైన తిననేరఁడు మిక్కిలి బాలుఁడని), ఆహుః=చెప్పిరి. యచ్చ=ఏది, ప్రాణితి = జీవముగలదియో; యచ్చన = ఏదిజీవము లేనిదియో; (ప్రాణముగలమనుష్యులు మొదలయినవియును, ప్రాణము లేని పర్వతములు మొదలయినవియును), ఇదఁసర్వం = ఈ సమస్తమును, తస్మిన్ =అపయస్సునందు, ప్రతిష్ఠితమితి = ఉంచఁబడినదని, (చెప్పిన ఈమంత్రమునందలి యర్థమేమనిన), యచ్చప్రాణితి = ఏది

జీవముకలదియో; యచ్చన=ఏదిజీవములేని పర్వతము మొదలయి నదియో; ఇదంసర్వం=ఈసమస్తమును, పయసిహి=పయస్సునందే, ప్రతిష్ఠితం = ఉంచఁబడియున్నది. (బ్రాహ్మణవాదాః = వేదములను చెప్పెడివారు), సంవత్సరం=ఒకసంవత్సరము, పయసా=క్షీరముతో, జుహ్వత్ = హోమముచేయువాఁడై, పునర్మృత్యుం=మరల మరణమును, అపజయతీతి = జయించుచున్నాఁడని. (పోఁగొట్టుకొనుచున్నాఁడు). యదిదం=ఏదీనిని, ఆహుః=చెప్పిరో; తత్=దానిని, తథా=ఆప్రకారము, నవిద్యాత్=తెలిసికొనఁగూడదు. యదహరేవ=ఏదినమునసే, జుహోతి=హోమముచేయుచున్నాఁడో; తదహః=ఆదినము, పునర్మృత్యుం = మరలమరణమును, అపజయతి=జయించుచున్నాడు. (పోఁగొట్టుకొనుచున్నాఁడు).ఏవం=ఈప్రకారము,విద్వాన్ సన్ = తెలిసికొనినవాఁడై, (యస్మాత్ = ఏకారణమువలన), సర్వం = సమస్తమయిన, (ప్రసిద్ధముగా సర్వస్వరూపమగు), అన్నాద్యంహి=అన్నమేయగు ఆపయస్సునే, దేవేభ్యః=దేవతలకొఱకు, ప్రయచ్ఛతి=ఇచ్చుచున్నాఁడో, (తస్మాత్=ఆకారణమువలన, ఏకేనైవఅహ్నా = ఒకదినముతోనే, జగదాత్మత్వం=జగత్స్వరూపతను,'ప్రతిపద్యతే=పొందుచున్నాఁడు). కస్మాత్=ఎందువలన, తాని=ఆ అన్నములు, సర్వదా=ఎల్లప్పుడును, (భూతైః=భూతములచేత), అద్యమానాని=భక్షింపఁబడినవయ్యును, నక్షీయన్తే = క్షీణింపవు. ఇతి=అని, (అడిగినప్రశ్నకుత్తరువును చెప్పుచున్నాఁడు). పురుషోవై=పూర్ణుఁడగుపురుషుఁడే, అక్షితిః=నాశరహితుఁడు. సహి=ఆపురుషుఁడే. ఇదం=ఈ, అన్నం=అన్నమును, పునఃపునః = మరలమరల, జనయతే = పుట్టించుచున్నాఁడు, యోవా=ఎవఁడు, ఏతాంఅక్షితిం=ఈనాశము లేకపోవుటను, వేద=తెలిసికొనుచున్నాఁడో, ఇతి=అని, (ఈ చెప్పినమంత్రార్థమును వివరించుచున్నాఁడు). అక్షితిః = అక్షయహేతువైనవాఁడు, పురుషోవై =పురుషుఁడే, సహి=ఆపురుషుఁడే, ఇదం=ఈభక్షింపఁబడిన,

అన్నం=అన్నమును, ధియాధియా=ఆయాకాలములయందైన ప్రజ్ఞ చేతను, కర్మభిః=వాఙ్మనఃకాయములయొక్క వ్యాపారములచేతను, జనయతే=పుట్టించుచున్నాఁడు. యత్=ఏ, ఏతత్=ఈభక్షింపఁబడిన అన్నమును, నకుర్యాద్ధి = చేయఁడో, తత్=ఆ అన్నము, క్షీయేతహ=నశించును. సః=ఆపురుషుఁడు, అన్నం=అన్నమును, ప్రతీకేన=ముఖముచేత, అత్తి=భక్షించుచున్నాఁడు. ఇతి=అని (చెప్పినమంత్రార్థమును వివరించుచున్నాఁడు). ముఖం = ముఖము, ప్రతీకం = ప్రతీకశబ్దార్థము, ముఖేనేతి=ముఖముచేత ననఁగా, ఏతత్=ఈప్రతీకశబ్దార్థము, (భవతి=అగుచున్నది). సః=ఆపురుషుఁడు, దేవానపి = దేవతలనుకూడ, గచ్ఛతి=పొందుచున్నాఁడు. (దేవాత్మభావమును పొందుచున్నాఁడు). సః=ఆపురుషుఁడు, ఊర్జం=మోక్షమును, ఉపజీవతి=అనుభవించుచున్నాఁడు. ఇతి=అని, (యత్ = ఏది, ఉక్తం=చెప్పఁబడినదో, సా=అది), ప్రశంసా=స్తుతి, (భవతి=అగుచున్నది).

తా॥ పూర్వమంత్రమునందుఁజెప్పిన అన్నములే ఈ బ్రాహ్మణవాక్యమునందు వివరింపఁబడుచున్నవి. ఈ లోకమునందు సాధారణముగా జీవులచేత భక్షింపఁబడెడి ఒక్కటియగు అన్నమును అనుభవించెడి జీవులయొక్క సముదాయమునకు పరమాత్మ, దీనిని సృజించెను. అట్టియన్నము ధర్మాధర్మములతో మిశ్రమమైనదగనుక దానిని పరమేశ్వరప్రీతికొఱకైన భగవదారాధన కుపయోగింపక కేవలము తన దేహధారణకొఱకుపయోగించెడి జనుఁడు పాపమువలనవిడువఁబడఁడు. ఆ పరమాత్మ దేవతలకు హుతప్రహుతములను హోమ బలిహరణరూపములైన అన్నములను రెంటిని సృజించెను. కనుకనే జనులు దేవతలనుగూర్చి హోమములను బలిహరణములను చేయుచున్నారు. ఇంక కొందఱు ఈ హుతప్రహుతములనే దర్శపూర్ణమాసములనుగా చెప్పుచున్నారు. కనుకనే జనుఁడు కామ్యయాగప్రధానుఁడు గాక దర్శపూర్ణమాసములయందే దేవతలనుగూర్చి హుతప్రహుతములను

చేయుచున్నాఁడు. ఆపరమాత్మ పశువులకు ఒక్కటియగు పయ స్వరూపమైన అన్నమును సృజించెను ఇది సర్వమునకు నాధారము గనుక దీనిని ముందుగా మనుజులు ఉపయోగించెదరు. పశువులును ఉపయోగించెడిని. ఈ కారణమునుబట్టియే మనుజులు జాతకర్మ సంస్కారమునందు బాలునికి ఈ పయోవికారమగు నేతిని ముందుగా త్రాగించెదరు. స్తనమునైనను కుడిపెదరు. ఇట్లు మనుజులు పశ్వన్న మగుపయస్సు నుపయోగించుటవలననే లోకులు ఒక శిశువునుగూర్చి వానిపరిమితిని ప్రశ్నచేయునపుడు చిక్కలి పసితనమును తెలియ పఱచుటకు బదులుగా (అతృణాదుఁడు) గడ్డి తిననేరనివాఁడని చెప్ప దరు. ఈ పయస్సువందే జంగమస్థావరాత్మకమైన సమస్త ప్రపంచ ముంచఁబడియున్నది. అట్టి సర్వాధారకమగు పయస్సును దేవతల కొఱకు ఒక సంవత్సరము హోమముచేయుచు జనుఁడు ఈ లోకము నుండి మరణమునుపొంది దేవతలయందుపుట్టి సంవత్సరాకృతియగు అగ్నిరూపప్రజాపతినిపొంది పునర్మరణమును పొందఁడు అని చెప్పెడి బ్రాహ్మణవాదులయొక్క వాక్యమును ఆ విధముగానే తెలిసికొనఁ గూడదు. మరియేమనిన జనుఁడు, ఆపయస్సును ఒకదినము హోమము చేయుటచేతనే సర్వము అపయోరూపమైన ఆహుతియొక్క విపరిణా మాత్మకమగుటవలన జగదాత్మత్వమును పొందుచున్నాఁడు. ఇట్లు తెలిసికొనిన విద్వాంసుఁడు, సర్వస్వరూపమగు అన్నమైన పయస్సును సాయంప్రాతఃకాలములయందు ఆహుతప్రక్షేపణముతో దేవతల కొఱకిచ్చుచు మరణమునుపొంది సర్వదేవస్వరూపుఁడై మరల మర ణమునుపొందఁడు. ఆ విద్వాంసుడు ఒకసారి మరణమునుపొంది దేహ ముతోవిడిపోయి సర్వాత్మస్వరూపుఁడగుచున్నాఁడు. ఈ సృజింపఁ బడిన సప్తాన్నములును వేరువేరు భోక్తలకొఱకు ఈయఁబడినవై ఆ భూతములచేత సర్వదాభక్షింపఁబడినవయ్యును ఎట్లు నశింపవనిన ఈ అన్నములను సృజించిన అక్షయస్వరూపుఁడగు పరమాత్మ

అన్నములకు సృష్టికర్తయై జాయాదిసంబంధముచేత తండ్రిగాను పాఙ్క్తస్వరూపకర్మచేత భోక్తగానుండి ఆ సృజించిన అన్నములను ఎవరికొఱకు ఇచ్చెనో వారు ఆయన్నములకు భోక్తలయ్యును జ్ఞాన కర్మలతోఁగూడుకొని తండ్రులై ఏడువిధములైన అన్నములను సృజించుచున్నారు. ఇట్లు ఆ అక్షయకారణుఁడగు పరమాత్మ, అనుభ వింపఁబడిన కార్యకారణలక్షణమగు ఏడువిధములైన అన్నములను ఆయా కాలములయందలి ప్రజ్ఞతో సంకల్పించుచు వాఙ్మనఃకాయముల యొక్క వ్యాపారములతో మరల మరల సృష్టించుచున్నాఁడు. అట్లు సృజింపఁడేని సర్వమును నశించును. కనుకనే పరమాత్మ సర్వదా జ్ఞానకర్మల యనుసరణ ప్రకారము సృజించుటవలన సప్తాన్నములు క్షీణింపనివై యున్నవి. ఇట్లు తెలిసికొనెడి ఆపురుషుఁడే, ముఖముతో అన్నమును భక్షించుచున్నాఁడు. ఆపురుషుఁడే దేవాత్మభావమును పొంది సర్వదేవస్వరూపుఁడగుచున్నాఁడు. ముక్తినిపొందుచున్నాఁడు. ఇట్లు ఆపురుషుఁడు సర్వదేవస్వరూపమును ముక్తిని పొందుచున్నాఁ డనిచెప్పుట స్తుతికొఱకు చెప్పఁబడినదియేగాని పూర్వము లేనిది వేరొకటేదియును లేనేలేదు. ఆపురుషుఁడు సర్వదా ముక్తుఁడై పర మాత్మ స్వరూపముగా నేయున్నాఁడు.

ఉ॥ త్రీణ్యాత్మనేఽకురుతేతి మనో వాచం ప్రాణం తాన్యాత్మనేఽ కురుతాన్యత్రమనా అభూవం నాదర్శమన్యత్రమనా అభూవం నాశ్రౌషమితి మనసా హ్యేవ పశ్యతి మనసా శృణోతి। కామస్సం కల్పో విచికిత్సా శ్రద్ధాఽశ్రద్ధా ధృతిరధృతిర్హ్రీర్ధీర్భీరిత్యేతత్సర్వం మన ఏవ తస్మాదపి పృష్ఠత ఉపస్పృష్టో మనసా విజానాతి యః కశ్చ శబ్దో వాగేవ సా। ఏషా హ్యన్తమాయత్తైషా హి న ప్రాణోఽపానో వ్యాన ఉదానస్సమానోఽన ఇత్యేతత్సర్వం ప్రాణ ఏవైతన్మయో వా అయమాత్మా వాఙ్మయో మనోమయః ప్రాణమయః ॥3॥

ప॥ త్రీణి - ఆత్మనే - అకురుత - ఇతి - మనః - వాచం - ప్రాణం - తాని-ఆత్మనే - అకురుత - అన్యత్రమనాః-అభూవం - న - అదర్శం - అన్యత్రమనాః - అభూవం - న - అశ్రౌషం - ఇతి - మనసా - హి - ఏవ - పశ్యతి - మనసా - శృణోతి - కామః - సంకల్పః - విచికిత్సా - శ్రద్ధా - అశ్రద్ధా - ధృతిః - అధృతిః - హ్రీః - ధీః - భీః - ఇతి - ఏతత్ - సర్వం - మనః - ఏవ - తస్మాత్ - అపి - పృష్ఠతః - ఉపస్పృష్టః - మనసా - విజానాతి - యః - కః - చ - శబ్దః - వాక్ - ఏవ - సా - ఏషా - హి - అన్తం - ఆయత్తా - ఏషా - హి - న - ప్రాణః - అపానః - వ్యానః - ఉదానః - సమానః - అనః - ఇతి - ఏతత్ - సర్వం - ప్రాణః - ఏవ - ఏతన్మయః - వై - అయం - ఆత్మా - వాఙ్మయః - మనోమయః - ప్రాణమయః.

ప్ర॥ త్రీణి=మూటిని, ఆత్మనే=తనకొఱకు, అకురుతేతి=చేసెనని, (చెప్పిన మంత్రములోని మూడు విధములైన యన్నము లేవియనిన), మనః=మనస్సును, వాచం=వాక్కును, ప్రాణం=ప్రాణమును, (అనెడు మూడువిధములైన), తాని=ఆ అన్నములను, ఆత్మనే = తనకొఱకు, అకురుత=చేసెను. (అహం=నేను), అన్యత్రమనాః = వేఱొకచోట మనస్సుగలవాఁడను, అభూవం=అయితిని, నాదర్శం=చూడకపోతిని, అన్యత్రమనాః=వేఱొకచోట మనస్సుగలవాఁడను, అభూవం=అయితిని, నాశ్రౌషం=వినకపోతిని. ఇతి=ఈ ప్రకారము, మనసా హ్యేవ= మనస్సుచేతనే, పశ్యతి=చూచుచున్నాఁడు మనసా = మనస్సుచేత, శృణోతి=వినుచున్నాఁడు. కామః = కోరికయు, (స్త్రీలయందలి ఆసక్తి రూపమగునట్టి అభిలాష), సఙ్కల్పః = సంకల్పమును, (పొందఁబడిన విషయములను శుక్లనీలాది భేదముతో వికల్పించుట), విచికిత్సా = సంశయ జ్ఞానము, శ్రద్ధా=ఆస్తిక్యబుద్ధి, (అదృష్టఫలములుగల కర్మల యందును దేవతలు మొదలైన వానియందును ఆస్తిక్యబుద్ధి), అశ్ర

ద్ధా=ఆస్తిక్యబుద్ధి లేకపోవుటయును, ధృతిః=ధారణమును, అధృతిః=ధారణము లేకపోవుటయును, హ్రీః=లజ్జయును, ధీః=ప్రజ్ఞయును, భీః=భయమును, ఇత్యేతత్=ఈ మొదలైనవియునగు, సర్వం=సమస్తమును, మనఏవ=మనస్సే, తస్మాత్ = అందువలన, పృష్ఠతః = వీఁపునందు, (కేనచిత్=ఒకానొక దానిచేత), ఉపస్పృష్టోపి = తాఁకబడినవాఁడైనను, మనసా = మనస్సుచేతను, విజానాతి = తెలిసికొనుచున్నాఁడు. యఃకశ్చశబ్దః=యఃకశ్చ=సమస్తమైన, శబ్దః = శబ్దము. (ధ్వన్యాత్మకవర్ణాత్మకములుగా నుండెడి సర్వశబ్దములు). సావాగేవ=ఆ వాక్కే, ఏషాహి = ఈవాక్కే, అన్తం=(అభిధేయముయొక్క) అంతమును, (వస్తునిర్ణయమును), ఆయత్తా = అనుసరించి పొందుచున్నది. ఏషా=ఈవాక్కు, నహి=ప్రకాశింపఁదగినది కాదు. (ఈ వాక్కు స్వయముగా పేరుగల వస్తువువలెనే ప్రకాశింపఁదగినది కాదు). ప్రకాశస్వరూపమగుటవలన వస్తువును ప్రకాశింపఁజేయునదియే యగుచున్నది). ప్రాణః=ప్రాణమును, అపానః=అపానమును, వ్యానః=వ్యానమును, ఉదానః=ఉదానమును. సమానః=సమానమును, అన ఇతి=అనమనునదియునగు, (ఈప్రాణాపానాదివృత్తివిశేషములయొక్క సాధారణమైన దేహచేష్టాసంబంధమగు వృత్తియే అన మనఁబడును), ఏతత్సర్వం=ఈ సమస్తమును, ప్రాణఏవ=ప్రాణమే, ఏతన్మయః = ఏతత్ = ఈ మనోవాక్ప్రాణములను పేరుగల అన్నములయొక్క, మయః=వికారమగు, అయమాత్మావై=ఈ దేహమే. (దేహేంద్రియసముదాయమే స్వరూపముగా గలిగి అజ్ఞానులచేత ఆత్మస్వరూపముగా నభిమానింపఁబడిన పిండమే). వాఙ్మయః = వాగ్వికారమైనదియును, మనోమయః=మనోవికారమైనదియును, ప్రాణమయః – ప్రాణవికారమైనదియును, (భవతి=అగుచున్నది).

తా॥ ఇంతవఱకు బ్రహ్మనిర్మితములగు సప్తాన్నములలో నాలుగు విధములగు అన్నములను భోక్తలకొఱకు విభజించి చూపి బ్రాహ్మణ

శేషముయొక్క తాత్పర్యమును చెప్పి ఆ పూర్వోక్తములైన అన్నములకంటె శ్రేష్ఠములైన తక్కిన మూడు విధములగు అన్నముల యొక్క వివరముకొఱకు ఉత్తరగ్రంథ తాత్పర్యమును ఈ అధ్యాయాంతము వఱకు చెప్పుచున్నాఁడు. మనోవాక్ప్రాణములను మూడు విధములైన అన్నములను ఆత్మకొఱకు సృజించెను. కనుక ఆ మూటిలో మొదటిదియగు మనస్సు అనునది బాహ్యశ్రోత్రాదీంద్రియములకంటె వేఱై ప్రసిద్ధముగా నున్నదనుటకు ఈ మంత్రమునందు చెప్పిన విషయమే స్ఫుటపరచుచున్నది. అది యేదియనిన, మనస్సు వేఱు ప్రదేశమునం దుండునపుడు జనుఁడు నామనస్సు వేఱొక ప్రదేశమునం దున్నది గాన నేను చూడనులేదు. వినను లేదని పలుకుచున్నాఁడు. అందువలన ఏమనస్సుయొక్క సాన్నిధ్యము లేనప్పుడు రూపము మొదలైన వానిని గ్రహించుటయందు సమర్థములైన చక్షురాదు లుండినను ఆ చక్షురాదులు తమకు విషయములైన రూపాదులను గ్రహింపలేవో, అటువంటి, సమస్త ఇంద్రియముల కుపయోగమైన మనస్సను పేరుగల అంతఃకరణమున్నదని ప్రసిద్ధముగాఁ దెలియఁబడుచున్నది. కనుకనే సమస్త లోకము మనస్సుచేతనే చూడఁబడుచున్నది. మనస్సుచేతనే వినఁబడుచున్నది. దీనిచేతనే వేఱుగ మనస్సున్నదని సిద్ధముకాఁగా అట్టి మనఃస్వరూపము కొఱకిది చెప్పఁబడుచున్నది. అదేదియనిన, కామము, సంకల్పము, విచికిత్స, శ్రద్ధ మొదలైన ఈ సర్వమును మనస్సే. అంతఃకరణ రూపమైన ఈ మనస్సునకు ఈ కామాదులే రూపములు. ఇట్టి మనస్సున్నందుకు వేఱొక కారణము కూడ చెప్పఁబడుచున్నది. ఒకానొక జనునిచేత తనకు కనఁబడని వీఁపునందు స్పృశింపఁబడినవాఁడై వివేకముచేత నిది హస్తస్పర్శమని జనుఁడు తెలిసికొనుచున్నాఁడు. అట్టి జ్ఞానము కేవల చర్మ మాత్రముచేత కలుగదు గనుక ఆ జ్ఞానకారణమగు మనోరూపాంతఃకరణ మున్నది. అట్టి మనస్సుయొక్క స్వరూపమును

పొందఁబడుచున్నది. ఇట్లు మనస్సు మొదలైనవానిలో మొదటిదియగు మనస్సును చెప్పి ఇప్పుడు వాక్కు చెప్పఁదగినదని ఆరంభించుచున్నారు. ప్రాణులచేత వర్ణస్వరూపమునై తాలువు మొదలైన స్థానములచే ప్రకటింపఁ జేయఁదగిన ధ్వనియును భేర్యాది ధ్వనియును మేఘాది నిమిత్తకమగు ధ్వనియును ఇదియంతయు ఆ వాక్కుయొక్క స్వరూపమే. ఈ వాక్కు వస్తువును అదియే అంతముగా కలిగిన వస్తు నిర్ణయము ననుసరించి పొందుచున్నది. ఈ వాక్కు స్వకీయముగా వస్తువువలెనే ప్రకాశింపఁదగినది కాదు అయినను ప్రకాశ స్వరూపమగుట వలన ప్రదీపాదికమువలెనే వస్తువును ప్రకాశింపఁజేయుచున్నది. వాక్కు, ప్రదీపాది ప్రకాశము వేఱొక ప్రకాశముచేత ప్రకాశింపఁ జేయనియట్లు, తాను స్వయంప్రకాశమైనది. ఇట్లు వాక్స్వరూపమును చెప్పి యిప్పుడు ప్రాణము చెప్పఁబడుచున్నది. ప్రాణము, ముఖనాసికములద్వారా సంచరించుచు హృదయపర్యంతము ప్రవర్తించుచున్నది. ఇది ఊర్ధ్వగమనమువలన ప్రాణమనియును, మూత్రపురీషాదికమును పోఁగొట్టుటవలన అపానమును, ఇది నాభిపర్యంతముండి క్రింద సంచరించు అధోగమనము చేయుటవలన అపానమనియును, వ్యానము, సమస్త శరీరమును పొందియుండునది. ఇది ప్రాణాపానములయొక్క సంధియై సామర్థ్యముగల కర్మకు కారణమైనది. ఉదానము, ఉత్క్రమములైన ఊర్ధ్వలోక గమనాదులకు కారణమై ఆ పాదతలమస్తక పర్యంతముండి ఊర్ధ్వమందు సంచరించుచున్నది. సమానము, ఉదరమునందుండు అన్నమును పచనము చేయుచు తినఁబడిన అన్నాదికమును త్రాగఁబడిన పానాదికమును సమానముగ పొందించుచున్నది. ఇట్లు ఈ చెప్పఁబడిన ప్రాణాదివృత్తులయొక్క సామాన్యమైన దేహచేష్టా సంబంధమగు వృత్తి విశేషమే అన మనున ది. ప్రాణాదివృత్తి సమూహమగు నీ సమస్తమును ప్రాణస్వరూపమే. ఇట్లు చెప్పఁబడిన మనోవాక్ప్రాణములే స్వరూపముగాఁగల దేహేంద్రియాది సముదాయమే

స్వరూపముగాఁ గలిగి అజ్ఞానులచేత ఆత్మస్వరూపముగా నభిమానింపఁ బడిన యీ పిండము సామాన్యముగా మనోవికారమును వాగ్వికారమును ప్రాణవికారమునై యున్నది.

ఉ॥ త్రయో లోకా ఏత ఏవ వాగేవాయం లోకో మనోఽన్తరిక్షలోకః ప్రాణోఽసౌలోకః. ॥4॥

ప॥ త్రయః - లోకాః - ఏతే - ఏవ - వాక్ - ఏవ - అయం- లోకః - మనః - అన్తరిక్షలోకః - ప్రాణః - అసౌ - లోకః.

ప్ర॥ త్రయః=మూడైన, లోకాః=భూరాదిలోకములు, ఏత ఏవ=ఈవాఙ్మనఃప్రాణములే. అయం = ఈ, లోకః = భూలోకము, వాగేవ=వాక్కే, అన్తరిక్షలోకః = భువర్లోకము, మనః = మనస్సు. అసౌలోకః=ఈస్వర్లోకము, ప్రాణః=ప్రాణము,

తా॥ ప్రజాపతిసంబంధములైన వాగాద్యన్నములకు మూఁటికిని ఆధ్యాత్మికవిభూతి చూపించుటకుత్తర గ్రంథముపక్రమించుచున్నాఁడు. భూలోక భువర్లోక సువర్లోకములు మూఁడును వాక్కు-మొదలైనవియే. అదెట్లనిన ఈభూలోకమే వాక్కు, భువర్లోకమే మనస్సు, సువర్లోకమే ప్రాణము.

ఉ॥ త్రయో వేదా ఏత ఏవ వాగేవర్గ్వేదో మనో యజుర్వేదః ప్రాణస్సామవేదః ॥5॥

ప॥ త్రయః - వేదాః - ఏతే - ఏవ - వాక్ - ఏవ - ఋగ్వేదః - మనః - యజుర్వేదః - ప్రాణః - సామవేదః.

ప్ర॥ త్రయః=మూఁడైన, వేదాః=వేదములు, (ఋగ్యజుస్సామములను మూఁడువేదములును), ఏతఏవ = ఈవాఙ్మనఃప్రాణములే, (వానిలో), వాగేవ = వాక్కే, ఋగ్వేదః = ఋగ్వేదము, మనః = మనస్సు, యజుర్వేదః=యజుర్వేదము. ప్రాణః=ప్రాణము, సామవేదః =సామవేదము.

తా॥ ఋగ్యజుస్సామవేదములు మూఁడును ఈవాఙ్మనఃప్రాణ

ములే. అందువాక్కే ఋగ్వేదము. మనస్సే యజుర్వేదము. ప్రాణమే సామవేదము.

ఉ॥ దేవాః పితరో మనుష్యా ఏత ఏవ వాగేవ దేవా మనః పితరః ప్రాణో మనుష్యాః. ॥6॥

ప॥ దేవాః - పితరః - మనుష్యాః - ఏతే - ఏవ - వాక్ - ఏవ - దేవాః - మనః-పితరః - ప్రాణః - మనుష్యాః.

ప్ర॥ దేవాః=దేవతలును, పితరః=పితృదేవతలును, మనుష్యాః = మనుజులును, ఏతఏవ = వాఙ్మనఃప్రాణములే, (వానిలో), వాగేవ=వాక్కే, దేవాః=దేవతలు, మనః=మనస్సే, పితరః = పితృదేవతలు. ప్రాణః=ప్రాణమే, మనుష్యాః=మనుష్యులు.

తా॥ అగ్నీంద్రాది దేవతలును, యమాంగిరస్వాత్తాది పితృదేవతలును మనుజులును వాఙ్మనఃప్రాణములే. అందు వాక్కే దేవతలును, మనస్సే పితృదేవతలును. ప్రాణమే మనుష్యులును.

ఉ॥ పితా మాతా ప్రజైత ఏవ మన ఏవ పితా వాఙ్మాతా ప్రాణః ప్రజా. ॥7॥

ప॥ పితా - మాతా - ప్రజా - ఏతే - ఏవ - మనః - ఏవ - పితా - వాక్ - మాతా - ప్రాణః - ప్రజా.

ప్ర॥ పితా=తండ్రియును, మాతా=తల్లియును, ప్రజా=సంతానమును, ఏతఏవ = ఈమనోవాక్ప్రాణములే. (వానిలో) మనఏవ = మనస్సే, పితా=తండ్రి, వాక్ = వాక్కే, మాతా = తల్లి, ప్రాణః= ప్రాణమే, ప్రజా=సంతానము.

తా॥ తండ్రియును తల్లియును సంతానమును ఈ మనోవాక్ప్రాణములే. అందుమనస్సే తండ్రియును, వాక్కే తల్లియును, ప్రాణమే సంతానమును.

ఉ॥ విజ్ఞాతం విజిజ్ఞాస్యమవిజ్ఞాతమేత ఏవ యత్కించ విజ్ఞాతం వాచస్తద్రూపం వాగ్ఘి విజ్ఞాతా వాగేనం తద్భూత్వాఽవతి ॥8॥ యత్కించ

విజిజ్ఞాస్యం మనస_స్త్రద్రూపం మనో హి విజిజ్ఞాస్యం మన ఏనం తద్భూత్వాఽవతి. ॥9॥ యత్కించావిజ్ఞాతం ప్రాణస్య తద్రూపం ప్రాణో హ్యవిజ్ఞాతః ప్రాణ ఏనం తద్భూత్వాఽవతి. ॥10॥

ప॥ విజ్ఞాతం - విజిజ్ఞాస్యం - అవిజ్ఞాతం - ఏతే - ఏవ - యత్కించ - విజ్ఞాతం - వాచః - తత్ - రూపం - వాక్ - హి - విజ్ఞాతా - వాక్ - ఏనం - తత్ - భూత్వా - అవతి - యత్కించ - విజిజ్ఞాస్యం - మనసః - తత్ - రూపం - మనః - హి - విజిజ్ఞాస్యం - మనః - ఏనం - తత్ - భూత్వా - అవతి - యత్కించ - అవిజ్ఞాతం - ప్రాణస్య - తత్ - రూపం - ప్రాణః - హి - అవిజ్ఞాతః - ప్రాణః - ఏనం - తత్ - భూత్వా - అవతి.

ప్ర॥ విజ్ఞాతం=విస్పష్టముగా తెలిసికొనుటయును, విజిజ్ఞాస్యం= విస్పష్టముగా తెలిసికొనుట కిష్టమైనదియును, అవిజ్ఞాతం=విజ్ఞానమునకు గోచరము కానిదియును, ఏతఏవ=ఈవాఙ్మనఃప్రాణములే. విజ్ఞాతం = విస్పష్టముగా తెలిసికొనుట, యత్కించ = ఏదియో, తత్ = అది. వాచః = వాక్కుయొక్క, రూపం = స్వరూపం, వాగ్ఘి = వాక్కే. విజ్ఞాతా = విస్పష్టముగా తెలిసికొనునది. వాక్ = వాక్కు, తత్ = అవిజ్ఞాతస్వరూపము, భూత్వా=అయి, ఏనం=ఈవాగ్విభూతి తెలిసిన వానిని, అవతి = రక్షించుచున్నది. విజిజ్ఞాస్యం = విస్పష్టముగ తెలిసికొనుట కిష్టమైనది, యత్కించ=ఏదియో, తత్ = అది, మనసః = మనస్సుయొక్క, రూపం=స్వరూపము. మనోహి=మనస్సే. విజిజ్ఞాస్యం = విస్పష్టముగ తెలిసికొనుటయొక్క క్రియరూపమైనది. మనః = మనస్సు, తత్ = అవిజ్ఞాస్యస్వరూపము, భూత్వా = అయి, ఏనం= ఈ మనోవిభూతి తెలిసినవానిని, అవతి=రక్షించుచున్నది. అవిజ్ఞాతం =విజ్ఞానాగోచరస్వరూపము, యత్కించ = ఏదియో, తత్ = అది, ప్రాణస్య = ప్రాణముయొక్క, రూపం = స్వరూపము. ప్రాణోహి= ప్రాణమే, అవిజ్ఞాతః = విజ్ఞానాగోచరస్వరూపము, (ఇంద్రియములకు

కనంబడనిరూపము), ప్రాణః=ప్రాణము, తత్ = ఆ అగోచర స్వరూపము, భూత్వా=అయి, ఏనం = ఈ ప్రాణవిభూతి తెలిసినవానిని, అవతి=రక్షించుచున్నది.

తా॥ విస్పష్టముగా తెలిసికొనునట్టి జ్ఞానమును తెలిసికొనుటకిచ్ఛావిషయమైన ప్రేమయును ఇంద్రియాగోచరమును ఇవియును ఈ వాఙ్మనఃప్రాణములే. అందు విజ్ఞానస్వరూపమే వాక్స్వరూపము. వాక్కే విజ్ఞానస్వరూపము. వాక్కు విజ్ఞానస్వరూపమై ఈ వాగ్విభూతి తెలిసినవానిని రక్షించుచున్నది. తెలిసికొనుటకు ఇచ్ఛావిషయమైన ప్రేమరూపే మనోస్వరూపము. మనస్సే తెలిసికొనుట కిచ్ఛావిషయమైన ప్రేమ. ఆ మనస్సు తెలిసికొనుట కిచ్ఛావిషయమైన ప్రేమరూపమై ఈ మనోవిభూతిని తెలిసినవానిని రక్షించుచున్నది. ఇంద్రియాగోచరస్వరూపమైన అజ్ఞానమే ప్రాణస్వరూపము. ప్రాణమే ఆ అజ్ఞానస్వరూపము. ప్రాణమిట్లు ఇంద్రియాగోచరస్వరూపమై ఈ ప్రాణవిభూతి తెలిసిన వానిని రక్షించుచున్నది.

ఉ॥ తస్యై వాచః పృథివీ శరీరం జ్యోతీ రూపమయమగ్ని స్తద్యావ
త్యేవ వాక్తావతీ పృథివీ తావానయమగ్నిః.　　॥11॥

ప॥ తస్యై - వాచః - పృథివీ - శరీరం - జ్యోతీరూపం - అయం - అగ్నిః - తత్ - యావతీ - ఏవ - వాక్ - తావతీ - పృథివీ - తావాన్ - అయం - అగ్నిః.

ప్ర॥ తస్యైవాచః=ఆవాక్కునకు, (తస్యైఅనుచోట విభక్తివ్యత్యయముఛాందసము), పృథివీ=భూమి, శరీరం=దేహము, జ్యోతీరూపం=ప్రకాశస్వరూపమైనయింద్రియము, అయమగ్నిః=ఈఅగ్ని, తత్ = ఆయుభయాత్మకమునందు, (పృథివి అగ్ని ఈ రెంటిరొక్క స్వరూపమునందు), వాక్=వాక్కు, యావత్యేవ=ఎంత పరిమాణము గలది, (భవతి=అగుచున్నదో), పృథివీ = భూమియును, తావతీ= అంతపరిమాణముగలది, (భవతి = అగుచున్నది), అయమగ్నిః =

ఈ అగ్నియును, తావాన్=అంత పరిమాణము గలది, (భవతి=అగుచున్నది).

తా॥ ప్రజాపతికి అన్నముగా చెప్పఁబడిన ఆ వాక్కునకు బాహ్యాధారమగు శరీరము భూమి. ఆ భూమి కాధేయస్వరూపమై ప్రకాశాత్మకమగు ఇంద్రియము అగ్ని. ఇట్లు ప్రజాపతి వాక్కు రెండు రూపములు గలది యగుచున్నది. కార్యమైన ఆధారమగు పృథివి, అప్రకాశమైనది. ఇంద్రియమైన ఆధేయమగు అగ్ని, ప్రకాశమైనది. పృథివ్యగ్ను లనెడి రెంటియొక్క స్వరూపమును ప్రజాపతియొక్క వాక్కే యగుచున్నది. ఆ పృథివ్యగ్ని స్వరూపమునందు వాక్కు అధ్యాత్మాధిభూతములచేత భిన్నమై ఎంతపరిమాణముగలది యగుచున్నదో, అంతటను ఆధారముగా నుండెడి కార్యభూతమైన భూమియును అంతే పరిమాణము గలది యగుచున్నది. ఆధేయమును ఇంద్రియరూపమునగు అగ్ని ప్రకాశరూపముతో భూమిని అనుసరించి ప్రవేశించినదై అంతే పరిమాణము గలది యగుచున్నది.

ఉ॥ అథైతస్య మనసో ద్యౌశ్శరీరం జ్యోతీ రూపమసా వాదిత్య స్త
ద్యావదేవ మనస్తావతీ ద్యౌస్తావానసావాదిత్యస్తౌ మిథునగ్ సమై
తాం తతః ప్రాణోఽజాయత స ఇన్ద్రః స ఏషోఽసపత్నోఽద్వితీ
యో వై సపత్నో నాస్య సపత్నో భవతి య ఏవం వేద. ॥12॥

ప॥ అథ - ఏతస్య - మనసః - ద్యౌః - శరీరం - జ్యోతీరూపం- అసౌ - ఆదిత్యః - తత్ - యావత్ - ఏవ - మనః - తావతీ - ద్యౌః - తావాన్ - అసౌ - ఆదిత్యః - తౌ - మిథునం - సమైతాం- తతః - ప్రాణః - అజాయత - సః-ఇన్ద్రః - సః - ఏషః - అసపత్నః- అద్వితీయః - వై - సపత్నః - న - అస్య - సపత్నః - భవతి - యః - ఏవం - వేద.

ప్ర॥ అథ=అనంతరము, (అధిదైవికమగు వాగ్విభూతియొక్క వ్యాఖ్యానానంతరము), ఏతస్య=ఈ, మనసః=మనస్సునకు, ద్యౌః=

ద్యులోకము, శరీరం=దేహము, జ్యోతీరూపం=ప్రకాశస్వరూపమైన కరణము, అసౌ=ఈ, ఆదిత్యః=సూర్యుఁడు, తత్=దానియందు, (ఆధారాధేయమగు ద్యులోకాదిత్య స్వరూపమైన దానియందు), మనః= మనస్సు, (అధ్యాత్మాధి భూతమగు మనస్సు), యావదేవ=ఎంత పరిమాణముగలది, (భవతి = అగుచున్నదో), ద్యౌః = ద్యులోకము, తావతీ=అంత పరిమాణము గలది, (భవతి=అగుచున్నది). అసౌ= ఈ, ఆదిత్యః=సూర్యుఁడును, తావాన్=అంత పరిమాణముగలవాఁడు, (భవతి=అగుచున్నాఁడు). తౌ=ఆ అగ్న్యాదిత్యు లిద్దఱును, మిథునం= మైథున్యమును, సమైతాం=పొందిరి. (అధిదైవికములగు వాఙ్మనస్సులనెడి మాతాపితలు అన్యోన్య సంసర్గమును పొందిరి). తతః=ఆ సంసర్గమువలన, ప్రాణః=ప్రాణవాయువు, అజాయత = పుట్టెను. సః = ఆ వాయువు, ఇన్ద్రః = పరమేశ్వరుఁడు, సఏషః = ఆ ఈపరమేశ్వరుఁడు, అసపత్నః=విరోధిలేనివాఁడు, ద్వితీయో వై=రెండవవాఁడే, సపత్నః= శత్రువు. (ప్రతిపక్షముగా పొందినవాఁడే శత్రువని చెప్పఁబడుచున్నది) యః=ఎవఁడు, ఏవం=ఈ ప్రకారము, (ప్రాణమును అసపత్నముగా), వేద=తెలిసికొనుచున్నాఁడో, అస్య=వీనికి, సపత్నః = శత్రువు, నభవతి=లేఁడు. (ఉండఁడు).

తా॥ ఇట్లు వాగ్విభూతిని చెప్పిన తరువాత మనోవిభూతిని చెప్పుచున్నాఁడు. ఆ ప్రజాపతి సంబంధమగు అన్నముగాఁ జెప్పఁబడిన మనస్సునకు కార్యభూతమైన యింద్రియాధారమగు శరీరము ద్యులోకము. ప్రకాశ స్వరూపమైన ఆధేయమగు కరణము సూర్యుఁడు. ఇట్లు కార్యకరణాత్మకమైన ద్యులోకాదిత్య స్వరూపమునందు అధ్యాత్మముగాను అధిభూతముగా నుండెడి మనస్సు ఎంత పరిమాణము గలదియో, ప్రకాశరూపమైన కరణమగు మనస్సునకు ఆధారముగా నుండెడి ద్యులోకమును అంతే పరిమాణముగలది యగుచున్నది. ప్రకాశ స్వరూపమును ఆధేయస్వరూపమును కరణము నగు సూర్యుఁడును

అంతే పరిమాణము గలవాఁడగుచున్నాఁడు. ఇట్లు వాఙ్మనస్సులైన అధిదైవికములగు తల్లిదండ్రులిద్దరిలో తండ్రియగు సూర్యుఁడును తల్లియగు అగ్నియును రెండును సంగమమును పొందెను. ఈ ప్రకారము తల్లిదండ్రులగు అగ్న్యాదిత్యుల సంగమమువలన చలనాత్మకమైన కర్మకొఱకు వాయువు పుట్టెను. ఇట్లు పుట్టిన వాయువే పరమేశ్వరుఁడు, ఆ పరమేశ్వరుఁడు తనకు సమానుఁడు లేకపోవుటవలన శత్రువు లేనివాఁడాయెను. లోకమునందు శత్రువనఁగా నెనడనిన తనకు ప్రతిపక్షముగా పొందిన రెండవవాఁడే శత్రువు. ఇట్టి శత్రువులేని వాయువును తెలిసికొనువానికి శత్రువే కలుగఁడు.

ఉ॥ అథైతస్య ప్రాణస్యాపశ్శరీరం జ్యోతీరూపమసౌ చన్ద్రస్తద్యావానేవ ప్రాణస్తావత్య ఆపస్తావానసౌ చన్ద్రస్త ఏతే సర్వ ఏవ సమాస్సర్వేఽనన్తాః స యో హైతానన్తవత ఉపాస్తేఽన్తవన్తగ్ం స లోకం జయత్యథ యో హైతాననన్తానుపాస్తేఽనన్తగ్ం స లోకం జయతి. ॥13॥

ప॥ అథ - ఏతస్య - ప్రాణస్య - ఆపః - శరీరం - జ్యోతీరూపం - అసౌ - చన్ద్రః - తత్ - యావాన్ - ఏవ - ప్రాణః - తావత్యః - ఆపః - తావాన్ - అసౌ - చన్ద్రః - తే - ఏతే - సర్వే - ఏవ - సమాః - సర్వే - అనన్తాః - సః - యః - హ - ఏతాన్ - అన్తవతః - ఉపాస్తే - అన్తవన్తం - సః - లోకం - జయతి - అథ - యః - హ - ఏతాన్ - అనన్తాన్ - ఉపాస్తే - అనన్తం - సః - లోకం - జయతి.

ప్ర॥ అథ = అనంతరము, (అధిదైవికములగు వాఙ్మనస్సుల యొక్క విభూతి నిర్దేశానంతరము), ఏతస్య=ఈ, ప్రాణస్య=ప్రాణమునకు, (ప్రకృతమగు ప్రజాపతి సంబంధాన్నమైన ప్రాణమునకు), ఆపః=ఉదకములు, శరీరం=దేహము, జ్యోతీరూపం=ప్రకాశరూపమైన కరణము, అసౌ=ఈ, చన్ద్రః=చంద్రుఁడు, తత్=దానియందు, (ఆధారాధే

యములగు జలచంద్రస్వరూపమైన దానియందు), ప్రాణః = ప్రాణము, యావానేవ=ఎంత పరిమితి గలది, (భవతి=అగుచున్నదో), ఆపః=ఉదకములు, తావత్యః=అంత పరిమితిగలవి, (భవంతి=అగుచున్నవి). (అధ్యాత్మాది భేదములయందు ప్రాణము ఎంత పరిమాణముగలది యగునో ఆధారములగు ఉదకములును అంతేపరిమాణముగలవి యగుచున్నవి). అసౌ=ఈ, చన్ద్రః = చంద్రుఁడు, తావానేవ = అంతే పరిమాణము గలవాఁడు, (భవతి=అగుచున్నాఁడు). (ఆధేయస్వరూపుఁడైన చంద్రుఁడు ఆయుదకములయందనుసరించి ప్రవేశించి యంతే పరిమితి గలవాఁడును ఇంద్రియ స్వరూపుఁడునై అధ్యాత్మాధి భూతములయందంతటను వ్యాపనము గలవాఁడగుచున్నాఁడు). తే = ఏతే=ఈ వాఙ్మనఃప్రాణములు, సర్వఏవ=అన్నియును, సమాః = సమానములైనవియును, (తుల్యమైన వ్యాప్తిగలవియును) సర్వే=అన్నియును, అనన్తాః=అంతము లేనివియును, (భవన్తి=అగుచున్నవి). ఏతాన్ = వీనిని, యోహ=ఎవఁడైతే, అన్తవతః=పరిమితిగలవానినిగా, ఉపాస్తే= ఉపాసన చేయుచున్నాఁడో, సః=వాఁడు, అన్తవన్తం=అంతముగల, లోకం=లోకమును, జయతి=జయించుచున్నాఁడు. (భిన్నుఁడయ్యే పుట్టుచున్నాఁడు). అథ=తిరిగి, యోహ=ఎవఁడైతే, ఏతాన్=వీనిని, అనన్తాన్=పరిమితిలేని వానినిగా, ఉపాస్తే=ఉపాసన చేయుచున్నాఁడో, సః=వాఁడు, అనన్తం=పరిమితిలేని, లోకం = లోకమును, జయతి= జయించుచున్నాఁడు. (అపరిచ్ఛిన్నమగు ఆత్మస్వరూపుఁడే యగుచున్నాఁడు).

తా॥ ఇట్లు వాఙ్మనస్సులయొక్క విభూతిని చెప్పిన తరువాత ప్రాణవిభూతిని చెప్పుచున్నాఁడు. ప్రజాపతి సంబంధమైన అన్నముగా చెప్పఁబడిన ప్రాణమునకు కార్యభూతమైన యింద్రియాధారమగు శరీరోదకములు. ప్రకాశస్వరూపమైన ఆధేయమగు కరణము చంద్రుఁడు. ఇట్లాధారాధేయాత్మకమైన జలచంద్ర స్వరూపమునందు

ప్రజాపత్యన్నరూపమైన ప్రాణమెంత పరిమితిగలది యగునో కరణా ధారములగు నుదకములును అంతే పరిమితి గలవి యగుచున్నవి. ఆ యుదకములయం దనుసరించి ప్రవేశించియున్న ఆధేయమగు ఇంద్రియ స్వరూపమైన చంద్రుఁడును అంతే పరిమితి గలవాఁడగుచున్నాఁడు. ఆ ప్రసిద్ధములగు ప్రజాపత్యన్నములైన యీవాఙ్మనః ప్రాణము లన్నియును సమానమైన వ్యాప్తి గలవియును అంతము లేనివియు నగుచున్నవి. వీనిని అంతము గలవానినిగా ఉపాసన చేయువాఁడు అంతముగల లోకమునే జయించుచు భిన్నుఁడై పుట్టుచున్నాఁడు. తిరిగి ఈ వాఙ్మనః ప్రాణములనే అంతములేని వానినిగా ఉపాసించెడి వాఁడు అనంతలోకమగు ఆత్మస్వరూపుఁడగుచున్నాఁడు.

ఉ॥ స ఏష సంవత్సరః ప్రజాపతిః షోడశకల స్తస్య రాత్రయ ఏవ పఞ్చ దశ కలా ధ్రువైవాస్య షోడశీ కలా స రాత్రిభిరేవా (౽౽చ) వ పూర్యతే౽ప చ క్షీయతే సో౽మావాస్యాగ్ం రాత్రిమేతయా షోడశ్యా కలయా సర్వమిదం ప్రాణభృదను ప్రవిశ్య తతః ప్రాత ర్జాయతే తస్మాదేతాగ్ం రాత్రిం ప్రాణభృతః ప్రాణం న విచ్ఛిన్ద్యా దపి కృకలా స స్యైతస్యా ఏవ దేవతాయా అపచిత్యై. ॥14॥

ప॥ సః - ఏషః - సంవత్సరః - ప్రజాపతిః - షోడశకలః - తస్య - రాత్రయః - ఏవ - పఞ్చదశ - కలాః - ధ్రువా - ఏవ - అస్య - షోడశీ - కలా - సః - రాత్రిభిః - ఏవ - అవపూర్యతే - అప - చ - క్షీయతే - సః - అమావాస్యాం - రాత్రిం - ఏతయా - షోడశ్యా - కలయా - సర్వం - ఇదం - ప్రాణభృత్ - అనుప్రవిశ్య - తతః - ప్రాతః - జాయతే - తస్మాత్ - ఏతాం - రాత్రిం - ప్రాణ భృతః - ప్రాణం - న - విచ్ఛిన్ద్యాత్ - అపి - కృకలాసస్య - ఏతస్యాః - ఏవ - దేవతాయాః - అపచిత్యై.

ప్ర॥ షోడశకలః=పదియాఱు కళలుగల, సః=ఆ, ప్రజాపతిః= ప్రజాపతి, ఏషః = ఈ, సంవత్సరః = సంవత్సర స్వరూపుఁడు. (కాల

స్వరూపుఁడు). తస్య=ఆ ప్రజాపతికి. రాత్రయఏవ = అహోరాత్రులే, (తిథులే), పఞ్చదశ=పదునైదు, కలాః=కళలు, అస్య= ఈ ప్రజాపతి యొక్క, షోడశీ=పదియాఱవదియగు, కలా=కళ, ధ్రువైవ = నిత్యమయ్యే నిలిచియున్నది. సః=ఆ ప్రజాపతి, రాత్రిభిరేవ=తిథుల చేతనే, అపూర్యతే = నిండింపఁబడుచున్నాఁడు. అపక్షీయతేచ = తగ్గిపోవుచున్నాఁడు. సః=ఆ ప్రజాపతి, అమావాస్యాం = అమావాస్యయను, రాత్రిం=తిథియందు, ఏతయా=ఈ, షోడశ్యా = పదియాఱవదియగు, కలయా=కల చేతను, ఇదం=ఈ, సర్వం=సమస్తమైన, ప్రాణభృత్ = ప్రాణసముదాయమును, అనుప్రవిశ్య=అనుసరించి ప్రవేశించి, తతః= అనంతరము, ప్రాతః = ఉదయకాలమునందు, జాయతే= పుట్టుచున్నాఁడు. (ఆ ప్రజాపతి అమావాస్యయం దున్నడి నిత్యమగు పదియాఱవకళలతో ఈ ప్రాణసముదాయము నంతయు వ్యాపించి అమావాస్య రాత్రియందుండి మఱుదినము రెండవదియగు కలతోఁగూడుకొని పుట్టుచున్నాఁడు). తస్మాత్ =ఆ కారణమువలన, ఏతాంరాత్రిం=ఈ అమావాస్య తిథియందు, ప్రాణభృతః=ప్రాణమును ధరించియున్న ప్రకలాసస్యాపి = (ఊసరవెల్లి దైనను) పాపాత్ముని యొక్కయును, ప్రాణం= జీవమును, నవిచ్ఛిన్ద్యాత్ =హింసింపఁగూడదు. (ఇట్లు హింసింపకుండుట ఎందుకొఱకనిన), ఏతస్యాః = ఈ, దేవతాయాఏవ = సోమదేవత యొక్కయే, అపచిత్యై=పూజకొఱకు.

తా॥ పూర్వము ప్రజాపతి పాఙ్క్తస్వరూపమగు కర్మచేత ఏడువిధములైన యన్నములను సృజించి వానిలో మూఁడు విధములైన వాఙ్మనఃప్రాణములను అన్నములను తనకొఱకు చేసికొనెనని చెప్పఁబడినది. వానిలో ఈ వాఙ్మనఃప్రాణములు మూఁడును పాఙ్క్తస్వరూపమైన కర్మయొక్క ఫలమెట్లగునని శంకింపఁగా చెప్పఁబడుచున్నది. పృథివ్యగ్నులే మాతృస్వరూపము, దివాదిత్యులే పితృస్వరూపము. ఈ రెంటియొక్క మధ్యమందలి ప్రాణవాయువు, సంతానస్వరూపమని

యింతకు పూర్వము చెప్పఁబడియున్నది. ఇట్లు అయిదు విధములైన మాతాపితృ పుత్రవిత్తకర్మములలో ఈ చెప్పఁబడిన మాతాపితృ పుత్రులు ముగ్గురుపోఁగా శేషించిన విత్తకర్మము లేవియనిన వానిని ఇక్కడ వివరించి చూపుటకు ఈ గ్రంథముపక్రమింపఁబడినది. ఎట్లనిన, షోడశకలలే అవయవములుఁగా కలిగి ఈ త్రివిధరూపములైన వాఙ్మనః ప్రాణములను అన్నములే స్వరూపముగాఁగల ఆ ప్రజాపతి, ఈ సంవత్సర స్వరూపుఁడు. (కాలస్వరూపుఁడు) ఇట్లు కాలస్వరూపుఁడైన ఆ ప్రజాపతికి ప్రతిపదాది పదునైదు తిథులును పదునైదు కలలు. అమావాస్యయందు శేషించి యుండెడి యొక కలయే శాశ్వతమైనది. ఇట్లు శాశ్వతమై శేషించియుండెడి పదియాఱవదియగు కలచేత (ఆ ప్రజాపతి ఈ సమస్తమైన ప్రాణిసముదాయము ననుసరించి ప్రవేశించి యుదకమును పానము చేయుచు ఓషధులను భక్షించుచు ఇట్లు సమస్తమును వ్యాపించి యమావాస్య తిథియందుండి యనంతరము మఱునాఁడు ప్రాతఃకాలమున రెండవదియగు కలతోఁగూడుకొనిన వాఁడై పుట్టుచున్నాఁడు, ఇట్లు ప్రజాపతి శుక్లపక్షమునందు ప్రతి దినమునను ఒక్కొక కలతో వృద్ధిపొందినవాఁడై పౌర్ణమాసియందు షోడశకలా పరిపూర్ణుఁడగుచున్నాఁడు. తిరిగి కృష్ణపక్షమునందు ప్రతి దినమునను ఒక్కొక కలతో క్షీణించినవాఁడై యమావాస్య తిథియందు శాశ్వతమైన ఏకకలతో శేషించినవాఁడై యున్నాఁడు. ఇట్లు ప్రజాపతి శుక్ల కృష్ణ పక్షములయందలి పదునైదేసి తిథులనెడి కలలతో విత్తము వలెనే వృద్ధి క్షయ రూపమైన ధర్మము కలవాఁడగుటవలన చంద్రమస్సంబంధములైన తిథులనెడి కలలే విత్తముగాను, కాలావయవములగు ఆ కలలయొక్క జగత్పరిణామ హేతుత్వమే కర్మముగాను, చెప్పఁబడుచున్నది. ఈ ప్రకారముగా ఈ ప్రజాపతి, నాకు జాయ కలుగునుగాక సంతానము కలుగునుగాక ధనము కలుగునుగాక కర్మచేయుదునుగాక యనెడి కోరికలకు అనురూపముగా ప్రాప్త-

కర్మయొక్క ఫలస్వరూపుఁడై యుండెను. ఏ కారణమువలన ప్రజాపతి స్వరూపుఁడైన చంద్రుఁడు ఈ అమావాస్య తిథియందు శాశ్వతమైన కళతో ప్రాణిసమూహమును అనుసరించి ప్రవేశించియున్నాఁడో ఆ కారణమునుండియే ఈ అమావాస్య తిథియందు జీవులు పాపాత్ముని ప్రాణమునుగూడ హింసింపఁగూడదు అని చెప్పఁబడుచున్నది. లోకమునందు ప్రాణిహింసయే చేయఁగూడదని సాధారణముగా చెప్పియుండఁగా ఈ యమావాస్యయందు మిక్కిలి జీవహింస చే కూడదని నిషేధించుట, ప్రజాపతి స్వరూపమగు ఈ చంద్రదేవతయొక్క పూజకొఱకని యెఱుంగఁదగినది.

ఉ॥ యో వై స సంవత్సరః ప్రజాపతిః షోడశకలో౽యమేవ స యో౽యమేవంవిత్పురుషస్తస్య విత్తమేవ పఞ్చదశకలా ఆత్మైవాస్య షోడశీ కలా స విత్తేనైవా చ పూర్యతే౽ప చ క్షీయతే తదేతన్నభ్యం యదయమాత్మా ప్రధిర్విత్తం తస్మాద్యద్యపి సర్వజ్యానిం జీయత ఆత్మనా చేజ్జీవతి ప్రధినాగాదిత్యేవాహుః ॥15॥

ప॥ యః – వై – సః – సంవత్సరః – ప్రజాపతిః – షోడశకలః – అయం – ఏవ – సః – యః – అయం – ఏవం – విత్ – పురుషః – తస్య – విత్తం – ఏవ – పఞ్చదశకలాః – ఆత్మా – ఏవ – అస్య – షోడశీ – కలా – సః – విత్తేన – ఏవ – ఆ – చ – పూర్యతే – అప – చ – క్షీయతే – తత్ – ఏతత్ – నభ్యం – యత్ – అయం – ఆత్మా – ప్రధిః – విత్తం – తస్మాత్ – యది – అపి – సర్వజ్యానిం – జీయత – ఆత్మనా – చేత్ – జీవతి – ప్రధినా-అగాత్ – ఇతి – ఏవ – ఆహుః.

ప్ర॥ షోడశకలః = పదియాఱుకళలుగలవాఁడును, సంవత్సరః =సంవత్సర స్వరూపుఁడునగు ప్రజాపతిః = ప్రజాపతి, యో వై = ఎవఁడో, సః=ఆ ప్రజాపతి, అయమేవ=వీడే, (వీడెవఁడనగా), ఏవం విత్ =ఈ పూర్వోక్తప్రకారము తెలిసికొనిన, పురుషః = పురుషుఁడు,

యః=ఎవఁడో, సః=వాడే, అయం = ఈ ప్రజాపతి, తస్య=ఆ ప్రజాపతికి, విత్తమేవ = ధనమే, (గోవులు మొదలైన ధనమే) పఞ్చదశ కలాః=పదునైదుకలలు, అస్య=ఈప్రజాపతికి, ఆత్మైవ=ఆత్మస్వరూపమే, షోడశీకలా=పదియాఱవకల, సః = ఆప్రజాపతి, విత్తేనైవ= ధనముచేతనే, ఆపూర్యతేచ = మిక్కిలి పరిపూర్ణుఁడగుచున్నాఁడు, అపక్షీయతేచ = క్షీణించుచున్నాఁడు. తదేతత్ = ఆఇది, నభ్యం= నాభిస్థానార్హమైనది. (అదియేదియనిన), అయం = ఈ, ఆత్మా=ఆత్మస్వరూపము, (పిణ్డము), యత్=ఏదియో, (తత్=అది), ప్రధిః=బండిపట్టావంటిదియగు విత్తము. (బండిచక్రమునకు ఆకులు పట్టా మొదలైనవివలెనే ఈదేహము వెలుపలనుండెడి పరివారస్థానీయమగు విత్తమువంటిదిగా నున్నది). తస్మాత్=ఆ కారణమువలన, సర్వజ్యానిం=సమస్తనాశనమును, జీయతేయద్యపి = పొందినను, (సమస్తధనముయొక్క హానిని పొందినను), ఆత్మనా = ఆత్మస్వరూపముతో, (చక్రమువంటిదియగు ఆత్మస్వరూపముతో), జీవతిచేత్ = జీవించియుండెనేని, ప్రధినా = బండిపట్టా మొదలైన దానివంటిదియగు విత్తముతో, (అయం = వీఁడు), అగాదిత్యేవ = (క్షీణించుటను) పొందినవాడేయని, (వెలుపలనుండెడి పరివారముతో క్షీణించినవాఁడని), ఆహుః=చెప్పెదరు.

తా॥ పూర్వము అధిదైవికమగు త్రివిధరూపమైన వాఙ్మనః ప్రాణములనెడి యన్నమే స్వరూపముగాగల ప్రజాపతియొక్క ధ్యానము చెప్పఁబడినది. ఇప్పుడు ఆప్రజాపతి స్వరూపమే నేనైతినని స్వస్వరూపగ్రహణముతో ధ్యానింపఁదగినదియని చెప్పుచున్నాఁడు. ఇంతకుపూర్వము పరోక్షముగా చెప్పఁబడినవాడును పదియాఱు కలలు గలవాఁడును కాలస్వరూపుఁడునగు ప్రజాపతి మిక్కిలి పరోక్షమైనవాడుగా తలంపఁతగినవాడు కాడు. ఎట్లనఁగా, ఆప్రజాపతి, పూర్వము చెప్పినప్రకారము త్రివిధరూపమైన వాఙ్మనఃప్రాణములను

అన్నమే స్వరూపముగాఁగల ప్రజాపతిని ఆత్మస్వరూపమైనవానినిగా తెలిసికొనిన ఈ ప్రత్యక్షమగు పురుషుడై యున్నాఁడు. కనుక ఇట్లు తెలిసికొని ప్రత్యక్షముగానుండెడి కరచరణాద్యవయవ విశిష్టుడగు పురుషుని ప్రజాపతినిగా తెలిసికొనవలయును. ఏసామ్యముచేత ఈపురుషుని ఆప్రజాపతినిగా తెలిసికొనవలయుననిఁ జెప్పఁబడుచున్నది. అనగా ఇట్లు ప్రజాపతిస్వరూపమును తెలిసికొనిన ఆపురుషునికి గోవులు మొదలైన ధనమే వృద్ధిక్షయ రూపమగుటవలన ప్రజాపతియొక్క పదునైదుకళలుగాను, ఈ తెలిసికొనిన పురుషునియొక్క పిణ్డమే (దేహము) ప్రజాపతియొక్క పదియాఱవదియగు శాశ్వతమైన కలగాను చెప్పఁబడియున్నది. ఈపురుషుడను ప్రజాపతి, గోవులు మొదలైన విత్తముచేతనే పదునైదుతిథులనెడి కలలచేత చంద్రునివలెనే వృద్ధిక్షయములను పొందుచున్నాఁడు. ఇది లోకప్రసిద్ధమై యున్నది. ఆత్మస్వరూపమే శాశ్వతమైన కలగా చెప్పఁబడినది. దానినే రథముయొక్క చక్రదృష్టాంతముతో స్పష్టముగా తెలియఁజేయుచున్నాఁడు. ఎట్లనగా, ఈయాత్మ స్వరూపమేదియో అది (దేహము) బండిచక్రమునకు ఆకులు పట్టా మొదలైన వానివలెనే వెలుపలనుండెడి పరివారస్థానీయమగు విత్తమువంటిదిగానున్నది. కనుక పురుషుడు బాహ్యమునందలి దేహమను విత్తమునందు బడలికను పొందినవాడైనను చక్రమువంటిదియగు ఆత్మస్వరూపముతో జీవించియుండినయెడల బండిపట్టా మొదలైనవాని వంటిదియగు బాహ్యమునందలి దేహమను విత్తముతో క్షీణమునుపొందినను బండిచక్రము వెలుపలనుండెడి ఆకులు పట్టా మొదలైనవానితోఁ గూడుకొని వృద్ధిపొందినట్లు ఈపురుషుడును వెలుపలనుండెడి బండి చక్రముయొక్క ఆకులు పట్టా మొదలైన వానివంటిదియగు శరీరమను విత్తముతోఁగూడుకొని వృద్ధిపొందుచున్నాఁడని యభిప్రాయము.

ఉ॥ అథ త్రయో వావ లోకా మనుష్యలోకః పితృలోకో

దేవలోక ఇతి సోఽయం మనుష్యలోకః పుత్రేణైవ జయ్యో
నాన్యేన కర్మణా కర్మణా పితృలోకో విద్యయా దేవలోకో దేవ
లోకో వై లోకానాగ్ శ్రేష్ఠస్తస్మాద్విద్యాం ప్రశగ్ సన్తి ॥16॥

ప॥ అథ - త్రయః - వావ - లోకాః - మనుష్యలోకః - పితృలోకః - దేవలోకః ఇతి - సః - అయం - మనుష్యలోకః - పుత్రేణ - ఏవ - జయ్యః - న - అన్యేన - కర్మణా - కర్మణా - పితృలోకః - విద్యయా - దేవలోకః - దేవలోకః - వై - లోకానాం - శ్రేష్ఠః - తస్మాత్ - విద్యాం - ప్రశంసన్తి.

ప్ర॥ అథ=అనంతరము, లోకాః=లోకములు, మనుష్యలోకః=మనుష్యలోకము, పితృలోకః = పితృలోకము, దేవలోకః = దేవలోకము, ఇతి=అని, త్రయోవావ=మూడే, (స్థితాః=ఉన్నవి. తేషాం=ఆలోకములలో), సః=ఆప్రసిద్ధమగు, అయం=ఈ, మనుష్యలోకః=మనుష్యలోకము, పుత్రేణైవ=పుత్రునిచేతనే, జయ్యః=జయింపఁదగినది. అన్యేన=ఇతరమగు, కర్మణా=కర్మచేతను, (విద్యయా వా=విద్యచేతను), న=జయింపఁదగినదిగాదు. కర్మణా=అగ్నిహోత్రాదిలక్షణమగు కేవలకర్మచేత, పితృలోకః=పితృలోకము, (జేతవ్యః=జయింపఁదగినది. ఇతరమగు పుత్రునిచేతను విద్యచేతను జయింపఁదగినది కాదు). దేవలోకః = దేవలోకము, విద్యయా = అపరవిద్యచేతను, ఋగ్యజుస్సామాథర్వణములును శిక్షాదిషడంగములును, ఇవియన్నియు చేరి అపరవిద్యయనఁబడును. దీనిని ముణ్డకోపనిషత్తు ప్రథమఖణ్డము ౫ వ మంత్రమునందు చూచుకొనవలయును). (జేతవ్యః = జయింపఁతగినది. అన్యమగు పుత్రునిచేతను కర్మచేతను జయింపఁదగినది కాదు). దేవలోకోవై = దేవలోకమే, లోకానాం = లోకములలో, శ్రేష్ఠః=ప్రశస్తమైనది. తస్మాత్ = ఆ దేవలోక సాధనమగుటవలన, విద్యాం=విద్యను, ప్రశంసన్తి=శ్లాఘించుచున్నారు.

తా॥ ఇట్లు పాఙ్క్తస్వరూపమును దైవవిత్తవిద్యాసంయుక్తమ

నగు కర్మచేత మూడువిధములగు వాఙ్మనఃప్రాణములనే అన్నములే స్వరూపముగాఁగల ప్రజాపతి యగుచున్నాఁడని వ్యాఖ్యానము చేయఁబడినది. అనంతరము భార్యాదివిత్తము పరివారస్థానీయమని చెప్పఁబడినది దానియందు పుత్రకర్మాపరవిద్యలకు లోకప్రాప్తి సాధనత్వముమాత్రము సామాన్యముగా తెలియఁబడినది. పుత్రాదులకు లోకప్రాప్తినిగూర్చి, విశేషముగా సంబంధ నియమము తెలియఁబడలేదు. కనుక పుత్రాది సాధనములకు సాధింపఁదగిన ఆ విశేష సంబంధము చెప్పఁదగినదియని యుత్తరగ్రన్థము చెప్పఁబడుచున్నది. మరియు మనుష్యలోక పితృలోక దేవలోకములని లోకములు మూడే యున్నవి. అందు ఈ ప్రసిద్ధమగు మనుష్యలోకము పుత్రుఁడను సాధనముచేత జయింపఁదగినది. అన్యములగు కర్మవిద్యలచేత జయింపఁదగినది కాదు. అగ్నిహోత్రాదిలక్షణమగు కేవల కర్మచేతనే పితృలోకము జయింపఁదగినది. అన్యములగు పుత్రవిద్యలచేత జయింపఁదగినది కాదు. దేవలోకము అపరవిద్యచేత సాధింపఁదగినది; అన్యములగు పుత్రకర్మచేతను జయింపఁదగినది కాదు. ఈ సమస్తలోకములలో దేవలోకమే మిక్కిలి శ్రేష్ఠమైనది, అట్టి దేవలోకసాధనమగుటవలన అపరవిద్యను జ్ఞానులుమిక్కిలి కొనియాడుచున్నారు.

ఉ॥ అథాతః సంప్రత్తిర్యదా ప్రైష్యన్మన్యతేఽథ పుత్రమాహ త్వం బ్రహ్మ త్వం యజ్ఞస్త్వం లోక ఇతి స పుత్రః ప్రత్యాహాహం బ్రహ్మాహం యజ్ఞోఽహం లోక ఇతి యద్వై కించానూక్తం తస్య సర్వస్య బ్రహ్మేత్యేకతా । యే వై కే చ యజ్ఞాస్తేషాగ్ం సర్వేషాం యజ్ఞ ఇత్యేకతా యే వై కే చ లోకాస్తేషాగ్ం సర్వేషాం లోక ఇత్యేకతైతావద్వా ఇదగ్ం సర్వమేతన్మా సర్వగ్ం సన్నయమితోఽభునజదితి తస్మాత్ పుత్రమనుశిష్టం లోక్యమాహుస్తస్మాదేనమనుశాసతి స యదైవంవిదస్మాల్లోకాత్ప్రైత్యథైభిరేవ ప్రాణైస్సహ పుత్రమావిశతి । సయద్యనేన కించిదక్ష్ణయాఽకృతం

ఖవతి తస్మాదేనగ్ సర్వస్మాత్పుత్రో ముఞ్చతి తస్మాత్పుత్రో నామ స పుత్రేణైవాస్మిల్లోకే ప్రతితిష్ఠత్యథైనమేతే దైవాః ప్రాణా అమృతా ఆవిశన్తి. ॥17॥

ప॥ అథ - అతః - సమ్ప్రత్తిః - యదా - ప్రైష్యన్ - మన్యతే - అథ - పుత్రం - ఆహ - త్వం - బ్రహ్మ - త్వం - యజ్ఞః - త్వం - లోకః - ఇతి - సః - పుత్రః - ప్రతి - ఆహ - అహం-బ్రహ్మ - అహం - యజ్ఞః - అహం - లోకః - ఇతి - యత్ - వై కించ - అనూక్తం - తస్య - సర్వస్య - బ్రహ్మ - ఇతి - ఏకతా - యే - వై - కే - చ - యజ్ఞాః - తేషాం - సర్వేషాం - యజ్ఞః - ఇతి - ఏకతా - యే - వై - కే - చ - లోకాః - తేషాం - సర్వేషాం - లోకః - ఇతి - ఏకతా - ఏతావత్ - వై - ఇదం - సర్వం - ఏతత్ - మా - సర్వం - సన్నయం - ఇతః - అభునజత్ - ఇతి-తస్మాత్ - పుత్రం - అనుశిష్టం - లోక్యం - ఆహుః - తస్మాత్, ఏనం - అనుశాసతి - సః - యదా - ఏవంవిత్ - అస్మాత్ - లోకాత్ - ప్రైతి - అథ - ఏభిః - ఏవ - ప్రాణైః - సహ - పుత్రం - ఆవిశతి - సః - యది - అనేన - కించిత్ - అక్ష్ణయా - కృతం-భవతి - తస్మాత్ - ఏనం - సర్వస్మాత్ - పుత్రః - ముఞ్చతి - తస్మాత్ - పుత్రో - నామ - సః - పుత్రేణ - ఏవ - అస్మిన్ - లోకే - ప్రతితిష్ఠతి - అథ - ఏనం - ఏతే - దైవాః - ప్రాణాః - అమృతాః - ఆవిశన్తి.

ప్ర॥ అతః=అందువలన, అథ = అనంతరము, సమ్ప్రత్తిః= సంప్రదానమనుకర్మ, (కర్తవ్యం=చేయఁదగినది). (సంప్రదానమనఁగా ముందు చెప్పఁబోవుెడి కర్మకుపేరు. ఇది, సః=ఆ తండ్రి), యదా = ఎప్పుడు, ప్రైష్యన్=మరణమును పొందుచు, (అరిష్టాది దర్శనముచే నేను మరణమును పొందగలనని), మన్యతే = తలంచుచున్నాఁడో, అథ=అప్పుడు, పుత్రం=కుమారుని, ఆహూయ=పిలిచి, త్వం = నీవు,

బ్రహ్మ=బ్రహ్మవు, త్వం=నీవు, యజ్ఞః=యజ్ఞస్వరూపుఁడవు. త్వం=నీవు, లోకః=లోకస్వరూపుఁడవు, ఇతి = అని, ఆహ = పలికెను. సః పుత్రః=ఆకుమారుఁడు, (ఏవముక్తః=ఇట్లు చెప్పఁబడినవాఁడై), అహం =నేను, బ్రహ్మ=బ్రహ్మను, అహం=నేను, యజ్ఞః=యజ్ఞస్వరూపుఁడను, అహం=నేను, లోకః=లోకస్వరూపుడను, ఇతి=అని, ప్రత్యాహ =తిరిగిపలికెను. (ఈవాక్యత్రయముయొక్క అర్థము తిరోహితమైనదని తలంచుచు శ్రుతి వ్యాఖ్యానమునకు ప్రవర్తించుచున్నది). యద్వైకించ=ఏదైనను, అనూక్తం=చెప్పఁబడలేదో, (నాచేత అధ్యయనము చేయఁబడినది గాని అధ్యయనము చేయఁబడనిది గాని ఏదైనను చెప్పఁబడక మిగిలియున్నదో), తస్యసర్వస్య=ఆసమస్తమునకు, బ్రహ్మేతి = బ్రహ్మయను ఈ పదమునందు, ఏకతా = ఏకత్వము, (భవతి = అగుచున్నది). (ఇంతవఱకున్నునాకు చేయఁదగియున్న అధ్యయనవ్యాపారము ఇఁకమీఁదట నీవే కర్తగాఁగలదియగునుగాక యని భావము. అపరిశాంతముగానే), యేవైకేచ=ఏవైనను, యజ్ఞాః =యజ్ఞములు, (మయా=నాచేతను, అనుష్ఠితాశ్చ = చేయఁబడినవియును, అననుష్ఠితాశ్చ = చేయబడనివియునై, స్థితాః = ఉన్నవో), తేషాంసర్వేషాం=వానికన్నిటికిని, యజ్ఞఇతి=యజ్ఞమను ఈపదమునందు, ఏకతా=ఏకత్వము. (భవతి=అగుచున్నది). (ఇదివఱకు నేను కర్తగా కలిగిన యజ్ఞములన్నియును ఇఁకమీఁదట నీవేకర్తగాఁగలవియగునుగాక యని యర్థము). యేవైకేచ = ఏవైనను, లోకాః= లోకములు, (మయా=నాచేతను, జితాశ్చ = జయింపఁబడినవియును, అజితాశ్చ = జయింపఁబడనివియునై, స్థితాః = ఉన్నవో), తేషాం సర్వేషాం=వాన్నికన్నిటికిని, లోకఇతి=లోకమను ఈ పదమునందు, ఏకతా = ఏకత్వము, (భవతి = అగుచున్నది). (ఇదివఱకు నాచేత జయింపఁదగిన లోకములన్నియును ఇకమీఁదట నీచేతజయింపదగినవి యని యర్థము). ఇదంసర్వం=ఈసమస్తమును, ఏతావద్వై = ఇంతే

పరిమాణముగలది. (ఈసర్వము గృహస్థులచేత చేయఁదగినది). ఏతత్=ఈ, సర్వం=సమస్తమును, (సః=ఆపుత్రుఁడు, ఆత్మని=తన యందు), సన్నయం=ఉంచుకొని, మా=నన్ను, ఇతః = ఈలోకము నుండి, అభునజత్=పరిపాలించఁగలడు, ఇతి = అని, (పితా=తండ్రి), ఆహ=పలికెను). (ఇంతకుపూర్వము అధ్యయనముచేయఁదగిన వేద ములకొఱకును, చేయఁదగిన యజ్ఞములకొఱకును, జయింపఁదగిన మనుష్యాదిలోకములకొఱకును, నాచేతనుచేయఁదగిన క్రతువునుండి నేను ముక్తుఁడనైతిని. ఇకమీఁదట ఈ నాభారమునంతయు ఆపుత్రుఁడే తనయందుంచుకొని నన్ను ఈ లోకమునుండి పరిపాలించఁగలఁడని, పలుకుచుండెడి తండ్రియొక్క యభిప్రాయమును తలంచుచు శ్రుతి ఇట్లుపలికెను). తస్మాత్=ఆ కారణమునుండి, (బ్రాహ్మణాః=బ్రహ్మ వేత్తలు), అనుశిష్టం=అనుసరించి, శిక్షింపఁబడిన, పుత్రం=కుమారుని, లోక్యం=శ్లాఘింపఁదగినవానినిగా, ఆహుః=చెప్పిరి. తస్మాత్=ఆ కార ణమునుండియే, ఏనం = ఈకుమారునిగూర్చి, (పితరః = తండ్రులు), అనుశాసతి = ఆజ్ఞాపించుచున్నారు. ఏవంవిత్ = ఇట్లు తెలిసియున్న, సః=అతఁడు, యదా=ఎప్పుడు, అస్మాల్లోకాత్ = ఈలోకమునుండి, ప్రైతి=మరణమును పొందుచున్నాఁడో, అథ=అప్పుడు, ఏభిః = ఈ, ప్రాణైరేవ= ప్రాణములతో, (ఈప్రకృతములైన వాఙ్మనః ప్రాణ ములతో), సహ=కూడ, పుత్రం=కుమారుని, ఆవిశతి=పొందు చున్నాఁడు. సఃపుత్రోయది = వాఁడు పుత్రుఁడాయెనేని) అనేన = ఈ తండ్రిచేతను, (కదాచిత్ = ఒకానొకప్పుడు, కర్తవ్యం = చేయఁదగినది), కించిత్=కొంచెమైనను, అక్ష్ణయా = కోణచ్ఛిద్రము వలన, (ఏదో యొకవైపున కలిగిన లోపమువలన), అకృతం=చేయఁ బడనిది, భవతి=అగునో, తస్మాత్=ఆ, సర్వస్మాత్=సమస్తమునుండి, ఏనం=ఈతండ్రిని, ముఞ్చతి=విడిపించుచున్నాఁడు. తస్మాత్=ఆ కార ణమునుండి, పుత్రోనామ=పుత్రుఁడని ప్రసిద్ధుఁడు, (భవేత్=అగును),

సః=ఆ తండ్రి, పుత్రేణైవ=ఇటువంటి పుత్రునిచేతనే, అస్మిన్ లోకే= ఈలోకమునందు, ప్రతితిష్ఠతి = ఉంచుచున్నాఁడు, ఇట్లు తండ్రి పుత్రుని చేత ఈమనుష్యలోకమును జయించుచున్నాఁడు). అథ=అనంతరము, (సమ్ప్రదాన కర్మానంతరమునందు), దైవాః = హిరణ్యగర్భసంబంధ ములగు, ఏతే = ఈవాక్కు మొదలైన, ప్రాణాః = ప్రాణములు, అమృతాః=మరణములేనివై, ఏనం=వీనిని, (ఈపూర్వోక్తప్రకారము సంప్రదానకర్మ చేసినవానిని), ఆ విశన్తి=పొందుచున్నవి.

తా॥ ఇట్లు పుత్ర, కర్మ, అపరవిద్యలను పేరుగల మూఁడు సాధ నములను సాధింపఁదగిన మనుష్యాది లోకత్రయముయొక్క ఫల భేదముచేత వినియోగింపఁబడినది. ఈ సాధనములలో భార్య, పుత్రి, కర్మలే ప్రయోజనములుగా కలదగుటవలన వేరొక సాధనముగా చెప్పఁబడలేదు. విత్తమును అదే ప్రకారము కర్మకు సాధనమగుట వలన వేఱొక సాధనముగా చెప్పఁబడినదికాదు. అపరవిద్యాకర్మలు, క్రియాస్వరూపములగుటవలన, దేవలోక పితృలోకములయొక్క జయ మునకు కారణములగుట, స్వాత్మయొక్క ప్రతిలాభముచేతనే యగు చున్నదని ప్రసిద్ధమైనది. పుత్రుఁడు క్రియాస్వరూపుఁడు కాకపోవుట వలన ఏ విధముగా మనుష్యలోకజయమునకు కారణమగునో తెలియఁ బడలేదు. కనుక విద్యాకర్మలను వదలి అపుత్రవిషయకమగు మనుష్య లోక జయమును ఇక్కడ వివరించి చెప్పుట కారంభింపఁబడుచున్నది. తండ్రి పుత్రునియందు తన సంబంధమైన వ్యాపారము నుంచుటకు సమ్ప్రత్తియని పేరు. ఆ సమ్ప్రత్తియను కర్మను తండ్రి యెప్పుడు చేయవలయుననిన, తాను అరిష్టములగు స్వప్నాది దర్శనములచేత మరణమును పొందుదునను నిశ్చయము కలిగినప్పుడు తండ్రి కుమారుని పిలిచి నీవు బ్రహ్మవు, యజ్ఞస్వరూపుఁడవు లోకస్వరూపుఁడవు అని పలుకగా ఇట్లు చెప్పఁబడిన ఆ పుత్రుఁడు పూర్వమే అనుసరించి శిక్షింపఁబడిన వాడగుటచేత నేను బ్రహ్మను నేను యజ్ఞస్వరూపుఁడను

నేను లోకస్వరూపుఁడనని తిరిగి పలికెను. ఇట్లు తండ్రిచేత పలుకఁబడిన నీవు బ్రహ్మవు అనునది మొదలైన వాక్యత్రయముయొక్క అర్థము మరుగైయుండునని తలంచుచు శ్రుతియే ఆ వాక్యత్రయముయొక్క అర్థమును వివరించి చెప్పుచున్నది. ఎట్లనిన, నీవు బ్రహ్మవు అని పలికిన తండ్రియొక్క వాక్యమునకు ఇంతకు పూర్వము నాచేత అధ్యయనము చేయఁబడినదిగాని అధ్యయనము చేయఁబడనిదిగాని ఏదైనను లోపించియున్న సర్వమునకు నీవే కర్తవై పూర్తిచేయుమా యని భావము. నీవు యజ్ఞస్వరూపుడవని పలికిన వాక్యమునకు ఇంతకు పూర్వము నాచేత చేయఁబడినవియును చేయఁబడనివియునగు యజ్ఞము లేవియో వానికన్నిటికి ఇకమీఁదట నీవే కర్తవై పూర్తి చేయఁదగినది యని భావము. నీవు లోకస్వరూపుడవని పలికిన వాక్యమునకు ఇంతకు పూర్వము నాచేత పుత్రకర్మాపరవిద్యలను మూఁడు సాధనముల చేతను జయింపఁబడినవియును జయింపఁబడనివియునగు ఆ మనుష్య పితృదేవలోకము లన్నియును ఇకమీఁదట నీచే జయింపఁబడఁదగినవి యని భావము. ఈప్రకారము గృహస్థునకు చేయఁదగినది. ఇట్లు తండ్రి ఈ పూర్వము చెప్పిన బ్రహ్మ, యజ్ఞ, లోకములను మూఁటికొఱకు తనచేతఁ జేయఁదగిన క్రతువువలన (సంకల్పమువలన) నేను ముక్తుఁడ నైతినని ఇకమీఁదట ఈ నాభారమునంతయు ఆ పుత్రుఁడే తనయం దుంచుకొని నన్ను ఈ లోకమునుండి పరిపాలించునని పలుకుచున్న యభిప్రాయమునే శ్రుతి యిట్లు వివరించినది. కనుకనే బ్రహ్మవేత్తలు ఈ ప్రకారము తండ్రిచేత ననుసరించి శిక్షితుఁడగు పుత్రుని కొనియాడ తగినవానినిఁగా చెప్పిరి. ఆ కారణమువల్లనే తండ్రులు మనపుత్రుఁడు శ్లాఘనీయుఁడు కావలయునని ఈ పుత్రుని శిక్షితునిగాఁ జేయుచున్నారు. ఇట్లు తెలిసిన ఆ తండ్రి కుమారునియం దుంచఁబడిన, క్రతుస్వరూపము గలవాఁడై ఈ లోకమునుండి మరణమును పొందు నప్పుడు దేహమునెడి భిన్నరూపమైన హేతువు పోవుటవలన తండ్రి

యొక్క వాఙ్మనః ప్రాణములు స్వకీయమైన పృథివ్యగ్న్యర్కా-ద్యాత్మక ములు ఆధిదైవిక స్వరూపముతో సమస్తమును పొందుచున్నవి. ఆ ప్రాణములతోకూడ తండ్రియును అప్పుడు ఈ పుత్రుని పొందు చున్నాఁడు. కనుక అనుశిష్టుఁడగు పుత్రుడుగల ఆ తండ్రి పుత్రి రూపముతో ఈ లోకమునందే యుండియున్నాఁడు. అట్టివాఁడు మర ణము పొందినవాఁడుగా తలంపఁదగినవాడు కాడు. పుత్రుఁడు తండ్రి చేతఁ జేయఁబడిన లోపమునంతయు పోఁగొట్టి పూర్తిచేసి ఆ లోపము వలన తండ్రిని విడిపించి రక్షించుటవలన ప్రసిద్ధముగ పుత్రుఁడను పేరు గలవాడగుచున్నాడు. ఇట్టిపుత్రునిచేత ఆతండ్రి ఈలోకమునందు మర ణమును పొందినను మరణమును పొందనివాఁడై యుండియున్నాఁడు. ఇట్లు తండ్రి పుత్రునిచేత ఈ మనుష్యలోకమును జయించుచున్నాఁడు. ఆ ప్రకారము స్వరూపలాభసత్తామాత్రముతో విద్యాకర్మలచే దేవ లోక పితృలోకములు జయింపఁబడినవి కావు. విద్యాకర్మలు స్వరూప లాభమునకు వేరుగా పుత్రుని వలెనే వ్యాపారాంతరముద్వారా లోక జయహేతుత్వమును పొందవు. అనంతరము ఈ పూర్వము చెప్పిన ప్రకారము చేయఁబడిన సమ్ప్రత్తియను కర్మగల ఈతండ్రిని హిరణ్య గర్భుని సంబంధములైన మరణధర్మము లేనివగు వాగాది ప్రాణములు పొందుచున్నవి. ఎట్లనిన పై మంత్రము చెప్పఁగలదు. ఈ ప్రకారము శ్రుతిచేత స్వకీయముగా పుత్రకర్మాపరవిద్యలకు మనుష్యలోక పితృ లోక దేవలోకములను సాధించుటయే ప్రయోజనముగాఁ గలు గుట చూపింపఁబడినది.

ఉ॥ పృథివ్యై చైనమగ్నేశ్చ దైవీ వాగావిశతి సా వై దైవీ వాగ్యయా యద్యదేవ వదతి తత్తద్భవతి. ॥18॥

ప॥ పృథివ్యై - చ - ఏనం - అగ్నేః - చ - దైవీ - వాక్ - ఆవిశతి - సా - వై - దైవీ - వాక్ - యయా - యత్ - యత్ - ఏవ - వదతి - తత్ - తత్ - భవతి.

ప్ర॥ దైవీ=అధిదైవాత్మికమగు, వాక్=వాక్కు, పృథివ్యైచ= భూమివలనను, (ఇక్కడ చతుర్థికి పంచమ్యర్థము), అగ్నేశ్చ=అగ్ని వల్లను, ఏనం = వీనిని, (ఈ పూర్వోక్తమైన సంప్రత్తికర్మను చేసిన వానిని), ఆవిశతి = పొందుచున్నది. (విద్వాన్ = విద్వాంసుఁడు), యయా=ఏ వాక్కుచేత, యద్య దేవ=దేని దేనినే, (ఆత్మనే=తనకొఱకు గాని, పరస్మై=ఇతరునికొఱకుగాని) వదతి=పలుకుచున్నాఁడో, తత్తత్= అదియది, భవతి=అగుచున్నది. సా వై=అదియే, దైవీ=దైవసంబంధ మైన, వాక్=వాక్కు, (అనృతాది దోషరహితమైన పరిశుద్ధవాక్కు).

తా॥ పూర్వశ్లోకమునందు చెప్పిన ప్రకారము చేయఁబడిన సమ్ప్రత్తికర్మగల వానిని మరణ ధర్మములేని హిరణ్యగర్భ సంబంధము లైన వాగాది ప్రాణములు ఎట్లు పొందుచున్నవనిన అదియే ఈ మంత్రమునందు వివరింపఁబడుచున్నది. పృథివ్యగ్నులే లక్షణముగాఁ గల అధిదైవికమగు వాక్కు ఈ సమ్ప్రత్తి కర్మచేసినవానిని పొందు చున్నది. ఆవాక్కు ఎట్టిదనిన, లోకమునందు విద్వాంసులు ఏవాక్కు చేత తన కొఱకుగాని యితరునికొఱకుగాని అనుకూలమైనను ప్రతికూల మైనను పలికినప్పుడు తప్పకయగునో, అట్టిశాపానుగ్రహమైన వాక్కే ఆయనృతాది దోషరహితమైన పరిశుద్ధ వాక్కు.

ఉ॥ దివశ్చైనమాదిత్యాచ్చ దైవం మన ఆవిశతి తద్వై దైవం మనో యేనానన్ద్యేవ భవత్యథో న శోచతి. ॥19॥

ప॥ దివః-చ-ఏనం - ఆదిత్యాత్ - చ - దైవం - మనః - ఆవిశతి - తత్ - వై - దైవం - మనః - యేన - ఆనన్దీ, ఏవ - భవతి - అథో - న - శోచతి.

ప్ర॥ దైవం=అధిదైవికమగు, మనః=మనస్సు, (నిర్మలమైన మనస్సు), దివశ్చ=ఆకాశము వల్లను, ఆదిత్యాచ్చ=సూర్యునివల్లను, ఏనం=వీనిని, (ఈ పూర్వోక్తమైన సమ్ప్రత్తికర్మచేసిన వానిని), ఆవి శతి=పొందుచున్నది. విద్వాన్=విద్వాంసుఁడు), యేన = ఏ మనస్సు

చేతను, ఆనన్ద్యేవ=ఆనందము కలవాఁడయ్యే, భవతి=అగుచున్నాఁడు. అథో=మరియు, నశోచతి=దుఃఖింపడో, తద్వై=అట్టిమనస్సే, దైవం= అధిదైవికమగు, మనః=మనస్సు, (శోకాదిరహితమైన ఆనందాత్మక మగు మనస్సు).

తా॥ ఈసమ్ప్రత్తి కర్మచేసినవానిని అధిదైవికమగు నిర్మల మనస్సు తనకధిష్ఠానములగు ఆకాశ సూర్యులనుండి పొందుచున్నది. ఆమనస్సు ఎటువంటిదనిన, లోకమునందు విద్వాంసుఁడు ఏమనస్సుతో దుఃఖరహితుఁడై యానందము కలవాఁడగునో, అదియే ఆయాధి దైవికమగు నిర్మల మనస్సు.

ఉ॥ అద్భ్యశ్చైనం చన్ద్రమసశ్చ దైవః ప్రాణ ఆవిశతి స వై దైవః ప్రాణో యస్సఞ్చరగ్ శ్చాసఞ్చరగ్ శ్చ న వ్యథతేఽథో న రిష్యతి స ఏవం విత్సర్వేషాం భూతానామాత్మా భవతి యథైషా దేవతై వగ్ం సఃయథైతాం దేవతాగ్ం సర్వాణి భూతాన్యవన్త్యేవగ్ం హైవం విదగ్ం సర్వాణి భూతాన్యవన్తి। యదు కించేమాః ప్రజాః శోచ న్త్య మైవాసాం తద్భవతి పుణ్యమేవాముం గచ్ఛతి న హ వై దేవా న్పాపం గచ్ఛతి. ॥20॥

ప॥ అద్భ్యః - చ - ఏనం - చన్ద్రమసః - చ - దైవః - ప్రాణః - ఆవిశతి - సః - వై - దైవః - ప్రాణః - యః - సఞ్చ రణ్-చ-అసఞ్చరణ్-చ-న-వ్యథతే-అథో-న-రిష్యతి-సః - ఏవంవిత్ - సర్వేషాం - భూతానాం - ఆత్మా - భవతి - యథా - ఏషా - దేవతా - ఏవం - సః - యథా - ఏతాం - దేవతాం - సర్వాణి - భూతాని - అవన్తి - ఏవం - హ - ఏవంవిదం - సర్వాణి-భూతాని- అవన్తి - యత్ - ఉ - కించ - ఇమాః - ప్రజాః - శోచన్తి - అమా - ఏవ - ఆసాం - తత్ - భవతి - పుణ్యం - ఏవ - అముం- గచ్ఛతి - న - హ - వై - దేవాన్ - పాపం - గచ్ఛతి.

ప్ర॥ దైవః=దేవసంబంధమగు, ప్రాణః=ప్రాణము, (సూత్రాత్మ

భూతమైన ప్రాణము), అద్భ్యశ్చ=ఉదకములవలనను, చన్ద్రమసశ్చ=చంద్రుని వల్లను, ఏనం=సమ్ప్రత్తికర్మచేసిన వీనిని, ఆవిశతి=పొందుచున్నది. యః=ఏ ప్రాణము, సఞ్చరంశ్చ = తిరుగుచున్నదియును, (ప్రాణిభేదములయందు తిరుగుచున్నదియును), అసఞ్చరంశ్చ=తిరుగనిదియునై), (సమష్టి స్వరూపముతో తిరుగనిదియునై), (లేక జంగమములయందు తిరుగునదియును, స్థావరములయందు తిరుగనిదియునై) నవ్యథతే=భయమును పొందదో, (దుఃఖనిమిత్తకమైన భయముతో కూడుకొనదో), అథో = మరియు, నరిష్యతి = నశింపదో, (హింసను పొందదో), సవై = అదియే, దైవః = దేవ సంబంధమగు, ప్రాణః=ప్రాణము. ఏవంవిత్=ఇట్లు తెలిసికొనిన, సః = వాఁడు, సర్వేషాం=సమస్తములైన, భూతానాం=భూతములకు, ఆత్మా=ఆత్మస్వరూపుఁడు, భవతి=అగుచున్నాఁడు. (ఇట్లు తెలిసికొనినవాఁడు సమస్త భూతములకును ఆత్మస్వరూపుఁడనగా ప్రాణస్వరూపుఁడును, మనఃస్వరూపుఁడును వాక్స్వరూపుఁడునై ఇట్లు సర్వాత్మస్వరూపముతో సర్వజ్ఞుఁడగుచున్నాఁడు), ఏషా=ఈపూర్వసిద్ధమైన, దేవతా=హిరణ్యగర్భ దేవత, యథా=ఏప్రకారమో, ఏవం=ఈప్రకారముగానే, సః=ఆపురుషుఁడు, (భవతి=అగుచున్నాఁడు). సర్వాణి=సమస్తములైన, భూతాని=భూతములును, ఏతాం=ఈ, దేవతాం=హిరణ్యగర్భ దేవతను, (ఇజ్యాదిభిః=యాగాదులచేత), యథా=ఏప్రకారము, అవన్తి=పాలించుచున్నవో, (పూజించుచున్నవో), ఏవంహ = ఈ ప్రకారముగానే, సర్వాణి భూతాని=సమస్తభూతములును, ఏవంవిధం = ఇట్లు తెలిసినవానిని, అవన్తి=పూజించుచున్నవి. (యాగాదిలక్షణమైన పూజను కూర్చుచున్నవి). ఇమాః=ఈ, ప్రజాః=సంతానములు, యదుకించ = ఏదైనను, శోచన్తి=దుఃఖించుచున్నారో, అమైవ=కూడానే, (సంతానములతోడనే), తత్=ఆ దుఃఖము, ఆసాం=ఈ ప్రజలకు, భవతి=అగుచున్నది. అముం=పరలోకగతుఁడైనవీనిని, పుణ్యమేవ=పుణ్యమే,

(పుణ్యఫలమైన సుఖమే) గచ్ఛతి=పొందుచున్నది. పాపం=దోషము, (పాపఫలమైన దుఃఖము), దేవాన్ =దేవతలను. నగచ్ఛతిహా వై= పొందనే పొందదు.

తా॥ ఆ ప్రకారముగానే దేవసంబంధమగు ప్రాణమును ఈ సత్ప్రవృత్తి కర్మచేసినవానిని ఉదకముల నుండియు చంద్రుని నుండియు పొందుచున్నది. ఆ ప్రాణ మెటువంటిదనిన తిరుగునట్టి సమస్త భూతములయందు తిరుగుచు తిరగనట్టి స్థావరములయందు తిరుగనిదియునై దుఃఖనిమిత్తకమైన భయమును పొందక నశింపనిదియే ఆదేవ సంబంధమగు ప్రాణము. ఇట్టి ప్రాణమును ఈ పూర్వము చెప్పిన ప్రకారము తెలిసికొనిన పురుషుఁడు సమస్త భూతముల కాత్మస్వరూపుఁడును వాఙ్మనఃప్రాణస్వరూపుఁడునై హిరణ్యగర్భాత్మకమైన దేవతవలెనే సర్వజ్ఞుఁడగుచున్నాఁడు. సమస్త భూతములును ఈ హిరణ్యగర్భాత్మకమైన దేవతను యాగాదులచేత పూజించినట్లు ఈ పూర్వోక్త ప్రకారము తెలిసికొనిన ఆ పురుషుని పూజించుచున్నవి. ఇట్లు సర్వభూతాత్మకుఁడై ఈశ్వర స్వరూపుఁడైన ఆ పురుషునికి పరిచ్ఛిన్నత్వాది దుఃఖనిమిత్తకములైన మిథ్యాజ్ఞానాదులు లేకపోవుటవలననే దుఃఖము లేదు. దేవతలనుగూర్చి పాపఫలకమగు దుఃఖము పొందదు గనుక ఈ ప్రజలు పొందునట్టి దుఃఖము పరిచ్ఛిన్నులగు ఈ ప్రజలకే కలుగునుగాని సత్ప్రవృత్తి కర్మచేసి పరలోకగతుఁడై ఈ పూర్వోక్త ప్రకారము ఈశ్వరస్వరూపుఁడగు ఈ పురుషుని పుణ్యఫలకమైన సుఖమే పొందునుగాని పాపఫలకమగు దుఃఖము పొందదు.

ఉ॥ అథాతో వ్రతమీమాంసా ప్రజాపతిర్హ కర్మాణి ససృజే తాని సృష్టాన్యన్యోన్యేనాస్పర్ధన్త వదిష్యామ్యేవాహమితి వాగ్దధ్రే ఈ (ద్ర) క్ష్యామ్యహమితి చక్షుః శ్రోష్యామ్యహమితి శ్రోత్రమేవ మన్యాని కర్మాణి యథా కర్మ తాని మృత్యుః శ్రమో భూత్వో పయేమే తాన్యాప్నోత్తాన్యాప్త్వా మృత్యురవారున్ధ తస్మా

చ్ఛ్రామ్యత్యేవ వాక్ శ్రామ్యతి చక్షుః శ్రామ్యతి శ్రోత్రమథేమ మేవ నాప్నోద్యోఽయం మధ్యమః ప్రాణస్తాని జ్ఞాతుం దధ్రిరే అయం వై నః శ్రేష్ఠో యస్సఞ్చరగ్ శ్చాసఞ్చరగ్ శ్చ న వ్యథతే (ఽథో) న రిష్యతి హన్తాస్యైవ సర్వే రూపమసామేతి త ఏతస్యైవ సర్వే రూపమభవగ్ స్తస్మాదేత ఏతేనాఖ్యాయన్తే ప్రాణా ఇతి తేన హ వావ తత్కులమాచక్షతే యస్మిన్కులే భవతి య ఏవం వేద య ఉహైవంవిదా స్పర్ధతేఽనుశుష్య (త్యనుశుష్య) హైవా న్తతో మ్రియత ఇత్యధ్యాత్మమ్. ॥21॥

ప॥ అథ - అతః - వ్రతమీమాంసా - ప్రజాపతిః - హ - కర్మాణి - ససృజే - తాని - సృష్టాని - అన్యోన్యేన - అస్పర్ధన్త - వదిష్యామి - ఏవ - అహం - ఇతి - వాక్ - దధ్రే - ద్రక్ష్యామి - అహం - ఇతి - చక్షుః - శ్రోష్యామి - అహం - ఇతి - శ్రోత్రం - ఏవం - అన్యాని - కర్మాణి - యథా - కర్మ - తాని - మృత్యుః - శ్రమః - భూత్వా - ఉపయేమే - తాని - ఆప్నోత్ - తాని - ఆప్త్వా - మృత్యుః - అవారున్ధత్ - తస్మాత్ - శ్రామ్యతి - ఏవ - వాక్ - శ్రామ్యతి - చక్షుః - శ్రామ్యతి - శ్రోత్రం - అథ - ఇమం - ఏవ - న - ఆప్నోత్ - యః - అయం - మధ్యమః - ప్రాణః - తాని - జ్ఞాతుం - దధ్రిరే - అయం - వై - నః - శ్రేష్ఠః - యః - సఞ్చరన్ - చ - అసఞ్చరన్ - చ - న - వ్యథతే - న - రిష్యతి - హన్త - అస్య - ఏవ - సర్వే - రూపం - అసామ - ఇతి - తే - ఏతస్య - ఏవ - సర్వే - రూపం - అభవన్ - తస్మాత్ - ఏతే - ఏతేన - ఆఖ్యాయన్తే - ప్రాణాః - ఇతి - తేన - హవావ - తత్ - కులం - ఆచక్షతే - యస్మిన్ - కులే - భవతి - యః - ఏవం - వేద - యః - ఉ - హ - ఏవం - విదా - స్పర్ధతే - అనుశుష్య - హ - ఏవ - అన్తతః - మ్రియతే - ఇతి - అధ్యాత్మం.

ప్ర॥ అతః=అందువలన, అథ = అనంతరము, (ఉపాసనను

చెప్పినతరువాత) వ్రతమీమాంసా=వ్రత=ఉపాసనయొక్క, (అవశ్యముగా చేయఁదగినకర్మయొక్క) మీమాంసా=విచారణ, (ప్రవర్తతే ఉన్నది. తత్ర=దానియందు), ప్రజాపతిర్హ=ప్రజాపతియే, (ప్రజాః= ప్రజలను, సృష్ట్వా = సృజించి), కర్మాణి = వాగాదీంద్రియములను, (ఇక్కడ వాగాదీంద్రియములు కర్మ నిమిత్తములై ఇష్టమైనవి గనుక కర్మలని చెప్పఁబడినవి). ససృజే=సృష్టించెను. సృష్టాని=సృజింపఁ బడిన, తాని=ఆవాగాదీంద్రియములు, అన్యోన్యేన = పరస్పరమును, అస్పర్ధన్త=వివాదమును చేసినవి. (ఎట్లనఁగా), వాక్=వాక్కు, అహమేవ=నేనే, వదిష్యామీతి=పలుకఁగలనని, (వ్రతం=నియమమును), దధ్రే=ధరించెను. (వాక్కు నాకుసమానమైన దేదైనను ఉండెనేని నా సామర్థ్యమును అదియును చూపించును గాకయని యెడతెగక అవశ్యముగా చేయఁదగిన తనపనిని చేయుట కారంభించెను). (ఆప్రకారమే). చక్షుః=నేత్రము, అహమేవ=నేనే, ఈక్షామీతి = చూడఁ గలనని, శ్రోత్రం=చెవి, అహమేవ=నేనే, శ్రోష్యామీతి=వినఁగల నని, అన్యాని=ఇతరములగు, కర్మాణి=ఇంద్రియములు, యథాకర్మ =వానికర్మలప్రకారము, వ్రతం = ముఖ్యముగా చేయఁదగినపనిని, దధ్రిరే=ధరించినవి). మృత్యుః = మృత్యువు, (వ్యాపారనిరోధకమగు దేవత), శ్రమః=శ్రమస్వరూపుఁడు, (పీడ) భూత్వా=అయి, తాని= ఆ ఇంద్రియములను, ఉపయేమే=గ్రహించెను. (ఎట్లనఁగా), తాని= ఆఇంద్రియములను, ఆప్నోత్=పొందెను. ఆప్త్వా=పొంది, మృత్యుః= మృత్యువు, (తాని=ఆఇంద్రియములను), అవారున్ధత్ = అడ్డగించెను. తస్మాత్=అందువలన, వాక్=వాక్కు, శ్రామ్యతి=శ్రమతోఁగూడు కొనుచున్నది. చక్షుః=నేత్రము, శ్రామ్యతి = శ్రమతోఁగూడుకొను చున్నది. శ్రోత్రం=చెవి, శ్రామ్యతి=శ్రమతోఁగూడుకొనుచున్నది. అథ=అనంతరము, (మృత్యుః=మృత్యువు), ఇమమేవ = ఈముఖ్య ప్రాణమునే, నాప్నోత్=పొందకపోయెను. అయం=ఈ, మధ్యమః=

దేహమధ్యమునందున్న, ప్రాణః=ప్రాణము, యః=ఏదియో, (తం= ఆప్రాణమును), జ్ఞాతుం= తెలిసికొనుటకు, తాని = ఆఇంద్రియములు, (మనః=మనస్సును), దధ్రిరే=ధరించినవి. యః = ఏప్రాణము, సఞ్చరంశ్చ=తిరుగుచున్నదియును, అసఞ్చరంశ్చ=తిరుగనిదియునై, నవ్యథతే=దుఃఖింపదో, నరిష్యతి=నశింపదో, అయంవై = ఈప్రాణమే, నః=మనలోపల, శ్రేష్ఠః=అధికమైనది, హన్త = ఇప్పుడు, సర్వే= సమస్తమైన, (వయం=మనము), అస్యైవ=ఈప్రాణముయొక్కయె, రూపం=రూపమును, అసామ=పొందుదము, ఇతి=అని, (నిశ్చిత్య= నిశ్చయించి), సర్వే=సమస్తములైన, తే=ఆఇంద్రియములు, ఏతస్య = ఈప్రాణముయొక్క, రూపమేవ=రూపముగానే, అభవన్=అయినవి. (ప్రాణరూపమునే ఆత్మనుగా పొందినవి). తస్మాత్=ఆకారణమువలన, ఏతే=ఈవాగాదీంద్రియములు, ఏతేన = ఈప్రాణముయొక్క పేరితోనే, ప్రాణాఇతి = ప్రాణములని, ఆఖ్యాయన్తే = చెప్పఁబడుచున్నవి. యః=ఎవఁడు, ఏవం = ఈపూర్వోక్తప్రకారము, (సమస్త ఇంద్రియములకు ముఖ్యప్రాణతను), వేద = తెలిసికొనుచున్నాఁడో, (సః=వాఁడు), యస్మిన్=ఏ, కులే=వంశమునందు, భవతి = కలుగుచున్నాఁడో, తత్కులం=ఆవంశమును, (జనులు) తేనహవావ=వానిచేతనే, (వానిపేరితోనే), ఆచక్షతే = చెప్పుచున్నారు. (కించ = మఱియు), యఉహ=ఎవఁడైనను, ఏవంవిదా=ఇట్లుప్రాణమును తెలిసికొనినవానితో, స్పర్ధతే = విరోధించుచున్నాఁడో, (సః = వాఁడు, అస్మిన్నేవశరీరే = ఈదేహమునందే, అనుశుష్యతి = శోషనుపొందుచున్నాఁడు. అనుశుష్యహైవ=శోషనుపొందే, అన్తతః = అన్తమునందు, మ్రియతే=మరణమునుపొందుచున్నాఁడు. ఇతి = ఈప్రకారము, అధ్యాత్మం=ప్రాణాత్మదర్శనము, (ఉక్తం=చెప్పబడినది).

తా॥ ఇంతకుపూర్వము అవియన్నియు, సమానములును అనన్తములునని సాధారణముగా వాఙ్మనఃప్రాణములయొక్క యుపాసనము

చెప్పఁబడినది. ఒక్కొక దానియందుండెడి విశేషము చెప్పఁబడియుండ లేదు. కనుక ఇప్పుడు అవశ్యముగా చేయఁదగినకర్మ చెప్పఁబడు చున్నది. బ్రహ్మదేవుఁడు ప్రజలనుసృష్టించి వాక్కు మొదలైన ఇంద్రియములను సృజించెను. ఇట్లు సృజింపఁబడిన ఆఇంద్రియములు పరస్పరమును కలహించి వానిలో వాగింద్రియము నాకు వేరైన దేదియైనను నాకు సమానమైన నాపనినిచేయుటకు శక్తికలదాయెనేని అదియును నాశక్తినిచూపించుగాకయని ఎడతెగక పలుకుటకారంభింపఁగా ఇతరములగు చక్షుశ్శ్రోత్రాదీంద్రియములన్నియును అదే ప్రకారము నేనే శ్రేష్ఠమని అహంకరించి తమతమపనులను చాలింపకుండ ఎల్లప్పుడును చేయుటకారంభించెను. అప్పుడు మృత్యువు శ్రమరూపుఁడై ఆవాగాదీంద్రియములనుపొంది వాని వాని పనులను నిరోధించెను. ఇట్లు నిరోధించుటవలన ఆ ఇంద్రియములు శ్రమను పొందినవై తమపనులనుచేయుట కశక్తములై యుండెను. తరువాత మృత్యువు శరీరమధ్యమందున్న ముఖ్యప్రాణమును పొందలేక పోయెను. ఇట్లు మృత్యువుచేత పొందఁబడక సంచరించుచున్నదై ననుసరింపని దైనను దుఃఖమును పొందకయు నశింపకయు, నుండెడి ఆప్రాణమే మనలలో శ్రేష్ఠమైనది. గనుక మనమందరమును ఆప్రాణ స్వరూపమునే పొందుదమని నిశ్చయించుకొనిన ఆవాగాదీంద్రియము లన్నియు ప్రాణరూపమునే ఆత్మనుగాపొందినవి. అందువల్లనే ఇంద్రియ ములన్నియు ప్రాణములని చెప్పఁబడుచున్నవి. ఇట్లు సమస్తఇంద్రియ ములకు ముఖ్యప్రాణాత్మతను ప్రాణమను పేరును, తెలిసికొనినవాఁడు పుట్టినవంశము వానిపేరితోనే లోకమునందు ప్రసిద్ధమగుచున్నది. మఱియు ఎవఁడైనను ఇట్లుతెలిసిన విద్వాంసునితో ద్వేషించెడి వాఁడు శీఘ్రముగా ఉపద్రవమును పొంది మరణమును పొందక ఈశరీరమునందే మూర్ఛనుపొందియుండి, కడపట మరణమును పొందుచున్నాఁడు. కాబట్టి ఎవరును ప్రాణాత్మను చూచెడి వానితో

ద్వేషింపఁగూడదు. ఇట్లు ప్రాణాత్మ దర్శనము చెప్పఁబడినది.

ఉ॥ అథాధిదైవతం జ్వలిష్యామ్యేవాహమిత్యగ్నిర్దధ్రే తప్స్యామ్య హమిత్యాదిత్యో భాస్యామ్యహమితి చన్ద్రమా ఏవమన్యా దేవతా యథాదైవతగ్ँ స యథైషాం ప్రాణానాం మధ్యమః ప్రాణ ఏవ మేతాసాం దేవతానాం వాయుః మ్లోచన్తి హ్యన్యా దేవతా న వాయుః సైషానస్తమితా దేవతా యద్వాయుః. ॥22॥

ప॥ అథ - అధిదైవతం - జ్వలిష్యామి - ఏవ - అహం - ఇతి - అగ్నిః - దధ్రే - తప్స్యామి - అహం - ఇతి - ఆదిత్యః - భాస్యామి - అహం - ఇతి - చన్ద్రమాః - ఏవం - అన్యాః - దేవతాః - యథాదైవతం - సః - యథా - ఏషాం - ప్రాణానాం- మధ్యమః - ప్రాణః - ఏవం - ఏతాసాం - దేవతానాం - వాయుః - మ్లోచన్తి - హి - అన్యాః - దేవతాః - న - వాయుః - సా - ఏషా - అనస్తమితా - దేవతా - యత్ - వాయుః.

ప్ర॥ అథ=అనంతరము, అధిదైవతం = దేవతావిషయమైన దర్శనము, (ఉచ్యతే=చెప్పఁబడుచున్నది). అగ్నిః=అగ్ని, అహమేవ =నేనే, జ్వలిష్యామీతి=మండగలనని, (మనః=మనస్సును), దధ్రే= ధరించెను. ఆదిత్యః=సూర్యుఁడు, అహం=నేను, తప్స్యామీతి= తపింపఁజేయగలనని, చంద్రమాః=చంద్రుఁడు, అహం=నేను. భాస్యా మీతి=ప్రకాశింపఁగలనని, (మనః=మనస్సును, దధ్రే=ధరించెను). ఏవం=ఈప్రకారముగానే, అన్యాః=అన్యములగు, దేవతాః=దేవతలం దఱును, యథాదైవతం=ఆయాదేవత కనుకూలముగాను, (మేనిరే= తలంచిరి). (ఈచెప్పఁబడిన అగ్న్యాదిదేవతలఁదఱును వారివారి పనులను ఎడతెగక చేయనారంభించిరి). ఏషాం=ఈ, ప్రాణానాం= వాక్కు మొదలైన ఇంద్రియములలో, మధ్యమః = నడుమనుండెడి, సః=ఆపూర్వోక్తమైన, ప్రాణః=ప్రాణము, యథా = ఏప్రకారమో, ఏవం=ఈప్రకారమే, ఏతాసాం దేవతానాం = ఈఅగ్ని మొదలైన

దేవతలలో, వాయుః=వాయువు, (భవతి=అగుచున్నది). అన్యాః= ఇతరులగు, దేవతాః= దేవతలు, మ్లోచన్తిహి = అస్తమానమును పొందుచున్నారుగదా, వాయుః=వాయువు, న = అస్తమానమును పొందుటలేదు. వాయుః = వాయువు, యత్ = ఏదియో, సైషా= ఆ యీ దేవతయె, అనస్తమితా=అస్తమానముపొందఁబడని, దేవతా =దేవత, (భవతి=అగుచున్నది).

తా॥ ఇట్లు అధ్యాత్మదర్శనమును చెప్పి అధిదైవతదర్శనమును చెప్పుచున్నాఁడు. వాగాదీంద్రియముల కధిదేవతలైన అగ్ని మొదలైన దేవతలందరును నేనే జ్వలింపఁగలను, నేనే తపింపఁగలను, నేనేప్రకాశింపఁగలను అనెడి ఆయా దేవతలకుఁగల సామర్థ్యాతిశయమును ఎడతెగక ప్రకాశింపఁజేయుట కుపక్రమింపగా వాగాదీంద్రియములవలెనే అగ్ని మొదలగు దేవతలును అస్తమానమునుపొంది, వాయువుమాత్రము ఆయగ్ని మొదలైన దేవతలన్నిటిలో వాగాదీంద్రియములన్నిటిలో మధ్యమందుండెడి ముఖ్యప్రాణమువలెనే అస్తమానమునుపొందక తనవ్యాపారమును ఎడతెగక చేయుచుండెను. కనుక ఇది అధిదైవతము ఇట్లు అధ్యాత్మము, అధిదైవతము, ఈ రెండును మీమాంసచేసి వాయుస్వరూపముయొక్క వ్రతమే భంగముకానిదియని ఏర్పఱుపఁబడినది.

ఉ॥ అథైష శ్లోకో భవతి యతశ్చోదేతి సూర్యోఽస్తం యత్ర చ గచ్ఛతీతి ప్రాణాద్వా ఏష ఉదేతి ప్రాణేఽస్తమేతి తం దేవాశ్చక్రిరే ధర్మంగ్‍స ఏవాద్య స ఉ శ్వ ఇతి యద్వా ఏతేఽముర్హ్యాధ్రియన్త తదేవాప్యద్య కుర్వన్తి । తస్మాదేకమేవ వ్రతం చరేత్ప్రాణ్యాచ్చైవాపాన్యాచ్చ నేన్మా పాప్మా మృత్యురాప్నువదితి యద్యు చరేత్సమాపిపయిషేత్తేనో, ఏతస్యై దేవతాయై సాయుజ్యగ్‍ం సలోకతాం జయతి　　॥23॥

ఇతి తృతీయాధ్యాయే పఞ్చమబ్రాహ్మణమ్.

ప॥ అథ - ఏషః - శ్లోకః - భవతి - యతః - చ - ఉదేతి - సూర్యః - అస్తం - యత్ర - గచ్ఛతి - ఇతి - ప్రాణాత్ - వై - ఏషః - ఉదేతి - ప్రాణే - అస్తం - ఏతి - తం - దేవాః - చక్రిరే - ధర్మం - సః - ఏవ - అద్య - సః - ఉ - శ్వః - ఇతి - యత్ - వై - ఏతే - అముర్హి - అధ్రియన్త - తత్ - ఏవ - అపి - అద్య - కుర్వన్తి - తస్మాత్ - ఏకం - ఏవ - వ్రతం - చరేత్ - ప్రాణ్యాత్ - చ - ఏవ - అపాన్యాత్ - చ - నేత్ - మా - పాప్మా - మృత్యుః - ఆప్నువత్ - ఇతి - యది - ఉచరేత్ - సమాపిపయిషేత్ - తేన - ఉ - ఏతస్యై - దేవతాయై - సాయుజ్యం - సలోకతాం - జయతి.

ప్ర॥ అథ=అనంతరము, (ఏతస్యైవ=ఈఅర్థమునకే, ప్రకాశకః=ప్రకాశమగు), ఏషః=ఈ, శ్లోకః = మంత్రము, భవతి=అగుచున్నది. సూర్యః=సూర్యుఁడు, యతః=ఏవాయువునుండి, ఉదేతి=ఉదయించుచున్నాఁడో, యత్ర = ఏవాయువునందు, అస్తం = అస్తమానమును, గచ్ఛతి = పొందుచున్నాఁడో. ఇతి = ఈప్రకారము, ఏషః=ఈసూర్యుఁడు, ప్రాణాద్వై=ప్రాణమునుండియె. ఉదేతి = ఉదయించుచున్నాఁడు. ప్రాణే=ప్రాణమునందు, అస్తం=అస్తమానమును, ఏతి=పొందుచున్నాఁడు. దేవాః=దేవతలు, తం=ఆ, ధర్మం = వ్రతమును, (ప్రాణవ్రతమును, వాయువ్రతమును), చక్రిరే=చేసిరి. స ఏవ =ఆధర్మమే, అద్య=ఇప్పుడు, (అనువర్త్యతే=అనుసరించి ప్రవర్తించుచున్నది). స ఉ = ఆధర్మమే, శ్వః = రేపును, (భవిష్యత్కాలమునందును, అనువర్తిష్యతే=అనుసరించి ప్రవర్తింపఁగలదు). ఇతి=అని, ఏతే=ఈవాక్కు మొదలైన ఇంద్రియములును అగ్ని మొదలైన దేవతలును, అముర్హి=ఈకాలమునందు, యద్వై = ఏవ్రతమును, (ప్రాణవ్రతమును, వాయువ్రతమును), అధ్రియన్త=ధరించిరో, త దేవ = దానినే, అద్యాపి = ఇప్పటికిని, కుర్వన్తి = చేయుచున్నవి,

(ఏ కారణమువలన వాక్కు మొదలైన ఇంద్రియముల యందును అగ్ని మొదలైన అధిదేవతల యందును అనుసరించి పొందియున్న వాయువు యొక్కయును ప్రాణము యొక్కయు పరిస్పందనాత్మక మగు వ్రతము సమస్త దేవతలచేతను అనుసరింపఁబడియున్నదో), తస్మాత్ = ఆ కారణమువలన, పాప్మామృత్యుః = పాపాత్మకుఁడైన మృత్యువు, మా = నన్ను, నాప్నువదితి = పొందఁడని, (అన్యోఽపి=ఇతరుఁడును), ఏక మేవ వ్రతం=ఒక్క వ్రతము నే, చరేత్ = చేయవలయును, (కింతత్=అది యేదియనిన), ప్రాణ్యాచ్చైవ=ప్రాణన వ్యాపారమును చేయవలయును. (ప్రాణనమనఁగా ఊర్ధ్వగమనము), అపాన్యాచ్చ=అపానవ్యాపారము చేయవలయును, (అపానమనఁగా అధోగమనము), (గనుక ఇతరుడును ఇంద్రియాంతరములయొక్క వ్యాపారమును విడలి ఊర్ధ్వాధోగమన లక్షణమగు ప్రాణవ్యాపార మనెడి వ్రతమును చేయవలయును(. యది = ఒకానొకప్పుడు, ఉచ రేత్ =(ప్రాణవ్రతమును) ప్రారంభించినయెడల, సమాపిపయిషేత్ = సమాప్తిని పొందించుటకు కోరవలయును. తేనఉ=ఆ వ్రతముచేత నే, ఏతస్యై దేవతాయై=ఈ ప్రాణ దేవతయొక్క, (ఇక్కడ షష్ఠీవిభక్తికి చతుర్థీవిభక్తి చెప్పుట ఛాందసమని ఎఱుఁగవలయును), సాయుజ్యం= ఏకస్వరూపమును, సలోకతాం=సమానలోకము కలుగుటను, జయతి= పొందుచున్నాఁడు.

తా॥ పూర్వము చెప్పిన అర్థమును దృఢపఱుచుటకు ఈ మంత్రము కలిగినది. ఈ సూర్యుఁడు అధిదైవతస్వరూపముతో వాయువు నుండి ఉదయించుచు వాయువునందే సాయంకాలమునందు అస్తమాన మును పొందుచున్నాఁడు. అధ్యాత్మస్వరూపుఁడై నేత్రరూపముతో ప్రాణమునుండి ఉదయించుచు పురుషునియొక్క నిద్రాసమయమునందు ప్రాణమునందే అస్తమానమును పొందుచున్నాఁడు. కనుక అధ్యాత్మ స్వరూపములైన వాగాదీంద్రియములు ప్రాణవ్రతమును అధిదైవత

స్వరూపములైన అగ్ని మొదలగు దేవతలు వాయువ్రతమును ధరించు చున్నారు. అదియె ఇప్పుడనుసరించునదియును ముందు అనుసరింపఁ గలదియునై యున్నదని దేవతలు వ్రతమునే ధరించిరి. కనుక ఇతరుఁడును శ్రమస్వరూపుఁడైన మృత్యువు నన్ను పొందఁడని నిశ్చయించుకొని వేఱు ఇంద్రియములయొక్క వ్యాపారములను విడిచి ప్రాణముయొక్క ఊర్ధ్వాధోగమన రూపమైన అభగ్నమగు ప్రాణవ్రతమును ఆచరింపవలయును. ఈ ప్రాణవ్రతము నారంభించువాఁడు దానిని సమాప్తి పొందింపవలయును. అట్లు సమాప్తి పొందింపడేని ప్రాణము తిరస్కృతమగును. కనుక జనుఁడు అట్టి ప్రాణవ్రతమును ఆచరించుటచేత ఆ ప్రాణదేవతయొక్క సాయుజ్యమును సాలోక్యమును పొందుచున్నాఁడు.

ఇట్లు తృతీయాధ్యాయమునందు పఞ్చమబ్రాహ్మణము సమాప్తము.

---

## తృతీయాధ్యాయము, షష్ఠబ్రాహ్మణము

ఉ॥ త్రయం వా ఇదం నామ రూపం కర్మ తేషాం నామ్నాం వాగిత్యేతదేషాముక్థమతో హి సర్వాణి నామాన్యుత్తిష్ఠన్తి । ఏతదేషాగ్ం సామైతద్ధి సర్వైర్నామభిస్సమ మేతదేషాం బ్రహ్మైతద్ధి సర్వాణి నామాని బిభర్తి. ॥1॥

ప॥ త్రయం - వై - ఇదం - నామ - రూపం - కర్మ - తేషాం - నామ్నాం - వాక్ - ఇతి - ఏతత్ - ఏషాం - ఉక్థం - అతః - హి - సర్వాణి - నామాని - ఉత్తిష్ఠన్తి - ఏతత్ - ఏషాం - సామ - ఏతత్ - హి - సర్వైః - నామభిః - సమం - ఏతత్ - ఏషాం - బ్రహ్మ - ఏతత్ - హి - సర్వాణి - నామాని - బిభర్తి.

ప్ర॥ ఇదం=ఈజగత్తు, నామ=పేరును, రూపం=ఆకృతియును, కర్మ=కర్మయును, (ఇతి=అని), త్రయంవై=మూడే. తేషాం=ఆనామ రూప కర్మములలో, నామ్నాం=నామములకు, వాగితి=వాక్కనియె,

(ఉచ్యతే=చెప్పఁబడుచున్నది) ఏతత్ = ఈవాక్కు, ఏషాం = ఈ నామములకు, ఉక్థం = కారణము, అతోహి = ఈ వాక్కునుండియే, సర్వాణి=సమస్తములైన, నామాని = నామములు, (యజ్ఞదత్తుఁడు దేవదత్తుఁడు మొదలైన నానావిధములగు పేళ్ళు). ఉత్తిష్ఠన్తి=పుట్టుచున్నవి. ఏతత్=ఈవాక్కు, ఏషాం=ఈనామములకు, సామ=సామాన్యమైనది, ఏతద్ధి = ఈవాక్కే, సర్వైః=సమస్తములైన, నామభిః=నామములతో, సమం=సమానమైనది ఏతద్ధి=ఈవాక్కే, (ఈ శబ్ద సామాన్యమే, యస్మాత్=ఏకారణమువలన), సర్వాణి=సమస్తములైన, నామాని=పేళ్ళను, బిభర్తి = ధరించుచున్నదో, (తస్మాత్=అందువలన), ఏతత్=ఈవాక్కు, ఏషాం=ఈనామములకు, బ్రహ్మ=ఆత్మస్వరూపము.

తా॥ ఇదివరకు వివరించిన అవిద్యాకార్యమునకు సంగ్రహముగా ఉపసంహారమును చెప్పుటకు వేఱొక బ్రాహ్మణమును అవతరింపఁజేయుచున్నాఁడు. నామరూపకర్మములను మూడే స్వరూపముగాఁగల ఈ కనఁబడెడి సమస్త ప్రపంచము అనాత్మస్వరూపమే. ఈ క్రియాకారణ ఫలాత్మకమైన సంసారరూపమగు జగత్తు నామరూప కర్మలే స్వరూపముగాఁగలది యని అనాత్మస్వరూపమైనదియని ఎట్లు తలంచుటకు శక్యమగుచున్నదనిన చెప్పఁబడుచున్నది. ఆ నామ రూపకర్మములు మూటిలో ఈనామములకు వాక్కు ముఖ్యకారణము. ఈముఖ్యకారణమైన వాక్కునుండి యే సమస్త నామములు పుట్టుచున్నవి. ఈవాక్కు లోకమునందలి యన్నినామములకు సమానమై నాముములన్నిటిలో సమానముగా నున్నది. నామ విశేషములకు ఆత్మ లాభ మెట్లుగా చెప్పఁదగినది యనిన చెప్పఁబడుచున్నది. ఈవాక్కు ముఖ్యకారణమై సమస్త నామములను ధరించుటవలన మన్ను, కుండలు మొదలైనవానికి ముఖ్యకారణమై వేరుగాక ఆత్మస్వరూపమైనట్లు నామములకు వేరుకానిదై ఆత్మస్వరూపమగుచున్నది. ఇట్లు నామ

విశేషము లన్నిటికి శబ్దసామాన్యత్వము సిద్ధమైనది.

ఉ॥ అథ రూపాణాం చక్షురిత్యేతదేషాముక్థమతో హి సర్వాణి రూపాణ్యుత్తిష్ఠన్త్యేతదేషాగ్ం సామైతద్ధి సర్వై రూపైః సమమేతదేషాం బ్రహ్మైతద్ధి సర్వాణి రూపాణి బిభర్తి. ॥2॥

ప॥ అథ - రూపాణాం - చక్షుః - ఇతి - ఏతత్ - ఏషాం-ఉక్థం - అతః - హి - సర్వాణి - రూపాణి - ఉత్తిష్ఠన్తి - ఏతత్ - ఏషాం - సామ - ఏతత్ - హి - సర్వైః - రూపైః - సమం - ఏతత్ - ఏషాం - బ్రహ్మ - ఏతత్ - హి - సర్వాణి - రూపాణి - బిభర్తి.

ప్ర॥ అథ=అనంతరము. రూపాణాం=రూపములకు, (తెలుపు నలుపు మొదలైనవానికి) చక్షురితి=చక్షుస్సుఅని, (ఉచ్యతే=చెప్పఁబడుచున్నది). నేత్రమునకు విషయమైనది చక్షుశ్శబ్దము చేత చెప్పఁదగినది). ఏతత్=ఈచక్షురింద్రియమే, ఏషాం=ఈ తెలుపు నలుపు మొదలైన రూపములకు, ఉక్థం=కారణము. అతో హి=ఆ చక్షురింద్రియమువల్లనే. సర్వాణి=సమస్తములైన, రూపాణి=రూపములు, ఉత్తిష్ఠన్తి = పుట్టుచున్నవి. ఏతత్=ఈచక్షురింద్రియము,ఏషాం = ఈ రూపములకు, సామ=సామ్యమైనది. ఏతద్ధి=ఈ చక్షురింద్రియమే, సర్వైః=సమస్తములైన, రూపైః=రూపములతో, సమం=సమమైనది, (యతః=ఏకారణమువలన), ఏతద్ధి=ఈ చక్షురింద్రియమే, సర్వాణిరూపాణి = సమస్తములైన రూపములను, బిభర్తి = ధరించుచున్నదో. (తస్మాత్ = ఆకారణమువలన), ఏతత్=ఈచక్షురింద్రియము, ఏషాం=ఈరూపములకు, బ్రహ్మ=ఆత్మస్వరూపము

తా॥ మఱియు ఆనామరూపకర్మములు మూటిలో తెలుపు నలుపు మొదలైన రూపములు తేజోరూపమైన నేత్రేంద్రియముచేత ప్రకాశింపఁదగినవిగనుక నేత్రేంద్రియమని చెప్పఁబడుచున్నవి. ఈనేత్రేంద్రియమే ఈ సమస్తరూపములకు కారణము. సమస్తరూపములు

ఈనేత్రేంద్రియమునుండియె పుట్టుచున్నవి. ఈనేత్రేంద్రియము లోకమునందలి యన్నిరూపములకు సమానమై అన్నిరూపములతో సమానముగానున్నది. ఇదియె రూపములకు వేరుకానిదై సమస్త రూపములను ధరించుటవలన వానికి ఆత్మస్వరూపముగానున్నది. ఇట్లు రూపములన్నియు నేత్రేంద్రియమాత్రమగుట సిద్ధమైనది.

ఉ॥ అథ కర్మణామాత్మే త్యేతదేషాముక్థమతో హి సర్వాణి కర్మా ణ్యుత్తిష్ఠన్త్యేతదేషాగ్ సామైతద్ధి సర్వైః కర్మభిః సమమేతదేషాం బ్రహ్మైతద్ధి సర్వాణి కర్మాణి బిభర్తి తదేతత్త్రియం సదేకమయ మాత్మాత్మో ఏకస్సన్నేతత్త్రియం తదేతదమృతగ్ సత్యేన చ్ఛన్నం ప్రాణోవా అమృతం నామరూపే సత్యాం తాభ్యామయం ప్రాణశ్ఛన్నః. ॥3॥

ఇతితృతీయాధ్యాయే షష్ఠం బ్రాహ్మణమ్.

ఇతిబృహదారణ్యకే తృతీయాఽధ్యాయః.

ప॥ అథ – కర్మణాం – ఆత్మా – ఇతి – ఏతత్ – ఏషాం – ఉక్థం – అతః – హి – సర్వాణి – కర్మాణి – ఉత్తిష్ఠన్తి – ఏతత్ – ఏషాం – సామ – ఏతత్ – హి – సర్వైః – కర్మభిః – సమం – ఏతత్ – ఏషాం – బ్రహ్మ – ఏతత్ – హి – సర్వాణి – కర్మాణి – బిభర్తి – తత్ – ఏతత్ – త్రయం – సత్ – ఏకం – అయం – ఆత్మా – ఆత్మా – ఉ – ఏకః – సన్ – ఏతత్ – త్రయం – తత్ ఏతత్ – అమృతం – సత్యేవ – చ్ఛన్నం – ప్రాణః – వై ॥ అమృతం – నామరూపే – సత్యం – తాభ్యాం – అయం – ప్రాణః – ఛన్నః.

ప్ర॥ అథ=అనంతరము, కర్మణాం=కర్మలకు, ఆత్మేతి = దేహమని, (ఉచ్యతే=చెప్పఁబడుచున్నది). ఏతత్=ఈశరీరము, ఏషాం= ఈకర్మలకు, ఉక్థం = కారణము. అతోహి = ఈశరీరమునుండియే, సర్వాణి=సమస్తములైన, కర్మాణి=కర్మలు, ఉత్తిష్ఠన్తి=పుట్టుచున్నవి. ఏతత్=ఈశరీరమే, ఏషాం = ఈకర్మలకు, సామ = సామ్యమైనది,

ఏతద్ధి=ఈశరీరము. సర్వైః కర్మభిః=సమస్తకర్మలతో, సమం=సమాన మైనది. (యత్ = ఏకారణమువలన), ఏతద్ధి = ఈశరీరమే, సర్వాణి కర్మాణి=అన్నికర్మలను, బిభర్తి = ధరించుచున్నదో, (తస్మాత్ = ఆకారణమునుండి), ఏతత్=ఈశరీరము, ఏషాం=ఈకర్మలకు, బ్రహ్మ =ఆత్మస్వరూపము, (భవతి=అగుచున్నది). తదేతత్=ఆ ఈ, త్రయం =నామ రూప కర్మలు మూడును, ఏకంసత్ = ఒక్కటియై, అయ మాత్మా=ఈశరీరము, (భవతి=అగుచున్నది). ఆత్మాఉ = శరీరమే, ఏకస్సన్=ఒకటియై, ఏతత్త్రయం=ఈనామ రూప కర్మలు మూడును, (భవతి = అగుచున్నది). తదేతదమృతం=ఆ ఈ అమృతస్వరూపము, సత్యేన=సత్యముచేత, ఛన్నం = కప్పఁబడినది. (ఆ అమృత సత్యము లేవియనిన చెప్పఁబడుచున్నవి). ప్రాణోవై = ప్రాణమే, అమృతం= అమృతస్వరూపము. (లోపల సమస్తమున కాధారమగు కర్మయునై ఇంద్రియరూపమును ఆత్మరూపము నైన ప్రాణము నశింపనిది). నామరూపే=నామరూపములు రెండును, సత్యం = సత్యస్వరూపము. (కార్యస్వరూపములైన శరీరావస్థలగు నామరూపములు రెండును సత్యమను పేరుగల పంచభూతములు స్వరూపములుగా కలుగుటవలన సత్యమనఁబడును), తాభ్యాం=ఆనామరూపములచేత, అయంప్రాణః =ఈప్రాణము, ఛన్నః=కప్పఁబడినది.

తా॥ ఇప్పుడానామరూపకర్మములు మూటిలో కర్మలన్నియు ఈశరీర సాధ్యములగుటవలన శరీరమనియె చెప్పఁబడుచున్నవి. ఈశరీరమె కర్మలన్నిటికి కారణము. దీనినుండియె యన్నికర్మలు పుట్టుచున్నవి. ఇదియె సమస్తకర్మలకు సామ్యమును అన్నికర్మలతో సమానము నైయున్నది. ఇదియె సమస్త కర్మలను ధరించుటవలన కర్మలన్నిటికి ఆత్మస్వరూపమైనది. ఈ నామరూపకర్మలు మూడును ఒకటియై ఈశరీరమగుచున్నవి. ఒక్కటియై ఈశరీరమే ఆనామరూప కర్మలు మూడునగుచున్నది. ఈనామరూపక్రియలు మూటిలో క్రియా

రూపమైన అమృతస్వరూపమగు ప్రాణము సత్యమను పేరుగల పంచ భూతవికారమైన నామరూపములచేత కప్పఁబడి ప్రకాశింపకుండ చేయఁబడుచున్నది. ఇట్లు కర్మలకు దేహాత్మత్వము చెప్పఁబడినదియె అజ్ఞానవిషయమైన సంసారభావము.

ఇట్లు బృహదారణ్యకము
తృతీయాధ్యాయము సమాప్తము.



శ్రీ

శుక్ల యజుర్వేద - కాణ్వశాఖాయామ్.

# బృహదారణ్యకోపనిషత్

## చతుర్థాధ్యాయః

హరిః ఓమ్॥ పూర్ణమదః పూర్ణమిదం పూర్ణాత్పూర్ణముదచ్యతే।
పూర్ణస్య పూర్ణమాదాయ పూర్ణమేవావశిష్యతే.

ఓమ్ శాన్తిః శాన్తిః శాన్తిః (చూ. 7. 1-1.)

హరిఃఓమ్. ఉ॥ దృప్తబాలాకిర్హానూచానో గార్గ్య ఆస స హోవాచాజాతశత్రుం కాశ్యం బ్రహ్మ తే బ్రువాణీతి స హోవాచాజాతశత్రుః సహస్రమేతస్యాం వాచి దద్మో జనకో జనక ఇతి వై జనా ధావన్తీతి. ॥1॥

ప॥ దృప్తబాలాకిః - హ - అనూచానః - గార్గ్యః - ఆస - సః - హ - ఉవాచ - అజాతశత్రుం - కాశ్యం - బ్రహ్మ - తే - బ్రువాణి - ఇతి - సః - హ - ఉవాచ - అజాతశత్రుః - సహస్రం - ఏతస్యాం - వాచి - దద్మః - జనకః - జనకః - ఇతి - వై - జనాః - ధావన్తి - ఇతి.

ప్ర॥ అనూచానః=వక్తయును, (అనుసరించి పలుకుటయందు సమర్థుఁడును), దృప్తబాలాకిర్హ=దృప్త=గర్విష్ఠుఁడైన, బాలాకిర్హ = బాలాకియనునట్టి, (బలాకయను దానియొక్క పుత్రుఁడునగు), గార్గ్యః = గార్గ్యుఁడు, (గోత్రమువలన గార్గ్యుఁడను పేరుగలవాఁడు), ఆస=ఉండెను. సః హ=ఆగార్గ్యుఁడే, అజాతశత్రుం=అజాతశత్రువను పేరుగల, కాశ్యం=కాశీరాజును, (అభిగమ్య=పొంది), తే=నీకొఱకు, బ్రహ్మ=పరబ్రహ్మను, బ్రువాణీతి=చెప్పఁగలనని, ఉవాచ=పలికెను, అజాతశత్రుః = అజాతశత్రువను పేరుగల, సహ=ఆకాశీరాజు, జనాః

=జనులు, జనకః=జనకమహారాజు, (దాతా=ఇచ్చెడివాఁడు), జనకః =జనకమహారాజు, (శ్రోతా=వినెడివాఁడు), ఇతి = అని, వై=ప్రసిద్ధముగా, ధావన్తి=పరువెత్తుచున్నారు. ఇతి=కనుక, ఏతస్యాంవాచి= నీకొఱకు పరబ్రహ్మస్వరూపము చెప్పఁగలనని పలికిన ఈవాక్యనిమిత్తమై, (గవాం=గోవులయొక్క), సహస్రం=వేయిని, దద్మః= ఇచ్చుచున్నానని, ఉవాచ=పలికెను.

తా॥ ఈ పూర్వము చెప్పిన అవిద్యా విషయకమగు సంసారముకంటె అనంతరమందు జ్ఞాన విషయకమైన ఆత్మస్వరూపము పొందఁదగినదియని నాలుగవ అధ్యాయము ఆరంభింపఁబడుచున్నది. ఈ విద్యావిద్యలలో నేను పరబ్రహ్మస్వరూపమైతిననెడి ఆత్మతత్వమొకటియె విద్యావిషయమైనది. నేను వేరు, నాచేత ధ్యానింపఁబడెడి ఆత్మస్వరూపము వేరు అనెడి భేదదృష్టియే అవిద్యావిషయకమైనది. ఇట్టి విద్యావిద్యల రెండింటిలో అవిద్యావిషయమంతయు ఈ మూఁడవ అధ్యాయాంతమువఱకు చెప్పఁబడినది. ఈ అవిద్యావిషయము రెండు విధములైనది. ఎట్లనిన, లోపల స్తంభములు మొదలైన గృహము యొక్క ఆధారమువలెనె శరీరములోపల ఉండెడి ప్రకాశస్వరూపమును అమృతస్వరూపమునగు ప్రాణమును, గృహమునకుబయట గడ్డి, మృత్తిక మొదలైనవివలెనె ఉండెడి అప్రకాశమును వృద్ధిక్షయరూపమును సత్యశబ్దవాచ్యమును వెలుపలనుండెడి కార్యలక్షణమునైన నామరూపాత్మకమగు శరీరమును. ఇట్లు రెండువిధములైనవానిలోపలనుండెడి మొదటిదియగు అమృతస్వరూపమైన ప్రాణము వెలుపలనుండెడి మరణశీలమగు కార్యలక్షణమైన శరీరముచేత కప్పఁబడియున్నదని పూర్వగ్రంథము సమాప్తిచేయఁబడినది. ఇట్టి అవిద్యావిషయమైన ప్రాణమునే ఆత్మస్వరూపముగా పొందిన గార్గ్యుఁడను బ్రాహ్మణుఁడు చెప్పెడివాఁడుగాను అదేప్రకారముగానే విపరీతమైన ఆత్మజ్ఞానముగల అజాతశత్రువను కాశీరాజు వినెడివాఁడుగాను కలిగిన

పూర్వపక్ష సిద్ధాన్త రూపమైన ఈకథను ఆచారవిధిని ఉపదేశించుటకు ఇక్కడ చెప్పుచున్నాఁడు. వక్తయును గర్విష్ఠుఁడును బలాక పుత్రుఁడునగు గార్గ్యుఁడను ఒక బ్రాహ్మణుఁడు కలఁడు. అతఁడు అజాతశత్రువగు కాశీరాజునుపొంది నీకు బ్రహ్మస్వరూపమును చెప్పఁగలనని పలికెను. ఇట్లు గార్గ్యునిచేత పలుకఁబడిన ఆ కాశీరాజు ఇంతకు పూర్వము బ్రహ్మవేత్తలగు జనులందఱును జనకమహారాజే దాతయని జనకమహారాజే శ్రోతయని పోవుచున్నారు. ఓ గార్గ్యుఁడా ఇప్పుడు నీవు ఆ సమస్తమును నాయందే భావించి నీకొఱకు బ్రహ్మస్వరూపమును చెప్పఁగలనని పలికెడి, ఈవాక్యనిమిత్తము వేయిగోవులను ఇచ్చుచున్నా ననిపలికెను.

ఉ॥ స హోవాచ గార్గ్యో య ఏవాసావాదిత్యే పురుష ఏతమేవాహం బ్రహ్మోపాస ఇతి స హోవాచాజాతశత్రుర్మా మైతస్మిన్ సంవదిష్ఠా అతిష్ఠాః సర్వేషాం భూతానాం మూర్ధా రాజేతి వా అహమేతముపాస ఇతి స య ఏతమేవముపాస్తేఽతిష్ఠాః సర్వేషాం భూతానాం మూర్ధా రాజా భవతి. ॥2॥

ప॥ సః – హ – ఉవాచ – గార్గ్యః – యః – ఏవ – అసౌ – ఆదిత్యే – పురుషః – ఏతం – ఏవ – అహం – బ్రహ్మ – ఉపాసే – ఇతి – సః – హ – ఉవాచ – అజాతశత్రుః – మాం – ఏతస్మిన్ – సంవదిష్ఠాః – అతిష్ఠాః – సర్వేషాం – భూతానాం – మూర్ధా – రాజా – ఇతి – వై – అహం – ఏతం – ఉపాసే – ఇతి – సః – యః – ఏతం – ఏవం – ఉపాస్తే – అతిష్ఠాః – సర్వేషాం – భూతానాం – మూర్ధా – రాజా – భవతి,

ప్ర॥ సఃహ=అ, గార్గ్యః = గార్గ్యుఁడు, ఆదిత్యే = సూర్యునియందు, అసౌ=ఈ పురుషః=పరిపూర్ణుఁడగు పరబ్రహ్మస్వరూపుఁడు, యఏవ=ఎవఁడో, ఏతమేవ=వీనినే, అహం=నేను (అస్మిన్=ఈ శరీరేంద్రియ సముదాయమునందు), బ్రహ్మ=పరబ్రహ్మమునుగా, ఉపాస

ఇతి=ఉపాసన చేయుచున్నానని, ఉవాచ=పలికెను. (ఏవముక్తః=ఇట్లు పలుకఁబడిన), సః=ఆ, అజాతశత్రుః = అజాతశత్రువను కాశీరాజు, (ఓగార్గ్యుఁడానీవు), అతిష్ఠాః=సమస్త భూతముల నతిక్రమించెడివాఁడును, సర్వేషాంభూతానాం=అన్ని భూతములకు, మూర్ధా=శిరస్సును, రాజేతివై=రాజునుఅనిన్ని, ఏతమేవ=ఈపురుషునినే, అహం=నేను, ఉపాసఇతి=ఉపాసించుచున్నాననియు, ఏతస్మిన్=ఈ పరబ్రహ్మవిషయమునందు, మామాసంవదిష్ఠాః=సంవాదమును చేయవద్దు, చేయవద్దు అనియు, ఉవాచ=పలికెను, యః=ఎవఁడు, ఏతం=ఈ పురుషస్వరూపుని, ఏవం=ఈ పూర్వము చెప్పిన ప్రకారము, ఉపాస్తే=ఉపాసించుచున్నాఁడో, సః=వాఁడు, అతిష్ఠాః=భూతముల నతిక్రమించినవాఁడును, సర్వేషాంభూతానాం=అన్ని భూతములకు, మూర్ధా=శిరస్సును, (ప్రధానుఁడును) రాజా=రాజును, భవతి=అగుచున్నాఁడు. (అని నాకు తెలియును).

తా॥ ఈ ప్రకారము పరబ్రహ్మస్వరూపమును వినుటకు అభిముఖుఁడైయున్న రాజునుగూర్చి ఆ గార్గ్యమహాఋషి, ఈ సూర్యమండలమునందును నేత్రమునందు ఒక్కఁడైన అభిమానియగువాఁడే నేత్రముద్వారా ఈ హృదయమునందు ప్రవేశించి నేను భోక్తను కర్తను అని ఉన్నాఁడు. ఇట్లు సూర్యమండలమునందు నేత్రమునందభిమానియై యుండెడి ఈ పురుషస్వరూపుని ఈ శరీరేంద్రియ సముదాయమునందు బ్రహ్మస్వరూపమునుగా చూచుచున్నాను, ఉపాసించుచున్నాను. కనుక నేను ఆ పురుషస్వరూపమగు బ్రహ్మమును నీకొఱకు చెప్పుచున్నాను. ఉపాసించుమూ యని పలికెను. ఇట్లా గార్గ్యునిచేత పలుకఁబడిన అజాతశత్రువను ఆ కాశీరాజు ఈ ప్రకారము మన ఉభయులకు సమానముగా తెలిసికొనఁదగిన విజ్ఞానమునందు మమ్మునుగూర్చి అజ్ఞానులనుగూర్చి వలెనే చూపించుచున్న మీచేత మేము బాధింపఁబడినవారల మగుదుము. కనుక నీవీ పర

బ్రహ్మనిషయమునం దిట్లు చెప్పవద్దు. దీనియందు వేరేదియైనను తెలిసి కొనియుంటివేని దానిని చెప్పుటకు నీవు తగియున్నావు. ఇంతకుపూర్వము నీవు ఈ సూర్యునియందును నేత్రమునందును అభిమానియగువాఁడొకఁడె, వాఁడే ఈ శరీరేంద్రియ సముదాయమునందు ప్రవేశించి యున్నాఁడు. వానిని నేను అన్నిభూతముల నతిక్రమించిన వానిగాను అన్నిభూతములకు ముఖ్యునిగాను బ్రహ్మస్వరూపమునుగా చూచుచున్నాను. ఉపాసించుచున్నాను. ఇట్లుపాసించెడివాఁడు భూతములన్నిటిని అతిక్రమించువాఁడును సమస్తభూతములలో ప్రధానుఁడును రాజును అగుచున్నాఁడని నీ వుపదేశించినది నాకు తెలియును. ఈ సూర్యునియందును ఈ శరీరేంద్రియ సముదాయమునం దుండెడి పురుషస్వరూపుఁడొక్కఁడే, వాఁడే పరబ్రహ్మము అని ఉపాసించెడివాఁడు సమస్తభూతముల నతిక్రమించి యుండెడివాఁడును భూతములన్నిటిలో ప్రధానుఁడును రాజును అగుచున్నాఁడని పలికెను.

మూ॥ స హోవాచ గార్గ్యో య ఏవాసౌ చన్ద్రే పురుష ఏతమేవాహం బ్రహ్మోపాస ఇతి స హోవాచాజాతశత్రుర్మా మైతస్మిన్ సంవదిష్ఠా బృహన్పాణ్డరవాసాః సోమో రాజేతి వా అహమేతముపాస ఇతి స య ఏతమేవముపాస్తేఽహరహర్హ సుతః ప్రసుతో భవతి నాస్యాన్నం క్షీయతే. ॥3॥

ప॥ సః - హ - ఉవాచ - గార్గ్యః - యః - ఏవ - అసౌ - చన్ద్రే - పురుషః - ఏతం - ఏవ - అహం - బ్రహ్మ - ఉపాసే - ఇతి - సః - హ - ఉవాచ - అజాతశత్రుః - మా - మా - ఏతస్మిన్ - సంవదిష్ఠాః - బృహన్ - పాణ్డరవాసాః - సోమః - రాజా - ఇతి - వై - అహం - ఏతం - ఉపాసే - ఇతి - సః - యః - ఏతం - ఏవం - ఉపాస్తే - అహరహః - హ - సుతః - ప్రసుతః - భవతి - న - అస్య - అన్నం - క్షీయతే.

ప్ర॥ సః=ఆ, గార్గ్యః=గార్గ్యుఁడు, చన్ద్రే = చంద్రునియందు,

అహాంకు, పురుషః=పురుషుఁడు, యఏవ=ఎవఁడో, ఏతమేవ=వీనినే, అహం=నేను, బ్రహ్మ=పరబ్రహ్మమునుగా, ఉపాసఇతి = ఉపాసించు చున్నానని, ఉవాచహా=పలికెను, (ఏవముక్తః=ఇట్లు పలుకఁబడిన) సః=ఆ, అజాతశత్రుః=అజాతశత్రువను కాశీరాజు, (ఓ గార్గ్యుఁడా నీవు), బృహన్ = అధికుఁడును, పాణ్డరవాసాః = తెల్లనివస్త్రముగల వాఁడునగు, సోమోరాజేతివై = చంద్రుఁడేయని, (యజ్ఞమున కుప యోగమైన సోమలత మొదలైన యోషధులకు చంద్రుఁడు రాజగుట వలన సోమోరాజాయని చెప్పఁబడినది). ఏతమేవ = ఈపురుషునే, అహం=నేను, ఉపాసఇతి=ఉపాసించుచున్నానని, ఏతస్మిన్=ఈపురుష స్వరూపమగు బ్రహ్మమునందు, మామాసంవదిష్ఠాః = సంవాదమును చేయవద్దు, చేయవద్దు. (అని), ఉవాచహా=పలికెను. యః=ఎవఁడు, ఏతం=ఈపురుషుని, (ఈపూర్వము చెప్పఁబడిన విశేషణములతోఁ గూడుకొనిన పురుషుని), ఏవం = ఈ పూర్వము చెప్పినప్రకారము, ఉపాస్తే=ఉపాసించుచున్నాఁడో, (తస్య=వానికి), సః=ఆపురుషుఁడు, (చంద్రమండలాభిమానియగు ఆ పురుషుఁడు), అహరహః=ప్రతిదిన మును, (యజ్ఞే = యజ్ఞమువందు), సుతః = ప్రకృతిస్వరూపుఁడును, ప్రసుతః=వికృతిగాను, (కర్మప్రకృతియని కర్మసాధనములు వికృతి యని చెప్పఁబడును). భవతి=అగుచున్నాఁడు. అస్య=ఈ ఉపాసకునికి, అన్నం=అన్నము, నక్షీయతే=క్షీణింపదు.

తా॥ ఇట్లు సంవాదములో అజాతశత్రువను కాశీరాజుచేత ఆదిత్యరూపమైన పరబ్రహ్మము సరియైనది కాదని చెప్పఁబడగా గార్గ్యుఁడు వేఱొక పరబ్రహ్మమును పొంది, ఓరాజా ? అధికుఁడును తెల్లని కిరణములను శ్వేతవస్త్రముగలవాఁడునగు చంద్రునియందును మనస్సునందును అభిమానియై నేను కర్తను భోక్తను అని తలంచెడి పురుషుఁడొక్కఁడే వీనినే నేను పరబ్రహ్మమునుగా నుపాసించు చున్నాను గనుక నేను ఆ పురుషుస్వరూపమగు బ్రహ్మమును

నీకొఱకు చెప్పుచున్నాను. నీవు దానిని ఉపాసించుమాయని పలికెను. ఇట్లు పలుకఁబడిన ఆ కాశీరాజు ఓ గార్గ్యుఁడా ! నీవు చంద్రమనస్సుల యందభిమానియగు ఆ పురుషుని విషయమై గొప్పవాఁడును తెల్లని వస్త్రముగలవాఁడును సోమలతాద్యాధిపత్యముచేత సోమరాజను పేరుగలచంద్రుఁడు అయియుండెడి ఈ పురుషునే నేను ఈ శరీరేంద్రియ సముదాయమునందు బ్రహ్మస్వరూపునిగా ఉపాసించుచున్నాను. అది నీకొఱకు చెప్పుచున్నాను. దానిని నీవు ఉపాసింపుమని చెప్ప వద్దు. ఇట్లు నీవు ఉపదేశించినది నాకు తెలియును. ఈ పూర్వము చెప్పిన మహాత్వాది విశేషణములతోఁగూడుకొనిన చంద్రమనస్సుల యభిమానియగు ఒక్కఁడైన పురుషుఁడే ధ్యానించెడి వానికి ఆపురుషుఁడే ప్రతిదినమును యజ్ఞకర్మయందు ప్రకృతి వికృతి స్వరూపుఁడగుచున్నాఁడు. ప్రకృతియనఁగా యజ్ఞమును వికృతియనఁగా యజ్ఞక్రియలును, ఈప్రకారము చంద్రమనస్సులయందభిమానియై యుండెడి పురుషుని ఏకముచేసి ఒక్కనిగాతలంచి పరబ్రహ్మమని ఉపాసించెడి వానికి అన్నము ఎప్పటికిని క్షీణింపదు, (నశింపదు) అని పలికెను.

ఉ॥ స హోవాచ గార్గ్యో య ఏవాసౌ విద్యుతి పురుష ఏతమేవాహం బ్రహ్మోపాస ఇతి స హోవాచాజాతశత్రుర్మా మైతస్మిన్ సంవదిష్ఠా స్తేజస్వీతి వా అహమేతముపాస ఇతి స య ఏతమేవముపాస్తే తేజస్వీ హ భవతి తేజస్వినీ హాస్య ప్రజాభవతి. ॥4॥

ప॥ సః – హ – ఉవాచ – గార్గ్యః – యః – ఏవ – అసౌ– విద్యుతి – పురుషః – ఏతం – ఏవ – అహం – బ్రహ్మ – ఉపాసే – ఇతి – సః – హ – ఉవాచ – అజాతశత్రుః – మా – మా – ఏతస్మిన్ – సంవదిష్ఠాః – తేజస్వీ – ఇతి – వై – అహం – ఏతం – ఉపాసే – ఇతి – సః – యః – ఏతం – ఏవం – ఉపాస్తే – తేజస్వీ – హ – భవతి – తేజస్వినీ – హ – అస్య – ప్రజా – భవతి.

ప్ర॥ సః=ఆ, గార్గ్యః=గార్గ్యుఁడు, విద్యుతి = మెరుపునందు,

అసౌ=ఈ, పురుషః=పురుషుఁడు, యఏవ=ఎవఁడో, ఏతమేవ=వీనినే, అహం=నేను, బ్రహ్మ=పరబ్రహ్మమునుగా, ఉపాసఇతి = ఉపాసించుచున్నానని ఉవాచహ=పలికెను. (ఏవముక్తః=ఇట్లు పలుకఁబడిన), సః=ఆ, అజాతశత్రుః=అజాతశత్రువను కాశీరాజు, (ఓ గార్గ్యుఁడా ! నీవు), తేజస్వీతివై=తేజోవంతుఁడేయని, ఏతం=ఈపురుషుని, అహం = నేను, ఉపాసఇతి = ఉపాసించుచున్నానని, ఏతస్మిన్ = ఈపురుష స్వరూపమగు బ్రహ్మమునందు, మామాసంవదిష్ఠాః = సంవాదమును చేయవద్దు, చేయవద్దు. (అని), ఉవాచహ=పలికెను. యః= ఎవఁడు, ఏతం= తేజోవంతుఁడగు ఈ పురుషస్వరూపుని, ఏవం=ఈపూర్వోక్త ప్రకారము, ఉపాస్తే=ఉపాసించుచున్నాఁడో, సః=వాఁడు. తేజస్వీహ =తేజోవంతుఁడును, భవతి = అగుచున్నాఁడు. అస్య=ఈ ఉపాసకుని యొక్క, ప్రజా=సంతానము, తేజస్వినీహ=తేజస్సుకలదియును, భవతి =అగుచున్నది.

తా॥ ఈప్రకారము సంవాదముతో కాశీరాజుచేత చంద్ర స్వరూపమైన పరబ్రహ్మము తిరస్కరింపఁబడఁగా గార్గ్యుఁడు వేఱొక పరబ్రహ్మమునుపొంది ఓ రాజా ! మెఱుపునందును త్వక్కునందును హృదయమునందును అభిమానియై నేను కర్తను భోక్తను అని తలంచెడి ప్రాణస్వరూపుఁడైన పురుషుఁడొక్కఁడే వీనినే నేను శరీరేంద్రియ సముదాయమునందు పరబ్రహ్మమునుగా నుపాసించుచున్నాను. కనుక నేను ఆ పురుషస్వరూపమగు బ్రహ్మమును నీకొఱకు చెప్పుచున్నాను. నీవు దానిని ఉపాసించుమోయని పలికెను ఇట్లు పలుకఁబడిన ఆ కాశీరాజే ఓ గార్గ్యుఁడా! నీవు మెఱుపునందును త్వక్కునందును హృదయమునందును అభిమానియగు ఒక్కఁడైన ప్రాణ స్వరూపుఁడగు పురుషుని విషయమై నేను ఈపురుషుని తేజోవంతుఁడనియే పరబ్రహ్మమునుగా ఉపాసించుచున్నాను. అది నీకొఱకు చెప్పుచున్నాను. దానిని నీవు ఉపాసించుమోయని చెప్పవద్దు. ఇట్లు నీవు

ఉపదేశించినది నాకు తెలియును. ఈ పూర్వము చెప్పిన తేజస్విత్వ విశేషములోఁగూడుకొనిన మెరుపు మొదలైనవాటియందభిమాని యగు ఒక్కఁడైన ప్రాణరూపుఁడగు పురుషుని ధ్యానించెడివాఁడు తేజోవంతుఁడగుచున్నాఁడు. వానిపుత్రులు మొదలైనవారును తేజోవంతులగుచున్నారు అని పలికెను.

౬॥ స హోవాచ గార్గ్యో య ఏవాయమాకాశే పురుష ఏతమేవాహం బ్రహ్మోపాస ఇతి స హోవాచాజాతశత్రుర్మా మైతస్మిన్ సంవదిష్ఠాః పూర్ణమప్రవర్తీతి వా అహమేతముపాస ఇతి స య ఏతమేవముపాస్తే పూర్యతే హ ప్రజయా పశుభిర్నాస్యాస్మాల్లోకాత్ప్రజోద్వర్తతే. ॥6॥

ప॥ సః – హ – ఉవాచ – గార్గ్యః – యః – ఏవ – అయం – ఆకాశే – పురుషః – ఏతం – ఏవ – అహం – బ్రహ్మ – ఉపాసే – ఇతి – సః – హ – ఉవాచ – అజాతశత్రుః – మా – మా – ఏతస్మిన్ – సంవదిష్ఠాః – పూర్ణం – అప్రవర్తి – ఇతి – వై – అహం – ఏతం – ఉపాసే – ఇతి – సః – యః – ఏతం – ఏవం – ఉపాస్తే – పూర్యతే – హ – ప్రజయా – పశుభిః – న – అస్య – అస్మాత్ – లోకాత్ – ప్రజా – ఉద్వర్తతే.

ప్ర॥ సః=ఆ, గార్గ్యః=గార్గ్యుఁడు, ఆకాశే=ఆకాశమునందు, అయం=ఈ, పురుషః = ప్రాణస్వరూపుఁడగు పురుషుఁడు, యఏవ= ఎవఁడో, ఏతమేవ=ఈప్రాణస్వరూపమైన పురుషునే, అస్మిన్ = శరీరేంద్రియసముదాయమునందు), అహం=నేను, బ్రహ్మ = పరబ్రహ్మమునుగా, ఉపాసఇతి=ఉపాసించుచున్నానని, ఉవాచహ = పలికెను. (ఏవముక్తః=ఇట్లు పలుకఁబడిన), సః=ఆ, అజాతశత్రుః=అజాతశత్రువను కాశీరాజు, (ఓ గార్గ్యుఁడా? నీవు) పూర్ణం = పరిపూర్ణుఁడును, అప్రవర్తివై = ప్రవర్తింపనివాఁడేయని, (క్రియారహితుఁడేయని) ఏతం=ఈప్రాణస్వరూపుఁడగు పురుషుని, అహం=నేను, ఉపాసఇతి=

ఉపాసించుచున్నానని, ఏతస్మిన్ = ఈబ్రహ్మమునందు, మామాసంవదిష్ఠాః=సంవాదమును చేయవద్దు. (అని), ఉవాచహ=పలికెను. యః=ఎవఁడు, ఏతం=పూర్ణత్వాదివిశేషణములతోఁగూడుకొనిన, ఈపురుషుని, ఏవం = ఈపూర్వోక్తప్రకారము, ఉపాస్తే = ఉపాసించుచున్నాఁడో, సః=వాఁడు, ప్రజయా=సంతానముతోను, పశుభిః=పశువులతోను, పూర్యతే=నిండింపఁబడుచున్నాడు, అస్య = ఈఉపాసకునియొక్క, ప్రజా=సంతానము, అస్మాత్ =ఈ, లోకాత్ =లోకమునుండి, నోద్వర్తతే=మఱియొకలోకమునుపొందదు. (సంతానవిచ్ఛిత్తిలేదు).

తా॥ ఇట్లు కాశీరాజుచేత సంవాదముతో విద్యుత్స్వరూపమైన పరబ్రహ్మము తిరస్కరింపఁబడగా గార్గ్యుఁడు వేఱొక పరబ్రహ్మమును పొందెను. ఓ రాజా! ఆకాశమునందును హృదయాకాశమునందును అభిమానియై నేను కర్తనుభోక్తను అని తలంచెడి పురుషుఁడొక్కఁడే వీనినే నేను ఈ దేహేంద్రియసముదాయమునందు పరబ్రహ్మమునుగా ఉపాసించుచున్నాను. కనుక నేను ఆ ప్రాణస్వరూపుఁడగు పురుషుని నీకొఱకు చెప్పుచున్నాను. నీవు వానిని ఉపాసింపుమాయని పలికెను. ఇట్లు పలుకఁబడిన కాశీరాజు, ఓ గార్గ్యుఁడా! నీవు బాహ్యాకాశ హృదయాకాశములయందు అభిమానియగు ఒక్కఁడైన ప్రాణస్వరూపుఁడగు పురుషుని విషయమై నేను ఈపురుషుని పూర్ణుఁడును క్రియారహితుఁడును అనియే పరబ్రహ్మమునుగా ఉపాసించుచున్నాను. అది నీకొఱకు చెప్పుచున్నాను. దానిని నీవు ఉపాసింపుమాయని చెప్పవద్దు. ఇట్లు నీవు ఉపదేశించినది నాకు తెలియును. ఈ పూర్వమును చెప్పినప్రకారము పూర్ణత్వ అక్రియావత్త్వములనెడి విశేషణములతోఁగూడుకొనినవాఁడును బాహ్యాకాశ హృదయాకాశములయందభిమానియైన వాఁడును ఒక్కటియైన ప్రాణస్వరూపుఁడునగు పురుషుని ధ్యానించెడివాఁడు పుత్రాదిసంతానముతోను, పశువులతోను,

నిండింపఁబడినవాఁడగుచున్నాఁడు. మరియు అట్టి ఉపాసకునియొక్క సంతానము ఈలోకమునుండి ఎడతెగక నశింపక యుండును.

ఉ॥ స హోవాచ గార్గ్యో య ఏవాయం వాయౌ పురుష ఏతమేవాహం బ్రహ్మోపాస ఇతి స హోవాచాజాతశత్రుర్మా మైతస్మిన్ సంవదిష్ఠా ఇన్ద్రో వైకుణ్ఠోఽపరాజితా సేనేతి వా అహమేతముపాస ఇతి స య ఏతమేవముపాస్తే జిష్ణుర్హాపరాజిష్ణుర్భవత్యన్యతస్త్యజాయీ. ॥6॥

ప॥ సః - హ - ఉవాచ - గార్గ్యః - యః - ఏవ - అయం - వాయౌ - పురుషః - ఏతం - ఏవ - అహం - బ్రహ్మ - ఉపాసే - ఇతి - సః - హ - ఉవాచ - అజాతశత్రుః - మా - మా - ఏతస్మిన్ - సంవదిష్ఠాః - ఇన్ద్రః - వైకుణ్ఠః - అపరాజితా - సేనా - ఇతి - వై - అహం - ఏతం - ఉపాసే - ఇతి - సః - యః - ఏతం - ఏవం - ఉపాస్తే - జిష్ణుః - హ - అపరాజిష్ణుః - భవతి - అన్యతస్త్యజాయీ.

ప్ర॥ సః=ఆ, గార్గ్యః=గార్గ్యుఁడు, వాయౌ=వాయువునందు; అయం=ఈ, పురుషః=పురుషుఁడు, యఏవ=ఎవఁడో, ఏతమేవ=ఈప్రాణరూపమైన పురుషునే, (అస్మిన్=ఈశరీరేంద్రియ సముదాయమునందు), అహం=నేను, బ్రహ్మ=పరబ్రహ్మమునుగా, ఉపాసఇతి=ఉపాసించుచున్నానని, ఉవాచహ = పలికెను. (ఏవముక్తః = ఇట్లు పలుకఁబడిన), సః=ఆ, అజాతశత్రుః=అజాతశత్రువను కాశీరాజు, (ఓ గార్గ్యుఁడా ? నీవు), ఇన్ద్రః=పరమేశ్వరుఁడును, వైకుణ్ఠః=సహింపశక్యుడు కానివాడును, అపరాజితా=పరాజయమునుపొందని, సేనేతివై=సేనాస్వరూపుడు నేయని, ఏతం=ప్రాణరూపుడగు ఈపురుషుని, అహం=నేను, ఉపాసఇతి=ఉపాసించుచున్నానని, ఏతస్మిన్=ఈబ్రహ్మమునందు, మామాసంవదిష్ఠాః=సంవాదమును చేయవద్దు, చేయవద్దు, (అని), ఉవాచహ=పలికెను. యః=ఎవఁడు, ఏతం=ఇన్ద్రత్వాది విశే

షణములతోఁగూడుకొనిన ఈపురుషుని, ఏవం = పూర్వోక్తప్రకారము. ఉపాస్తే=ఉపాసించుచున్నాఁడో, సః=వాఁడు, జిష్ణుః = జయశీలుడును, అపరాజిష్ణుః=ఇతరులచేత జయింపఁబడని స్వభావముగలవాఁడును, అన్యత స్త్యజాయీ=శత్రువులను జయించుటకు స్వభావముకలవాఁడును, భవతి=అగుచున్నాఁడు.

తా॥ ఇట్లా కాశీరాజుచేత సంవాదముతో ఆకాశస్వరూపమైన పరబ్రహ్మ ప్రత్యాఖ్యానము చేయఁబడగా గార్గ్యుడు వేఱొక పరబ్రహ్మమునుపొంది ఓ రాజా ? వాయువునందును ప్రాణమునందును హృదయమునందును అభిమానియై నేను కర్తనుభోక్తను అని తలంచెడి పురుషుడొక్కఁడే. వీనినే నేను దేహేంద్రియాది సముదాయమునందు పరబ్రహ్మమునుగా ఉపాసించుచున్నాను, కనుక నేను ఆ ప్రాణస్వరూపుడగు పురుషుని నీకొఱకు చెప్పుచున్నాను. నీవు వానిని ఉపాసింపుమాయని పలికెను. ఇట్లు పలుకఁబడిన కాశీరాజు ఓ గార్గ్యుడా ? నీవు వాయుప్రాణహృదయములయందు అభిమానియగు ఒక్కఁడైన ప్రాణస్వరూపుడగు పురుషునివిషయమై నేను ఈపురుషుని ఇంద్రుడును అప్రసహ్యుడును పరాజయమునుపొందని సేనాస్వరూపుడును అని యే పరబ్రహ్మమునుగా ఉపాసించుచున్నాను. అది నీకొఱకు చెప్పుచున్నాను. దానిని నీవు ఉపాసింపుమాయని చెప్పవద్దు. ఇట్లు నీవు ఉపదేశించినది నాకు తెలియును. ఈపూర్వము చెప్పినప్రకారము ఇన్ద్రిత్వాది విశేషణములతోఁగూడుకొనినవాఁడును వాయువుప్రాణహృదయములయందు అభిమానియైనవాఁడును ఒక్కటియైన ప్రాణస్వరూపుడునగు పురుషుని ధ్యానించెడివాఁడు జయశీలుడును ఇతరులకు జయింపనలవిగాని స్వభావుడును శత్రుజయశీలుడును అగుచున్నాడని పలికెను.

ఉ॥ స హోవాచ గార్గ్యో య ఏవాయమగ్నౌ పురుష ఏతమేవాహం బ్రహ్మోపాస ఇతి స హోవాచాజాతశత్రుర్మా మైతస్మిన్ సంవ

దిష్ఠాః విషాసహిరితి వా అహమేతముపాస ఇతి స య ఏతమేవ
ముపాస్తే విషాసహిర్హ భవతి విషాసహిర్హాస్య ప్రజా భవతి. ॥7॥

ప॥ సః - హ - ఉవాచ - గార్గ్యః - యః - ఏవ - అయం - అగ్నౌ - పురుషః - ఏతం - ఏవ - అహం - బ్రహ్మ - ఉపాసే - ఇతి - సః - హ - ఉవాచ - అజాతశత్రుః - మా - మా - ఏతస్మిన్ - సంవదిష్ఠాః - విషాసహిః - ఇతి - వై - అహం - ఏతం - ఉపాసే - ఇతి - సః - యః - ఏతం - ఏవం - ఉపాస్తే - విషాసహిః - హ - భవతి - విషాసహిః - హ - అస్య - ప్రజా - భవతి.

ప్ర॥ సః=ఆ, గార్గ్యః = గార్గ్యుడు, అగ్నౌ = అగ్నియందు, అయం=ఈ, పురుషః=పురుషుఁడు, యఏవ = ఎవఁడో, ఏతమేవ = ఈప్రాణరూపుడైన పురుషునే, (అస్మిన్ = ఈ దేహేంద్రియసముదాయమునందు), అహం=నేను, బ్రహ్మ=పరబ్రహ్మమునుగా, ఉపాస ఇతి=ఉపాసించుచున్నానని, ఉవాచహ=పలికెను. (ఏవముక్తః=ఇట్లు పలుకఁబడిన), సః=ఆ, అజాతశత్రుః = అజాతశత్రువను కాశీరాజు, (ఓ గార్గ్యుడా ! నీవు), విషాసహిరితివై=ఇతరులను ఓర్చువాడనియే, (వేల్చఁబడిన హవిస్సునంతయు భస్మముచేయుటచేత అగ్ని విషాసహి యనఁబడుచున్నది). ఏతం=ఈయగ్నియందలి ప్రాణరూపుడైన పురుషుని, అహం=నేను, ఉపాసఇతి=ఉపాసించుచున్నానని, ఏతస్మిన్ = ఈబ్రహ్మమునందు, మామాసంవదిష్ఠాః=ఈసంవాదమును చేయవద్దు, చేయవద్దు. (అని). ఉవాచహ = పలికెను. యః = ఎవఁడు, ఏతం= విషాసహిత్వగుణముతోఁ గూడుకొనిన, ఈపురుషుని, ఏవం = ఈపూర్వోక్తప్రకారము, ఉపాస్తే = ఉపాసించుచున్నాఁడో, సః= వాఁడు, విషాసహిః = శత్రువులను ఓర్చువాఁడు, భవతిహ = అగుచున్నాఁడు. అస్య=ఈఉపాసకునియొక్క, ప్రజా = సంతానమును, విషాసహిః=శత్రువులను ఓర్చునది, భవతిహ = అగుచున్నది.

తా॥ ఇట్లా కాశీరాజుచేత సంవాదముతో వాయుపురుషరూప

మైన బ్రహ్మోపాసనము తిరస్కరింపఁబడగా గార్గ్యుడు వేఱొక బ్రహ్మమునుపొంది ఓ రాజా ? అగ్నియందును వాక్కునందును హృదయమునందును అభిమానియై నేను కర్తనుభోక్తను అని తలంచెడి పురుషుడొక్కడే వీనిసే నేను దేహేంద్రియాది సముదాయము నందు పరబ్రహ్మమునుగా ఉపాసించుచున్నాను. కనుక నేను ఆ ప్రాణ రూపుడగు పురుషుని నీకొఱకు చెప్పుచున్నాను. నీవు వానిని ఉపాసింపుమాయని పలికెను. ఇట్లు పలుకఁబడిన కాశీరాజు, ఓ గార్గ్యుడా ! నీవు అగ్నియందును వాక్కునందును హృదయమునందును అభిమానియగు ఒక్కడైన ప్రాణస్వరూపుడగు పురుషునివిషయమై నేను ఈపురుషుని ఇతరమైన సర్వమును ఓర్చువాఁడని యే పరబ్రహ్మమునుగా ఉపాసించుచున్నాను. అది నీకొఱకు చెప్పుచున్నాను. దానిని నీవు ఉపాసింపుమాయని చెప్పవద్దు. ఇట్లు నీవు ఉపదేశించినది నాకు తెలియును. ఈ పూర్వము చెప్పినప్రకారము విషాసహిత్వ గుణముతోఁగూడిన వాఁడును అగ్ని వాక్కు హృదయము వీనియందభిమానియైనవాఁడును ప్రాణరూపుడునగు పురుషుని ధ్యానించెడి వాఁడు శత్రువులకు సహింపనశక్యుడు అగుచున్నాఁడు. అట్టి యుపాసకునియొక్క పుత్రుడును శత్రువులచే నోర్వశక్యుడుగాక అగ్ని తన యందు వ్రేల్చఁబడిన హవిస్సునంతయు భస్మముచేయుటచే నోర్చినట్లు శత్రువులనందఱిని ఓర్చుచున్నాఁడని పలికెను.

ఉ॥ స హోవాచ గార్గ్యో య ఏవాయమప్సు పురుష ఏతమేవాహం బ్రహ్మోపాస ఇతి స హోవాచాజాతశత్రుర్మా మైతస్మిన్ సంవదిష్ఠాః ప్రతిరూప ఇతి వా అహమేతముపాస ఇతి స య ఏతమేవముపాస్తే ప్రతిరూపగ్ం హైవైనముపగచ్ఛతి నాప్రతిరూప మథో ప్రతిరూపోఽస్మాజ్జాయతే. ॥8॥

ప॥ సః - హ - ఉవాచ - గార్గ్యః - యః - ఏవ - అయం అప్సు - పురుషః - ఏతం - ఏవ - అహం - బ్రహ్మ - ఉపాస్తే

– ఇతి – సః – హ – ఉవాచ – అజాతశత్రుః – మా – మా – ఏతస్మిన్ – సంవదిష్ఠాః – ప్రతిరూపః – ఇతి – వై – అహం – ఏతం – ఉపాసే – ఇతి – సః – యః – ఏతం – ఏవం – ఉపాస్తే – ప్రతిరూపం – హ – ఏవ – ఏనం – ఉపగచ్ఛతి – న – అప్రతిరూపం–అథో – ప్రతిరూపః – అస్మాత్ – జాయతే.

ప్ర॥ సః=ఆ, గార్గ్యః=గార్గ్యుడు, అప్సు=ఉదకములయందు, అయం=ఈ; పురుషః=పురుషుఁడు, యఏవ = ఎవఁడో, ఏతమేవ= ఈప్రాణరూపుఁడైన పురుషునే, (అస్మిన్ = దేహేంద్రియాది సముదాయమునందు), అహం=నేను, బ్రహ్మ=పరబ్రహ్మమునుగా, ఉపాస ఇతి=ఉపాసించుచున్నానని, ఉవాచహ=పలికెను. (ఏవముక్తః=ఇట్లు పలుకఁబడిన), సః=ఆ, అజాతశత్రుః=అజాతశత్రువను కాశీరాజు, (ఓ గార్గ్యుడా ? నీవు), ప్రతిరూపఇతివై =అనురూపమైనవాఁడేయని, (శ్రుతిస్మృతులకు ప్రతికూలము కానివాఁడేయని), ఏతం=ఈ యుదకములయందలి ప్రాణరూపుఁడైన పురుషుని, అహం=నేను, ఉపాస ఇతి=ఉపాసించుచున్నానని, ఏతస్మిన్=ఈబ్రహ్మమునందు; మామా సంవదిష్ఠాః=సంవాదమును చేయవద్దు, చేయవద్దు. (అని), ఉవాచహ =పలికెను. యః=ఎవఁడు, ఏతం=శ్రుతిస్మృత్యనుకూలత్వగుణముతోఁ గూడుకొనిన ఈ పురుషుని, ఏవం= ఈ పూర్వోక్తప్రకారము, ఉపాస్తే =ఉపాసించుచున్నాఁడో, సః=వాఁడు, ప్రతిరూపంహైవ=శ్రుతిస్మృతి శాసనమునకు అనుకూలమైనఫలమునే, ఉపగచ్ఛతి = పొందుచున్నాఁడు. అథో=తరువాత, ఏనం=ఈ ఉపాసకుని, అప్రతిరూపం= శ్రుతిస్మృత్యనుకూలముగాని ఫలమును, నోపగచ్ఛతి = పొందదు. అస్మాత్=ఈ ఉపాసకునివలన, ప్రతిరూపః = ప్రతిబింబరూపుఁడగు పుత్రుఁడు, (సమానరూపముగల పుత్రుడు), జాయతే=పుట్టుచున్నాఁడు.

తా॥ ఇట్లు కాశీరాజుచేత సంవాదముతో అగ్నిపురుషరూపమైన బ్రహ్మోపాసన తిరస్కరింపఁబడగా గార్గ్యుడు వేఱొక బ్రహ్మో

పాసననుపొంది ఓ రాజా! ఉదకములయందును రేతస్సునందును హృదయమువందును అభిమానియై నేను కర్తనుభోక్తను అని తలంచెడి పురుషుడొక్కడే. వీని నేను దేహేంద్రియాది సముదాయము నందు పరబ్రహ్మమునుగా ఉపాసించుచున్నాను. కనుక నేను అప్రాణ స్వరూపుడగు పురుషుని నీకొఱకు చెప్పుచున్నాను. నీవు వానిని ఉపాసింపుమాయని పలికెను. ఇట్లు పలుకఁబడిన కాశీరాజు ఓ గార్గ్యుడా! నీవు ఉదక రేతో హృదయములయందభిమానియగు ఒక్కడైన ప్రాణ స్వరూపుడగు పురుషునివిషయమై నేను ఈపురుషుని శ్రుతిస్మృతులకు ప్రతికూలుడు కానివాఁడేయని పరబ్రహ్మమునుగా ఉపాసించుచున్నాను. అది నీకొఱకు చెప్పుచున్నాను. దానిని నీవు ఉపాసింపుమాయని చెప్పవద్దు. ఇట్లు నీవు ఉపదేశించినది నాకు తెలియును. ఈ పూర్వము చెప్పినప్రకారము శ్రుతిస్మృత్యనుకూలత్వ గుణముతోఁ గూడుకొనినవాఁడును ఉదక రేతో హృదయములయందభిమానియైన వాఁడును ప్రాణరూపుడునగు పురుషుని ధ్యానించెడివాఁడు శ్రుతిస్మృత్యనుకూలమైన ఫలమును పొందుచున్నాఁడు. ఈ యుపాసకుని శ్రుతిస్మృత్యనుకూలముగాని ఫలమునుపొందడు. ఈ యుపాసకునివలన వానితో సమానుడగు పుత్రుఁడును పుట్టుచున్నాఁడని పలికెను.

ఉ॥ స హోవాచ గార్గ్యో య ఏవాయ మాదర్శే పురుష ఏతమేవాహం బ్రహ్మోపాస ఇతి స హోవాచాజాతశత్రుర్మా మైతస్మిన్ సంవదిష్ఠా రోచిష్ణురితి వా అహమేతముపాస ఇతి స య ఏతమేవ ముపాస్తే రోచిష్ణుర్హ భవతి రోచిష్ణుర్హాస్య ప్రజా భవత్యథో యైస్సన్నిగచ్ఛతి సర్వాగ్స్తానతిరోచతే. ॥9॥

ప॥ సః – హ – ఉవాచ – గార్గ్యః – యః – ఏవ – అయం–ఆదర్శే – పురుషః – ఏతం – ఏవ – అహం – బ్రహ్మ – ఉపాసే – ఇతి – సః – హ – ఉవాచ – అజాతశత్రుః – మా – మా – ఏతస్మిన్ – సంవదిష్ఠాః – రోచిష్ణుః – ఇతి – వై – అహం – ఏతం – ఉపాసే –

ఇతి - సః - యః - ఏతం - ఏవం - ఉపాస్తే - రోచిష్ణుః - హ - భవతి - రోచిష్ణుః - హ అస్య - ప్రజా - భవతి - అథో - యైః - సన్నిగచ్ఛతి - సర్వాన్ - తాన్ - అతిరోచతే.

ప్ర॥ సః=ఆ, గార్గ్యః = గార్గ్యుఁడు, ఆదర్శే = అద్దమునందు, (నిర్మల స్వభావమైనదానియందు), అయం=ఈ, పురుషః=పురుషుఁడు, య ఏవ =ఎవఁడో, ఏతమేవ=ఈపురుషునే. (అస్మిన్=ఈ దేహేంద్రియాది సముదాయమునందు), అహం=నేను, బ్రహ్మ = పరబ్రహ్మమనుగా, ఉపాసఇతి=ఉపాసించుచున్నానని, ఉవాచహ = పలికెను. (ఏవముక్తః=ఇట్లు పలుకఁబడిన), సః=ఆ, అజాతశత్రుః=అజాతశత్రువను కాశీరాజు, ఓ గార్గ్యుఁడా నీవు), రోచిష్ణురితివై =ప్రకాశ స్వభావమైన వాఁడేయని, ఏతం = ఈ పురుషుని, (ఈ అద్దము మొదలైన నిర్మల స్వభావమైన దానియందలి పురుషుని), అహం = నేను, ఉపాసఇతి = ఉపాసించుచున్నానని, ఏ తస్మిన్=ఈ బ్రహ్మమునందు, మామా సంవదిష్ఠాః=సంవాదమును చేయవద్దు. (అని), ఉవాచహ= పలికెను. యః = ఎవఁడు, ఏతం = ఈ పురుషుని, ఏవం = ఈ పూర్వోక్తప్రకారము, ఉపాస్తే = ఉపాసించుచున్నాఁడో, సః= వాఁడు, రోచిష్ణుః = ప్రకాశ స్వభావము గలవాఁడు, భవతిహ = అగుచున్నాడు. అస్య = ఈ ఉపాసకునియొక్క, ప్రజా = సంతతి, రోచిష్ణుః=ప్రకాశ స్వభావముకలది, భవతిహ=అగుచున్నది, అథో= మరియు (ఆ ఉపాసకుడు), యైః=ఎవరితో, సన్నిగచ్ఛతి=కలిసికొనుచున్నాఁడో, తాన్ = ఆ, సర్వాన్ = అందరిని, అతిరోచతే=అతిక్రమించి ప్రకాశించుచున్నాఁడు.

తా॥ ఇట్లు కాశీరాజుచేత సంవాదములో, జలపురుషరూపమైన బ్రహ్మోపాసన తిరస్కరింపఁబడఁగా గార్గ్యుఁడు వేరొక బ్రహ్మోపాసనను పొందిఓరాజా! నిర్మలస్వభావమగు అద్దమునందును ఇతరమగు ఖడ్గము మొదలైనదానియందును, ప్రతిబింబించి అభిమా

నియై నేను కర్తను భోక్తను అని తలంచెడి పురుషుఁడొక్కఁడె వీని నేను దేహేంద్రియాది సముదాయమునందు పరబ్రహ్మమునుగా ఉపాసించుచున్నాను. కనుక నేను ఓ రాజా ఆ ప్రాణస్వరూపమగు పురుషుని నీకొఱకు చెప్పుచున్నాను. నీవు వానిని ఉపాసించుమూ యనిపలికెను. ఇట్లుపలుకఁబడిన కాశీరాజు ఓ గార్గ్యుఁడా నీవు నిర్మలస్వభావములైన అదర్శాదులయందు ప్రతిఫలనాత్మకమై యభిమాని యగు ఒక్కఁడగు ప్రాణస్వరూపుఁడైన పురుషుని విషయమై నేను ఈ పురుషుని ప్రకాశస్వభావుఁడేయని పరబ్రహ్మమునుగా ఉపాసించుచున్నాను. అది నీకొఱకు చెప్పుచున్నాను. దానిని నీవు ఉపాసించుమూయని చెప్పవద్దు. ఇట్లు నీవు ఉపదేశించినది నాకు తెలియును. ఈపూర్వము చెప్పినప్రకారము ప్రకాశస్వభావగుణముతోఁగూడుకొనినవాఁడును నిర్మలములగు అదర్శాదులయందు ప్రతిఫలించి యభిమానియైనవాఁడును ప్రాణస్వరూపుఁడునగు పురుషుని ధ్యానించెడివాఁడు ప్రకాశస్వభావమును పొందుచున్నాఁడు. ఈఉపాసకునియొక్క పుత్రుఁడును ప్రకాశస్వభావుఁ డగుచున్నాఁడు. మఱియు నా ...సకుఁడు సమానులందరిని అతిక్రమించి ప్రకాశించుచున్నాఁడని పలికెను.

ఉ॥ స హోవాచ గార్గ్యోయ ఏవాయం యన్తం పశ్చాచ్ఛబ్దోఽ
నూదేత్యేత మేవాహం బ్రహ్మోపాస ఇతి స హోవాచాజాత
శత్రుర్మా మైతస్మిన్ సంవదిష్ఠా అసురితి వా అహమేత ముపాస
ఇతి స య ఏతమేవ ముపాస్తే సర్వగ్ం హైవాస్మిగ్ంల్లోక ఆయురేతి
నైనం పురాకాలాత్ప్రాణో జహాతి. ॥10॥

ప॥ సః - హ - ఉవాచ - గార్గ్యః - యః - ఏవ - అయం - యన్తం - పశ్చాత్ - శబ్దః - అనూదేతి - ఏతం - ఏవ - అహం - బ్రహ్మ - ఉపాసే - ఇతి - సః - హ - ఉవాచ - అజాతశత్రుః - మా - మా - ఏతస్మిన్ - సంవదిష్ఠాః - అసుః - ఇతి - వై - అహం - ఏతం - ఉపాసే - ఇతి - సః - యః - ఏతం - ఏవం -

ఉపాస్తే - సర్వం - హ - ఏవ - అస్మిన్ - లోకే - ఆయుః - ఏతి - న - ఏనం - పురా - కాలాత్ - ప్రాణః - జహాతి.

ప్ర॥ సః=ఆ, గార్గ్యః=గార్గ్యుఁడు, యః = ఏ, అయం = ఈ, శబ్దఏవ=శబ్దమే, యన్తం=పోవువానిగూర్చి, పశ్చాత్=వెనుక, అనూదేతి=అనుసరించి పుట్టుచున్నదో, ఏతమేవ=వీనినే, (అస్మిన్ = ఈ దేహేంద్రియాది సముదాయమందు), అహం=నేను, బ్రహ్మ=పరబ్రహ్మమునుగా, ఉపాసఇతి = ఉపాసించుచున్నానని, ఉవాచహ= పలికెను. (ఏవముక్తః = ఇట్లుపలుకబడిన) సః = ఆ, అజాతశత్రువను కాశీరాజు, (ఓగార్గ్యుఁడానీవు), అసురితివై = ప్రాణమేయని, ఏతం = ఈ శబ్దమును, అహం=నేను, ఉపాసఇతి = ఉపాసించుచున్నానని, ఏతస్మిన్=దీనియందు, మా మాసంవదిష్ఠాః =సంవాదమును చేయవద్దు, చేయవద్దు (అని) ఉవాచహ=పలికెను, యః=ఎవఁడు, ఏతం=వీనిని, ఏవం = ఈపూర్వోక్తప్రకారము, ఉపాస్తే = ఉపాసించుచున్నాఁడో, సః=వాఁడు, అస్మిన్=ఈ, లోకే=లోకమునందు, సర్వంహైవాయుః= సమస్తమైన అయుస్సును, ఏతి=పొందుచున్నాఁడు. ప్రాణః=ప్రాణము, కాలాత్ = కర్మఫల పరిచ్ఛిన్నకాలముకంటె, పురా = ముందు, (రోగాదిభిః=వ్యాధులుమొదలైన వానిచేత, పీడ్యమానమపి=పీడింపఁబడినవాఁడైనను), ఏనం=ఈఉపాసకుని, నజహాతి=విడువదు.

తా॥ ఇట్లా కాశీరాజుచేత సంవాదముతో ప్రతిబింబరూపమైన బ్రహ్మోపాసన తిరస్కరింపఁబడగా గార్గ్యుఁడు వేరొకబ్రహ్మోపాసనను పొంది ఓ రాజా ! నడచిపోయెడివానినిగూర్చి వెనుకభాగమునందు అనుసరించి పుట్టెడి శబ్దస్వరూపమైన పురుషుని నేను ఈ దేహేంద్రియసముదాయమునందు పరబ్రహ్మమునుగా ఉపాసించుచున్నాను, కనుక ఓ రాజా ! నేను అప్రాణస్వరూపమగు పురుషుని నీకొఱకు చెప్పుచున్నాను. నీవు దాని ఉపాసించుమాయని పలికెను. ఇట్లు పలుకఁబడి ఆ కాశీరాజు ఓ గార్గ్యుఁడా ? నీవు శబ్దస్వరూపమైన ఈ

పురుషుని విషయమై నేను ఈ పురుషుని ప్రాణమేయని యుపాసించుచున్నాను. అది నీకొఱకు చెప్పుచున్నాను, దానిని నీవు ఉపాసించుమాయని చెప్పవద్దు. ఇట్లు నీవు ఉపదేశించినది నాకు తెలియును, ఈ పూర్వము చెప్పిన ప్రకారము శబ్దగుణముతో గూడినవాఁడును ప్రాణరూపుఁడునగు పురుషుని ధ్యానించెడివాఁడు ఈ లోకమునందు తనకర్మచే పొందఁబడిన సమస్త ఆయుస్సును పొందుచున్నాఁడు. ప్రాణము కర్మపరిచ్ఛిన్న కాలముకంటె పూర్వము ఈఉపాసకుని రోగాదులచేత బాధింపఁబడినను విడువదు (వీనిని అపమృత్యువు పొందదని భావము), అని పలికెను.

ఉ॥ స హోవాచ గార్గ్యో య ఏవాయం దిక్షు పురుష ఏతమేవాహం బ్రహ్మోపాస ఇతి స హోవాచాజాత శత్రుర్మా మైతస్మిన్ సంవదిష్ఠా ద్వితీయోఽనపగ ఇతి వా అహమేతముపాస ఇతి స య ఏతమేవముపాస్తే ద్వితీయవాన్ హ భవతి నాస్మాద్గణశ్ఛిద్యతే.॥11॥

ప॥ సః - హ - ఉవాచ - గార్గ్యః - యః - ఏవ - అయం - దిక్షు - పురుషః - ఏతం - ఏవ - అహం - బ్రహ్మ - ఉపాసే - ఇతి - సః - హ - ఉవాచ - అజాతశత్రుః - మా - మా - ఏతస్మిన్ - సంవదిష్ఠాః - ద్వితీయః - అనపగః - ఇతి - వై - అహం - ఏతం - ఉపాసే - ఇతి - సః - యః - ఏతం - ఏవం - ఉపాస్తే - ద్వితీయవాన్ - హ - భవతి - న - అస్మాత్ - గణః - ఛిద్యతే.

ప్ర॥ సః=ఆ, గార్గ్యః = గార్గ్యుఁడు, దిక్షు = దిక్కులయందు, అయం=ఈ, పురుషః = పురుషుఁడు, యఏవ = ఎవఁడో, ఏతమేవ= ఈ పురుషునే, (అస్మిన్=ఈ దేహేంద్రియాది సముదాయమునందు), అహం = నేను, బ్రహ్మ = పరబ్రహ్మమునుగా, ఉపాసఇతి = ఉపాసించుచున్నానని, ఉవాచహ = పలికెను. (ఏవముక్తః = ఇట్లుపలుకఁబడిన), సః = ఆ, అజాతశత్రుః = అజాతశత్రువను కాశీరాజు, (ఓ గార్గ్యుఁడా ! నీవు), ద్వితీయః = రెండవది కలవాఁడును,

అనపగమిష్యతి వై=విడిపోనివాఁడును అని యె, ఏతం = ఈ పురుషుని, (ఈ దిక్కులయందలి పురుషుని), అహం=నేను, ఉపాస ఇతి=ఉపాసించుచున్నానని, ఏతస్మిన్=ఈ పురుషుని విషయమై, మామా సంవదిష్ఠాః= సంవాదమును చేయవద్దు చేయవద్దు (అని) ఉవాచ హ=పలికెను. యః=ఎవఁడు, ఏతం=ఈ పురుషుని, ఏవం=ఈ పూర్వోక్తప్రకారము, ఉపాస్తే=ఉపాసించుచున్నాఁడో, సః=వాఁడు, ద్వితీయవాన్=రెండవవాఁడుకలవాఁడు, భవతి హ=అగుచున్నాఁడు. అస్మాత్=ఈ ఉపాసకుని వలన, గణః=సమూహము, (సాధువులగు భృత్యులతో చుట్టుకొని యుండుట) నఛిద్యతే=విడిపోదు.

తా॥ ఇట్లా కాశీరాజుచేత సంవాదముతో శబ్దస్వరూపమైన పురుషోపాసన తిరస్కరింపఁబడఁగాగార్గ్యుఁడు వేరొక బ్రహ్మోపాసనను పొంది ఓ రాజా! అశ్వినీ దేవతలే స్వరూపముగాఁగల దిక్కుల యందును శ్రోత్రములయందును హృదయమందును అభిమానియై నేను కర్తను భోక్తను అని తలంచెడి పురుషుఁడొక్కఁడే, వీనిని నేను దేహేంద్రియాది సముదాయమునందు పరబ్రహ్మమునుగా ఉపాసించుచున్నాను. కనుక నేను ఆ ప్రాణస్వరూపుఁడగు పురుషుని నీకొఱకు చెప్పుచున్నాను. నీవు వానిని ఉపాసింపుమూ యని పలికెను. ఇట్లు పలుకఁబడి కాశీరాజు ఓ గార్గ్యుఁడా! నీవు దిక్ఛ్రోత్రహృదయముల యం దభిమానియగు ఒక్కఁడైన ప్రాణస్వరూపుఁడగు పురుషుని విషయమై నేను దిక్ఛ్రోత్రహృదయములయందు ఏక దేవతాస్వరూపులైన అవియుక్తస్వభావులగువారు అశ్వినీదేవతలు గనుక ఈ దిక్ఛ్రోత్ర హృదయములయం దభిమానియగు ప్రాణస్వరూపుఁడైన ఈపురుషుని ఆ యశ్వినీదేవతల సంబంధమైన ద్వితీయ వత్వమును అవియుక్తత్వమును ధర్మముగా కలవాఁడేయని పరబ్రహ్మమునుగా ఉపాసించుచున్నాను. అది నీకొఱకు చెప్పుచున్నాను. దానిని నీవు ఉపాసించుమూయని చెప్పవద్దు. ఇట్లు నీవు చెప్పినది నాకు తెలియును. ఈపూర్వము

చెప్పినప్రకారము ద్వితీయవత్వ అవియు క్తత్వములను ధర్మములతోఁ గూడుకొనినవాఁడును ప్రాణస్వరూపుఁడునగు పురుషుని ధ్యానించెడి వాఁడు సహాయముకలవాఁడును సాధువులగు భృత్యులతో ఎడతెగక చుట్టుకొనియుండువాఁడును అగుచున్నాఁడు. ఇట్టి యుపాసకునివలన భృత్యగణము ఎప్పటికి విడిపోదు అని పలికెను.

ఉ॥ స హోవాచ గార్గ్యో య ఏవాయం ఛాయామయః పురుష ఏత మేవాహం బ్రహ్మోపాస ఇతి స హోవాచాజాతశత్రుర్మా మైతస్మిన్ సంవదిష్ఠా మృత్యురితి వా అహమేతముపాస ఇతి స య ఏత మేవముపాస్తే సర్వగ్ం హైవాస్మిగ్ంల్లోక ఆయు రేతి నైనం పురా కాలాన్మృత్యురాగచ్ఛతి. ॥12॥

సః - హ - ఉవాచ - గార్గ్యః - యః - ఏవ - అయం - ఛాయామయః - పురుషః - ఏతం - ఏవ - అహం-బ్రహ్మ-ఉపాసే - ఇతి - సః - హ - ఉవాచ - అజాతశత్రుః - మా - మా - ఏత స్మిన్ - సంవదిష్ఠాః - మృత్యుః - ఇతి - వై - అహం - ఏతం - ఉపాసే - ఇతి-సః-యః - ఏతం - ఏవం - ఉపాస్తే - సర్వం - హ- ఏవ - అస్మిన్ - లోకే - ఆయుః - ఏతి - న - ఏనం - పురా - కాలాత్ - మృత్యుః - ఆగచ్ఛతి.

ప్ర॥ సః = ఆ, గార్గ్యః = గార్గ్యుఁడు, అయం = ఈ, ఛాయామయః = ఛాయాస్వరూపుఁడైన, పురుషః = పురుషుఁడు, యఏవ=ఎవఁడో, ఏతమేవ=ఈ పురుషునే, (అస్మిన్ = ఈ దేహేం ద్రియాది సముదాయమునందు) అహం—నేను, బ్రహ్మ=పరబ్రహ్మము నుగా, ఉపాసఇతి=ఉపాసించుచున్నానని, ఉవాచహ=పలికెను. (ఏవ ముక్తః=ఇట్లు పలుకఁబడిన) సః=ఆ, అజాతశత్రుః=అజాతశత్రువను కాశీరాజు, (ఓగార్గ్యుఁడా నీవు), మృత్యురితివై = మృత్యుస్వరూపమే యని, ఏతం=ఈ పురుషుని, అహం=నేను, ఉపాసఇతి = ఉపాసించు చున్నానని. ఏతస్మిన్ =ఈ పురుషుని విషయమై, మామాసంవదిష్ఠాః=

సంవాదమును చేయువద్దు, చేయువద్దు, (అని) ఉవాచహ = పలికెను. యః=ఎవఁడు, ఏతం=ఈ పురుషుని, ఏవం=ఈ పూర్వోక్తప్రకారము, ఉపాస్తే=ఉపాసించుచున్నాఁడో, సః=వాఁడు, అస్మిన్=ఈ, లోకే= లోకమునందు, సర్వంహైవాయుః = సమస్తమైన ఆయుస్సునున్ను, ఏతి=పొందుచున్నాఁడు. మృత్యుః=మృత్యువు, కాలాత్ = మరణ కాలముకంటె, పురా=పూర్వము, ఏనం=ఈ ఉపాసకుని, నాగచ్ఛతి= పొందదు.

తా॥ ఇట్లా కాశీరాజుచేత సంవాదముతో దిక్పురుషోపాసన తిరస్కరింపఁబడఁగా గార్గ్యుఁడు వేరొక బ్రహ్మోపాసనను పొంది ఓ రాజా! వెలుపలనుండెడి అధ్యాత్మస్వరూపమగు చీకటియందును హృదయమునందలి ఆవరణాత్మకమైన అజ్ఞానమునందును అభిమానియై నేను కర్తను భోక్తను అని తలంచెడి పురుషుఁడొకఁడే వీనిని దేహేంద్రియాది సముదాయమునందు పరబ్రహ్మమునుగా ఉపాసించుచున్నాను. కనుక నేను ఆ ప్రాణస్వరూపుఁడగు పురుషుని నీకొఱకు చెప్పుచున్నాను. నీవు వానిని ఉపాసించుమాయని పలికెను. ఇట్లు పలుకఁబడి ఆ కాశీ రాజు ఓగార్గ్యుఁడా? నీవు వెలుపలి అంధకారమునందును హృదయమునందలి అజ్ఞానమునందును అభిమానియగు ఒకఁడైన ప్రాణస్వరూపుఁడగు పురుషుని విషయమై నేను అంధకారాజ్ఞానములయందు ఏకస్వరూపమైన మృత్యువే దేవతగనుక ఈ అంధకారాజ్ఞానములయందు అభిమానియగు ప్రాణస్వరూపుఁడైన ఈ పురుషుని అమృత్యువే యని పరబ్రహ్మముగా ఉపాసించుచున్నాను. అదినీకొఱకు చెప్పుచున్నాను. దానిని నీవు ఉపాసించుమాయని చెప్పవద్దు. ఇట్లు నీవుచెప్పినదినాకు తెలుసును. ఈ పూర్వము చెప్పినప్రకారము మృత్యుధర్మముతోఁ గూడుకొనినవాఁడును ప్రాణస్వరూపుఁడునగు పురుషుని ధ్యానించెడివాఁడు ఈ లోకమునందు సమస్త ఆయుస్సును పొందుచున్నాఁడు. ఇట్టి ఉపాసకుని మృత్యువు మరణకాలముకంటె

ముందు పొందదు అని పలికెను.

ఉ॥ స హోవాచ గార్గ్యో య ఏవాయమాత్మని పురుష ఏతమేవాహం బ్రహ్మోపాస ఇతి స హోవాచాజాతశత్రుర్మా మైతస్మిన్ సంవదిష్ఠా ఆత్మన్వీతి వా అహమేతముపాస ఇతి స య ఏతమేవముపాస్తే ఆత్మన్వీ హ భవత్యాత్మన్వినీ హాస్య ప్రజా భవతి స హ తూష్ణీమాస గార్గ్యః. ॥13॥

ప॥ సః - హ - ఉవాచ - గార్గ్యః-యః-ఏవ-అయం-ఆత్మని-పురుషః - ఏతం - ఏవ - అహం - బ్రహ్మ - ఉపాసే - ఇతి - సః - హ - ఉవాచ - అజాతశత్రుః - మా - మా - ఏతస్మిన్ - సంవదిష్ఠాః - ఆత్మన్వీ - ఇతి - వై - అహం - ఏతం - ఉపాసే - ఇతి - సః - యః - ఏతం - ఏవం - ఉపాస్తే - ఆత్మన్వీ - హ - భవతి - ఆత్మన్వినీ, హ - అస్య - ప్రజా - భవతి - సః - హ - తూష్ణీం - ఆస - గార్గ్యః.

ప్ర॥ సః=ఆ, గార్గ్యః=గార్గ్యుఁడు, ఆత్మని=బుద్ధిస్వరూపమైన ప్రజాపతియందు, అయం=ఈ, పురుషః=పురుషుఁడు, యఏవ=ఎవఁడో, ఏతమేవ = ఈపురుషునే, (అస్మిన్ = ఈ దేహేంద్రియ సముదాయమునందు, అహం=నేను,బ్రహ్మ=పరబ్రహ్మమునుగా,ఉపాసఇతి=ఉపాసించుచున్నానని, ఉవాచహ=పలికెను. (ఏవముక్తః=ఇట్లు పలుకఁబడిన), సః=ఆ, అజాతశత్రుః=అజాతశత్రువను కాశీరాజు, (ఓ గార్గ్యుఁడా ? నీవు) ఆత్మన్వీతివై=అధికబుద్ధిగలవాఁడనియె, (స్వాధీనమైన బుద్ధికలవాఁడని), ఏతం=ఈపురుషుని, అహం=నేను, ఉపాసఇతి=ఉపాసించుచున్నానని, ఏతస్మిన్=ఈపురుషుని విషయమై, మా మా సంవదిష్ఠాః=సంవాదమును చేయవద్దు, చేయవద్దు. (అని) ఉవాచహ = పలికెను. యః=ఎవఁడు, ఏతం=ఈపురుషుని, ఏవం = ఈపూర్వోక్తప్రకారము, ఉపాస్తే=ఉపాసించుచున్నాఁడో, సః=వాఁడు, ఆత్మన్వీ=అధికబుద్ధికలవాఁడు, భవతిహ=అగుచున్నాఁడు. అస్య = ఈ ఉపాసకునియొక్క,

ప్రజా=సంతానము, భవతిహ = అగుచున్నది. (తతః=అనంతరము), సః=ఆ, గార్గ్యః=గార్గ్యుఁడు, తూష్ణీమ్ ఆస=ఊరకుండెను.

ఇట్లు కాశీరాజు చేత సంవాదముతో మృత్యుస్వరూపమైన పురుషోపాసన తిరస్కరింపఁబడఁగా గార్గ్యుఁడు వేఱొక బ్రహ్మోపాసననుపొంది ఓ రాజా? బుద్ధిస్వరూపమగు ప్రజాపతియందును హృదయమందును అభిమానినై నేను కర్తను భోక్తను అని తలంచెడి పురుషుఁడొక్కండే వీని దేహేంద్రియాది సముదాయమునందు పరబ్రహ్మముగా ఉపాసించుచున్నాను. కనుక నేను ఆ ప్రాణస్వరూపుఁడగు పురుషుని నీకొఱకు చెప్పుచున్నాను. నీవు వానిని ఉపాసించుమాయని పలికెను. ఇట్లు పలుకఁబడిన ఆ కాశీరాజు ఓ గార్గ్యుఁడా ? నీవు, బుద్ధిస్వరూపమైన ప్రజాపతి హృదయములయందభిమానియగు ఒక్కఁడైన ప్రాణస్వరూపుఁడగు పురుషునివిషయమై నేను ప్రజాపతి హృదయములమందు ఏకస్వరూపమైన పురుషుఁడు స్వాధీనమైన బుద్ధిగలవాఁడుగనుక ప్రజాపతియందును హృదయమందును అభిమానియగు ఈ పురుషుని స్వాధీనబుద్ధిగలవాఁడేయని పరబ్రహ్మముగా ఉపాసించుచున్నాను. అది నీ కొఱకు చెప్పుచున్నాను. దానిని నీవు ఉపాసించుమాయని చెప్పవద్దు. ఇట్లు నీవు చెప్పినది. నాకు తెలియును. ఈపూర్వము చెప్పినప్రకారము స్వాధీనమైనబుద్ధి ధర్మముతోఁగూడుకొని వాఁడున్న ప్రాణస్వరూపుఁడునగు పురుషుని ధ్యానించెడివాఁడు స్వాధీనబుద్ధిగలవాఁడగుచున్నాఁడు. ఈయుపాసకునియొక్క పుత్రుఁడును స్వాధీనబుద్ధిగలవాఁడగుచున్నాఁడు అని పలికెను. ఈప్రకారము చెప్పఁబడిన బ్రహ్మోపాసనలన్నిటిని కాశీరాజు తిరస్కరింపఁగా ఆ గార్గ్యుఁడు ప్రత్యుత్తరముతోచనివాఁడై శిరస్సువంచుకొని ఊరకుండెను.

ఉ॥ స హోవా ... తశత్రు రేతావన్నూ ౩ ఇత్యేతావద్ధీతి నై తావతా విదితం భవతీతి స హోవాచ గార్గ్య ఉప త్వా యానీతి, ॥14॥

ప॥ సః - హ - ఉవాచ - అజాతశత్రుః - ఏతావత్ - నూ - ఏతావత్ - హి - ఇతి - న - ఏతావతా - విదితం - భవతి- ఇతి - సః - హ - ఉవాచ - గార్గ్యః - ఉప - త్వా - యాని -

ప్ర॥ సః = ఆ, అజాతశత్రుః = అజాతశత్రువను కాశీరాజు, ఏతావన్నూ ఇతి=ఇంతేనా యని, ఉవాచహ = పలికెను, (ఇతరః = అన్యుఁడగు గార్గ్యుఁడు), ఏతావద్ధితి=ఇంతేయని, (ఆహ = పలికెను). (అజాతశత్రుః = అజాతశత్రువను కాశీరాజు), ఏతావతా = ఇంత మాత్రము తెలిసికొనుటచేత, (బ్రహ్మ=పరబ్రహ్మము), విదితం= తెలియఁబడినది: నభవతీతి=కాదని, (ఆహ=పలికెను). సః=ఆ, గార్గ్యః= గార్గ్యుఁడు, త్వా=నిన్ను, ఉపయానీతి = పొందెదనని, ఉవాచహ= పలికెను.

తా॥ ఆ ప్రకారము ఊరకున్న గార్గ్యునిచూచి అజాతశత్రువను కాశీరాజు ఓ గార్గ్యుఁడా ? నీవు తెలిసికొనిన పరబ్రహ్మమిదియేనా ఇంకను అధికముగా ఉన్నదాయని పలుకఁగా ఆ గార్గ్యుఁడు ఇంతేయని చెప్పెను. అప్పుడా కాశీరాజు పరబ్రహ్మ మింతమాత్రముతో తెలియఁ బడదు అని పలికి ఇంతకంటె అధికమైన పరబ్రహ్మమున్నది, అది తెలిసికొనఁదగినది యని సూచనచేయఁగా అట్టి పరబ్రహ్మస్వరూప మును సమీపించి వచ్చిన శిష్యునికొఱకు చెప్పఁదగినది యనెడి ఆచార విధి తెలిసిన గార్గ్యుఁడు ఆపత్కాలమునందు అబ్రాహ్మణునివల్లనైనను అధ్యయనము చేయఁదగినదియని తానే ఓ. కాశీరాజా ? నిన్ను నేను ఇతరుఁడగు శిష్యుఁడు గురువునివలెనె పొందెదనని పలికెను.

ఉ॥ స హోవాచాజాతశత్రుః ప్రతిలోమం (చై) తైతద్యద్బ్రాహ్మణః క్షత్రియముపేయాద్బ్రహ్మ మే వక్ష్యతీతి వ్యేవ త్వా జ్ఞపయిష్యా మీతి తం పాణావాదాయోత్తస్థౌ తౌ హ పురుషగ్ం సుప్తమా జగ్మతు స్తమేతైర్నామభిరామన్త్రయాఞ్చక్రే బృహన్పాణ్డరవాసః

సోమ రాజన్నితి సనో త్తస్థౌతం పాణినా పేషం బోధయాఞ్చకార స హోత్తస్థౌ. ॥15॥

ప॥ సః - ఉవాచ - అజాతశత్రుః - ప్రతిలోమం - వా-ఏతత్-యత్ - బ్రాహ్మణః - క్షత్రియం - ఉపేయాత్ - బ్రహ్మ - మే - వక్ష్యతి - ఇతి - వి - ఏవ - త్వా - జ్ఞాపయిష్యామి - ఇతి - తం - పాణౌ - ఆదాయ - ఉత్తస్థౌ - తౌ - హ - పురుషం - సుప్తం - ఆజగ్మతుః - తం - ఏతైః - నామభిః - ఆమన్త్రయాఞ్చక్రే - బృహన్ - పాణ్డరవాసః - సోమరాజన్ - ఇతి - సః - న - ఉత్తస్థౌ - తం - పాణినా - ఆపేషం - బోధయాఞ్చకార - సః - హ - ఉత్తస్థౌ.

ప్ర॥ బ్రాహ్మణః=బ్రాహ్మణుఁడు, క్షత్రియం=క్షత్రియునిగూర్చి, బ్రహ్మ=పరబ్రహ్మమును, మే=నాకు, వక్ష్యతీతి=చెప్పఁగలఁడని, ఉపేయాదితియత్=పొందుటయేదియో, తత్=అది, ప్రతిలోమంవా=విపరీతమైనదేయని, సః = ఆ, అజాతశత్రుః = అజాతశత్రువను కాశీరాజు, ఉవాచహ=పలికెను. (ఇది ఆచారవిధిశాస్త్రములయందు నిషేధింపఁబడినది గనుక నీవు ఆచార్యుఁడవయ్యే ఉండుము నేను), త్వామేవ=నిన్నుగూర్చియె, (వేద్యం=తెలిసికొనఁదగిన, బ్రహ్మ=ముఖ్యమైన పరబ్రహ్మమును), విజ్ఞాపయిష్యామితి=విన్నవింపఁగలనని, తం=ఆగార్గ్యుని, పాణౌ=హస్తమునందు, ఆదాయ = గ్రహించి, ఉత్తస్థౌ = లేచెను. తౌహ=ఆ గార్గ్యాజాతశత్రులిద్దఱును, (క్వచిత్ = ఒకానొక, రాజగృహప్రదేశే = రాజుయొక్క ఇంటిలోపలి స్థలమునందు), సుప్తం = నిద్రించియున్న, పురుషం = పురుషునిగూర్చి, ఆజగ్మతుః = వచ్చిరి. తం=ఆ పురుషుని, (ప్రాప్య=పొంది), హేబృహన్ = ఓ అధికుఁడా? హేపాణ్డరవాసః=ఓ తెల్లనివస్త్రము కలవాఁడా? హేసోమరాజన్ = ఓ సోమరాజా, ఇతి=అనెడి, ఏతైః=ఈ, నామభిః = పేళ్ళచేతను, ఆమన్త్రయాఞ్చక్రే=పిలిచెను. సః=ఆనిద్రించెడి పురుషుఁడు, నోత్తస్థౌ =లేవకపోయెను, తం=ఆ లేవనిపురుషుని, పాణినా=హస్తముచేతను,

ఆపేషం=స్పర్శించిస్పర్శించి, బోధయాఞ్చకార=లేపెను. (తేన = ఆ స్పర్శించుట చేతను), సహ=ఆ పురుషుఁడు, ఉత్తస్థౌ=లేచెను.

తా॥ ఈపూర్వోక్తప్రకార మా గార్గ్యుఁడు ఓ రాజా ! నీకు నేను శిష్యుఁడ నగుచున్నానని పలుకఁగా ఆ అజాతశత్రువను కాశీరాజు ఓ గార్గ్యుఁడా ? బ్రాహ్మణుఁడు అనాచార్యుఁడగు క్షత్రియుఁడు పర బ్రహ్మోపదేశము చేయఁగలఁడని ఆనాచార్యస్వభావుఁడగు క్షత్రియునిగూర్చి శిష్యుఁడగుట ఆచారమును విధించెడి శాస్త్రములయందు కేవలము నిషేధింపఁబడినది. కనుక నీవు ఆచార్యుఁడవయ్యే యుండుము. నేను నిన్నుగూర్చియె తెలిసికొనఁదగిన ముఖ్యమగు పర బ్రహ్మమును విన్నవించెదనని పలికి లజ్జితుఁడగు ఆ గార్గ్యునిచూచి ఆయనకు స్వేచ్ఛావిహారము కలుగుటకు చెయ్యిపట్టుకొని ఆగార్గ్యుఁడు చెప్పిన ప్రాణస్వరూపులగు ఆదిత్యాది పరబ్రహ్మముకంటె వేరగు ముఖ్యమైన పరబ్రహ్మమును తెలుపుటకు లేచెను. లేచిన ఆ గార్గ్యాజాతశత్రువు లిద్దఱును రాజగృహములో నొకప్రదేశమునందు నిద్రించియున్న పురుషునియొద్దకుపోయి ఇంతకుపూర్వము గార్గ్యునిచేత చెప్పఁబడినవియును ప్రాణములకు ప్రసిద్ధములైనవియునగు బృహత్ పాణ్డరవాసః సోమరాజన్ అనెడి ఈనామములతో కాశీరాజు ఆ నిద్రించినవాని పిలువఁగా అతఁడు లేవకపోయెను. ఇట్లు లేవకపోఁగా కాశీరాజు తిరిగి హస్తములతో స్పర్శించి లేపెను. అప్పుడా నిద్రించియున్న పురుషుఁడు లేచెను. వీనిచేత ఇంతకుపూర్వము గార్గ్యునిచేత ద్వైతముగా చెప్పఁబడిన సోపాధికములగు ప్రాణరూపులైన ఆదిత్యాది బ్రహ్మోపాసనలకంటె వేరగు నిరుపాధికమైన పరబ్రహ్మము ప్రతిపాదింపఁదగినది యని కాశీరాజు గార్గ్యునిగూర్చి తెలియఁజేసెను.

మ॥ స హోవాచాజాతశత్రుర్యత్రైష ఏతత్సుప్తోఽభూద్య ఏష విజ్ఞానమయః పురుషః క్వైష తదాభూత్కుత ఏతదాగాదితి తదు హ న మేనే గార్గ్యః. ॥16॥

ప॥ సః - హ - ఉవాచ - అజాతశత్రుః - యత్ర -ఏషః - ఏతత్ - సుప్తః - అభూత్ - యః - ఏషః - విజ్ఞానమయః - పురుషః - క్వ - ఏషః - తదా - అభూత్ - కుతః - ఏతత్ - ఆగాత్ - ఇతి - తత్ - ఉ - హ - న - మేనే - గార్గ్యః.

ప్ర॥ సః = ఆ, అజాతశత్రుః = అజాతశత్రువను కాశీరాజు, (గార్గ్యం=గార్గ్యునిగూర్చి),ఉవాచహ=పలికెను. ఏషః=ఈవిజ్ఞానమయ పురుషుఁడు, యత్ర=ఏకాలమునందు, ఏతత్ = ఈ స్వాపముకలుగు నట్టుగా, సుప్తోభూత్=నిద్రించెనో, ఏషః=ఈ, విజ్ఞానమయః=విజ్ఞాన స్వరూపుఁడగు, పురుషః=పురుషుఁడు, యః=ఎవఁడో, ఏషః=ఈ విజ్ఞానమయ పురుషుఁడు, తదా = అప్పుడు, (ఆ నిద్రాసమయమునందు), క్వ=ఎక్కడ, అభూత్=ఉండెను. కుతః=ఎక్కడినుండి, ఏతత్ = ఈ ఆగమనమును, ఆగాత్=పొందెను. ఇతి=అని, (ప్రష్టవ్యం=అడుగఁ దగినది, ఆసీత్=ఉండెను). గార్గ్యః=గార్గ్యుఁడు, తదుహ=ఆ రెంటిని, (విజ్ఞానమయ పురుషుఁడెక్కడ ఉండెను ఎక్కడనుండి వచ్చెను అని ఈ రెంటిని అడుగవలసిన వాటినిగా), నమేనే=తెలిసికొనకపోయెను.

తా॥ ఆ కాశీరాజు ఈప్రకారము ఆదిత్యాది బ్రహ్మములకంటె వేరగు ముఖ్యమైన పరబ్రహ్మమున్నదని ప్రతిపాదించి గార్గ్యునిగూర్చి పలికెను. ఈ గార్గ్యుఁడు విజ్ఞానమయమగు ఈ పురుషుఁడు ఏ కాలమందు నిద్రించెను. నిద్రించిన కాలమందు ఎక్కడ ఉండెను. ఈ జాగ్రత్కాలమునం దెక్కడనుండి వచ్చెను. అని ప్రశ్న చేయవలసి యున్నది. ఈ ప్రశ్నలనే గార్గ్యుఁడు తెలిసికొనకపోయెను అని తానే ప్రశ్నలను చేసి సమాధానమును చెప్పుచున్నాఁడు.

ఉ॥ సహోవాచాజాతశత్రుర్యత్రైష ఏతత్సుప్తోఽభూద్య ఏష విజ్ఞానమయః పురుషస్తదైషాం ప్రాణానాం విజ్ఞానేనవిజ్ఞానమాదాయ య ఏషో౽న్తర్హృదయ ఆకాశ స్తస్మిఞ్ఛేతే తానియదా గృహ్ణాత్యథ హైతత్పురుషః స్వపితి నామ తద్గృహీత ఏవ ప్రాణోభవతి గృహీతా

వాక్ గృహీతం చక్షుర్గృహీతగ్ శ్రోత్రం గృహీతం మనః. ॥17॥

ప॥ సః – హ – ఉవాచ – అజాతశత్రుః – యత్ర – ఏషః– ఏతత్ – సుప్తః – అభూత్ – యః – ఏషః – విజ్ఞానమయః – పురుషః – తదా – ఏషాం – ప్రాణానాం – విజ్ఞానేన – విజ్ఞానం – ఆదాయ – యః – ఏషః – అన్తర్హృదయే-ఆకాశః – తస్మిన్– శేతే – తాని –యదా – గృహ్ణాతి – అథ – హ –ఏతత్ – పురుషః – స్వపితి – నామ – తత్ – గృహీతః – ఏవ – ప్రాణః – భవతి – గృహీతా- వాక్ – గృహీతం–చక్షుః – గృహీతం–శ్రోత్రం – గృహీతం–మనః.

ప్ర॥ సః=ఆ, అజాతశత్రుః=అజాతశత్రువను కాశీరాజు, ఉవాచ హ=పలికెను. ఏషః = ఈ, విజ్ఞానమయః = విజ్ఞానస్వరూపుఁడైన, పురుషః=పురుషుఁడు,(ఆత్మస్వరూపుఁడు) యః=ఎవఁడో, ఏషః=వీఁడు, యత్ర=ఏకాలమునందు, ఏతత్=ఈస్వాపము కలుగునట్లు,సుప్తోభూత్ =నిద్రించెనో, తదా=ఆకాలమునందు, (సః=ఆ విజ్ఞానమయపురుషుఁడగు పరమాత్మ), విజ్ఞానేన=విజ్ఞానముచేతను, (అంతఃకరణముయొక్క స్వభావము వలన పుట్టిన విశేషజ్ఞానముచేతను), ఏషాం=ఈ, ప్రాణానాం=వాగాదీంద్రియములయొక్క, విజ్ఞానం=విజ్ఞానమును, (వాగాదీంద్రియములకు వానివాని విషయమునుపొందిన నియతమగు ప్రకాశమును, విజ్ఞానసామర్థ్యమును), ఆదాయ=గ్రహించి, అన్తర్హృదయే= హృదయమధ్యమునందు, ఏషః=ఈ, ఆకాశః = ఆకాశము, (ఇక్కడ ఆకాశశబ్దముచేత స్వకీయమగు శ్రేష్ఠమైన ఆత్మ చెప్పఁబడుచున్నది); యః=ఏదిరో, తస్మిన్ = దానియందు, శేతే = ఉంచుచున్నాఁడు, పురుషః=విజ్ఞానపురుషుఁడు, యదా=ఏకాలమునందు, తాని=ఆవాగాదీంద్రియములయొక్క విజ్ఞానములను, గృహ్ణాతి=గ్రహించుచున్నాఁడో, అథహ=అప్పుడే, ఏతత్=ఈ, స్వపితినామ = నిద్రించుచున్నాఁడను ప్రసిద్ధి, (భవతి=ఆగుచున్నది). తత్=ఆస్వాపకాలమునందు, ప్రాణః= ఘ్రాణేంద్రియము, గృహీతఏవ=గ్రహింపఁబడినదే, వాక్ = వాక్కు,

గృహీతా=గ్రహింపఁబడినది, చక్షుః=నేత్రము, గృహీతం=గ్రహింపఁబడినది. శ్రోత్రం=చెవి, గృహీతం=గ్రహింపఁబడినది. మనః=మనస్సు, గృహీతం=గ్రహింపఁబడినది, భవతి=అగుచున్నది.

తా॥ ఓ గార్గ్యుఁడా విజ్ఞానాత్మ, నిద్రించిన కాలమునందు అంతఃకరణ స్వభావమగు అజ్ఞానము చేతఁబుట్టిన అంతఃకరణమును పొందిన స్ఫుటమగు చైతన్యాభాసలక్షణమైన సాధనముతో వాగాదీంద్రియములయొక్క విషయములగు శబ్దాదులను పొందియున్న సామర్థ్యమును తీసికొని హృదయమధ్యమునందలి పరమాత్మస్వరూపమగు చిదాకాశమునందున్నాఁడు. ఇట్లు ఆ విజ్ఞానాత్మ, వాగాదీంద్రియములయొక్క విషయములనుపొందిన సామర్థ్యమును తీసికొనునప్పుడు నిద్రించుచున్నాఁడను ప్రసిద్ధికలుగుచున్నది. ఆ నిద్రించిన కాలమునందే ఘ్రాణేంద్రియమును, వాక్కును, నేత్రమును, శ్రోత్రమును, మనస్సును, ఇవియన్నియును తీసికొనఁబడినవగుచున్నవి. ఇట్లు విజ్ఞానాత్మ, నిద్రాసమయమునందు సర్వేంద్రియోపరమముకలిగి పూర్వదేహసంబంధముచేత కలుగఁజేయఁబడిన విశేషాత్మస్వరూపమునువిడిచి అవిశేషమైన స్వాభావికమగు కేవలాత్మయందున్నది.

మ॥ స యత్రైతత్స్వప్న్యయా చరతి తే హాస్య లోకాస్తదుతేవ మహారాజో భవత్యుతేవ మహాబ్రాహ్మణ ఉతేవోచ్చావచం నిగచ్ఛతి స యథా మహారాజో జానపదాన్గృహీత్వా స్వే జనపదే యథాకామం పరివర్తతేవమేవైష ఏతత్ప్రాణాన్గృహీత్వా స్వే శరీరే యథాకామం పరివర్తతే. ॥18॥

ప॥ సః – యః – ఏతత్ – స్వప్న్యయా – చరతి – తే – హ – అస్య – లోకాః – తత్ – ఉత – ఇవ – మహారాజః – భవతి – ఉత – ఇవ – మహాబ్రాహ్మణః – ఉత – ఇవ – ఉచ్చావచం – నిగచ్ఛతి – సః – యథా – మహారాజః – జానపదాన్ – గృహీత్వా – స్వే – జనపదే – యథాకామం – పరివర్తతే – ఏవం – ఏవ –

ఏషః - ఏతత్ - ప్రాణాన్ - గృహీత్వా - స్వే - శరీరే - యథా
కామం - పరివర్తతే.

ప్ర॥ సః = అపూర్వోక్తమైనవిజ్ఞానమయ స్వరూపుడగు, ఏతత్=ఈజీవాత్మ, ఇక్కడయత్ర=ఏకాలమునందు, స్వప్న్యయా = స్వప్నవృత్తితో, చరతి=ఉన్నాఁడో, అస్య=ఈ స్వప్నమునుపొందిన ఆత్మకు, తేహా = అప్రసిద్ధములగు, లోకాః = లోకములు, (కర్మఫలములు, భవన్తి=అగుచున్నవి). (సః=ఆ, అయం=ఈ ఆత్మ), తత్ = అక్కడ, ఉత = మరియు, మహారాజఇవ=మహారాజువలెనె, భవతి = అగుచున్నది. ఉత=మరియు, మహాబ్రహ్మణఇవ=గొప్పబ్రాహ్మణుఁడువలెనె, (భవతి=అగుచున్నది). ఉతేవ=మరియు, ఉచ్చావచం=అధికనీచములగు దేవత్వతిర్యక్త్వాదికములను, నిగచ్ఛతి=పొందుచున్నది. సః=ఆ, మహారాజః = గొప్పరాజు, యథా = ఏప్రకారము, జానపదాన్ = దేశమండలివారిని, (భృత్యులను లేక ఇతరులను), గృహీత్వా = గ్రహించి, (స్వాధీనపఱచుకొని), స్వేజనపదే = తనదేశమునందు, యథాకామం = స్వేచ్ఛగా, (తనఇష్టప్రకారము), ప్రవర్తేత=ఉన్నాఁడో, ఏవమేవ=ఈప్రకారముగానే, ఏషః=ఈవిజ్ఞానమయ ఆత్మయును, ఏతత్=ఈప్రకారము కలుగునట్లు, ప్రాణాన్= వాగాదీంద్రియములను, గృహీత్వా=గ్రహించి, (జాగరితస్థానములనుండి యింద్రియములను ఉపసంహరించి), స్వేశరీరే = తనదేహమునందు, యథాకామం = తనఇష్టప్రకారము, పరివర్తతే = ఉన్నది. (కామకర్మములచేత ప్రకాశింపఁజేయబడిన జాగ్రత్తయందనుభవింపఁబడిన వస్తువులకు సమానములైన స్మరణలను అనుభవించుచున్నది).

తా॥ అపూర్వోక్తమైన కేవలాత్మయందున్న విజ్ఞానమయాత్మ, దర్శనలక్షణముగల స్వప్నావస్థతోఁగూడుకొనునప్పుడు ఈ విజ్ఞానమయాత్మకు, కర్మఫలములగు లోకమ్ములుకలుగుచున్నవి. ఆ కర్మఫలములను విజ్ఞానాత్మమహారాజు లోకములను వలెనె గొప్ప బ్రాహ్మణుఁడు.

అధికములగు దేవత్వాదికములనువలెనె నీచములగు తిర్యక్త్వాదికము లనువలెనె జనుఁడు భ్రాంతిచేత ముత్తెపు చిప్పయందు వెండినివలెని అబద్ధముగానే పొందుచున్నది. ఇట్లు పొందిన యీ విజ్ఞానమయాత్మ, ఆ మహారాజు తన దేశమందున్న సేవకులు మొదలైనవారిని స్వాధీన పరచుకొని తన దేశమునందు స్వేచ్ఛగానుండునట్లు వాగాదీంద్రియము లను స్వాధీనపఱచుకొని తన దేహమునందు స్వేచ్ఛగానుండి కామ కర్మలచేతఁ బ్రకాశింపఁజేయఁబడిన జాగ్రత్తయందనుభవింపఁబడిన వస్తువులకు సమానములగువాసనలను అనుభవించుచున్నది.

ఉ॥ అథ యదా సుషుప్తో భవతి యదా న కస్యచన వేద హితా నామ నాడ్యో ద్వాసప్తతి సహస్రాణి హృదయాత్పురీతతమభిప్రతిష్ఠన్తే తాభిః ప్రత్యవసృప్య పురీతతి శేతే స యథా కుమారో వా మహారాజో వా మహాబ్రాహ్మణో వాతిఘ్నీమానన్దస్య గత్వా శయీతైవ మేవైష ఏతచ్ఛేతే. ॥19॥

ప॥ అథ - యదా - సుషుప్తః - భవతి - యదా - న - కస్య - చన - వేద - హితాః - నామ - నాడ్యః - ద్వాసప్తతిసహస్రాణి - హృదయాత్ - పురీతతం - అభి - ప్రతిష్ఠన్తే - తాభిః - ప్రత్యవసృప్య - పురీతతి - శేతే - సః - యథా - కుమారః - వా - మహారాజః - వా - మహాబ్రాహ్మణః - వా - అతిఘ్నీం - ఆనన్దస్య - గత్వా - శయీత - ఏవం - ఏవ - ఏషః - ఏతత్ - శేతే.

ప్ర॥ అథ=అనంతరము, (సః=ఆవిజ్ఞానమయాత్మ), యదా= ఎప్పుడు, సుషుప్తః = మిక్కిలి నిద్రించినది, భవతి = అగుచున్నది. యదా=ఎప్పుడు, కస్యచన = కొంచెమును, (శబ్దాదివిషయసంబంధ మైనది కొంచెమును), న వేద=తెలిసికొనలేదు, (ఈప్రకారము విశేష జ్ఞానములేకపోవుటచే సుషుప్తి కలుగుచున్నదని చెప్పఁబడినది). (ఏప్రకారముగా సుషుప్తి కలుగుచున్నదనిన చెప్పఁబడుచున్నది). హితనామ = హితములని పేరుగల, (ఇష్టఫలమును పొందించుటకు

కారణమగుటవలన హితములని చెప్పఁబడుచున్నవి.) ద్వాసప్తతిసహ స్రాణినాడ్యః=డెబ్బదిరెండు వేలనాడులు, హృదయాత్=హృదయము వలన, అనగా హృదయమునందు అధోముఖముగానుండెడి పద్మా కారముగల మాంసపిండమునుండి), పురీతతం=శరీరమును, (పురీత చ్ఛబ్దమునకు పేగు అర్థము, ఇక్కడ పేగుతోఁగూడుకొనిన శరీరము చెప్పంబడినది). అభిప్రతిష్ఠన్తే = అంతటను వ్యాపించియున్నవి. తాభిః=ఆనాడులతో, (సః=ఆవిజ్ఞానాత్మ, తదా=ఆసుషుప్తి సమయ మునందు), ప్రత్యవసృప్య=అనుసరించి వ్యాపించి. పురీతతి= శరీరము నందు, శేతే = ఉన్నది. సః = అది, యథా = ఏప్రకారమనిన, కుమారోవా = మిక్కిలిబాలుఁడును, మహారాజోవా=గొప్పరాజును, మహాబ్రాహ్మణోవా = బ్రహ్మజ్ఞానముగల బ్రాహ్మణుఁడును, (యథా= ఏప్రకారము), ఆనందస్య=ఆనందముయొక్క, అతిఘ్నీం = మిక్కిలి దుఃఖమును పోఁగొట్టునట్టి సుఖావస్థను, గత్వా=పొంది శయీత= ఉండునో, ఏవమేవ=ఈప్రకారముగానే, ఏషః=ఈ విజ్ఞానమయాత్మ, ఏతత్=ఈ సుషుప్తికలుగునట్లుగా, శేతే=ఉన్నది.

తా॥ ఆవిజ్ఞానాత్మకు స్వప్నావస్థాంతరము ఎప్పుడు గాఢనిద్ర కలుగును. ఎప్పుడు ఈశబ్దాదివిషయములలో కొంచెము తెలియక యుండును. అని ఆకాశీరాజు ప్రశ్నపూర్వకముగా సుషుప్తివృత్తిని చెప్పి సుషుప్తియొక్కరీతిని తెలియపఱచుచున్నాఁడు. ఇట్లు ఏమియు విశేష జ్ఞానము లేక యుండుటే సుషుప్తియనఁబడును. అదియెట్లు కలుగునని, హృదయమునందు అధోముఖముగానుండెడి పద్మాకారముగల మాంసపిండమునుండి యిష్టఫలప్రాప్తికారణములగు డెబ్బదిరెండు వేల నాడులు శరీరమునందంతట వ్యాపించి రావియాకుల పజ్జ్ఞ్ఞల వలెనే బహిర్ముఖములై యున్నవి. ఆ హృదయము బుద్ధికి నివాసస్థానము. తక్కినసమస్త యింద్రియములును ఆబుద్ధి యధీనములు, అందు చేత బుద్ధి కర్మాధీనమువలన శ్రోత్రాదీంద్రియములను ఆనాడులతో

చేపలవలవలెనే చెవిరంధ్రము మొదలైనస్థానములనుండి వ్యాపింపఁ జేసి యధిష్ఠించియున్నది. ఆబుద్ధిని జాగత్కాలమునందు విజ్ఞానమయాత్మస్ఫుటమగు స్వాత్మచైతన్యముయొక్క ఆభాసముతో వ్యాపించుచున్నాఁడు. ఆబుద్ధి స్వల్పమగునప్పుడు విజ్ఞానాత్మయును బుద్ధిని అనుసరించి స్వల్పమగుచున్నది. అదియే విజ్ఞానమయాత్మకునిద్ర. ఆవిజ్ఞానాత్మ, ఉదకములు మొదలైనవాని ననుసరించికలుగునట్టి చంద్రాదిప్రతిబింబమువలెనే బుద్ధియను నుపాధియొక్క స్వభావమును అనుసరించి ఎక్కువతక్కువలు కలదియగుచున్నది. కనుక ఆవిజ్ఞానాత్మ, జాగద్విషయమగు ఆబుద్ధియొక్క ఆయానాడులతో అనుసరించి శరీరమునందు, కాల్చఁబడినలోహపిండమును అగ్నివలెనే వ్యాపించియున్నది. ఈవిజ్ఞానాత్మ స్వాభావికమగు స్వాత్మయందుండినను కర్మమును అనుసరించిపొందినబుద్ధిని అనుసరించుటవలన శరీరమునందున్నదని చెప్పఁబడుచున్నది. గాఢసుషుప్తిసమయమునందు విజ్ఞానాత్మకు శరీరసంబంధములేదు ఆసమయమునందు హృదయసంబంధములగు సమస్తదుఃఖములను దాటినదై యున్నది. అదియెట్లనఁగా లోకమునందు చిక్కులి పసిబాలునియొక్క స్వాధీనములగు స్వామ్యమాత్య సుహృత్కోశరాష్ట్ర దుర్గబలములుగల రాజుయొక్కయు పరిపక్వమైన విద్యాసంపత్తుగల బ్రహ్మజ్ఞానియగు బ్రాహ్మణునియొక్కయు ప్రసిద్ధమగు సహజమైన ఆనందావస్థ, వారు వికారములు లేనివారై యుండునపుడెట్లుండునో యాప్రకారముగానే ఈవిజ్ఞానాత్మ గాఢసుషుప్తికాలమునందు స్వాభావికమగు స్వాత్మయందు సమస్తమైన సంసారధర్మము నతిక్రమించినదై యున్నది.

ఉ॥ స యథోర్ణనాభి స్తన్తునోచ్చరే ద్యథాగ్నేః క్షుద్రా విస్ఫులిఙ్గా వ్యుచ్చర న్త్యే వమేవాస్మాదాత్మనః సర్వే ప్రాణా స్సర్వే లోకా స్సర్వే దేవా స్సర్వాణి భూతాని వ్యుచ్చర న్తి తస్యోపనిషత్సత్యస్య సత్యమితి ప్రాణా వై సత్యం తేషామేషసత్యమ్. ॥20॥

ఇతి చతుర్థాధ్యాయే ప్రథమ బ్రాహ్మణమ్.

ప॥ సః - యథా - ఊర్ణనాభిః - తన్తునా - ఉచ్చరేత్ - యథా - అగ్నేః - క్షుద్రాః - విస్ఫులిఙ్గాః - వ్యుచ్చరన్తి - ఏవం- ఏవ - అస్మాత్ - ఆత్మనః - సర్వే - ప్రాణాః - సర్వే - లోకాః- సర్వే - దేవాః - సర్వాణి - భూతాని - వ్యుచ్చరన్తి - తస్య - ఉపనిషత్ - సత్యస్య - సత్యం - ఇతి - ప్రాణాః - వై - సత్యం - తేషాం - ఏషః - సత్యం.

ప్ర॥ సః=ఆ, ఊర్ణనాభిః = సాలెపురుగు, తన్తునా = దారము చేతను, యథా=ఏప్రకారము, ఉచ్చరేత్=ఎగురునో, అగ్నేః=అగ్ని వలన, క్షుద్రాః=స్వల్పములైన, విస్ఫులిఙ్గాః=మిణుఁగురులు, యథా= ఏప్రకారము, వ్యుచ్చరన్తి=అనేకవిధములుగా ఎగురుచున్నవో, ఏవ మేవ=ఈప్రకారముగానే, అస్మాత్ = ఈ, ఆత్మనః = వికారము లేని కూటస్థఆత్మవలన, (ఈవిజ్ఞానాత్మకు మేలుకొనుటకంటె పూర్వముం డెడి నిర్వికారస్వరూపమువలన), సర్వే=సమస్తమైన, ప్రాణాః=వాగా దీంద్రియములును, సర్వేలోకాః=సమస్తలోకములును, (సమస్తము లైన కర్మఫలములును), సర్వే దేవాః = సమస్తదేవతలును, (ప్రాణ లోకముల కధిష్ఠాతలగు అగ్ని మొదలగు దేవతలు), సర్వాణి భూతాని=సమస్తభూతములును, (బ్రహ్మమొదలుకొని స్తంబపర్యంత ముండెడి ప్రాణిసమూహములును), వ్యుచ్చరన్తి = బయలు వెళ్లు చున్నవి. (పుట్టుచున్నవి). (జంగమస్థావరాత్మకమైన యీప్రపంచము ఏఆత్మవలన ఎల్లప్పుడు అగ్నిమిణుఁగురులవలెనే పుట్టుచున్నదో, ఏపరమాత్మయందే నీటిబుగ్గవలెనే లీనమగుచున్నదో, స్థితికాలము నందు ఏపరమాత్మస్వరూపమై యున్నదో), తస్య = ఆపరమాత్మకు, (పరబ్రహ్మమునకు), ఉపనిషత్=ఉపనిషత్తని పేరు. (ఈయుపనిషత్తను శబ్దమునుపొందియున్న విశేషము శాస్త్రప్రామాణ్యమువలన సమీ పమును పొందించుటయని నిశ్చయింపఁబడుచున్నది). (ఈ యుప నిషత్తు ఏదియనిన), సత్యస్యసత్యమితి = సత్యమునకు సత్యమైనదని,

(ఆహ=పలికెను). (పరబ్రహ్మముకంటె వేరగుసంసారియను పేరుగల వస్తువులేకపోవుటవలనను పారమార్థిక సత్యత్వమును తెలిపెడి సత్యస్యసత్యమనెడిపేరు పరబ్రహ్మమునకు మాత్రమే కలిగియుండెను. ఇక్కడ అపరబ్రహ్మకుండెడి సత్యస్యసత్యమనెడిపేరు పరబ్రహ్మైక్యమునుపొందించుటవలన ఉపనిషత్పరముగా చెప్పఁబడినది). (ఆ అర్థమునే శ్రుతి వివరించుచున్నది). ప్రాణాః=ప్రాణములు, వై=ప్రసిద్ధముగా, సత్యం=సత్యస్వరూపములు. తేషాం=ఆప్రాణములకు, ఏషః=ఈ ఆత్మ, సత్యం=సత్యస్వరూపము.

తా॥ ఇంతకుపూర్వము ఈ రీతిగా ఆత్మ ఎక్కడయుండెను అని యడిగినప్రశ్నకు ప్రతివచనము చెప్పఁబడినది. ఈ ప్రశ్నయొక్క నిర్ణయముచేత విజ్ఞానమయాత్మకు విశుద్ధియును సంసారములేకపోవుటయును చెప్పఁబడినది. ఈ ఆత్మఎక్కడ యుండెనని అడిగినప్రశ్నయొక్క ప్రతివచనముచేతనే ఆత్మయెక్కడనుండి వచ్చెనని అడిగిన రెండవ ప్రశ్నయొక్క ప్రతివచనమును తెలియఁబడుచుండఁగా మరల ఆత్మయెక్కడనుండి వచ్చెను అని అడిగినప్రశ్న నిరర్థకమగుచున్నది. అది నిరర్థకముకాదేని ఈరెండవప్రశ్నకు వేఱొకయర్థమును వినుటకు కోరుచున్నాను అని అనఁగా చెప్పుచున్నాఁడు. ఈ విషయమునందు ఎక్కడనుండి అనెడిపదమునకు అపాదానత్వము అర్థము చెప్పినయెడల పునరుక్తిదోషమును, నిమిత్తార్థము (ఇక్కడికి ఎందునిమిత్తము వచ్చెను అని) చెప్పినయెడల ముందు చెప్పఁబోయెడి అగ్ని విస్ఫులింగాది దృష్టాంతములచేత ఆనిర్వికారఆత్మనుండి కలుగుచున్నదని చెప్పెడి ప్రతివచనమునందు విరోధమును కలుగుచున్నది. ఇట్లు కలుగఁగా అపాదానార్థము చెప్పెడిపక్షమునందుకలిగెడు పునరుక్తదోషము లేదు. వలయునని ఇక్కడ ఉదాహరింపఁబడిన విద్యావిద్యలయొక్క విషయములు రెంటిలో అవిద్యావిషయమునందు చెప్పఁదగినదంతయును చెప్పఁబడినది. విద్యావిషయకమైన కేవలాత్మ స్వరూపమును

ఉదాహరింపఁబడి నిర్ణయింపఁబడినది. కాఁబట్టిదానికి అనురూపము లైన ఆత్మఎక్కడఉండెను ? ఎక్కడనుండివచ్చెను ? అని రెండు ప్రశ్నలు శ్రుతిచేతనే ఉదాహరింపఁబడినవి. ఈప్రశ్నలద్వారా శ్రుతి చేతనే ఆత్మకంటె వేఱొకవస్తువు లేకపోవుటవలన ఆత్మనుండియే సర్వము కలుగుచున్నదని చూపింపఁబడుచున్నది. అదిఎట్లనిన దానికిదృష్టాంతము చెప్పఁబడుచున్నది. ఏదియనిన ప్రసిద్ధమగు సాలెపురుగు తననుండి వేరుచేయఁబడినదారములతో ఎగిరినట్లును అగ్నివలన స్వల్పములగు మిణుఁగురులు కలిగినట్లును ఈ విజ్ఞానాత్మ యొక్క జాగ్రదవస్థకంటె పూర్వమందలి నిర్వికార స్వరూపము నుండి సమస్తమైన వాగాదీంద్రియములును సమస్త లోకములును లోకప్రాణముల కధిష్ఠాతలగు అగ్ని మొదలగు దేవతలందఱును బ్రహ్మాదిస్తంబ పర్యంతముండెడి సమస్త ప్రాణి సమూహములును ఈ నిర్వికారాత్మనుండియే పుట్టుచున్నవి. ఇట్లు ఏ ఆత్మవలన సర్వమును ఎల్లప్పుడు అగ్నివలన మిణుఁగురుల వలెనే పుట్టుచున్నదో, ఏ ఆత్మ యందు సర్వమును నాశకాలమునందు నీటిబుగ్గవలెనే లీనమగుచున్నదో స్థితికాలమునందు సర్వమును ఏ ఆత్మ స్వరూపమైయున్నదో ఆ యాత్మను చెప్పునట్టి శబ్దము ఉపనిషత్తు. ఈ ఉపనిచ్ఛబ్దార్థము శాస్త్ర ప్రామాణ్యమువలన సమీపమును పొందించునదియని నిర్ణయింపఁ బడినది. ఇట్టి యుపనిషత్తు ఏదియనిన సత్యస్యసత్యమని చెప్పఁబడినది. కేవల పారమార్థిక సత్యత్వమును తెలిపెడి ఈ సత్యస్యసత్యమను నామము కేవలాత్మకు మాత్రమే కలిగియున్నను ఇక్కడ ఆయాత్మైక్య మును పొందించునట్టి యుపనిషత్తునకును చెప్పఁబడినది. ఆసత్యస్య సత్యమను శబ్దార్థమును తెలియఁజేయుటకు శ్రుతియే స్వకీయముగా ప్రాణములు ప్రసిద్ధముగా సత్యస్వరూపములు. ఆ ప్రాణములకు ఈ ఆత్మసత్యస్వరూపము అని చెప్పినది. ఈ అర్థమును ముందు చెప్పఁ బోయెడి బ్రాహ్మణముల రెంటియందు వివరింపఁబడుచున్నది.

ఇట్లు చతుర్థాధ్యాయమునందు ప్రథమబ్రాహ్మణము సమాప్తము.

చతుర్థాధ్యాయము, ద్వితీయ బ్రాహ్మణము.

ఉ॥ యో హ వై శిశుగ్ సాధానగ్ సప్రత్యాధానగ్ సస్థూణగ్ సదామం వేద స_ప్త హ ద్విషతో భ్రాతృవ్యానవరుణద్ధి । అయం వావ శిశుర్యోఽయం మధ్యమః ప్రాణ_స్తస్యేద మేవాధానమిదం ప్రత్యాధానం ప్రాణః స్థూణాన్నం దామ. ॥1॥

ప॥ యః - హ_వై - శిశుం - సాధానం - సప్రత్యాధానం - సస్థూణం - సదామం - వేద - స_ప్త - హ - ద్విషతః - భ్రాతృవ్యాన్ - అవరుణద్ధి - అయం - వావ - శిశుః - యః - అయం - మధ్యమః - ప్రాణః - తస్య - ఇదం - ఏవ - ఆధానం - ఇదం - ప్రత్యాధానం - ప్రాణః - స్థూణా అన్నం - దామ.

ప్ర॥ యోహవై=ఎవఁడైతే, సాధానం=ఆధానముతోఁగూడినవాఁడును, సప్రత్యాధానం = ప్రత్యాధానముతోఁ గూడుకొనినవాఁడును, సస్థూణం=స్తంభముతోఁ గూడుకొనినవాఁడును, సదామ=పలుపుతోఁగూడుకొనినవాఁడునగు, శిశుం = ప్రాణమను శిశువును, వేద=తెలిసికొనుచున్నాఁడో, (సః=వాడు), ద్విషతః = ద్వేషించుచున్న, స_ప్తహ=ఏడుగురగు, భ్రాతృవ్యాన్=సహోదరుని పుత్రులగు విషయరాగములను, (శిరస్సునందైన చక్షుశ్శ్రోత్రనాసికములుఆఱును ముఖము ఒకటియు ఇవియేడును శబ్దాదివిషయములను పొందుటకు ద్వారములు. వానివలన పుట్టిన విషయరాగములు సహజములగుటవలన భ్రాతృవ్యములనఁబడుచున్నవి. అవి, జీవాత్మకు తన ఆత్మయందు దృష్టినిశబ్దాది విషయములను చూచెడిదానినిగా చేయుచున్నవి. ఇట్లు తన ఆత్మస్వరూపమును చూచుటయందు విరోధములగుటవలన ద్వేషించునట్టి భ్రాతృవ్యు లనఁబడుచున్నవి. ఎవఁడు ప్రాణము మొదలైన ఆచక్షురాదీంద్రియములయొక్క నిజస్థితిని తెలిసికొనుచున్నాఁడో, వాఁడు ఈ భ్రాతృవ్యులను), అవరుణద్ధి=అడ్డగించుచున్నాఁడు. (నశింప జేయుచున్నాఁడు). ఈ పూర్వము చెప్పఁబడిన శిశువు ఎవఁడనిన)

అయం=ఈ, మధ్యమః = శరీరము మధ్యమునందున్న, ప్రాణః = ప్రాణము, యః=ఏదియో, అయంవావ = ఇదియే, శిశుః = శిశువు. (అయిదు విధములుగా దేహమునందుండెడి ఆ ఈ ప్రాణము శిశువు వలెనే శబ్దాది విషయములయందు ఒక ఇంద్రియము ఇంకొక ఇంద్రియ విషయమందు వలెనే అసమర్థమగుటవలన శిశువుగా చెప్పఁబడినది.) (ఆ శిశువునకు చెప్పఁబడిన ఆధానమను నదేదియనిన), తస్య=ఆ శిశువునకు, ఇదమేవ=ఈ శరీరమే, ఆధానం=ఆధానము. (కార్యాత్మకమైన శరీరమునందు ప్రాణముంచఁబడుచున్నది. గనుక శరీర మాధానమనఁబడుచున్నది). (ప్రత్యాధానమేది యనిన), (ఈ శరీరమునందు వానివాని స్వరూపమును పొందియున్న యింద్రియములు, శబ్దాది విషయములను పొందుటకు ద్వారము లగుచున్నవి. ఈ యింద్రియములు ప్రాణమాత్రమునందు చేరియున్నప్పుడు విషయములను పొందుటకు ద్వారములు కావు. అది కాశీరాజగు అజాతశత్రువుచేత నిద్రించియున్నవానిని హస్తముతో పొర్లించుట మొదలైన వానివలన లేపుట చేత చూపింపఁబడినది). ఇదం=ఇది, ప్రత్యాధానం=ప్రత్యాధానము. (విజ్ఞానమయాత్మ జాగ్రదవస్థయందు శిరఃప్రదేశమందలి చక్షుశ్శ్రోత్రములు మొదలైన విశేషప్రదేశములయందు తిరిగి యుంచఁబడుచున్నది గనుక ప్రత్యాధాన మనఁబడును). (స్తంభమేదియనిన), ప్రాణః=బలము, (అన్నపానమువలన పుట్టిన శక్తి). స్థూణా=స్తంభము, (ప్రాణమను శిశువు ఈ శరీరమునందు స్తంభము ఆధారముగాఁగల శిశువువలెనె అన్నపానములవలన పుట్టిన బలము ఆధారముగాఁగలవాఁడగుటవలన బలము స్తంబముగా చెప్పఁబడినది). (పలుపు ఏది యనిన), అన్నం=అన్నము, దామ=పలుపు,(భక్షింపఁబడిన యన్నము మూఁడు విధములుగా పరిణమించుచున్నది. ఆమూఁడు విధములైన స్థూలమధ్యమ అణిష్ఠములను రసములలో మొదటి స్థూలరసము మాత్రపురీషములై బయలువెడలుచున్నది. రెండవదియగు శ్లేష్మమైన

మధ్యమరసము క్రమముగా రక్తము మొదలైనవాని రూపముతో స్వకార్యములగు త్వక్కు, రక్తము, మాంసము, మేదస్సు, మజ్జ, ఎముక, రేతస్సు, ఈ ఏడింటివలనఁబుట్టిన శరీరమును వృద్ధిపొందించుచున్నది. మూడవదియగు మిక్కిలి సూక్ష్మమగురసము, అమృతమని, ఊర్జమని, ప్రభావమని చెప్పఁబడుచున్నది. అది పొక్కిలికి ఊర్ధ్వముగానున్న హృదయదేశమును పొంది, హృదయమునుండి బయలువెడలి విశేషముగా దేహమంతటా వ్యాపించియున్న డెబ్బది రెండువేల నాడులయందు ప్రవేశించి, యింద్రియ సమూహాసమే రూపముగా కలిగిన శిశువను పేరుగల లిఙ్గశరీరమును శరీరమందుంచుటకు కారణమైన స్థూణమను పేరుగల బలమును పుట్టించుచున్నది. కనుక ఇట్లు అన్నము రెండు విధములుగా పలుపువలెనే ప్రాణశరీరములకు మిక్కిలి బంధించునదియగుచున్నది. కనుక అన్నము దామమని చెప్పఁబడినది).

తా॥ ఇంతకుపూర్వము పరబ్రహ్మస్వరూపమును నీకు చెప్పెదనని ప్రతిజ్ఞచేసి ఈప్రపంచమంతయు దేనివలనపుట్టి ఏ స్వరూపమైయుండి దేనియందు లీనమగుచున్నదో, అది ఆ ద్వితీయమగు పరబ్రహ్మముగా తెలియఁజేయఁబడినది. ఆ జగత్తు ఏ స్వరూపమైపుట్టుచున్నదనిన పంచభూతాత్మకమై పుట్టుచున్నది. ఇట్లు పంచభూతాత్మకమైపుట్టిన జగత్తును భూతములు నామరూపాత్మకములగుటవలన నామరూపాత్మకమనియును చెప్పఁబడుచున్నది. పంచభూతములు మూర్తామూర్త స్వరూపములగుటవలన సత్యములని చెప్పఁబడినవి. దేహేంద్రియములు ఆభూతస్వరూపములగుటవలన సత్యములని అంగీకరింపఁబడినవి. అట్టి దేహేంద్రియాత్మకములగు భూతములకు సత్యత్వమును నిర్ణయించుటయందలి కోరికచేత బ్రాహ్మణద్వయమారంభింపఁబడినది, ఆ దేహేంద్రియాదులను సత్యమునుగా నిర్ణయించునదియే ఉపనిషత్తు. దేహేంద్రియాదులకు సత్యత్వమును నిర్ణయించు ద్వారా

సత్యస్యసత్యమనెడి పరబ్రహ్మము నిశ్చయింపఁబడుచున్నది. ఇట్లు బ్రహ్మోపనిషత్తులయొక్క ప్రసంగముచేత మార్గమునడిచెడివాఁడు మార్గమునందు పొందియున్న బావులు, ఉద్యానవనములు మొదలైన వానిని నిశ్చయించిన విధముగా ఇంద్రియములయొక్క స్వరూపము సయితము నిశ్చయింపఁబడుచున్నది. అయిదువిధములుగా ఈ దేహము నందుండెడి ఈ ప్రాణము శిశువువలెనె శబ్దాది విషయములయందు ఒక యింద్రియము ఇంకొక యింద్రియవిషయమునందువలెనె అసమర్థ మగుటవలన శిశువుగాను ఇట్లు ఆ ప్రాణమను శిశువునకు అధిష్ఠాన మగుటవలన శరీరము ఆధానమనియును ఇట్టి ఆధానమగు శరీరము తోఁగూడుకొనుటవలన దేహమధ్యమునందలి ప్రాణమను శిశువును సాధనముగాను, ఈ ప్రాణమను శిశువును పొందియున్న విజ్ఞానమ యాత్మ నిద్రవలన జాగ్రత్కాలమునందు శిరస్సునందున్న చక్షు శ్శ్రోత్రనాసికములయొక్క రంధ్రములనాఱింటిని ముఖబిలమును ఈ యేడింటిని తిరిగి పొందియుండుటవలన ప్రత్యాధానమనియును, ఇట్టి ప్రత్యాధానముతోఁగూడుకొనుటవలన శిశువును సప్రత్యాధాన మునుగాను, ప్రాణమను శిశువు ఈశరీరమునందు స్తంభము ఆధా రముగాఁగల శిశువువలెనె అన్నపానములవలనఁబుట్టిన బలము ఆధారముగా కలవాఁడగుటవలన సస్థూణమునుగాను, భక్షింపఁబడిన అన్నము, స్థూలమధ్యను అణిష్ఠములని మూడువిధములైనది. అందు స్థూలరూపమైన రసము మూత్రపురీషముగా బయలువెడలుచున్నది. మధ్యమరూపమగు రసము క్రమముగా రక్తము మొదలైన వాని రూపముతో స్వకార్యములగు త్వక్కు, రక్తము, మాంసము, మేదస్సు, మజ్జ, ఎముక, రేతస్సు ఈ ఏడింటివలనఁబుట్టిన శరీరమును వృద్ధిపొం దించుచున్నది. అణిష్ఠరూపమగు రసము అమృతమని ఊర్జమని ప్రభావమని చెప్పఁబడును. అది బొడ్డునకుమీఁదనున్న హృదయదేశ మునుపొంది హృదయమునుండి బయలువెడలి విశేషముగా దేహము

నందంతటను వ్యాపించియున్న డెబ్బదిరెండువేల నాడులయందు ప్రవేశించి, ఇంద్రియసమూహామే రూపముగా కలిగిన సూత్రరూప మగు ప్రాణమను శిశువును శరీరమందుంచుటకు కారణమైన స్థూణమను పేరుగల శక్తిని కలుగఁజేయుచు, శరీరప్రాణములను పలుపువలెనె బంధించుటవలన ఆప్రాణమను శిశువును సదామమునుగాను, ఈప్రకారము దేహమధ్యమునందున్న ప్రాణమను శిశువును సాధానమును గాను, సప్రత్యాధానమునుగాను సస్థూణమునుగాను సదామమును గాను తెలిసికొనువాఁడు (శిరఃప్రదేశమునందున్న శ్రోత్ర నాసికా చక్షుస్సులాఱును ముఖము ఒక్కటియును ఈ యేడింటివలనఁబుట్టిన విషయరాగములు సహోదరుని బిడ్డలైనటువంటివియును విజ్ఞానమయాత్మకు ఆత్మస్వరూపమునందలి దృష్టిని పోఁగొట్టి బాహ్యమునందలి శబ్దాదివిషయములను పొందునటుల చేయుటవలన ద్వేషించునవియునై యున్నవి), అట్టివిషయరాగములను నశింపఁజేయుచున్నాఁడు.

ఉ॥ తమేతాః సప్తాక్షితయ ఉపతిష్ఠన్తే తద్యా ఇమా అక్షన్లోహిన్యో రాజయస్తాభిరేనగ్ రుద్రోఽన్వాయత్తోఽథ యా అక్షన్నాపస్తాభిః పర్జన్యోయా కనీనికా తయాదిత్యోయత్కృష్ణం తేనాగ్నిర్యచ్ఛుక్లంతేనేన్ద్రోఽధరయైనం వర్తన్యా పృథివ్యన్వాయత్తా ద్యౌరుత్తరయా నాస్యాన్నం క్షీయతే య ఏవం వేద. ॥2॥

ప॥ తం – ఏతాః – సప్త – అక్షితయః – ఉపతిష్ఠన్తే – తత్ – యాః – ఇమాః – అక్షన్ – లోహిన్యః – రాజయః – తాభిః – ఏనం – రుద్రః – అన్వాయత్తః – అథ – యాః అక్షన్ – ఆపః – తాభిః – పర్జన్యః – యా – కనీనికా – తయా – ఆదిత్యః – యత్ – కృష్ణం – తేన – అగ్నిః – యత్ – శుక్లం – తేన – ఇన్ద్రః – అధరయా – ఏనం – వర్తన్యా – పృథివీ – అన్వాయత్తా – ద్యౌః – ఉత్తరయా – న – అస్య – అన్నం – క్షీయతే – యః – ఏవం – వేద.

ప్ర॥ ఏతాః=ఈముందు చెప్పఁబోయెడి, సప్తాక్షితయః=ఏడుగు

రగు నాశనము లేని రుద్రాది దేవతలు, తం=ఆ ప్రాణమును, ఉపతిష్ఠన్తే =పొందుచున్నారు. తత్ అక్షన్=ఆ నేత్రమునందు, ఇమాః=ఈ ప్రసిద్ధములైన, లోహిన్యః=ఎఱ్ఱని, రాజయః=రేఖలు, యాః = ఏవిరో, తాభిః=అరేఖలతో, (ఆరేఖలద్వారా), రుద్రః=రుద్రుడు, ఏనం=ప్రాణమును, అన్వాయత్తః = అనుసరించిపొందుచున్నాడు. అథ=అనంతరము, అక్షన్=నేత్రమును, ఆపః=ఉదకములు, (పొగమొదలైనవానియొక్క కూడికవలనకలిగెడునీళ్లు), యాః=ఏవిరో, తాభిః=ఆయుదకములతో, (ఆ ఉదకముద్వారా), పర్జన్యః=వర్షాధి దేవత, (ఏనం = ఈ ప్రాణమును, అన్వాయత్తః = అనుసరించి పొందుచున్నాడు). (అక్షిణి=నేత్రమునందు), కనీనికా=తారక, (నల్లగుడ్డు), యా = ఏదిరో, తయా = దానితో, (దానిద్వారా), ఆదిత్యః=సూర్యుడు, ఏనం=ఈ ప్రాణమును, అన్వాయత్తః=అనుసరించిపొందుచున్నాడు), (అక్షిణి=నేత్రమునందు), కృష్ణం = నలుపు, యత్=ఏదిరో, తేన=దానితో, (దానిద్వారా). అగ్నిః=అగ్ని, (ఏనం=ఈ ప్రాణమును, అన్వాయత్తః=అనుసరించిపొందుచున్నది). (అక్షిణి=నేత్రమునందు), శుక్లం=తెలుపు, యత్=ఏదిరో, తేన=దానితో, (దానిద్వారా) ఇంద్రః=ఇంద్రుడు, (ఏనం = ఈ ప్రాణమును, అన్వాయత్తః= అనుసరించిపొందుచున్నాడు). అధరయా = క్రిందనున్న, వర్తన్యా=రెప్పతో, (రెప్పద్వారా); పృథివీ=భూమి, ఏనం=ఈ ప్రాణమును, అన్వాయత్తా=అనుసరించి పొందుచున్నది. ఉత్తరయా=ఊర్ధ్వమునందున్న, వర్తన్యా = రెప్పతో, (రెప్పద్వారా), ద్యౌః= అంతరిక్షము, (ఏనం=ఈ ప్రాణమును, అన్వాయత్తా = అనుసరించి పొందుచున్నది). యః=ఎవడు, ఏవం=ఈ ప్రకారము, వేద = తెలిసికొనుచున్నాడో, అస్య=వీనికి, అన్నం=అన్నము, నక్షీయతే=నశింపదు.

తా॥ ఈ ఇంద్రియ స్వరూపుడగు ప్రాణమను శిశువు సుషుప్త్యవస్థనుండి జాగ్రదవస్థయందు నేత్రమును పొందియుండగా ఆ ప్రాణ

ముఖను రుద్రుఁడు నేత్రమునందలి రక్తరేఖలద్వారా పొందుచున్నాఁడు. పర్జన్యుఁడు పొగ మొదలయిన వానియొక్క కూడిక చేత నేత్రమునందు కలిగిన యుదకములద్వారా పొందుచున్నాఁడు. సూర్యుఁడు నేత్రము నందలి నల్లగ్రుడ్డుద్వారా పొందుచున్నాఁడు. అగ్ని నేత్రమునందలి నల్లనికాంతిద్వారా పొందుచున్నాఁడు. ఇంద్రుఁడు నేత్రమునందలి తెల్లని కాంతిద్వారా పొందుచున్నాఁడు. భూమి నేత్రముయొక్క క్రింది రెప్పద్వారా పొందుచున్నది. అంతరిక్షము నేత్రముయొక్క పై రెప్పద్వారా పొందుచున్నది. ఈ ప్రకారము అన్నస్వరూపులైన రుద్రాది దేవతలు ఏడుగురును నేత్రమునందున్న రక్తరేఖలు మొద లయినవానిద్వారా జాగ్రత్తయందు నేత్రమునందున్న ప్రాణమును పొందుట తెలిసికొనిన వానికి అన్నము నశింపదు.

ఉ॥ తదేషశ్లోకోభవతి అర్వాగ్బిలశ్చమస ఊర్ధ్వబుధ్న స్తస్మిన్యశో నిహితం విశ్వరూపం తస్యాసత ఋషయస్సప్త తీరే వాగష్టమీ బ్రహ్మణా సంవిదానేతి అర్వాగ్బిలశ్చమస ఊర్ధ్వబుధ్న ఇతీదం తచ్ఛిర ఏషహ్యర్వాగ్బిలశ్చమస ఊర్ధ్వబుధ్న స్తస్మిన్యశో నిహితం విశ్వ రూపమితి ప్రాణా వై యశో నిహితం విశ్వరూపం ప్రాణానేతదాహ తస్యాసత ఋషయః సప్త తీర ఇతి ప్రాణా వా ఋషయః ప్రాణా నేతదాహ వాగష్టమీ బ్రహ్మణా సంవిదానేతి వాగ్ఘ్యష్టమీ బ్రహ్మణా సంవిదత్తే. ॥3॥

ప॥ తత్ - ఏషః - శ్లోకః - భవతి-అర్వాగ్బిలః - చమసః - ఊర్ధ్వబుధ్నః - తస్మిన్ - యశః - నిహితం - విశ్వరూపం - తస్య- ఆసతే - ఋషయః - సప్త - తీరే - వాక్ - అష్టమీ - బ్రహ్మణా- సంవిదానా - ఇతి - అర్వాగ్బిలః - చమసః - ఊర్ధ్వబుధ్నః - ఇతి- ఇదం - తత్ - శిరః - ఏషః - హి - అర్వాగ్బిలః - చమసః - ఊర్ధ్వబుధ్నః - తస్మిన్ - యశః - నిహితం - విశ్వరూపం - ఇతి - ప్రాణాః - వై - యశః - నిహితం - విశ్వరూపం - ప్రాణాన్ -

ఏతత్ - ఆహ - తస్య - ఆసతే - ఋషయః - సప్త - తీరే- ఇతి- ప్రాణాః - వై - ఋషయః - ప్రాణాన్ - ఏతత్ - ఆహవాక్ - అష్టమీ - బ్రహ్మణా - సంవిదానా - ఇతి - వాక్ - హి-అష్టమీ- సంవిదత్తే. ॥4॥

ప్ర॥ తత్ = ఆ అర్థమునందు, అర్వాగ్బిలః = క్రిందరంధ్రము కలిగిన, ఊర్ధ్వబుధ్నః=మీఁదలావుగా నుండెడి, చమసః=చమసము, (యజ్ఞమునందు సోమపానము చేసెడి పాత్ర), తస్మిన్=ఆ పాత్రయందు, విశ్వరూపం=నానారూపమైన, యశః=యశస్సు, నిహితం=ఉంచఁబడినది, (భవతి=అగుచున్నది). తస్య=ఆ పాత్రయొక్క, తీరే=సమీపమునందు, సప్త=ఏడుగురగు, ఋషయః = ఋషులు, ఆసతే=ఉన్నారు. బ్రహ్మణా=బ్రహ్మచేత, సంవిదానా=సంవాదము చేయఁబడిన, (పలకఁబడిన), వాక్=వాక్కు, అష్టమీ=ఎనిమిదవది, (భవతి=అగుచున్నది). ఇతి=అనెడి, ఏషః=ఈ. శ్లోకః=మంత్రము, భవతి=అగుచున్నది. (ఈ మంత్రార్థమును శ్రుతియె వివరించుచున్నది ఎట్లనఁగా), అర్వాగ్బిలశ్చమస ఊర్ధ్వబుధ్న ఇతి = క్రింద బిలముకలిగి మీఁదలావుగా నుండెడి మీఁదలావుగానుండెడి పాత్రవిశేషమనునట్టి, ఇదం=ఇది, తత్ = ఆ ప్రసిద్ధమగు, శిరః=శిరస్సు, (తల), ఏషహి = ఇదియె, అర్వాగ్బిలశ్చమసఊర్ధ్వబుధ్నః=క్రింద బిలముకలిగి మీఁద లావుగా నుండెడి పాత్ర విశేషము. (అనఁగా శిరస్సు, ఇదిముఖబిలము కలిగిమీఁద లావుగా నుండుటవలన చమసయను సోమపాన పాత్రయొక్క ఆకారము కలిగి యున్నది). తస్మిన్యశోనిహితం=విశ్వరూపమితి = ఆ పాత్రమునందు, అనఁగా ఆ శిరస్సునందు నానారూపమైన యశస్సు ఉంచఁబడినది యనెడి, (తత్=ఆయశస్సు, కిం=ఏదియనఁగా), ప్రాణావై = ప్రాణములే, విశ్వరూపం=నానారూపమైన, నిహితం=ఉంచఁబడిన, యశః= యశస్సు. (ఇతి=అని), ఏతత్=ఈ మంత్రము, ప్రాణాన్=శ్రోత్రాదీన్ద్రియములనుగూర్చి, ఆహ = చెప్పెను, (శిరస్సునందలి శ్రోత్రమ్ము

మొదలైన ఏడు స్థానములయందు వాయువులు ఏడు విధములుగా వ్యాపించియున్నవి. దీనినే యశస్సనుగా మంత్రము చెప్పినది). తస్యా సతఋషయస్స త్తీరఇతి = ఆ పాత్రముయొక్క, అనఁగా ఆ శిరస్సు యొక్క సమీపమునందు ఏడుగురు ఋషులు ఉన్నారనెడి. ఏతత్ = ఈ మంత్రము, ప్రాణావై = ప్రాణములే, (శిరస్సునందలి శ్రోత్రాదుల యందు వ్యాపించియున్న చలనాత్మక వాయువులే). ఋషయః = ఋషులు. (ఇతి=అని), ప్రాణాః = శ్రోత్రాదీంద్రియములనుగూర్చి, ఆహ=చెప్పెను. వాగష్ట మీబ్రహ్మణాసంవిదానేతి=బ్రహ్మచేత పలుకఁబడినవాక్కు ఎనిమిదవదియగుచున్నదనెడి, (ఈమంత్రమునందు చెప్పియు, అష్టమత్వమునకు కారణమును మంత్రము చెప్పుచున్నది). బ్రహ్మణా=బ్రహ్మచేత, అష్టమీ=ఎనిమిదవదియగు, వాగ్వి=వాక్కే, సంవిదత్తే = సంవాదము చేయఁబడినది. (వాగింద్రియము తినుటయు పలుకుటయు ఈరెంటియొక్క భేదము చేత రెండువిధములుగా ఇష్ట మగుచున్నది. ఆవాగింద్రియమునకు తినుటచేత సప్తమత్వమును పలుకుటచేత అష్టమత్వమును కలుగుచున్నదని భావము).

తా॥ పూర్వశ్లోకమునందు చెప్పఁబడిన రుద్రాదిశబ్దములు దేవతావిషయములగుటవలన మంత్రముకూడ దేవతావిషయమైనదే యని శంకించి నేత్రమునందు రుద్రాదిగణము చెప్పఁబడుటచేతను ఇంద్రియసంబంధమువలన ఆ రుద్రాది దేవగణమునకు ఇంద్రియ సముదాయత్వముతోఁచుచున్నది. అందువలన ఆ రుద్రాది దేవతా విషయకమైన మంత్రము ప్రసిద్ధదేవతావిషయమైనది కాదని అంగీక రించి ఈమంత్రమును ఆ పూర్వమంత్రార్థమును వివరించుటకే కలిగి నదని చెప్పఁబడుచున్నది. ఈమంత్రమునందు చెప్పిన శిరస్సు యజ్ఞము నందు సోమపానపాత్రయొక్క ఆకృతివలెనే క్రిందరంధ్రముకలిగి మీఁదలావుగానుండినది. దానియందుమంచఁబడినది. దానియందుంచఁ బడిన యశస్సు ఏదియనిన, శిరస్సునందలి శ్రోత్రచక్షుర్నాసికలు

ఆయును ముఖబిలమొకటియును ఈ ఏడుస్థానములయందును వాయువులు ఏడువిధములగా వ్యాపించియున్నవి, ఇదియే యశస్సు, ఆశిరస్సు యొక్క సమీపమునందు ఏడుగురు ఋషులెవరనిన, ఆశిరస్సునందలి శ్రోత్రము మొదలైన ఏడుస్థానములయందు వ్యాపించియున్న చలనాత్మకములగు వాయువులే ఋషులు. బ్రహ్మచేతఁబలుకఁబడిన వేదరూపమగువాక్కు పూర్వముచెప్పిన ఏడింటికి వేరై, ఎనిమిదవది యెట్లయినదనిన, వాగింద్రియము తినుటయు పలుకుటయు ఈ భేదము చేత రెండువిధములగుచున్నది. కనుక ఆ వాగింద్రియమునకు తినుట చేత సప్తమత్వమును పలుకుటచేత అష్టమత్వమును కలిగినది. ఈ రెంటికిని నాలుకే కారణము. అని ఈ ప్రకారము శ్రోత్రాది యములనుగూర్చి మంత్రమే వివరించినది.

ఉ॥ ఇమావేవ గౌతమ భరద్వాజావయమేవ గౌతమోఽయం భరద్వాజ ఇమావేవ విశ్వామిత్రజమదగ్నీ అయమేవ విశ్వామిత్రోఽయం జమదగ్నిరిమావేవ వసిష్ఠకశ్యపావయమేవ వసిష్ఠోఽయం కశ్యపో వాగేవాత్రి ర్వాచా హ్యన్నమద్యతేఽత్తిర్హ వై నామైతద్యదత్రిరితి సర్వస్యాత్తా భవతి సర్వమస్యాన్నం భవతి య ఏవం వేద. ॥4॥

ఇతి చతుర్థాధ్యాయే-ద్వితీయ బ్రాహ్మణమ్.

ప॥ ఇమౌ - ఏవ - గౌతమభరద్వాజౌ - అయం - ఏవ - గౌతమః - అయం - భరద్వాజః - ఇమౌ - ఏవ - విశ్వామిత్రజమదగ్నీ - అయం - ఏవ - విశ్వామిత్రః - అయం - జమదగ్నిః - ఇమౌ - ఏవ - వసిష్ఠకశ్యపౌ - అయం - ఏవ - వసిష్ఠః - అయం- కశ్యపః - వాక్ - ఏవ - అత్రిః - వాచా - హి - అన్నం - అద్యతే- అత్తిః - హవై - నామ - ఏతత్ - యత్ - అత్రిః - ఇతి - సర్వస్య - అత్తా - భవతి - సర్వం - అస్య - అన్నం - భవతి - యః - ఏవం - వేద.

ప్ర॥ ఇమావేవ=ఈశ్రోత్రములు రెండే, గౌతమభరద్వాజౌ=గౌతమభరద్వాజులను ఋషులు, అయమేవ=ఈదక్షిణకర్ణమే, గౌతమః=గౌతమఋషి. అయం=ఈఉత్తరకర్ణము, భరద్వాజః=భరద్వాజఋషి. ఇమావేవ=ఈ నేత్రములు రెండే, విశ్వామిత్రజమదగ్నీ=విశ్వామిత్ర జమదగ్నులను ఋషులు. అయమేవ=ఈదక్షిణనేత్రమే, విశ్వామిత్రః=విశ్వామిత్రఋషి. అయం = ఈఉత్తరనేత్రము, జమదగ్నిః=జమదగ్నిఋషి. ఇమావేవ = ఈ నాసికలే, (ముక్కుపుటములే), వసిష్ఠకశ్యపౌ=వసిష్ఠకశ్యపులను ఋషులు. అయమేవ=ఈదక్షిణ నాసికాపుటమే, వసిష్ఠః=వసిష్ఠమహర్షి. అయం = ఈ ఉత్తరనాసికాపుటము, కశ్యపః=కశ్యపమహర్షి. వాగేవ = వాగింద్రియమే, అత్రిః = అత్రిమహర్షి. వాచా=వాగింద్రియముచేత, అన్నం=అన్నము, అద్యతేహి=ప్రసిద్ధముగా భక్షింపఁబడుచున్నది. (తస్మాత్ = ఆకారణమువల్ల), అత్తిరితియత్=అత్రియనుపేరేదియో, ఏతత్=ఈ, నామ = పేరు, అత్త్రిర్హవై=అత్త్రియనే ప్రసిద్ధమైనది. (అన్నమును భక్షించుటవల్లనే అత్త్రియని చెప్పఁబడుచున్నది). (ఈ అత్రిశబ్దముయొక్క నిశ్చయకథనమును తెలిసికొనుటవలన), సర్వస్య = సమస్తమునకు, (ప్రాణముయొక్క అన్నసమూహమునకంతయు), అత్తా=భక్షించువాఁడు, భవతి=అగుచున్నాఁడు. (ఆత్మయేయగుచున్నాఁడు). యః=ఎవఁడు, ఏవం=ఈపూర్వము చెప్పినప్రకారము, (పూర్వము చెప్పిన ప్రాణములయొక్క=అనఁగా శ్రోత్రాదీంద్రియములయొక్క నిజస్వరూపమును), వేద=తెలిసికొనుచున్నాఁడో, అస్య=వీనికి, సర్వం=సమస్తమైన, అన్నం=అన్నము, భవతి=అగుచున్నది. (ఈప్రకారము శ్రోత్రాదీంద్రియములయొక్క నిజస్వరూపమును తెలిసికొనినవాఁడు మధ్యమప్రాణస్వరూపుఁడై పూర్వము చెప్పిన ఆధానప్రత్యాధానములనుపొంది భోక్తయగుచున్నాఁడు).

తా॥ పూర్వమంత్రమునందు చెప్పిన యజ్ఞమునందలి సోమపాన

షా(త్ర కృతియగు శిరస్సుయొక్క సమీపమునందున్న ఏడుగుఋ ఋషులెవరనిన, శిరస్సునందున్న దక్షిణపు చెవి గౌతమఋషి. ఉత్త రపు చెవి భరద్వాజఋషి, దక్షిణపు నేత్రము విశ్వామిత్రఋషి. ఉత్తర పు నేత్రము జమదగ్నిఋషి. దక్షిణపు నాసాపుటము వసిష్ఠఋషి, ఉత్తరపు నాసాపుటము కశ్యపఋషి. వాక్కే అత్రిఋషి. (అన్నమును భక్షించుటవల్లనే అత్తియని పేరుకలుగుచున్నది. అత్తియనినదియె అత్రియని చెప్పఁబడుచున్నది) ఇట్లు అత్రిశబ్దముయొక్క నిశ్చయ మును తెలిసికొన్నవాఁడు ప్రాణముయొక్క అన్నజాతమునకంతయు భోక్తయగుచున్నాఁడు. ఈ చెప్పిన ప్రకారము శ్రోత్రాదీంద్రియము లయొక్క నిజస్వరూపమును తెలిసికొనెడివాఁడు పూర్వము చెప్పిన ఆధాన ప్రత్యాధానములనుపొంది మధ్యమప్రాణస్వరూపుఁడై భోజ్య మగు అన్నముకంటె వేరైన భోక్తయగుచున్నాఁడు. వీనికి సమస్త మగు అన్నమును కలుగుచున్నది.

ఇట్లు చతుర్థాధ్యాయమునందు ద్వితీయబ్రాహ్మణము సమాప్తము.

## చతుర్థాధ్యాయము, తృతీయబ్రాహ్మణము.

ఉ॥ ద్వే వావ బ్రహ్మణో రూపే మూర్తం చైవామూర్తం చ మర్త్యం చామృతం చ స్థితం చ యచ్చ సచ్చ త్యచ్చ. ॥1॥

ప॥ ద్వే - వావ - బ్రహ్మణః - రూపే - మూర్తం - చ - ఏవ - అమూర్తం - చ - మర్త్యం - చ - అమృతం - చ - స్థితం- చ - యత్ - చ - సత్ - చ - త్యత్ - చ.

ప్ర॥ బ్రహ్మణః = పరమాత్మకు, రూపే = ఆకారములు, ద్వేవావ=రెండే, (ఆరెండు రూపములేవియనిన), మర్త్యంచ=మరణ ధర్మముకలదియును, స్థితంచ=పరిచ్ఛిన్నమైనదియును, (అవధికలది), సచ్చ=ప్రత్యక్షముగా కనఁబడునదియునగు, (సచ్ఛబ్దము, మూర్తత్వ మర్త్యత్వస్థితత్వములవలన విశేష్యమైనదై సాధారణ ధర్మవిశేషము

కలది). మూర్తం చైవ=మూర్తస్వరూపమే. (ఆ కారణముకలదియె). అమృతంచ=మరణధర్మము లేనిదియును, యచ్చ = వ్యాపించియుండు నదియును, (అంతటను వ్యాపించి యవధిలేకయుండునదియును), త్యచ్చ=ప్రత్యక్షము కానిదియునగు, అమూర్తంచ=అమూర్తస్వరూపమే. (ఆ కారము లేనిదే. ఇక్కడ చ కారము ఏవ కారముయొక్క అర్థముకలది).

తా॥ ఇంతకుపూర్వము ప్రాణము లే సత్యమని చెప్పఁబడినది. బ్రహ్మోపనిషత్ప్రసంగము చేత ప్రాణస్వరూపమును చెప్పెడి యుపనిషత్తులు వ్యాఖ్యానము చేయఁబడినవి. ఆ ప్రాణములు ఏ స్వరూపములు, ఆ ప్రాణములకు సత్యత్వమెట్లుఅని ఇది చెప్పదగినదియని శరీరేంద్రియ స్వరూపములును సత్యస్వరూపములనగు పంచభూతములయొక్క స్వరూపమును నిశ్చయించుటకు ఈ బ్రాహ్మణమారంభింపఁబడుచున్నది. ఏ పరబ్రహ్మమునకు ఉపాధినాశముద్వారా సత్యత్వము నిశ్చయించుటకు కోరఁబడినదో, ఆపరబ్రహ్మమునకు, మరణధర్మముఁకలదియును అవధికలదియును నేత్రేంద్రియప్రత్యక్షమునగు మూర్తస్వరూపమును, మరణధర్మము లేనిదియును సర్వవ్యాపియును, ప్రత్యక్షము కానిదియు నగు అమూర్తస్వరూపమును ఇవిరెండే స్వరూపములగుచున్నవి.

ఉ॥ తదేతన్మూర్తం యదన్యద్వాయోశ్చాన్తరిక్షాచ్చైతన్మర్త్యమే
తత్స్థితమేతత్సత్తస్యైతస్య మూర్తస్యైతస్య మర్త్యస్యైతస్య
స్థితస్యైతస్య సత ఏష రసో య ఏష తపతి సతో హ్యేష రసః॥ 2॥

ప॥ తత్ - ఏతత్ - మూర్తం - యత్ - అన్యత్ - వాయోః - చ - అన్తరిక్షాత్ - చ - ఏతత్ - మర్త్యం - ఏతత్ స్థితం - ఏతత్ - సత్ - సత్య - ఏతస్య - మూర్తస్య - ఏతస్య - మర్త్యస్య - ఏతస్య - స్థితస్య - ఏతస్య - సతః - ఏషః - రసః - యః - ఏషః - తపతి - సతః - హి - ఏషః - రసః.

ప్ర॥ వాయోశ్చ=వాయువుకంటెను, అంతరిక్షాచ్చ=ఆకాశము

కంటెను, అన్యత్=వేరైన, యత్=ఏదియో, తత్ = ఆ. ఏతత్= ఇది, మూర్తం=మూర్తస్వరూపము. (వాయ్వాకాశములను భూత ములరెంటికంటె వేరగుపృథివ్యప్తేజస్సులు మూడుభూతములు మూర్తము. అనఁగాపరస్పరమును కలిసికొనిన అవయవములుకల ఆకారము), ఏతత్=ఇది, మర్త్యం = మరణధర్మముకలది. ఏతత్= ఇది, స్థితం=పరిచ్ఛిన్నమైనది. (పరిమితికలది), ఏతత్=ఇది, సత్= ప్రత్యక్షమగువది. తస్య=అటువంటి, ఏతస్య=ఈ, మూర్తస్య=మూర్త స్వరూపముగల, ఏతస్య=ఈ, మర్త్యస్య=మరణధర్మముగల, ఏతస్య =ఈ, స్థితస్య=పరిచ్ఛిన్నముగల, ఏతస్య=ఈ, సతః = ప్రత్యక్షమగు పృథివ్యప్తేజస్సులను మూడుభూతములయొక్క, (ఈమూర్తస్వరూ పము అన్యోన్యము ఎడతెగకయుండుటవలన సత్ అనఁబడుచున్నది). (ఈమూర్తత్వము మొదలైన నాలుగుధర్మములకు స్వేచ్ఛగా విశేషణ విశేష్యభావమును హేతుహేతుమద్భావమునుకలదు. సర్వవిధములు గాను ఈ నాలుగు విశేషములతోఁ గూడుకొనిన పృథివ్యప్తేజస్సు లను మూడుభూతములును బ్రహ్మముయొక్క మూర్తమనురూపము. ఈ మూర్తత్వాది నాలుగు విశేణములలో ఒకవిశేషణము గ్రహించిన యెడల ఇతరవిశేషణములు గ్రహింపఁబడినవే యగుచున్నవి). రసః =సారము, ఏషః=ఇది. (అచేతనమగు మండలము) యఏషః=ఏ ఈ సూర్యుఁడు, మండలస్వరూపమైన సూర్యుఁడు), తపతి=తపింపఁజేయు చున్నాఁడో, ఏషః = ఈసూర్యుఁడు, (అనఁగాసూర్యమండలము) సతోహి = భూతత్రయముయొక్కయె, (అనఁగా పృథివ్యప్తేజస్సుల యొక్క), రసః=సారము. (మూర్తస్వరూపమైన భూతత్రయముయొక్క సారమగు ఈ మండలస్వరూపమైన సూర్యుఁడు లోకమును తపింపఁ జేయుచున్నాఁడు).

తా॥ ఇంతకుపూర్వము పరబ్రహ్మకు చెప్పినటువంటి మూర్తా మూర్తస్వరూపములరెంటిలో మూర్తస్వరూపము ఏదియనిన, వాయ్వా

కాశములను రెండు భూతములకంటె వేరగు భూమి, జలము, తేజస్సు అనుమూడును. (అన్యోన్యముకలిగిసికొనిన అవయవములుగల ఈభూతములయొక్క యాకారము). మూర్తస్వరూపము. ఇది ఇట్లుఅవయవములతోఁగూడిన ఆకారముగనుక నే మరణధర్మముకలదియును మరణధర్మముకలదిగనుక నే అవధికలదియును అవధికలది గనుక నే ప్రత్యక్షమైనదియును అగుచున్నది. ఈ ప్రకారము ఆకారముగలదియును మరణధర్మముకలదియును అవధికలదియును ప్రత్యక్షమైనదియునగు పృథివ్యప్తేజస్సులను భూతత్రయముయొక్క సారమే ఈలోకమును తపింపఁజేయుచున్న మండలాకారమగు సూర్యుఁడు.

ఉ॥ అథామూర్తం వాయుశ్చాన్తరిక్షం చైతదమృతమే తద్యదేతత్త్యత్తస్యైతస్యామూర్తస్యై తస్యామృతస్యై తస్య యత ఏతస్యత్యస్యైష రసో య ఏష ఏతస్మిన్మండలే పురుష స్త్యస్య హ్యేష రస ఇత్యధి దైవతమ్. ॥3॥

ప॥ అథ - అమూర్తం - వాయుః - చ - అన్తరిక్షం - చ - ఏతత్ - అమృతం - ఏతత్ - యత్ - ఏతత్ - త్యత్ - తస్య - ఏతస్య - అమూర్తస్య - ఏతస్య - అమృతస్య - ఏతస్య - యతః - ఏతస్య - త్యస్య - ఏషః - రసః - యః - ఏషః - ఏతస్మిన్ - మణ్డలే - పురుషః - త్యస్య - హి - ఏషః - రసః - ఇతి - అధిదైవతం.

ప్ర॥ అథ=ఇప్పుడు, అమూర్తం=అమూర్తస్వరూపము, (పరబ్రహ్మయొక్క అవయవములు లేనిరూపము, ఉచ్యతే = చెప్పఁబడుచున్నది). వాయుశ్చ = వాయువును, అన్తరిక్షంచ = ఆకాశమును, (పూర్వము చెప్పిన పృథివ్యప్తేజస్సులను మూడు భూతములకు వేరై వాయ్వాకాశములను భూతద్వయము, యత్ = ఏదియో, ఏతత్ = ఈఅమూర్తస్వరూపము, అమృతం = మరణధర్మము లేనిది, ఏతత్ =ఇది, యత్ =వ్యాపించియుండునది. ఏతత్ = ప్రత్యక్షముకానిది. (కనఁబడనిది), తస్య=ఆ, ఏతస్య= ఈ, అమూర్తస్వరూపముగల,

అమూర్తస్య=అమూర్తస్వరూపముగల, ఏతస్య = ఈ, అమృతస్య= మరణధర్మములేని, ఏతస్య=ఈ, యతః=వ్యాపించియున్న, ఏతస్య= ఈ, త్యస్య=ప్రత్యక్షముగాని వాయురాకాశములను భూతద్వయము యొక్క, (ఈ అమూర్తత్వము మొదలయిన నాలుగుధర్మములకు స్వేచ్ఛగావిశేషణ విశేష్యభావమును, హేతుహేతుమద్భావమును కలదు. సర్వవిధముల ఈ నాలుగువిశేణములలోఁగూడుకొనిన వాయు రాకాశములను భూతద్వయమును పరబ్రహ్మముయొక్క అమూర్త మనురూపము). రసః=సారము, (చేతనస్వరూపము), ఏషః = ఇది, ఏతస్మిన్=ఈ, మణ్డలే=సూర్యమండలమునందు, ఏషః=ఈ, పురుషః =పురుషుఁడు, యః=ఎవఁడో, ఏషః=ఈపురుషుఁడు, (సూర్యమండల మధ్యమునందుండెడి చేతన స్వరూపుఁడగు పురుషుఁడు), త్యస్యహి= వాయురాకాశములను భూతద్వయముయొక్కయె (పూర్వముచెప్పిన అమూర్తత్వాది నాలుగువిశేషణములలో ఒకవిశేషణము గ్రహించి నను ఇతరవిశేషణములు గ్రహింపఁబడినవేయగుచున్నవి. కనుక ఇక్కడ త్యత్ అను ఒక విశేషణమును, గ్రహించుటచేతనే అమూర్త త్వాది నాలుగు విశేషణములలోఁగూడుకొనిన వాయురాకాశము లను భూతద్వయము గ్రహింపఁబడినదగుచున్నది). రసః=చేతనస్వరూ పుఁడు (భవతి=అగుచున్నాఁడు). ఇతి=ఈప్రకారము, అధిదైవతం= అధిదైవతస్వరూపము, (భవతి=అగుచున్నది).

తా॥ ఇట్లు పరబ్రహ్మముయొక్క అచేతనాత్మకమగు మూర్త స్వరూపమును చెప్పి యిప్పుడు చేతనాత్మకమగు అమూర్తస్వరూపము చెప్పఁబడుచున్నది. ఆ అమూర్త స్వరూపము ఏదియనిన, పూర్వము చెప్పిన పృథివ్యప్తేజస్సులను భూతద్వయముకంటె వేరగు వాయురాకా శములను భూతద్వయము అమూర్తస్వరూపము, ఇదియట్లు ఆకారము లేనిది గనుకనే మరణధర్మము లేనిదియును, మరణధర్మము లేనిదిగను కనే సర్వవ్యాపకమైనదియును, వ్యాపకమైనదిగనుకనే కనఁబడనిది

యును ఆగుచున్నది. ఈ ప్రకారము ఆకారము లేనిదియును మరణ ధర్మము లేనిదియును వ్యాపకమైనదియును పరోక్షమైనదియునగు వాయు రాకాశములను భూతద్వయముయొక్క సారమే సూర్యమండ లాంతర్గతమైన అధిదైవికమగు పురుష స్వరూపుడు.

ఉ॥ అథాధ్యాత్మమిదమేవ మూర్తం యదన్యత్ప్రాణాచ్చ యశ్చాయ మన్తరాత్మన్నాకాశ ఏతన్మర్త్యమేతత్స్థిత మేతత్సత్తస్యైతస్య మూర్తస్యైతస్య మర్త్యస్యైతస్య స్థితస్యైతస్య సత ఏష రసో యచ్చక్షుః సతో హ్యేష రసః. ॥4॥

ప॥ అథ – అధ్యాత్మం – ఇదం – ఏవ – మూర్తం – యత్ – అన్యత్ – ప్రాణాత్ – చ-యః – చ – అయం – అన్తరాత్మన్ – ఆకాశః – ఏతత్ – మర్త్యం – ఏతత్ – స్థితం – ఏతత్ – సత్ – ఏతస్య – మూర్తస్య – ఏతస్య – మర్త్యస్య – ఏతస్య – స్థితస్య – ఏతస్య – సతః – ఏషః – రసః – యత్ – చక్షుః – సతః – హి – ఏషః – రసః.

ప్ర॥ అథ = ఇప్పుడు, అధ్యాత్మం = అధ్యాత్మస్వరూపము, (ఉచ్యతే = చెప్పఁబడుచున్నది). ప్రాణాచ్చ = వాయుకంటెను, అన్తరాత్మన్ = శరీరములోపలనున్న, అయం=ఈ, ఆకాశః = ఆకాశము, యః = ఏదియో, (తస్మాత్ =దానికంటెను), అన్యత్ = ఇతరమైనది, యత్=ఏదియో, ఇదమేవ=ఇదియె, మూర్తం=మూర్తస్వరూపము. (ఆకారము) ఏతత్ = ఇది, స్థితం = పరిచ్ఛిన్నమైనది. ఏతత్=ఇది, సత్ =ప్రత్యక్షమైనది. తస్య=అటువంటి, ఏతస్య=ఈ, మూర్తస్య=మూర్తస్వరూపముగల, ఏతస్య = ఈ, మర్త్యస్య = మరణ ధర్మముగల, ఏతస్య = ఈ, స్థితస్య = పరిచ్ఛేదముగల, ఏతస్య = ఈ, సతః = ప్రత్యక్షమగు పృథివ్యప్తేజస్సులను భూతత్రయముయొక్క, రసః=సారము, ఏషః=ఇది, చక్షుః=నేత్రము, యత్ = ఏదియో, ఏషః=ఇది, సతో హి=ఆధ్యాత్మిక సంబధమగు పృథివ్యప్తేజస్సులను

భూతత్రయముయొక్క సారము, రసః=సారము, (భవతి=అగుచున్నది.)

తా॥ ఇట్లు ఆధిదైవికసంబంధములగు మూర్తామూర్త స్వరూపములను చెప్పి యిప్పుడు ఆధ్యాత్మిక సంబంధములగు మూర్తామూర్త స్వరూపముల విభాగము చెప్పఁబడుచున్నది. దానిలో మూర్తస్వరూపమేదియనిన, ప్రాణవాయుప్రకంటెను దేహమధ్యము నందలి ఆకాశముకంటెను శరీరారంభకమైన పృథివ్యప్తేస్సులుమూడును మూర్తస్వరూపము. ఇదిమూర్తస్వరూపముగనుకనే మరణధర్మము కలదియును మరణధర్మము కలదిగనుకనే ఇంతయనిపరిమాణము చేయఁబడినదియును ఇట్లువేఱుపఱబడి పరిచ్ఛిన్నమైనది గనుక నె ప్రత్యక్షమైనదియు నగుచున్నది. అటువంటి ఈ మూర్తత్వాని నాలుగు ధర్మములతోఁ గూడుకొని ఆధ్యాత్మికమును శరీరారంభకమునగు పృథివ్యప్తేజస్సులయొక్క సారమే ఈకార్యాత్మకమైన స్థూలదేహము. ఈస్థూలదేహమునందలి నేత్రము అధిదైవతమునందు పృథివ్యప్తేజస్సులయొక్క సారమైన సూర్యమండలమువలెనే అధ్యాత్మమునందు పృథివ్యాదిభూతత్రయసారమగుచున్నది.

ఉ॥ అథామూర్తం ప్రాణశ్చ యశ్చాయ మన్తరాత్మన్నాకాశ ఏతద మృతమేతద్యదేతత్త్యత్తస్యైతస్యా మూర్తస్యైతస్యామృతస్యై తస్య యత ఏతస్య త్యస్యైష రసో యోఽయం దక్షిణేఽక్షన్ పురుష స్త్యస్య హ్యేష రసః. ॥5॥

ప॥ అథ - అమూర్తం - ప్రాణః - చ - యః - చ-అయం - అన్తరాత్మన్ - ఆకాశః - ఏతత్ - అమృతం - ఏతత్ - యత్ ఏతత్ - త్యత్ - తస్య - ఏతస్య - అమూర్తస్య - ఏతస్య - అమృతస్య - ఏతస్య - యతః - ఏతస్య - త్యస్య - ఏషః - రసః - యః - అయం - దక్షిణే - అక్షన్ - పురుషః - త్యస్య - హి - ఏషః-రసః.

అథ = ఇప్పుడు, అమూర్తం = అమూర్తస్వరూపము,

ర్యతే=చెప్పఁబడుచున్నది). ప్రాణశ్చ = ప్రాణవాయువును, అన్త రాత్మన్=దేహములోపలనున్న, అయం=ఈ, ఆకాశః = ఆకాశము, యః=ఏదియో, (సః = ఆ ఆకాశమును, ఏతత్ = ఈరెండుభూతము లును, అమూర్తం=అమూర్తస్వరూపము; ఆకారములేనిస్వరూపము). ఏతత్=ఇది, అమృతం=మరణధర్మములేనిది. ఏతత్ = ఇది, యత్= వ్యాపకమైనది. ఏతత్=ఇది, త్యత్=పరోక్షమైనది. (కనఁబడనిది) తస్య=అటువంటి, ఏతస్య=ఈ, అమూర్తస్య= అమూర్తస్వరూపము, ఏతస్య=ను, అమృతస్య = మరణధర్మములేనిదియును, ఏతస్య = ఈ, యతః=వ్యాపకమైనదియును, ఏతస్య=ఈ, త్యస్య=ప్రత్యక్షము కానిది యునగు వాయురాకాశములను భూతద్వయమునొక్క, రసః = సారము, ఏషః=ఇది. దక్షిణేఽక్షన్=దక్షిణనేత్రమునందలి, అయం= ఈ, పురుషః=పురుషుఁడు, యః=ఎవఁడో, ఏషః=వీఁడు, త్యస్యహి= వాయురాకాశములను భూతద్వయమునొక్కయే, (దేహములోపలి ప్రాణాకాశములయొక్క), రసః=సారము, (భవతి=అగుచున్నాఁడు).

తా॥ ఇట్లుఅధ్యాత్మమునందు మూర్తస్వరూపమును చెప్పి అమూర్తస్వరూపము చెప్పఁబడుచున్నది. ఈ దేహమునందలి ప్రాణాకాశములు రెండును అమూర్తస్వరూపము. ఇదిమరణధర్మములేనియును వ్యాపకమైనదియును ప్రత్యక్షము కానిదియునగుచున్నది. ఇట్లు అమూర్తత్వాది ధర్మములతోఁగూడుకొనిన వాయురాకాశములను భూతద్వయమునొక్క సారమే ఈ లింగశరీరము. అలింగశరీరము యొక్క దక్షిణనేత్రమునందలి ఈపురుషుఁడు. పృథివ్యాదిభూతత్రయముకంటెవేరగు వాయురాకాశములను భూతద్వయమునొక్కసారమై ఈదేహాంతర్గతమను కరణాత్మకమునగు అధ్యాత్మ స్వరూపుఁడగుచున్నాఁడు.

ఉ॥ తస్య హైతస్య పురుషస్య రూపం యథా మాహారజనం వాసో యథా పాణ్డ్వావికం యథేన్ద్రగోపో యథాఽగ్న్యర్చిర్యథా పుణ్డ

దీక౦ ద్యుత్తగ్ సకృద్విద్యుత్తేవ హ వా అస్య శ్రీర్భవతి య ఏవం వేదాథాత ఆదేశో నేతి నేతి న హ్యేతస్మాదితి నేత్యన్యత్పరమస్త్యథ నామధేయగ్ సత్యస్య సత్యమితి ప్రాణా వై సత్యం తేషామేష సత్యం. ॥6॥

ఇతి చతుర్థాధ్యాయే తృతీయ బ్రాహ్మణమ్.

ప॥ తస్య - హ - ఏతస్య - పురుషస్య - రూపం - యథా - మాహారజనం - వాసః - యథా - పాణ్డు - ఆవికం - యథా - ఇన్ద్రగోపః - యథా - అగ్న్యర్చిః - యథా - పుణ్డరీకం - యథా - సకృద్విద్యుత్తం - సకృద్విద్యుత్తా - ఇవ - హ - వై - అస్య - శ్రీః - భవతి - యః - ఏవం - వేద - అథ - అతః - ఆదేశః - న - ఇతి - న - ఇతి - న - హి - ఏతస్మాత్ - ఇతి - న - ఇతి - - పరం - అస్తి - అథ - నామధేయం - సత్యస్య - సత్యం ప్రాణాః - వై - సత్యం - తేషాం - ఏషః - సత్యం.

ప్ర॥ తస్యహ=ఆ ప్రసిద్ధమైన, ఏతస్య=ఈలింగశరీరాత్మకమైన, పురుషస్య=పురుషునియొక్క, రూపం = స్వరూపము, మహారజనం= ఎఱ్ఱనైన, వాసోయథా = వస్త్రమువలెను, పాణ్డు = తెల్లని . ఆవికం యథా=గొఱ్ఱెబొచ్చువలెన, (కంబళివలెన) ఇన్ద్రగోపోయథా=ఆర్ద్రపురుగువలెన, అగ్న్యర్చిర్యథా=అగ్నిజ్వాలవలెన, యథాపుణ్డరీకం= శుక్లమువలెన, యథాసకృద్విద్యుత్తం=మెఱుపువలెన, (భవతి=అగుచున్నది). యః = ఎవఁడు, ఏవం= ఈప్రకారముగా, వేద= తెలిసికొనుచున్నాఁడో, అస్య=వీనియొక్క, శ్రీః=శోభ, (ఖ్యాతి), సకృద్విద్యుత్తేవహవై =ప్రసిద్ధముగా సర్వత్రప్రకాశించెడిమెఱుపువలెను, భవతి= అగుచున్నది. అథ = అనన్తరము, సత్యస్వరూపనిర్దేశానన్తరము ఏకారణమువలన సత్యస్యసత్యమనునది. మిగిలియున్నదో), అతః= ఆకారణమువలన, నేతినేతి = నేతినేతియను ఈ నకారములరెంటి చేతను, (బ్రహ్మణః = పరబ్రహ్మమునొక్క), ఆదేశః = నిర్దేశము,

(నిర్ణయము, ఉచ్యతే=చెప్పఁబడుచున్నది). ఏతస్మాదితి=దీనికంటెనన్య మైనది. నహి=లేనేలేదు. (యస్మాత్=ఏ కారణమువలన), అన్యత్= ఇతరమైన, పరం=శ్రేష్ఠమగు బ్రహ్మనిర్దేశనము, నాస్తీతి=లేనేలేదో, (తస్మాత్ = ఆ కారణమువలన, అయమేవ = ఈపూర్వము చెప్పినదే, బ్రహ్మణః=పరబ్రహ్మముయొక్క, నిర్దేశః=నిర్దేశము). అథ=అనంతరము, (బ్రాహ్మణః=పరబ్రహ్మమునకు), సత్యస్యసత్యమితి = సత్యస్య సత్యమనునది, నామధేయం=పేరు, (భవతి=అగుచున్నది). ప్రాణాః =శ్రోత్రాదీంద్రియములు, వై =ప్రసిద్ధముగా, సత్యం = సత్యస్వరూపము, తేషాం=ఆప్రాణములలో, ఏషః=ఈఆత్మ, (ఈప్రత్యగాత్మ= విజ్ఞానాత్మ), సత్యం=సత్యస్వరూపము.

తా॥ ఇంతకుపూర్వము పరబ్రహ్మమునకు ఉపాధిభూతములైన మూర్తామూర్తస్వరూపములకు శరీరేంద్రియ విభాగముచేతను సత్యశబ్దవాచ్యములైన అధ్యాత్మాధిదైవతములయొక్క విభాగము చెప్పఁబడినది. ఇప్పుడు ఇంద్రియాత్మకుఁడును లింగదేహస్వరూపుఁడును పరమాత్మైకదేశీయుఁడునగు విజ్ఞానమయాత్మయొక్క వాసనాస్వరూపమగు రూపములు చెప్పఁబడుచున్నవి. (ఇక్కడ వాసనలనేకములగుటవలన రూపములని బహువచనము చెప్పఁబడినది). ఎట్లనఁగా లోకమునందు హరిద్రాచూర్ణముచేతను ఎఱ్ఱగా చేయఁబడినవస్త్రమువలెనే ఈ విజ్ఞానమయాత్మయొక్క చిత్తమునకు స్త్రీలు మొదలైనవారియొక్క విషయ సంయోగమునందు రజ్జనాకారమగు వాసనారూపమును తెల్లనికంబళివలెను ఆర్ద్రిపురుగువలెను ఒకానొకప్పుడు విషయవిశేషములయొక్క అపేక్షచేత ఒకానొకవస్తువునందలి అనురాగముయొక్క తారతమ్యమును, చిత్తవృత్తియొక్క అపేక్షచేత అగ్నిజ్వాలవలెనే ప్రకాశమగు ఒకానొక వస్తువుయొక్క వాసనారూపమును ఒకానొకప్పుడు పుండరీకమువలెనే ఒకానొక వస్తువుయొక్క పరిశుద్ధమగు వాసనారూపమును ఒకానొకప్పుడు పుండరీమువలెనే ఒకానొక వస్తువు

వాసనారూపమును మెఱుపువలెనే జ్ఞానప్రకాశము యొక్క వివృద్ధ్యపేక్షచేత ఒకానొక వస్తువు యొక్క వాసనారూపమును కలుగుచున్నది. ఇటువంటి వాసన లనేకములగుట వలన ఈ వాసనలకు ఆదిమధ్య అంతకాలములును నిమిత్తము లనేకము లగుట వలన నిమిత్తమును నిశ్చయింపఁబడదు. ఈ వస్త్రాది దృష్టాంతములు వాసనలయొక్క స్వరూప సంఖ్యలను నిశ్చయపఱచుటకే ప్రయోజనముగా కలవిగావు గాని వాసనలయొక్క రీతులు ఈ ప్రకారమైనవని చూపించుటయే ప్రయోజనముగా కలవియగుచున్నవి. వెనుక దృష్టాంతములలో కడపట చెప్పఁబడిన మెఱుపు వంటివియగు వాసనారూపమేదియో దానిని హిరణ్యగర్భుని సంబంధమైన వాసనారూపమునుగా తెలిసికొనెడి వానికి ఖ్యాతి, మెఱుపువలెనే, సర్వత్ర ప్రకాశించుచున్నది. ఈ ప్రకారము సంపూర్ణముగా సత్యము యొక్క స్వరూపమును చెప్పి అనంతరము ఆ పరబ్రహ్మముయొక్క సత్యస్యసత్యమను స్వరూప నిర్దేశము చెప్పఁబడుచున్నది. ఎట్లనఁగా ఆరోపింపఁబడిన నామ రూప కర్మములద్వారా ఎప్పుడు పోయినటువంటి సమస్త ఉపాధి విశేషములుగల పరబ్రహ్మస్వరూపము నిర్దేశింపఁబడినదగుచున్నదో అప్పుడు నేతినేతి యను నకారద్వయముచేతను పరబ్రహ్మమునందు ఆరోపితమైనదంతయు నిషేధింపఁబడుచున్నది. ఎప్పుడు సమస్త ఉపాధులను నిరాకరించునట్టి ద్వారా సమస్తమైన దిక్కాలాదులను తెలిసికొనవలెనెడి కోరిక నివర్తించి పోవుచున్నదో, అప్పుడు సైన్ధవ ఘనము వలెనే ఏకరసమును ప్రజ్ఞానఘనమును అనంతరమును అబాహ్యమును సత్యస్యసత్యమునగు బ్రహ్మమునే. నేతి నేతి యనెడి జిజ్ఞాస, సర్వత్రనివర్తించి ప్రజ్ఞ ఆత్మయందే ఉన్నది. ఇట్లు నేతినేతి యను నకారద్వయముచేత సమస్త ఉపాధులను నిషేధించి పరబ్రహ్మ నిర్దేశముచేయుటకంటె అన్యమగు శ్రేష్ఠమైన బ్రహ్మ నిర్దేశనము వేఱెలేదు గనుక ఇదియే పరబ్రహ్మముయొక్క

నిర్దేశము కావున ఆపరమాత్మను చెప్పెడి ఆయుపనిషత్తునకు సత్యస్య సత్యమని పేరు. ఈప్రకారముగానే పరబ్రహ్మమునకు చెప్పఁబడిన సత్యస్యసత్యమను నామధేయము యుక్తమైనదియగుచున్నది శ్రోత్రాదీంద్రియములును సత్యస్వరూపము ఆశ్రోత్రాదీంద్రియములలో పరమాత్మైకదేశమగు ఈ విజ్ఞాన స్వరూపమైన పరమాత్మయును సత్యస్వరూపము.

ఇట్లు చతుర్థాధ్యాయమునందు తృతీయబ్రాహ్మణము సమాప్తము.

## చతుర్థాధ్యాయము, చతుర్థబ్రాహ్మణము.

శ్లో॥ మైత్రేయీతిహోవాచ యాజ్ఞవల్క్యఉద్యాస్యన్వా అరేఽహమస్మాత్ స్థానాదస్మిహన్త తేఽనయా కాత్యాయన్యాఽన్తం కరవాణీతి.॥1

ప॥ మైత్రేయి - ఇతి - హ - ఉవాచ - యాజ్ఞవల్క్యః - ఉద్యాస్యన్ - వై - అరే - అహం - అస్మాత్ - స్థానాత్ - అస్మి - హన్త - తే - అనయా - కాత్యాయన్యా - అన్తం - కరవాణి - ఇతి.

ప్ర॥ యాజ్ఞవల్క్యః=యాజ్ఞవల్క్యమహాఋషి, మైత్రేయీతి = మైత్రేయీయనిపిలిచి, (తనమొదటిభార్యయగు మైత్రేయియను ఆమెనుపిలిచి), అరే=ఓ మైత్రేయి, అహం=నేను, అస్మాత్=ఈ, స్థానాత్=స్థానమునుండి, (ఈగృహస్థాశ్రమమునుండి), ఉద్యాస్యన్వై=ఊర్ధ్వాశ్రమమును పొందుటకు కోరినవాఁడనే,(సన్న్యాసాశ్రమమును పొందనిచ్ఛగలవాఁడనే), అస్మి=అగుచున్నాను, (అతః=అందువలన, తే=నీయొక్క), హన్త=అనుమతిని, (ప్రార్థయామి=కోరుచున్నాను). (కించ=మఱియు). తే=నీకు, అనయా=ఈ, కాత్యాయన్యా=కాత్యాయనితో, (రెండవభార్యయగు కాత్యాయనితో), అన్తం=విభాగమును, కరవాణీతి=చేసెదనని, ఉవాచహ=పలికెను.

తా॥ ఇంతకు పూర్వము తృతీయాధ్యాయమునందు అవిద్యావిషయమంతయు ఉపసంహారము చేయఁబడినది. చతుర్థాధ్యాయము

నందు బ్రహ్మవిద్యావిషయమైన ప్రత్యగాత్మను, "బ్రహ్మతే బ్రువాణీతి, బ్రహ్మజ్ఞాపయిష్యామీతిచ" అను ఈ వాక్యములు ప్రస్తుతము చేసికొని, (ఉపక్రమించుకొని), ఏకమును అద్వితీయమును సర్వవిశేష శూన్యమునగు ఆ పరబ్రహ్మమును క్రియాకారక ఫలస్వభావ సత్యశబ్ద వాచ్యాశేషభూతధర్మములయొక్క నిషేధముద్వారా నేతినేతియని తెలియఁజేయఁబడినది. ఇట్టి పరబ్రహ్మవిద్యకు అంగముగా సన్న్యాసమును విధింపవలెననెడి యిచ్ఛచేత ఈ కథ ఉపక్రమింపఁబడుచున్నది. యాజ్ఞవల్క్యమహాఋషికి మైత్రేయి కాత్యాయనులను ఇద్దరు భార్యలు కలరు. వారిలో మొదటి భార్యయగు మైత్రేయిని యాజ్ఞవల్క్య మహాఋషి పిలిచి ఓ మైత్రేయీ నేను ఈ గృహస్థాశ్రమమునుండి శ్రేష్ఠమగు సన్న్యాసాశ్రమమును పొందుట కిచ్ఛగలవాఁడనగుచున్నాను కనుక నీ యంగీకారమును కోరుచున్నాను. మఱియు ఈ నా రెండవభార్యయగు కాత్యాయనితో నీకు ధనవిభాగమును చేసెదనని పలికెను.

ఉ॥ సా హోవాచ మైత్రేయీ యన్ను మ ఇయం భగోః సర్వా పృథివీ విత్తేన పూర్ణా స్యాత్కథం తేనామృతా స్యామితి నేతి హోవాచ యాజ్ఞవల్క్యో యథైవోపకరణవతాం జీవితం తథైవ తే జీవితగ్ స్యాదమృతత్వస్య తు నాశాస్తి విత్తేనేతి. ॥2॥

ప॥ సా - హ - ఉవాచ - మైత్రేయీ - యత్ - ను - మే - ఇయం - భగోః - సర్వా - పృథివీ - విత్తేన - పూర్ణా - స్యాత్ - కథం - తేన - అమృతా - స్యాం - ఇతి - న - ఇతి - హ - ఉవాచ - యాజ్ఞవల్క్యః - యథా - ఏవ - ఉపకరణవతాం - జీవితం - తథా - ఏవ - తే - జీవితం - స్యాత్ - అమృతత్వస్య - తు - న - ఆశా - అస్తి - విత్తేన - ఇతి,

ప్ర॥ సా=ఆ, మైత్రేయీ=మైత్రేయి, యన్ను=విచారింపఁగా, హేభగోః=ఓ యాజ్ఞవల్క్యమహాఋషీ, సర్వా=సమస్తమైన, ఇయం

=ఈ, పృథివీ=భూమి, విత్తేన = ధనముచేతను, పూర్ణా = నిండినది, స్యాత్కథం=అగునాఏమి? తేన=ఆ ధనసాధ్యమైన అగ్నిహోత్రాది కర్మచేత, (అహం=నేను), అమృతా=మరణములేనివాడనను, (ముక్తురాలను), స్యామితి = అగుదునా ఏమియని, ఉవాచహ = పలికెను. యాజ్ఞవల్క్యః=యాజ్ఞవల్క్యమహాఋషి. నేతి=లేదని, హోవాచ= పలికెను. (అట్లయిన ఏమి ప్రయోజనమనిన) ఉపకరణవతాం=సాధనములు గలవారలకు, (లోకే=లోకమునందు), జీవితం = జీవనము, యథైవ=ఏ ప్రకారముగానో, తథైవ=ఆ ప్రకారముగానే, తే=నీకు, విత్తేన=ధనముచేత, (ధనసాధ్యమైన కర్మముచేత), జీవితం=జీవనము, స్యాత్ =అగును. అమృతత్వస్యతు=మోక్షమునకైన, ఆశా=కోరిక, (మనసాపి=మనస్సుచేతను), నాస్తీతి=లేదని. (యాజ్ఞవల్క్య మహాఋషి, ఉవాచహ=పలికెను).

తా॥ ఇట్లు యాజ్ఞవల్క్యమహాఋషిచేత పలుకఁబడిన ఆ మైత్రేయి ఓ యాజ్ఞవల్క్యమహాఋషీ! సముద్రముచేత చుట్టఁబడిన ఈ సమస్త భూమియు ధనముచేత నిండిన దగునా! అట్టి ధనముచేత నేను ముక్తురాలనగుదునా యని పలుకఁగా ఆయన అట్లుకాదుగాని లోకమునందు సమస్త సాధనములు గలవారలకు సుఖజీవన మెట్లు కలుగునో ఆ విధముగానే నీకును ధనముచేత సుఖజీవనము కలుగును గాని మనస్సుతోనైనను మోక్షేచ్ఛ లేదని పలికెను.

ఉ॥ సా హోవాచ మైత్రేయీ యేనాహం నామృతా స్యాం కిమహం తేన కుర్యాం యదేవ భగవాన్వేద తదేవ మే బ్రూహీతి. ॥3॥

ప॥ సా - హ - ఉవాచ - మైత్రేయీ - యేన - అహం - న - అమృతా - స్యాం - కిం - అహం - తేన - కుర్యాం - యత్ - ఏవ - భగవాన్ - వేద - తత్ - ఏవ - మే - బ్రూహి - ఇతి.

ప్ర॥ సా=ఆ, మైత్రేయీ=మైత్రేయి, ఉవాచహ = పలికెను. యేన=ఏ ధనముచేత, అహం = నేను, అమృతా = ముక్తురాలను,

నస్యాం=కానో; తేన=అటువంటి ధనముతో, అహం=నేను, కిం=ఏమి, కుర్యాం=చేయుదును. భగవాన్=పూజ్యుడవగు నీవు, యదేవ=దేనినే, (ముక్తి సాధనమునుగా), వేద = తెలిసికొంటివో; తదేవ = దానినే, మే = నాకొఱకు. బ్రూహీతి = చెప్పుమాయని, (మైత్రేయి పలికెను).

తా॥ ఈ పూర్వము చెప్పిన ప్రకారము యాజ్ఞవల్క్యమహాఋషిచేత పలుకఁబడిన ఆ మైత్రేయి ఓ యాజ్ఞవల్క్యమహాఋషీ! నేను ఏ ధనముచేత ముక్తురాలను కానో; అట్టి ధనముతో నేను ఏమి చేయుదును. కనుక పూజ్యుఁడవగు నీవు మోక్షసాధనమని దేనినే తెలిసికొనియున్నావో, అట్టి మోక్షసాధనమునే నాకొఱకు చెప్పుమాయని పలికెను.

ఉ॥ స హోవాచ యాజ్ఞవల్క్యః ప్రియా బతారే నః సతీ ప్రియం భాషస ఏహ్యాస్స్వ వ్యాఖ్యాస్యామి తే వ్యాచక్షాణస్య తు మే నిదిధ్యాసస్వేతి. ॥4॥

ప॥ సః - హ - ఉవాచ - యాజ్ఞవల్క్యః - ప్రియా - బత - అరే - నః - సతీ - ప్రియం - భాషసే - ఏహి - ఆస్స్వ - వ్యాఖ్యాస్యామి - తే - వ్యాచక్షాణస్య - తు - మే - నిదిధ్యాసస్వ - ఇతి.

ప్ర॥ సః = ఆ, యాజ్ఞవల్క్యః = యాజ్ఞవల్క్యమహాఋషి, ఉవాచహ=పలికెను. బత=అయ్యో, అరే=ఓ మైత్రేయి, నః=మాకు, (పూర్వం = పూర్వము), ప్రియాసతీ = ఇష్టురాలవై, (ఇదానీమపి= ఇప్పుడును), ప్రియం=ఇష్టమును, భాషసే=పలుకుచున్నావు. ఏహి= రమ్ము, ఆస్స్వ=కూర్చుండుము. తే=నీకు, (ఇష్టం=ఇష్టమైన, అమృతత్వ సాధనం=మోక్షసాధనమైన, ఆత్మజ్ఞానం=బ్రహ్మజ్ఞానమును), వ్యాఖ్యాస్యామి= చెప్పెదను. వ్యాచక్షాణస్యతు= చెప్పుచున్న, మే=నాయొక్క (వాక్యాని=వాక్యములను), నిదిధ్యాసస్వేతి = ధ్యానింప నిచ్ఛయిుం

పుమా యని, నేను చెప్పిన వాక్యములను అర్థమువలన నిశ్చయముగా ధ్యానించుటకు కోరుమా యని, (ఉవాచ=పలికెను).

తా॥ ఇట్లు మైత్రేయి విత్తసాధ్యమైన మోక్షసాధనమును తిరస్కరింపఁగా ఆ యాజ్ఞవల్క్యమహాఋషి సంతోషించినవాఁడై ఓ మైత్రేయి! పూర్వము నాకు నీవు ఇష్టురాలవైతివి. ఆహా ఇప్పుడును ఇష్టమునే పలుకుచున్నావు. రమ్ము, కూర్చుండుము. నీకు ఇష్టమును మోక్షసాధనమునగు ఆత్మజ్ఞానమును చెప్పెదను. ఇట్లు చెప్పుచున్న నాయొక్క వాక్యములను అర్థముతో నిశ్చయముగా ధ్యానించుటకు కోరుమాయని పలికెను.

ఉ॥ స హోవాచ న వా అరే పత్యుః కామాయ పతిః ప్రియో భవత్యాత్మనస్తు కామాయ పతిః ప్రియో భవతి న వా అరే జాయాయై కామాయ జాయా ప్రియా భవత్యాత్మనస్తు కామాయ జాయా ప్రియా భవతి। న వా అరే పుత్రాణాం కామాయ పుత్రాః ప్రియా భవన్త్యాత్మనస్తు కామాయ పుత్రాః ప్రియా భవన్తి। న వా అరే విత్తస్య కామాయ విత్తం ప్రియం భవత్యాత్మనస్తు కామాయ విత్తం ప్రియం భవతి। న వా అరే బ్రహ్మణః కామాయ బ్రహ్మ ప్రియం భవత్యాత్మనస్తు కామాయ బ్రహ్మ ప్రియం భవతి। న వా అరే క్షత్రస్య కామాయ క్షత్రం ప్రియం భవత్యాత్మనస్తు కామాయ క్షత్రం ప్రియం భవతి। న వా అరే లోకానాం కామాయ లోకాః ప్రియా భవన్త్యాత్మనస్తు కామాయ లోకాః ప్రియా భవన్తి। న వా అరే దేవానాం కామాయ దేవాః ప్రియా భవన్త్యాత్మనస్తు కామాయ దేవాః ప్రియా భవన్తి। న వా అరే భూతానాం కామాయ భూతాని ప్రియాణి భవన్త్యాత్మనస్తు కామాయ భూతాని ప్రియాణి భవన్తి। న వా అరే సర్వస్య కామాయ సర్వం ప్రియం భవత్యాత్మనస్తు కామాయ సర్వం ప్రియం భవత్యాత్మా వా అరే ద్రష్టవ్యః శ్రోతవ్యో మన్తవ్యో నిదిధ్యాసితవ్యో మైత్రేయ్యాత్మనో వా అరే దర్శనేన శ్రవణేన మత్యా విజ్ఞానేనే

దగ్ సర్వం విదితమ్. ॥5॥

ప॥ సః - హ - ఉవాచ - న - వై-అరే-పత్యుః - కామాయ-పతిః - ప్రియః - భవతి - ఆత్మనః - తు - కామాయ - పతిః - ప్రియః - భవతి - న - వై - అరే - జాయాయై - కామాయ - జాయా - ప్రియా - భవతి - ఆత్మనః - తు - కామాయ - జాయా - ప్రియా భవతి - న - వై - అరే - పుత్రాణాం - కామాయ - పుత్రాః - ప్రియాః - భవన్తి - ఆత్మనః - తు - కామాయ - పుత్రాః - ప్రియాః - భవన్తి - న - వై - అరే - విత్తస్య - కామాయ - విత్తం - ప్రియం - భవతి - ఆత్మనః - తు - కామాయ - విత్తం-ప్రియం - భవతి - న - వై - అరే - బ్రహ్మణః - కామాయ - బ్రహ్మ - ప్రియం - భవతి - ఆత్మనః - తు - కామాయ - బ్రహ్మ-ప్రియం - భవతి - న - వై - అరే - క్షత్రస్య - కామాయ - క్షత్రం - ప్రియం - భవతి - ఆత్మనః - తు - కామాయ - క్షత్రం-ప్రియం - భవతి - న - వై - అరే - లోకానాం - కామాయ - లోకాః - ప్రియాః - భవన్తి - ఆత్మనః - తు - కామాయ - లోకాః - ప్రియాః - భవన్తి - న - వై - అరే - దేవానాం - కామాయ - దేవాః - ప్రియాః - భవన్తి - ఆత్మనః - తు - కామాయ - దేవాః - ప్రియాః - భవన్తి - న - వై - అరే - భూతానాం - కామాయ - భూతాని - ప్రియాణి - భవన్తి - ఆత్మనః-తు - కామాయ - భూతాని - ప్రియాణి - భవన్తి - న - వై - అరే - సర్వస్య - కామాయ - సర్వం - ప్రియం - భవతి - ఆత్మనః తు - కామాయ - సర్వం - ప్రియం - భవతి - ఆత్మా - వై - అరే - ద్రష్టవ్యః - శ్రోతవ్యః - మన్తవ్యః - నిదిధ్యాసితవ్యః - మైత్రేయి - ఆత్మనః - వై - అరే - దర్శనేన - శ్రవణేన - మత్యా-విజ్ఞానేన - ఇదం - సర్వం - విదితం.

ప్ర॥ సః=ఆ యాజ్ఞవల్క్యుడు, ఉవాచహ=పలికెను. అరే=

ఓ మైత్రేయి, వై = ప్రసిద్ధముగా, పత్యుః = పెనిమిటియొక్క, కామాయ=ప్రయోజనముకొఱకు, పతిః=పెనిమిటి, ప్రియః=ఇష్టమైనవాఁడు, నభవతి = కాఁడు. ఆత్మనస్తు=ఆత్మస్వరూపమురియొక్కయే, కామాయ=ప్రయోజనముకొఱకు, (భార్యాయాః=భార్యకు), పతిః=పెనిమిటి, ప్రియః=ఇష్టుఁడు, భవతి=అగుచున్నాఁడు. జాయాయై = భార్యయొక్క, కామాయ=ప్రయోజనముకొఱకు, జాయా= భార్య, ప్రియా=ఇష్టురాలు. నవై భవతి=కాదు ఆత్మనస్తు=ఆత్మస్వరూపముయొక్కయే, కామాయ=ప్రయోజనముకొఱకు, జాయా = భార్య (పత్యుః=పెనిమిటికి), ప్రియా=ఇష్టురాలు, భవతి=అగుచున్నది. అరే =ఓ మైత్రేయి, పుత్రాణాం=పుత్రులయొక్క, కామాయ= ప్రయోజనముకొఱకు, పుత్రాః=పుత్రులు, ప్రియాః=ఇష్టులు, నవై భవన్తి=కారు, ఆత్మనస్తు=ఆత్మస్వరూపముయొక్కయే, కామాయ=ప్రయోజనముకొఱకు, పుత్రాః=పుత్రులు, ప్రియాః=ఇష్టులు, భవన్తి=అగుచున్నారు. అరే=మైత్రేయి, విత్తస్య=ధనమురియొక్క, కామాయ=ప్రయోజనముకొఱకు, విత్తం=ధనము, ప్రియం=ఇష్టమైనది, నవై భవతి=కాదు. ఆత్మనస్తు=ఆత్మస్వరూపమురియొక్కయే, కామాయ=ప్రయోజనముకొఱకు, విత్తం=ధనము, ప్రియం=ఇష్టమైనది, భవతి=అగుచున్నది. అరే=మైత్రేయి, బ్రహ్మణః = బ్రాహ్మణునియొక్క, కామాయ=ప్రయోజనముకొఱకు, బ్రహ్మ=బ్రాహ్మణుఁడు, ప్రియం = ఇష్టుఁడు, నవై భవతి = కాఁడు. ఆత్మనస్తు = ఆత్మస్వరూపముయొక్కయే, కామాయ=ప్రయోజనముకొఱకు, బ్రహ్మ = బ్రాహ్మణుఁడు, ప్రియం=ప్రియుఁడు, భవతి = అగుచున్నాఁడు. అరే = ఓమైత్రేయి, క్షత్రస్య=క్షత్రియునియొక్క, కామాయ = ప్రయోజనముకొఱకు, క్షత్రం=క్షత్రియుఁడు, ప్రియం = ప్రియుఁడు, నవై భవతి = కాఁడు. ఆత్మనస్తు=ఆత్మస్వరూపముయొక్కయే, కామాయ=ప్రయోజనముకొఱకు, క్షత్రం=క్షత్రియుఁడు, ప్రియం = ప్రియుఁడు, భవతి=

అగుచున్నాడు అరే=మైత్రేయి, లోకానాం = లోకములయొక్క, కామాయ=ప్రయోజనముకొఱకు, లోకాః=లోకములు, ప్రియాః = ప్రియములు, నవై భవన్తి = కావు. ఆత్మనస్తు = ఆత్మస్వరూపము యొక్కయే, కామాయ = ప్రయోజనముకొఱకు, లోకాః = లోకములు, ప్రియాః = ప్రియములు, భవన్తి = అగుచున్నవి. అరే = మైత్రేయి, దేవానాం=దేవతలయొక్క, కామాయ=ప్రయోజనముకొఱకు, దేవాః=దేవతలు, ప్రియాః=ప్రియులు, నవై భవన్తి=కారు. ఆత్మనస్తు=ఆత్మస్వరూపముయొక్కయే, కామాయ = ప్రయోజనముకొఱకు. దేవాః=దేవతలు, ప్రియాః = ప్రియులు, భవన్తి = అగుచున్నారు. అరే = మైత్రేయి, భూతానాం = భూతములయొక్క, కామాయ=ప్రయోజనముకొఱకు, భూతాని=భూతములు, ప్రియాణి =ప్రియములు. నవై భవన్తి = కావు. ఆత్మనస్తు = ఆత్మస్వరూపము యొక్కయే, కామాయ=ప్రయోజనముకొఱకు, భూతాని = భూతములు, ప్రియాణి = ప్రియములు, భవన్తి = అగుచున్నవి. అరే = మైత్రేయి, సర్వస్య=సమస్తముయొక్క, కామాయ=ప్రయోజనముకొఱకు, సర్వం=సమస్తము, ప్రియం=ప్రియము, నవై భవతి=కాదు. ఆత్మనస్తు = ఆత్మస్వరూపముయొక్కయే, కామాయ=ప్రయోజనముకొఱకు, సర్వం=సమస్తము, ప్రియం=ప్రియము, భవతి=అగుచున్నది. అరే=మైత్రేయి, ఆత్మావై = ఆత్మస్వరూపమే, ద్రష్టవ్యః = చూడఁదగినది. (చూపునకు విషయముగా చేసికొనఁదగినది). శ్రోతవ్యః = వినఁదగినది. (ముందుగా ఆత్మస్వరూపము ఆచార్యునివలన వేదము నుండి విననలసినది). మన్తవ్యః=మననముచేయవలసినది. (శ్రవణానంతరము తర్కమువలన ఆత్మను ఊహింపవలయును). నిదిధ్యాసితవ్యః=నిశ్చయముగాధ్యానింప వలయును. (మననానంతరము ఆత్మను నిశ్చయముతో ధ్యానింపవలయును). అరే=మైత్రేయి, ఓ మైత్రేయి, ఆత్మనో వై=ఆత్మస్వరూపముయొక్కయే, దర్శనేన=చూచుటచేతను,

శ్రవణేన=వినుటచేతను, మత్యా=మననముచేతను, విజ్ఞానేన = విజ్ఞానముచేతను, ఇదంసర్వం= ఈ సమస్తము, విదితం=తెలియఁబడినది, (భవతి=అగుచున్నది).

తా॥ ఇట్లు ఆయాజ్ఞవల్క్యమహాఋషి తన భార్యయగు మైత్రేయిని స్తుతించి మోక్షసాధనమగు వైరాగ్యమును ఉపదేశించుటకు కోరినవాఁడై ఆసన్న్యాసముకొఱకు జాయాపుత్రాదులనుండి విరాగమును పుట్టించుచున్నాఁడు. ఓ మైత్రేయి లోకమునందు పెనిమిటి యొక్క ప్రయోజనముకొఱకు భార్యకు పెనిమిటి ప్రియుఁడుకాఁడు. మఱియేమనిన, ఆత్మప్రయోజనముకొఱకే భార్యకు పెనిమిటి ప్రియుఁడగుచున్నాఁడు. ఆప్రకారముగానే జాయాపుత్రవిత్తాదులన్నియును ఆత్మప్రయోజనముకొఱకే ప్రియములగుచున్నవి. ఇట్లు ఇతరమైన జాయాపుత్రాది సమస్తమునందుండెడిప్రీతి ఆత్మప్రాధాన్యమైనదియే గాని సహజమైనదిగాదు. కనుక ఆత్మప్రీతియే ముఖ్యమైనది. అందువలన ఆత్మస్వరూపమే చూడఁదగినది. ఆచార్యునివలన వినఁదగినది. మననముచేయఁదగినది. ధ్యానించఁదగినది యగుచున్నది. ఇట్లు శ్రవణ మనన నిదిధ్యాసనములను నిమిత్తములచేత ఆత్మ చూడఁబడినదగుచున్నది. ఆత్మయందు అజ్ఞానముచేత ఆరోపితజ్ఞానవిషయమైన బ్రహ్మక్షత్రాది కర్మనిమిత్తకమగు వర్ణాశ్రమాదిలక్షణము త్రాటియందు సర్పజ్ఞానమువలెనే కలుగుచున్నది. ఈ అజ్ఞానము ఆత్మస్వరూపముయొక్క శ్రవణ మనన నిది ధ్యాసనములచేత నివర్తించి సమస్తము తెలియఁబడినదై బ్రహ్మాత్మైక్యవిషయమగు సమ్యగ్దర్శనము (బ్రహ్మస్వరూపమే నేననెడి నిశ్చయజ్ఞానము) కలుగుచున్నదని యాజ్ఞవల్క్యమహాఋషి భార్యయగు మైత్రేయితో పలికెను.

ఉ॥ బ్రహ్మ తం పరాదాద్యోఽన్యత్రాత్మనో బ్రహ్మ వేద క్షత్రం తం పరాదాద్యోఽన్యత్రాత్మనః క్షత్రం వేద లోకాస్తం పరాదుర్యోఽన్యత్రాత్మనో లోకాన్వేద దేవాస్తం పరా దుర్యోఽ

న్యత్రాత్మనో దేవా న్వేద భూతాని తం పరాదుర్యోఽన్యత్రాత్మనో భూతాని వేద సర్వం తం పరాదాద్యోఽన్యత్రాత్మనః సర్వం వేదేదం బ్రహ్మేదం క్షత్రమిమే లోకా ఇమే దేవా ఇమాని భూతానీదగ్ సర్వం యదయమాత్మా. ॥6॥

బ్రహ్మ - తం పరాదాత్ - యః - అన్యత్ర-ఆత్మనః- బ్రహ్మ - వేద - క్షత్రం- తం - పరాదాత్ - యః - అన్యత్ర - ఆత్మనః - క్షత్రం - వేద - లోకాః - తం - పరాదుః - యః అన్యత్ర - ఆత్మనః - లోకాన్ - వేద - దేవాః - తం- పరాదుః- యః - అన్యత్ర - ఆత్మనః - దేవాణ్ - వేద - భూతాని-తం పరాదుః-యః - అన - ఆత్మనః - తాని - వేద - సర్వం - తం- పరాదాత్ - యః - అన్యత్ర - ఆత్మనః - సర్వం - వేద - ఇదం- బ్రహ్మ - ఇదం - క్షత్రం - ఇమే-లోకాః - ఇమే - దేవాః - ఇమాని - భూతాని - ఇదం - సర్వం - యత్ - అయం - ఆత్మా.

ప్ర॥ యః=ఎవఁడు, ఆత్మనః=ఆత్మస్వరూపముకంటె, అన్యత్ర= ఇతరమునందు, (వేరుగా), బ్రహ్మ=బ్రాహ్మణజాతిని, వేద = తెలిసికొనునో, తం=వానిని, బ్రహ్మ=బ్రాహ్మణజాతి, పరాదాత్ = అన్యముగా చేయును. యః=ఎవఁడు, క్షత్రం=క్షత్రియజాతిని, ఆత్మనోన్యత్ర= ఆత్మస్వరూపముకంటె వేరుగా, వేద=తెలిసికొనునో, తం = వానిని, క్షత్రం=క్షత్రియజాతి, పరాదాత్=అన్యముగా చేయును. యః=ఎవఁడు, లోకాణ్ = లోకములను, అన్యత్రాత్మనః = ఆత్మస్వరూపముకంటె వేరుగా, వేద=తెలిసికొనునో, తం=వానిని, లోకాః = లోకములు, పరాదుః=అన్యముగా చేయుచున్నవి. యః=ఎవఁడు, దేవాన్=దేవతలను, అన్యత్రాత్మనః=ఆత్మస్వరూపముకంటె వేరుగా, వేద = తెలిసికొనునో, తం=వానిని, దేవాః = దేవతలు, పరాదుః = అన్యముగా చేయుచున్నారు. యః=ఎవఁడు, భూతాని=భూతములను, అన్యత్రాత్మనః=ఆత్మస్వరూపముకంటె వేరుగా, వేద = తెలిసికొనునో, తం=

వానిని, భూతాని=భూతములు, పరాదుః=అన్యముగా చేయుచున్నవి. యః=ఎవఁడు, సర్వం=సమస్తమును, అన్యత్రాత్మనః=ఆత్మస్వరూపము కంటె వేరుగా, వేద=తెలిసికొనునో, తం=వానిని, సర్వం = సమస్తమున్ను, పరాదాత్=అన్యముగా చేయుచున్నది. ఇదం=ఈ, బ్రహ్మ= బ్రాహ్మణజాతియును, ఇదం=ఈ, క్షత్రం=క్షత్రియజాతియును, ఇమే= ఈ,లోకాః=లోకములును, ఇమే=ఈ, దేవాః=దేవతలును, ఇమాని= ఈ, భూతాని=భూతములును, ఇదం=ఈ, సర్వం=సమస్తమును, (ఈ కనఁబడెడి సర్వమును), యత్=ఏ కారణమువలన, అయం = ఈ, ఆత్మా=ఆత్మస్వరూపమైనదో, (సృష్టి సంహార స్థితి కాలములయందు ఈ సమస్తమును ఆత్మస్వరూపము వలన పుట్టుచు, ఆత్మస్వరూపమందు లీనమగుచు, స్థితికాలమునం దాత్మస్వరూపమై యున్నదో, తస్మాత్= ఆ కారణము వలన, సర్వం=సమస్తమును, ఆత్మైవ=ఆత్మస్వరూపమే, భవతి=అగుచున్నది).

తా॥ ఇంతకుపూర్వము శ్రవణ మనన నిదిధ్యాసములచేత ఆత్మస్వరూపము తెలియఁబడిన యెడల సమస్తమును తెలియఁబడుచున్నదని చెప్పఁబడినది. అదెట్లనఁగా ఆత్మయే సర్వస్వరూపము గనుక ఆ సర్వస్వరూపమైన ఆత్మ తెలియఁబడఁగా సర్వమును తెలియఁబడుచున్నది. ఆత్మ సర్వస్వరూప మెట్లగుననిన, ఎవఁడు ఈ బ్రాహ్మణ జాతిని క్షత్రియజాతిని లోకములను దేవతలను భూతములను మరియు నితరములగు సమస్తమును ఆత్మస్వరూపముకంటె వేరుగా చూచుచున్నాఁడో, వానిని ఈ బ్రాహ్మణాది సమస్తమును అన్యముగానే చేయుచున్నది. ఈ కనఁబడెడి బ్రహ్మక్షత్రాది సమస్తమును సృష్టికాలమునందాత్మవలన పుట్టి లయకాలమునందు ఆత్మయందే లీనమై స్థితికాలమునం దాత్మస్వరూపమై యున్నది. కాఁబట్టి ఆత్మకంటె వేరుగా ఏదియును తెలియఁబడదు. ఇట్లు తెలియఁబడకపోవుటవలన సర్వమును ఆత్మస్వరూపమయ్యే యున్నది. కనుక ఇట్లు ఆత్మను తెలిసి

కాని ఆత్మ తానగుటవలన సర్వము తెలియఁబడిన దగుచున్నది.

ఉ॥ స యథా దున్దుభేర్హన్యమానస్య న బాహ్యాఞ్ఛబ్దాన్ శక్నుయాద్గ్రహణాయ దున్దుభేస్తు గ్రహణేన దున్దుభ్యాఘాతస్య వా శబ్దో గృహీతః. ॥7॥

ప॥ సః - యథా - దున్దుభేః - హన్యమానస్య - న - బాహ్యాన్ - శబ్దాన్ - శక్నుయాత్ - గ్రహణాయ - దున్దుభేః - తు- గ్రహణేన - దున్దుభ్యాఘాతస్య - వా - శబ్దః - గృహీతః.

ప్ర॥ (లోకే=లోకమునందు), సః=అదృష్టాన్తము, యథా = ఏప్రకారమనగా,దున్దుభేః=భేరీ, హన్యమానస్య=కొట్టఁబడుచుండఁగా, బాహ్యాన్ = వెలుపలనైన, శబ్దాన్ = ధ్వనులను, గ్రహణాయ = గ్రహించుటకొఱకు, నశక్నుయాత్ = సమర్థముకాదు. దున్దుభేస్తు = భేరియొక్కయైనను, దున్దుభ్యాఘాతస్యవా = భేరికొట్టుటయొక్కయైనను, గ్రహణేన=గ్రహించుటచేతను, శబ్దః=ధ్వని, గృహీతః= గ్రహింపఁబడినది, (భవతి=అగుచున్నది).

తా॥ ఎట్లు ఈ సర్వము ఆత్మస్వరూపముగానే గ్రహించుటకు శక్యమగుచున్నది యనిన సర్వమును చిన్మాత్ర స్వరూపమును అనుసరించి పొందుటవలన అంతటను చిత్స్వరూపతయే తోఁచుచున్నది. దీనికే దృష్టాంతమిక్కడ చెప్పఁబడుచున్నది. అదెట్లనఁగా లోకమునందు దండము మొదలయిన దానిచేత భేర్యాదికము కొట్టఁబడఁగా బాహ్యశబ్దములు ఆభేరి ధ్వనిని అతిశయించినవి కాకపోవుటవలన, ఎట్లు గ్రహించుటకు శక్యములు కావో, భేరీని గ్రహించుటచేత శబ్దసామాన్య విశేషణముచే ఇవి భేరీధ్వనులని గ్రహించుటకును, భేరీ వాద్యమును తెలిసికొనుటచేతను, ఆ భేరీని పొందియున్న శబ్దవిశేషములు ఇవియనియును గ్రహించుటకు నెట్లు శక్యములగుచున్నవో, ఆ ప్రకారముగానే ప్రజ్ఞాన స్వరూపముకంటె వేఱుగా నేదియూ లేక పోవుటవలన స్వప్నజాగరములయందు దానికంటె వేరగు ఒకానొక

వస్తు విశేషమును గ్రహింపఁబడదు. కనుక ప్రజ్ఞాన స్వరూపమగు ఆత్మ స్వరూపమును తెలిసికొనుటచేత దానికంటె వేఱుగా ఏదియును లేదు. అందువలన సర్వము ఆత్మమాత్రమగుట యుక్తమగుచున్నది.

ఉ॥ స యథా శఙ్ఖస్య ధ్మాయమానస్య న బాహ్యాఞ్ఛబ్దాన్ శక్నుయాద్గ్రహణాయ । శఙ్ఖస్య తు గ్రహణేన శఙ్ఖధ్మస్య వా శబ్దో గృహీతః. ॥8॥

ప॥ సః - యథా-శఙ్ఖస్య-ధ్మాయమానస్య - న - బాహ్యాన్-శబ్దాన్ - శక్నుయాత్ - గ్రహణాయ - శఙ్ఖస్య - తు - గ్రహణేన - శఙ్ఖధ్మస్య - వా - శబ్దః - గృహీతః.

ప్ర॥ సః=అది, యథా=ఏప్రకారమనఁగా, శఙ్ఖస్య=శంఖము, ధ్మాయమానస్యసతః=పూరింపఁబడుచుండఁగా, బాహ్యాన్=వెలుపలనైన, శబ్దాన్ = శబ్దములను, గ్రహణాయ = తెలిసికొనుటకొఱకు, నశక్నుయాత్ = సమర్థము కాదు. శఙ్ఖస్యతు = శంఖముయొక్కయొ, గ్రహణేన=గ్రహించుటచేత, శఙ్ఖధ్మస్యవా = శంఖమును పూరించుటయొక్కయైనను, శబ్దః=ధ్వని, గృహీతః=గ్రహింపఁబడినది, (భవతి= అగుచున్నది).

తా॥ ఆభేరీదృష్టాంతమువలెనే ఇంకొక దృష్టాంతమిక్కడ చెప్పఁబడుచున్నది. అదియెట్లనిన లోకమునందు ఏ ప్రకారముగా శంఖము ధ్వనించుచుండఁగా బాహ్యములగు ధ్వనులు ఆధ్వనిని అతిక్రమించినవి కాకపోవుటవలన ఎట్లుగ్రహించుటకు శక్యములు కావో, శంఖమును గ్రహించుటచే శంఖమునూదుటచే కలిగిన శబ్దవిశేషములు నెట్లుగ్రహింపఁబడినవగునో, ఆప్రకారముగా ఆత్మస్వరూపము నతిక్రమించిన దేదియు లేకపోవుటవలన స్వప్నజాగరములయందు ఆ ఆత్మస్వరూపముకంటె వేఱగువస్తువిశేష మొకటియు గ్రహింపఁబడదు. కనుక ఆత్మస్వరూపమును తెలిసికొనుటచే దానికంటె వేఱగు విశేషమేదియును లేకపోవుటవలన సర్వము ఆత్మస్వరూపమగుచున్నది.

ఉ॥ స యథా వీణాయై వాద్యమానాయై న బాహ్యాఞ్ఛబ్దాన్ శక్ను యాద్గ్రహణాయ వీణాయై తు గ్రహణేన వీణావాదస్య వా శబ్దో గృహీతః. ॥9॥

ప॥ సః – యథా – వీణాయై – వాద్యమానాయై – న – బాహ్యాన్ – శబ్దాన్ – శక్నుయాత్ – గ్రహణాయ – వీణాయై – తు – గ్రహణేన – వీణావాద్యస్య – వా – శబ్దః – గృహీతః.

ప్ర॥ సః=అది, యథా = ఏప్రకారముగా, వీణాయై = వీణ, వాద్యమానాయై=వాయించుచుండఁగా, (ఇక్కడ షష్ఠీవిభక్తికి చతుర్థి విభక్తి చెప్పఁబడియున్నది). బాహ్యాన్=బాహ్యములగు, శబ్దాన్= శబ్దములను, గ్రహణాయ = గ్రహించుటకొఱకు, నశక్నుయాత్ = సమర్థముకాదు. వీణాయైతు = వీణయొక్కయే, గ్రహణేన = తెలిసి కొనుటచేత, వీణావాద్యస్యవా=వీణావాద్యము యొక్కయైనను, శబ్దః =ధ్వని, గృహీతః=గ్రహింపఁబడినది, (భవతి=అగుచున్నది).

తా॥ ఈ పూర్వము చెప్పిన భేరీశంఖదృష్టాంతములవలెనే ఇం కొక దృష్టాంతము చెప్పఁబడుచున్నది. అది ఎట్లనిన లోకమునందు వీణవాయించుచుండఁగా అన్యశబ్దములు దానినతిశయించినవి కాక పోవుటవలన గ్రహించుటకెట్లు శక్యములుకావో, వీణను గ్రహించుట చేత వీణావాద్యముయొక్క విశేషములును ఎట్లు గ్రహింపఁబడిన వగునో, ఆప్రకారముగా ఆత్మ నతిశయించిన దేదియు లేకపోవుట వలన సర్వము ఆత్మే యగుచున్నది. ఈ చెప్పఁబడిన భేరీశంఖవీణల యొక్క సామాన్య విశేషశబ్దములు వాని యందంతర్భూతములై వాని నతిక్రమించినవి కాకపోవుటవలన వానికి వేఱుగాక అవిగానె ఎట్లు గ్రహింపఁబడుచున్నవో ఆ ప్రకారముగానే స్థితికాలమునందు పరబ్రహ్మము, సామాన్యవిశేషములకు వేఱుకాకపోవుటవలన సర్వము పరబ్రహ్మమాత్రముగానే తెలిసికొనుటకు శక్యమగుచున్నది యని భావము).

ఉ॥ స యథార్ద్రైధాగ్నేర భ్యాహితాత్పృథగ్ధూమా వినిశ్చరన్త్యేవం వా అరేఽస్య మహతో భూతస్య నిశ్వసితమేతద్యదృగ్వేదో యజుర్వేదః సామవేదోఽథర్వాఙ్గిరస ఇతిహాసః పురాణం విద్యా ఉపనిషదః శ్లోకాః సూత్రాణ్యనువ్యాఖ్యానాని వ్యాఖ్యానాన్యస్యైవైతాని సర్వాణి నిశ్వసితాని. ॥10॥

ప॥ సః – యథా – ఆర్ద్రైధాగ్నేః – అభ్యాహితాత్ – పృథక్ – ధూమాః – వినిశ్చరన్తి – ఏవం – వై – అరే – అస్య – మహతః – భూతస్య – నిశ్వసితం – ఏతత్ – యత్ – ఋగ్వేదః – యజుర్వేదః – సామవేదః – అథర్వాఙ్గిరసః – ఇతిహాసః – పురాణం – విద్యా – ఉపనిషదః – శ్లోకాః – సూత్రాణి – అనువ్యాఖ్యానాని వ్యాఖ్యానాని – అస్య – ఏవ – ఏతాని – సర్వాణినిశ్వసితాని.

ప్ర॥ సః=అదృష్టాంతము, యథా=ఏ ప్రకారమనఁగా, అభ్యాహితాత్=ఉంచఁబడిన, ఆర్ద్రైధాగ్నేః=తడికట్టెలుగల అగ్నివలన, ధూమాః=పొగలు, (ఇక్కడపొగలని బహువచనముగా చెప్పుటచేత మిణుఁగురులు మొదలైనవియునుకూడ గ్రహింపవలయును). పృథక్=వేరుగా. (యథా = ఏప్రకారము), వినిశ్చరన్తి = బయలువెడలుచున్నవో, ఏవంవై=ఈప్రకారముగానే, అరే=ఓమైత్రేయి, అస్య=ఈ, మహతః=అనవచ్ఛిన్నమైన, (ఎడతెగని), భూతస్య=భూతముయొక్క, (పరమార్థముయొక్క), నిశ్వసితం = నిట్టూర్పువంటిది, ఏతత్=ఈ ముందు చెప్పునది, (భవతి=అగుచున్నది). ఋగ్వేదః=ఋగ్వేదమును, యజుర్వేదః=యజుర్వేదమును, సామవేదః = సామవేదమును, అథర్వాఙ్గిరసః=అథర్వవేదమును, ఇతిహాసః = ఇతిహాసమును, (ఊర్వశీపురూరవులయొక్క సంవాదము మొదలైన బ్రాహ్మణమే), పురాణం=పురాణమును, (ఈ ఉపనిషత్తులలోని అసద్వా ఇదమగ్ర ఆసీ దిత్యాదికములు), విద్యా = దేవ జన విద్య, (నృత్య

గీతాది శాస్త్రము), ఉపనిషదః=ఉపనిషత్తులు, శ్లోకాః=మంత్రములు, (బ్రాహ్మణములవలనఁబుట్టిన మంత్రములు), సూత్రాణి = పరమార్థ వస్తువును, చెప్పెడివాక్యములు. (వేదమునందు పరమాత్మస్వరూప మును చెప్పునట్టి, "ఆత్మేత్యేవోపాసీత" అనెడి మొదలైనవాక్య ములు), అనువ్యాఖ్యానాని = మంత్రములయొక్క వివరములును, వ్యాఖ్యానాని = అర్థవాదములును, (అర్థమును చెప్పునవి), యత్ = ఏవియో, ఏతానిసర్వాణి=ఇవియన్నియును, అస్యైవ = ఈపరమార్థ స్వరూపమగు మహాభూతముయొక్కయే, (ఈప్రకృతమైన పరమాత్మ యొక్కయే), నిశ్వసితాని = నిట్టూర్పులవంటివే, (భవతి = అగు చున్నవి. పురుషునియొక్క శ్వాసముల వలెనె ఇవియన్నియు అప్ర యత్నముగా పరమాత్మవలన కలుగుచున్నవి).

తా॥ ఉత్పత్తికాలమునందు ఉత్పత్తికంటె పూర్వము సర్వము పరబ్రహ్మమేయని తెలిసికొనుటకు శక్యమగుచున్నది. అది యెట్లఁ నగా లోకమునందు అగ్నిసంబంధములగు, అగ్నికణములు, పొగ, నిప్పు, జ్వాల, వీనియొక్క విభాగముకంటె పూర్వము అగ్నికి ఒకటే స్వరూపమగుట ఎట్లో అప్రకారముగానే నామ రూప వికారములు గల ఈ జగత్తుయొక్క ఉత్పత్తికంటె పూర్వము ఈ జగత్తు ప్రజ్ఞాన ఘనస్వరూపమగు పరమాత్మయై యున్నది యని గ్రహించుట యుక్తము. ఇట్లు ఏకస్వరూపమైన ఆపరమాత్మయె ఈ సమస్తమునకు కారణమని ఇంతకు పూర్వము చెప్పఁబడియున్నది. అది యెట్లనిన అదియే ఇక్కడ వివరింపఁబడుచున్నది. ఋగ్యజుస్సామాథర్వణము లును, ఇతిహాసమును, పురాణమును, నృత్తగీతాదిశాస్త్రమును, ఉప నిషత్తులును, మంత్రములును, పరమాత్మస్వరూపమును తెలియఁ జేసెడి వేదమునందలి వాక్యములును, మంత్రవివరణములును, వ్యాఖ్యా నములును ఇవియన్నియును లోకమునందు పురుషునియొక్క నిశ్వా సములవలెనె అప్రయత్నముగా పరమాత్మయొక్క నిశ్వాసముల

వంటివై ఆపరమాత్మవలన కలుగుచున్నవి. కనుక ఈసర్వము స్థితికాలమునందును ఈ చెప్పిన అగ్ని దృష్టాంతముచే పరబ్రహ్మమాత్రమై యున్నది.

ఉ॥ స యథా సర్వాసామపాగ్ సముద్ర ఏకాయనమేవగ్ సర్వేషాగ్ స్పర్శానాం త్వగేకాయనమేవగ్ సర్వేషాగ్ రసానాం జిహ్వైకాయనమేవగ్ సర్వేషాగ్ గన్ధానాగ్ నాసికై కాయనమేవగ్ సర్వేషాగ్ రూపాణాం చక్షురేకాయనమేవగ్ సర్వేషాగ్ శబ్దానాగ్ శ్రోత్రమేకాయనమేవగ్ సర్వేషాగ్ సఙ్కల్పానాగ్ మన ఏకాయనమేవగ్ సర్వాసాగ్ విద్యానాగ్ హృదయమేకాయనమేవగ్ సర్వేషాగ్ కర్మణాగ్ హస్తావేకాయనమేవగ్ సర్వేషామానన్దానాముపస్థ ఏకాయనమేవగ్ సర్వేషాగ్ విసర్గాణాగ్ పాయురేకాయనమేవగ్ సర్వేషామధ్వనాగ్ పాదావేకాయనమేవగ్ సర్వేషాగ్ వేదానాగ్ వాగేకాయనమ్. ॥11॥

ప॥ సః - యథా - సర్వాసాం - అపాం - సముద్రః - ఏకాయనం - ఏవం - సర్వేషాం - స్పర్శానాం - త్వక్ - ఏకాయనం - ఏవం - సర్వేషాం - రసానాం - జిహ్వా - ఏకాయనం - ఏవం - సర్వేషాం - గన్ధానాం - నాసికా - ఏకాయనం - ఏవం - సర్వేషాం - రూపాణాం - చక్షుః - ఏకాయనం - ఏవం - సర్వేషాం - శబ్దానాం - శ్రోత్రం - ఏకాయనం - ఏవం - సర్వేషాం - సఙ్కల్పానాం - మనః - ఏకాయనం - ఏవం - సర్వాసాం - విద్యానాం - హృదయం - ఏకాయనం - ఏవం - సర్వేషాం - కర్మణాం - హస్తౌ - ఏకాయనం - ఏవం - సర్వేషాం - ఆనన్దానాం - ఉపస్థః - ఏకాయనం - ఏవం - సర్వేషాం - విసర్గాణాం - పాయుః - ఏకాయనం - ఏవం - సర్వేషాం అధ్వనాం - పాదౌ - ఏకాయనం - ఏవం - సర్వేషాం - వేదానాం - వాక్ - ఏకాయనం.

ప్ర॥ సః=ఆ దృష్టాంతము, యథా=ఏప్రకారమనఁగా, సము

ద్రః=సముద్రము, సర్వాసాం=సమస్తములైన, అపాం=ఉదకములకు, (యథా=ఏప్రకారము), ఏకాయనం=ఒకటిగా పొందుట ప్రలయము, (అవిభాగముగా పొందునది, భవతి = అగుచున్నదో), ఏవం= ఈప్రకారముగానే, త్వక్=త్వగింద్రియము, సర్వేషాం = సమస్తములైన, స్పర్శానాం = స్పర్శములకు, (మృదు కఠినము మొదలైన స్పర్శములకు), ఏకాయనం = ప్రలయమైనది. ఏవం = ఈప్రకారముగానే, సర్వేషాం=సమస్తములైన, రసానాం = రసములకు, (ఉప్పు, పులుసు, కారము, తీపు, వగరు, చేదు, వీనికి), జిహ్వా = నాలుక, ఏకాయనం=ప్రలయమైనది. ఏవం=ఈప్రకారముగానే, సర్వేషాం= సమస్తములైన, గన్ధానాం=గంధములకు, నాసికా=ఘ్రాణము, ఏకాయనం=ప్రలయమైనది, ఏవం=ఈప్రకారముగానే, సర్వేషాం రూపాణాం=అన్నిరూపములకు, చక్షుః=నేత్రము, ఏకాయనం = ప్రలయమైనది. ఏవం=ఈప్రకారముగానే, సర్వేషాంశబ్దానాం=అన్నిశబ్దములకు, శ్రోత్రం=శ్రోత్రము, ఏకాయనం=ప్రలయమైనది. ఏవం=ఈప్రకారముగానే, సర్వేషాంసఙ్కల్పానాం=అన్నితలంపులకు, మనః = మనస్సు, ఏకాయనం=ప్రలయమైనది. ఏవం = ఈప్రకారముగానే, సర్వాసాం విద్యానాం=అన్నివిద్యలకు, హృదయం = హృదయము, (అవస్థావిశేషముతోఁ గూడుకొనిన మనస్సే హృదయమనఁబడుచున్నది). ఏకాయనం=ప్రలయమైనది. ఏవం = ఈప్రకారముగానే, సర్వేషాం కర్మాణాం=అన్నికర్మలకు, (అన్ని పనులకు), హస్తౌ=హస్తములు, ఏకాయనం = ప్రలయమైనది. ఏవం = ఈప్రకారముగానే, సర్వేషామానన్దానాం=అన్ని ఆనందములకు, ఉపస్థః=యోని, ఏకాయనం=ప్రలయమైనది. ఏవం=ఈప్రకారముగానే, సర్వేషాంవిసర్గాణాం=అన్ని విసర్గములకు, (వదలుటలన్నిటికి), పాయుః = గుదము, ఏకాయనం = ప్రలయమైనది. ఏవం=ఈప్రకారముగానే, సర్వేషామధ్వనాం=అన్నిమార్గములకు, పాదౌ = పాదములు, ఏకాయనం=

ప్రలయమైనది. ఏవం = ఈప్రకారముగానే, సర్వేషాం వేదానాం= అన్ని వేదములకు, వాక్=వాక్కు, ఏకాయనం=ప్రలయమైనది.

తా॥ ఇట్లు జగత్తు ప్రజ్ఞానఘనస్వరూపమగు ఆత్మకంటె వేఱుగా లేకపోవుటవలన జగత్తునకు ఉత్పత్తి స్థితికాలములయందు మాత్రమే పరమాత్మ స్వరూపమగుటకాదు. ప్రలయకాలమునందును ఆపరమాత్మయందే లీనమగుచున్న నామరూపక్రియాత్మకమైన జగత్తు, నీటిబుగ్గలు నుఱుగు మొదలైనవి, నీటికి అన్యములుగాక నీరే యైనట్లు, పరమాత్మస్వరూపముకంటె వేఱుకాకపోవుటవలన పరమాత్మస్వరూపమేయని తెలిసికొనఁదగినది. ఎట్లనిన ఏప్రకారముగా నదీ వాపీ తటాకాదులను పొందియున్న సమస్త ఉదకములకును సముద్రమే వేఱుకాని ఏకస్వరూపమును పొందుచు వానిని తనయందే లీనపఱుచుకొనుచు అవితానేయై యున్నదో, ఈప్రకారముగానే మృదు కఠినాది సమస్తస్పర్శములకు త్వక్కును, మధురామ్లాది సమస్తరసములకును జిహ్వయును, సమస్తగంధములకు నాసికయును, సమస్తరూపములకు నేత్రమును, అన్నిశబ్దములకు శ్రోత్రమును, తలంపులన్నిటికి మనస్సును, విద్యలన్నిటికి హృదయమును, కర్మలన్నిటికి హస్తములును, ఆనందములన్నిటికి యోనియును, విసర్గములన్నిటికి పాయువును, మార్గములన్నిటికి పాదములును, వేదములన్నిటికి వాక్కును, ఇవి తనుతమ విషయములగు ఈచెప్పఁబడిన స్పర్శరసగంధాదులు తమకు వేఱుకాకపోవుటవలన వానితో నైక్యమును పొందుచు వానిని తమయందే లీనపఱుచుకొనుచు ఆవిషయములు తామేయగుచున్నవి. ఇట్లు సర్వేంద్రియములును తమవిషయములన్నిటితోను క్రమముగా ప్రలయమును పొంది మనోమాత్రమై మనస్సు విజ్ఞానమాత్రమై, ఆవిజ్ఞానస్వరూపము నీటియందు సైంధవఘనమువలెనే నిరుపాధిక మగుటవలన ప్రజ్ఞాన ఘనస్వరూపమగు పరమాత్మయందు లీనమగుచున్నవి.

ఉ॥ స యథా సైన్ధవఖిల్య ఉదకే ప్రాస్త ఉదకమేవానువిలీయేత న హాస్యోద్గ్రహణాయేవ స్యాత్ యతో యతస్త్వాదదీత లవణమేవై వం వా అర ఇదం మహద్భూత మనన్తమపారం విజ్ఞానఘన ఏవ । ఏతేభ్యో భూతేభ్యః సముత్థాయ తాన్యేవాను వినశ్యతి న ప్రేత్య సంజ్ఞాస్తీత్యరే బ్రవీమీతి హోవాచ యాజ్ఞవల్క్యః॥12॥

ప॥ సః - యథా - సైన్ధవఖిల్యః - ఉదకే - ప్రాస్తః - ఉదకం - ఏవ - అను - విలీయేత - న - హ - అస్య - ఉద్గ్రహణాయ- ఇవ - స్యాత్ - యతః - యతః - తు - ఆదదీత - లవణం - ఏవ - ఏవం - వై - అరే - ఇదం - మహద్భూతం - అనన్తం - అపారం - విజ్ఞానఘనః - ఏవ - ఏతేభ్యః - భూతేభ్యః - సముత్థాయ - తాని - ఏవ - అనువినశ్యతి - న - ప్రేత్య - సంజ్ఞా - అస్తి - ఇతి- అరే - బ్రవీమి - ఇతి - హ - ఉవాచ - యాజ్ఞవల్క్యః.

ప్ర॥ సః=ఆదృష్టాన్తము, యథా=ఏప్రకారమనఁగా, సైన్ధవ ఖిల్యః=లవణశకలము, (ఉప్పుతాయి), (యథా=ఏప్రకారము), ఉదకే =నీటియందు, ప్రాస్తః=ఉంచఁబడినదై, ఉదకమేవ=నీటినే, అను= అనుసరించి, విలీయతే = లీనమగుచున్నదో; అస్య = ఈ లవణము యొక్క, (ఈ లవణమును). (సునిపుణోపి=మిక్కిలి సమర్థుఁడైనను), ఉద్గ్రహణాయ=ఎత్తిగ్రహించుటకు, న హేవస్యాత్=శక్తుఁడు కాఁడో, యతో యతః = ఏప్రదేశమునుండి, (తత్=ఆ ఉదకమును), ఆద దీత=గ్రహించి రుచిచూచునో, (ఆయాప్రదేశమునందంతయు, తత్= ఆ ఉదకము), లవణమేవ = ఉప్పుగానే, (భవతి = అగుచున్నదో), (తిరిగి ఉప్పుతాయి కాదో), ఏవంవై = ఈప్రకారముగానే, అరే= ఓ మైత్రేయి, ఇదం=ఈ, మహద్భూతం=గొప్ప పారమార్థిక స్వరూ పమును, (ఇక్కడ భూతశబ్దమునకు పారమార్థికమర్థము), అనన్తం= అంతము లేనిదియును, అపారం=దట్టనైనదియునగు, విజ్ఞానఘనఏవ= విజ్ఞానఘనస్వరూపమే. (విశేషజ్ఞానములయొక్క ఏకీభావమె=విజ్ఞాన

సారమగు జీవస్వరూపము), ఏతేభ్యః=ఈ, భూతేభ్యః = భూతముల నుండి, (సత్యశబ్దముచేత చెప్పఁబడిన భూతముల వలన), సముత్థాయ =పుట్టి, తాన్యేవ=ఆభూతములనే, అనువినశ్యతి=అనుసరించి నశించుచున్నది. ప్రేత్య = మరణమును పొంది, సంజ్ఞా=సంజ్ఞ, (దేహేంద్రియాది సముదాయమునుండి విడువఁబడిన ఈ విజ్ఞానఘనస్వరూపుఁడగు, జీవునికి, నేను, వీఁడు, వీనిపుత్రుఁడు, సాధనము, నాక్షేత్రము, నేను సుఖముగలవాఁడను, నేను దుఃఖముగలవాఁడను అనెడి ఈ మొదలైన సంజ్ఞ), నాస్తి=లేదు, ఇతి=ఈప్రకారము, అరే=ఓ మైత్రేయి బ్రవీమితి=చెప్పుచున్నానని, యాజ్ఞవల్క్యః = యాజ్ఞవల్క్యుఁడు, హోవాచ = పలికెను.

తా॥ ఇంతకుపూర్వము ఈసమస్తము ఉత్పత్తి స్థితి లయముల యందు ప్రజ్ఞానఘనస్వరూపముకంటె వేఱుగా లేకపోవుటవలన ఆత్మస్వరూపమేయని ప్రతిజ్ఞ చేయఁబడినదానిని ఇంతవఱకు యుక్తివలన సాధింపఁబడినది. బ్రహ్మవేత్తలకు బ్రహ్మవిద్యా నిమిత్తకమైన బుద్ధిపూర్వకమగు ఈ ఆత్యన్తిక ప్రళయమునందు దృష్టాంతము చెప్పఁబడుచున్నది. అది ఎట్లనఁగా, నీళ్లవలనఁబుట్టిన ఉప్పుతాయి ఆ నీటియందుంచఁబడి తిరిగి ఆ ఉప్పురాతినిగా నీటినుండి తీయుటకు ఎంత నిపుణుఁడైనను సమర్థుఁడు గాక ఆ నీటిని రుచిచూచి ఉప్పుగా తెలిసికొనుచున్నాఁడో, ఈప్రకారముగానే గొప్ప పారమార్థిక స్వరూపమును నాశనములేనిదియు నగు విజ్ఞానఘనస్వరూపమైన ఈజీవాత్మయె నీటివలన కలిగిన సూర్యచంద్రాది ప్రతిబింబమువలెను స్వచ్ఛమగు స్ఫటికమునకు రక్తపీతాదివస్తుసంయోగమువలన కలిగిన రక్తపీతాది భావమువలెను, నామరూపాత్మకములై దేహేంద్రియ విషయాకారములుగా పరిణమించిన సత్యశబ్దవాచ్యములగు భూతములనుండి నీటివలన ఉప్పుగడ్డవలెనె (అజ్ఞానముచే నామరూపాత్మకమై పుట్టి ఆ దేహేంద్రియ విషయాకారములుగా పరిణమించిన భూతములు

శాస్త్రాచార్యోపదేశము చేతనైన బ్రహ్మవిద్యచేత నదీసముద్రము వలెనే చిక్కలి లీనపఱుపఁబడినపై సలిల ఫేన బుద్బుదాదికమువలెనే నశించుచుండఁగా అజ్ఞానముచే నామరూపాత్మకంబగు ఆ జీవభావము సూర్యాదిప్రతిబింబములకు హేతువులగు నీళ్లును స్ఫటికమును రక్త పీతాది వస్తుసంయోగమును లేనప్పుడు సూర్యచంద్రస్ఫటికములు మొదలైన వానియొక్క ప్రతిబింబములవలెనె నశించుచున్నది. ఇట్లు నశించి కేవల బింబభూతములైన సూర్యచంద్రస్ఫటికములవలెనె జీవాత్మ, బ్రహ్మజ్ఞానముచేత భూతములు నశింపఁగా తానును నశించి, అంతములేనిదియును దట్టమైనదియును, స్వచ్ఛమైనదియునగు ప్రజ్ఞాన ఘనస్వరూపమగు పరమాత్మయై యున్నది.

ఇట్లు ఓ మైత్రేయి ! దేహేంద్రియాది సముదాయముల వలన ముక్తినిపొంది పరమాత్మస్వరూపమైనవానికి. నేను, వీఁడు, వీని పుత్రుఁడు, నాక్షేత్రము, నాధనము, నేను సుఖముగలవాఁడను, నేను దుఃఖముగలవాఁడను అనెడి ఈ మొదలైన చిహ్నములుగల విశేష సంజ్ఞలేదని యాజ్ఞవల్క్యమహాఋషి భార్యయైనమైత్రేయి కొఱకు పరమార్థస్వరూపమును చెప్పెను.

ఉ॥ సా హోవాచ మైత్రేయ్యత్రైవ మా భగవాన మూముహాన్న
ప్రేత్య సంజ్ఞాస్తీతి స హోవాచ యాజ్ఞవల్క్యో న వా అరేఽహం
మోహం బ్రవీమ్యలం వా అర ఇదం విజ్ఞానాయ. ॥13॥

ప॥ సా - హ - ఉవాచ - మైత్రేయీ - అత్ర - ఏవ - మా - భగవాన్ - అమూముహత్ - న - ప్రేత్య - సంజ్ఞా - అస్తి - ఇతి - సః - హ - ఉవాచ - యాజ్ఞవల్క్యః - న - వై - అరే - అహం - మోహం - బ్రవీమి - అలం - వై - అరె - ఇదం - విజ్ఞానాయ.

ప్ర॥ సా=ఆ, మైత్రేయీ=మైత్రేయి, భగవాన్ = పూజ్యుఁడ వైన నీవు, మా=నన్ను, అత్రైవ=ఈపరబ్రహ్మమునందే, ప్రేత్య=మర

ణమునుపొంది, సంజ్ఞా=సంజ్ఞ, (నేను, వీడు, అనెడి ఈ మొదలైన లక్షణముగల విశేషసంజ్ఞ), నా స్తీతి=లేదని, అమూముహాత్=భ్రమ పెట్టితివియని, హోవాచ=పలికెను. సః=ఆ, యాజ్ఞవల్క్యః=యాజ్ఞ వల్క్యఋషి. అరే=ఓమైత్రేయి, అహం=నేను, మోహం=భ్రమను, నబ్రవీమి=చెప్పలేదని, హోవాచ=పలికెను. అరే = మైత్రేయి, ఇదం=ఈ చెప్పఁబడిన విజ్ఞానఘనస్వరూపమును, విజ్ఞానాయ = తెలిసి కొనుటకొఱకు, అలంవై=సమర్థమగుచున్నది.

తా॥ ఇట్లు పరమాత్మస్వరూపమును బోధింపబడిన ఆ మైత్రేయి ఓ యాజ్ఞవల్క్యుఁడా ! పరబ్రహ్మమునందు విరుద్ధధర్మము కలుగుటను చెప్పుచున్న నీచేతను నాకు భ్రాంతికలుగఁ జేయఁబడినది. ఎట్లనఁగా పూర్వము జీవాత్మ విజ్ఞానఘనస్వరూపమేయని ప్రతిజ్ఞచేసి, తిరిగి ఆ జీవాత్మను, మరణమును పొందినతరువాత, నేను వీఁడు అనెడి ఈ మొదలైన చిహ్నగల విశేషజ్ఞానములేదని పలికితివి. కనుక ఒకటియగు అగ్ని, శీతోష్ణములును విరుద్ధములగు రెండు ధర్మములు కలది కాదనెడి యభిప్రాయముచేత నీవు చెప్పిన పరబ్రహ్మవిషయమై మూఢురాలనైతినని పలికెను. ఇట్లు పలుకఁబడినయాజ్ఞవల్క్యుఁడు ఓ మైత్రేయీ! నేను ఒక ధర్మముగల వస్తువునందు అట్లు మోహరూపమైన వాక్యమును పలుకలేదు. నీవు భ్రాంతిచేత ఒకవస్తువును విరుద్ధధర్మముగా గ్రహించినావు. ఎట్లనఁగా అజ్ఞానముచేత కలిగిన దేహేంద్రియసంబంధమైన ఆత్మకు దేహేంద్రియాత్మకమగు జీవభావము కలిగినది. అది జ్ఞానముచేత నశింపఁగా ఆజీవభావనిమిత్తకమగు శరీరాది సంబంధమైన నేను, వీఁడు అనెడిసంజ్ఞ, దేహేంద్రియ సంఘాతరూపమైన ఉపాధిలేకపోఁగా ఉదకము మొదలైన ఆధారములు లేనప్పుడు చంద్రాదిప్రతిబింబములవలెనె నశించుచున్నది. కేవలబింబ భూతములైన చంద్రాదిత్యులవలెనె అసంసారి బ్రహ్మస్వరూపమైన విజ్ఞానఘనస్వరూపమునకు నాశములేదు. అట్టి పరబ్రహ్మస్వరూపమే

విజ్ఞానఘనమని చెప్పఁబడుచున్నది. ఆ ఆత్మస్వరూపమె ఈ సమస్తమై జగత్తుయొక్క నాశమునుండి నశింపకయుండునది. ఇదియె ఓ మైత్రేయి! ఇదివఱకు నేను చెప్పిన అనంతమును అపారమునగు విజ్ఞానఘనస్వరూపమైన ఆత్మ. ఇది తెలిసికొనుటకు సమర్థ మగుచున్నది.

ఉ॥ యత్ర హి ద్వైతమివ భవతి తదితర ఇతరం పశ్యతి తదితర ఇతరం జిఘ్రతి తదితర ఇతరగ్ శృణోతి తదితర ఇతర మభివదతి తదితర ఇతరం మనుతే తదితర ఇతరం విజానాతి యత్ర వా అస్య సర్వమాత్మైవాభూత్తత్కేన కం జిఘ్రేత్తత్కేన కం పశ్యేత్తత్కేన కగ్ శృణుయాత్తత్కేన కమభివదేత్తత్కేన కం మన్వీత తత్కేన కం విజానీయాత్ । యేనేదగ్ సర్వం విజానాతి తం కేన విజానీయాత్ విజ్ఞాతారమరే కేన విజానీయాదితి. ॥14॥

ఇతి చతుర్థాధ్యాయే చతుర్థ బ్రాహ్మణమ్.

ప॥ యత్ర - హి - ద్వైతం - ఇవ - భవతి - తత్ - ఇతరః - ఇతరం - పశ్యతి - తత్ - ఇతరః - ఇతరం - జిఘ్రతి - తత్ - ఇతరః - ఇతరం - శృణోతి - తత్ - ఇతరః - ఇతరం - అభివదతి - తత్ - ఇతరః - ఇతరం - మనుతే - తత్ - ఇతరః - ఇతరం - విజానాతి - యత్ర - వై - అస్య - సర్వం - ఆత్మా - ఏవ - అభూత్ - తత్ - కేన - కం - జిఘ్రేత్ - తత్ - కేన - కం - పశ్యేత్ - తత్ - కేన - కం - శృణుయాత్ - తత్ - కేన- కం - అభివదేత్ - తత్ - కేన - కం - మన్వీత - తత్ - కేన- కం - విజానీయాత్ - యేన - ఇదం - సర్వం - విజానాతి - తం - కేన - విజానీయాత్ - విజ్ఞాతారం - అరే - కేన - విజానీయాత్ - ఇతి.

ప్ర॥ యత్ర = ఏ పరబ్రహ్మమునందు, (అవిద్యా కల్పితమైన దేహేంద్రియ సంఘాతోపాధివలనఁ బుట్టిన విశేషాత్మయందు, జీవుని యందు), సర్వం=సమస్తము, ఆత్మనః=పరమాత్మ స్వరూపముకంటె),

ద్వైతమివ = భిన్నమైనదివలెనె, భవతి = అగుచున్నదో; (పరమార్థముగా అద్వైతమగు పరబ్రహ్మమునందు ఆత్మకంటె భిన్నమైన మరియొక వస్తువు వలెనె అగుచున్నదో), తత్=దానియందు, ఇతరః=అన్యుఁడగు చూచెడివాఁడు. (యథార్థమైన చంద్రాదులకంటె వేఱగు ఉదకమునందలి చంద్రాది ప్రతిబింబమువలెనె యథార్థమగు పరమాత్మకంటె వేఱగు అంతఃకరణమునందలి పరమాత్మ ప్రతిబింబమగు, జీవుఁడు=చూచెడి జీవాత్మ), ఇతరం=అన్యమగు చూడఁదగిన రూపమును, పశ్యతి = చూచుచున్నాఁడు. (జీవుఁడు చక్షురాదీంద్రియములద్వారా చూడఁదగిన రూపాదికములను చూచుచున్నాఁడు). తత్=దానియందు, ఇతరః=అన్యుఁడగు ఆఘ్రాణించెడివాఁడు, ఇతరం =అన్యమగు ఆఘ్రాణింపఁదగిన గంధమును, జిఘ్రతి = ఆఘ్రాణించుచున్నాఁడు. తత్=దానియందు, ఇతరః=అన్యుఁడగు వినెడివాఁడు, ఇతరం=అన్యమగు వినఁదగినదానిని, శృణోతి=వినుచున్నాఁడు. తత్ =దానియందు, ఇతరః=అన్యుఁడగు పలికెడువాఁడు, ఇతరం = అన్యమగు పలుకఁదగినదానిని, అభివదతి=పలుకుచున్నాఁడు, తత్=దానియందు, ఇతరః=అన్యుఁడగు తలంచెడివాఁడు, ఇతరం = అన్యమగు తలంపఁదగినదానిని, మనుతే = తలంచుచున్నాఁడు. తత్ = దానియందు, ఇతరః=అన్యుఁడగు తెలిసికొనెడివాఁడు, ఇతరం=అన్యమగు తెలిసికొనఁదగినదానిని, విజానాతి = తెలిసికొనుచున్నాఁడు. అస్య= ఈబ్రహ్మవేత్తకు. యత్రత్వై=దేనియందే, సర్వం = సమస్తమును, ఆత్మైవ=ఆత్మస్వరూపముగానే, అభూత్ = ఆయెనో, తత్ = దానియందు, కేన=దేనిచేత, కం=దేనిని, జిఘ్రేత్=ఆఘ్రాణించును. తత్ =దానియందు, కేన=దేనిచేత, కం=దేనిని, పశ్యేత్ = చూచును. తత్=దానియందు, కేన=దేనిచేత, కం=దేనిని, శృణుయాత్=వినును. తత్=దానియందు, కేన=దేనిచేత, కం=దేనిని, అభివదేత్ = పలుకును. తత్=దానియందు, కేన=దేనిచేత, కం=దేనిని, మన్వీత=తలం

చును. తత్=దానియందు, కేన=దేనిచేత, కం=దేనిని, విజానీయాత్ =తెలిసికొనును. (తత్రాపి=దానియందును), యేన=దేనిచేత, ఇదం= ఈ, సర్వం=సమస్తమును, విజానాతి = తెలిసికొనుచున్నాడో, తం= దానిని, కేన=దేనిచేత, విజానీయాత్=తెలిసికొనును. (సర్వము ఆత్మ మాత్రమైనపుడు దేనిచేతను దేనిని ఎవడును అతిప్రయత్నముచేసనైనను చూడనేలేడు), అరే=ఓమైత్రేయి, విజ్ఞాతారం=తెలిసికొనెడి వానిని, కేన = దేనిచేతను, విజానీయాత్ = తెలిసికొనవచ్చును. ఇతి= సమాప్తము.

తా॥ ఓ మైత్రేయి! నీయే ఇదివఱకు నేను చెప్పిన అనంతమును అపారమునగు విజ్ఞానఘనస్వరూపమైన ఆత్మ, ఇది తెలిసికొనుటకు నశక్యమగుచున్నదని యాజ్ఞవల్క్య మహాఋషి చెప్పెను, ఇప్పుడు ఇదివఱకు విజ్ఞానఘనస్వరూపమని చెప్పిన కేవలాత్మకు అజ్ఞానము వలన నానారూపక్రియాత్మకమైన దేహేంద్రియాది సంబంధముచేత కలిగిన జీవభావమునందు, నేను, వీఁడు, అనెడి ఈ మొదలైన ద్వైతజ్ఞానము కలుగుచున్నది. బ్రహ్మజ్ఞానముచేత ఆ నానారూపక్రియాత్మకమగు దేహేంద్రియాది సంబంధమువల్లనైన జీవభావము నశింపగా, నేను, వీఁడు, అనెడి ఈ మొదలైన ద్వైతజ్ఞానమును నశించుచున్నదని నేను చెప్పిన వాక్యమునకు ఓ మైత్రేయి! నీవు లోకమునందు అగ్నియందు విరుద్ధధర్మములగు శీతోష్ణములు రెండును ఎట్లుండవో అట్లే విజ్ఞానఘనస్వరూపమైన ఆత్మకు, ఒకప్పుడు, నేను, వీఁడు, అనెడి ఈ మొదలైన ద్వైతజ్ఞానము కలుగుటయును, ఒకప్పుడు ఆ ద్వైతజ్ఞానము లేదని చెప్పుటయును విరుద్ధమని నీకు కలిగిన సందేహమునకు సమాధానమును చెప్పుచున్నాను. వినుము. అవిద్యచేత కల్పింపఁబడిన దేహేంద్రియ సంఘాతోపాధివలనఁబుట్టిన జీవభావమునందు ఆత్మసర్వమును ద్వైతమునువలెనే అగుచున్నది. అప్పుడు, చూచుట, ఆఘ్రాణించుట, వినుట, పలుకుట, తలంచుట, తెలిసికొనుట, ఈ మొద

లైన ద్వైతజ్ఞానము కలుగుచున్నది. ఎప్పుడు బ్రహ్మవేత్తకు బ్రహ్మజ్ఞానముచేత సర్వము ఆత్మమాత్రమగుచున్నదో; అప్పుడు దేనిచేత దేనిని చూచును. దేనిచేత దేనిని ఆఘ్రాణించును. దేనిచేత దేనిని పలుకును. దేనిచేత దేనిని వినును, దేనిచేత దేనిని తలంచును. దేనిచేత దేనిని తెలిసికొనును. ఎవనిచేత సర్వమును తెలిసికొనఁబడుచున్నదో; వానిని దేనిచేత తెలిసికొనవచ్చును. ఓ మైత్రేయి! సర్వమును తెలిసికొనునది విజ్ఞానమయాత్మయే; దానిని తెలిసికొనునది వేఱొకటి లేకపోవుటవలన జ్ఞానముచేత సర్వముతానైనప్పుడు బ్రహ్మవేత్తయొక్క ఈ సర్వమును తెలిసికొనెడి విజ్ఞాతృస్వరూపమగు విజ్ఞానమయాత్మ, కేవల అద్వయస్వరూపమై విజ్ఞానఘనస్వరూప మగుచున్నది. అప్పుడు అజ్ఞానమువలనకలిగెడు, నేను, వీఁడు, ఈ మొదలైన లక్షణముగల విశేషజ్ఞాన సంజ్ఞ లేదని చెప్పుట విరోధము కాదని భార్యయైనమైత్రేయితో యాజ్ఞవల్క్యఋషి చెప్పెను.

ఇట్లు చతుర్థాధ్యాయమునందు చతుర్థబ్రాహ్మణము సమాప్తము.



## చతుర్థాధ్యాయము, పఞ్చమబ్రాహ్మణము

**మ॥ ఇయం** పృథివీ సర్వేషాం భూతానాం మధ్వస్యై పృథివ్యై సర్వాణి భూతాని మధు యశ్చాయమస్యాం పృథివ్యాం తేజోమయో ఽమృతమయః పురుషో యశ్చాయమధ్యాత్మగ్ శారీరస్తేజోమయో ఽమృతమయః పురుషో ఽయమేవ స యో ఽయమాత్మేదమమృతమిదం బ్రహ్మేదగ్ సర్వమ్. ॥1॥

ప॥ ఇయం – పృథివీ – సర్వేషాం – భూతానాం – మధు – అస్యై – పృథివ్యై – సర్వాణి – భూతాని – మధు – యః – చ – అయం – అస్యాం – పృథివ్యాం – తేజోమయః – అమృతమయః – పురుషః – యః – చ – అయం – అధ్యాత్మం – శారీరః – తేజోమయః – అమృతమయః – పురుషః – అయం – ఏవ – సః – యః –

అయం - ఆత్మా - ఇదం - అమృతం - ఇదం - బ్రహ్మ - ఇదం - సర్వం.

ప్ర॥ ఇయం=ఈ, పృథివీ=భూమి, సర్వేషాం=సమస్తములైన, భూతానాం=భూతములయొక్క, (బ్రహ్మమొదలుకొని తృణ పర్యంత ముండెడి జీవుల యొక్క), మధు=మధుస్వరూపమైనది. (కార్యము), సర్వాణి=సమస్తములైన, భూతాని=భూతములను, అస్యై=ఈ; పృథివ్యై = భూమియొక్క, మధు = మధుస్వరూపమైనది. అస్యాం = ఈ, పృథివ్యాం=భూమియందు, తేజోమయః=తేజోరూపమైన, అమృతమయః=అమృతస్వరూపమైన, అయం = ఈ, పురుషః=పురుషుఁడు, యః=ఎవఁడో, అయం=ఈ, అధ్యాత్మం=అధ్యాత్మస్వరూపమునందు, (దేహేంద్రియ సంఘాతకర్తయందు), శారీరం = శరీరమందైన, తేజోమయః = తేజోరూపమైన, అమృతమయః = అమృతస్వరూపమైన, పురుషః=పురుషుఁడును, యః=ఎవఁడో, (లింగశరీరాభిమానియైన ఈజీవుఁడు), అయమేవ=ఈ పురుషుఁడే, సః = ఆ ఆత్మస్వరూపము, (ఇదివరకు సర్వము ఆత్మస్వరూపమేయని ప్రతిజ్ఞ చేయఁబడిన ఆత్మ), యః=ఏది, అయం = ఈ, ఆత్మా = ఆత్మస్వరూపము, ఇదం=ఇది, (మైత్రేయికొఱకు అమృతత్వసాధనరూపమైన యే ఆత్మవిజ్ఞానము చెప్పఁబడినదో ఇది), అమృతం=అమృతస్వరూపము. ఇదం = ఇది, బ్రహ్మ = పరబ్రహ్మస్వరూపము. ఇదం = ఇది, సర్వం = సమస్తము, (భవతి=అగుచున్నది).

తా॥ కర్మను కోరనటువంటి మోక్షసాధనమైన ఆత్మజ్ఞానమేదియో దానిని చెప్పవలయునని మైత్రేయీ బ్రాహ్మణ మారంభింపఁబడినది. ఆ ఆత్మజ్ఞానము సర్వసన్న్యాసాంగముతోఁ గూడుకొన్నది. అట్టి ఆత్మ తెలియఁబడుచుండఁగా, సమస్తము తెలియఁబడినదగుచున్నది. సమస్తమునకంటె ఆత్మస్వరూపము ప్రియమైనది. గనుక ఆత్మచూడఁదగినదియును, వినఁదగినదియును, మననమును

చేయఁదగినదియును నిదిధ్యాసనము చేయఁదగినదియునని ఆ ఆత్మ దర్శనముయొక్క రీతులు చెప్పఁబడినవి. వానిలో ఆచార్యాగమము వలన వినఁదగినదనిన్ని తర్కమువలన మననము చేయఁదగినదనిన్ని చెప్పఁబడినది. అందుకు ఇంతకు పూర్వము, ఈ సమస్తము ఆత్మేయని ప్రతిజ్ఞ చేసినదానికి ఆత్మే ఉత్పత్తి స్థితి లయాదులకు కారణమై యున్నది. అట్టి కారణమసిద్ధమని శంకించెడి శంక నివర్తించుటకు ఈ మధుబ్రాహ్మణము ప్రారంభింపఁబడినది. ఎట్లనఁగా లోకమునందు ఈ పృథివ్యాది జగత్తంతయు పరస్పరోపకార్యోపకారకమైనది. ఇట్లు పరస్పరోపకార్యోపకారకమైన దంతయు ఏకకారణపూర్వకమును ఏకసామాన్యాత్మకమును ఏకప్రళయత్వమునై చూడఁబడుచున్నది. గనుక పృథివ్యాదిలక్షణమైన ఈ జగత్తంతయును పరస్పరమున్ను కార్యకారణమగుటవలన అదేప్రకారమగుటకు తగియున్నది. ఈ అర్థమే ఈ బ్రాహ్మణమునందు ప్రకాశింపఁజేయఁబడుచున్నది. ఎట్లనఁగా ఈ ప్రసిద్ధమగుభూమి బ్రహ్మమొదలుకొని స్తంబపర్యంతనుం డెడి సమస్త ప్రాణులయొక్క కార్యమైనది. సమస్తభూతములున్ను ఈ భూమియొక్క కార్యము. ఈ భూమియందలి తేజోస్వరూపుఁడును అమృతస్వరూపుడునగు ఈపురుషుఁడును దేహేంద్రియ సముదాయకర్తయంచు ఈ శరీరమునందలి తేజోస్వరూపుడును అమృతస్వరూపుఁడునగు లింగశరీరాభిమానియైన జీవుఁడును, ఇంతకు పూర్వము, "ఇదం సర్వం యదయమాత్మా" యని ప్రతిజ్ఞ చేయఁబడిన ఆ ఆత్మస్వరూపమే యీ ఆత్మస్వరూపమే మైత్రేయికొఱకు చెప్పఁబడిన అమృతత్వ సాధనరూపమైన ఆత్మవిజ్ఞానము. ఇదియే అమృతస్వరూపము. ఇదియే పరబ్రహ్మస్వరూపము. ఇదియే సమస్తమునగుచున్నది.

ఉ॥ ఇమా ఆపస్సర్వేషాం భూతానాం మధ్వాసామపాగ్ సర్వాణి భూతాని మధు యశ్చాయమాస్వప్సు తేజోమయోఽమృత

మయః పురుషో యశ్చాయమధ్యాత్మగ్ రై(రే) తసస్తేజోమయోఽ మృతమయః పురుషోఽయమేవ స యోఽయమాత్మేదమమృత మిదం బ్రహ్మేదగ్ సర్వమ్. ॥2॥

ప॥ ఇమాః - ఆపః - సర్వేషాం - భూతానాం - మధు - ఆసాం - అపాం - సర్వాణి - భూతాని - మధు - యః - చ - అయం - ఆసు - అప్సు - తేజోమయః-అమృతమయః - పురుషః- యః - చ - అయం - అధ్యాత్మం - రైతసః - తేజోమయః - అమృతమయః - పురుషః - అయం - ఏవ - సః - యః - అయం- ఆత్మా - ఇదం - అమృతం - ఇదం - బ్రహ్మ - ఇదం - సర్వం.

ప్ర॥ ఇమాః=ఈ, ఆపః=ఉదకములు, సర్వేషాం=సమస్తము లైన, భూతానాం=భూతములయొక్క, మధు = మధుస్వరూపము. (కార్యమగు సారము), సర్వాణి=సమస్తములైన, భూతాని = భూత ములు, ఆసాం=ఈ, అపాం=ఉదకములయొక్క, మధు=మధు స్వరూ పము, ఆసు=ఈ, అప్సు=ఉదకములయందు, అయం = ఈ, తేజో మయః=తేజోస్వరూపుఁడును, అమృతమయః = అమృతస్వరూపుడు నగు, పురుషః=పురుషుఁడు, యః=ఎవఁడో, అధ్యాత్మం = అధ్యాత్మ యందు, (దేహేంద్రియ సంఘాత కర్తయందు), అయం=ఈ, రైత సః=రేతోసంబంధమైన, తేజోమయః=తేజోస్వరూపుఁడును, అమృత మయః = అమృతస్వరూపుఁడునగు, పురుషః = పురుషుఁడు, యః= ఎవఁడో, అయమేవ = ఈ పురుషుఁడే, సః = ఆ ఆత్మస్వరూపము. (ఇంతకు పూర్వము "ఇదం సర్వం యదయమాత్మా" యని ప్రతిజ్ఞ చేయఁబడిన ఆత్మస్వరూపము). అయం=ఈ, ఆత్మా=ఆత్మ, యః= ఏదియో, ఇదం=ఇది, అమృతం=అమృత స్వరూపము. ఇదం=ఇది, బ్రహ్మ=బ్రహ్మ స్వరూపము. ఇదం=ఇది, సర్వం=సమస్తము, (భవతి= అగుచున్నది).

తా॥ ఈ ప్రసిద్ధములగు ఉదకములు సమస్త ప్రాణులయొక్క

కార్యభూతమగు సారాంశము. సమస్త ప్రాణులను ఈ ప్రసిద్ధములగు ఉదకములయొక్క కార్యభూతమగు సారాంశము. ఈ ఉదకముల యందలి తేజోమయుడును అమృతస్వరూపుడునగు పురుషుడును ఈ దేహేంద్రియ సముదాయ కర్తయందు రేతస్సంబంధుడును తేజోమయుండును, అమృతస్వరూపుడునగు పురుషుడును ఎవడో, వీడే, "ఇదంసర్వం యదయమాత్మా" యని ప్రతిజ్ఞచేసిన ఆ ఆత్మ స్వరూపము. ఈ ఆత్మస్వరూప మేదియో ఇదియే అమృత స్వరూపము, ఇదియే పరబ్రహ్మస్వరూపము. ఇదియే సర్వము నగుచున్నది.

ఉ॥ అయమగ్నిస్సర్వేషాం భూతానాం మధ్వస్యాగ్నేః సర్వాణి భూతాని మధు యశ్చాయమస్మిన్నగ్నౌ తేజోమయోఽమృతమయః పురుషో యశ్చాయమధ్యాత్మం వాఙ్మయస్తేజోమయోఽమృతమయః పురుషోఽయమేవ స యోఽయమాత్మేదమమృతమిదం బ్రహ్మేదగ్ం సర్వమ్. ॥3॥

ప॥ అయం - అగ్నిః - సర్వేషాం - భూతానాం - మధు - అస్య - అగ్నేః - సర్వాణి - భూతాని - మధు - యః - చ - అయం - అస్మిన్ - అగ్నౌ - తేజోమయః - అమృతమయః - పురుషః - యః - చ - అయం - అధ్యాత్మం - వాఙ్మయః - తేజోమయః - అమృతమయః - పురుషః - అయం - ఏవ - సః - యః - అయం ఆత్మా - ఇదం - అమృతం - ఇదం - బ్రహ్మ - ఇదం - సర్వం.

ప్ర॥ అయం=ఈ, అగ్నిః=అగ్ని, సర్వేషాం=సమస్తములైన, భూతానాం=భూతములయొక్క, మధు=మధుస్వరూపము (కార్యమగు శ్రేష్ఠాంశము), సర్వాణిభూతాని = సమస్త భూతములున్ను, అస్యాగ్నేః=ఈ అగ్నియొక్క, మధు=మధుస్వరూపము, అస్మిన్=ఈ, అగ్నౌ=అగ్నియందు, అయం=ఈ, తేజోమయః = తేజోరూపమైన, అమృతమయః=అమృత స్వరూపమైన, పురుషః=పురుషుడు,

యః=ఎవఁడో, అధ్యాత్మం = దేహేంద్రియ సంఘాత కర్తయందు, అయం=ఈ, వాఙ్మయః = వాగ్రూపమును, తేజోమయః = తేజోరూపమును, అమృతమయః=అమృతరూపమునగు, పురుషః=పురుషుఁడు, యః=ఎవఁడో, అయమేవ=ఈపురుషుడే, సః=ఆ ఆత్మస్వరూపము. ("ఇదం సర్వం యదయమాత్మా" యని ప్రతిజ్ఞ చేయఁబడిన ఆత్మస్వరూపము). అయం = ఈ, ఆత్మా = ఆత్మస్వరూపము, యః= ఏదియో, ఇదం=ఇది, అమృతం=అమృతస్వరూపము. ఇదం = ఇది, బ్రహ్మ=పరబ్రహ్మస్వరూపము. ఇదం = ఇది, సర్వం = సమస్తము, (భవతి=అగుచున్నది).

తా॥ ఈప్రశస్తమగు అగ్ని సమస్తప్రాణులయొక్క కార్యభూతమగు సారాంశము. సమస్త భూతములును ఈ అగ్నియొక్క సారాంశము. ఈ అగ్నియందలి తేజోమయుఁడును అమృతమయుఁడు నగు పురుషుడును దేహేంద్రియసంఘాత కర్తయందు వాఙ్మయుఁడును తేజోమయుఁడును అమృతమయుఁడు నగు పురుషుఁడును ఎవఁడో, వీడే ఇదం సర్వం యదయమాత్మా యని ప్రతిజ్ఞ చేసి చెప్పిన ఆ ఆత్మస్వరూపము. ఇదియే అమృతస్వరూపము. ఇదియే పరబ్రహ్మస్వరూపము. ఇదియే సమస్తమునగుచున్నది.

ఉ॥ అయం వాయు స్సర్వేషాం భూతానాం మధ్వ స్య వాయోః సర్వాణి భూతాని మధు యశ్చాయమస్మిన్వాయౌ తేజోమయోఽమృతమయః పురుషో యశ్చాయమధ్యాత్మం ప్రాణ స్తేజోమయోఽమృతమయః పురుషోఽయమేవ స యోఽయమాత్మేద మమృతమిదం బ్రహ్మేదగ్ సర్వమ్. ॥4॥

ప॥ అయం - వాయుః - సర్వేషాం - భూతానాం - మధు- అస్య - వాయోః - సర్వాణి - భూతాని - మధు - యః - చ - అయం - అస్మిన్ - వాయౌ - తేజోమయః - అమృతమయః - పురుషః - యః - చ - అయం - అధ్యాత్మం - ప్రాణః - తేజో

మయః - అమృతమయః - పురుషః - అయం - ఏవ - సః - యః - అయం - ఆత్మా - ఇదం - అమృతం - ఇదం - బ్రహ్మ - ఇదం - సర్వం.

ప్ర॥ అయం=ఈ, వాయుః=వాయువు, సర్వేషాం=సమస్తములైన, భూతానాం=భూతములయొక్క, మధు = మధుస్వరూపము. (శ్రేష్ఠాంశము), సర్వాణి=సమస్తములైన, భూతాని = భూతములు, అస్య=ఈ, వాయోః=వాయువుయొక్క, మధు = మధుస్వరూపము. అస్మిన్=ఈ, వాయౌ=వాయువుయందు, అయం=ఈ, తేజోమయః =తేజోరూపుఁడును, అమృతమయః=అమృతరూపుఁడునగు, పురుషః =పురుషుఁడు, యః=ఎవఁడో, అధ్యాత్మం=దేహేంద్రియ సంఘాత కర్తయందు, అయం=ఈ, ప్రాణః=ప్రాణరూపుఁడును, తేజోమయః =తేజోరూపుఁడును, అమృతమయః=అమృతరూపుఁడునగు, పురుషః= పురుషుఁడు, యః=ఎవఁడో, అయమేవ=వీఁడే, సః = ఆ ఆత్మస్వరూపము. అయం=ఈ, ఆత్మా=ఆత్మస్వరూపము, యః=ఏదియో, ఇదం =ఇది, అమృతం=అమృతస్వరూపము. ఇదం=ఇది, బ్రహ్మ=పరబ్రహ్మస్వరూపము. ఇదం = ఇది, సర్వం = సమస్తమును, (భవతి = అగుచున్నది).

తా॥ ఈ ప్రశస్తమగు వాయువు సమస్త భూతములయొక్క సారాంశము. సమస్తభూతములును, ఈ వాయువుయొక్క సారాంశము. ఈ వాయువునందున్న తేజోమయుఁడును అమృతమయుఁడునగు ఈ పురుషుఁడును దేహేంద్రియ సంఘాతకర్తయందు ప్రాణరూపుఁడును తేజోరూపుఁడును అమృతరూపుఁడునగు ఈ పురుషుఁడును వీఁడే ఆ ఆత్మస్వరూపము. ఈ ఆత్మస్వరూపమే అమృతస్వరూపమును పరబ్రహ్మస్వరూపమును సర్వము నగుచున్నది.

ఉ॥ అయమాదిత్యస్సర్వేషాం భూతానాం మధ్వస్యాదిత్యస్య సర్వాణి భూతాని మధు యశ్చాయమస్మిన్నాదిత్యే తేజోమయోఽమృత

మయః పురుషో యశ్చాయమధ్యాత్మం చాక్షుష స్తేజోమయోఽ
మృతమయః పురుషోఽయమేవ స యోఽయమాత్మేదమమృత
మిదం బ్రహ్మేదగ్ం సర్వమ్. ॥5॥

ప॥ అయం - ఆదిత్యః - సర్వేషాం - భూతానాం - మధు-
అస్య - ఆదిత్యస్య - సర్వాణి - భూతాని - మధు - యః - చ -
అయం - అస్మిన్ - ఆదిత్యే - తేజోమయః - అమృతమయః -
పురుషః - యః - చ - అయం - అధ్యాత్మం - చాక్షుషః - తేజో
మయః - అమృతమయః - పురుషః - అయం - ఏవ - సః - యః-
అయం - ఆత్మా - ఇదం - అమృతం - ఇదం - బ్రహ్మ - ఇదం -
సర్వం.

ప్ర॥ అయం=ఈ, ఆదిత్యః=సూర్యుఁడు, సర్వేషాం=సమస్తము
లైన, భూతానాం = భూతములయొక్క, మధు = మధుస్వరూపము.
(శ్రేష్ఠాంశము). సర్వాణి=సమస్తములైన, భూతాని = భూతములు,
అస్య=ఈ, ఆదిత్యస్య=సూర్యునియొక్క, మధు = మధుస్వరూపము,
అస్మిన్=ఈ, ఆదిత్యే=సూర్యునియందు, తేజోమయః = తేజోరూపుఁ
డును, అమృతమయః=అమృతరూపుడునగు, అయం=ఈ, పురుషః=
పురుషుఁడు, యః=ఎవఁడో, అధ్యాత్మం=అధ్యాత్మయందు, చాక్షుషః
= నేత్రసంబంధుఁడును, తేజోమయః = తేజోరూపుఁడును, అమృత
మయః=అమృతస్వరూపుఁడునగు, అయం=ఈ, పురుషః=పురుషుఁడు,
యః=ఎవఁడో, అయమేవ=ఈపురుషుఁడే, సః = ఆ ఆత్మస్వరూపము.
అయం=ఈ, ఆత్మా=ఆత్మస్వరూపము, యః=ఏదియో, ఇదం = ఇది,
అమృతం=అమృతస్వరూపము. ఇదం = ఇది, బ్రహ్మ = పరబ్రహ్మ
స్వరూపము, ఇదం=ఇది, సర్వం=సమస్తమును, (భవతి=అగుచున్నది).

తా॥ ఈ ప్రసిద్ధమగు సూర్యుఁడు సమస్తభూతములయొక్క
శ్రేష్ఠాంశము. సమస్త భూతములును ఈసూర్యునియొక్క శ్రేష్ఠాం
శము. ఈసూర్యునియందున్న తేజోరూపుఁడును అమృతరూపుఁడునగు

పురుషుఁడును దేహేంద్రియసంఘాతకర్తయందు నేత్రసంబంధుఁడును తేజోమయుఁడును అమృతమయుఁడునగు పురుషుఁడును, వీఁడే ఆప్రసిద్ధమగు ఆత్మస్వరూపము. ఈ ఆత్మస్వరూపమే అమృతస్వరూపమును పరబ్రహ్మస్వరూపమును సమస్తము నగుచున్నది.

ఉ॥ ఇమా దిశస్సర్వేషాం భూతానాం మధ్వాసాం దిశాగ్ం సర్వాణి భూతాని మధు యశ్చాయమాసు దిక్షు తేజోమయోఽమృతమయః పురుషో యశ్చాయ మధ్యాత్మగ్ం శ్రౌత్రః ప్రాతిశ్రుత్కస్తేజోమయోఽమృతమయః పురుషోఽయమేవ స యోఽయమాత్మే దమమృతమిదం బ్రహ్మేదగ్ం సర్వమ్. ॥6॥

ప॥ ఇమాః - దిశః - సర్వేషాం - భూతానాం - మధు - ఆసాం - దిశాం - సర్వాణి - భూతాని - మధు - యః - చ - అయం - ఆసు - దిక్షు - తేజోమయః - అమృతమయః - పురుషః - యః - చ - అయం - అధ్యాత్మం - శ్రౌత్రః - ప్రాతిశ్రుత్కః - తేజోమయః - అమృతమయః - పురుషః - అయం - ఏవ - సః - యః - అయం - ఆత్మా - ఇదం - అమృతం - ఇదం - బ్రహ్మ - ఇదం - సర్వం.

ప్ర॥ ఇమాః=ఈ, దిశః=దిక్కులు, సర్వేషాం=సమస్తములైన, భూతానాం=భూతములయొక్క, మధు=మధుస్వరూపము. (శ్రేష్ఠాంశము). సర్వాణి=సమస్తములైన, భూతాని=భూతములు, ఆసాం = ఈ, దిశాం=దిక్కులయొక్క, మధు=మధుస్వరూపము. ఆసు = ఈ, దిక్షు = దిక్కులయందు, తేజోమయః = తేజోరూపుఁడును. అమృతమయః=అమృతస్వరూపుఁడునగు, అయం=ఈ, పురుషశ్చ=పురుషుఁడును, యః=ఎవఁడో, అధ్యాత్మం=అధ్యాత్మయందు, శ్రౌత్రః=శ్రోత్రసంబంధుఁడును, ప్రాతిశ్రుత్కః = ప్రతి శ్రవణ సమయమునందును పుట్టెడివాఁడును, తేజోమయః=తేజోరూపుఁడును, అమృతమయః=అమృతస్వరూపుఁడునగు, అయం=ఈ, పురుషశ్చ = పురుషుఁడును,

యః=ఎవఁడో, అయమేవ=ఈపురుషుఁడే, సః=ఆ ఆత్మస్వరూపము. అయం=ఈ, ఆత్మా=ఆత్మస్వరూపము, యః=ఏదిరో, ఇదం = ఇది, అమృతం=అమృతస్వరూపము. ఇదం = ఇది, బ్రహ్మ=పరబ్రహ్మము. ఇదం=ఇది, సర్వం=సమస్తమును, (భవతి=అగుచున్నది).

తా॥ ఈదిక్కులు సమస్తభూతములయొక్క సారాంశము. సమస్త భూతములును ఈదిక్కులయొక్క సారాంశము. ఈదిక్కుల యందలి తేజోమయుఁడును అమృతమయుఁడునగు పురుషుఁడును ఈ దేహేంద్రియసంఘాతకర్తయందు శ్రోత్రసంబంధుఁడును ప్రతి దానియొక్క వినెడి కాలమందు కలిగెడివాఁడును, తేజోమయుఁడును అమృతమయుఁడునగు పురుషుఁడునైన వీఁడే ఆ ఆత్మస్వరూపము. ఈ ఆత్మస్వరూపమే అమృతస్వరూపమును పరబ్రహ్మస్వరూపమును సమస్తమునగుచున్నది.

ఉ॥ అయం చన్ద్రస్సర్వేషాం భూతానాం మధ్వస్య చన్ద్రస్య సర్వాణి భూతాని మధు యశ్చాయమస్మిగ్శ్చన్ద్రే తేజోమయోఽమృత మయః పురుషో యశ్చాయ మధ్యాత్మం మానసస్తేజోమయోఽ మృతమయః పురుషోఽయమేవ స యోఽయమాత్మేద మమృత మిదం బ్రహ్మేదగ్ సర్వమ్. ॥7॥

ప॥ అయం - చన్ద్రః - సర్వేషాం - భూతానాం - మధు - అస్య - చన్ద్రస్య సర్వాణి - భూతాని - మధు - యః - చ - అయం - అస్మిగ్ - చన్ద్రే - తేజోమయః - అమృతమయః - పురుషః - యః - చ - అయం - అధ్యాత్మం - మానసః - తేజోమయః - అమృతమయః - పురుషః - అయం - ఏవ - సః - యః - అయం - ఆత్మా - ఇదం - అమృతం - ఇదం - బ్రహ్మ - ఇదం- సర్వం.

ప్ర॥ అయం=ఈ, చన్ద్రః=చంద్రుఁడు, సర్వేషాం=సమస్తములైన, భూతానాం=భూతములయొక్క, మధు = మధుస్వరూపము.

(శ్రేష్ఠాంశము). సర్వాణి=సమస్తములైన, భూతాని = భూతములు, అస్య=ఈ, చన్ద్రస్య=చంద్రునియొక్క, మధు = మధుస్వరూపము, అస్మిన్=ఈ, చన్ద్రే=చంద్రునియందు, తేజోమయః = తేజోరూపుఁడును, అమృతమయః=అమృతస్వరూపుఁడునగు, అయం=ఈ, పురుషశ్చ=పురుషుఁడును, యః=ఎవఁడో, అధ్యాత్మం=అధ్యాత్మయందు, మానసః = మనస్సంబంధుఁడును, తేజోమయః = తేజోరూపుఁడును, అమృతమయః=అమృతస్వరూపుఁడునగు, అయం=ఈ, పురుషశ్చ=పురుషుఁడును, యః=ఎవఁడో, అయమేవ=ఈపురుషుఁడే, సః=ఆ ఆత్మస్వరూపము. అయం=ఈ, ఆత్మా=ఆత్మస్వరూపము, యః=ఏదియో, ఇదం=ఇది, అమృతం=అమృతస్వరూపము. ఇదం=ఇది, బ్రహ్మ=పరబ్రహ్మము. ఇదం=ఇది, సర్వం = సమస్తమున్ను, (భవతి = అగుచున్నది).

తా॥ ఈ ప్రసిద్ధమగు చంద్రుఁడు సమస్తభూతములయొక్క శ్రేష్ఠాంశము. సమస్తభూతములును ఈ చంద్రునియొక్క శ్రేష్ఠాంశము. ఈచంద్రునియందలి తేజోమయుఁడును అమృతమయుఁడనగు పురుషుఁడును, దేహేంద్రియసంఘాతకర్తయందు మనస్సంబంధుఁడును తేజోమయుఁడును అమృతమయుఁడునగు పురుషుఁడైన వీఁడే ఆ ఆత్మస్వరూపము. ఈ ఆత్మస్వరూపమే అమృతరూపమును పరబ్రహ్మమును సర్వమునగుచున్నది.

ఉ॥ ఇయం విద్యుత్సర్వేషాం భూతానాం మధ్వస్యై విద్యుతేసర్వాణి భూతాని మధు యశ్చాయమస్యాం విద్యుతి తేజోమయోఽమృతమయః పురుషో యశ్చాయమధ్యాత్మం తైజసస్తేజోమయోఽమృతమయః పురుషోఽయమేవ స యోఽయమాత్మేదమమృతమిదం బ్రహ్మేదగ్ం సర్వమ్. ॥8॥

ప॥ ఇయం - విద్యుత్ - సర్వేషాం - భూతానాం - మధు - అస్యై - విద్యుతే - సర్వాణి - భూతాని - మధు - యః - చ -

అయం - అస్యాం - విద్యుతి - తేజోమయః - అమృతమయః - పురుషః - యః - చ - అయం - అధ్యాత్మం - తైజసః - తేజోమయః - అమృతమయః - పురుషః - అయం - ఏవ - సః - యః - అయం - ఆత్మా - ఇదం - అమృతం - ఇదం - బ్రహ్మ - ఇదం - సర్వం.

ప్ర॥ ఇయం=ఈ, విద్యుత్=మెఱుపు, సర్వేషాం=సమస్తములైన, భూతానాం=భూతములయొక్క, మధు = మధుస్వరూపము. (శ్రేష్ఠాంశము). సర్వాణి=సమస్తములైన, భూతాని = భూతములు, అస్యై=ఈ, విద్యుతే=మెఱుపుయొక్క, మధు = మధుస్వరూపము. అస్యాం=ఈ, విద్యుతి=మెఱుపుయందు, తేజోమయః = తేజోరూపుఁడును, అమృతమయః=అమృతరూపుఁడునగు, అయం=ఈ, పురుషశ్చ =పురుషుఁడును, యః=ఎవఁడో, అధ్యాత్మం = అధ్యాత్మయందున్న, తైజసః = తేజోసంబంధుఁడును, (చర్మముయొక్క తేజస్సుయందైన వాఁడును), తేజోమయః=తేజోరూపుఁడును, అమృతమయః=అమృత రూపుఁడునగు, అయం = ఈ, పురుషశ్చ = పురుషుఁడును, యః= ఎవఁడో, అయమేవ=వీఁడే, సః=ఆ ఆత్మస్వరూపము. అయం = ఈ, ఆత్మా=ఆత్మస్వరూపము, యః=ఏదియో, ఇదం = ఇది, అమృతం= అమృతస్వరూపము. ఇదం=ఇది, బ్రహ్మ=బ్రహ్మస్వరూపము, ఇదం =ఇది, సర్వం=సమస్తమును (భవతి=అగుచున్నది).

తా॥ ఈ మెఱుపు సమస్త భూతములయొక్క సారాంశము. సమస్త భూతములును ఈ మెఱుపుయొక్క సారాంశము. ఈ మెఱుపు నందలి తేజోమయుఁడును అమృతమయుఁడునగు పురుషుఁడును దేహేంద్రియసంఘాతకర్తయందు చర్మమునయొక్క తేజోసంబంధుఁడును తేజోమయుఁడును అమృతమయుఁడునగు పురుషుఁడైన వీఁడే ఆ ఆత్మస్వరూపము. ఈ ఆత్మస్వరూపమే అమృత రూపమును పర బ్రహ్మమును సర్వము నగుచున్నది.

ఉ॥ అయగ్ స్తనయిత్నుః సర్వేషాం భూతానాం మధ్వస్య స్తనయిత్నోః సర్వాణి భూతాని మధు యశ్చాయమస్మిగ్ స్తనయిత్నౌ తేజోమయోఽమృతమయః పురుషో యశ్చాయమధ్యాత్మగ్ శాబ్దస్సౌవర స్తేజోమయోఽమృతమయః పురుషోఽయమేవ స యోఽయమాత్మేదమమృతమిదం బ్రహ్మేదగ్ సర్వమ్. ॥9॥

ప॥ అయం - స్తనయిత్నుః - సర్వేషాం - భూతానాం - మధు - అస్య - స్తనయిత్నోః - సర్వాణి - భూతాని - మధు - యః - చ - అయం - అస్మిన్ - స్తనయిత్నౌ - తేజోమయః - అమృతమయః - పురుషః - యః - చ - అయం - అధ్యాత్మం - శాబ్దః - సౌవరః - తేజోమయః - అమృతమయః - పురుషః - అయం - ఏవ - సః - యః - అయం - ఆత్మా - ఇదం - అమృతం- ఇదం - బ్రహ్మ - ఇదం - సర్వం.

ప్ర॥ అయం = ఈ, స్తనయిత్నుః = గర్జనము, సర్వేషాం = సమస్తములైన, భూతానాం = భూతములయొక్క, మధు = మధుస్వరూపము. సర్వాణి = సమస్తములైన, భూతాని = భూతములు, అస్య=ఈ, స్తనయిత్నోః = గర్జనముయొక్క, మధు = మధుస్వరూపము, అస్మిన్=ఈ, స్తనయిత్నౌ = గర్జనమునందు, తేజోమయః= తేజోరూపుఁడును, అమృతమయః=అమృతస్వరూపుఁడునగు, అయం =ఈ, పురుషశ్చ=పురుషుఁడును, యః=ఎవఁడో, అధ్యాత్మం=అధ్యాత్మయందు, (దేహేంద్రియసంఘాతకర్తయందు), శాబ్దః=శబ్దమందైనవాఁడును, సౌవరః = స్వరమందైనవాఁడును, తేజోమయః = తేజోరూపుఁడును, అమృతమయః=అమృతరూపుఁడునగు, అయం = ఈ, పురుషశ్చ=పురుషుఁడును, యః=ఎవఁడో, అయమేవ=ఈపురుషుఁడే, సః=ఆ ఆత్మస్వరూపము. |అయం = ఈ, ఆత్మా = ఆత్మస్వరూపము, యః=ఏదియో, ఇదం=ఇది, సర్వం=సమస్తమున్ను, (భవతి = అగుచున్నది).

తా॥ ఈ ప్రసిద్ధమగు మేఘగర్జనము సమస్తభూతములయొక్క సారము. సమస్తభూతములు మేఘగర్జనముయొక్క సారము. ఈగర్జనమునందలి తేజోరూపుఁడును అమృతరూపుఁడునగు పురుషుఁడును దేహేంద్రియసంఘాతకర్తయందు శబ్దమందైనవాఁడును స్వరమందైనవాఁడును తేజోమయుఁడును అమృతమయుఁడునగు పురుషుఁడైన వీఁడే ఆ ఆత్మస్వరూపము. ఇదియే అమృతస్వరూపమును, పరబ్రహ్మస్వరూపమును సమస్తము నగుచున్నది.

ఉ॥ అయమాకాశ స్సర్వేషాం భూతానాం మధ్వ స్యాకాశస్య
సర్వాణి భూతాని మధు యశ్చాయమస్మిన్నాకాశే తేజోమయోఽ
మృతమయః పురుషో యశ్చాయమధ్యాత్మగ్ హృద్యాకాశస్తే
జోమయోఽమృతమయః పురుషోఽయమేవ స యోఽయమాత్మే
దమమృతమిదం బ్రహ్మేదగ్ సర్వమ్. ॥10॥

ప॥ అయం - ఆకాశః - సర్వేషాం - భూతానాం - మధు- అస్య - ఆకాశస్య - సర్వాణి - భూతాని - మధు - యః - చ - అయం - అస్మిన్ - ఆకాశే - తేజోమయః - అమృతమయః - పురుషః - యః - చ - అయం - అధ్యాత్మం - హృది - ఆకాశః - తేజోమయః - అమృతమయః - పురుషః - అయం - ఏవ - సః - యః - అయం - ఆత్మా - ఇదం - అమృతం - ఇదం - బ్రహ్మ - ఇదం - సర్వం.

ప్ర॥ అయం=ఈ, ఆకాశః=ఆకాశము, సర్వేషాం=సమస్తములైన, భూతానాం = భూతములయొక్క, మధు = మధుస్వరూపము, సర్వాణి=సమస్తములైన, భూతాని=భూతములు, అస్య = ఈ, ఆకాశస్య=ఆకాశముయొక్క, మధు = మధుస్వరూపము, అస్మిన్ = ఈ, ఆకాశే=ఆకాశమునందు, తేజోమయః=తేజోరూపుఁడును, అమృతమయః=అమృతస్వరూపుఁడునగు, అయం=ఈ, పురుషశ్చ=పురుషుఁడును, యః=ఎవఁడో, అధ్యాత్మం=అధ్యాత్మయందు, (దేహేంద్రియ

సంఘాతకర్తయందు), హృది=హృదయమునందు, ఆకాశః = ఆకాశ స్వరూపుడును, తేజోమయః = తేజోరూపుడును, అమృతమయః= అమృతస్వరూపుడునగు, అయం=ఈ, పురుషశ్చ = పురుషుడును, యః=ఎవడో, అయమేవ = ఈపురుషుడే, సః=ఆ ఆత్మస్వరూపము, అయం=ఈ, ఆత్మా=ఆత్మస్వరూపము, యః=ఏదియో, ఇదం = ఇది, అమృతం=అమృతస్వరూపము. ఇదం = ఇది, బ్రహ్మ = పరబ్రహ్మ స్వరూపము. ఇదం = ఇది, సర్వం = సమస్తమును, (భవతి = అగు చున్నది).

తా॥ ఈ ఆకాశము సమస్తభూతములయొక్క సారము, సమస్తభూతములును ఈ ఆకాశముయొక్కసారము. ఈ ఆకాశము నందలి తేజోరూపుడును, అమృతరూపుడునగు పురుషుడును దేహేంద్రియ సంఘాతకర్తయందు హృదయాకాశ స్వరూపుడును తేజోమయుడును అమృతమయుడునగు పురుషుడునైన వీడే ఆ ఆత్మస్వరూపము. ఈ ఆత్మస్వరూపమే అమృతస్వరూపమును పర బ్రహ్మస్వరూపమును సర్వము నగుచున్నది.

మ॥ అయం ధర్మ స్సర్వేషాం భూతానాం మధ్వస్య ధర్మస్య సర్వాణి భూతాని మధు యశ్చాయమస్మిన్ ధర్మే తేజోమయోఽమృత మయః పురుషో యశ్చాయమధ్యాత్మం ధార్మస్తేజోమయోఽ మృతమయః పురుషోఽయమేవ స యోఽయమాత్మేదమమృత మిదం బ్రహ్మేదగ్ం సర్వమ్. ॥11॥

ప॥ అయం - ధర్మః - సర్వేషాం - భూతానాం - మధు - అస్య - ధర్మస్య - సర్వాణి - భూతాని - మధు - యః - చ - అయం - అస్మిన్ - ధర్మే - తేజోమయః - అమృతమయః - పురుషః-యః - చ - అయం - అధ్యాత్మం - ధార్మః - తేజోమయః - అమృతమయః - పురుషః - అయం - ఏవ - సః - యః - అయం - ఆత్మా - ఇదం - అమృతం - ఇదం - బ్రహ్మ - ఇదం - సర్వం.

ప్ర॥ అయం=ఈ, ధర్మః = అపూర్వమను పేరుగల ధర్మము, సర్వేషాం=సమస్తములైన, భూతానాం=భూతములయొక్క, మధు =మధుస్వరూపము. సర్వాణి = సమస్తములైన, భూతాని = భూతములు, అస్య=ఈ, ధర్మస్య=ధర్మముయొక్క, మధు = మధుస్వరూపము. అస్మిన్=ఈ, ధర్మే = ధర్మమునందు, తేజోమయః = తేజోరూపుఁడును, అమృతమయః = అమృతరూపుఁడునగు, అయం= ఈ, పురుషశ్చ=పురుషుఁడున్ను. యః=ఎవఁడో, అధ్యాత్మం = అధ్యాత్మయందు, ధార్మః=ధర్మమంద్రైనవాఁడును, తేజోమయః=తేజోరూపుఁడును, అమృతమయః=అమృతస్వరూపుఁడునగు, పురుషశ్చ = పురుషుఁడున్ను, యః=ఎవఁడో. అయమేవ=ఈపురుషుఁడే, సః=ఆ ఆత్మస్వరూపము, యః=ఏదియో, ఇదం=ఇది, అమృతం = అమృతస్వరూపము, ఇదం=ఇది, బ్రహ్మ=పరబ్రహ్మస్వరూపము. ఇదం=ఇది, సర్వం= సమస్తమును, (భవతి=అగుచున్నది).

తా॥ ఈ ప్రసిద్ధమగు సామాన్యవిశేషములచేత రెండువిధములైన, అపూర్వమను పేరుగల ధర్మము సమస్తభూతములయొక్క సారము. సమస్తభూతములును ఈ ధర్మముయొక్కసారము. ఈ పృథివ్యాదిభూతములయందలి సామాన్యధర్మమునందు తేజోమయుఁడును అమృతమయుఁడునగు పురుషుఁడును దేహేంద్రియ సంఘాతకర్తయందలి విశేషధర్మమంద్రైనవాడును తేజోమయుఁడును అమృతమయుఁడునగు పురుషుఁడును నైనవీఁడే ఆ ఆత్మస్వరూపము. ఇదియే అమృతస్వరూపమును పరబ్రహ్మమును సర్వము నగుచున్నది.

మ॥ ఇదగ్ం సత్యగ్ం సర్వేషాం భూతానాం మధ్వస్య సత్యస్య సర్వాణి భూతాని మధు యశ్చాఽయమస్మిన్సత్యే తేజోమయోఽమృతమయః పురుషో యశ్చాఽయమధ్యాత్మగ్ం సాత్య స్తేజోమయోఽమృతమయః పురుషోఽయమేవ స యోఽయమాత్మేదమమృతమిదం బ్రహ్మేదగ్ం సర్వమ్. ॥12॥

ప॥ ఇదం - సత్యం - సర్వేషాం - భూతానాం - మధు - అస్య - సత్యస్య - సర్వాణి - భూతాని - మధు - యః - చ - అయం - అస్మిన్ - సత్యే - తేజోమయః - అమృతమయః - పురుషః - యః - చ - అయం - అధ్యాత్మం - సాత్యః - తేజోమయః-అమృతమయః-పురుషః-అయం - ఏవ - సః-యః-అయం - ఆత్మా - ఇదం - అమృతం - ఇదం - బ్రహ్మ - ఇదం - సర్వం,

ప్ర॥ ఇదం=ఈ, సత్యం=సత్యము, సర్వేషాం=సమస్తములైన, భూతానాం=భూతములయొక్క, మధు=మధుస్వరూపము. సర్వాణి =సమస్తములైన, భూతాని = భూతములు, అస్య = ఈ, సత్యస్య= సత్యముయొక్క, మధు = మధుస్వరూపము. అస్మిన్=ఈ, సత్యే= సత్యమునందు, తేజోమయః = తేజోరూపుఁడును, అమృతమయః = అమృతరూపుఁడునగు, అయం = ఈ, పురుషశ్చ = పురుషుఁడున్ను, యః=ఎవఁడో, అధ్యాత్మం=అధ్యాత్మయందు, సాత్యః=సత్యమందైన వాఁడును, తేజోమయః=తేజోరూపుఁడును, అమృతమయః=అమృత రూపుఁడునగు, అయం=ఈ, పురుషశ్చ=పురుషుఁడును, యః=ఎవఁడో, అయమేవ=ఈపురుషుఁడే, సః=ఆ ఆత్మస్వరూపము, అయం = ఈ, ఆత్మా=ఆత్మస్వరూపము, యః=ఏదియో, ఇదం = ఇది, అమృతం= అమృతస్వరూపము. ఇదం = ఇది, బ్రహ్మ = పరబ్రహ్మస్వరూపము, ఇదం=ఇది, సర్వం=సమస్తమును, (భవతి=అగుచున్నది).

తా॥ పూర్వోక్తమైన ధర్మముచేయఁబడిన ఆచారరూప ముతో సత్యమనుపేరుగలదై సామాన్యవిశేషములచేత రెండువిధము లగుచున్నది. ఈ ప్రసిద్ధమగుసత్యము సమస్తభూతములయొక్క సారము. సమస్తభూతములును ఈ సత్యముయొక్కసారము. ఈపృథి వ్యాది భూతములయందలి సామాన్యముగానుండెడి క్రియారూపమైన సత్యమునందు తేజోమయుఁడును అమృతమయుఁడునగు పురుషుఁడును దేహేంద్రియ సంఘాతమునందున్న విశేషరూపమైన సత్యమందైన

వాఁడును తేజోమయుఁడును అమృతమయుఁడునగు పురుషుఁడు నైన వీఁడే ఆ ఆత్మస్వరూపము. ఇదియే అమృతస్వరూపమును. పరబ్రహ్మ స్వరూపమును, సర్వము నగుచున్నది.

ఉ॥ ఇదం మానుషగ్ సర్వేషాం భూతానాం మధ్వస్య మానుషస్య
సర్వాణి భూతాని మధు యశ్చాయమస్మిన్మానుషే తేజోమయోఽ
మృతమయః పురుషోఽయశ్చాయమధ్యాత్మం మానుషస్తేజో
మయోఽమృతమయః పురుషోఽయమేవ స యోఽయ మాత్మేద
మమృతమిదం బ్రహ్మేదగ్ సర్వమ్. ॥13॥

ప॥ ఇదం - మానుషం - సర్వేషాం - భూతానాం - మధు - అస్య - మానుషస్య - సర్వాణి - భూతాని - మధు - యః-చ - అయం - అస్మిన్ - మానుషే - తేజోమయః - అమృతమయః - పురుషః - యః - చ - అయం - అధ్యాత్మం - మానుషః - తేజో మయః - అమృతమయః - పురుషః - అయం - ఏవ - సః - యః - అయం - ఆత్మా - ఇదం - అమృతం - ఇదం - బ్రహ్మ - ఇదం - సర్వం.

ప్ర॥ ఇదం = ఈ, మానుషం = మనుష్యజాతి, సర్వేషాం= సమస్తములైన, భూతానాం = భూతములయొక్క, మధు = మధు స్వరూపము. సర్వాణి=సమస్తములైన, భూతాని=భూతములు, అస్య =ఈ, మానుషస్య=మనుష్యజాతియొక్క, మధు = మధుస్వరూపము. అస్మిన్=ఈ, మానుషే=మనుష్యజాతియందు, తేజోమయః = తేజో రూపుఁడును, అమృతమయః=అమృతరూపుఁడునగు, అయం = ఈ, పురుషశ్చ=పురుషుఁడున్ను, యః=ఎవఁడో, అధ్యాత్మం = అధ్యాత్మ యందు, మానుషః=మనుష్యసంబంధమైనవాఁడును, తేజోమయః= తేజోరూపుఁడును, అమృతమయః=అమృతస్వరూపుఁడునగు, అయం =ఈ, పురుషశ్చ = పురుషుఁడున్ను, యః = ఎవఁడో, అయమేవ= ఈపురుషుఁడే, సః=ఆ ఆత్మస్వరూపము. అయం=ఈ, ఆత్మా = ఆత్మ

స్వరూపము, యః=ఏదియో, ఇదం=ఇది, అమృతం = అమృతస్వరూపము. ఇదం=ఇది, బ్రహ్మ = పరబ్రహ్మము, ఇదం = ఇది, సర్వం= సమస్తమున్ను, (భవతి=అగుచున్నది).

తా॥ మనుష్యజాతి బాహ్యమని అధ్యాత్మికమని రెండువిధములు. అందు బాహ్యమనఁగా అన్యశరీరమును ఆశ్రయించియుండునట్టి మానుషజాతి, ఆధ్యాత్మికియనఁగా నిర్దేశించి చెప్పెడివానియొక్క స్వశరీరమందుండెడి మానుషజాతి, ఇట్టిమానుషజాతి సమస్త భూతములయొక్క సారము. సమస్త భూతములు ఈ మనుష్యజాతియొక్క సారము. ఈ అన్యమగు మానుషజాతియందలి తేజోరూపుఁడును అమృతరూపుఁడునగు పురుషుఁడును, నిర్దేశించువానియొక్క తన దేహేంద్రియాదిసముదాయమునందలి మనుష్యజాతి సంబంధుఁడును తేజోమయుడును అమృతమయుడునగు పురుషుఁడునునైనవీఁడే ఆ ఆత్మస్వరూపము. ఇదియే అమృతస్వరూపమును పరబ్రహ్మస్వరూపమును సమస్తము నగుచున్నది.

మ॥ అయమాత్మా సర్వేషాం భూతానాం మధ్వస్యాత్మనః సర్వాణి భూతాని మధు యశ్చాయమస్మిన్నాత్మని తేజోమయోఽమృతమయః పురుషోయశ్చాయమాత్మా తేజోమయోఽమృతమయః పురుషోఽయమేవ స యోఽయమాత్మేదమమృతమిదం బ్రహ్మేదగ్ం సర్వమ్. ॥14॥

ప॥ అయం - ఆత్మా - సర్వేషాం - భూతానాం - మధు - అస్య - ఆత్మనః - సర్వాణి - భూతాని - మధు - యః - చ - అయం - అస్మిన్ - ఆత్మని - తేజోమయః - అమృతమయః - పురుషః - యః - చ - అయం - ఆత్మా - తేజోమయః - అమృతమయః పురుషః - అయం - ఏవ - సః - యః - అయం - ఆత్మా - ఇదం- అమృతం - ఇదం - బ్రహ్మ - ఇదం - సర్వం.

ప్ర॥ అయం = ఈ, ఆత్మా = ఆత్మస్వరూపము, (మానుషాది

జాతితో కూడుకొనిన దేహేంద్రియాది సంఘాతమగు ఈ ఆత్మస్వరూపము). సర్వేషాం=సమస్తములైన, భూతానాం=భూతములయొక్క, మధు=మధుస్వరూపము. సర్వాణి=సమస్తములైన, భూతాని=భూతములు. అస్య=ఈ, ఆత్మనః=ఆత్మయొక్క, మధు=మధుస్వరూపము. అస్మిన్=ఈ, ఆత్మని=ఆత్మయందు (దేహేంద్రియసంఘాతమునందు) తేజోమయః=తేజోరూపుఁడును, అమృతమయః=అమృతస్వరూపుఁడునగు, అయం=ఈ, పురుషశ్చ = పురుషుఁడున్ను, యః = ఎవఁడో, తేజోమయః = తేజోరూపుఁడును, అమృతమయః = అమృతరూపుఁడును, అయం=ఈ, ఆత్మా=విజ్ఞానమయస్వరూపుఁడునగు, పురుషశ్చ =పురుషుఁడును, యః=ఎవఁడో అయమేవ = ఈ పురుషుఁడే, సః= ఆ ఆత్మస్వరూపము. ("ఇదం సర్వంయదయమాత్మా" యని ప్రతిజ్ఞ చేసి చెప్పిన ఆత్మస్వరూపము), అయం=ఈ, ఆత్మా = ఆత్మ, యః= ఏదియో, ఇదం=ఇది, అమృతం=అమృతస్వరూపము. ఇదం = ఇది, బ్రహ్మ=పరబ్రహ్మస్వరూపము ఇదం=ఇది, సర్వం = సమస్తమున్ను, (భవతి=అగుచున్నది).

తా॥ మానుషాదిజాతితో కూడుకొనిన దేహేంద్రియాది సంఘాతమగు ఈ ఆత్మస్వరూపము సమస్త భూతములయొక్క శ్రేష్ఠాంశము. సమస్త భూతములును ఈ ఆత్మస్వరూపముయొక్క శ్రేష్ఠాంశము. ఈ దేహేంద్రియ సంఘాతాత్మయందు తేజోరూపుఁడును అమృతరూపుఁడునగు పురుషుఁడును విజ్ఞానమయుఁడును తేజోమయుఁడును, అమృతమయుఁడునగు పురుషుఁడును నైన వీఁడే, "ఇదం సర్వంయదయమాత్మా" యని ప్రతిజ్ఞచేసి ఇంతకుపూర్వము చెప్పిన ఆ ఆత్మస్వరూపము. ఇదియే అమృతస్వరూపమును పరబ్రహ్మస్వరూపమును సర్వమును నగుచున్నది.

మం॥ స వా అయమాత్మా సర్వేషాం భూతానామధిపతి స్సర్వేషాం
భూతానాగ్ం రాజా తద్యథా రథనాభౌ చ రథనేమౌ చారాః

సర్వే సమర్పితా ఏవమేవాస్మిన్నాత్మని సర్వే ప్రాణా స్సర్వే లోకా స్సర్వే దేవా స్సర్వాణి భూతాని సర్వ ఏత ఆత్మాన స్సమర్పితాః. ॥15॥

ప॥ సః - వై - అయం - ఆత్మా - సర్వేషాం - భూతానాం - అధిపతిః - సర్వేషాం - భూతానాం - రాజా - తత్ - యథా - రథనాభౌ - చ - రథనేమౌ - చ - అరాః - సర్వే - సమర్పితాః - ఏవం - ఏవ - అస్మిన్ - ఆత్మనే - సర్వే - ప్రాణాః - సర్వే - లోకాః - సర్వే - దేవాః - సర్వాణి - భూతాని - సర్వే - ఏతే - ఆత్మానః - సమర్పితాః.

ప్ర॥ స్సవై=అప్రసిద్ధమగు, అయం=ఈ, ఆత్మా = ఆత్మస్వరూపము, (పూర్వపర్యాయములయందు చెప్పనిదియును అంత్యపర్యాయమునందు ఈ ఆత్మాయని చెప్పఁబడిన విజ్ఞానమయాత్మయే బ్రహ్మవిద్యచేత ఆత్మస్వరూపమునందు ప్రవేశింపఁబడి ఆ పరమాత్మతో అభేదమును పొందుచున్నదో, అట్టి ఆత్మస్వరూపము), సర్వేషాం= సమస్తములైన, భూతానాం=భూతములకు, అధిపతిః= స్వామియును, (స్వతంత్రమైనది), సర్వేషాం=సమస్తములైన, భూతానాం = భూతములకు, రాజా=రాజును, (ఒకానొకఁడు రాజుకుఁదగిన వృత్తిని ఆశ్రయించి రాజు అగుచున్నాఁడు. అధిపతికానేరడు, గనుక రాజా అధిపతి శబ్దములకు భేదముకలదు) (భవతి=అగుచున్నది). తద్యథా= అదెట్లనఁగా, సర్వే = సమస్తమైన, అరాః = ఆకులు. రథనాభౌచ= చక్రమురొయొక్క మధ్యభాగమునందున్ను, రథనేమౌచ = చక్రము యొక్క పట్టాయందున్ను, (యథా = ఏప్రకారము), సమర్పితాః= ఉంచఁబడినవో, ఏవమేవ=ఈ ప్రకారముగానే, సర్వే = సమస్తములైన, ప్రాణాః = ప్రాణములున్ను, సర్వేలోకాః = సమస్తలోకములున్ను, సర్వేదేవాః=సమస్తదేవతలున్ను, సర్వాణి భూతాని=సమస్తభూతములున్ను, ఏతే=ఈ, సర్వేఆత్మానః = సమస్త ఆత్మలున్ను,

అస్మిన్=ఈ, ఆత్మని=ఆత్మయందు, సమర్పితాః=ఉంచఁబడినవి.

తా॥ పరబ్రహ్మవిద్యచేతను కేవలాత్మయందు ప్రవేశించి పరమాత్మతో నైక్యమును పొందిన ఆ ప్రసిద్ధమగు ఈ విజ్ఞానాత్మ సమస్తభూతములకు నధిపతియును రాజు నగుచున్నది. ఇట్టి ఆత్మస్వరూపమునందు సర్వప్రాణులున్ను సమస్తలోకములున్ను సర్వదేవతలును సర్వభూతములును ఈ సమస్త ఆత్మలును ఇవియున్నియును చక్రమధ్యమునందు రంధ్రముతోఁగూడుకొనియున్న అడ్డయందును చక్రమునకుచుట్టు అమర్చిన కొయ్యయందును ఉంచబడిన బండిచక్రము యొక్క ఆకులు వలెనె ఉంచఁబడియున్నవి.

ఉ॥ ఇదం వై తన్మధు దధ్యఙ్ఙాథర్వణోఽశ్విభ్యామువాచ త దేతదృషిః
పశ్యన్నవోచత్ । తద్వాం నరా సనయేదంస ఉగ్రమావిష్కృ
ణోమి తన్యతుర్న వృష్టిం । దధ్యఙ్ హ యన్మధ్వాథర్వణో
వామశ్వస్య శీర్ష్ణా ప్ర యదీమువాచేతి. ॥16॥

ప॥ ఇదం – వై – తత్ – మధు – దధ్యఙ్ – ఆథర్వణః – అశ్విభ్యాం – ఉవాచ – తత్ – ఏతత్ – ఋషిః – పశ్యన్ – అవోచత్ – తత్ – వాం – నరా – సనయే – దంసః – ఉగ్రం – ఆవిష్కృణోమి – తన్యతుః – న – వృష్టిం – దధ్యఙ్ – హ – యత్ – మధు – ఆథర్వణః – వాం – అశ్వస్య – శీర్ష్ణా–ప్ర–యదీం – ఉవాచ

ప్ర॥ తత్=ఆ, ఇదంవై=ఈప్రసిద్ధమగు, మధు = మధుస్వరూపమును, ఆథర్వణః=అథర్వణపుత్రుఁడగు, దధ్యఙ్=దధ్యఙ్ఙనువాఁడు, అశ్విభ్యాం=అశ్వినీదేవతలకొఱకు, ఉవాచ=పలికెను. త దేతత్=ఆ దీనిని, ఋషిః=మంత్రము, పశ్యన్=పొందినదై, అవోచత్=పలికెను. హేనరా=ఓ అశ్వినీదేవతలారా ! వాం=మీకు, సనయే = లాభము కొఱకు, (కృతం=చేయఁబడిన), ఉగ్రం=క్రూరమైన, దంసః = దంస

మను పేరుగల, తత్=ఆకర్మను, తన్యతుః =పర్జన్యుఁడు, వృష్టింన= వర్షమునువలెనె, ఆవిష్కృణోమి = ప్రకటనచేయుచున్నాను. (అని పలికెను). ఆథర్వణః=అథర్వణపుత్రుఁడగు, దధ్యఙ్ = దధ్యఙ్ అను వాఁడు, యత్=ఏ, మధు=మధుస్వరూపమును, వాం=మీకు, అశ్వస్య =గుఱ్ఱముయొక్క, శీర్ష్ణా=శిరస్సుచేతను, ప్రయదీమువాచేతి = పలికె ననునది ఏదియో, (తత్=దానిని, ఆవిష్కృణోమి = ప్రకటనచేయు చున్నానని, అవోచత్=పలికెను).

తా॥ ఇదివరకు చెప్పఁబడిన పరబ్రహ్మవిద్యాస్తుతికొఱకు ఈ కథ ప్రారంభింపఁబడినది. ఏదియనఁగా, పూర్వము అథర్వణ పుత్రుఁడగు దధ్యఙ్ అనుఋషి ఇంద్రునివలన ఆత్మజ్ఞానలక్షణమైన మధు బ్రాహ్మణముచేత చెప్పఁబడిన పరబ్రహ్మవిద్యనుపొంది ఆశ వలన దేవవైద్యులగు అశ్వినీదేవతలయొద్దకువచ్చి ఓ అశ్వినీ దేవత లారా ! ఇంద్రుఁడు ఈ మధుబ్రాహ్మణముచేత చెప్పఁబడుటవలన మధువను పేరుగల బ్రహ్మవిద్యను ఎవరికిని చెప్పకూడదనిన్ని చెప్పిన యెడల నీ శిరస్సును ఛేదించుచున్నానని ఉపదేశ సమయమున ప్రతిజ్ఞ చేసి నాకు చెప్పెను. కాబట్టి మీకు చెప్పుటకు భయపడుచున్నాను. ఆభయము మీచేత పోగొట్టఁబడినయెడల మీకు ఆ మధువను పేరు గల బ్రహ్మవిద్యను ఉపదేశించుచున్నానని పలికెను. అప్పుడశ్వినీ దేవతలు ఓ అథర్వణుఁడా ! నికాభయమెంత మాత్రమును లేదు. మేమిప్పుడు నీ శిరస్సును ఛేదించి వేరొకప్రదేశమునపెట్టి అశ్వశిర స్సుతో నిన్ను కూర్చుచున్నాము ఆశిరస్సుతో మాకుపదేశించుమూ! ఆ ఉపదేశముచే ఇంద్రుఁడు కోపించి ఆశిరస్సు ఛేదించినయెడల తిరిగి నీశిరస్సును యథాప్రకారము కూర్చుచున్నాము. అని ప్రతిజ్ఞ చేసిచెప్పి ఆ ప్రకారముచేసి అశ్వినీదేవతలు అథర్వణుఁడను దధ్యఙ్ అనువానివలన మధువను బ్రహ్మవిద్యను పొందిరి. ఆ ఇదియె మధు

స్వరూపము. దీనిని అశ్వినీదేవతలకొఱకు దధ్యఙ్ అను ఋషి చెప్పెను. దీనిని మంత్రము పొందినవాడై దధ్యఙ్ అనువాఁడు తన శిరస్సును అశ్వినీదేవతలచే ఛేదింపఁబడినవాఁడై అశ్వశిరస్సుతోఁగూడుకొని ప్రవర్గ్యమనుకర్మ ప్రకరణమందు సూచింపఁబడిన మధువను బ్రహ్మవిద్యను అశ్వినీదేవతలకొఱకు చెప్పుట ఈ మొదలైన క్రూరమగు కర్మను పర్జన్యుఁడు ఉరుము మొదలైన వానిచేత వర్షమునువలెనె లోకమునందు ప్రకటనచేయుచున్నానని పలికెను.

ఉ॥ ఇదం వై తన్మధు దధ్యఙ్ఙాథర్వణోఽశ్విభ్యాముువాచ తదేతదృషిః పశ్యన్నవోచత్ ।ఆథర్వణాయాశ్వినౌదధీచేఽశ్వ్యగ్ శిరః ప్రత్యైరయతం । స వాం మధు ప్రవోచదృతాయన్ త్వాష్ట్రం యద్దస్రావపి కక్ష్యం వామితి. ॥17॥

ప॥ ఇదం - వై - తత్ - మధు - దధ్యఙ్ - ఆథర్వణః - అశ్విభ్యాం - ఉవాచ - తత్ - ఏతత్ - ఋషిః - పశ్యన్ - అవోచత్ - ఆథర్వణాయ - అశ్వినా - దధీచే - అశ్వ్యం - శిరః - ప్రతి - ఐరయతం - సః - వాం - మధు - ప్రవోచత్ - ఋతాయన్ - త్వాష్ట్రం - యత్ - దస్రా - అపి - కక్ష్యం - వాం - ఇతి.

ప్ర॥ తత్=ఆ, ఇదంవై = ఈప్రసిద్ధమగు, మధు=మధుస్వరూపమును, ఆథర్వణః = అథర్వణపుత్రుఁడగు, దధ్యఙ్ = దధ్యఙ్ అను వాఁడు. (పూర్వము చెప్పిన వానికంటె అన్యుఁడగు దధ్యఙ్ అను వాఁడు). అశ్విభ్యాం=దేవవైద్యులగు అశ్వినీదేవతలకొఱకు, ఉవాచ =పలికెను. తదేతత్=ఆ దీనిని, ఋషిః=మంత్రము, పశ్యన్=పొందినవాడై, హేఅశ్వినా = ఓ అశ్వినీదేవతలారా! (మీచేతను) దధీచే= దధ్యఙ్ అను పేరుగల, ఆథర్వణాయ = అథర్వణపుత్రుఁడగు వాని కొఱకు, అశ్వ్యం=అశ్వసంబంధమైన, శిరః=శిరస్సు, ప్రత్యైరయతం =పొందింపఁబడినది. సః=ఆదధ్యఙ్ అనువాఁడు. ఋతాయన్=సత్యమును పరిపాలించుకొొన నిచ్ఛగలవాఁడై, వాం = మీకొఱకు,

త్వాష్ట్రం = త్వష్టృసంబంధమైన, (త్వష్టయను సూర్యసంబంధమైన), మధు=మధుస్వరూపమును, (అనఁగా యజ్ఞసంబంధమగు ఛేదింపఁ బడిన శిరస్సు త్వష్టయను ఆదిత్యుఁడాయెను. ఆ శిరస్సును అను సంధానము చేయుటకు ప్రవర్గ్యమను కర్మకలిగినది. ఆప్రవర్గ్యకర్మాంగ భూతమైన శిరశ్ఛేదన శిరస్సంధానాదిరూపమగు విజ్ఞానము త్వాష్ట్రం మధువని చెప్పఁబడును), ప్రవోచత్ = పలికెను. అపిచ = మరిన్ని, హేదస్రౌ=శత్రుహంతకులగు ఓ అశ్వినీదేవతలారా! కక్ష్యం=రహస్యమైన పరమాత్మసంబంధమగు మధుస్వరూపము, యత్ = ఏదియో, (తచ్చ=అదిన్ని), వాం=మీకొఱకు, ప్రవోచదితి=పలికెనని, అవోచత్=చెప్పెను.

తా॥ పూర్వము చెప్పిన వానికంటె అన్యుఁడగు అథర్వణపుత్రుఁడగు దధ్యఙ్ అనువాఁడు ఆ ఈ ప్రసిద్ధమైన మధుస్వరూపమును దేవవైద్యులగు అశ్వినీదేవతలకొఱకు చెప్పెను. దీనిని మంత్రము పొందినదై ఓ అశ్వినీదేతవలారా! మీచేత దధ్యఙ్ అనువానికొఱకు అశ్వసంబంధమైన శిరస్సు పొందింపఁబడినది. ఆదధ్యఙ్ అనువాఁడు తాను ముందు మీకు ఉపదేశించుతానని చెప్పినవాక్యమును తప్పక సత్యపాలనమందిచ్ఛగలవాఁడై, ప్రవర్గ్య కర్మాంగ భూతమైన శిరశ్ఛేదన శిరస్సంధానాదిరూపమగు విజ్ఞానమునున్ను రహస్యమైన పరమాత్మసంబంధమైన విజ్ఞానమునున్ను మీకొఱకు చెప్పెనని పలికెను.

ఉ॥ ఇదం వై తన్మధు దధ్యఙ్ఙాథర్వణోఽశ్విభ్యామువాచ తదేతదృషిః పశ్యన్నవోచత్ । పురశ్చక్రే ద్విపదః పురశ్చక్రే చతుష్పదః । పురః స పక్షీ భూత్వా పురః పురుష ఆవిశదితి । స వా అయం పురుషః సర్వాసు పూర్షు పురిశయో నైనేనకించనా నావృతం నైనేన కించనా సంవృతమ్. ॥18॥

ప॥ ఇదం - వై - తత్ - మధు - దధ్యఙ్ - ఆథర్వణః - అశ్విభ్యాం - ఉవాచ - తత్ - ఏతత్ - ఋషిః - పశ్యన్ - అవోచత్ - పురః - చక్రే - ద్విపదః - పురః - చక్రే - చతుష్పదః - పురః - సః - పక్షీ - భూత్వా - పురః - పురుషః - ఆవిశత్ - ఇతి - సః - వై - అయం - పురుషః - సర్వాసు - పూర్షు - పురిశయః - న - అనేన - కించన - న - అనావృతం - న - అనేన - కించన - అసంవృతం.

ప్ర॥ దధ్యఙ్ = దధ్యఙ్ అను పేరుగల, ఆథర్వణః=అథర్వణ పుత్రుఁడగువాఁడు, తత్=ఆ, ఇదంవై=ఈ ప్రసిద్ధమగు, మధు=మధు స్వరూపమును, అశ్విభ్యాం = దేవవైద్యులగు అశ్వినీదేవతలకొఱకు, ఉవాచ=పలికెను. తదేతత్=ఆ దీనిని, ఋషిః=మంత్రము, పశ్యన్ =పొందినదై, అవోచత్=పలికెను, (పరమాత్మసంబంధమైన రహస్య మగు యే మధుస్వరూపమును ఆథర్వణుఁడు మీకొఱకు చెప్పెనని చెప్పఁబడినదో, అది యేదియనిన చెప్పఁబడుచున్నది). (సః=ఆపర మేశ్వరుఁడు, అవ్యాకృతే=అవ్యాకృతములగు, నామరూప = నామ రూపములను, వ్యాకుర్వాణః=చేయువాఁడై, ప్రథమం=ముందుగా, భూరాదిలోకాన్=భూలోకము మొదలైన లోకములను, సృష్ట్వా= సృజించి), ద్విపదః = రెండు పాదములుఁగల, (ద్విపాదుపలక్షితము లైన), పురః=శరీరములను, (మనుష్య శరీరములను), చక్రే=చేసెను. (తథా = ఆప్రకారముగానే), చతుష్పదః = నాలుగుపాదములుగల, పురః=శరీరములను, (చతుష్పాదుపలక్షితములైన పశు శరీరములను). చక్రే=చేసెను. సః=ఆ ఈశ్వరుఁడు. పురః=ముందుగా, పక్షీ=లింగ శరీరము, భూత్వా=అయి, పురః=శరీరములను, పురుషః = పురుష రూపుఁడుగా, ఆవిశదితి=ప్రవేశించెనని, (అవోచత్=పలికెను). స వై =ఆప్రసిద్ధుఁడైన, అయంపురుషః=ఈపురుషుఁడే, సర్వాసు=సమస్తము లైన, పూర్షు=దేహములయందు, పురిశయస్సన్ = ...

మగు దేహమునందుండువాఁడై, (దేహమందుండెడి వాఁడనెడి వ్యుత్పత్తిచేత, పురుషఇతి = పురుషుఁడని, ఉచ్యతే = చెప్పఁబడుచున్నాఁడు). అనేన=ఈ ఈశ్వరునిచేతను, కించన = కొంచెమున్ను, అనావృతం=ఆచ్ఛాదింపఁబడనిది, (కప్పఁబడనిది), న=లేదు. అనేన =ఈ ఈశ్వరునిచేతను, అసంవృతం=లోపల ప్రవేశింపబడనిది. కించన =కొంచెమున్ను, న=లేదు. (బాహ్యాంతరములై, నామరూపాత్మకములగు దేహేంద్రియరూపముతో నిండియున్నాఁడు).

తా॥ ఇంతకుపూర్వము రెండుమంత్రములచేత ప్రవర్గ్య రూపమగు కర్మే ప్రయోజనముగాఁగల రెండు అధ్యాయములయొక్క అర్థము ప్రకాశింపఁజేయఁబడినది. ఉత్తరమునందు ఇంక రెండు మంత్రములచేతను పరబ్రహ్మవిద్యయే ప్రయోజనముగా కలిగినటువంటి రెండు అధ్యాయములయొక్క అర్థము ప్రకాశింపఁజేయఁదగినది యనే కారణమువలన ప్రవర్తించుచున్నది. వెనుక పదియేడవ మంత్రముయొక్క అంతమునందు దేవవైద్యులగు అశ్వినులకొఱకు చెప్పఁబడిన రహస్యమైన పరమాత్మసంబంధమగు మధు స్వరూప మేదియో అది యేదియనఁగా ఇక్కడ చెప్పఁబడుచున్నది. పూర్వము ఆపరమేశ్వరుఁడు అవ్యాకృతములగు నామరూపములను చేయ నిచ్ఛయించినవాఁడై ముందుగా భూరాదిలోకములను సృజించి అనంతరము రెండుపాదములుగల మనుష్య శరీరములను తరువాత నాలుగుపాదములుగల పశుశరీరములను చేసెను. ఆశరీరములను ఈశ్వరుడు లింగశరీరియై ప్రవేశించెను గనుకనే ఈశ్వరుఁడే సమస్త దేహములయందును ఉండియున్నాఁడు. ఇట్లు ఈశ్వరుఁడు దేహమందుండుట వలననే పురుషుఁడనిన్ని చెప్పఁబడుచున్నాఁడు. ఇట్లు పురుష స్వరూపుఁడైన ఈశ్వరునిచేత కప్పఁబడనిదియును లోపల ప్రవేశింపఁబడనిదియును కొంచెమైనను లేదు॥ ఇట్లు బాహ్యాంతరమును నామరూపాత్మకమునగు దేహేంద్రియరూపముతోనున్నటువంటి ఈశ్వరునిచేత నిండియుండ

నిది కొంచెమైనను లేకపోవుటచేత పూర్ణుడనియును కనుకనే పురుషుడనియును చెప్పబడుచున్నాడు. ఇదియే దధ్యఙ్ అను ఆథర్వణుడు దేవవైద్యులగు అశ్వినీదేవతలకొఱకు చెప్పిన రహస్యమగు పరమాత్మ సంబంధమైన మధు స్వరూపము. దీనినే మంత్రము పొందిక సదై చెప్పెను.

ఉ॥ ఇదం వై తన్మధు దధ్యఙ్ఙాథర్వణోఽశ్విభ్యామువాచ తదేతదృషిః పశ్యన్నవోచత్ । రూపగ్ం రూపం ప్రతిరూపో బభూవ తదస్య రూపం ప్రతిచక్షణాయ । ఇన్ద్రో మాయాభిః పురురూప ఈయతే యుక్తా హ్యస్య హరయః శతా దశేతి । అయం వై హరయోఽయం వై దశ చ సహస్రాణి బహూని చానన్తాని చ తదేతద్బ్రహ్మాపూర్వమనపరమనన్తరమబాహ్యమయమాత్మా బ్రహ్మ సర్వానుభూరిత్యనుశాసనమ్. ॥19॥

ఇతి చతుర్థాధ్యాయే పఞ్చమం బ్రాహ్మణమ్.

ప॥ ఇదం - వై - తత్ - మధు - దధ్యఙ్ - ఆథర్వణః - అశ్విభ్యాం - ఉవాచ - తత్ - ఏతత్ - ఋషిః - పశ్యన్ - అవోచత్ - రూపం - రూపం - ప్రతిరూపః - బభూవ - తత్ - అస్య-రూపం - ప్రతిచక్షణాయ - ఇన్ద్రః - మాయాభిః - పురురూపః - ఈయతే - యుక్తాః - హి - అస్య - హరయః - శతా - దశ - ఇతి - అయం - హరయః - అయం - వై - హరయః - అయం - వై - దశ - చ - సహస్రాణి - బహూని - చ - అనన్తాని - చ-తత్ - ఏతత్ - బ్రహ్మ - అపూర్వం - అనపరం - అనన్తరం - అబాహ్యం - అయం - ఆత్మా - బ్రహ్మ - సర్వానుభూః - ఇతి - అనుశాసనం.

ప్ర॥ దధ్యఙ్=దధ్యఙ్ అనుపేరుగల, ఆథర్వణః = అథర్వణ పుత్రుడగువాడు, తత్=ఆ, ఇదంవై=ఈ ప్రసిద్ధమగు, మధు=మధు స్వరూపమును, అశ్విభ్యాం=దేవవైద్యులగు అశ్వినీదేవతలకొఱకు,

ఉవాచ=పలికెను. తదేతత్=ఆ దీనిని, ఋషిః=మంత్రము, పశ్యన్=పొందినదై, అవోచత్=పలికెను. (సః=ఆపరమేశ్వరుఁడు), అస్య=ఈ ఆత్మస్వరూపముయొక్క, రూపం=స్వరూపమును, ప్రతిచక్షణాయ=చెప్పికొనుటకు, రూపంరూపం=ప్రతిరూపమునుగూర్చి, ప్రతిరూపః=సమానమైన వేరొకరూపముగలవాఁడు, బభూవ=అయెను. (పరమేశ్వరుఁడు తన స్వరూపమును చెప్పుటకు మనుష్యాది జాతులయందు మాతాపితరులకు సమానమగు వేఱురూపమును పొందుచున్నాఁడు.) ఇన్ద్రః=పరమేశ్వరుఁడు, మాయాభిః = ప్రజ్ఞలచేతను, పురురూపః=అనేకరూపములుకలవాడుగా, ఈయతే = ఉండుచున్నాఁడు. అస్య=ఈపరమేశ్వరునికి, యుక్తాః = కూడుకొనిన, (దేహమునందుకూడుకొనిన), హరయః=ఇంద్రియములు, దశ=పదియైన, శతా = నూర్లు, భవన్తి=అగుచున్నవి). ఇతి = గనుక, అయంవై=ఈపరమేశ్వరుఁడే, హరయః=ఇంద్రియములు. అయంవై=ఈపరమేశ్వరుఁడే, దశ=పదియైన, సహస్రాణిచ = వేలున్ను, బహూనిచ = అనేకములున్ను, అనన్తానిచ=అంతములు లేనివిగను, (భవతి=అగుచున్నాఁడు). (యః=యేఆత్మ), అపూర్వం = పూర్వములేనిదియో, (కారణములేనిది), అనపరం = పరములేనిదియో, (కార్యములేనిది), అనన్తరం=అనంతరము లేనిదియో, (ఈ ఆత్మమధ్యమునందు వేరొకజాతిలేనిది), అబాహ్యం=బాహ్యములేనిదియో, (ఈఆత్మకు వెలుపలలేదు), తదేతత్=ఆఇది, బ్రహ్మ=పరబ్రహ్మము, సర్వానుభూః=సమస్తములు అనుభవించుచున్న, (సర్వస్వరూపముతో సమస్తమును అనుభవించుచున్న), అయం=ఈ, ఆత్మా = ఆత్మ (చూచునది, వినునది, తలంచునది, తెలిసికొనునది, విజ్ఞాతయనునది ఏదియో, ఈప్రత్యగాత్మ), బ్రహ్మ=పరబ్రహ్మస్వరూపము. ఇతి=ఇది, అనుశాసనం=ఉపదేశము,

తా॥ పరమేశ్వరుఁడు ఆత్మస్వరూపమును తెలియఁజేయుటకు మనుష్యాది జాతులయందు మాతాపితృలకు సమానమగు వేఱురూపమును పొందెను. ప్రజ్ఞానఘన స్వరూపుఁడైన ఆయన ఒక్కఁడయ్యు,

అవిద్యా ప్రజ్ఞలచేత అనేకరూపములు గలవాఁడుగా తోఁచఁబడుచున్నాఁడు. ఏప్రకారము అనఁగా, ఈపరమేశ్వరునకు మనుష్యాది దేహములయందు కూడుకొన్న ఇంద్రియములు ప్రాణిభేదముయొక్క విశేషమువలన అనేకములగుచున్నవి. ఆ ఇంద్రియములు అనేకములగు ఇంద్రియవిషయములను ప్రకాశింపఁజేయుటకు దేహములయందు రథమునందు గుఱ్ఱములవలెనే కూడుకొని యున్నవిగాని ఆత్మను ప్రకాశింపఁజేయుటకు కూడుకొన్నవిగావు. కనుకనే ఆ పరమేశ్వరుఁడు ఆ ఇంద్రియ విషయ స్వరూపములచేత బహుస్వరూపుఁడుగా తోఁచఁబడుచున్నాఁడే గాని ప్రజ్ఞానఘనైకమగు స్వరూపముతో బహుస్వరూపుఁడుగా తోఁచఁబడుటలేదు. ఇందుచే పరమేశ్వరుఁడు వేఱు, ఇంద్రియములు వేఱుకాదు. ప్రజ్ఞానఘనస్వరూపమైన పరమాత్మకు రథస్థానీయమగు శరీరమునందుఁ గూడుకొనియున్న ఇంద్రియములు తమ విషయములను ప్రకాశింపఁజేయుటయందు ప్రవర్తించుచున్నవి. కనుక ఆ ఇంద్రియముల యొక్కయు, ఆ ఇంద్రియ విషయముల యొక్కయు బాహుళ్యమునుండి వాని రూపములచేత ఈ పరమేశ్వరుఁడు బహురూపుఁడుగా తోఁచుచున్నాడు. ఆ పరమాత్మకే అజ్ఞానముచేత ఆ యా ఇంద్రియాది రూపముతో ప్రకాశము కలుగుటవలన పరమాత్మయె ఇంద్రియములును అనేకములును అనంతములును విషయములు నగుచున్నాఁడు. ఇదియే అపూర్వమును, అనపరమును, అనన్తరమును, అబాహ్యమునగు పరబ్రహ్మము. చూచుట, వినుట, తలంచుట, తెలిసికొనుట ఈ మొదలైన సర్వస్వరూపములతో సమస్తమును అనుభవించుచున్న ఈ ప్రత్యగాత్మే పరబ్రహ్మము. ఇది ఉపదేశము. ఈ పరమాత్మ సంబంధమగు రహస్యమైన మధుస్వరూపమును ఆథర్వణుఁడగు దధ్యఙ్ అనువాఁడు దేవవైద్యులగు అశ్వినీదేవతలకొఱకు చెప్పెను. దీనిని మంత్రము పొందినదై పలికెను.

ఇట్లు చతుర్థాధ్యాయమునందు పఞ్చమబ్రాహ్మణము సమాప్తము.

చతుర్థాధ్యాయము, షష్ఠబ్రాహ్మణము

ఉ॥ అథ వగ్ంశః పౌతిమాష్యో గౌపవనాద్గౌపవనః పౌతిమాష్యాత్పౌతి
మాష్యో గౌపవనాద్గౌపవనః కౌశికాత్కౌశికః కౌణ్డిన్యాత్కౌణ్డి
న్యః శాణ్డిల్యాచ్ఛాణ్డిల్యః కౌశికాచ్చ గౌతమాచ్చ గౌతమః. ॥1
అగ్నివేశ్యాదాగ్నివేశ్యః శాణ్డిల్యాచ్చానభిమ్లాతాచ్చానభి
మ్లాత ఆనభిమ్లాతాదానభిమ్లాత ఆనభిమ్లాతాదానభిమ్లాతో
గౌతమాద్గౌతమః సైతవప్రాచీనయోగ్యాభ్యాగ్ం సైతవప్రా
చీనయోగ్యౌ పారాశర్యాత్పారాశర్యో భారద్వాజాద్భార
ద్వాజో భారద్వాజాచ్చ గౌతమాచ్చ గౌతమో భార
ద్వాజాద్భారద్వాజః పారాశర్యాత్పారాశర్యో బైజవాపాయనా
ద్బైజవాపాయనః కౌశికాయనేః కౌశికాయనిః. ॥2

ఉ॥ ఘృతకౌశికాద్ఘృతకౌశికః పారాశర్యాయణాత్పారాశర్యాయణః
పారాశర్యాత్పారాశర్యో జాతూకర్ణ్యాజ్జాతూకర్ణ్య ఆసురాయ
ణాచ్చ యాస్కాచ్చాసురాయణస్త్రైవణేస్త్రైవణిరౌపజన్ధనేరౌప
జన్ధనిరాసురేరాసురిర్భారద్వాజాద్భారద్వాజ ఆత్రేయాదాత్రేయో
మాణ్టేర్మాణ్టిర్గౌతమాద్గౌతమో గౌతమాద్గౌతమో వాత్స్యాద్వాత్స్యః
శాణ్డిల్యాచ్ఛాణ్డిల్యః కైశోర్యాత్కాప్యాత్కైశోర్యః కాప్యః కుమార
హారితాత్కుమారహారితో గాలవాద్గాలవో విదర్భీకౌణ్డిన్యాద్విదర్భీ
కౌణ్డిన్యో వత్సనపాతో బాభ్రవాద్వత్సనపాద్బాభ్రవః పథః సౌభ
రాత్పన్థాః సౌభరోఽయాస్యాదాఙ్గిరసాదయాస్య ఆఙ్గిరస ఆభూతే
స్త్వాష్ట్రాదాభూతిస్త్వాష్ట్రో విశ్వరూపాత్త్వాష్ట్రాద్విశ్వరూపస్త్వాష్ట్రోఽ
శ్విభ్యామశ్వినౌ దధీచ ఆథర్వణాద్దధ్యఙ్ఙాథర్వణోఽథర్వణో దైవాదథ
ర్వా దైవో మృత్యోః ప్రాధ్వగ్ంసనాన్మృత్యుః ప్రాధ్వగ్ంసనః
ప్రధ్వగ్ంసనాత్ప్రధ్వగ్ంసన ఏకఋషేరేకఋషిర్విప్రచిత్తేర్విప్రచి
త్తిర్వ్యష్టేర్వ్యష్టిస్సనారోః సనారుస్సనాతనాత్సనాతనస్సనకాత్స
నకః పరమేష్ఠినః పరమేష్ఠీ బ్రహ్మణో బ్రహ్మ స్వయమ్భు బ్రహ్మణే నమః.

ఇతి చతుర్థాధ్యాయే షష్ఠం బ్రాహ్మణమ్. చతుర్థాధ్యాయస్సమాప్తః

ప॥ అథ - వంశః-పౌతిమాష్యః-గౌపవనాత్ - గౌపవనః-పౌతిమాష్యాత్ - పౌతిమాష్యః - గౌపవనాత్ - గౌపవనః - కౌశికాత్ - కౌశికః - కౌణ్డిన్యాత్ - కౌణ్డిన్యః - శాణ్డిల్యాత్ - శాణ్డిల్యః - కౌశికాత్ - చ - గౌతమాత్-చ-గౌతమః-ఆగ్నివేశ్యాత్ - ఆగ్నివేశ్యః-శాణ్డిల్యాత్-చ-ఆనభిమ్లాతాత్-చ-ఆనభిమ్లాతః- ఆనభిమ్లాతాత్ - ఆనభిమ్లాతః - ఆనభిమ్లాతాత్ - ఆనభిమ్లాతః - గౌతమాత్ - గౌతమః - సైతవప్రాచీనయోగ్యాభ్యాం - సైతవప్రాచీనయోగ్యౌ - పారాశర్యాత్ - పారాశర్యః - భారద్వాజాత్ - భారద్వాజః - భారద్వాజాత్ - చ - గౌతమాత్ - చ - గౌతమః - భారద్వాజాత్ - భారద్వాజః - పారాశర్యాత్ - పారాశర్యః - బైజవాపాయనాత్ - బైజవాపాయనః-కౌశికాయనేః - కౌశికాయనిః॥ ఘృతకౌశికాత్ - ఘృతకౌశికః - పారాశర్యాయణాత్ - పారాశర్యాయణః - పారాశర్యాత్ - పారాశర్యః - జా[illegible]త్ - జా[illegible]ః - ఆసురాయణాత్ - చ - యాస్కాత్ - చ - ఆసురాయణః - త్రైవణేః - త్రైవణిః - ఔపజన్ధనేః - ఔపజన్ధనిః - ఆసురేః - ఆసురిః - భారద్వాజాత్ - భారద్వాజః - ఆత్రేయాత్ - ఆత్రేయః - మాణ్టేః - మాణ్టిః - గౌతమాత్ - గౌతమః - గౌతమాత్ - గౌతమః - వాత్స్యాత్ - వాత్స్యః - శాణ్డిల్యాత్ - శాణ్డిల్యః - కైశోర్యాత్ - కాప్యాత్ - కైశోర్యః - కాప్యః - కుమారహారితాత్ - కుమారహారితః - గాలవాత్ - గాలవః - విదర్భీకౌణ్డిన్యాత్ - విదర్భీకౌణ్డిన్యః - వత్సనపాతః - బాభ్రవాత్ - వత్సనపాత్ - బభ్రవః - పథస్సౌభరాత్ - పన్థాస్సౌభరః - అయాస్యాదాఙ్గిరసాత్ - అయాస్య అఙ్గిరసః - ఆభూతేస్త్వాష్ట్రాత్ - ఆభూతిస్త్వాష్ట్రః - విశ్వరూపాత్త్వాష్ట్రాత్ - విశ్వరూపస్త్వాష్ట్రః - అశ్విభ్యాం - అశ్వినౌ - దధీచ - ఆథర్వణాత్ - దధ్యఙ్ఙాథర్వణః - అథర్వణోదైవాత్ - అథర్వాదైవః-మృత్యోః - ప్రాధ్వంసనాత్ -

మృత్యోఃప్రాధ్వంసనః - ప్రధ్వంసనాత్-ప్రధ్వంసనః - ఏకఋషేః-ఏకఋషిః - విప్రచిత్తేః - విప్రచిత్తిః - వ్యష్టేః - వ్యష్టిః - సనారోః-సనారుః - సనాతనాత్ - సనాతనః - సనకాత్ - సనకః - పరమేష్ఠినః - పరమేష్ఠీ - బ్రహ్మణః - బ్రహ్మ - స్వయమ్భు - బ్రహ్మణే-నమః.

ప్ర॥ అథ=ఇప్పుడు, వంశః=వంశము, (ఉచ్యతే=చెప్పఁబడుచున్నది. ఈ నాలుగు అధ్యాయములకు ఆచార్యపరంపరాక్రమము చెప్పఁబడుచున్నది.) పౌతిమాష్యః = పౌతిమాష్యుఁడను వాఁడు, గౌపవనాత్ =గౌపవనునివల్లను, గౌపవనః = గౌపవనుఁడనువాఁడు. పౌతిమాష్యాత్ = పౌతిమాష్యుని వల్లను, పౌతిమాష్యః = పౌతిమాష్యుఁడు, గౌపవనాత్ = గౌపవనుని వల్లను, గౌపవనః = గౌపవనుఁడు, కౌశికాత్ = కౌశికుని వల్లను. కౌశికః = కౌశికుఁడు, కౌణ్డిన్యాత్=కౌణ్డిన్యునివల్లను, కౌణ్డిన్యః=కౌణ్డిన్యుఁడు, శాణ్డిల్యాత్=శాణ్డిల్యుని వల్లను, శాణ్డిల్యః = శాణ్డిల్యుఁడు, కౌశికాచ్చ = కౌశికుని వల్లను, గౌతమాచ్చ = గౌతముని వల్లను, గౌతమః = గౌతముఁడు, ఆగ్నివేశ్యాత్ = ఆగ్నివేశ్యుని వల్లను, ఆగ్నివేశ్యః = ఆగ్నివేశ్యుఁడు, శాణ్డిల్యాచ్చ = శాండిల్యుని వల్లను, ఆనభిమ్లాతాచ్చ = ఆనభిమ్లాతుని వల్లను, ఆనభిమ్లాతః=ఆనభిమ్లాతుఁడు, ఆనభిమ్లాతాత్=ఆనభిమ్లాతుని వల్లను, ఆనభిమ్లాతః=ఆనభిమ్లాతుఁడు, గౌతమాత్ = గౌతముని వల్లను, గౌతమః=గౌతముఁడు, సైతవప్రాచీనయోగ్యాభ్యాం=సైతవప్రాచీనయోగ్యులను వారిద్దరివల్లను, సైతవప్రాచీనయోగ్యౌ=సైతవప్రాచీనయోగ్యులను వారిద్దరు, పారాశర్యాత్ = పారాశర్యుని వల్లను, పారాశర్యః =పారాశర్యుఁడు, భారద్వాజాత్=భారద్వాజుని వల్లను, భారద్వాజః = భారద్వాజుఁడు, భారద్వాజాచ్చ = భారద్వాజుని వల్లను, గౌతమాచ్చ = గౌతముని వల్లను, గౌతమః = గౌతముఁడు, భారద్వాజాత్ = భారద్వాజుని వల్లను, భారద్వాజః =

భారద్వాజుఁడు, పారాశర్యాత్=పారాశర్యుని వల్లను, పారాశర్యః=పారాశర్యుఁడు. బైజవాపాయనాత్=బైజవాపాయనుని వల్లను, బైజవాపాయనః = బైజవాపాయనుఁడు. కౌశికాయనేః = కౌశికాయనుని వల్లను, కౌశికాయనిః = కౌశికాయనుఁడు, ఘృతకౌశికాత్ = ఘృతకౌశికుని వల్లను, ఘృతకౌశికః = ఘృతకౌశికుఁడు, పారాశర్యాయణాత్ = పారాశర్యాయణుని వల్లను, పారాశర్యాయణః = పారాశర్యాయణుఁడు, పారాశర్యాత్=పారాశర్యుని వల్లను, పారాశర్యః=పారాశర్యుఁడు, జాతూకర్ణ్యాత్ = జాతూకర్ణ్యుని వల్లను, జాతూకర్ణ్యః = జాతూకర్ణ్యుఁడు, ఆసురాయణాచ్చ=ఆసురాయణునివల్లను, యాస్కాచ్చ=యాస్కునివల్లను, ఆసురాయణః=ఆసురాయణుఁడు, త్రైవణేః = త్రైవణి వల్లను, త్రైవణిః = త్రైవణి, ఔపజన్ధనేః = ఔపజన్ధని వల్లను, ఔపజన్ధనిః = ఔపజన్ధని, ఆసురేః = ఆసురివల్లను, ఆసురిః = ఆసురి, భారద్వాజాత్ = భారద్వాజుని వల్లను, భారద్వాజః=భారద్వాజుఁడు. ఆత్రేయాత్=ఆత్రేయుని వల్లను, ఆత్రేయః=ఆత్రేయుఁడు, మాణ్టేః=మాణ్టివల్లను, మాణ్టిః=మాణ్టి, గౌతమాత్=గౌతముని వల్లను, గౌతమః = గౌతముఁడు, గౌతమాత్=గౌతముని వల్లను, గౌతమః = గౌతముఁడు, వాత్స్యాత్ = వాత్స్యుని వల్లను, వాత్స్యః = వాత్స్యుఁడు, శాణ్డిల్యాత్ = శాండిల్యుని వల్లను, శాణ్డిల్యః = శాండిల్యుఁడు, కైశోర్యాత్ = కైశోర్యుఁడను, కాప్యాత్ = కాప్యునివల్లను, కైశోర్యః = కైశోర్యుఁడను, కాప్యః = కాప్యుఁడు, కుమారహారీతాత్ = కుమారహారీతుని వల్లను, కుమారహారీతః = కుమారహారీతుఁడు, గాలవాత్ = గాలవుని వల్లను, గాలవః=గాలవుఁడు, విదర్భీకౌణ్డిన్యాత్ = విదర్భీకౌణ్డిన్యుని వల్లను, విదర్భీకౌణ్డిన్యః= విదర్భీకౌణ్డిన్యుఁడు, వత్సనపాతః=వత్సనపాత్తను, బాభ్రవాత్= బాభ్రవుని వల్లను, వత్సనపాత్=వత్సనపాత్తను, బాభ్రవః = బాభ్రవుఁడు, పథస్సౌభరాత్ = పంథాయను సౌభరుని వల్లను, పన్థాస్సౌభ

రః = పంథాయను సౌభరుఁడు, ఆయాస్యాదాఙ్గిరసాత్ = ఆయాస్య యను ఆఙ్గిరసుని వల్లను, ఆయాస్య ఆఙ్గిరసః = ఆయాస్యయను ఆఙ్గిరసుఁడు, ఆభూతేస్త్వాష్ట్రాత్=ఆభూతియను త్వాష్ట్రుని వల్లను, ఆభూతిస్త్వాష్ట్రః=ఆభూతియను త్వాష్ట్రుఁడు, విశ్వరూపాత్త్వాష్ట్రాత్ = విశ్వరూపుఁడను త్వాష్ట్రుని వల్లను, విశ్వరూపస్త్వాష్ట్రః = విశ్వరూపుఁడను త్వాష్ట్రుఁడు, అశ్విభ్యాం = అశ్వినుల వల్లను, అశ్వినౌ=అశ్వినులు, దధీచ ఆథర్వణాత్ =దధ్యఙ్ఙను ఆథర్వణుని వల్లను, దధ్యఙ్ఙాథర్వణః= దధ్యఙ్ అను ఆథర్వణుఁడు, ఆథర్వణో దైవాత్ = అథర్వుఁడను దేవుని వల్లను, అథర్వా దైవః = అథర్వుఁడను దైవము, మృత్యోః ప్రాధ్వంసనాత్ = మృత్యువను ప్రాధ్వంసనుని వల్లను, మృత్యుః ప్రాధ్వంసనః = మృత్యువను ప్రాధ్వంసనుఁడు, ప్రధ్వంసనాత్ = ప్రధ్వంసనుని వల్లను, ప్రధ్వంసనః = ప్రధ్వంసనుఁడు, ఏకఋషేః= ఏకఋషి వల్లను, ఏకఋషిః = ఏకఋషి, విప్రచిత్తేః = విప్రచిత్తి వల్లను, విప్రచిత్తిః = విప్రచిత్తి, వ్యష్టేః = వ్యష్టి వల్లను, వ్యష్టిః = వ్యష్టి, సనారోః = సనారుని వల్లను, సనారుః = సనారువు, సనాతనాత్ = సనాతనుని వల్లను, సనాతనః = సనాతనుఁడు, సనకాత్= సనకుని వల్లను, సనకః = సనకుఁడు, పరమేష్ఠినః = విరాట్టువల్లను, పరమేష్ఠీ = విరాట్టు, బ్రహ్మణః=హిరణ్యగర్భుని వల్లను, (ఇక్కడ పరమేష్ఠి బ్రహ్మ శబ్దములకు ఒక యర్థమే యైనను బ్రహ్మముఖముల వలన తనంతటనే పుట్టిన వేదము హిరణ్యగర్భ మనఁబడును. ఈశ్వరాను గృహీతుఁడైన బ్రహ్మకు తన బుద్ధియందు కలిగిన వేదము వల్లనే జ్ఞాన ముదయించుట వలన ఇట్లు చెప్పఁబడినది). బ్రహ్మ = వేదము, స్వయమ్భు= తనంతట తాను పుట్టినది. (తస్మై=అటువంటి= వేఱొక కారణము లేక తనంతటనే పుట్టినటువంటి వేదస్వరూపమైన), బ్రహ్మణే = బ్రహ్మము కొఱకు, నమః = నమస్కారము.

తా॥ ఇప్పుడు ఇంతకు పూర్వము చెప్పిన పరబ్రహ్మ విద్యకు

పౌతిమాష్యుఁడు మొదలుకొని వేదమను పేరుగల బ్రహ్మపర్యంతము గురుశిష్యవంశ పరంపరను చెప్పి ఆద్యంతములయందు చేయఁదగిన మంగళమును తెలియఁజేయుటకు అంతమునందు బ్రహ్మమునకు నమస్కారమని చెప్పఁబడినది.

ఇట్లు చతుర్థాధ్యాయమునందు
షష్ఠబ్రాహ్మణము సమాప్తము.

---

శ్రీ

శుక్ల యజుర్వేద - కాణ్వశాఖాయామ్.

# బృహదారణ్యకోపనిషత్

## పఞ్చమాధ్యాయము.

శాంతిః ఓమ్॥ పూర్ణమదః పూర్ణమిదం పూర్ణాత్పూర్ణముదచ్యతే (చ్య) తే।
పూర్ణస్య పూర్ణమాదాయ పూర్ణమేవా వశిష్యతే.

ఓమ్ శాన్తిః శాన్తిః శాన్తిః (చూ. 7. 1-1.)

ఉ॥ జనకో హ వైదేహో బహుదక్షిణేన యజ్ఞేనేజే తత్ర హ కురుపాఞ్చాలానాం బ్రాహ్మణా అభిసమేతా బభూవుస్తస్య హ జనకస్య వైదేహస్య విజిజ్ఞాసాబభూవ కస్స్విదేషాం బ్రాహ్మణానామనూచానతమ ఇతి స హ గవాగ్ సహస్రమవరురోధ దశ దశ పాదా ఏకైకస్యాః శృఙ్గయోరాబద్ధా బభూవుః. ॥1॥

ప॥ జనకః - హ - వైదేహః - బహుదక్షిణేన - యజ్ఞేన - ఈజే - తత్ర - హ - కురుపాఞ్చాలానాం - బ్రాహ్మణాః - అభిసమేతాః - బభూవుః - తస్య - హ - జనకస్య - వైదేహస్య - విజిజ్ఞాసా - బభూవ - కః - స్విత్ - ఏషాం - బ్రాహ్మణానాం - అనూచానతమః - ఇతి - సః - హ - గవాం - సహస్రం - అవరురోధ - దశ - దశ - పాదాః - ఏకైకస్యాః - శృఙ్గయోః - ఆబద్ధాః - బభూవుః.

ప్ర॥ వైదేహః = విదేహదేశమందైన, జనకోహవై = జనకమహారాజు, బహుదక్షిణేన = బహుదక్షిణమను పేరుగల, యజ్ఞేన= యజ్ఞము చేతను, (లేక అశ్వమేధయాగముచేతను), ఈజే=యాగము చేసెను. తత్రహ = ఆ యజ్ఞమునందు, కురుపాఞ్చాలానాం = కురుపాంచాల దేశములలోని, బ్రాహ్మణాః = బ్రాహ్మణులు,అభిసమేతాః= కూడివచ్చినవారలు, బభూవుః = అయిరి. ఏషాంబ్రాహ్మణానాం =

ఈ బ్రాహ్మణులలో, అనూచానతమః = మిక్కిలి సాంగ వేదాధ్యాపకుఁడు, (షడంగములతో వేదమును చదువుకొన్నవాఁడు), కస్స్విత్ = ఎవఁడో. ఇతి = అని, తస్యహ = ఆ ప్రసిద్ధుఁడగు, వైదేహస్య = విదేహదేశమందైన, జనకస్య = జనకమహారాజునకు, విజిజ్ఞాసా = తెలిసికొనుటకు ఇచ్ఛ, బభూవ = కలిగెను. సహ = ఆ జనక మహారాజు, గవాం = గోవులయొక్క, సహస్రం = వేయింటిని, అవరురోధ = అడ్డగించెను. (పశువుల దొడ్డియందు అరికట్టెను). ఏకైకస్యాః = ఒక్కొక గోవుయొక్క, శృంగయోః = కొమ్ములయందు, దశదశ = పదేసి పదేసి, పాదాః = పాదములు, (బంగారముయొక్క పలమునకు నాలవభాగము పాదమనఁబడును. అనఁగా ముప్పాతిక తులము. అటువంటి ముప్పాతిక తులములు ఒయిదేసిచొప్పున రెండు కొమ్ములయందును పదిముప్పాతిక తులములు, అనఁగా ఏడున్నర తులముల బంగారము), ఆబద్ధాః=కూర్చఁబడినవి, బభూవుః=ఆయెను.

తా॥ ఇంతకు పూర్వము ఆత్మైకత్వమును హస్తమును పొందిన మారేడు ఫలము వలెనే ప్రత్యక్షముగా ప్రకాశింపఁజేయుటకు సమర్థములైన ఆగమోపపత్తుల రెంటిలో ఆగమ ప్రధానమైన మధుకాండమును చెప్పి ఉపపత్తి ప్రధానమైన యాజ్ఞవల్క్య సంబంధమగు కాండము ప్రారంభింపఁబడినది. ఈ కథ బ్రహ్మవిద్యా ప్రాప్తియొక్క యుపాయమును చూపించుటయే ప్రయోజనముగా కలది. పూర్వము విదేహదేశములకు ప్రభువైన మండలాధిపతియగు జనకమహారాజు కలఁడు. ఆయన బహు దక్షిణమను పేరుగల యాగమును చేసెను. ఆ యాగమునకు పిలువఁబడినవారును చూడవలయునను కోరిక గలవారునగు కురుపాంచాల దేశములలోని గొప్పవిద్వాంసులు వచ్చిరి. అప్పుడు జనకమహారాజు ఆ గొప్ప విద్వాంసుల సముదాయమును చూచి వీరిలో పరబ్రహ్మము తెలిసిన వారెవరో ఒకరా? లేక వీరందరా? యని తెలిసికొన నిచ్ఛగలవాఁడై అట్లు తెలిసికొనుటకుపాయార్థమై

ఒక్కొక్క గోవునకు ఒక్కొక్క కొమ్మునకు మూడుతులాలన్నర యెత్తు గల బంగారపు కొమ్ములు ప్రతి గోవునకు రెండు కొమ్ములయందు అమర్చి వేయి గోవులను ఒక పశువుల దొడ్డియందు నింపెను.

ఉ॥ తాన్హోవాచ బ్రాహ్మణా భగవన్తో యో వో బ్రహ్మిష్ఠః స ఏతా గా ఉదజతామితి । తే హ బ్రాహ్మణా న దధృషురథ హ యాజ్ఞవల్క్యః స్వమేవ బ్రహ్మచారిణ మువాచైతాః సోమ్యోదజ సామశ్రవ ఇతి తా హోదాచకార తే హ బ్రాహ్మణాశ్చుక్రుధుః కథం నో బ్రహ్మిష్ఠో బ్రవీతేత్యథ హ జనకస్య వైదేహస్య హోతాశ్వలో బభూవ స హైనం పప్రచ్ఛ త్వం ను ఖలు నో యాజ్ఞవల్క్య బ్రహ్మిష్ఠోఽసీ 3 ఇతి స హోవాచ నమో వయం బ్రహ్మిష్ఠాయ కుర్మో గోకామా ఏవ వయగ్ స్మ ఇతి తగ్ హ తత ఏవ ప్రష్టుం దధ్రే హోతాశ్వలః. ॥2॥

ప॥ తాన్ – హోవాచ – బ్రాహ్మణాః – భగవన్తః – యః – వః – బ్రహ్మిష్ఠః – సః – ఏతాః – గాః – ఉదజతాం – ఇతి – తే – హ – బ్రాహ్మణాః – న – దధృషుః – అథ – హ – యాజ్ఞవల్క్యః – స్వం – ఏవ – బ్రహ్మచారిణం – ఉవాచ – ఏతాః – సోమ్య – ఉదజ – సామశ్రవః ఇతి – తాః – హోదాచకార – తే – హ – బ్రాహ్మణాః – చుక్రుధుః – కథం – నః – బ్రహ్మిష్ఠః – బ్రవీత – ఇతి – అథ – హ – జనకస్య – వైదేహస్య – హోతా – అశ్వలః – బభూవ – సః – హ – ఏనం – పప్రచ్ఛ – త్వం – ను – ఖలు – నః – యాజ్ఞవల్క్య – బ్రహ్మిష్ఠః – అసీ – ఇతి – సః – హోవాచ – నమః – వయం – బ్రహ్మిష్ఠాయ – కుర్మః – గోకామాః – ఏవ – వయం – స్మ – ఇతి – తం – హ – తతః – ఏవ – ప్రష్టుం – దధ్రే – హోతా – అశ్వలః,

ప్ర॥ హేభగవన్తః = పూజ్యులగు, హేబ్రాహ్మణాః = ఓ బ్రాహ్మణులారా! వః = మీలోపల, బ్రహ్మిష్ఠః = బ్రహ్మవేత్త,

యః = ఎవఁడో, సః = వాఁడు, ఏతాః = ఈ, గాః = గోవులను, ఉదజతామితి = తోలుకొని పోవునుగాక యని, (సః = ఆ జనక మహారాజు), తాన్ = ఆ బ్రాహ్మణులను గూర్చి, హోవాచ = పలికెను. తేహ = ఆ ప్రసిద్ధులగు, బ్రాహ్మణాః = బ్రాహ్మణులు, నదధృషుః = సమర్థులు కాకపోయిరి. అథహ = అనంతరము, యాజ్ఞవల్క్యః = యాజ్ఞవల్క్యుఁడు, స్వమేవ = తన సంబంధుఁడగు, బ్రహ్మచారిణం = శిష్యునిగూర్చి, హేసోమ్య = ఓ సౌమ్యుఁడా! హేసామశ్రవః = సామవిధిని వినెడి ఓ శిష్యుఁడా! (త్వం = నీవు), ఏతాః = ఈ గోవులను, ఉదజ = తోలుకొని పొమ్మా, ఇతి = అని, ఉవాచ = పలికెను. (సః = ఆ సామశ్రవుడు), తాః = ఆ గోవులను, హోదాచకార = తోలుకొనిపోయెను. తేహ = ఆ ప్రసిద్ధులగు, బ్రాహ్మణాః = బ్రాహ్మణులు, నః = మనలోపల, (అయం = ఈ యాజ్ఞవల్క్యుఁడు, అహం = నేను), బ్రహ్మిష్ఠః = బ్రహ్మవేత్తను, (ఇతి = అని), కథం = ఎట్లు, బ్రవీతేతి = పలికెనని, చుక్రుధుః = కోపించిరి. అథహ = అనంతరము, వైదేహస్య = విదేహ దేశమునందు పుట్టిన, జనకస్య = యజమానియగు జనకమహారాజునకు, అశ్వలః = అశ్వలుఁడను పేరుగల, హోతా = ఋత్విక్కు, బభూవ = ఉండెను. సహ = ఆ అశ్వలుఁడు, ఏనం = ఈ యాజ్ఞవల్క్యునిఁ గూర్చి, హేయాజ్ఞవల్క్య = ఓ యాజ్ఞవల్క్యుఁడా! త్వం = నీవు, ఖలు = నిశ్చయముగా, నః = మాలో, కథం = ఎటుల, బ్రహ్మిష్ఠః = బ్రహ్మవేత్తవు, అసీ = అయితివి, ఇతి = అని, పప్రచ్ఛ = అడిగెను. సః = ఆ యాజ్ఞవల్క్యుఁడు, హోవాచ = పలికెను. వయం = మేము, బ్రహ్మిష్ఠాయ = బ్రహ్మవేత్తకొఱకు, నమః = నమస్కారమును, కుర్మః = చేయుచున్నాము. వయం = మేము, గోకామాయేవ = గోవులనుకోరువారమే, స్మః = అగుచున్నాము, ఇతి = అని, (ఉవాచ = పలికెను.) తతఏవ = అందువల్లనే, హోతా = ఋత్విక్కగు, అశ్వలః = అశ్వ

లుఁడు, తంహ = ఆ యాజ్ఞవల్క్యుని, ప్రష్టుం=అడుగుటకు, (మనః= మనస్సును), దధ్రే = ధరించెను.

తా॥ జనకమహారాజు ఇట్లు వేయిగోవులను దొడ్డియందుంచి, పూజ్యులగు ఓ బ్రాహ్మణులారా! మీ లోపల బ్రహ్మవేత్తయగు వాఁడు ఈ గోవులను తోలుకొని పోవలసినదని పలుకఁగా ఆ బ్రాహ్మణులు ధైర్యములేనివారైరి. అప్పుడు యాజ్ఞవల్క్యుఁడు తన సంబంధుఁడగు సామశ్రవుఁడను శిష్యుని పిలిచి నీవు ఈ గోవులను మన యింటికి తోలుకొని పొమ్మని చెప్పఁగా ఆ శిష్యుఁడు ఆ గోవులను ఇంటికి తోలుకొని పోయెను. అప్పుడా బ్రాహ్మణులందఱు ఈ యాజ్ఞవల్క్యుఁడు మన అందఱిలో, నేను బ్రహ్మవేత్తనని ఎట్లు పలికెనని కోపము గలవారైరి. ఇట్లుండఁగా యాగమును చేయుచున్న జనక మహారాజునకు ఋత్విక్కైన అశ్వలుఁడనువాఁడు ఈ యాజ్ఞవల్క్యునిఁ గూర్చి ఓ యాజ్ఞవల్క్యుఁడా! నీవే మా అందఱిలో ఎట్టు బ్రహ్మవేత్తవు అయితివని అడిగెను. ఇట్లడుగఁగా ఆ యాజ్ఞవల్క్యుఁడు ఆ అశ్వలునిగూర్చి మేము బ్రహ్మవేత్తకొఱకు నమస్కరించుచున్నాము. మేము బ్రహ్మవేత్తృత్వమునకు పణముగా నుంచిన గోవులను గోకాములమై తోలుకొనిపోతిమి గాని బ్రహ్మవేత్తృత్వమునం దభిమానము కలిగి తోలుకొని పోలేదు గనుక మేము గోవులను కోరువారమే అగుచున్నామని పరిహాసముగా పలికెను. ఇట్లు బ్రహిష్ఠ పణమును గ్రహించుట వలన ఋత్విక్కగు అశ్వలుఁడు ఆ యాజ్ఞవల్క్యుని ప్రశ్న చేసి యడుగుటకు మనస్సు కలవాఁడాయెను.

ఉ॥ యాజ్ఞవల్క్యేతి హోవాచ యదిదగ్ం సర్వం మృత్యునాప్తగ్ం సర్వం మృత్యునాభిపన్నం కేన యజమానో మృత్యోరాప్తి మతిముచ్యత ఇతి హోత్రర్త్విజాగ్నినా వాచా వాగ్వై యజ్ఞస్య హోతా తద్యేయం వాక్ సోఽయమగ్నిః స హోతా స ముక్తి స్సాతిముక్తిః. ॥3॥

ప॥ యాజ్ఞవల్క్య – ఇతి – హోవాచ – యత్ – ఇదం – సర్వం – మృత్యునా – ఆ ప్తం – సర్వం – మృత్యునా – అభిపన్నం – కేన – యజమానః – మృత్యోః – ఆ ప్తిం–అతి – ముచ్యతే – ఇతి – హోత్ర ర్త్విజా – అగ్నినా – వాచా – వాక్ – వై – యజ్ఞస్య – హోతా – తత్ – యా – ఇయం – వాక్ – సః – అయం – అగ్నిః – సః – హోతా – సః – ముక్తిః – సా – అతిముక్తిః.

ప్ర॥ (సః = ఆ అశ్వలుఁడు), యాజ్ఞవల్క్యేతి = ఓ యాజ్ఞవల్క్యుఁడా యని, (ముందు అడిగెడి ప్రశ్నను), హోవాచ=పలికెను. యదిదంసర్వం = ఏ ఈ సమస్తము, మృత్యునా = మృత్యువుచేతను, ఆప్తం = వ్యాప్తమైనది. సర్వం=సమస్తము, మృత్యునా=మృత్యువుచేతను, అభిపన్నం = స్వాధీనము చేసికొనఁబడ్డది. యజమానః = యజమానుఁడు, కేన = ఏ సాధనముచేత, మృత్యోః = మృత్యువుయొక్క, ఆప్తిం = కూడికను, (గోచరమగుటను), అతిముచ్యతే = అతిక్రమించి విడుచుచున్నాఁడు. ఇతి = అని, (హోవాచ=పలికెను). హోత్ర ర్త్విజా=హోతయైన ఋత్విక్స్వరూపుఁడును, (హోతయనఁగా ఋగ్వేదము తెలిసిన ఋత్విక్కు), అగ్నినా = అగ్ని స్వరూపమునగు, వాచా = వాక్కుచేతను, (అతిముచ్యతే = అతిక్రమించి విడుచుచున్నాఁడుఅని, యాజ్ఞవల్క్యః=యాజ్ఞవల్క్యుఁడు, ఆహ=చెప్పెను). యజ్ఞస్య = యజమానియొక్క, వాగ్వై = వాక్కే, హోతా = హోతయను ఋత్విక్కు. తత్=వానియందు, (ఆ యజమానియందు), ఇయంవాక్ = ఈవాక్కు, యా = ఏదియో, అయం = ఇది, సః = ఆప్రసిద్ధమైన, అగ్నిః = అగ్ని, సః = అది, హోతా = హోతయను ఋత్విక్కు, సః = అది, ముక్తిః = ముక్తి, సా=అది, (ఆముక్తియె) అతిముక్తిః = అతిక్రమించిన ముక్తి. (ఫలభూతమగు అగ్నిభావమున పొందుట అతిముక్తి అనఁగా మృత్యువుయొక్క ప్రాప్తిని అతిక్రమించిన ముక్తి).

తా॥ అశ్వలుఁడు, ఓ యాజ్ఞవల్క్యుఁడా! మనుష్యునియొక్క కర్మకు సాధనమైన ఋత్విక్కు అగ్ని మొదలయిన ఇది యంతయు కర్మలక్షణమైన మృత్యువు చేతను వ్యాపించి మృత్యు స్వాధీనమై యున్నది. యజమాని ఏ సాధనముచేత మృత్యువునకు గోచరమగుటను అతిక్రమించి విడిచి స్వతంత్రుఁడై మృత్యువునకు స్వాధీనుఁడు కాఁడని ప్రశ్నము చేసెను. అప్పుడు యాజ్ఞవల్క్యుఁడు, ఓ అశ్వలుఁడా! యజమానివాక్కే హోతగాను, ఈ వాక్కే ఆ అగ్నిగాను ఈ అగ్నియే ఆహోతగాను తెలిసికొని ఇట్లు కర్మసాధనమైన హోతాగ్నులు రెంటిని అధిదైవతమగు అగ్నిరూపముతో చూచుట ముక్తి. అధిదేవతా స్వరూపమగు ముక్తియే అధ్యాత్మ అధిభూతములే అవధిగాఁగల విషయములయందు మిక్కిలి కూడియుండుటయే స్థానమగు మృత్యువును అతిక్రమించి ఫలస్వరూపమగు అధిదేవతాస్వరూపమైన అగ్నిభావనయొక్క ప్రాప్తి అతిముక్తి. ఇట్లు యజమాని కర్మసాధనములగు హోతాగ్నుల రెంటిని అగ్నిస్వరూపముగా చూచుటచేత మృత్యువును అతిక్రమించి ప్రకాశించుచున్నాఁడని పలికెను.

ఉ॥ యాజ్ఞవల్క్యేతి హోవాచ యదిదగ్ సర్వ మహోరాత్రాభ్యా
మాప్తగ్ సర్వ మహోరాత్రాభ్యామభిపన్నం కేన యజమానోఽ
హోరాత్రయోరాప్తిమతి ముచ్యత ఇత్యధ్వర్యుణర్త్విజా
చక్షుషాదిత్యేన చక్షుర్వై యజ్ఞస్యాధ్వర్యు స్తద్యదిదం చక్షుః
సోఽసావాదిత్యః సోఽధ్వర్యుః స ముక్తిః సాతిముక్తిః. ॥4॥

ప॥ యాజ్ఞవల్క్య – ఇతి – హోవాచ – యత్ – ఇదం – సర్వం – అహోరాత్రాభ్యాం – ఆప్తం – సర్వం – అహోరాత్రాభ్యాం – అభిపన్నం – కేన – యజమానః – అహోరాత్రయోః – ఆప్తిం – అతిముచ్యతే – ఇతి – అధ్వర్యుణర్త్విజా – చక్షుషా – ఆదిత్యేన – చక్షుః – వై – యజ్ఞస్య – అధ్వర్యుః – తత్ – యత్ –

ఇదం - చక్షుః - సః - అసౌ - ఆదిత్యః - సః - అధ్వర్యుః - సః - ముక్తిః - సా - అతిముక్తిః.

ప్ర॥ (సః = ఆ అశ్వలుఁడు) హేయాజ్ఞవల్క్య=ఓ యాజ్ఞవల్క్యుఁడా! ఇతి = అని, హోవాచ = పలికెను, యదిదంసర్వం = ప్రసిద్ధమగు ఈ సమస్తము, అహోరాత్రాభ్యాం = రాత్రి పగళ్ళ చేతను, ఆప్తం = వ్యాప్తమైనది. సర్వం = సమస్తము, అహోరాత్రాభ్యాం = రాత్రిపగళ్ళచేతను, అభిపన్నం = స్వాధీనము చేసికొనఁబడ్డది. యజమానః = యజమానుఁడు, కేన = ఏ సాధనముచేతను, అహోరాత్రయోః = రాత్రి పగళ్ళయొక్క, ఆప్తిం = వ్యాప్తిని, అతిముచ్యతే=అతిక్రమించి విడుచుచున్నాఁడు, ఇతి=అని, (హోవాచ= పలికెను). అధ్వర్యుణా ర్త్విజా=అధ్వర్యుఁడను ఋత్విక్కుచేను, (అధ్వర్యుఁ డనఁగా యజుర్వేదము తెలిసిన ఋత్విక్కు), చక్షుషా = నేత్రరూపుఁడునగు, ఆదిత్యేన = సూర్యునిచేతను, (అతిముచ్యతే = అతిక్రమించి విడుచుచున్నాఁడని, యాజ్ఞవల్క్యః = యాజ్ఞవల్క్యుఁడు, ఆహ = చెప్పెను). యజ్ఞస్య = యజమానియొక్క, చక్షురేవ = నేత్రమే, అధ్వర్యుః = అధ్వర్యుఁడు, తత్ = అక్కడ, (ఆ యజమానియందు), ఇదంచక్షుః = ఈ నేత్రము, యత్ = ఏదియో, సః = అది, అసౌఆదిత్యః = ఈ సూర్యుఁడు. సః = ఆ ఆదిత్యుఁడు, అధ్వర్యుః = అధ్వర్యుఁడు, సః = ఆ ఆదిత్యుఁడు, ముక్తిః = ముక్తి, సా = ఆముక్తి, అతిముక్తిః = మృత్యువు నతిక్రమించిన ముక్తి.

తా॥ ఇంతకు పూర్వము స్వాభావికమైన అజ్ఞానాసంగ ప్రయుక్తమగు కర్మలక్షణమైన మృత్యువునుండి అతిముక్తి వ్యాఖ్యానము చేయఁబడినది. కర్మరూపమైన మృత్యువునకు ఆశ్రయభూతములగు దర్శపూర్ణమాసములు మొదలైన సాధనములయొక్క పరిణామమునకు హేతువగు కాలమునుండి వేఱుగా అతిముక్తి చెప్పఁదగినదియని ఇది ఆరంభింపఁబడినది. అశ్వలుఁడు వేఱొక ప్రశ్నమును చేయుచున్నాఁడు.

ఓ యాజ్ఞవల్క్యుఁడా! ఈ సమస్తము అహోరాత్రములచే వ్యాపించి అహోరాత్రములచేత స్వాధీనము చేసికొనఁబడినది. అహోరాత్రాది రూపమైన కాలము కర్మాశ్రయములగు దర్శపూర్ణ మాసాదులకు హేతువగుట వలన కాలమును మృత్యుస్వరూపమైనది. ఇట్టి కాలమను మృత్యువుయొక్క వ్యాప్తిని యజమాని ఏ సాధనముచేత అతిక్రమించి విడుచుచున్నాఁడని అశ్వలుఁడు ప్రశ్న చేసెను. అప్పుడు యాజ్ఞవల్క్యుఁడు ఓ అశ్వలుఁడా! యజమాని అధ్వర్యుఁడను ఋత్విక్స్వరూపమును నేత్రరూపమునగు ఆదిత్యునిచే కాలమును మృత్యువునుండి అతిక్రమించి విడుచుచున్నాఁడు. ఎట్లనఁగా యజమానియొక్క నేత్రమే అధ్వర్యుఁడు. ఈ యజమాని నేత్రమే సూర్యుఁడు. ఈ సూర్యుఁడే అధ్వర్యుఁడు. ఇట్లు అధ్యాత్మరూపమైన చక్షుస్సును కర్మసాధనులగు ఆదిత్యాధ్వర్యులను ఒక్క అధిదేవతారూపమైన సూర్యస్వరూపముతో చూచుట ముక్తి. ఇట్లు చూచుటవలన యజమాని అధ్యాత్మాది భూతములే అవధిగాఁగల విషయములయందు మిక్కిలి కూడియుండుటయే స్థానమగు మృత్యువును అతిక్రమించి ముక్తుఁడగుచున్నాఁడు. ఇదియే అతిముక్తి. ఇట్లు యజమాని కర్మసాధనములగు అధ్వర్యు ఆదిత్యుల నిద్దరిని ఆదిత్యునిగా చూచుటచేత మృత్యువు నతిక్రమించి ప్రకాశించుచున్నాఁడని యాజ్ఞవల్క్యుఁడు పలికెను.

ఉ॥ యాజ్ఞవల్క్యేతి హోవాచ యదిదగ్ం సర్వం పూర్వపక్షాపరపక్షాభ్యా మాప్తగ్ం సర్వం పూర్వపక్షాపరపక్షాభ్యా మభిపన్నం కేన యజమానః పూర్వపక్షాపరపక్షయోరాప్తి మతిముచ్యత ఇత్యుద్గాత్రర్త్విజా వాయునా ప్రాణేన ప్రాణో వై యజ్ఞస్యోద్గాతా తద్యోఽయం ప్రాణస్సవాయుః స ఉద్గాతా స ముక్తిః సాతిముక్తిః. ॥5॥

ప॥ యాజ్ఞవల్క్య–ఇతి–హోవాచ – యత్–ఇదం – సర్వం – పూర్వపక్షాపరపక్షాభ్యాం–ఆప్తం–సర్వం–పూర్వపక్షాపరపక్షాభ్యాం–

అభిపన్నం - కేన - యజమానః - పూర్వపక్షాపరపక్షయోః - ఆప్తిం - అతిముచ్యతే - ఇతి - ఉద్గాత్రర్త్విజా - వాయునా - ప్రాణేన - ప్రాణః - వై - యజ్ఞస్య - ఉద్గాతా - తత్ - యః - అయం - ప్రాణః - సః - వాయుః - సః - ఉద్గాతా - సః - ముక్తిః - సా - అతిముక్తిః.

ప్ర॥ (సః = ఆ అశ్వలుఁడు), హేయాజ్ఞవల్క్యేతి=ఓ యాజ్ఞవల్క్యుఁడాయని, హోవాచ = పలికెను. యదిదంసర్వం = ప్రసిద్ధమగు ఈ సమస్తము, పూర్వపక్షాపరపక్షాభ్యాం = శుక్లపక్ష కృష్ణపక్షములచేత, ఆప్తం = వ్యాప్తమైనది, సర్వ = సమస్తమును, పూర్వపక్షా పరపక్షాభ్యాం = శుక్లపక్ష కృష్ణపక్షముల చేతను, అభిపన్నం = స్వాధీనపఱుచు కొనఁబడినది. యజమానః = యజమానుఁడు, కేన = ఏ యుపాయము చేతను, పూర్వ పక్షాపరపక్షయోః = శుక్లపక్ష కృష్ణపక్షములయొక్క, ఆప్తిం = వ్యాప్తిని, అతిముచ్యతే = అతిక్రమించి విడుచుచున్నాఁడు. ఇతి = అని, (అని పలికెను). ఉద్గాత్రర్త్విజా = ఉద్గాతయను ఋత్విక్కును, (ఉద్గాత యనఁగా సామవేదము తెలిసిన ఋత్విక్కు), వాయునా = వాయురూపమునగు, ప్రాణేన=ప్రాణముచేతను, (యజమాని మృత్యువు నతిక్రమించి విడుచుచున్నాఁడని యాజ్ఞవల్క్యుఁడు పలికెను). యజ్ఞస్య = యజమానియొక్క, ప్రాణోవై = ప్రాణమే, ఉద్గాతా= సామగానము చేయునట్టి ఋత్విక్కు, తత్ = ఆ యజమానియందు, అయం = ఈ, ప్రాణః = ప్రాణము, యః = ఏదియో, సః = అది, వాయుః = వాయువు, సః = ఆ వాయువు, ఉద్గాతా=సామగానము చేయునట్టి ఋత్విక్కు, సః = ఆ వాయువు, ముక్తిః = ముక్తి, సా= ఆముక్తి, అతిముక్తిః = మృత్యువు నతిక్రమించిన ముక్తి.

తా॥ ఇప్పుడు తిథ్యాది లక్షణమైన మృత్యువువలన అతిముక్తి చెప్పఁబడుచున్నది. అశ్వలుఁడు వేఱొక ప్రశ్నమును చేయుచున్నాఁడు.

ఓ యాజ్ఞవల్క్యుఁడా! ఈ సమస్తము శుక్లపక్ష కృష్ణ పక్షములచేత వ్యాపించి సమస్తము శుక్లపక్ష కృష్ణపక్షములచే స్వాధీనముచేసికొనఁబడి యున్నది. ఇట్లు వ్యాపించిన శుక్ల కృష్ణపక్షాదిరూపమైన కాలమను మృత్యువును యజమాని ఏ యుపాయముచేత అతిక్రమించి విడుచుచున్నాఁడు అని అశ్వలుఁడు ప్రశ్నము చేసెను. ఇట్లు ప్రశ్న చేయఁగా యాజ్ఞవల్క్యుఁడు ఓ అశ్వలుఁడా! యజమాని ఉద్గాతయను ఋత్విక్స్వరూపమును వాయు స్వరూపమునగు ప్రాణముచేత శుక్లపక్ష కృష్ణ పక్షాది రూపకాలమను మృత్యువునుండి అతిక్రమించి విడుచుచున్నాఁడు. ఎట్లనఁగా యజమానియొక్క ప్రాణమే సామగానము చేయునట్టి ఉద్గాతయను ఋత్విక్కు. ఆ యజమాని యందలి ఈ ప్రసిద్ధమగు ప్రాణమే ఆ వాయువు. ఆ వాయువే ఉద్గాత. ఇట్లు అధ్యాత్మరూపమైన ప్రాణమును కర్మసాధనములగు ఉద్గాత వాయువులును ఒక్కటియగు అధిదైవ స్వరూపమైన వాయురూపముతో చూచుట ముక్తి. ఇట్లు చూచుటవల్ల యజమాని అధ్యాత్మ అధి భూతములే అవధిగాఁగల విషయములయందు మిక్కిలి కూడియుండునట్టి స్థానమగు మృత్యువును అతిక్రమించి ముక్తుఁడగుచున్నాఁడు. ఇదియే అతిముక్తి. ఇట్లు యజమాని కర్మసాధనములగు ఉద్గాత వాయువులను రెంటిని వాయుస్వరూపముగా చూచుటచేత మృత్యువు నతిక్రమించి ప్రకాశించుచున్నాఁడని యాజ్ఞవల్క్యుఁడు పలికెను.

ఉ॥ యాజ్ఞవల్క్యేతి హోవాచ యదిదమన్తరిక్షమనారమ్బణమివ కేనాక్రమేణ యజమానః స్వర్గం లోకమాక్రమత ఇతి బ్రహ్మణర్త్విజా మనసా చన్ద్రేణ మనో వై యజ్ఞస్య బ్రహ్మా తద్యదిదం మనః సోఽసౌ చన్ద్రః స బ్రహ్మా స ముక్తిః సాతిముక్తిరిత్యతిమోక్షా అథ సమ్పదః. ॥6॥

ప॥ యాజ్ఞవల్క్య – ఇతి – హోవాచ – యత్ – ఇదం –

అన్తరిక్షం - అనారమ్బణం - ఇవ - కేన-ఆక్రమేణ - యజమానః-
స్వర్గం - లోకం - ఆక్రమతే - ఇతి - బ్రహ్మణర్త్విజా - మనసా -
చన్ద్రేణ - మనః - వై - యజ్ఞస్య - బ్రహ్మా - తత్ - యత్ -
ఇదం - మనః - సః - అసౌ - చన్ద్రః-సః బ్రహ్మా - సః - ముక్తిః-
సా -అతిముక్తిః - ఇతి - అతిమోక్షాః - అథ - సమ్పదః.

ప్ర॥ (సః = ఆ అశ్వలుఁడు), యాజ్ఞవల్క్యేతి = ఓ యాజ్ఞవల్క్యుఁడా అని, హోవాచ = పలికెను, యదిదమంతరిక్షం = ఈ ప్రసిద్ధమగు ఆకాశము, అనారమ్బణమివ = ఆధారము లేనిదివలెనే, (దృశ్యతే = చూడఁబడుచున్నది). యజమానః = యజమానుఁడు, కేన ఆక్రమేణ = ఏ ఆక్రమ...మును చేతను, (దేని ఆధారముచేతను), స్వర్గం లోకం = స్వర్గలోకమును, ఆక్రమతే=ఆక్రమించుచున్నాఁడు, (కర్మఫలమగు స్వర్గలోకమును అతిక్రమించి ముక్తుఁడగుచున్నాఁడు), ఇతి = అని, (హోవాచ = పలికెను). బ్రహ్మణర్త్విజా = బ్రహ్మయను ఋత్విక్కును, మనసా = మనస్సనగు, చన్ద్రేణ = చంద్రునిచేతను, (యజమాని కర్మఫలరూపమైన మృత్యువు నతిక్రమించి ముక్తుఁడగుచున్నాఁడని యాజ్ఞవల్క్యుఁడు పలికెను), యజ్ఞస్య = యజమాని యొక్క, మనోవై = మనస్సే, బ్రహ్మా = బ్రహ్మయను ఋత్విక్కు, తత్ = ఆ యజమానియందు, ఇదం మనః = ఈ మనస్సు, యత్ = ఏదియో, సః = అది, అసౌచన్ద్రః = ఈ చంద్రుఁడు, సః = ఆ చంద్రుఁడు, బ్రహ్మా = బ్రహ్మయను ఋత్విక్కు, సః = ఆ చంద్రుఁడు, ముక్తిః = ముక్తి, సా = ఆ ముక్తి, అతిముక్తిః = అతిముక్తి, (మృత్యువు నతిక్రమించిన ముక్తి), అతిమోక్షాః = అతిముక్తులు, ఇతి = ఈ ప్రకారములైనవి. అథ = ఇప్పుడు, సమ్పదః = సమ్పదలు (కర్మకు సాధనములైన) సంపత్తులు, ఉచ్యన్తే = చెప్పఁబడుచున్నవి.

తా॥ ఇంతవఱకు యజమానునికి మృత్యురూపమైన కాలమునుండి అతిముక్తి వ్యాఖ్యానము చేయఁబడినది. అశ్వలుఁడు ప్రశ్నము

చేయుచున్నాఁడు. ఓ యాజ్ఞవల్క్యుఁడా! ఈ ఆకాశము వేఱు ఆధారములేనిదై చూడఁబడుచున్నది. యజమాని దేని యాధారము చేత కర్మఫలమగు స్వర్గము నతిక్రమించి అతిముక్తుఁ డగుచున్నాఁడు, అని ప్రశ్నము చేసెను. ఇట్లు ప్రశ్నము చేయఁగా యాజ్ఞవల్క్యుఁడు ఓ అశ్వలుఁడా! యజమాని బ్రహ్మయను ఋత్విక్స్వరూపుఁడును మనో రూపుఁడునగు చంద్రునిచేత కర్మఫలమగు స్వర్గలోకము నతిక్రమించి అతిముక్తుఁడగుచున్నాఁడు. ఎట్లనఁగా యజమానియొక్క మనస్సే బ్రహ్మయను ఋత్విక్కు, అధ్యాత్మ స్వరూపమగు ఆ యజమాని మనస్సే అధిదైవతమగు ఈ చంద్రుఁడు. ఈ చంద్రుఁడే బ్రహ్మయను ఋత్విక్కు. ఇట్లు అధ్యాత్మరూపమైన మనస్సును కర్మసాధనములగు బ్రహ్మయను ఋత్విక్కును చంద్రుఁడును ఒక్కటియగు అధిదైవతమగు చంద్ర రూపముతో చూచుట ముక్తి. ఇట్లు చూచుటవల్ల యజమాని అధ్యాత్మ అధిభూతములే అవధిగాఁగల విషయములయందు మిక్కిలి కూడియుండుటే స్థానమగు మృత్యువుయొక్క స్వరూపముగా నుండెడి కర్మఫలమగు స్వర్గలోకమును విడిచి అతిముక్తుఁడగుచున్నాఁడు. ఈ ప్రకారము యజమాని కర్మసాధనములగు బ్రహ్మ చంద్రులను ఇద్దరిని అధిదేవతా స్వరూపమగు చంద్రునిగా చూచుటచేత మృత్యురూప మగు స్వర్గలోకము నతిక్రమించి ప్రకాశించుచున్నాఁడు అని యాజ్ఞ వల్క్యుఁడు చెప్పెను. ఈ ప్రకారము అతిముక్తులు చెప్పి ఇప్పుడు కర్మసాధనములగు ఆజ్యాద్యాహుతి సంపాదన రూపమైన సంపత్తులు చెప్పఁబడుచున్నవి.

ఉ॥ యాజ్ఞవల్క్యేతి హోవాచ కతిభిరయమద్యర్గ్భిర్హోతాస్మిన్యజ్ఞే కరి ష్యతీతి తిసృభిరితి కతమాస్తాస్తిస్ర ఇతి పురోఽనువాక్యా చ యాజ్యా చ శస్యైవ చ తృతీయా కిం తాభిర్జయతీతి యత్కిం చేదం ప్రాణభృదితి. ॥7॥

ప॥ యాజ్ఞవల్క్య - ఇతి - హోవాచ - కతిభిః - అద్య -

అద్య - అగ్నిభిః - హోతా - అస్మిన్ - యజ్ఞే - కరిష్యతి - ఇతి - తిసృభిః - ఇతి - కతమాః - తాః - తిస్రః - ఇతి - పురోనువాక్యా - చ - యాజ్యా - చ - శస్యా - ఏవ - చ - తృతీయా - కిం - తాభిః - జయతి - ఇతి - యత్కించ - ఇదం - ప్రాణభృత్ - ఇతి.

ప్ర॥ (సః = ఆ అశ్వలుఁడు), యాజ్ఞవల్క్యేతి = ఓయాజ్ఞవల్క్యుఁడాయని, హోవాచ = పలికెను. అయం = ఈ, హోతా = ఋత్విక్కు, (యజ్ఞమునందు ఋగ్వేదమును చెప్పెడి ఋత్విక్కు హోత యనఁబడును), అద్య = ఇప్పుడు, అస్మిన్ = ఈ, యజ్ఞే = యజ్ఞమునందు, కతిభిఃఋగ్భిః=ఎన్ని ఋఙ్మంత్రములచేతను, (హోత్రము), కరిష్యతీతి = చేయుచున్నాఁడని, (హోవాచ = పలికెను). (యాజ్ఞవల్క్యః = యాజ్ఞవల్క్యుఁడు), తిసృభిరితి = మూఁడింటిచేతనని, (ఉవాచ = పలికెను). తాః=ఆ, తిస్రః=మూఁడును, కతమాః= ఏవి, ఇతి = అని, (అశ్వలుఁడు ప్రశ్నము చేసెను), పురోనువాక్యాచ= పురోనువాక్య యనునదియును, యాగకాలముకంటె పూర్వము చెప్పెడి ఋగ్వేదమంత్రములు పురోనువాక్య లనఁబడును). యాజ్యాచ = యాజ్యయును, (యాగము కొఱకు ప్రయోగింపఁబడెడి ఋగ్వేద మంత్రములు యాజ్యలనఁబడును). తృతీయా = మూఁడవదియగు, శస్యైవచ = శస్యయనునదియును, (యాగమునందు శస్త్రము కొఱకు ఉపయోగింపఁబడెడి ఋగ్వేద మంత్రములు శస్యము లనఁబడును). (ఇట్లు యాజ్ఞవల్క్యుఁ డుత్తరము చెప్పెను). తాభిః = వానిచేతను, కిం = ఏమి, జయతి = జయించుచున్నాఁడు. ఇతి=అని, (అశ్వలుఁడు ప్రశ్నము చేసెను). యత్కించేదం = ఈ సమస్తమగు, ప్రాణభృత్ = ప్రాణి సముదాయమును, జయతి = జయించుచున్నాఁడు), ఇతి=అని, (యాజ్ఞవల్క్యుఁ డుత్తరమును చెప్పెను).

తా॥ అశ్వలుఁడు ఓ యాజ్ఞవల్క్యుఁడాయని పిలిచి హోత యను ఋత్విక్కు యజ్ఞమునందు ఎన్ని ఋగ్వేదమంత్రములచేత

హోత్రమును చేయుచున్నాఁడని ప్రశ్నము చేయఁగా యాజ్ఞవల్క్యుఁడు ఓ అశ్వలుఁడా హోతయను ఋత్విక్కు యజ్ఞమునందు పురోనువాక్య లని యాజ్యలని శస్యలని మూఁడు విధములైన ఋగ్వేదమంత్రముల చేతను హోత్రమును చేయుచున్నాఁడని చెప్పెను. అశ్వలుఁడు హోత యను ఋత్విక్కు మూఁడువిధములైన ఆ ఋగ్వేదమంత్రములచే ఏమి జయించుచున్నాఁడని ప్రశ్నముచేయఁగా యాజ్ఞవల్క్యుఁడు, ఓ అశ్వ లుఁడా! వానిచేత ఈ మూఁడు లోకములను జయించుచున్నాఁడని పలికెను.

ఉ॥ యాజ్ఞవల్క్యేతి హోవాచ కత్యయమద్యాఽఽధ్వర్యురస్మిన్యజ్ఞ ఆహు తీర్హోష్యతీతి తిస్ర ఇతి కతమాస్తాస్తిస్ర ఇతి యా హుతా ఉజ్జ్వలన్తి యా హుతా అతినేదన్తే యా హుతా అధిశేరతే కిం తాభిర్జయ తీతి యా హుతా ఉజ్జ్వలన్తి దేవలోకమేవ తాభిర్జయతి దీప్యత ఇవ హి దేవలోకో యా హుతా అతినేదన్తే పితృలోకమేవ తాభి ర్జయత్యతీవ హి పితృలోకో యా హుతా అధిశేరతే మనుష్య లోకమేవ తాభిర్జయత్యధ ఇవ హి మనుష్యలోకః. ॥8॥

ప॥ యాజ్ఞవల్క్య – ఇతి – హోవాచ – కతి – అయం – అద్య – అధ్వర్యుః – అస్మిన్ – యజ్ఞే – ఆహుతీః – హోష్యతి – ఇతి – తిస్రః – ఇతి – కతమాః – తాః – తిస్రః – ఇతి – యాః – హుతాః – ఉజ్జ్వలన్తి – యాః – హుతాః – అతినేదన్తే – యాః – హుతాః – అధిశేరతే – కిం–తాభిః – జయతి – ఇతి – యాః–హుతాః – ఉజ్జ్వలన్తి – దేవలోకం – ఏవ – తాభిః – జయతి – దీప్యతే – ఇవ – హి – దేవలోకః – యాః – హుతాః – అతినేదన్తే – పితృలోకం – ఏవ – తాభిః – జయతి – అతి – ఇవ – హి – పితృలోకః – యాః – హుతాః – అధిశేరతే – మనుష్యలోకం – ఏవ – తాభిః – జయతి – అధః – ఇవ – హి – మనుష్యలోకః.

ప్ర॥ (సః = ఆ అశ్వలుఁడు). యాజ్ఞవల్క్యేతి = ఓ యాజ్ఞ

వల్క్యుండాయని, హోవాచ = పలికెను. అద్య = ఇప్పుడు, అయం = ఈ, అశ్వలః = అశ్వలుడను ఋత్విక్కు, అస్మిన్ = ఈ, యజ్ఞే = యజ్ఞమునందు, కతిఆహుతీః = ఎన్ని ఆహుతులను, హోష్యతి = హోమము చేయుచున్నాఁడు. ఇతి = అని, (హోవాచ = పలికెను), తిస్రఇతి = మూఁడు ఆహుతులని, (యాజ్ఞవల్క్యుఁడు పలికెను). తాః = ఆ, తిస్రః = మూఁడు ఆహుతులు, కతమాః = ఏవి, ఇతి = అని, (అశ్వలుఁడు ప్రశ్నము చేసెను). యాః = ఏ, హుతాః = ఆహుతులు, ఉజ్జ్వలన్తి = ప్రకాశించుచున్నవో, (సమిదాజ్యాద్యాహుతులు), యాః = ఏ, హుతాః = ఆహుతులు, అతినేదన్తే = మిక్కిలి ధ్వని చేయుచున్నవో, (మాంసము మొదలైన ఆహుతులు), యాః = ఏ, హుతాః = ఆహుతులు, అధిశేరతే = భూమిక్రింద పోయి ఉన్నవో, (పయస్సోమాహుతులు), తాః = ఆ మూఁడు విధములైన ఆహుతులని (యాజ్ఞవల్క్యుఁడు పలికెను). తాభిః = ఆ ఆహుతులచేతను, కిం = ఏమి, జయతి = జయించుచున్నాఁడు, ఇతి = అని, (అశ్వలుఁడు ప్రశ్నము చేసెను). యాః = ఏ, హుతాః = ఆహుతులు, ఉజ్జ్వలన్తి = ప్రకాశించుచున్నవో, తాభిః = ఆ ఆజ్యాద్యాహుతులచేతను, దేవలోకమేవ = దేవలోకమునే, జయతి = జయించుచున్నాఁడు. దేవలోకఇవ = దేవలోకమే, దీప్యతేహి = ప్రకాశించుచున్నది గదా. యః = ఏ, హుతాః = ఆహుతులు, అతినేదన్తే = మిక్కిలి ధ్వని చేయుచున్నవో, తాభిః = ఆ మాంసాహుతుల చేతను, పితృలోకమేవ = పితృలోకమునే, జయతి = జయించుచున్నాఁడు. పితృలోకోహి = పితృలోకమే, అతీవ = మిక్కిలి, (శబ్ద = శబ్దము కలది, భవతి = అగుచున్నది). పితృలోక సంబంధిమైన యమ పట్టణము నందు యమునిచేత హింసింపఁబడు వారల యొక్క అయ్యో కొట్టఁబడుచున్నాను విడువుము విడువుము అనెడి శబ్దము పితృలోకము నందు కలుగుచున్నది), యాః = ఏ, హుతాః = ఆహుతులు, అధి

శేరతే = క్రింద ఉన్నవో, తాభిః = ఆపయస్సోమాద్యాహుతుల చేతను, మనుష్యలోకమేవ = మనుష్యలోకమునే, జయతి=జయించు చున్నాఁడు. మనుష్యలోకః = మనుష్యలోకము, అధఇవహి=క్రిందనే యున్నది గదా.

తా॥ అశ్వలుఁడు ఓ యాజ్ఞవల్క్యుఁడా యని పిలిచి అధ్వర్యుఁడు ఈ యజ్ఞమునందు ఎన్ని ఆహుతులను హోమము చేయుచున్నాఁడని ప్రశ్నము చేసెను. ఇట్లు ప్రశ్నము చేయఁగా యాజ్ఞవల్క్యుఁడు ఓ అశ్వలుఁడా! అధ్వర్యుఁడను ఋత్విక్కు యజ్ఞమునందు ప్రకాశించునట్టి అజ్యాద్యాహుతులచేతను, ధ్వనిచేయునట్టి మాంసాహుతులచేతను, భూమిక్రింద నిలిచి యుండునట్టి పయస్సోమాద్యాహుతులచేతను, ఈ మూఁడు విధములైన ఆహుతులచేత హోమము చేయుచున్నాఁడని పలికెను. ఇట్లు చెప్పఁగా అశ్వలుఁడు, ఓ యాజ్ఞవల్క్యుఁడా! అధ్వర్యుఁడా మూఁడు విధములైన ఆహుతులచేతను ఏమి జయించుచున్నాఁడని ప్రశ్నము చేయఁగా యాజ్ఞవల్క్యుఁడు ఓ అశ్వలుఁడా!అధ్వర్యుఁడు ప్రకాశించునట్టి ఆజ్యాద్యాహుతులచేతను అట్టి ప్రకాశముగల దేవలోకమును, ధ్వనిచేయునట్టి మాంసాహుతుల చేతను అదేప్రకారము యమునివలన యాతనను పొందుచున్న జీవులయొక్క ధ్వనిగల పితృలోకమును, భూమిక్రింద నిలిచియుండునట్టి పయస్సోమాద్యాహుతులచేత ఊర్ధ్వముగా నుండెడి దేవలోకాదులకు క్రింద నుండెడి మనుష్యలోకమును జయించుచున్నాఁడని చెప్పెను.

ఉ॥ యాజ్ఞవల్క్యేతి హోవాచ కతిభిరయమద్య బ్రహ్మా యజ్ఞం దక్షిణతో దేవతాభిర్గోపాయతీత్యేక యేతి కతమా సైకేతి మన ఏవేత్యనన్తం వై మనోఽనన్తా విశ్వే దేవా అనన్తమేవ స తేన లోకం జయతి. ॥9॥

ప॥ యాజ్ఞవల్క్య – ఇతి – హోవాచ – కతిభిః – అయం – అద్య – బ్రహ్మా – యజ్ఞం – దక్షిణతః – దేవతాభిః – గోపాయతి –

ఇతి - ఏకయా - ఇతి - కతమా - సా - ఏకా - ఇతి - మనః - ఏవ - ఇతి - అనన్తం - వై - మనః - అనన్తాః - విశ్వే దేవాః - అనన్తం - ఏవ - సః - తేన - లోకం - జయతి.

ప్ర॥ (సః=ఆ అశ్వలుఁడు), యాజ్ఞవల్క్యేతి=యాజ్ఞవల్క్యుఁడా యని. హోవాచ=పలికెను. అద్య=ఇప్పుడు. అయం=ఈ, బ్రహ్మా = బ్రహ్మయను ఋత్విక్కు, దక్షిణతః = దక్షిణముగాను, (బ్రహ్మాసనమునుండి), యజ్ఞం = యజ్ఞమును, కతిభిః దేవతాభిః = ఎందఱు దేవతలచేతను, గోపాయతి = రక్షించుచున్నాఁడు. ఇతి = అని, (ప్రశ్నము చేసెను). ఏకయేతి = ఒక్క దేవత చేతనని, (యాజ్ఞవల్క్యుఁడు చెప్పెను). సా = ఆ ప్రసిద్ధమగు, ఏకా = ఒక్కటియైన దేవత, కతమా = ఏది, ఇతి = అని, (అశ్వలుఁడు ప్రశ్నముచేసెను). మనఏవేతి = మనస్సెఅని, (యాజ్ఞవల్క్యుఁడు చెప్పెను.) మనః = మనస్సు, అనన్తంవై = ప్రసిద్ధముగా అనన్తమైనది. విశ్వే = సమస్తమైన, దేవాః = దేవతలు, అనన్తాః = అనన్తమైనవారు. సః = ఆ బ్రహ్మయను ఋత్విక్కు, తేన = ఆధ్యానము చేతను, (మనస్సునందు విశ్వే దేవ దృష్టితో ధ్యానించుట చేతను), అనన్తమేవలోకం=అనన్తమైన లోకమునే, జయతి = జయించుచున్నాఁడు.

తా॥ అశ్వలుఁడు ఓ యాజ్ఞవల్క్యుఁడా యని పిలిచి యజ్ఞమునందు బ్రహ్మయను ఋత్విక్కు దక్షిణముగా బ్రహ్మాసనమునందు కూర్చుండి ఎందఱు దేవతలచేత ఈ యజ్ఞమును కాపాడుచున్నాఁడని ప్రశ్నము చేయఁగా యాజ్ఞవల్క్యుఁడు మనస్సను ఒక్క దేవతచేతను కాపాడుచున్నాఁడు అని చెప్పి మనస్సును వృత్తి భేదముచేత అనన్తమైనది. విశ్వేదేవులు అనన్తమైనవారు. ఇట్టి దేవతలు మనస్సునందు ఏకమగుచున్నారు. కనుక మనస్సు సర్వదేవతారూపమైనది. అని ఇట్లు మనస్సునందు విశ్వేదేవదృష్టితో ధ్యానించుటచేత బ్రహ్మయను ఋత్విక్కు అనన్తమగు లోకమును జయించుచున్నాఁడని యాజ్ఞ

వల్క్యుఁడు పలికెను.

ఉ॥ యాజ్ఞవల్క్యేతి హోవాచ కత్యయమద్యోద్గాతాస్మిన్యజ్ఞే స్తోత్రియాః స్తోష్యతీతి తిస్ర ఇతి కతమాస్తాస్తిస్ర ఇతి పురోఽనువాక్యాచ యాజ్యా చ శస్యైవ చ తృతీయా కతమాస్తా యా అధ్యాత్మమితి ప్రాణఏవ పురోనువాక్యాఽపానో యాజ్యా వ్యానశ్శస్యా కింతాభిర్జయతీతి పృథివీలోకమేవ పురోనువాక్యయా జయత్యన్తరిక్షలోకం యాజ్యయా ద్యులోకగ్ శస్యయా తతో హ హోతాశ్వల ఉపరరామ. 10

ఇతిపఞ్చమాధ్యాయే ప్రథమంబ్రాహ్మణమ్.

ప॥ యాజ్ఞవల్క్య – ఇతి – హోవాచ – కతి – అయం – అద్య – ఉద్గాతా – అస్మిన్ – యజ్ఞే – స్తోత్రియాః – స్తోష్యతి – ఇతి – తిస్రః – ఇతి – కతమాః – తాః – తిస్రః – ఇతి – పురోనువాక్యా – చ – యాజ్యా – చ – శస్యా – ఏవ – చ – తృతీయా – కతమాః – తాః – యాః – అధ్యాత్మం – ఇతి – ప్రాణః – ఏవ – పురోనువాక్యా – అపానః – యాజ్యా – వ్యానః – శస్యా – కిం – తాభిః – జయతి – ఇతి – పృథివీలోకం – ఏవ – పురోనువాక్యయా – జయతి – అన్తరిక్షలోకం – యాజ్యయా – ద్యులోకం – శస్యయా – తతః – హ – హోతా – అశ్వలః – ఉపరరామ.

ప్ర॥ (సః = ఆ అశ్వలుఁడు), హేయాజ్ఞవల్క్యేతి=ఓయాజ్ఞవల్క్యుఁడా యని, హోవాచ = పలికెను. అద్య = ఇప్పుడు, అయం= ఈ, ఉద్గాతా = ఉద్గాతయను ఋత్విక్కు, అస్మిన్ = ఈ, యజ్ఞే= యజ్ఞమునందు, కతి = ఎన్ని, స్తోత్రియాః = స్తోత్రియములను = ఋగ్వేద మంత్రములను, (విశేషగానము గల ఋగ్వేద మంత్రములు స్తోత్రీయము లనఁబడును. ఋక్సామ సముదాయములగు ఋక్కులు) స్తోష్యతి = స్తుతించుచున్నాఁడు. ఇతి = అని, (ప్రశ్నము చేసెను). తిస్రఇతి = మూఁడు అని, (యాజ్ఞవల్క్యుఁడు పలికెను). తాః = ఆ,

తిస్రః = మూఁడు, కతమాః = ఏవి, ఇతి = అని, (అశ్వలుఁడు ప్రశ్నము చేసెను). పురోనువాక్యాచ = పురోను వాక్యయును, యాజ్యాచ = యాజ్యయును, తృతీయా = మూఁడవదియగు, శస్యైవచ = శస్యయనునదియును, (ఈ పురోనువాక్యాదుల వివరమును ఈ అధ్యాయము ప్రథమ బ్రాహ్మణమునందు ఏడవ మంత్రములో చెప్పఁబడినది). (ఇట్లు యాజ్ఞవల్క్యుఁడు చెప్పెను). తాః=ఆ మూఁడు విధములైన పురోనువాక్యాదులు, యః = ఏవియో, (తాః = అవి), అధ్యాత్మం = అధ్యాత్మయందు, (దేహేంద్రియ సముదాయ కర్త యందు), కతమాః = ఏవి, ఇతి = అని, (అశ్వలుఁడు ప్రశ్నము చేసెను). ప్రాణఏవ = ప్రాణమే, పురోనువాక్యా = పురోనువాక్య యనునది. అపానః = అపానము, యాజ్యా = యాజ్యయనునది, వ్యానః=వ్యానము, శస్యా=శస్యయనునది. (ఇట్లు యాజ్ఞవల్క్యుఁడు చెప్పెను). తాభిః = ఆ మూఁటిచేతను, కిం=దేనిని, జయతి=జయించుచున్నాఁడు, ఇతి = అని, (అశ్వలుఁడు ప్రశ్నము చేసెను). పురోనువాక్యయా = పురోనువాక్య యనుదానిచేతను, పృథివీలోకమేవ = భూలోకమునే, జయతి = జయించుచున్నాఁడు. యాజ్యయా=యాజ్య యనుదాని చేతను, అన్తరిక్షలోకం = అన్తరిక్షలోకమును, (జయతి= జయించుచున్నాఁడు). శస్యయా=శస్య యనుదానిచేతను, ద్యులోకం = స్వర్గలోకమును, జయతి = జయించుచున్నాఁడు). (అని యాజ్ఞవల్క్యుఁడు చెప్పెను). తతోహ = ఆ కారణమువల్లనే, (తన ప్రశ్నములను నిర్ణయించుట వలన), హోతా = హోతయను ఋత్విక్కు అగు, అశ్వలః = అశ్వలుఁడనువాఁడు, ఉపరరామ=ఊరకయుండెను.

తా॥ అశ్వలుఁడు ఓ యాజ్ఞవల్క్యుఁడా యని పిలిచి యజ్ఞమునందు ఉద్గాతయను ఋత్విక్కు స్తోత్రీయములను ఎన్ని ఋఙ్మంత్రములను స్తుతించుచున్నాఁడని ప్రశ్నము చేయఁగా యాజ్ఞవల్క్యుఁడు ఓ అశ్వలుఁడా! పురోనువాక్య, యాజ్య, శస్యలను ఈ మూఁడు అని

చెప్పెను. అశ్వలుఁడు ఓ యాజ్ఞవల్క్యుఁడా! ఆ పురోనువాక్యాదులు మూఁడును అధ్యాత్మస్వరూపమగు దేహేంద్రియ సముదాయ కర్త యందు ఏవియని ప్రశ్నము చేయఁగా యాజ్ఞవల్క్యుఁడు ఓ అశ్వలుఁడా! అధ్యాత్మయందు ప్రాణమే పురోనువాక్యయనునది. అపానమే యాజ్యయనునది వ్యానమే శస్యయనునది, అని పలికెను. అప్పుడు అశ్వలుఁడు ఓ యాజ్ఞవల్క్యుఁడా! ఈ ఋక్కులచేతను ఉద్గాతయను ఋత్విక్కు ఏమి జయించుచున్నాఁడని ప్రశ్నము చేసెను. అప్పుడు యాజ్ఞవల్క్యుఁడు ఓ అశ్వలుఁడా! ఉద్గాత ప్రాణరూపమైన పురోనువాక్య యనుదానిచే భూలోకమును అపానరూపమగు యాజ్య యనుదానిచేత అంతరిక్షలోకమును వ్యాన రూపమైన శస్య యను దానిచేతను ద్యులోకమును జయించుచున్నాఁడని చెప్పఁగా అశ్వలుఁడు యాజ్ఞవల్క్యుఁడీప్రకారము తానడిగిన ప్రశ్నము లన్నిటికిని సమాధానము చెప్పటవలన వేఱొక ప్రశ్నము తోఁచనివాఁడై ఊరక యుండెను.

ఇట్లు పఞ్చమాధ్యాయము ప్రథమ బ్రాహ్మణము సమాప్తము.

## ద్వితీయబ్రాహ్మణము.

ఉ॥ అథ హైనం జారత్కారవ ఆర్తభాగః పప్రచ్ఛ యాజ్ఞవల్క్యేతి హోవాచ కతి గ్రహాః కత్యతిగ్రహా ఇతి అష్టౌ గ్రహా అష్టావతి గ్రహా ఇతి య ఏ తేఽ ష్టౌ గ్రహా అష్టావతి గ్రహాః కతమే త ఇతి. ॥1॥

ప॥ అథ – హ – ఏనం – జారత్కారవః – ఆర్తభాగః – పప్రచ్ఛ – యాజ్ఞవల్క్య – ఇతి – హోవాచ – కతి – గ్రహాః – కతి – అతిగ్రహాః – ఇతి – అష్టౌ – గ్రహాః – అష్టౌ – అతిగ్రహాః – ఇతి – యే – ఏతే – అష్టౌ – గ్రహాః – అష్టౌ – అతిగ్రహాః – కతమే – తే – ఇతి,

ప్ర॥ అథహ = అనన్తరము. జారత్కారవః = జారత్కారు గోత్రమునందుఁ బుట్టిన, ఆర్తభాగః = ఋతుభాగుని పుత్రుఁడు, ఏనం = ఈ యాజ్ఞవల్క్యుని, పప్రచ్ఛ = అడిగెను. యాజ్ఞవల్క్యేతి= ఓ యాజ్ఞవల్క్యుఁడా యని పిలిచి, గ్రహాః = గ్రహములు, కతి = ఎన్ని, అతిగ్రహాః = అతిగ్రహములు, కతి = ఎన్ని, ఇతి = అని, హోవాచ = పలికెను. (అని ప్రశ్నము చేసెను.) గ్రహాః = గ్రహములు, అష్టౌ = ఎనిమిది, అతిగ్రహాః = అతిగ్రహములు, అష్టౌ = ఎనిమిది, ఇతి = అని, (యాజ్ఞవల్క్యుఁడు చెప్పెను). ఏతే = ఈ, అష్టౌ = ఎనిమిదియైన, గ్రహాః = గ్రహములును, అష్టౌ = ఎనిమిదియైన, అతిగ్రహాః = అతిగ్రహములును, యే = ఏవియో, తే=అవి, కతమే = ఏవి, ఇతి = అని, (ఆర్తభాగుఁడు ప్రశ్నము చేసెను.)

తా॥ ఇంతకు పూర్వము అశ్వలప్రశ్నయందు యజమానికి. జ్ఞానసహితములైన కర్మలయొక్క ఫలరూపమైన యగ్ని మొదలైన అధిదైవతములయొక్క రూపముతో కాల లక్షణమును కర్మలక్షణము నగు మృత్యువునుండి ముక్త్యతి ముక్తులను చెప్పి గ్రహాతిగ్రహాలక్షణ మైనమృత్యువునుండి ముక్తి చెప్పవలయునని ఈబ్రాహ్మణ మారంభింపఁ బడినది. ఈ పూర్వ బ్రాహ్మణమునందు చెప్పిన ప్రకారము అశ్వలుఁడు ప్రశ్నముచేసి పరాజయమును పొంది ఊరకయున్న తరువాత ఆర్త భాగుఁడనువాఁడు ఓ యాజ్ఞవల్క్యుఁడా యని పిలిచి ప్రశ్నము చేయుచున్నాఁడు. ఏమనఁగా గ్రహములు ఎన్ని అతిగ్రహములు ఎన్ని అని ఈ యాజ్ఞవల్క్యునిఁగూర్చి ఆర్తభాగుఁడు ప్రశ్నము చేసెను. అప్పుడు యాజ్ఞవల్క్యుఁడు ఓ ఆర్తభాగుఁడా! గ్రహములు ఎనిమిది అతిగ్రహములు ఎనిమిది యని చెప్పెను. మరల ఆర్తభాగుఁడు ఓ యాజ్ఞవల్క్యుఁడా ఆ ఎనిమిదియైన గ్రహములును ఎనిమిదియైన అతి గ్రహములును ఏవి యని ప్రశ్నము చేసెను.

ఉ॥ ప్రాణో వై గ్రహః సోఽపానేనాతిగ్రాహేణ గృహీతోఽపానేన

హి గన్ధాన్ జిఘ్రతి. ॥2॥

ప॥ ప్రాణః - వై - గ్రహః - సః - అపానేన-అతిగ్రాహేణ-గృహీతః - అపానేన - హి - గన్ధాన్ - జిఘ్రతి.

ప్ర॥ ప్రాణోవై = ఘ్రాణమే, (ఇక్కడ ప్రాణశబ్దమునకు ఘ్రాణేన్ద్రియ మర్థము). గ్రహః = గ్రహము, (గంధమును గ్రహించునది గనుక గ్రహమనఁబడును). సః = ఆ ఘ్రాణేంద్రియము, అతిగ్రాహేణ = అతిగ్రహమైన, (మిక్కిలి గ్రహించునట్టిది గనుక అతిగ్రహమనఁబడును). అపానేన = గన్ధము చేతను. (ఇక్కడ అపానశబ్దమునకు గన్ధమన్థము). గృహీతః = గ్రహింపఁబడినది. (భవతి = అగుచున్నది). అపానేనహ = నిశ్వాస వాయువుచేతనే, (ఉనీతాన్= తీసికొని రాఁబడిన), గన్ధాన్ = గంధములను, లోకః = జనము, ఘ్రాణేన = ఘ్రాణేంద్రియము చేతను), జిఘ్రతి = ఆఘ్రాణించుచున్నది.

తా॥ ఓ ఆర్తభాగుఁడా! ఘ్రాణేంద్రియమే గ్రహము. ఘ్రాణేంద్రియ విషయమగు గంధమే అతిగ్రహము. ఈ అతిగ్రహమగు గంధముచేతను ఆఘ్రాణేంద్రియము గ్రహింపఁబడినదగుచున్నది. ఇట్లు అతిగ్రహమగు విషయమైన గంధముచే మిక్కిలి గ్రహింపఁబడిన ఘ్రాణేంద్రియముతో లోకము నిశ్వాసవాయువుచే తీసికొనిరాఁబడి గంధమును ఆఘ్రాణించుచున్నది.

ఉ॥ వాగ్వై గ్రహః స నామ్నాతి గ్రాహేణ గృహీతో వాచా హి నామాన్యభివదతి. ॥3॥

ప॥ వాక్ - వై - గ్రహః - సః - నామ్నా-అతిగ్రాహేణ-గృహీతః - వాచా - హి - నామాని - అభివదతి.

ప్ర॥ వాగ్వై = వాగింద్రియమే, గ్రహః = గ్రహము, అతిగ్రాహేణ = అతిగ్రహమగు, నామ్నా = పేరుచేతను. సః=ఆవాగింద్రియమను గ్రహము, గృహీతః = గ్రహింపఁబడినది, (భవతి =

అగుచున్నది). వాచాహి = వాక్కు చేతనే, నామాని=నామములను, (లోకః = జనము, అభివదతి = పలుకుచున్నది).

తా॥ వాక్కే గ్రహము. వక్తవ్య విషయమే అతిగ్రహము. ఆ వాగాఖ్యగ్రహము అతిగ్రహముగు వక్తవ్య విషయము చేతను గ్రహింపఁబడినదై వ్యాపించియున్నది. ఆ వాక్కు చేతనే లోకము నామములను పలుకుచున్నది.

ఉ॥ జిహ్వా వై గ్రహః స రసేనాతి గ్రాహేణ గృహీతో జిహ్వయా హి రసాన్విజానాతి. ॥4॥

ప॥ జిహ్వా - వై - గ్రహః - సః - రసేన - అతిగ్రాహేణ - గృహీతః - జిహ్వయా - హి - రసాన్ - విజానాతి.

ప్ర॥ జిహ్వావై = నాలుకే, గ్రహః = గ్రహము. సః = ఆ నాలుకయను గ్రహము, అతిగ్రాహేణ = అతిగ్రహముగు, రసేన = రసము చేతను, గృహీతః=గ్రహింపఁబడినది. (భవతి=అగుచున్నది). జిహ్వయాహి = నాలుక చేతనే, (లోకః = లోకము), రసాన్ = రసములను, విజానాతి = తెలిసికొనుచున్నది.

తా॥ నాలుకే గ్రహము. దానికి విషయమైన రసమే అతి గ్రహము. ఆ నాలుకయను గ్రహము అతిగ్రహముగు రసముచేత గ్రహింపఁబడి వ్యాపించుచున్నది. అట్టి నాలుక చేతనే లోకము రసములను గ్రహించుచున్నది.

ఉ॥ చక్షుర్వై గ్రహః స రూపేణాతి గ్రాహేణ గృహీత శ్చక్షుషా హి - రూపాణి పశ్యతి. ॥5॥

ప॥ చక్షుః - వై - గ్రహః - సః - రూపేణ-అతిగ్రాహేణ- గృహీతః - చక్షుషా - హి - రూపాణి - పశ్యతి.

ప్ర॥ చక్షుర్వై = నేత్రమే, గ్రహః = గ్రహము. సః = ఆ నేత్రమను గ్రహము, అతిగ్రాహేణ = అతిగ్రహముగు, రూపేణ = రూపము చేతను, గృహీతః = గ్రహింపఁబడినది, (భవతి = అగు

చున్నది), చక్షుషాహి = నేత్రము చేతనే, (లోకః = లోకము), రూపాణి = రూపములను, పశ్యతి = చూచుచున్నది.

తా॥ నేత్రమే గ్రహము. ఆ నేత్రమునకు విషయమైన రూపమే అతిగ్రహము. ఆ నేత్రమను గ్రహము అతిగ్రహమగు రూపముచేత గ్రహింపబడినదై వ్యాపించుచున్నది. అట్టి నేత్రము చేతనే లోకము రూపములను గ్రహించుచున్నది.

ఉ॥ శ్రోత్రం వై గ్రహః స శబ్దేనాతిగ్రాహేణ గృహీతః శ్రోత్రేణ హి శబ్దాన్ శృణోతి. ॥6॥

ప॥ శ్రోత్రం - వై - గ్రహః - సః - శబ్దేన - అతిగ్రాహేణ- గృహీతః - శ్రోత్రేణ - హి - శబ్దాన్ - శృణోతి.

ప్ర॥ శ్రోత్రంవై = చెవియే, గ్రహః = గ్రహము, సః = ఆ శ్రోత్రమను గ్రహము, అతిగ్రాహేణ = అతిగ్రహమగు, శబ్దేన= శబ్దము చేతను, గృహీతః = గ్రహింపబడినది, (భవతి = అగు చున్నది). శ్రోత్రేణహి = శ్రోత్రముచేతనే, (లోకః = లోకము), శబ్దాన్ = శబ్దములను, శృణోతి = వినుచున్నది.

తా॥ శ్రోత్రమే గ్రహము. ఆ శ్రోత్రమునకు విషయమైన శబ్దమే అతిగ్రహము. ఆ శ్రోత్రమను గ్రహము అతిగ్రహమగు శబ్దముచేత గ్రహింపబడి వ్యాపించుచున్నది. అట్టి శ్రోత్రముచేతనే లోకము శబ్దములను వినుచున్నది,

ఉ॥ మనో వై గ్రహః స కామేనాతి గ్రాహేణ గృహీతో మనసా హి కామాన్ కామయతే. ॥7॥

ప॥ మనః - వై - గ్రహః - సః - కామేన - అతిగ్రాహేణ- గృహీతః - మనసా - హి - కామాన్ - కామయతే.

ప్ర॥ మనోవై = మనస్సే, గ్రహః = గ్రహము, సః = ఆ మనస్సను గ్రహము, అతిగ్రాహేణ = అతిగ్రహమగు, కామేన= కామము చేతను, గృహీతః = గ్రహింపబడినది. (భవతి = అగు

చున్నది). మనసాహి = మనస్సు చేతనే. (లోకః = లోకము), కామాన్ = కామములను. కామయతే = కోరుచున్నది.

తా॥ మనస్సే గ్రహము. ఆ మనస్సునకు విషయమైన కామమే అతిగ్రహము. ఆమనస్సను గ్రహము అతిగ్రహమగు కామముచేత గ్రహింపఁబడి వ్యాపించుచున్నది. అట్టి మనస్సుచేతనే లోకము కామములను కోరుచున్నది.

ఉ॥ హస్తౌ వై గ్రహః స కర్మణాతిగ్రాహేణ గృహీతో హస్తాభ్యాగ్ హి కర్మ కరోతి. ॥8॥

ప॥ హస్తౌ – వై – గ్రహః – సః – కర్మణా – అతిగ్రాహేణ – గృహీతః – హస్తాభ్యాం – హి – కర్మ – కరోతి.

ప్ర॥ హస్తౌవై = చేతులే, గ్రహః = గ్రహము, సః = ఆ హస్తములను గ్రహము, అతిగ్రాహేణ = అతిగ్రహమగు, కర్మణా = కర్మచేతను, గృహీతః = గ్రహింపఁబడినది, (భవతి = అగుచున్నది). హస్తాభ్యాంహి = హస్తములచేతనే, (లోకః = లోకము), కర్మ = పనిని, కరోతి = చేయుచున్నది.

తా॥ హస్తములే గ్రహము. ఆ హస్తములకు విషయమైన కర్మమే అతిగ్రహము, ఆ హస్తములను గ్రహము అతిగ్రహమగు కర్మము చేతను గ్రహింపఁబడి వ్యాపించుచున్నది. అట్టి హస్తములను గ్రహముచేతనే లోకము పనిచేయుచున్నది.

ఉ॥ త్వగ్వై గ్రహః స స్పర్శేనాతిగ్రాహేణ గృహీతస్త్వచా హి స్పర్శాన్వేద యత ఇత్యేతేఽష్టౌగ్రహా అష్టావతిగ్రహాః. ॥9॥

ప॥ త్వక్ – వై – గ్రహః – సః – స్పర్శేన – అతిగ్రాహేణ – గృహీతః – త్వచా – హి – స్పర్శాన్ – వేదయతే – ఇతి – ఏతే – అష్టౌ – గ్రహాః – అష్టౌ – అతిగ్రహాః,

ప్ర॥ త్వగ్వై = చర్మమే, గ్రహః = గ్రహము. సః = త్వక్కు అనుగ్రహము, అతిగ్రాహేణ = అతిగ్రహమగు, స్పర్శేన =

స్పర్శముచేతను, (తాఁకెడి జ్ఞానముచేతను), గృహీతః = గ్రహింపఁబడినది, (భవతి =అగుచున్నది). త్వచాహి = త్వగింద్రియముచేతనే, (లోకః =జనము), స్పర్శాన్ = స్పర్శములను, వేదయతే = తెలిసికొనుచున్నది. ఇతి = ఈ ప్రకారము, ఏతే = ఇవి, అష్టౌ = ఎనిమిదియైన, గ్రహాః = గ్రహములు (ఏతే = ఇవి) అష్టౌ = ఎనిమిదియైన, అతిగ్రహాః = అతిగ్రహములు,

తా॥ త్వగింద్రియమే గ్రహము. ఆ త్వగింద్రియవిషయమైన స్పర్శమే అతిగ్రహము. ఆ త్వగింద్రియమను గ్రహము అతిగ్రహమగు స్పర్శముచేతను గ్రహింపఁబడినదై వ్యాపించుచున్నది. అట్టి త్వగింద్రియముచేతనే లోకము స్పర్శములను తెలిసికొనుచున్నది. ఓ ఆర్తభాగుఁడా! ఇట్లు త్వగింద్రియపర్యంతము చెప్పిన ఈ యెనిమిదియును గ్రహములు, స్పర్శపర్యంతము చెప్పిన ఈ యెనిమిదియును అతిగ్రహములు అని యాజ్ఞవల్క్యుఁడు గ్రహాతిగ్రహములను చెప్పెను.

ఉ॥ యాజ్ఞవల్క్యేతి హోవాచ యదిదగ్ం సర్వం మృత్యోరన్నం కా స్విత్సా దేవతా యస్యా మృత్యురన్నమిత్యగ్నిర్వై మృత్యుః సోఽపామన్నమప పునర్మృత్యుం జయతి. ॥10॥

ప॥ యాజ్ఞవల్క్య – ఇతి – హోవాచ – యత్ – ఇదం – సర్వం – మృత్యోః – అన్నం – కా – స్విత్ – సా – దేవతా – యస్యాః – మృత్యుః – అన్నం – ఇతి – అగ్నిః – వై – మృత్యుః – సః – అపాం – అన్నం – అప – పునః – మృత్యుం – జయతి.

ప్ర॥ యాజ్ఞవల్క్యేతి = ఓయాజ్ఞవల్క్యుఁడా! యని, హోవాచ = పలికెను. యదిదంసర్వం = ఈ ప్రసిద్ధమగు సమస్తమును, మృత్యోః = మృత్యువునకు, అన్నం = అన్నము. (భవతి = అగుచున్నది). యస్యాః = ఏ దేవతకు, మృత్యుః = మృత్యువు, అన్నం = అన్నమో, సా = ఆ, దేవతా = దేవత, కాస్విత్ =

ఏది, ఇతి = అని, (ఆర్తభాగుఁడు ప్రశ్నముచేసెను). అగ్నిర్వై = అగ్నియే, మృత్యుః = మృత్యువు. సః = ఆ అగ్ని, అపాం = ఉదకములకు, అన్నం = అన్నము, (భవతి = అగుచున్నది). (అతః = అందువలన, పురుషః = పురుషుఁడు), పునర్మృత్యుం = మరల మృత్యువును, అపజయతి = జయించుచున్నాఁడు. (ఒకసారి మరణమును పొంది తిరిగి మరణమును పొందఁడు).

తా॥ ఆర్తభాగుఁడు మరలప్రశ్నముచేయుచున్నాఁడు. ఓయాజ్ఞవల్క్యుఁడా! ఈ ప్రసిద్ధమగు సమస్తమును మృత్యువునకు అన్నమగుచున్నది. మృత్యువు ఏ దేవత కన్నమగుచున్నదో ఆ దేవత ఏది యని ఁడిగెను. అప్పుడు యాజ్ఞవల్క్యుఁడు ఓ ఆర్తభాగుఁడా! అగ్నియే మృత్యువు. ఆ అగ్నియే ఉదకములకు అన్నమగుచున్నది యని చెప్పి ఇట్టి విజ్ఞానమువల్లనే పురుషుఁడు మరణమైన తరువాత ఇఁక జన్మమెత్తి మరల మరణమును పొందఁడని పలికెను.

ఉ॥ యాజ్ఞవల్క్యేతి హోవాచ యత్రాయం పురుషో మ్రియత ఉదస్మాత్ప్రాణాః క్రామన్త్యాహో 3 నేతి నేతి హోవాచ యాజ్ఞవల్క్యోఽత్రైవ సమవనీయన్తే స ఉచ్ఛ్వయత్యాధ్మాయత్యాధ్మాతో మృతశ్శేతే. ॥11॥

యాజ్ఞవల్క్య - ఇతి - హోవాచ - - అయం - పురుషః - మ్రియతే - ఉత్ - అస్మాత్ - ప్రాణాః - క్రామన్తి - ఆహో - న - ఇతి - న - ఇతి-హోవాచ - యాజ్ఞవల్క్యః - అత్ర - ఏవ-సమవనీయన్తే - సః - ఉచ్ఛ్వయతి - ఆధ్మాయతి - ఆధ్మాతః - మృతః - శేతే.

ప్ర॥ యాజ్ఞవల్క్యేతి = యాజ్ఞవల్క్యుఁడా! యని, హోవాచ = పలికెను. అయం = ఈ, పురుషః = పురుషుఁడు, యత్ర - ఎక్కడ, మ్రియతే = మరణమును పొందుచున్నాఁడో, అస్మాత్ = ఈపురుషుని వలన, ప్రాణాః = ప్రాణములు, ఉత్క్రామన్త్యాహో =

ఊర్ధ్వముగా పోవుచున్నవా ? న = లేదా ? ఇతి = అని, (ఆర్తభాగుఁడు ప్రశ్నముచేసెను). యాజ్ఞవల్క్యః = యాజ్ఞవల్క్యుఁడు, నేతి = లేదు, నేతి = లేదని, హోవాచ = పలికెను. అత్రైవ = ఇక్కడనే, (ఈ పరమాత్మయందే), సమవనీయన్తే = కలిసికొనుచున్నవి. (పరబ్రహ్మతత్త్వమునందు సముద్రమునందు తరంగములవలెనే ఏకమై లీనమగుచున్నవి). సః = ఆ పురుషుఁడు, ఉచ్ఛ్వయతి = నిద్రించుచున్నాఁడు. ఆధ్మాయతి = (బాహ్యవాయువుచేత) పూరింపఁబడుచున్నాఁడు. ఆధ్మాతః = వాయువుచేత పూరింపఁబడినవాఁడును, మృతః = మరణమునుపొందినవాఁడునై, శేతే = పండుకొనియున్నాఁడు. (నిశ్చేష్టితుఁడై యున్నాఁడు).

తా॥ ఇదివఱకు పరబ్రహ్మజ్ఞానము గలవాఁడు మృత్యువును జయించుచున్నాఁడని చెప్పిన ఫలమును విశదపఱుచుటకు వేఱొక ప్రశ్నమును చేయుచున్నాఁడు. ఓ యాజ్ఞవల్క్యుఁడా ! యని పిలిచి పరబ్రహ్మవేత్తయగు ఈ పురుషుడు మరణమును పొందఁగా ఈ పురుషునివలన ప్రాణములు లేచిపోవుచున్నవా ? లేదా ? యని ఆర్తభాగుఁడు ప్రశ్నముచేసెను. యాజ్ఞవల్క్యుఁడు, ఓ ఆర్తభాగుఁడా ! ఈ పురుషునియొక్క ప్రాణములు ఇక్కడనే పరబ్రహ్మతత్త్వమునందు లీనమగుచున్నవి. అనంతరము ఈ పురుషుఁడు నిద్రాళుతను పొంది బాహ్యవాయువుచేత నిండింపఁబడినవాఁడై నిశ్చేష్టితుఁడై యున్నాఁడు. ఇట్లు బంధము నశించుటతోనే ముక్తుఁడగువాఁడు ఎక్కడికి పోక అంతటను పరిపూర్ణుఁడగుచున్నాఁడు.

ఉ॥ యాజ్ఞవల్క్యేతి హోవాచ యత్రాయం పురుషో మ్రియతే కిమేనం న జహాతీతి నామేత్యనన్తం వై నామానన్తా విశ్వేదేవా అనన్తమేవ స తేన లోకం జయతి. ॥12॥

ప॥ యాజ్ఞవల్క్య - ఇతి - హోవాచ - యత్ర - అయం - పురుషః - మ్రియతే - కిం - ఏనం - న - జహాతి - ఇతి - నామ -

ఇతి - అనన్తం - హ్యై - నామ - అనన్తాః - విశ్వేదేవాః - అనన్తం - ఏవ - సః - తేన - లోకం - జయతి.

ప్ర॥ యాజ్ఞవల్క్యే = యాజ్ఞవల్క్యుఁడా! యని, హో వాచ = పలికెను. అయం = ఈ, పురుషః = పురుషుఁడు, యత్ర ఎక్కడ, మ్రియతే = మరణమును పొందుచున్నాఁడో, ఏనం = ఈ పురుషుని, కిం = ఏమి, నజహాతి = విడువదు. ఇతి = అని, (ఆర్తభాగుఁడు ప్రశ్నముచేసెను). నామ = నామమాత్రము, (నలీయతే = లీనముకాదు). ఇతి = అని, (యాజ్ఞవల్క్యుఁడు చెప్పెను). నామ = నామము, అనన్తంహ్యై=అనన్తమైనది. విశ్వేదేవాః=విశ్వేదేవులు, అనన్తాః = అనన్తమైనవారు. తేన = దానిచేతను, (నామము నిత్యమైనది. నిత్యత్వమే నామమునకు అనన్త్యత్వము. అట్టి అనన్త్యత్వమును పొందినవారు విశ్వేదేవులు. ఇట్లు ఆ నామముయొక్క అనన్త్యత్వమును పొందిన విశ్వేదేవులను ఆత్మత్వమును పొంది చూచుట చేతను), సః = ఆ పురుషుఁడు, అనన్తం = అనన్తమగు, లోకమేవ = లోకమునే, జయతి = జయించుచున్నాఁడు.

తా॥ ఇదివఱకు ముక్తునియొక్క ప్రాణములు మాత్రము పరబ్రహ్మతత్త్వమునందు లీనమగుచున్నవని చెప్పఁబడినది. ప్రాణేతరమగు సమస్తముండఁగా వానికి ముక్తి ఎట్లుకలుగునో దానిని తెలిసికొనుటకు ఈ ప్రశ్నము చేయుచున్నాఁడు. ఓయాజ్ఞవల్క్యుఁడా! యని పిలిచి ఈ పురుషుఁడు మరణమును పొందఁగా వీనిని విడిచి పోనిది యేదియని ఆర్తభాగుఁడు ప్రశ్నము చేసెను. యాజ్ఞవల్క్యుఁడు, ఓ ఆర్తభాగుఁడా! ఈ పురుషుని పేరు మాత్రము విడిచిపోదు. బ్రహ్మవేత్తయొక్క వ్యావహారికనామము వానిదృష్టితో శేషింపకయే పోవుచున్నది. ఇతరులయొక్క దృష్టితో వ్యావహారిక నామము మిగిలియున్నది. ఎట్లనఁగా ముక్తులైన శుకాదుల నామములనలెనే. ఇట్లునిత్యమై అనన్త్యమునగు నామాధికృతులగు విశ్వే

దేవులను బ్రహ్మము నేనైతిని అని ఆత్మస్వరూపముతో చూచుట చేత బ్రహ్మవేత్తయగు పురుషుఁడు అనంతమగు లోకమును జయించు చున్నాఁడు. అనఁగా పరమాత్మైక్యమును పొంది ముక్తుఁడగుచు న్నాఁడు.

ఉ॥ యాజ్ఞవల్క్యేతి హోవాచ యత్రాస్య పురుషస్య మృతస్యాగ్నిం వాగప్యేతి వాతం ప్రాణశ్చక్షురాదిత్యం మనశ్చన్ద్రం దిశః శ్రోత్రం పృథివీగ్ం శరీరమాకాశమాత్మౌషధీర్లోమాని వనస్పతీన్కేశా అప్సు లోహితం చ రేతశ్చ నిధీయతే క్వాయం తదా పురుషో భవతీత్యా హర సోమ్య హస్త మార్తభాగావా మేవైతస్య వేదిష్యావో న నావేతత్ సజన ఇతి తౌ హోత్క్రమ్య మన్త్రయాఞ్చక్రాతే తౌ హ యదూచతుః కర్మ హైవ తదూచతురథ యత్ప్రశశగ్ంసతుః కర్మహైవ తత్ప్రశశగ్ంసతుః పుణ్యో వై పుణ్యేన కర్మణా భవతి పాపః పాపే నేతి తతో హ జారత్కారవ ఆర్తభాగ ఉపరరామ. ॥13॥

ఇతి బృహదారణ్యకే ॥ పఞ్చమాధ్యాయే – ద్వితీయంబ్రాహ్మణమ్.

ప॥ యాజ్ఞవల్క్య – ఇతి – హోవాచ – యత్ర – అస్య – పురుషస్య – మృతస్య – అగ్నిం – వాక్ – అపి – ఏతి – వాతం – ప్రాణః – చక్షుః – ఆదిత్యం – మనః – చంద్రం – దిశః – శ్రోత్రం – పృథివీం – శరీరం – ఆకాశం – ఆత్మా – ఓషధీః – లోమాని – వనస్పతీన్ – కేశాః – అప్సు – లోహితం – చ – రేతః – చ – నిధీయతే – క్వ – అయం – తదా – పురుషః – భవతి – ఇతి – ఆహార – సోమ్య – హస్తం – ఆర్తభాగ – ఆవాం – ఏవ – ఏతస్య – వేదిష్యావః – న – నౌ – ఏతత్ – సజనే – ఇతి – తౌ – హ – ఉత్క్రమ్య – మన్త్రయాఞ్చక్రాతే – తౌ – హ – యత్ – ఊచతుః – కర్మ – హ – ఏవ తత్ – ప్రశశంసతుః – పుణ్యః – వై – పుణ్యేన – కర్మణా – భవతి – పాపః – పాపేన – ఇతి – తతః –

హం - జారత్కారవః - ఆర్తభాగః - ఉపరరామ.

ప్ర॥ యాజ్ఞవల్క్యేతి = ఓ యాజ్ఞవల్క్యుడా! యని, హోవాచ = పలికెను. యత్ర = ఎప్పుడు, అస్య = ఈ, మృతస్య = మరణమ్మును పొందిన, పురుషస్య = పురుషునియొక్క, (బ్రహ్మజ్ఞాని కానివాడును, శిరఃపాణ్యాదులు గలవాడును, మృతుడైనవాడు నగు పురుషునియొక్క = అజ్ఞానియొక్క), వాక్ = వాగింద్రియము, అగ్నిం = అగ్నిని, అప్యేతి = పొందుచున్నది. ప్రాణః = ప్రాణము, వాతం = వాయువును, అప్యేతి = పొందుచున్నది. చక్షుః = నేత్రము, ఆదిత్యం = సూర్యుని, అప్యేతి = పొందుచున్నది. మనః = మనస్సు, చంద్రం = చంద్రుని, అప్యేతి = పొందుచున్నది. శ్రోత్రం = శ్రోత్రము, దిశః = దిక్కులను, అప్యేతి=పొందుచున్నది. శరీరం = దేహము, పృథివీం = భూమిని, అప్యేతి = పొందుచున్నది. ఆత్మా = ఆత్మ, ఆకాశం = ఆకాశమును, అప్యేతి=పొందుచున్నది. (ఇక్కడ ఆత్మ కధిష్ఠానము హృదయాకాశము గనుక ఆత్మ ఆకాశత్వమును పొందుచున్నది. లోమాని = దేహమునందలి వెండ్రుకలు, ఓషధీః = ఓషధులను, (చెట్లు పొదలు తీగలు మొదలైనవానిని), అప్యేతి = పొందుచున్నవి. కేశాః = శిరస్సునందలి వెండ్రుకలు, వనస్పతీన్ = వనస్పతులను, (పుష్పింపక ఫలించెడి మఱ్ఱిచెట్టు మొదలైనవి వనస్పతులనబడును), అప్యేతి = పొందుచున్నవి. లోహితంచ = రక్తమును, రేతశ్చ = శుక్లమును, అప్సు = ఉదకములయందు, నిధీయతే = ఉంచబడుచున్నది. తదా = అప్పుడు, (దేహేంద్రియాదులన్నియుపోయి నిరాధారమైన సమయమునందు), అయం = ఈ, పురుషః = పురుషుడు, క్వ = ఎక్కడ, భవతి = ఉన్నాడు. ఇతి = అని, (విదేహమై అస్వతంత్రుడైన కర్తయగు పురుషుడు ఏ ఆశ్రయమును ఆశ్రయించి మరల ఈ దేహేంద్రియ సముదాయమును స్వీకరించుచున్నాడు. అది ఏది అని ఆర్తభాగుడు ప్రశ్నము

చేసెను). హేసోమ్య = ఓ సౌమ్యుడా? హే ఆర్తభాగ = ఓ ఆర్తభాగుడా! హస్తం = హస్తమును, ఆహార = తెమ్ము. అవామేవ = మనమిద్దరమే. ఏతస్య = ఈ నీవుఅడిగినదానియొక్క, (వేదితవ్యం = తెలిసికొనదగినది. యత్ = ఏదియో, తత్ = దానిని), వేదిష్యావః = తెలిసికొందము. (నిరూపింతము). ఏతత్ = ఇది, నౌ = మనయిద్దఱికిని, సజనే = జనసముదాయమునందు, (నిర్ణేతుం = నిర్ణయించుటకు), న = శక్యముకాదు. ఇతి = అని, తౌహ = ఆయాజ్ఞవల్క్య, ఆర్తభాగులిద్దరును, ఉత్క్రమ్య = లేచి వెళ్లి, (లేచి ఏకాంత ప్రదేశమును పొంది). మన్త్రయాఞ్చక్రాతే = ఆలోచించిరి. (లౌకికవాదుల పక్షములలో నొక్కదానిని పరిగ్రహించి విచారించిరి). తౌహ = వారిద్దఱును, (విచార్య = విచారించి), యత్ = దేనిని, ఊచతుః = పలికిరి. (ఏతత్ = ఈ), కర్మహైవ = కర్మమునే, తత్ = అక్కడ, ఊచతుః = చెప్పిరి. అథ = అనంతరము, యత్ = దేనిని, ప్రశశంసతుః = స్తుతించిరి. కర్మహైవ = కర్మమునే. తత్ = ఆ విచారసమయమునందు, ప్రశశంసతుః = స్తుతించిరి. (ఏ కారణము వలన ఆ యాజ్ఞవల్క్య, ఆర్తభాగు లిద్దరును దేహాంతర ప్రాప్తి కారణములగు కాల కర్మ దైవములలో కర్మే ప్రధానమైనదని చెప్పి శ్లాఘించిరో ఆ కారణమువలన). పుణ్యోవై = పుణ్యాత్ముడే, పుణ్యేనకర్మణా = శాస్త్ర విహితమైన పుణ్యకర్మము చేతను, భవతి = అగుచున్నాడు. పాపః= పాపాత్ముడు, పాపేన=పాపకర్మము చేతను, (భవతి=అగుచున్నాడు). ఇతి = సమాప్తము. తతోహ = అందువల్లనే. జారత్కారవః = జరత్కారుని గోత్రమందుబుట్టిన, ఆర్తభాగః = ఆర్తభాగుడను వాడు, ఉపరరామ = ఊరకయుండెను.

తా॥ ఇంతకు పూర్వము గ్రహాతిగ్రహరూపమైన మృత్యురూప బంధనమును, ఆ బంధమునుండి జ్ఞానియగు వానికి ఇక్కడనే ప్రదీప

నిర్వాణమువలె ముక్తియును చెప్పఁబడినది. ఇప్పుడు గ్రహాతిగ్రహ మను పేరుగల మృత్యురూపమైన బన్ధనముయొక్క ప్రయోజనమును నిర్ధారణ చేయుటకు ఈ ప్రశ్నము ఆరంభింపఁబడినది. ఓ యాజ్ఞవల్క్యుఁడా! యని పిలిచి అజ్ఞానియై మృతిపొందిన పురుషునియొక్క వాక్కు అగ్నిని ప్రాణము వాయువును నేత్రము సూర్యుని మనస్సు చంద్రుని శ్రోత్రము దిక్కులను శరీరము భూమిని ఆత్మ ఆకాశమును లోమములు ఓషధులను కేశములు వనస్పతులను పొందుచున్నవి. రక్తమును శుక్లమును నీళ్ళయం దుంచఁబడుచున్నది. ఇట్లు దేహేంద్రియాదులన్నియు పోయి నిరాశ్రయుఁడై నప్పుడు విదేహియును అస్వతంత్రుఁడును అజ్ఞానియు నగు కర్తయైన ఈ పురుషుఁడు దేనిని ఆశ్రయించి మరల ఈ దేహేంద్రియాది సమమును పొందుచున్నాఁడు, అది ఏదియని ఆర్తభాగుఁడు ప్రశ్నము చేయఁగా యాజ్ఞవల్క్యుఁడు ఓ ఆర్తభాగుఁడా! నీ హస్తమును తెమ్ము అని హస్తమును చాచి ఆర్తభాగుని హస్తమును పట్టుకొని పలికెను. నీవు అడిగిన దానిని మన మిద్దరమును నిరూపింతము. ఇక్కడ వాదులచేత, స్వభావ, యదృచ్ఛా, కాల, కర్మ, దైవ, విజ్ఞానమాత్ర శూన్యములు కల్పింపఁబడినవి. కనుక ఇది విరోధ స్థానమగుటవలన ఈ జనసముదాయమునందు ఆ వస్తువును నిర్ణయించుటకు మనకు శక్యముకాదు. కనుక దానిని విచారించుటకు ఏకాంత ప్రదేశమునుగూర్చి వెళ్ళెదము అని పలికెను. ఇట్లు పలికి ఆ యాజ్ఞవల్క్య, ఆర్తభాగు లిద్దరును ఆ జనసముదాయ ప్రదేశమునుండి లేచి రహస్యస్థానమును పొంది ముందుగా లౌకికవాదుల యొక్క పక్షములలో ఒక్కొకదానిని పరిగ్రహించి విచారించి సమస్తములైన పూర్వపక్షములను పోఁగొట్టి మరల మరల దేహేంద్రియాదులను గ్రహించుటకు కర్మమే హేతువు. విదేహియై మృతి పొందిన కర్తయగు ఈ పురుషునకు కర్మే ఆశ్రయమైనది యని నిర్ణయించి పలికి, కాల కర్మ దైవములను ఈ మూడు కారణములలో

కర్మమే మిక్కిలి ప్రధానమైనదని స్తుతించిరి. ఇట్లు వారు మాటిమాటికి దేహేంద్రియ సముదాయమును స్వీకరించుట, కర్మప్రయుక్తమైనదిగా నిర్ధారణ చేసిరి. ఆ కారణము వలన పుణ్యాత్ముఁడు శాస్త్రవిహితమైన పుణ్యకర్మతో పుణ్యకర్మ ఆశ్రయముగా కలవాఁడై బ్రాహ్మణాది జన్మమును పాపాత్ముఁడు శాస్త్రవిపరీతమైన పాపకర్మతో పాపకర్మ ఆశ్రయముగా కలవాఁడై శ్వ,సూకరాది జన్మములను పొందుచున్నాఁడు అని యాజ్ఞవల్క్యుఁడు చెప్పెను. ఇట్లు చెప్పుటవలన జరత్కారుని గోత్రమునందు పుట్టిన ఆర్తభాగుఁడు నిరుత్తరుఁడై వేఱు ప్రశ్నము చేయక యూరకుండెను,

ఇట్లు పఞ్చమాధ్యాయము ద్వితీయ బ్రాహ్మణము సమాప్తము.

## పఞ్చమాధ్యాయము. తృతీయ బ్రాహ్మణము

ఉ॥ అథ హైనం భుజ్యుర్లాహ్యాయనిః పప్రచ్ఛ యాజ్ఞవల్క్యేతి హోవాచ మద్రేషు చరకాః పర్యవ్రజామ తే పతఞ్చలస్య కాప్యస్య గృహానైమ తస్యాసీద్దుహితా గన్ధర్వగృహీతా తమపృచ్ఛామ కోఽసీతిసోఽబ్రవీత్సుధన్వాఽఙ్గిరస ఇతి తం యదా లోకానామన్తానపృచ్ఛామాథైనమబ్రూమ క్వ పారిక్షితా అభవన్నితి క్వ పారిక్షితా అభవన్స త్వా పృచ్ఛామి యాజ్ఞవల్క్య క్వ పారిక్షితా అభవన్నితి. 1

ప॥ అథ - హ - ఏనం - భుజ్యుః - లాహ్యాయనిః - పప్రచ్ఛ - యాజ్ఞవల్క్య - ఇతి - హోవాచ - మద్రేషు - చరకాః - పర్యవ్రజామ - తే - పతఞ్చలస్య - కాప్యస్య - గృహాన్ - ఐమ - తస్య - ఆసీత్ - దుహితా - గన్ధర్వగృహీతా - తం - అపృచ్ఛామ - కః - అసి - ఇతి - సః - అబ్రవీత్ - సుధన్వా - ఆఙ్గిరసః - ఇతి - తం - యదా - లోకానాం - అన్తాన్ - అపృచ్ఛామ - అథ - ఏనం - అబ్రూమ - క్వ - పారిక్షితాః - అభవన్ - ఇతి - క్వ -

ః - అభవన్ - సః - త్వా - పృచ్ఛామి - యాజ్ఞ వల్క్య - క్వ - పారిక్షితాః - అభవన్ - ఇతి.

ప్ర॥ అథ = అనంతరము, (జారత్కారుఁడు ప్రశ్నముచేసి ఊరకున్న తరువాత), లాహ్యాయనిః = లహ్యునియొక్క పుత్రుఁడగు, భుజ్యుః = భుజ్యువు అను పేరుగలవాఁడు, పప్రచ్ఛ = అడిగెను. యాజ్ఞవల్క్యేతి = ఓ యాజ్ఞవల్క్యుఁడా! యని, హోవాచ = పలికెను. చరకాః = వ్రతాచరణముచేయుచున్న, (అధ్యయనముకొఱకు వ్రతమును ఆచరించుచున్న, వయం = మేము), మద్రేషు = మద్ర దేశములయందు, పర్యవ్రజామ = తిరిగితిమి. తే = ఆ తిరుగుచున్న, (వయం = మేము), కాప్యస్య = కపిగోత్రమునందు పుట్టిన, పతఞ్జలస్య = పతంజలుఁడనువానియొక్క, గృహాన్ = గృహమునుగూర్చి, ఐమ=పోతిమి, తస్య = ఆ పతఞ్జలుఁడనువానికి, గన్ధర్వగృహీతా = గన్ధర్వగ్రహముచేత గ్రహింపఁబడిన, (అమానుషమగు గంధర్వ గ్రహావిష్టమైన), దుహితా = కొమార్తె, ఆసీత్ = ఉండెను. తం = ఆ గంధర్వుని, (త్వం = నీవు), కోఽసీతి = ఎవఁడవు అగుచున్నావని, (వయం = మేము), అపృచ్ఛామ = అడిగితిమి. సః=ఆ గంధర్వుఁడు, (అహం = నేను), ఆఙ్గిరసః = ఆంగిరసగోత్రమునందు పుట్టిన, సుధన్వా = సుధన్వుఁడను పేరు గలవాఁడను. ఇతి = అని, అబ్రవీత్ = పలికెను, తం = ఆ గంధర్వుని, (వయం = మేము), యదా = ఎప్పుడు, లోకానాం = లోకములయొక్క, అన్తాన్ = అవసానములను, అపృచ్ఛామ = అడిగితిమో, అథ = అనంతరము, (వయం = మేము), పారిక్షితాః = పరిక్షిత్తను వానియొక్క పుత్రులు, క్వ = ఎక్కడ, (ఏ లోకమునందు), అభవన్నితి = ఉండిరని, ఏనం = ఈ గంధర్వునిఁగూర్చి, అబ్రూమ = పలికితిమి. సః = ఆ గంధర్వుఁడు, పారిక్షితాః = పరిక్షిత్పుత్రులు, క్వ=ఎక్కడ, అభవన్ = ఉండిరో, (సర్వం= సమస్తమును, అస్మభ్యం = మాకొఱకు, అబ్రవీత్ = పలి

కెను). సః = ఆ, (అహం = నేను), త్వా = నిన్ను, పారిక్షితాః = పరీక్షిత్పుత్రులు, క్వ = ఎక్కడ, అభవన్నితి = ఉండిరని, పృచ్ఛామి = అడుగుచున్నాను. హే యాజ్ఞవల్క్య = ఓ యాజ్ఞవల్క్యుఁడా! (త్వం = నీవు), కథయ = చెప్పుము). ఇతి = అని, (భుజ్యువు అనువాఁడు ప్రశ్నముచేసెను).

తా॥ ఇప్పుడు కర్మఫలములకు సంసారత్వము చూపించుటకు ఈ బ్రాహ్మణమారంభింపఁ బడినది. ఋతభాగుని పుత్రుఁడగు జారత్కారవుఁడు ఊరకయున్న తరువాత లహ్యుని పుత్రుఁడగు భుజ్యువనువాఁడు సమష్టివ్యష్టి రూపమైన ఆత్మదర్శనమునకు (సమష్టి అనఁగా ఏకము వ్యష్టిఅనగా అనేకము),అలౌకికత్వమునుచూపించుటకు తన ప్రవర్తనరూపమైన ఈకథనుచేయుచు దీనిచేతప్రతివాదిబుద్ధిని మోహపెట్టఁగలనని తలంచి అడుగుచున్నాఁడు. ఓ యాజ్ఞవల్క్యుఁడా! యని పిలిచి పలికెను. మేము మద్రదేశములయందు అధ్యయనముకొఱకు వ్రతాచరణమును చేయువారలమై తిరుగుచు కపిగోత్రమునందు పుట్టిన పతంజలుఁడనువాని గృహమునకు పోతిమి. అక్కడ అతని కొమార్తె అమానుషమగు గంధర్వ గ్రహావిష్టయై యుండెను. అప్పుడు మేమందఱము ఆ స్త్రీయందు ఆవహించియున్న గంధర్వ గ్రహమును చుట్టుకొన్నవారమై నీవు ఎవరు? నీ పేరేమి? యని అడిగితిమి. ఆ గంధర్వుఁడు నేను అంగిరసగోత్రోత్పన్నుఁడనైన సుధన్వుఁడనువాఁడనని పలికెను, అప్పుడు మే మందఱము లోకములయొక్క పరిమాణములను తెలిసికొనుటకు ఈ గంధర్వుని పరిక్షిత్పుత్రులు ఏలోకమందుండిరని అడిగితిమి. ఆ గంధర్వుఁడు మాకొఱకు పరిక్షిత్పుత్రులు ఎక్కడవున్నది సమస్తమును చెప్పెను. ఈ ప్రకారము నాచేత గంధర్వులవలన జ్ఞానము పొందఁబడినది. ఇట్లు గంధర్వునివలన జ్ఞానమును పొందినవాఁడును విద్యాసంపత్తిగలవాఁడును నగు నేను ఓ యాజ్ఞవల్క్యుఁడా! నిన్ను పరిక్షిత్పుత్రులు ఎక్కడ ఉన్నారని అడుగుచు

న్నాను. నీవు దానిని తెలిసికొనియుంటివా చెప్పుము అని భుజ్యువను వాఁడు ప్రశ్నము చేసెను.

ఉ॥ స హోవాచోవాచ వై సోఽగచ్ఛన్వై తే తద్యత్రాశ్వమేధ యాజినో గచ్ఛన్తీతి క్వ న్వశ్వమేధయాజినో గచ్ఛన్తీతి ద్వాత్రిగ్ం శతం వై దేవరథాహ్న్యాన్యయం లోక స్తగ్ం సమన్తం పృథివీ ద్విస్తావత్ప ర్యేతి తాగ్ం సమన్తం పృథివీం ద్విస్తావత్సముద్రః ప ర్యేతి తద్యావతీ క్షురస్య ధారా యావద్వా మక్షికాయాః పత్రం తావన న్తరేణాకాశస్తానిన్ద్రః సుపర్ణో భూత్వా వాయవే ప్రాయ చ్ఛత్తా న్వాయురాత్మని ధిత్వా తత్రాగమయద్యత్రాశ్వమేధ యాజినోఽభవన్నిత్యేవమివ వై స వాయుమేవ ప్రశశగ్ం స తస్మాద్వాయురేవ వ్యష్టిర్వాయు స్సమష్టిరప పునర్మృత్యుం జయతి య ఏవం వేద తతో హ భుజ్యుర్లాహ్యాయనిరుపరరామ.॥2॥

ఇతి పఞ్చమాధ్యాయే – తృతీయం బ్రాహ్మణమ్.

ప॥ సః – హోవాచ – ఉవాచ – వై – సః – అగచ్ఛత్ – వై – తే – తత్ – యత్ర – అశ్వమేధయాజినః – గచ్ఛన్తి – ఇతి – క్వ – ను – అశ్వమేధయాజినః – గచ్ఛన్తి – ఇతి – ద్వాత్రింశ తం – వై – దేవరథాహ్న్యాని – అయం – లోకః – తం – సమన్తం – పృథివీ – ద్విః – తావత్ – సముద్రః – పర్యేతి – తత్ – యావతీ – క్షురస్య – ధారా – యావత్ – వా – మక్షికాయాః – పత్రం – తావాన్ – అన్తరేణ – ఆకాశః – తాన్ – ఇన్ద్రః – సుపర్ణః – భూత్వా – వాయవే – ప్రాయచ్ఛత్ – తాన్ – వాయుః – ఆత్మని – ధిత్వా – తత్ర – అగమయత్ – యత్ర – అశ్వమేధయాజినః – అభవన్ – ఇతి – ఏవం – ఇవ – వై – సః – వాయుం – ఏవ – ప్రశశంస – తస్మాత్ – వాయుః – ఏవ – వ్యష్టిః – వాయుః – స మష్టిః – అప – పునః – మృత్యుం – జయతి – యః – ఏవం – వేద – తతః – హ – భుజ్యుః – లాహ్యాయనిః – ఉపరరామ.

ప్ర॥ సః = ఆ యాజ్ఞవల్క్యుఁడు, హోవాచ = పలికెను. అశ్వమేధయాజినః = అశ్వమేధయాగము చేసినవారు, యత్ర = ఏ లోకమునకు, గచ్ఛన్తి = పోవుచున్నారో, తత్ = ఆ లోకమును, తే = ఆ పరిక్షిత్పుత్రులు, అగచ్ఛన్నితి = పొందిరి అని, సః = ఆ గంధర్వుఁడు, (తుభ్యం = మీకొఱకు), ఉవాచవై = పలికెను. అశ్వమేధయాజినః = అశ్వమేధయాగము చేసినవారు, క్వను = దేని యందు, గచ్ఛన్తి = పోవుచున్నారు, ఇతి = అని, (భుజ్యువనువాఁడు మరల ప్రశ్నము చేసెను). (ఆ అశ్వమేధయాగమును చేసినవారి యొక్క గతిని చెప్పవలయునను ఇచ్ఛచేత భువనకోశముయొక్క పరిమాణమును చెప్పెను). అయం = ఈ, లోకః = లోకము, (ఎక్కడ విరాట్పురుషుని శరీరమో, యెక్కడ ప్రాణులయొక్క కర్మఫలము అనుభవించుటయో, అటువంటిదియగు లోకము = అనఁగా లోకాలోకపర్వతముచేత చుట్టుకొనఁబడిన ఈ లోకము), ద్వాత్రింశతంవై = ముప్పదిరెండైన, దేవరథాహ్న్యాని = దేవరథ = సూర్యరథము యొక్క, ఆహ్న్యాని = ఆహ్న్యములైనది. (సూర్యరథము ఒకరోజులో ఎంత దేశము తిరుగునో ఆ దేశపరిమితి దేవరథాహ్న్యమని చెప్పఁబడును. అటువంటి ముప్పదిరెండు దేవరథాహ్న్యముల ప్రమాణముకలది ఈ లోకము), తం = ఆ లోకమును, సమన్తం = అంతటను, (లోకాలోకమును వ్యాపించియున్న ఈ లోకమునంతయు) పృథివీ = భూమి, ద్విస్తావత్ = రెండింతలపరిమితితో, పర్యేతి = చుట్టుకొనియున్నది. తాం = ఆ, పృథివీం = భూమిని, సమన్తం = అంతటను, సముద్రః = సముద్రుఁడు, ద్విస్తావత్ = రెండింతల పరిమితితో, పర్యేతి = చుట్టుకొనియున్నది. (అశ్వమేధయాగమును చేసినవారు ఏమార్గముచేతను బయటపోయి వ్యాపించుచున్నారో. అటువంటి అండ కపాలములయొక్క రంధ్రపరిమాణము చెప్పఁబడు చున్నది). క్షురస్య = మంగలకత్తియొక్క, ధారా = వాడి యొక్క

కొన, యావతీ = ఎంతకపరిమాణముకలదియో, మక్షికాయాః = ఈగ యొక్క, పత్రం = రెక్క, యావద్వా = ఎంతపరిమితిగలదియో, తావాన్ = అటువంటిది, (అట్టి సూక్ష్మ పరిమాణముకలది). తత్ = ఆ అండ కపాలములయొక్క, అన్తరేణ = మధ్యమందలి, ఆకాశః = ఆకాశము, (రంధ్రము), ఇన్ద్రః = పరమేశ్వరుఁడు, సుపర్ణోభూత్వా = పక్షియై, (రెక్కలు తోఁకగల పక్షిరూపమై), తాన్ = ఆ పరిక్షిత్పుత్రులను, వాయవే = వాయువునకు, ప్రాయచ్ఛత్ = ఇచ్చెను. వాయుః = వాయువు, తాన్ = ఆపరిక్షిత్పుత్రులను, ఆత్మని = తనయందు, ధిత్వా = ఉంచుకొని: (తన స్వరూపమైన వారలనుగా చేసికొని), తత్ర = అక్కడికి, (బ్రహ్మాండమునకు వెలుపల నుండెడి దేశమునకు), అగమయత్ = పొందించెను. యత్ర = ఏ ప్రదేశమునందు, అశ్వమేధయాజినః = అశ్వమేధయాగమును చేసిన పరిక్షిత్పుత్రులు, అభవన్నితి = ఉండిరని, (ఆ గంధర్వుఁడు చెప్పినది ఇదే). ఏవమివవై = ఈ ప్రకారముగానే, సః = ఆ గంధర్వుఁడు వాయుమేవ = వాయువునే, ప్రశశంస = స్తుతించెను. తస్మాత్ = అందువలన, వాయురేవ = వాయువే, వ్యష్టిః = వ్యష్టిరూపమైనది, (అధ్యాత్మ అధిభూత అధిదైవభావముతో నానావిధమైనది). వాయుః = వాయువు, సమష్టిః = సమష్టిరూపమైనది. (కేవల సూత్రాత్మ స్వరూపముతో ఒక్కటియైనది). ఏవం = ఈ ప్రకారము, యః = ఎవఁడు, వేద = తెలిసికొనుచున్నాఁడో, (సః = వాఁడు), పునర్మృత్యుం = మరల మరణమును, అపజయతి = జయించుచున్నాఁడు. (ఒకసారి మరణమునుపొంది మరల మరణమును పొందఁడు. అనఁగా మరల జన్మము లేనివాఁ డగుచున్నాఁడు). తతోహ = అందువలననే, (ఇట్లు యాజ్ఞవల్క్యుఁడు తన ప్రశ్నములను నిర్ణయించి చెప్పుటవలన), లాహ్యాయనిః = లహ్యుని పుత్రుఁడగు, భుజ్యుః = భుజ్యువనువాఁడు, ఉపరరామ = ఊరకయుండెను.

తా॥ ఈ పూర్వప్రకారము ప్రశ్నము చేయఁగా యాజ్ఞవల్క్యుఁడు ఓ భుజ్యుఁడా! ఆ పరిక్షిత్పుత్రులు, అశ్వమేధయాగము చేసిన వార లెక్కడికి పోవుచున్నారో అక్కడికి పోయిరని ఆ గంధర్వుఁడు మీకు చెప్పెనని పలికెను. ఇట్లు యాజ్ఞవల్క్యుఁడుత్తరమును చెప్పఁగానే భుజ్యుఁడనువాఁడు ఓ యాజ్ఞవల్క్యుఁడా! అశ్వమేధయాగమును చేసినవారు పోవునట్టి ప్రదేశమేది యని మరల ప్రశ్నము చేసెను. ఇట్లడుగఁగా ఆ యశ్వమేధయాగమును చేసినవారిగతిని చెప్పుటకు లోకపరిమాణమును చెప్పుచున్నాఁడు. ప్రాణులయొక్క కర్మ ఫలముల ననుభవించుటకు స్థానమైనదియును విరాట్పురుష సంబంధమైన దేహమైనదియును లోకాలోక పర్వతముచేత చుట్టుకొోఁబడినదియు నగు ఈ లోకము, సూర్య రథము ఒక పగటిలో ఎంత దేశము తిరుగునో ఆ దేశపరిమితి, దేవరథాహ్న్య మనఁబడును. అట్టి ప్రమాణములు ముప్పదిరెండింతలుగలది. ఇంత పరిమితిగల ఆ యీ లోకమునంతటను రెండింతల పరిమితిగల భూమిచుట్టుకొని యున్నది. ఇంత పరిమితిగల ఆ భూమిని రెండింతల పరిమితిగల సముద్రముచుట్టుకొని యున్నది. ఇటువంటి బ్రహ్మాండకటాహమును భేదించుకొని అశ్వమేధయాగమును చేసినవారు బ్రహ్మాండముయొక్క వెలుపలికి పోవుచున్నారు. ఆ మార్గము ఏదియనఁగా అండ కపాలములయొక్క రంధ్రము. ఇది మిక్కిలి సూక్ష్మమైన మంగలకత్తియొక్క వాడి కొనవలెను ఈగయొక్క రెక్కవలెను అండ కపాలములయొక్క మధ్యమందున్నది. పరమేశ్వరుఁడు అశ్వమేధయాగము చేసిన ఆ పరిక్షిత్పుత్రులను తాను పక్షిరూపుఁడై మోసికొనిపోయి బాహ్యాంతరములయందు సమష్టి వ్యష్టి స్వరూపములతో అంతటను వ్యాపించి యున్న వాయువుకొఱకు ఇచ్చెను. ఆ వాయువు ఆ పరిక్షిత్పుత్రులను తన స్వరూపులనుగా చేసికొని ఆ అండకపాలములయొక్క మధ్యమందున్న యతిసూక్ష్మమగు ఆ మార్గము ద్వారా బ్రహ్మాండముయొక్క

వెలుపలికి తీసికొనిపోయెను. దీనినే ఆ గంధర్వుఁడు మీకు చెప్పి ఈ ప్రకారముగానే పరిక్షిత్పుత్రులయొక్క గతినిగూర్చి వాయువును స్తుతించెను. ఇట్లు వాయువు అధ్యాత్మిక అధిభౌతిక అధిదైవిక స్వరూపములతో అనేకవిధములుగాను కేవల సూత్రాత్మ స్వరూపముతో ఒక విధముగాను ఉండుటవలన సమష్టి వ్యష్టిరూపుఁడాయెను. ఇట్లు వాయువును సమష్టిగాను వ్యష్టిగాను తెలిసికొనినవాఁడు మరల జన్మమెత్తఁడు. అని ఇట్లు యాజ్ఞవల్క్యుఁడు తానుచేసిన ప్రశ్నములను నిర్ణయించి చెప్పుటవలన లహ్యునిపుత్రుఁడగు భుజ్యువనువాఁడు వేరు ప్రశ్నము చేయనివాఁడై ఊరకుండెను,

ఇట్లు పంచమాధ్యాయము తృతీయబ్రాహ్మణము సమాప్తము.

చతుర్థబ్రాహ్మణము ప్రారంభము.

ఉ॥ అథ హైనముషస్తశ్చాక్రాయణః పప్రచ్ఛ యాజ్ఞవల్క్యేతి హోవాచ యత్సాక్షాదపరోక్షాద్బ్రహ్మ య ఆత్మా సర్వాన్తరస్తం మే వ్యాచక్ష్వేత్యేష త ఆత్మా సర్వాన్తరః కతమో యాజ్ఞవల్క్య సర్వాన్తరో యః ప్రాణేన ప్రాణితి స త ఆత్మా సర్వాన్తరో యోఽపానేనాపానీతి స త ఆత్మా సర్వాన్తరో యో వ్యానేన వ్యానితి స త ఆత్మా సర్వాన్తరో య ఉదానేనోదానితి స త ఆత్మా సర్వాన్తర ఏష త ఆత్మా సర్వాన్తరః.1

ప॥ అథ - హ - ఏనం - ఉషస్తః - చాక్రాయణః - పప్రచ్ఛ - యాజ్ఞవల్క్య - ఇతి - హోవాచ - యత్ - సాక్షాత్ - అపరోక్షాత్ - బ్రహ్మ - యః - ఆత్మా - సర్వాన్తరః - తం - మే - వ్యాచక్ష్వ - ఇతి - ఏషః - తే - ఆత్మా - సర్వాన్తరః - కతమః - యాజ్ఞవల్క్య - సర్వాన్తరః - యః - ప్రాణేన - ప్రాణితి - సః - తే - ఆత్మా - సర్వాన్తరః - యః - అపానేన - అపానితి - సః - తే - ఆత్మా - సర్వాన్తరః - యః - వ్యానేన - వ్యా

నితి - సః - తే - ఆత్మా - సర్వాన్తరః - యః - ఉదానేన - ఉదానితి - సః - తే - ఆత్మా - సర్వాన్తరః - ఏషః - తే - ఆత్మా - సర్వాన్తరః

ప్ర॥ అథహ = అనన్తరము, చాక్రాయణః = చక్రునియొక్క పుత్రుండగు, ఉషస్తః = ఉషస్తుండనువాడు, ఏనం = ఈ యాజ్ఞవల్క్యుని, పప్రచ్ఛ = అడిగెను. యాజ్ఞవల్క్యేతి = ఓ యాజ్ఞవల్క్యుండా! యని, హోవాచ = పలికెను. సాక్షాత్ = సమీపమైనదియును, (ద్రష్టయగువానికి సమీపమైనదియును), అపరోక్షాత్ = ప్రత్యక్షమైనదియునగు, (గౌణముకానిదియును), బ్రహ్మ = పరబ్రహ్మము, యత్ = ఏదియో, సర్వాన్తరః = సమస్తమునకు అంతరమునందుండునదియగు, ఆత్మా = ఆత్మస్వరూపము, యః = ఏదియో, తం = అటువంటి ఆత్మస్వరూపమును, మే = నాకొఱకు, వ్యాచక్ష్వేతి = స్పష్టముగా చెప్పుమాయని, (కొమ్ములను బట్టుకొని గోవును చూపించినట్టు వాండేవీండని విస్పష్టముగా చూపించుమాయని ఉషస్తుండు ప్రశ్నముచేసెను). తే = నీయొక్క, (దేహేంద్రియ సంఘాతమగు నీయొక్క), ఏషః = ఈ, ఆత్మా = ఆత్మ, సర్వాన్తరః = సమస్తమునకు లోపలనుండునది. (అని యాజ్ఞవల్క్యుండు చెప్పెను). హేయాజ్ఞవల్క్య = ఓ యాజ్ఞవల్క్యుండా! సర్వాన్తరః = సమస్తమునకు లోపలనున్న, (మే = నాయొక్క, ఆత్మా = ఆత్మ). కతమః = ఏది. (అని ఉషస్తుండు మరల అడిగెను). యః = ఏది, ప్రాణేన = ప్రాణ వాయువుచేతను, ప్రాణితి = ప్రాణ వ్యాపారమును చేయుచున్నదో, సః = అది, తే = దేహేంద్రియ సంఘాతమగు నీయొక్క, సర్వాన్తరః = సమస్తమునకు లోపలనుండెడి, ఆత్మా = విజ్ఞానమయమగు ఆత్మస్వరూపము. యః = ఏది, అపానేన = అపాన వాయువుచేతను, అపానితి = అపాన వ్యాపారమును చేయుచున్నదో, సః = అది, తే = దేహేంద్రియ సంఘా

తమగు నీయొక్క, సర్వాన్తరః = సమస్తమునకు లోపలనుండెడి, ఆత్మా = విజ్ఞానమయమగు ఆత్మస్వరూపము. యః = ఏది, వ్యానేన = వ్యాన వాయువుచేతను. వ్యానితి = వ్యాన వ్యాపారమును చేయుచున్నదో, సః = అది, తే = దేహేంద్రియ సముదాయమగు నీయొక్క, సర్వాన్తరః = సమస్తమునకు లోపలనుండెడి, ఆత్మా = విజ్ఞానమయమగు ఆత్మస్వరూపము. యః = ఏది, ఉదానేన = ఉదాన వాయువుచేతను, ఉదానితి = ఉదాన వ్యాపారమును చేయుచున్నదో, సః = అది, తే = దేహేంద్రియ సముదాయమగు నీయొక్క, సర్వాన్తరః = సమస్తమునకు లోపల నుండెడి, ఆత్మా = విజ్ఞానమయమగు ఆత్మస్వరూపము. ఏషః = ఇది, సర్వాన్తరః = సమస్తమునకు లోపలనుండెడి, తే = దేహేంద్రియసంఘాతమగు నీయొక్క, ఆత్మా = విజ్ఞానమయమగు ఆత్మ.

తా॥ ఇంతకుపూర్వము చెప్పినగ్రహాతిగ్రహాలక్షణమగుమృత్యువుచే మ్రింగఁబడి సంసారమును పొందినవాఁడు, ఉన్నాఁడా ? లేడా? ఉన్నయెడల ఏమిచిహ్నము గలవాఁడు అని ఈ ప్రకారముగా ఆత్మస్వరూపమును వివేకముతోఁ దెలిసికొనుటకు ఉషస్త ప్రశ్నము ఆరంభింపఁ బడుచున్నది. లాహ్యాయనుఁడగు భుజ్యువు ప్రశ్నమును చాలించిన తరువాత చాక్రాయణుఁడగు ఉషస్తుఁడు ఈ యాజ్ఞవల్క్యుని అడిగెను. ఓ యాజ్ఞవల్క్యుఁడా! యని పిలిచి మిక్కిలి సమీపమైనదియును ప్రత్యక్షమైనదియునగు పర బ్రహ్మమును, సమస్తమునకు లోపలనుండెడి ప్రత్యగాత్మయును ఇట్లు పరబ్రహ్మ ప్రత్యగాత్మ శబ్దములతో ప్రసిద్ధమగు పరమాత్మ స్వరూపమేదియో దానిని గోవు యొక్క కొమ్మును పట్టుకొని గోవును చూపించినట్లు ఆపరబ్రహ్మమే ఈ ప్రత్యగాత్మ స్వరూపమని విస్పష్టముగా చెప్పుమాయని ప్రశ్నము చేసెను. ఇట్లు ప్రశ్నము చేయఁబడి యాజ్ఞవల్క్యుఁడు, ఓ ఉషస్తుఁడా! నీయొక్క ఆత్మ, సమీపమును ప్రత్యక్షమును బ్రహ్మమును

సర్వాన్తరమును ప్రత్యగాత్మయును అను ఇట్టి విశేషణములతోఁ గూడుకొన్న ఇదియే అని పలికెను, ఇది అనఁగా ఏ ఆత్మ చేతను నీ దేహేంద్రియ సంఘాతము ఆత్మకలది యగుచున్నదో అదియే నీ దేహేంద్రియ సంఘాతమునకు ఆత్మ యని పలికెను. ఇట్లు యాజ్ఞవల్క్యునిచే పలుకఁబడిన ఆ ఉషస్తుఁడు, ఆత్మస్వరూపము ఈ దేహమా, లేక దేహము లోపలనుండెడి యింద్రియసంఘాతమగు లింగాత్మా; లేక మూడవదియగు యింకొకటియా; యని సందేహము కలవాఁడై ఈ మాటలో సర్వాన్తరమగు నా యొక్క ఆత్మగా నీచేత చెప్పఁబడినది యేదియని పలికెను. ఇట్లు ఉషస్తునిచేత పలుకఁబడిన ఆ యాజ్ఞవల్క్యుఁడు, ఓ ఉషస్తుఁడా! దేనిచేత నీముఖము నాసికా సంచారముగల ప్రాణవాయువు ప్రాణవ్యాపారమును పొందింపఁబడుచున్నదో అదియే నీ దేహేంద్రియాది సంఘాతమునకు విజ్ఞానమయమగు ఆత్మస్వరూపము. ఈ ప్రకారమే దేనిచేతను నీయొక్క అపాన వ్యానోదానములును వాని వాని వ్యాపారములను పొందింపఁబడుచున్నవో అదియే నీ దేహేంద్రియ సంఘాతమునకు విజ్ఞానమయమగు ఆత్మ స్వరూపము. దేహేంద్రియాది విలక్షణమైన అట్టి విజ్ఞానమయాత్మచే దేహేంద్రియ సంఘాతము, అధిష్ఠింపఁబడినదై దారుయంత్రమువలెనే (ప్రాణములుగల మనుష్యాదులతోఁ గూడుకొని నిర్జీవములగు రథములు చలనాది వ్యాపారమును పొందినట్లు), ప్రాణనాది వ్యాపారమును పొందుచున్నది. కనుక ఈ దేహేంద్రియాది సముదాయమునకంటె వేరగు విజ్ఞానమయమగు ఆత్మ యున్నది. ఇదియే సర్వాన్తరమగు నీయొక్క ఆత్మయని యాజ్ఞవల్క్యుఁడు చెప్పెను.

ఉ॥ స హోవాచోషస్తశ్చాక్రాయణో యథా విబ్రూయాదసౌ గౌరసావశ్వ ఇత్యేవమేవైతద్వ్యపదిష్టం భవతి యదేవ సాక్షాదపరోక్షాద్బ్రహ్మ య ఆత్మా సర్వాన్తరస్తం మే వ్యాచక్ష్వేత్యేష త ఆత్మా సర్వాన్తరః కతమో యాజ్ఞవల్క్య సర్వాన్తరః

న దృష్టేః ద్రష్టారం పశ్యేర్న శ్రుతేః శ్రోతారగ్ శృణుయాన్న మతేర్మన్తారం మన్వీథా న విజ్ఞాతేర్విజ్ఞాతారం విజానీయాః । ఏష త ఆత్మా సర్వాన్తరో ఽతో ఽన్యదార్తం తతో హోషస్తశ్చాక్రాయణ ఉపరరామ. ॥2॥

ఇతి పఞ్చమాధ్యాయే చతుర్థంబ్రాహ్మణమ్.

ప॥ సః – హోవాచ – ఉషస్తః – చాక్రాయణః – యథా – విబ్రూయాత్ – అసౌ – గౌః – అసౌ – అశ్వః – ఇతి – ఏవం – ఏవ – ఏతత్ – వ్యపదిష్టం – భవతి – యత్ – ఏవ – సాక్షాత్ – అపరోక్షాత్ – బ్రహ్మ – యః – ఆత్మా – సర్వాన్తరః – తం – మే – వ్యాచక్ష్వ – ఇతి – ఏషః – తే – ఆత్మా – సర్వాన్తరః – కతమః–యాజ్ఞవల్క్య–సర్వాన్తరః – న – దృష్టేః – ద్రష్టారం – పశ్యేః– న – శ్రుతేః – శ్రోతారం – శృణుయాః – న – మతేః – మన్తారం – మన్వీథాః – న – విజ్ఞాతేః – విజ్ఞాతారం – విజానీయాః – ఏషః – తే – ఆత్మా – సర్వాన్తరః – అతః – అన్యత్ – ఆర్తం – తతః – హ – ఉషస్తః – చాక్రాయణః – ఉపరరామ.

ప్ర॥ చాక్రాయణః = చాక్రాయణుఁడగు, సః=ఆ, ఉషః = ఉషస్తుఁడు, హోవాచ = పలికెను. అసౌ = ఇది, గౌః = గోవు. అసౌ = ఇది, అశ్వః = గుఱ్ఱము, ఇతి = అని, (ప్రత్యక్షముగా చూపించెదనని ముందు ప్రతిజ్ఞ చేసి, అనంతరము గోవు చలించునది, గుఱ్ఱము పరిగెత్తునది యని), యథా = ఏ ప్రకారము, విబ్రూయాత్ = విరుద్ధముగా పలుకునో. ఏవమేవ = ఈ ప్రకారముగానే, ఏతత్ = ఈ ఆత్మస్వరూపము, (త్వయా = నీ చేతను), వ్యపదిష్టం = మిష చేత నిర్దేశింపఁబడినది, భవతి = అగుచున్నది. (అట్టి మిషను వదిలిపెట్టి), సాక్షాత్ = మిక్కిలి సమీపమైనదియును, అపరోక్షాత్ = ప్రత్యక్షమైనదియునగు, బ్రహ్మ = పరబ్రహ్మము, యత్ = ఏదియో, సర్వాన్తరః = సమస్తమునకు లోపలనుండునట్టి, ఆత్మా

= ప్రత్యగాత్మ, యః = ఏదియో, తం = అట్టి ఆత్మస్వరూపమును, మే = నాకొఱకు. వ్యాచక్ష్వ = విస్పష్టముగా చెప్పుమా, ఇతి = అని, (ఉషస్తుడు ప్రశ్నముచేసెను). తే = నీయొక్క; ఏషః = ఈ, ఆత్మా = ఆత్మ, సర్వాన్తరః = సమస్తమునకు లోపలనుండున ది. (అని యాజ్ఞవల్క్యుడు చెప్పెను). హే యాజ్ఞవల్క్య=ఓ యాజ్ఞవల్క్యుడా! (మే=నాయొక్క), సర్వాన్తరః= సమస్తమునకు లోపల నున్న,(ఆత్మా=ఆత్మ),కతమః=ఏది. (అని ఉషస్తుడు మరలఅడిగెను), దృష్టేః = చూపుయొక్క, ద్రష్టారం = చూచెడువానిని, (చూపు నకు కర్తయైన వానిని అంతటను ఇట్లు చూచుకొనవలయును), నపశ్యేః = చూడలేవు. శ్రుతేః = శ్రవణముయొక్క, శ్రోతారం = వినెడివానిని. శ్రుణుయాః = వినలేవు. మతేః = మనోవృత్తియొక్క మన్తారం = మననముచేసెడివానిని, నమన్వీథాః = తలంపలేవు. విజ్ఞాతేః = బుద్ధివృత్తియొక్క, విజ్ఞాతారం = తెలిసికొనెడి వానిని, నవిజానీయాః = తెలిసికొనలేవు. తే = నీయొక్క, సర్వాన్తరః = సమస్తమునకు లోపలనుండునట్టి, ఆత్మా = విజ్ఞానమయమగు ఆత్మ, ఏషః = ఇది, అతః = ఈ ఆత్మకంటె, అన్యత్ = ఇతరమైనది, ఆర్తం = నశించునట్టి దేహేంద్రియసంఘాతము. (కార్యమగు దేహము, కరణాత్మకమగు లిఙ్గము), తతోహ = అందువలన, (అట్లు ప్రశ్నమునకు నిర్ణయించి చెప్పుటవలన), చాక్రాయణః = చాక్రాయణుడగు, ఉషస్తిః=ఉషస్తుడు, ఉపరరామ =ఊరకుండెను.

తా॥ ఉషస్తుడు ఓ యాజ్ఞవల్క్యుడా! లోకమునందొకానొక జనుడు ముందు ఇది గోవు, ఇది గుఱ్ఱము అని ప్రత్యక్షముగా చూపించుచున్నానని ప్రతిజ్ఞచేసి మరల గోవు చలించునది, గుఱ్ఱము పరిగెత్తునది యని ఎట్లు విరుద్ధముగా పలుకునో అదేప్రకారము నీవు బ్రహ్మ ప్రత్యగాత్మ శబ్దములచే ప్రసిద్ధమగు ఈ ఆత్మను కొమ్ములను పట్టుకొని గోవును చూపించినట్లు ఆ బ్రహ్మచే ఈ ప్రత్యగాత్మయని

ప్రత్యక్షముగా చూపించుచున్నానని ప్రతిజ్ఞ చేసి చేతనాధిష్ఠితమైన రథచలనాది దృష్టాంత వ్యాజముతో చూపించితివి. అట్టి వ్యాజమును వదలి నీవు ఇదివఱకు చెప్పిన మిక్కిలి సమీపమైనదియును ప్రత్యక్షమైనదియునగు పరబ్రహ్మమును సర్వాన్తరమగు ప్రత్యగాత్మయునై యున్న నా యొక్క ఆత్మస్వరూపము ఏదియో దానిని ప్రత్యక్షముగా చూపించుమాయని ప్రశ్నము చేయఁగా యాజ్ఞవల్క్యుఁడు చెప్పుచున్నాడు. యాజ్ఞవల్క్యుడు ఓ ఉషస్తుఁడా! ఇంతకు పూర్వము ప్రతిజ్ఞ చేసి చెప్పిన ఆత్మను ఘటపటాదికమునువలెనే విషయముగాఁ జేసికొనమనఁగా, ఉషస్తుఁడు. ఆ ఆత్మ ఘటాదికమువలెనే విషయము గాఁ జేసికొనుటకు అశక్యమగుట వలన విషయముగాఁ జేసికొనఁబడదనెను. యాజ్ఞవల్క్యుఁడు, ఎందు వలన అశక్యమైనదియనఁగా ఉషస్తుఁడు ఆ ఆత్మవస్తువుయొక్క స్వాభావ్యమువలన గోచరము చేసికొనుటకు శక్యముకాదు. యాజ్ఞవల్క్యుఁడు, ఆ ఆత్మవస్తు స్వాభావ్య మేమనఁగా, ఉషస్తుఁడు, ఆ ఆత్మవస్తువునకు దృష్టి మొదలైనదానియొక్క కర్తృత్వమే స్వాభావ్యమనెను. యాజ్ఞవల్క్యుఁడు, దృష్ట్యాదికర్తృత్వము ఆత్మవస్తు స్వాభావ్యము గనుక దృష్టికిఁద్రష్టయే ఆత్మయై యున్నది. అటువంటి దృష్టికి కర్తయైన ద్రష్టయగు ఆత్మను నీవు చూడలేవు. ఈ ప్రకారముగానే శ్రవణమునకును కర్తయైన శ్రోతయగు ఆత్మను వినలేవు. మనోవృత్తికి కర్తయైన మన్తయగు ఆత్మను తలంపలేవు. బుద్ధి వృత్తికి కర్తయైన విజ్ఞాతయగు ఆత్మను తెలిసికొనలేవు. ఇట్లు చూచుటకును వినుటకును తలంచుటకును తెలిసికొనుటకును శక్యముగానటువంటిదియును అవినాశియును కూటస్థమునగు ఇదియె, నీయొక్క సర్వాన్తరమగు ప్రత్యగాత్మ స్వరూపమైన ఆత్మ. ఇట్టి ఆత్మస్వరూపముకంటె వేఱైనది నశించునదియగు దేహమును ఇంద్రియాత్మకమగు లింగశరీరమును అని ఆ యాజ్ఞవల్క్యుఁడు చెప్పెను. ఇట్లు ప్రశ్నములను నిర్ణయించి

చెప్పుటవలన చాక్రాయణుఁడగు ఉషస్తుఁడు వేఱొక ప్రశ్నముచేయక ఊరకుండెను.

ఇట్లు పఞ్చమాధ్యాయము చతుర్థబ్రాహ్మణము సమాప్తము.

---

పఞ్చమాధ్యాయము, పఞ్చమ బ్రాహ్మణము.

ఉ॥ అథ హైనం కహోళః కౌషీతకేయః పప్రచ్ఛ యాజ్ఞవల్క్యేతి హోవాచ యదేవ సాక్షాదపరోక్షాద్బ్రహ్మ య ఆత్మా సర్వాన్తర సం మే వ్యాచక్ష్వేత్యేష త ఆత్మా సర్వాన్తరః। కతమో యాజ్ఞవల్క్య సర్వాన్తరో యోఽశనాయాపిపాసే శోకం మోహం జరాం మృత్యుమత్యేతి। ఏతం వై తమాత్మానం విదిత్వా బ్రాహ్మణాః పుత్రైషణాయాశ్చ విత్తైషణాయాశ్చ లోకైషణాయాశ్చ వ్యుత్థాయ। అథభిక్షాచర్యంచరన్తి యా హ్యేవ పుత్రైషణా సా విత్తైషణా యావిత్తైషణా సాలోకైషణోభేహ్యేతే ఏషణే ఏవ భవతః। తస్మాద్బ్రాహ్మణః పాణ్డిత్యం నిర్విద్య బాల్యేన తిష్ఠాసేత్ బాల్యం చపాణ్డిత్యం చ నిర్విద్యాథమునిరమౌనం చ మౌనం చ నిర్విద్యాఽథ బ్రాహ్మణః స బ్రాహ్మణః కేన స్యాద్యేన స్యాత్తేనేదృశ ఏవాతోఽన్యదార్తం తతో హ కహోళః కౌషీతకేయ ఉపరరామ. ॥1॥

ఇతి పఞ్చమాధ్యాయే - పఞ్చమంబ్రాహ్మణమ్,

ప॥ అథ - హ - ఏనం - కహోళః - కౌషీతకేయః - పప్రచ్ఛ - యాజ్ఞవల్క్య - ఇతి - హోవాచ - యత్ - ఏవ - సాక్షాత్ - అపరోక్షాత్ - బ్రహ్మ - యః - ఆత్మా - సర్వాన్తరః - కతమః - యాజ్ఞవల్క్య - సర్వాన్తరః - యః - అశనాయాపిపాసే - శోకం - మోహం - జరాం - మృత్యుం - అత్యేతి - ఏతం - వై - తం - ఆత్మానం - విదిత్వా - బ్రాహ్మణాః - పుత్రైషణాయాః - చ - విత్తైషణాయాః - చ - లోకైషణాయాః - చ - వ్యుత్థాయ -

అథ – భిక్షాచర్యం – చరన్తి – యా – హి – ఏవ – పుత్రైషణా – సా – విత్తైషణా – యా – విత్తైషణా – సా – లోకైషణా – ఉభే – హి – ఏతే – ఏషణే – ఏవ – భవతః – తస్మాత్ – బ్రాహ్మణః – పాణ్డిత్యం – నిర్విద్య – బాల్యేన – తిష్ఠాసేత్ – బాల్యం – చ – పాణ్డిత్యం – నిర్విద్య – అథ – మునిః – అమౌనం – చ – నిర్విద్య – అథ – బ్రాహ్మణః – సః – బ్రాహ్మణః – కేన – స్యాత్ – యేన – స్యాత్ – తేన – ఈదృశః – ఏవ – అతః – అన్యత్ – ఆర్తం – తతః – హ – కహోళః – కౌషీతకేయః – ఉపరరామ.

ప్ర॥ అథహ = అనంతరము, కౌషీతకేయః = కుషీతకుని యొక్క పుత్రుఁడగు, కహోళః = కహోళుఁడనువాఁడు, ఏనం = ఈ యాజ్ఞవల్క్యుని, ప్రపచ్ఛ = అడిగెను. హే యాజ్ఞవల్క్యేతి = ఓ యాజ్ఞవల్క్యుఁడా! యని పిలిచి, (త్వం = నీవు), సాక్షాత్ = సమీపమైనదియును, అపరోక్షాత్ = ప్రత్యక్షమైనదియునగు, బ్రహ్మ = పరబ్రహ్మము, యత్ = ఏదియో, సర్వాన్తరః = సమస్తమునకు లోపలనుండెడి, ఆత్మా = ప్రత్యగాత్మ, యః = ఏదియో, తం = ఆ ఆత్మస్వరూపమును, మే = నాకొఱకు, వ్యాచక్ష్వేతి = విస్పష్టముగాఁ జెప్పుమా యని, హోవాచ = పలికెను. తే = నీ యొక్క, ఏషఆత్మా = ఈ ఆత్మ, సర్వాన్తరః = సమస్తమునకు లోపలనుండునది. (అని యాజ్ఞవల్క్యుఁడు పలికెను). హేయాజ్ఞవల్క్య = ఓ యాజ్ఞవల్క్యుఁడా! సర్వాన్తరః = సమస్తమునకు లోపలనుండెడి, (మే = నాయొక్క, ఆత్మా = ఆత్మ), కతమః = ఏది. (కహోళుఁడు ప్రశ్నము చేసెను), యః = ఏది. అశనాయాపిపాసే = భోజనేచ్ఛ పానేచ్ఛలను, శోకం = దుఃఖమును, మోహం = మోహమును, జరాం = వృద్ధత్వమును, మృత్యుం = మరణమును, అత్యేతి = అతిక్రమించి యున్నదో, తం=ఆ ప్రసిద్ధమగు, ఏతం వై = ఈ, ఆత్మానం = ఆత్మస్వరూపమును, విదిత్వా = తెలిసికొని,

బ్రాహ్మణాః = బ్రాహ్మణులు. పుత్రైషణాయాశ్చ = పుత్రులకొఱ కైన కోరికవల్లనుండి, (పుత్రునిచేత ఈ లోకమును జయింపఁదగినది యని లోకజయ సాధనమైన పుత్రునిగూర్చిన కోరిక = అనఁగా వివాహము చేసికొనుటవలన), విత్తైషణాయాశ్చ = (కర్మసాధనమగు గోవులు మొదలైన) ధనమువల్లనుండి, (ఈ గవాది ధనముచేతను కర్మచేసి పితృలోకమును జయింపవలెననెడి కోరికనుండి), లోకైష ణాయాశ్చ = లోకముయొక్క కోరికవల్లనుండి, (దైవవిత్తమగు హిరణ్యగర్భ విద్యచేత దేవలోకమును జయింపవలెననెడి కోరికవల్ల నుండి), వ్యుత్థాయ = మళ్లి, అనాత్మలోక ప్రాప్తిసాధనములైన మూఁడగు భార్యావిత్త విద్యల సాధనములయందు ఆశను చేయక సన్న్యసించి), అథ = అనంతరము, భిక్షాచర్యం = భిక్షకొఱకైన సంచారమును, చరన్తి = చేయుచున్నారు. (సమస్తకర్మలను కర్మ సాధనములను విడిచి పరమహంస రూపమైన సన్న్యాసమును పొంది భిక్షాచరణమును చేయుచున్నారు). పుత్రైషణా=పుత్రులకొఱకైన కోరిక, యాహ్యేవ = ఏదియో, సా = అది, విత్తైషణా = గోవు మొదలైన ధనముయొక్క కోరిక ; విత్తైషణా = గవాది ధనముయొ క్క కోరిక, యా = ఏదియో, సా = అది, లోకైషణా = లోకము యొక్క కోరిక ; (గనుక కోరిక ఒకటె). ఏతే = ఈ, ఏషణే = కోరికలు, ఉభేహ్యేవ = రెండే. భవతః = అగుచున్నవి. (ఆ ఒకటి యైన కోరిక సాధ్య సాధనములయొక్క భేదముచేతను రెండగుచు న్నవి). (ఏ కారణమువలన బ్రాహ్మణులు అసాధన ఫల స్వభావమైన ఈ ఆత్మజ్ఞానమును తెలిసికొని (నిర్దృష్టాదృష్టార్థమగు కర్మను, ఆ కర్మ సాధనమును విడిచి సన్న్యసించి భిక్షాచరణమును చేయుచున్నారో), తస్మాత్ =ఆ కారణము వలన, బ్రాహ్మణః = బ్రాహ్మణుఁడు, (బ్రహ్మ వేత్త), పాణ్డిత్యం = పండిత భావమును, (ఈ ఆత్మవిజ్ఞానమును), నిర్విద్య = నిశ్శేషముగాఁ దెలిసికొని, (ఆచార్యునివలన ఆగమము

వలన బాగుగాఁ దెలిసికొని), బాల్యేన = బలభావముతోఁ, (అసాధన స్వరూపమగు ఆత్మవిజ్ఞానమే బలము; బలమనఁగా బ్రహ్మవిద్యవలన సమస్తమైన విషయములయొక్క దృష్టిని తిరస్కరించుట. అట్టి బలము యొక్క భావమే బాల్యమనఁబడును). తిష్ఠాసేత్ = ఉండుటకు కోరుము. బాల్యంచ = ఆత్మవిజ్ఞానబలభావమును, పాండిత్యంచ = పండిత భావమును, నిర్విద్య = నిశ్శేషముగాఁ దెలిసికొని, అథ = అనంతరము, మునిః = యోగి, (భవతి = అగుచున్నాఁడు). సమస్తమైన అనాత్మజ్ఞానమును తిరస్కరించి కృతకృత్యుఁడగుచున్నాఁడు). అమౌనంచ = అమౌనమునున్ను, (ఆత్మజ్ఞానమునున్ను, అనాత్మజ్ఞానమును తిరస్కరించుటయున్ను, ఇవి రెండు పాండిత్యబాల్యములు; ఈ రెంటిని శేషము లేకుండా చేయుటయే అమౌన మనఁబడును). మౌనంచ = మౌనమునున్ను, (అనాత్మ జ్ఞానమును తిరస్కరించుట యొక్క అంతమునందైన ఫలము మౌన మనఁబడును). నిర్విద్య = నిశ్శేషముగాఁ దెలిసికొని, అథ = అనంతరము, బ్రాహ్మణః = బ్రాహ్మణుఁడు, (భవతి = అగుచున్నాఁడు). (సమస్తము బ్రహ్మస్వరూపమే యనెడి జ్ఞానము పుట్టుచున్నది). సః బ్రాహ్మణః = అట్టి బ్రాహ్మణుఁడు, కేన = దేనిచేతను, స్యాత్ = అగును? యేన = ఈపూర్వోక్తమైన ఏ ఆచరణచేతను, స్యాత్ = అగునో, తేన = దానిచేతను, ఈదృశఏవ = ఈ పూర్వోక్తమైన బ్రాహ్మణుఁడే, (భవతి=అగుచున్నాఁడు). అతః = దీనికంటె, (అశనాయాద్యతీతమును నిత్యతృప్తమును బ్రాహ్మణ్యావస్థానమునగు ఈ ఆత్మస్వరూపమునకంటె), అన్యత్ = ఇతరమైనది, (అవిద్యా విషయమైన పూర్వము చెప్పిన పుత్రేషణాది లక్షణమైన అన్యవస్తువు), ఆర్తం = నశించునది. తతోహ = అందువలన (యాజ్ఞవల్క్యుఁడు ఇట్లు ప్రశ్నమును నిర్ణయించి చెప్పుటవలన), కౌషీతకేయః = కుషీతకుని పుత్రుఁడగు, కహోళః = కహోళుఁడనువాఁడు, ఉపరరామ = ఊరకయుండెను,

తా॥ ఇప్పుడు బంధ మోక్ష సాధనమైన సన్యాససహితమగు ఆత్మజ్ఞానము చెప్పఁదగినదని కహోళ ప్రశ్న మారంభింపఁబడుచున్నది. పూర్వమునందు ప్రశ్నముచేసిన ఉషస్తుఁడును ఈ కహోళుఁడును వీరిద్దఱును చేరి చేసిన ప్రశ్నములలో నొకటిని ఉషస్తుఁడు చేయఁగా, పూర్వప్రశ్నమునందు గ్రహాతిగ్రహలక్షణమైన మృత్యురూపమగు దేహేంద్రియాది బంధముకంటె వేరగు ఆత్మస్వరూపమున్నదని చూపింపఁబడినది. రెండవదియగు ఈ కహోళ ప్రశ్నమందు పూర్వము చెప్పినదానికంటె వేరు విశేషముగా ఆ ఆత్మస్వరూపమునకే క్షుత్పిపాసాది సంసార ధర్మమునకంటె అతీతమైయుండుట చెప్పఁబడుచున్నది. కహోళుఁడనువాఁడు యాజ్ఞవల్క్యుని, ఓ యాజ్ఞవల్క్యుఁడా! యని పిలిచి సన్నిహితమై ప్రత్యక్షముగా నుండెడి పరబ్రహ్మస్వరూపమును సర్వాంతరమగు ప్రత్యగాత్మ స్వరూపమునగు ఆ ఆత్మస్వరూపమును నాకొఱకు విస్పష్టముగాఁ జెప్పుమా యని ప్రశ్నముచేయఁగా, ఓ కహోళుఁడా! నీయొక్క ఈ ఆత్మస్వరూపము సర్వాంతరమైనదియని యాజ్ఞవల్క్యుఁడు చెప్పెను. ఓ యాజ్ఞవల్క్యుఁడా! సర్వాంతరమగు నా ఆత్మస్వరూపము ఏదియని మరల కహోళుఁడు ప్రశ్నముచేసెను. ఓ కహోళుఁడా! ప్రాణ మన శ్శరీరములే అధికరణములుగాఁగల క్షుత్పిపాసలును శోకమోహములును జరామరణములును ప్రాణులయందు అహోరాత్రములు వలెనే సముద్రతరంగములువలెనే యున్నవై సంసారమని చెప్పఁబడుచున్నవి. బ్రహ్మాది స్తంబపర్యంతముండెడి జీవులయొక్క ఈ పూర్వోక్తమగు సంసారధర్మములైన క్షుత్పిపాసాదులచేతను సమీపమును ప్రత్యక్షమును సర్వాన్తరమునగు ఆత్మస్వరూపము మేఘము మొదలైన వానియొక్క మాలిన్యములచేత ఆకాశమువలెనే స్పృశింపఁబడక యుండుచున్నది. అటువంటి ఈ ఆత్మస్వరూపమును తెలిసికొని బ్రాహ్మణులు దారేషణ ధనేషణ లోకేషణలనుండి విరక్తులై సన్న్యసించి దేహాధార

ణార్థమై భిక్షాచరణమును మాత్రము చేయుచున్నారు. ఇట్లు బ్రాహ్మణులు అసాధనఫలస్వభావమైన ఆత్మజ్ఞానమును తెలిసికొని దృష్టాదృష్టార్థమగు కర్మను కర్మసాధనమును విడిచి సన్యసించి భిక్షాచరణమును చేయుటవలన బ్రహ్మవేత్త ఆత్మవిజ్ఞానమును ఆచార్యాగమములవలన నిశ్శేషముగాఁ దెలిసికొని బ్రహ్మవిద్యవలన సమస్తమైన విషయములయొక్క దృష్టిని తిరస్కరించుటయనెడి బలముయొక్క భావముతో నుండుటకు కోరవలయును. ఇట్లు ఆత్మవిజ్ఞానమును, అనాత్మజ్ఞానములగు విషయములయొక్క దృష్టిని, తిరస్కరించుటను నిశ్శేషముగాఁ దెలిసికొని సమస్తమైన అనాత్మజ్ఞానమును తిరస్కరించి కృతకృత్యుఁడగు ముని యగుచున్నాఁడు. ఆత్మజ్ఞానమును అనాత్మజ్ఞానతిరస్కారమును నిశ్శేషముగాఁ జేయుటకు స్వరూపముగాఁగల అమౌనమును, మునిభావమగు మౌనమును, నిశ్శేషముగాఁ దెలిసికొని సమస్తము బ్రహ్మస్వరూపమే యనెడి జ్ఞానముగల బ్రాహ్మణుఁ డగుచున్నాఁడు. అట్టి బ్రాహ్మణుఁడు ఈపూర్వము చెప్పిన ఆచరణముచేతనే యగుచున్నాఁడని చెప్పి క్షుత్పిపాసాద్యతీతమును నిత్యతృప్తమును బ్రాహ్మణ్యావస్థానమునగు ఈ ఆత్మస్వరూపముకంటె అన్యమగు అవిద్యావిషయమును పూర్వము చెప్పిన పుత్రైషణాది లక్షణమునగు వస్తువు స్వప్న మాయా మరీచ్యుదకములకు సమానమై నశించుచున్నది యని యాజ్ఞవల్క్యుఁడు చెప్పెను. ఇట్లు యాజ్ఞవల్క్యుఁడు తానుచేసిన ప్రశ్నమును నిర్ణయించి చెప్పుటవలన కౌషీతకపుత్రుఁడగు కహోళుఁడు వేఱొక ప్రశ్నమును చేయనివాఁడై యూరక యుండెను.

ఇట్లు పఞ్చమాధ్యాయమునందు
పఞ్చమ బ్రాహ్మణము సమాప్తము.

పఞ్చమాధ్యాయము - షష్ఠబ్రాహ్మణము

ఉ॥ అథ హైనం గార్గీ వాచక్నవీ పప్రచ్ఛ యాజ్ఞవల్క్యేతి హోవాచ యదిదగ్ం సర్వమప్స్వోతం చ ప్రోతం చ కస్మిన్ను ఖల్వాప ఓతాశ్చ ప్రోతాశ్చేతి । వాయౌ గార్గీతి కస్మిన్ను ఖలు వాయురోతశ్చ ప్రోతశ్చేత్యన్తరిక్షలోకేషు గార్గీతి కస్మిన్ను ఖల్వన్తరిక్షలోకా ఓతాశ్చ ప్రోతాశ్చేతి గన్ధర్వలోకేషు గార్గీతి కస్మిన్ను ఖలు గన్ధర్వలోకా ఓతాశ్చ ప్రోతాశ్చేత్యాదిత్యలోకేషు గార్గీతి కస్మిన్ను ఖల్వాదిత్యలోకా ఓతాశ్చ ప్రోతాశ్చేతి చన్ద్రలోకేషు గార్గీతి కస్మిన్ను ఖలు చన్ద్రలోకా ఓతాశ్చ ప్రోతాశ్చేతి నక్షత్రలోకేషు గార్గీతి కస్మిన్ను ఖలు నక్షత్రలోకా ఓతాశ్చ ప్రోతాశ్చేతి దేవలోకేషు గార్గీతి కస్మిన్ను ఖలు దేవలోకా ఓతాశ్చ ప్రోతాశ్చేతీన్ద్రలోకేషు గార్గీతి కస్మిన్ను ఖల్విన్ద్రలోకా ఓతాశ్చ ప్రోతాశ్చేతి ప్రజాపతిలోకేషు గార్గీతి కస్మిన్ను ఖలు ప్రజాపతిలోకా ఓతాశ్చ ప్రోతాశ్చేతి బ్రహ్మలోకేషు గార్గీతి కస్మిన్ను ఖలు బ్రహ్మలోకా ఓతాశ్చ ప్రోతాశ్చేతి స హోవాచ గార్గి మాతిప్రాక్షీర్మా తే మూర్ధా వ్యపప్తదనతిప్రశ్న్యాం వై దేవతామతిపృచ్ఛసి గార్గి మాతిప్రాక్షీరితి తతో హ గార్గీ వాచక్నవ్యుపరరామ. ॥1॥

ఇతి పఞ్చమాధ్యాయే షష్ఠబ్రాహ్మణమ్.

ప॥ అథ - హ - ఏనం - గార్గీ - వాచక్నవీ - పప్రచ్ఛ - యాజ్ఞవల్క్య - ఇతి - హోవాచ - యత్ - ఇదం సర్వం - అప్సు - ఓతం - చ - ప్రోతం - చ - కస్మిన్ - ను - ఖలు - ఆపః - ఓతాః - చ - ప్రోతాః - చ - ఇతి - వాయౌ - గార్గి - ఇతి - కస్మిన్ - ను - ఖలు - వాయుః - ఓతః - చ - ప్రోతః - చ - ఇతి - అన్తరిక్షలోకేషు - గార్గి - ఇతి కస్మిన్ - ను - ఖలు - అన్తరిక్షలోకాః - ఓతాః - చ - ప్రోతాః - చ - ఇతి - గన్ధర్వలోకేషు - గార్గి -

ఇతి, – కస్మిన్ – ను – ఖలు – గన్ధర్వలోకాః – ఓతాః – చ – ప్రోతాః – చ – ఇతి – ఆదిత్యలోకేషు – గార్గి – ఇతి – కస్మిన్ – ను – ఖలు – ఆదిత్యలోకాః – ఓతాః – చ – ప్రోతాః – చ – ఇతి – చన్ద్రలోకేషు – గార్గి – ఇతి – కస్మిన్ – ను – ఖలు – చన్ద్రలోకాః – చ – ఓతాః – చ – ప్రోతాః – చ – ఇతి – నక్షత్రలోకేషు – గార్గి – ఇతి – కస్మిన్ – ను – ఖలు – నక్షత్రలోకాః – ఓతాః – చ – ప్రోతాః – చ – ఇతి – దేవలోకేషు – గార్గి – ఇతి – కస్మిన్ – ను – ఖలు – దేవలోకాః – ఓతాః – చ – ప్రోతాః – చ – ఇతి – ఇన్ద్రలోకేషు – గార్గి – ఇతి – కస్మిన్ – ను – ఖలు – ఇన్ద్రలోకాః – ఓతాః – చ – ప్రోతాః – చ – ఇతి – ప్రజాపతిలోకేషు – గార్గి – ఇతి – కస్మిన్ – ను – ఖలు – ప్రజాపతిలోకాః – ఓతాః – చ – ప్రోతాః – చ – ఇతి – బ్రహ్మలోకేషు – గార్గి – ఇతి – కస్మిన్ – ను – ఖలు – బ్రహ్మలోకాః – ఓతాః – చ – ప్రోతాః – చ – ఇతి – సః – హోవాచ – గార్గి – మా – అతిప్రాక్షీః – మా – తే – మూర్ధా – వ్యపప్తత్ – అనతిప్రశ్న్యాం – వై – దేవతాం – అతి పృచ్ఛసి – గార్గి – మా – అతిప్రాక్షీః – ఇతి – తతః – హ – గార్గి – వాచక్నవీ – ఉపరరామ.

ప్ర॥ అథహ = అనంతరమునందు, వాచక్నవీ = వచక్నుని పుత్రికయగు, గార్గీ = గార్గియనునది, ఏనం = ఈ యాజ్ఞవల్క్యుని, పప్రచ్ఛ = అడిగెను. యాజ్ఞవల్క్యేతి = ఓ యాజ్ఞవల్క్యుడాయని, హోవాచ = పలికెను. ఇదంసర్వం = ఈ సమస్తమున్ను, (భూసంబంధమగు ధాతుజాతమంతయు), అప్సు = ఉదకములయందు, ఓతంచ = పటముయొక్క దీర్ఘతంతువులు వలెనె కల్పింపఁబడినది. (పడుగువలెనె చేయఁబడినది). ప్రోతంచ = పటముయొక్క తిర్యక్తంతువులు వలెనె కల్పింపఁబడినది. (పేకవలెనె చేయఁబడినది). ఆపః = ఉదకములు, కస్మిన్నుఖలు = దేనియందు, ఓతాశ్చప్రోతాశ్చ = వస్త్రముయొక్క

పడుగు పేకలువలెఁ గల్పింపఁబడినవి. ఇతి = అని, (గార్గి ప్రశ్న చేసెను). హేగార్గి = ఓగార్గి! వాయౌ = వాయువునందు, ఇతి = అని, (యాజ్ఞవల్క్యుఁడు చెప్పెను). వాయుః = వాయువు, కస్మిన్నుఖలు = దేనియందు, ఓతశ్చప్రోతశ్చేతి = వస్త్రముయొక్క పడుగు పేకలువలెనె కల్పింపఁబడినవి అని, (గార్గి ప్రశ్న చేసెను). హేగార్గి = ఓగార్గీ! అన్తరిక్షలోకేషు = అన్తరిక్షలోకములయందు, ఇతి = అని, (యాజ్ఞవల్క్యుఁడు చెప్పెను). అన్తరిక్షలోకాః = అంతరిక్షలోకములు, కస్మిన్నుఖలు = దేనియందు, ఓతాశ్చప్రోతాశ్చేతి = వస్త్రముయొక్క పడుగుపేకలువలెనే కల్పింపఁబడినవి అని, (గార్గి ప్రశ్న చేసెను). హేగార్గి = ఓగార్గి! గన్ధర్వలోకేష్వితి = గన్ధర్వలోకములయందని, (యాజ్ఞవల్క్యుఁడు చెప్పెను). గన్ధర్వలోకాః = గంధర్వలోకములు, కస్మిన్నుఖలు = దేనియందు, ఓతాశ్చప్రోతాశ్చేతి = వస్త్రములయొక్క పడుగుపేకలువలెనె కల్పింపఁబడినవని, (గార్గి ప్రశ్న చేసెను). హేగార్గి = ఓగార్గి! ఆదిత్యలోకేష్వితి = ఆదిత్యలోకములయందని, (యాజ్ఞవల్క్యుఁడు చెప్పెను). ఆదిత్యలోకాః = ఆదిత్యలోకములు. కస్మిన్నుఖలు = దేనియందు, ఓతాశ్చప్రోతాశ్చేతి = వస్త్రముయొక్క పడుగుపేకలువలెనె కల్పింపఁబడినవని, (గార్గి ప్రశ్నము చేసెను) హేగార్గి = ఓ గార్గి, చన్ద్రలోకేష్వితి = చంద్రలోకముల యందని, (యాజ్ఞవల్క్యుఁడు చెప్పెను). చన్ద్రలోకాః = చంద్రలోకములు, కస్మిన్నుఖలు = దేనియందు, ఓతాశ్చప్రోతాశ్చేతి = వస్త్రముయొక్క పడుగు పేకలు వలెనే కల్పింపఁబడినవని, (గార్గి ప్రశ్న చేసెను). హేగార్గి = ఓగార్గి, నక్షత్రలోకేష్వితి = నక్షత్రలోకములయందని, (యాజ్ఞవల్క్యుఁడు చెప్పెను). నక్షత్రలోకాః = నక్షత్రలోకములు, కస్మిన్నుఖలు = దేనియందు, ఓతాశ్చప్రోతాశ్చేతి = వస్త్రముయొక్క పడుగుపేకలువలెనె కల్పింపఁబడినవని, (గార్గి ప్రశ్న చేసెను).

హేగార్గి = ఓగార్గీ, దేవలోకేష్వితి = దేవలోకములయందని, (యాజ్ఞవల్క్యుఁడు చెప్పెను). దేవలోకాః = దేవలోకములు, కస్మిన్ను ఖలు = దేనియందు, ఓతాశ్చప్రోతాశ్చేతి = వస్త్రముయొక్క పడుగుపేకలువలెనె కల్పింపఁబడినవని, (గార్గి ప్రశ్న చేసెను). హేగార్గి = ఓగార్గీ, ఇన్ద్రలోకేష్వితి = ఇన్ద్రలోకములయందని, (యాజ్ఞవల్క్యుఁడు చెప్పెను). ఇన్ద్రలోకాః = ఇంద్రలోకములు, కస్మిన్నుఖలు = దేనియందు, ఓతాశ్చప్రోతాశ్చేతి = వస్త్రముయొక్క పడుగుపేకలువలెనె కల్పింపఁబడినవని, (గార్గి ప్రశ్న చేసెను). హేగార్గి = ఓగార్గీ! ప్రజాపతిలోకేష్వితి = ప్రజాపతిలోకములయందని, (యాజ్ఞవల్క్యుఁడు చెప్పెను). ప్రజాపతిలోకాః = ప్రజాపతిలోకములు, కస్మిన్నుఖలు = దేనియందు, ఓతాశ్చప్రోతాశ్చేతి = పడుగుపేకలువలెనే కల్పింపఁబడినవని, (గార్గి ప్రశ్నముచేసెను). బ్రహ్మలోకేష్వితి = బ్రహ్మలోకములయందని (యాజ్ఞవల్క్యుఁడు చెప్పెను). బ్రహ్మలోకాః = బ్రహ్మలోకములు, కస్మిన్నుఖలు = దేనియందు, ఓతాశ్చప్రోతాశ్చేతి = వస్త్రముయొక్క పడుగుపేకలువలెనె కల్పింపఁబడినవని, (గార్గి ప్రశ్న చేసెను). సః = ఆ యాజ్ఞవల్క్యుఁడు. హేగార్గి = ఓగార్గి! మాతిప్రాక్షీః = న్యాయమును అతిక్రమించి ప్రశ్న చేయకుము. తే = నీయొక్క (న్యాయమును అతిక్రమించి ప్రశ్నముచేయుచున్న నీయొక్క), మూర్ధా = శిరస్సు, వ్యపప్తత్ = పగిలిపడును. అనతిప్రశ్న్యాంవై = ప్రసిద్ధముగా న్యాయమును అతిక్రమించి ప్రశ్నముచేయఁగూడని. దేవతాం = దేవతను, అతిపృచ్ఛసి = న్యాయమును అతిక్రమించి అడుగుచున్నావు, హేగార్గి = ఓగార్గీ, మాతిప్రాక్షీః = (న్యాయమును) అతిక్రమించి అడుగకుము, ఇతి = అని, హోవాచ = పలికెను. తతోహ = అందువలన, వాచక్నవీ = వచక్నుని పుత్రికయగు, గార్గీ = గార్గి, ఉపరరామ = ఊరకయుండెను.

తా॥ పూర్వము చెప్పిన చతుర్థ పఞ్చమబ్రాహ్మణముల రెంటి యందు ఆత్మకు సర్వాన్తరత్వము చెప్పఁబడినది. బాహ్యాన్తర్భావము తోను భూమి మొదలు ఆకాశాంతముపరకుఁ డెడి భూతములయొక్క వ్యాప్యమునుపొంది నిరాకరించుచు ద్రష్టయొక్క సాక్షాత్సర్వాన్తర మగు సమస్త సంసారధర్మముల విడిచియున్న ఆత్మస్వరూపము చూపించఁదగినదియని ఈ బ్రాహ్మణము ఆరంభింపఁబడినది. కహోళ ప్రశ్నానంతరము వచక్నుని పుత్రికయగు గార్గి, ఓయాజ్ఞవల్క్యుఁడా! ఈ పృథివీసంబంధమగు ధాతుజాతమంతయు వస్త్రముయొక్క పడుగుపేకలలోనుండెడి దారములువలెనె బాహ్యాన్తర్భూతములగు ఉదకములచేత అంతటను వ్యాపింపఁబడి యున్నది. ఆ ప్రకార ముగానే ఆ యుదకములు దేనియందున్నవని ప్రశ్నచేయగా వాయువునందున్నదనియును, వాయువు దేనియందని ప్రశ్నచేయగా అంతరిక్ష లోకములయందున్నదనియును, అంతరిక్షలోకములు దేని యందని ప్రశ్నచేయగా గంధర్వలోకములయందున్నవనియును, గంధర్వలోకములు దేనియందని ప్రశ్నచేయగా ఆదిత్యలోక ములందున్నవనియును, ఆదిత్యలోకములు దేనియందని ప్రశ్న చేయగా చంద్రలోకములయందున్నవనియును, చంద్రలోకములు దేని యందని ప్రశ్నచేయగా నక్షత్రలోకములయందున్నవనియును, నక్షత్ర లోకములు దేనియందని ప్రశ్నచేయగా దేవలోకములయందున్న వనియును. దేవలోకములు దేనియందని ప్రశ్నచేయగా ఇంద్రలోక ములయందున్నవనియును, ఇంద్రలోకములు దేనియందని ప్రశ్నచే యగా ప్రజాపతిలోకములయందున్నవనియును, ప్రజాపతిలోకములు దేనియందని ప్రశ్నచేయగా బ్రహ్మలోకములయందున్నవనియును, చెప్పె యాజ్ఞవల్క్యుఁడు ఈ ప్రకారము గార్గి యడిగిన ప్రశ్నలు అనఁగా అనుమానముచేత నడుగఁదగిన పృథివ్యాది భూతములను గురించియును, ఆ భూతములవలన కలిగిన అంతరిక్షాది బ్రహ్మలోక

ములను గురించియును, క్రమముగాఁగార్య కారణములైన వాటిన్ని టిని చెప్పి భూతములకును భూతవికారములగు అంతరిక్షాది బ్రహ్మ లోకములకును అతీతమైనదియును పూర్వప్రకారము అనుమానముచేఁ దర్కించుటకు నర్హముగానిదియునగు ఆగమ ప్రమాణముచేఁ దెలిసి కొనఁదగిన దేవతా స్వరూపమును తెలిసికొనుటకు పూర్వమువలెనే న్యాయమునతిక్రమించి అనుమానముచే గార్గి ప్రశ్న చేయఁగా, యాజ్ఞవల్క్యుఁడు, ఓ గార్గి! ఇట్లు న్యాయమునతిక్రమించి ప్రశ్నము చేయఁగూడదు. నీవు అట్లు చేసితివేని నీ శిరస్సు పగిలి క్రిందపడును. కాఁబట్టి నీవు బ్రతికియుండుటకు ఇచ్ఛకలదానవైతివేని అట్లు ప్రశ్నము చేయకుమా యని పలుకగా వచక్ను ని పుత్రికయగు గార్గి వేఱొక ప్రశ్నము చేయక యూరకుండెను.

ఇట్లు పఞ్చమాధ్యాయమునందు షష్ఠబ్రాహ్మణము సమాప్తము.

పఞ్చమాధ్యాయము – సప్తమబ్రాహ్మణము

ఉ॥ అథ హైనముద్దాలక ఆరుణిః పప్రచ్ఛ యాజ్ఞవల్క్యేతి హోవాచ మద్రేష్వవ సామ పతఞ్జలస్య కాప్యస్య గృహేషు యజ్ఞమధీయానాస్తస్యాసీద్భార్యా గంధర్వ గృహీతా తమపృచ్ఛామకోఽసీతి సోఽబ్రవీత్ కబన్ధ ఆథర్వణ ఇతి సోఽబ్రవీత్పతఞ్జలం కాప్యం యాజ్ఞికాగ్ శ్చ వేత్థ ను త్వం కాప్య తత్సూత్రం యేనాయం చ లోకః పరశ్చ లోకః సర్వాణి చ భూతాని సన్దృబ్ధాని భవన్తీతి సోఽబ్రవీత్పతఞ్జలః కాప్యో నాహం తం భగవన్వేదేతి। సోఽబ్రవీత్పతఞ్జలం కాప్యం యాజ్ఞికాగ్ శ్చ వేత్థ నుత్వం కాప్య తమన్తర్యామిణం య ఇమం చ లోకం పరం చ లోకగ్ సర్వాణి చ భూతాని యోఽన్తరో యమయతీతి సోఽబ్రవీత్పతఞ్జలః కాప్యోనాహంతం భగవన్వేదేతి సోఽబ్రవీత్పతఞ్జలం కాప్యం యాజ్ఞికాగ్ శ్చ యో వై తత్కాప్య సూత్రం విద్యాత్తం చాన్తర్యామిణమితి స బ్రహ్మవిత్స లోకవిత్స దేవవిత్స

వేదవిత్స భూతవిత్స ఆత్మవిత్స సర్వవిదితి తేభ్యోఽబ్రవీత్తదహం వేద తచ్చేత్త్వం యాజ్ఞవల్క్య సూత్రమవిద్వాగ్ స్తం చాన్తర్యామిణం బ్రహ్మగవీరుదజసే మూర్ధా తే విపతిష్యతీతి వేద వా అహం గౌతమ తత్సూత్రం తం చాన్తర్యామిణమితి యో వా ఇదం కశ్చిద్బ్రూయా ద్వేద వేదేతి యథా వేత్థ తథా బ్రూహీతి. ॥1॥

ప॥ అథ – హ – ఏనం – ఉద్దాలకః – ఆరుణిః – పప్రచ్ఛ – యాజ్ఞవల్క్య – ఇతి – హోవాచ – మద్రేషు – అవసామ – పతఞ్జలస్య – కాప్యస్య – గృహేషు – యజ్ఞం – అధీయానాః – తస్య – ఆసీత్ – భార్యా – గన్ధర్వగృహీతా – తం – అపృచ్ఛామ – కః – అసి – ఇతి – సః–అబ్రవీత్ – కబన్ధః – ఆథర్వణః– ఇతి – సః – అబ్రవీత్ – పతఞ్జలం – కాప్యం – యాజ్ఞికాన్ – చ – వేత్థ – ను – త్వం – కాప్య – తత్ – సూత్రం – యేన – అయం – చ – లోకః – పరః – చ – లోకః – సర్వాణి – చ – భూతాని – సన్దృబ్ధాని – భవన్తి – ఇతి – సః – అబ్రవీత్ – పతఞ్జలః – కాప్యః – న – అహం – తం – భగవన్ – వేద – ఇతి – సః – అబ్రవీత్ – పతఞ్జలం – కాప్యం – యాజ్ఞికాన్ – చ – వేత్థ – ను – త్వం – కాప్య – తం – అన్తర్యామిణం – యః – ఇమం – చ – లోకం – పరం – చ – లోకం – సర్వాణి – చ – భూతాని – యః – అన్తరః – యమయతి – ఇతి – సః – అబ్రవీత్ – పతఞ్జలః– కాప్యః – న – అహం – తం – భగవన్ – వేద – ఇతి – సః – అబ్రవీత్ – పతఞ్జలం – కాప్యం – యాజ్ఞికాన్ – చ – యః – వై – తత్ – కాప్య – సూత్రం – విద్యాత్ – తం – చ – అన్తర్యామిణం – ఇతి – సః – బ్రహ్మవిత్ – సః – లోకవిత్ – సః – దేవవిత్ – సః – వేదవిత్ – సః – భూతవిత్ – సః – ఆత్మవిత్ – సః – సర్వవిత్ – ఇతి – తేభ్యః – అబ్రవీత్ – తత్ – అహం –

వేద - తత్ - చేత్ - త్వం - యాజ్ఞవల్క్య - సూత్రం - అవిద్వాన్ - తం - చ - అన్తర్యామిణం - బ్రహ్మగవీః - ఉదజసే - మూర్ధా - తే - విపతిష్యతి - ఇతి - వేద - వా - అహం - గౌతమ - తత్ - సూత్రం - తం - చ - అన్తర్యామిణం - ఇతి - యః - వై - ఇదం - కః - చిత్ - బ్రూయాత్ - వేద - వేద - ఇతి - యథా - వేత్థ - తథా - బ్రూహి - ఇతి.

ప॥ అథ హ = అనంతరము, ఆరుణిః = అరుణపుత్రుఁడగు, ఉద్దాలకః = ఉద్దాలకుఁడనువాఁడు, ఏనం = ఈ యాజ్ఞవల్క్యుని, పప్రచ్ఛ = అడిగెను. హే యాజ్ఞవల్క్యేతి = ఓ యాజ్ఞవల్క్యుఁడాయని, హోవాచ = పలికెను. (వయం = మేము), మద్రేషు = మద్రదేశములయందు, కాప్యస్య = కపిగోత్రోత్పన్నుఁడైన, పతఞ్జలస్య = పతంజలుఁడనువానియొక్క, గృహేషు = గృహమునందు, యజ్ఞం = యజ్ఞశాస్త్రమును, (కల్పసూత్రమును), అధీయానాః = అధ్యయనమును చేయువారమై, అవసామ = నివసించియుంటిమి. తస్య = ఆ పతంజలునియొక్క, భార్యా = భార్య, గన్ధర్వగృహీతా = గంధర్వునిచే గ్రహింపఁబడినదై, ఆసీత్ = ఉండెను. తం = ఆ గంధర్వగ్రహమును, (వయం = మేము), కోఽసీతి = ఎవఁడవగుచున్నావని, అపృచ్ఛామ = అడిగితిమి, సః = ఆ గంధర్వుఁడు, ఆథర్వణః=అథర్వుని పుత్రుఁడగు, కబన్ధఇతి = కబన్ధుఁడనని, అబ్రవీత్ = పలికెను, సః = ఆ గంధర్వుఁడు, కాప్యం = కపిగోత్రోత్పన్నుఁడైన, పతఞ్జలం = పతంజలుఁడనువానిని గూర్చియును, యాజ్ఞికాంశ్చ = యజ్ఞశాస్త్రాధ్యయనమును చేయునట్టి ఆయన శిష్యులను గూర్చియును, అబ్రవీత్ = పలికెను. యేన = ఏ సూత్రముచేతను, అయంచలోకః = ఈ జన్మమును, పరశ్చలోకః = అన్యజన్మమును, (పొందఁదగిన జన్మమును), సర్వాణిచ భూతాని = సమస్తభూతములును, (బ్రహ్మమొదలుకొని స్తంబపర్యంతముండెడి భూతములును),

సన్దృబ్ధాని = కూర్చఁబడినవి. (దారముచేత పుష్పమాలికలువలెనే కూర్చఁబడినవి), భవన్తి = అగుచున్నవో, హే కాప్య=కపిగోత్రోత్ప న్నుఁడవైన ఓపతంజలుఁడా, త్వం=నీవు, తత్ =ఆసూత్రమును, వేత్థను= తెలుసుకొంటివా, ఇతి = అని, (అబ్రవీత్ = పలికెను). సః = ఆ, కాప్యః = కపిగోత్రోత్పన్నుఁడైన, పతఞ్జలః = పతంజలుఁడనువాఁడు, హే భగవన్ = పూజ్యుఁడవగు ఓ గంధర్వుఁడా, అహం = నేను, తత్ = ఆ సూత్రమును, న వేదేతి = తెలిసికొనలేదని, అబ్రవీత్ = పలికెను. సః = ఆ గంధర్వుఁడు, కాప్యం = కపిగోత్రోత్పన్నుఁడైన, పతఞ్జలం = పతంజలుఁడనువానినిగూర్చియును. యాజ్ఞికాంశ్చ = యజ్ఞశాస్త్రాధ్యయనమును చేయునట్టి శిష్యులనుగూర్చియును, అబ్ర వీత్ = పలికెను. హే కాప్య = కపిగోత్రోత్పన్నుఁడవైన ఓపతంజ లుఁడా, త్వం = నీవు. యః = ఎవఁడు, ఇమంచలోకం = ఈ జన్మ మును, పరంచలోకం = అన్యజన్మమును, అన్తరః = లోపలనున్న వాఁడై, యమయతి=నియమించుచున్నాఁడో, యః = ఎవఁడు, సర్వా ణిచభూతాని = సమస్తభూతములను. (అన్తరః = లోపలనున్నవాఁడై, యమయతి = నియమించుచున్నాఁడో), తం = అటువంటి, అన్తర్యా మిణం = అంతర్యామియగు పరమాత్మను, వేత్థను = తెలిసికొని యుంటివా, ఇతి = అని, .(గంధర్వుఁడు, అబ్రవీత్ = పలికెను). కాప్యః = కపిగోత్రోత్పన్నుఁడైన, సఃపతఞ్జలః = ఆ పతంజలుడను వాఁడు, హే భగవన్ = పూజ్యుఁడవైన ఓ గంధర్వుఁడా, అహం = నేను, తం = అంతర్యామియగు ఆపరమాత్మను, న వేదేతి = తెలిసి కొనలేదని (అబ్రవీత్ = పలికెను). సః = ఆ గంధర్వుఁడు, కాప్యం = కపిగోత్రోత్పన్నుఁడైన, పతఞ్జలం = పతంజలునిగూర్చియును, యాజ్ఞి కాంశ్చ = యజ్ఞశాస్త్రాధ్యయనమును చేయుచున్న శిష్యులగూర్చి యును, అబ్రవీత్ = పలికెను. హే కాప్య = కపిగోత్రోత్పన్నుఁడవైన పతంజలుఁడా, యోవై = ఎవఁడైతే, తత్ సూత్రం = ఆసూత్ర

స్వరూపమునున్ను, తంచాన్తర్యామిణం = ఆ యంతర్యామి స్వరూపమునున్ను, ఇతి = ఈపూర్వము చెప్పిన ప్రకారముగా, విద్యాత్ = తెలిసికొనునో, సః = వాఁడు, బ్రహ్మవిత్ = పరమాత్మను తెలిసికొనినవాఁడు. సః = వాఁడు, లోకవిత్ = భూమి మొదలగు లోకములను తెలిసికొనినవాఁడు, సః = వాఁడు, దేవవిత్ = అగ్ని మొదలగు దేవతలను తెలిసికొనినవాఁడు, సః = వాఁడు. వేదవిత్ = సమస్త ప్రమాణభూతములైన వేదములను తెలిసికొనినవాఁడు, సః = వాఁడు, భూతవిత్ = బ్రహ్మ మొదలైన సమస్తభూతములను తెలిసికొనినవాఁడు, సః = వాఁడు, ఆత్మవిత్ = ఆత్మను తెలిసికొనినవాఁడు. (ఆ అన్తర్యామిచే నియమింపఁబడినదియును, కర్తృత్వభోక్తృత్వములతోఁ గూడుకొనియున్నదియునగు ఆ ఆత్మను తెలిసికొన్నవాఁడు), సః = వాఁడు, సర్వవిత్ = సమస్తమును తెలిసికొన్నవాఁడు, ఇతి = ఈప్రకారము. (గంధర్వుఁడు సూత్రాన్తర్యామి విజ్ఞానమును స్తుతించగా ఆ కపిగోత్రోత్పన్నుఁడైన పతంజలుఁడును, యజ్ఞశాస్త్రాధ్యయనమును చేయుచున్న మేమును దానిని కోరువారమై అభిముఖులమైతిమి). తేభ్యః = అటువంటి మాకొఱకు, (గంధర్వః = గంధర్వుఁడు, సూత్రం = సూత్రస్వరూపమును, అన్తర్యామిణంచ = అన్తర్యామి స్వరూపమును), అబ్రవీత్ = పలికెను. తత్ = ఆ సూత్రాన్తర్యామి విజ్ఞానమును, అహం = నేను, వేద = ఎఱుఁగుదును. హేయాజ్ఞవల్క్య=ఓ యాజ్ఞవల్క్యుఁడా! త్వం=నీవు, తత్ = ఆ, సూత్రం = సూత్రమును, తంచాన్తర్యామిణం=ఆ అంతర్యామిని. అవిద్వాన్ = తెలిసికొననివాఁడవై, బ్రహ్మగవీః = బ్రహ్మవేత్తలయొక్క ధనమైన గోవులను, ఉదజసేచేత్ =తోలుకొనిపోతివేని, తే=నీయొక్క, మూర్ధా = శిరస్సు,విపతిష్యతి=విస్పష్టముగా పడిపోఁగలదు, ఇతి= అని, (అరుణపుత్రుఁడగు ఉద్దాలకుఁడు పలికెను). హేగౌతమ = గౌతమగోత్రోత్పన్నుఁడవైన ఓఉద్దాలకుఁడా! అహం=నేను, తత్సూత్రం=ఆ సూత్రస్వ

రూపమును. తంచాంతర్యామిణం = ఆ యంతర్యామిస్వరూపమును, వేదవై = గుర్తెఱుఁగుదును. ఇతి = అని, (యాజ్ఞవల్క్యుఁడు పలికెను). (గౌతమః = గౌతముఁడు), యోవాకశ్చిత్ = ఎవఁడైనను, ఇదం = దీనిని, (నీచేతఁ జెప్పఁబడినదానిని) వేదవేదేతి = ఎఱుఁగుదును, ఎఱుఁగుదునని, బ్రూయాత్ = పలుకును? (అట్లు వ్యర్థముగాఁ బలుకుటతో నేమి ప్రయోజనము?) యథా = ఏప్రకారము, (త్వం = నీవు) వేత్థ = తెలిసికొంటివో, తథా = ఆప్రకారము, బ్రూహి = చెప్పుమా, ఇతి = అని, (అబ్రవీత్ = పలికెను).

తా॥ ఇంతకుపూర్వము సూత్రాత్మకంటె తక్కువైన వ్యాపక స్వరూపము చెప్పఁబడినది. ఇప్పుడు సూత్రస్వరూపమునున్ను ఆ సూత్రాంతర్గతమైన అంతర్యామిస్వరూపమునున్ను చెప్పుటకు ఈ బ్రాహ్మణ మారంభింపఁబడినది. ఆ సూత్రాన్తర్యామి స్వరూపమును ఆగమన్యాయముచేతనే అడుగఁదగినదియని ఇతిహాసముచేతను ఆగమోపన్యాసము చేయఁబడుచున్నది. (ఆగమ మనఁగా ఆచార్యోపదేశము). గార్గి యనునది వేరొక ప్రశ్నను చేయకుండ నూరకున్న తరువాత అరుణపుత్రుఁడగు ఉద్దాలకుఁ డనువాఁడు ఈ యాజ్ఞవల్క్యుని, ఓ యాజ్ఞవల్క్యుఁడా! మేము మద్రదేశములయందు కపిగోత్రోత్పన్నుఁడైన పతంజలుఁడనువాని గృహమునందు యజ్ఞశాస్త్రాధ్యయనమును చేయుచున్నవారమై నివసించియుంటిమి. అప్పుడా పతంజలుని యొక్క భార్య గంధర్వగ్రహావిష్టమై యుండెను. ఆ గంధర్వుని మేము నీవెవ్వరవని అడిగితిమి. అంతట, గంధర్వుఁడు అథర్వుని పుత్రుఁడనగు కబన్ధుఁడనువాఁడనని చెప్పి కపిగోత్రోత్పన్నుఁడైన ఆ పతంజలుని గూర్చియును యజ్ఞశాస్త్రాధ్యయనమును చేయుచున్న మమ్మును గూర్చియును పలికెను. ఏసూత్రముచేత ఈజన్మమున్ను పరజన్మమున్ను బ్రహ్మాదిస్తంబపర్యంతముండెడి సమస్తభూతములున్ను దారముతో పుష్పమాలికలువలెనె కూర్చఁబడియున్నవో ఆసూత్రములను

ఓ పతంజలుఁడా! నీవు తెలిసికొంటివాయని పలికెను. అనంతరమా పతంజలుఁడు పూజ్యుఁడవగు ఓ గంధర్వుఁడా! ఆ సూత్రమును నేను తెలిసికొనలేదని పలికెను. తిరిగి ఆ గంధర్వుఁడు ఓ పతంజలుఁడా! నీవు, ఈజన్మ పరజన్మములను, బ్రహ్మాది స్తంబ పర్యన్తముండెడి సమస్తభూతములను, అభ్యంతరుఁడై నియమించునట్టి అంతర్యామి స్వరూపమును తెలిసికొంటివాయని అడుగఁగా, ఓ పూజ్యుఁడవగు గంధర్వుఁడా! నేను ఆ అంతర్యామి స్వరూపమును తెలిసికొనలేదని పతంజలుఁడు చెప్పెను. తిరిగి ఆ గంధర్వుఁడు కాప్యుఁడవగు ఓ పతంజలుఁడా! ఏజనుఁడైతే ఆ సూత్రస్వరూపమును అంతర్యామి యగు పరమాత్మస్వరూపమును తెలిసికొనుచున్నాఁడో వాఁడే పరమాత్మను, భూరాది లోకములను, అగ్ని మొదలగు దేవతలను, సమస్త ప్రమాణభూతములైన వేదములను, బ్రహ్మాది స్తంబపర్యంతముండెడి సమస్తభూతములను అంతర్యామిచే నియమింపఁబడినదియును కర్తృత్వభోక్తృత్వములతోఁ గూడుకొనినదియునగు ఆత్మస్వరూపమును సమస్తమును తెలిసికొనిన వాఁడగుచున్నాఁడని గంధర్వుఁడు సూత్రాన్తర్యామి విజ్ఞానమును ఇట్లు స్తుతించఁగా కాప్యుఁడగు పతంజలుఁడును యజ్ఞశాస్త్రాధ్యయనమును చేయుచున్న మేమును ఆ సూత్రాన్తర్యామి విజ్ఞానమును కోరువారమై ఆ గంధర్వునకభిముఖులమై ప్రార్థించితిమి. అప్పుడాగంధర్వుఁడు ఆ సూత్రాన్తర్యామి విజ్ఞానమును మాకొఱకు చెప్పెను. గనుక ఆ సూత్రాన్తర్యామి విజ్ఞానమును నేను గుర్తెఱుఁగుదును. ఓ యాజ్ఞవల్క్యుఁడా! నీవు ఆ సూత్రమునున్ను ఆ అంతర్యామినిన్ని తెలియనివాఁడవై బ్రహ్మవేత్తలయొక్క ధనమైన ఈ గోవులను తోలించుకొని పోయినయెడల నీ శిరస్సు విస్పష్టముగా పడిపోవునని అరుణపుత్రుఁడగు ఉద్దాలకుఁడనఁగా యాజ్ఞవల్క్యుఁడు గౌతమగోత్రోత్పన్నుఁడవైన ఓ యుద్దాలకుఁడా! నాకు సూత్రాన్తర్యామి స్వరూపములు తెలియునని పలు

కగా, గౌతముఁడు ఓ యాజ్ఞవల్క్యుఁడా! ప్రాకృతుఁడగు యే జనుఁడైనను ఆ సూత్రాన్తర్యామి స్వరూపములను తెలిసికొని యున్నానని పలుకునా? అట్లు పలికినంతమాత్రముతో నేమిప్రయోజనము? లేదు గనుక ఎట్లు తెలిసికొంటివో ఆ ప్రకారమును చెప్పుమా యని అడిగెను.

ఉ॥ స హోవాచ వాయుర్వై గౌతమ తత్సూత్రం వాయునా వై గౌతమ సూత్రేణాయం చ లోకః పరశ్చలోకః సర్వాణి చ భూతాని సన్దృబ్ధాని భవన్తి తస్మాద్వై గౌతమ పురుషం ప్రేతమాహుర్వ్యస్రగ్ంసిషతాస్యాఙ్గానీతి వాయునా హి గౌతమ సూత్రేణ సన్దృబ్ధాని భవన్తీత్యేవమేవైతద్యాజ్ఞవల్క్యాన్తర్యామిణం బ్రూహీతి. ॥2॥

ప॥ సః - హోవాచ - వాయుః - వై - గౌతమ - తత్ - సూత్రం - వాయునా - వై - గౌతమ - సూత్రేణ - అయం - చ - లోకః - పరః - చ - లోకః - సర్వాణి - చ - భూతాని-సన్దృబ్ధాని- భవన్తి - తస్మాత్ - వై - గౌతమ - పురుషం - ప్రేతం - ఆహుః - వ్యస్రంసిషత - అస్య - అఙ్గాని ఇతి - వాయునా - హి - గౌతమ- సూత్రేణ - సన్దృబ్ధాని - భవన్తి - ఇతి - ఏవం - ఏవ - ఏతత్ - యాజ్ఞవల్క్య - అన్తర్యామిణం - బ్రూహి - ఇతి.

ప్ర॥ సః = ఆ యాజ్ఞవల్క్యుఁడు, హోవాచ = పలికెను. హేగౌతమ = గౌతమగోత్రోత్పన్నుఁడవైన ఓ ఉద్దాలకుఁడా! ఏతత్ = ఈ, సూత్రం = సూత్రము, వాయుర్వై = వాయువే. హేగౌతమ = గౌతమగోత్రోత్పన్నుఁడవైనఓ ఉద్దాలకుఁడా! సూత్రేణ=సూత్రరూపమైన, వాయునావై = వాయువుచేతనే, అయంచలోకః = ఈ జన్మమును, పరశ్చలోకః=పరజన్మమును, సర్వాణిచ భూతాని= సమస్తభూతములును, సన్దృబ్ధాని=కూర్చఁబడినవి, భవన్తి=అగుచున్నవి. తస్మాద్వై=ఆకారణమువల్లనుంచియే, హేఃగౌతమ=గౌతముఁ

డనగు ఓ ఉద్దాలకుఁడా! పురుషం=పురుషునిని, ప్రేతం=చచ్చినవా నినిగా, ఆహుః=చెప్పిరి. అస్య=ఈ పురుషునియొక్క, అఙ్గాని=అవ యవములు, వ్యస్రంసిషత=జారిపోయినవి. ఇతి=గనుక, హేగౌతమ= ఓ గౌతముఁడా, సూత్రేణ=సూత్రరూపమైన, వాయునాహి=వాయు స్వరూపముచేతనే (అంగాని=అవయవములు) సన్దృబ్ధాని=కూర్పఁబడి నవి, భవన్తి=అగుచున్నవి. ఇతి=అని, (యాజ్ఞవల్క్యుఁడు చెప్పెను. గౌతముఁడు) ఏతత్=ఈ సూత్రస్వరూపము, ఏవమేవ=ఈప్రకార ముగానే, హే యాజ్ఞవల్క్య=ఓ యాజ్ఞవల్క్యుఁడా! అన్తర్యామి ణం=అంతర్యామిస్వరూపమును, (ఆ సూత్రాంతర్గతమైన అంతర్యామి స్వరూపమును), బ్రూహీతి = చెప్పుమాయని, (హోవాచ = పలికెను).

తా॥ యాజ్ఞవల్క్యుఁడు, ఓ గౌతముఁడా! ఆ సూత్రస్వరూ పము వాయువే. ఆ సూత్రస్వరూపమైన వాయువుచేతనే ఈ జన్మ మును పరజన్మమును బ్రహ్మాది స్తంబపర్యంతముండెడి సమస్తభూత ములును దారముతో పుష్పమాలికవలెనే కూర్పఁబడి యున్నవి. గనుక ఈ వాయువు విడిచిపోయినపుడు ఇవియన్నియు దారము తెగినప్పుడు పుష్పములువలెనే విడి శిథిలమగుచున్నవి. అందువల్లనే వాయువు విడిచిపోయినప్పుడు పురుషుని చనిపోయినాఁడని చెప్పుచు న్నారు. ఈ పురుషుని అవయవములన్నియు శిథిలమై పోవుచున్నవి. గనుకనే ఓ గౌతముఁడా! సూత్రస్వరూపమైన వాయువుచేతనే అన్ని యుఁగూర్చబడియున్నవి. అని యాజ్ఞవల్క్యుఁడు చెప్పఁగా గౌత ముఁడు, ఓ యాజ్ఞవల్క్యుఁడా! నీచేతను సూత్రస్వరూపము బాగు గాఁ జెప్పఁబడినది. ఇప్పుడా సూత్రాంతర్గతమైనవాఁడును ఆ సూత్ర మునకు నియామకుఁడునగు అంతర్యామి స్వరూపమును చెప్పుమా యని పలికెను.

ఉ॥ యః పృథివ్యాంతిష్ఠన్ పృథివ్యా అన్తరోయం పృథివీ న వేదయస్య

పృథివీశరీరం యః పృథివీమన్తరో యమయత్యేష త ఆత్మాన్త ర్యామ్యమృతః. ॥3॥

ప॥ యః – పృథివ్యాం – తిష్ఠన్ – పృథివ్యాః – అన్తరః – యం – పృథివీ – న–వేద – యస్య – పృథివీ – శరీరం–యః – పృథివీం – అన్తరః – యమయతి – ఏషః – తే – ఆత్మా–అన్తర్యామీ–అమృతః

ప్ర॥ యః=ఏది, పృథివ్యాం=భూమియందు, తిష్ఠన్=ఉన్నదై పృథివ్యాః=భూమికంటె, అన్తరః=అభ్యన్తరమైనదో, పృథివీ=భూమి. యం=దేనిని, నవేద=తెలిసికొనలేదో, పృథివీ=భూమి, యస్య=ఎవనికి, శరీరం=దేహమో, యః=ఏది, పృథివీం=భూమిని, అన్తరః=లోపలనున్నదై, నియమయతి=నియమించుచున్నదో, ఏషః=ఇది, తే=నీయొక్క, అమృతః=నాశనములేని, అన్తర్యామీ=అంతర్యామి స్వరూపమగు. ఆత్మా=ఆత్మస్వరూపము.

ఉ॥ యోఽప్సుతిష్ఠన్నద్భ్యోఽన్తరో యమాపో న విదుర్యస్యాపశ్శరీరం యోఽపామన్తరో యమయత్యేష త ఆత్మాన్తర్యామ్యమృతః. ॥4॥

ప॥ యః – అప్సు – తిష్ఠన్ – అద్భ్యః – అన్తరః – యం – ఆపః – న – విదుః – యస్య – ఆపః – శరీరం – యః – అపాం అన్తరః – యమయతి–ఏషః – తే – ఆత్మా-అన్తర్యామీ–అమృతః.

ప్ర॥ యః=ఏది, అప్సు=ఉదకములయందు, తిష్ఠన్=ఉన్నదై, అద్భ్యః=ఉదకములకంటె, అన్తరః=లోపలనుండెడివాఁడు (భవతి=అగుచున్నాఁడో), ఆపః=ఉదకములు, యం=దేనిని, నవిదుః=తెలిసికొనలేవో, యస్య=దేనికి, ఆపః=ఉదకములు, శరీరం=దేహమో, యః=ఏది, అపాం=ఉదకములను, అన్తరః=అభ్యంతరమైనదై, యమయతి=నియమించుచున్నదో, ఏషః=ఇది, తే=నీయొక్క, అమృతః=నాశరహితమగు, అన్తర్యామీ = అంతర్యామిస్వరూపమైన,

ఆత్మా=ఆత్మస్వరూపము.

ఉ॥ యోఽగ్నౌ తిష్ఠ న్నగ్నే రన్తరో యమగ్నిర్న వేద యస్యాగ్నిః శరీరం యోఽగ్ని మన్తరో యమయత్యేష త ఆత్మాన్తర్యామ్య మృతః. ॥5॥

ప॥ యః - అగ్నౌ - తిష్ఠన్ - అగ్నేః - అన్తరః - యం - అగ్నిః - న - వేద - యస్య - అగ్నిః - శరీరం - యః - అగ్నిం - అన్తరః - యమయతి - ఏషః - తే - ఆత్మా - అన్తర్యామి - అమృతః.

ప్ర॥ యః = ఏది, అగ్నౌ = అగ్నియందు, తిష్ఠన్ = ఉన్నదై, అగ్నేః = అగ్నికంటె, అన్తరః = అభ్యన్తరమైనది, (భవతి = అగుచున్నదో), అగ్నిః = అగ్ని, యం = దేనిని, నవేద = తెలిసికొనలేదో, యస్య = దేనికి, అగ్నిః = అగ్ని, శరీరం = దేహమో, యః = ఏది, అగ్నిం = అగ్నిని, అభ్యన్తరః = లోపలనున్నదై, యమయతి = నియమించుచున్నదో, ఏషః = ఇది, తే = నీయొక్క, అమృతః = నాశనములేని, అన్తర్యామీ = అన్తర్యామిస్వరూపమగు, ఆత్మా = ఆత్మ, (భవతి = అగుచున్నది).

ఉ॥ యోఽన్తరిక్షే తిష్ఠ న్నన్తరిక్షాద న్తరో యమన్తరిక్షం న వేద యస్యాన్తరిక్షగ్ శరీరం యోఽన్తరిక్షమన్తరో యమయత్యేష త ఆత్మాన్తర్యామ్యమృతః. ॥6॥

ప॥ యః - అన్తరిక్షే - తిష్ఠన్-అన్తరిక్షాత్ అన్తరః-యం - అన్తరిక్షం-న - వేద - యస్య -అన్తరిక్షం-శరీరం-యః-అన్తరిక్షం - అన్తరః - యమయతి - ఏషః - తే - ఆత్మా - అన్తర్యామీ - అమృతః.

ప్ర॥ యః = ఏది, అన్తరిక్షే = అంతరిక్షమునందు, తిష్ఠన్ = ఉన్నదై, అన్తరిక్షాత్ = అంతరిక్షముకంటె, అన్తరః = లోపల నున్నది. (భవతి = అగుచున్నదో), అన్తరిక్షం = అంతరిక్షము,

యం = దేనిని, నవేద = తెలిసికొనలేదో, అన్తరిక్షం=అంతరిక్షము, యస్య = దేనికి, శరీరం = దేహమో, యః=ఏది, అన్తరిక్షం = అంతరిక్షమును, అన్తరః = లోపలనున్నదై, యమయతి = నియమించుచున్నదో, ఏషః = ఇది, తే=నీయొక్క, అమృతః=నాశనము లేని, అన్తర్యామీ = అంతర్యామిస్వరూపమగు, ఆత్మా = ఆత్మ, (భవతి = అగుచున్నది).

ఉ॥ యో వాయౌ తిష్ఠ న్వాయోర న్తరోయం వాయుర్న వేద యస్య వాయుః శరీరం యో వాయుమ న్తరో యమయ త్యేష త ఆత్మా న్తర్యామ్యమృతః. ॥7॥

ప॥ యః - వాయౌ - తిష్ఠన్ - వాయోః - అన్తరః - యం- వాయుః - న - వేద - యస్య - వాయుః - శరీరం - యః - వాయుం - అన్తరః-యమయతి-ఏషః - తే - ఆత్మా - అన్తర్యామీ - అమృతః.

ప్ర॥ యః = ఏది, వాయౌ = వాయువునందు, తిష్ఠన్ = ఉన్నదై, వాయోః = వాయువుకంటె, అన్తరః = లోపలనుండునది, (భవతి = అగుచున్నదో), యం = దేనిని, వాయుః = వాయువు, నవేద = తెలిసికొనలేదో, వాయుః = వాయువు, యస్య = దేనికి, శరీరం = దేహమో, యః = ఏది, వాయుం=వాయువును, అన్తరః = లోపలనున్నదై, యమయతి = నియమించుచున్నదో, ఏషః = ఇది, తే = నీయొక్క, అమృతః = నాశనములేని, అన్తర్యామీ = అంతర్యామిస్వరూపమగు, ఆత్మా = ఆత్మ, (భవతి = అగుచున్నది).

ఉ॥ యో దివి తిష్ఠన్దివోఽ న్తరోయం ద్యౌర్న వేద యస్య ద్యౌః శరీరం యో దివమ న్తరో యమయ త్యేష త ఆత్మా న్తర్యామ్యమృతః.॥8॥

ప॥ యః - దివి-తిష్ఠన్ - దివః - అన్తరః - యం - ద్యౌః-న- వేద - యస్య - ద్యౌః - శరీరం - యః - దివం - అన్తరః - యమయతి - ఏషః - తే - ఆత్మా - అన్తర్యామీ - అమృతః.

ప్ర॥ యః = ఏది, దివి = ద్యులోకమునందు, తిష్ఠన్ = ఉన్నదై, దివః = ద్యులోకముకంటె, అన్తరః = లోపలనున్నది, (భవతి = అగుచున్నదో), ద్యౌః = ద్యులోకము, యం = దేనిని, న వేద = తెలిసికొనలేదో, యస్య = దేనికి, ద్యౌః = ద్యులోకము, శరీరం = దేహమో, యః = ఏది, దివం=ద్యులోకము, అన్తరః = లోపలనున్నదై, యమయతి = నియమించుచున్నదో, ఏషః = ఇది, తే = నీయొక్క, అమృతః = నాశనములేని, అన్తర్యామీ = అంతర్యామిస్వరూపమగు, ఆత్మా = ఆత్మ, (భవతి = అగుచున్నది).

ఉ॥ య ఆదిత్యేతిష్ఠ న్నాదిత్యాదన్తరోయ మాదిత్యో న వేద యస్యాదిత్యః శరీరం య ఆదిత్య మన్తరోయమయత్యేష త ఆత్మాన్తర్యామ్యమృతః. ॥9॥

ప। యః - ఆదిత్యే - తిష్ఠన్ - ఆదిత్యాత్ - అన్తరః - యం - ఆదిత్యః - న - వేద - యస్య - ఆదిత్యః - శరీరం - యః- ఆదిత్యం-అన్తరః - యమయతి - ఏషః- తే-ఆత్మా-అన్తర్యామీ - అమృతః.

ప్ర॥ యః = ఏది, ఆదిత్యే = సూర్యునియందు, తిష్ఠన్ = ఉన్నదై, ఆదిత్యాత్ = సూర్యునికంటె, అన్తరః = లోపలనున్నది, (భవతి = అగుచున్నది). ఆదిత్యః = సూర్యుఁడు, యం = దేనిని, నవేద = తెలిసికొనలేదో, ఆదిత్యః = సూర్యుఁడు, యస్య = దేనికి, శరీరం = దేహమో, యః = ఏది, ఆదిత్యం= సూర్యుని, అన్తరః= లోపలనున్నదై, యమయతి = నియమించుచున్నది. ఏషః=ఇది, తే = నీయొక్క, అమృతః = నాశనరహితమైన, అన్తర్యామీ = అంతర్యామిస్వరూపమగు, ఆత్మా = ఆత్మ, (భవతి = అగుచున్నది).

ఉ॥ యో దిక్షు తిష్ఠ న్దిగ్భ్యోఽన్తరోయం దిశో న విదు ర్యస్య దిశ శ్శరీరం యోదిశోఽన్తరోయమయత్యేష త ఆత్మాన్తర్యామ్య మృతః. ॥10॥

ప॥ యః – దిక్షు – తిష్ఠన్ – దిగ్భ్యః – అన్తరః – యం – దిశః – న – విదుః – యస్య – దిశః – శరీరం – యః – దిశః – అన్తరః – యమయతి – ఏషః – తే – ఆత్మా – అన్తర్యామీ – అమృతః.

ప్ర॥ యః = ఏది, దిక్షు = దిక్కులయందు, తిష్ఠన్ = ఉన్నదై, దిగ్భ్యః = దిక్కులకంటె, అన్తరః = లోపలనున్నది. (భవతి = అగుచున్నదో), దిశః = దిక్కులు, యం = దేనిని, నవిదుః = తెలిసికొనలేవో, దిశః = దిక్కులు, యస్య = దేనికి, శరీరం = దేహమో, యః = ఏది, దిశః = దిక్కులను, అన్తరః = లోపలనున్నదై, యమయతి = నివసించుచున్నదో, ఏషః = ఇది, తే = నీయొక్క, అమృతః = నాశనములేని, అన్తర్యామీ = అంతర్యామిస్వరూపమగు, ఆత్మా = ఆత్మ, (భవతి = అగుచున్నది).

ఉ॥ యశ్చన్ద్రతారకే తిష్ఠగ్ శ్చన్ద్రతారకాదన్తరోయం చన్ద్రతారకం
న వేద యస్య చన్ద్రతారకగ్ శరీరం యశ్చన్ద్రతారకమన్తరో
యమయత్యేష త ఆత్మాన్తర్యామ్యమృతః. ॥11॥

ప॥ యః – చన్ద్రతారకే – తిష్ఠన్ – చన్ద్రతారకాత్ – అన్తరః – యం – చన్ద్రతారకం – న – వేద – యస్య – చన్ద్రతారకం – శరీరం – యః – చన్ద్రతారకం – అన్తరః – యమయతి– ఏషః – తే – ఆత్మా – అన్తర్యామీ – అమృతః.

ప్ర॥ యః = ఏది, చన్ద్రతారకే = చంద్రనక్షత్రములయందు, తిష్ఠన్ = ఉన్నదై, చన్ద్రతారకాత్ = చంద్రనక్షత్రములకంటె, అన్తరః = లోపలనున్నదై, (భవతి = అగుచున్నదో), యం = దేనిని, చన్ద్రతారకం = చంద్రనక్షత్రములు, నవేద = తెలిసికొనలేవో, యస్య = దేనికి, చంద్రతారకం = చంద్రనక్షత్రములు, శరీరం = దేహమో, యః = ఏది, చన్ద్రతారకం = చంద్రనక్షత్రములను, అన్తరః = లోపలనున్నదై, యమయతి = నియమించుచున్నదో,

ఏషః=ఇది. తే=నీయొక్క, అమృతః=నాశనములేని, అన్తర్యామీ=
అంతర్యామిస్వరూపమైన, ఆత్మా = ఆత్మ, (భవతి = అగుచున్నది).

ఉ॥ య ఆకాశే తిష్ఠ న్నాకాశాదన్తరో యమాకాశో న వేద
యస్యాకాశశ్శరీరం య ఆకాశ మన్తరో యమయత్యేష త
ఆత్మాన్తర్యామ్యమృతః. ॥12॥

ప॥ యః - - తిష్ఠన్ - ఆకాశాత్ - అన్తరః -
యం - ఆకాశః - న - వేద - యస్య ఆకాశః - శరీరం - యః -
ఆకాశం-అన్తరః - యమయతి - ఏషః - తే-ఆత్మా-అన్తర్యామీ -
అమృతః.

ప్ర॥ యః = ఏది, ఆకాశే = ఆకాశమునందు, తిష్ఠన్ =
ఉన్నదై, ఆకాశాత్ = ఆకాశమునకంటె, అన్తరః=లోపలనున్నది,
(భవతి = అగుచున్నదో), ఆకాశః = ఆకాశము, యం = దేనిని,
నవేద = తెలిసికొనలేదో, యస్య = దేనికి, ఆకాశః = ఆకాశము,
శరీరం = దేహమో, యః = ఏది, ఆకాశం = ఆకాశమును,
అన్తరః=లోపలనున్నదై, యమయతి=నియమించుచున్నదో, ఏషః=
ఇది, తే = నీయొక్క, అమృతః = నాశనములేని, అన్తర్యామీ=
అంతర్యామిస్వరూపమగు, ఆత్మా = ఆత్మ, (భవతి = అగుచున్నది).

ఉ॥ యస్తమసి తిష్ఠగ్ స్తమసోఽన్తరోయం తమో న వేద యస్య
తమశ్శరీరం యస్తమోఽన్తరో యమయత్యేష త ఆత్మాన్త
ర్యామ్యమృతః ॥13॥

ప॥ యః - తమసి - తిష్ఠన్ - తమసః - అన్తరః - యం -
తమ - న - వేద - యస్య - తమః - శరీరం - యః - తమః -
అన్తరః - యమయతి - ఏషః - తే - ఆత్మా - అన్తర్యామీ -
అమృతః.

ప్ర॥ యః = ఏది, తమసి = చీకటియందు, (ఆవరణాత్మక
మైన బాహ్యామంధలి చీకటియందు). తిష్ఠన్ = ఉన్నదై, తమసః =

చీకటికంటె, అన్తరః = లోపలనున్నది, (భవతి = అగుచున్నది). తమః = చీకటి, యం = దేనిని, నవేద = తెలిసికొనలేదో, యస్య = దేనికి, తమః = చీకటి, శరీరం = దేహమో, యః = ఏది, తమః = చీకటిని, అన్తరః = లోపలనున్నదై, యమయతి = నియమించుచున్నదో, ఏషః = ఇది, తే = నీయొక్క, అమృతః = నాశనములేని, అన్తర్యామీ = అన్తర్యామిస్వరూపమైన, ఆత్మా = ఆత్మ, (భవతి = అగుచున్నది).

ఉ॥ యస్తేజసి తిష్ఠగ్ స్తేజసోఽన్తరోయం తేజో న వేద యస్య తేజశ్శరీరం యస్తేజోన్తరో యమయత్యేష త ఆత్మాన్తర్యామ్య మృతః ఇత్యధిదైవత మథాధిభూతమ్. ॥14॥

ప॥ యః - తేజసి - తిష్ఠన్ - తేజసః - అన్తరః - యం - తేజః - న - వేద - యస్య - తేజః - శరీరం - యః - తేజః - అన్తరః - యమయతి - ఏష - తే - ఆత్మా - అన్తర్యామీ - అమృతః - ఇతి - అధిదైవతం - అథ - అధిభూతం.

ప్ర॥ యః = ఏది, తేజసి = తేజస్సునందు, తిష్ఠన్ = ఉన్నదై, తేజసః = తేజస్సుకంటె, అన్తరః = లోపలనున్నది, (భవతి = అగుచున్నదో), తేజః = తేజస్సు, యం = దేనిని, నవేద = తెలిసికొనలేదో, యస్య = దేనికి, తేజః = తేజస్సు, శరీరం = దేహమో, యః = ఏది, తేజః = తేజస్సును, అన్తరః = లోపలనున్నదై, యమయతి = నియమించుచున్నదో, ఏషః = ఇది, తే = నీయొక్క, అమృతః = నాశనములేని, అన్తర్యామీ = అంతర్యామిస్వరూపమగు, ఆత్మా = ఆత్మ, (భవతి = అగుచున్నది). ఇతి = ఇట్లు, అధిదైవతం = అధిదైవతస్వరూపము, అథ = అనంతరము, అధిభూతం = అధిభూతస్వరూపము, (ఉచ్యతే = చెప్పఁబడుచున్నది).

తా॥ ఓ గౌతముఁడా! అధిదైవతములగు భూమి, ఉదకము, అగ్ని, అన్తరిక్షలోకము, వాయువు, ద్యులోకము, సూర్యుఁడు, చన్ద్రి

తారకములు, ఆకాశము, చీకటి, తేజస్సు వీనిలోపలనుండి వాటి నన్నిటిని నియమించుచు వాటిచే దెలిసికొనఁబడక విలక్షణముగా నుండెడి నాశనరహితమగు అంతర్యామిస్వరూపమే నీ యాత్మయని ఈప్రకారము అధిదైవతమును చెప్పి, అధిభూతమును యాజ్ఞవల్క్యుఁడు చెప్పుచున్నాఁడు.

ఉ॥ యస్సర్వేషు భూతేషు తిష్ఠన్సర్వేభ్యో భూతేభ్యోఽన్తరో యగ్ సర్వాణి భూతాని న విదు ర్యస్య సర్వాణి భూతాని శరీరం యస్సర్వాణి భూతాన్యన్తరో యమయత్యేష త ఆత్మాన్తర్యామ్య మృత ఇత్యధిభూత మథాధ్యాత్మం. ॥15॥

ప॥ యః – సర్వేషు – భూతేషు తిష్ఠన్ – సర్వేభ్యః – భూతేభ్యః – అన్తరః – యం సర్వాణి – భూతాని – న– విదుః – యస్య – సర్వాణి – భూతాని – శరీరం – యః – సర్వాణి–భూతాని– అన్తరః – యమయతి – ఏషః – తే – ఆత్మా – అన్తర్యామీ – అమృతః – ఇతి – అధిభూతం – అథ – అధ్యాత్మం.

ప్ర॥ యః = ఏది, సర్వేషు = సమస్తములైన, భూతేషు = భూతములయందు, (బ్రహ్మాదిస్తంబ పర్యంతముండెడి అన్ని భూతముల యందును), తిష్ఠన్ = ఉన్నదై, సర్వేభ్యః = సమస్తములైన, భూతేభ్యః = భూతములకంటె, అన్తరః = లోపలనుండునది, (భవతి = అగుచున్నదో), సర్వాణి = సమస్తములైన, భూతాని = భూతములు, యం = దేనిని, నవిదుః= తెలిసికొనలేవో, సర్వాణిభూతాని= సమస్తభూతములును, యస్య = దేనికి, శరీరం = దేహమో, యః= ఏది, సర్వాణిభూతాని = సమస్తభూతములను, అన్తరః = లోపల నున్నదై, యమయతి = నియమించుచున్నదో, ఏషః = ఇది, తే = నీయొక్క, అమృతః = నాశనములేని, అన్తర్యామీ = అంతర్యామి స్వరూపమగు, ఆత్మా = ఆత్మ, (భవతి = అగుచున్నది). ఇతి = ఈప్రకారము, అధిభూతం = అధిభూతస్వరూపము, అథ = అనంత

రము, అధ్యాత్మం = అధ్యాత్మస్వరూపము, (ఉచ్యతే = చెప్పఁబడు చున్నది).

తా॥ ఓ గౌతముఁడా ! అధిభూతములగు బ్రహ్మ మొదలు గడ్డిపోచవరకుండెడి సమస్తజీవకోట్లయందుండి వాటినన్నిటిని నియమించుచు వాటిచేఁదెలిసికొనఁబడక విలక్షణమై సర్వాంతరమగు నాశనరహితమైన అన్తర్యామిస్వరూపమే నీ యాత్మయనిచెప్పి యాజ్ఞవల్క్యుఁడు అధ్యాత్మమునందంతర్యామి స్వరూపమును చెప్పు చున్నాఁడు.

ఉ॥ యః ప్రాణే తిష్ఠన్ప్రాణాదన్తరోయం ప్రాణో న వేద యస్య ప్రాణశ్శరీరం యః ప్రాణమన్తరో యమయత్యేష త ఆత్మాన్తర్యామ్యమృతః. ॥16॥

ప॥ యః - ప్రాణే - తిష్ఠన్ - ప్రాణాత్ - అన్తరః - యం- ప్రాణః - న - వేద - యస్య - ప్రాణః - శరీరం - యః - ప్రాణం- అన్తరః - యమయతి - ఏషః - తే - ఆత్మా - అన్తర్యామీ - అమృతః.

ప్ర॥ యః = ఏది, ప్రాణే = ప్రాణమునందు, (ప్రాణవాయువు సహితమైన ఘ్రాణమునందు), తిష్ఠన్ = ఉన్నదై, ప్రాణాత్ = ప్రాణము కంటె, అన్తరః = లోపలనుండునది, (భవతి = అగుచున్నదో), ప్రాణః = ప్రాణము, యం = దేనిని, నవేద = తెలిసికొనలేదో, ప్రాణః = ప్రాణము, యస్య = దేనికి, శరీరం = దేహమో, యః= ఏది, ప్రాణం = ప్రాణమును, అన్తరః=లోపలనున్నదై, యమయతి= నియమించుచున్నదో, ఏషః = ఇది, తే = నీయొక్క, అమృతః = నాశనములేని, అన్తర్యామీ = అంతర్యామిస్వరూపమగు, ఆత్మా = ఆత్మ, (భవతి = అగుచున్నది).

ఉ॥ యో వాచి తిష్ఠన్వాచోఽన్తరోయం వాఙ్న వేద యస్య వాక్శరీరం యో వాచమన్తరో యమయత్యేష త ఆత్మాన్తర్యామ్యమృతః.17

ప॥ యః - వాచి - తిష్ఠన్ - వాచః - అన్తరః - యం - వాక్ - న - వేద - యస్య - వాక్ - శరీరం - యః - వాచం - అన్తరః - యమయతి - ఏషః - తే - ఆత్మా - అన్తర్యామి - అమృతః.

ప్ర॥ యః = ఏది, వాచి = వాక్కునందు, తిష్ఠన్ = ఉన్నదై, వాచః = వాక్కుకంటె, అన్తరః=లోపలనుండునది. (భవతి = అగుచున్నదో), వాక్ = వాక్కు, యం = దేనిని, న వేద = తెలిసికొనలేదో, యస్య = దేనికి, వాక్ = వాక్కు, శరీరం = దేహమో, యః = ఏది, వాచం = వాక్కును, అన్తరః = లోపలనున్నదై, యమయతి = నియమించుచున్నదో, ఏషః = ఇది, తే = నీయొక్క, అమృతః = నాశనములేని, అన్తర్యామీ = అంతర్యామిస్వరూపమగు, ఆత్మా = ఆత్మ స్వరూపము, (భవతి = అగుచున్నది).

ఉ॥ యశ్చక్షుషి తిష్ఠగ్ శ్చక్షుషోఽన్తరోయం చక్షు ర్న వేద యస్య చక్షుశ్శరీరం యశ్చక్షురన్తరో యమయత్యేష త ఆత్మాన్తర్యామ్యమృతః. ॥18॥

ప॥ యః - చక్షుషి - తిష్ఠన్ - చక్షుషః - అన్తరః - యం- చక్షుః - న - వేద - యస్య - చక్షుః - శరీరం - యః - చక్షుః - అన్తరః - యమయతి - ఏషః - తే - ఆత్మా - అన్తర్యామీ - అమృతః.

ప్ర॥ యః = ఏది, చక్షుషి = నేత్రమునందు, తిష్ఠన్ = ఉన్నదై, చక్షుషః = నేత్రముకంటె, అన్తరః = లోపలనుండునది, (భవతి = అగుచున్నదో), చక్షుః = నేత్రము, యం = దేనిని, న వేద = తెలిసికొనలేదో, యస్య = దేనికి, చక్షుః = నేత్రము, శరీరం = దేహమో, యః = ఏది, చక్షుః = నేత్రమును, అన్తరః= లోపలనున్నదై. యమయతి = నియమించుచున్నదో, ఏషః = ఇది, తే = నీయొక్క, అమృతః = నాశనములేని, అన్తర్యామీ = అంత

ర్యామి స్వరూపమగు, ఆత్మా = ఆత్మ, (భవతి = అగుచున్నది).

ఉ॥ యశ్శ్రోత్రే తిష్ఠన్ శ్రోత్రాదన్తరోయగ్ శ్రోత్రం న వేదయస్య శ్రోత్రగ్ శరీరం య శ్శ్రోత్రమన్తరో యమయత్యేష త ఆత్మా న్తర్యామ్య మృతః. ॥19॥

ప॥ యః - శ్రోత్రే - తిష్ఠన్ - శ్రోత్రాత్ - అన్తరః - యం - శ్రోత్రం - న - వేద - యస్య - శ్రోత్రం -శరీరం- యః - శ్రోత్రం - అన్తరః - యమయతి - ఏషః - తే - ఆత్మా - అన్తర్యామీ - అమృతః.

ప॥ యః = ఏది, శ్రోత్రే = చెవియందు, తిష్ఠన్ =ఉన్నదై, శ్రోత్రాత్ = చెవికంటె, అన్తరః = అభ్యంతరమైనది, (భవతి = అగుచున్నదో). శ్రోత్రం = చెవి, యం = దేనిని, నవేద = తెలిసికొనలేదో, శ్రోత్రం = చెవి, యస్య = దేనికి, శరీరం = దేహమో, యః = ఏది, శ్రోత్రం = చెవిని, అన్తరః = అభ్యంతరమైనదై, యమయతి = నియమించుచున్నదో, ఏషః –ఇది, తే = నీయొక్క, అమృతః=నాశనములేని, అన్తర్యామీ= అంతర్యామి స్వరూపమగు, ఆత్మా = ఆత్మ. (భవతి = అగుచున్నది).

ఉ॥ యో మనసి తిష్ఠన్మనసోఽన్తరోయం మనో న వేద యస్య మనః శరీరం యో మనోఽన్తరో యమయత్యేష త ఆత్మాన్తర్యామ్య మృతః. ॥20॥

ప॥ యః - మనసి - తిష్ఠన్ - మనసః - అన్తరః - యం - మనః - న - వేద - యస్య - మనః - శరీరం - యః - మనః - అన్తరః - యమయతి - ఏషః - తే - ఆత్మా - అన్తర్యామీ - అమృతః.

ప్ర॥ యః = ఏది, మనసి = మనస్సునందు, తిష్ఠన్=ఉన్నదై, మనసః = మనస్సుకంటె, అన్తరః = లోపలనుండునది, (భవతి = అగుచున్నదో), మనః = మనస్సు, యం = దేనిని, నవేద = తెలిసి

కొనలేదో, మనః = మనస్సు, యస్య=దేనికి, శరీరం = దేహమో, యః = ఏది, మనః = మనస్సును, అన్తరః = లోపలనుండునదై, యమయతి = నియమించుచున్నదో, ఏషః = ఇది, తే = నీయొక్క, అమృతః = నాశనములేని, అన్తర్యామీ = అంతర్యామి స్వరూపమైన, ఆత్మా = ఆత్మ, (భవతి = అగుచున్నది).

ఉ॥ యస్త్వచి తిష్ఠగ్ స్త్వచోఽన్తరోయం త్వఙ్న వేద యస్య త్వక్శరీరం యస్త్వ చమన్తరో యమయత్యేష త ఆత్మాన్తర్యామ్యమృతః. ॥21॥

ప॥ యః – త్వచి – తిష్ఠన్ – త్వచః – అన్తరః – యం – త్వక్ – న – వేద – యస్య – త్వక్ – శరీరం – యః – త్వచం – అన్తరః – యమయతి – ఏషః – తే – ఆత్మా – అన్తర్యామీ – అమృతః.

ప్ర॥ యః = ఏది, త్వచి =చర్మమునందు, తిష్ఠన్ =ఉన్నదై, త్వచః = చర్మమునకంటె, అన్తరః = లోపలనుండునది, (భవతి = అగుచున్నదో), త్వక్ = చర్మము, యం = దేనిని, నవేద = తెలిసికొనలేదో, యస్య = దేనికి, త్వక్ = చర్మము, శరీరం = దేహమో, యః = ఏది, అన్తరః = లోపలనుండునదియై, త్వచం= చర్మమును, యమయతి = నియమించుచున్నదో, ఏషః = ఇది, తే = నీయొక్క, అమృతః = నాశనములేని, అన్తర్యామీ = అంతర్యామి స్వరూపమగు, ఆత్మా = ఆత్మ, (భవతి = అగుచున్నది).

ఉ॥ యో విజ్ఞానే తిష్ఠ న్విజ్ఞానాదన్తరోయం విజ్ఞానం న వేద యస్య విజ్ఞానగ్ శరీరం యో విజ్ఞానమన్తరో యమయత్యేష త ఆత్మాన్తర్యామ్యమృతః. ॥22॥

ప॥ యః – విజ్ఞానే – తిష్ఠన్ – విజ్ఞానాత్ – అన్తరః –యం – విజ్ఞానం – న – వేద – యస్య – విజ్ఞానం – శరీరం– యః– విజ్ఞానం– అన్తరః – యమయతి – ఏషః – తే – ఆత్మా – అన్తర్యామీ –

అమృతః.

ప్ర॥ యః = ఏది, విజ్ఞానే = విజ్ఞానమునందు, (బుద్ధియందు), తిష్ఠన్ = ఉన్నదై, విజ్ఞానాత్ = బుద్ధికంటె, అన్తరః=లోపలనుండునది, (భవతి = అగుచున్నదో), విజ్ఞానం = బుద్ధి, యం = దేనిని, న వేద = తెలిసికొనలేదో, విజ్ఞానం = బుద్ధి, యస్య = దేనికి, శరీరం = దేహమో, యః = ఏది, విజ్ఞానం = బుద్ధిని, అంతరః = లోపలనుండునదై, యమయతి = నియమించుచున్నదో, ఏషః = ఇది, తే = నీయొక్క, అమృతః = నాశనములేని, అన్తర్యామీ = అంతర్యామి స్వరూపమైన, ఆత్మా = ఆత్మ, (భవతి=అగుచున్నది).

ఉ॥ యో రేతసి తిష్ఠన్రేతసోఽన్తరో యగ్ం రేతో న వేద యస్య రేతశ్శరీరం యో రేతోఽన్తరో యమయత్యేష త ఆత్మాన్తర్యామ్యమృతోఽదృష్టో ద్రష్టాఽశ్రుతః శ్రోతాఽమతో మన్తాఽవిజ్ఞాతో విజ్ఞాతా నాన్యోఽతోఽస్తి ద్రష్టా నాన్యోఽతోఽస్తి శ్రోతా నాన్యోఽతోఽస్తి మన్తా నాఽన్యోఽతోఽస్తి విజ్ఞాతైష త ఆత్మాన్తర్యామ్యమృతోఽతోఽన్యదార్తం తతో హోద్దాలక ఆరుణిరుపరరామ. ॥23॥

ఇతి బృహదారణ్యకే - పఞ్చమాధ్యాయే - సప్తమంబ్రాహ్మణమ్.

ప॥ యః - రేతసి - తిష్ఠన్ - రేతసః - అన్తరః - యం - రేతః - న - వేద - యస్య - రేతః - శరీరం - యః-రేతః - అన్తరః - యమయతి - ఏషః - తే - ఆత్మా - అన్తర్యామీ - అమృతః - అదృష్టః - ద్రష్టా - అశ్రుతః - శ్రోతా - అమతః - మన్తా - అవిజ్ఞాతః - విజ్ఞాతా - న - అన్యః - అతః - అస్తి - ద్రష్టా - న - అన్యః - అతః - అస్తి - శ్రోతా - న - అన్యః - అతః - అస్తి -మన్తా - న - అన్యః - అతః - అస్తి - విజ్ఞాతా - ఏషః - తే - ఆత్మా - అన్తర్యామీ - అమృతః - అతః-అన్యత్ - ఆర్తం - తతః - హ - ఉద్దాలకః - ఆరుణిః - ఉపరరామ.

ప్ర॥ యః = ఏది, రేతసి = రేతస్సునందు, (ప్రజననమందు= ఉత్పత్తియందు), తిష్ఠన్ = ఉన్నదై, రేతసః = రేతస్సుకంటె, అన్తరః = లోపలనుండునది, (భవతి = అగుచున్నది). రేతః = రేతస్సు, యం = దేనిని, నవేద = తెలిసికొనలేదో, రేతః = రేతస్సు, యస్య = దేనికి, శరీరం = దేహమో, యః = ఏది, రేతః = రేతస్సును, అన్తరః = లోపలనుండునదై, యమయతి = నియమించుచున్నదో, ఏషః = ఇది, తే = నీయొక్క, అమృతః = నాశనములేని, అన్తర్యామీ = అన్తర్యామిస్వరూపమగు, ఆత్మా = ఆత్మ, (భవతి = అగుచున్నది). (ఏ కారణమువలన పృథివ్యాది దేవతలు తమ్ము నియమించుచు తమయందున్నటువంటి అంతర్యామి స్వరూపమును తెలిసికొనలేవు. అనఁగాఁ జెప్పుచున్నాఁడు). (సః = ఆ అంతర్యామి స్వరూపమైన ఆత్మ), అదృష్టః = నేత్రముయొక్క చూపునకు కనఁబడనిదై, ద్రష్టా = చూచునదియును, (నేత్రమునకు సమీపమగుటవలన దృక్స్వరూపమైయున్నది). అశ్రుతః = చెవికివినఁబడనిదై, శ్రోతా = వినునదియును, (శ్రోత్రమునకు సమీపమైనదగుటవలన శ్రోతయైనదియును), అమతః = మనస్సంకల్పమునకు గోచరముకానిదై, మన్తా = సంకల్పించునదియును, మనస్సునందు సమీపించి యున్నదగుటవలన సంకల్పించునదియును), అవిజ్ఞాతః = నిశ్చయమునకు విషయముకానిదై, విజ్ఞాతా = నిశ్చయించునదియును, (లోపములేని విజ్ఞానముకలదియై సమీపించి యున్నదగుటవలన తెలిసికొన నిశ్చయించునది అగుచున్నది). అతః = ఈ అంతర్యామిస్వరూపముకంటె, అన్యః = వేఱైన, ద్రష్టా = చూచునది, నాస్తి = లేదు, అతః = ఈ అంతర్యామికంటె, అన్యః = వేఱైన, శ్రోతా = వినునది, నాస్తి = లేదు. అతః = ఈ అంతర్యామికంటె, అన్యః = వేఱైన, మన్తా = సంకల్పించునది, నాస్తి= లేదు. అతః= ఈ అంతర్యామికంటె. అన్యః = వేఱైన, విజ్ఞాతా= తెలిసికొనునది,

నాస్తి = లేదు. అమృతః = నాశనములేని, ఏషః = ఇది, తే = నీ యొక్క, అన్తర్యామీ = అన్తర్యామిస్వరూపమైన, ఆత్మా=ఆత్మ, (భవతి = అగుచున్నది). అతః = ఈ పరమాత్మయగు అంతర్యామి స్వరూపముకంటె, అన్యత్ = ఇతరమైనది, ఆర్తం = నశించునది. తతోహ = అందువలన, (ఈ ప్రకారము ప్రశ్నమును నిర్ణయించి చెప్పుటవలన), ఆరుణిః = అరుణపుత్రుఁడగు, ఉద్దాలకః = ఉద్దాలకుఁడు, ఉపరరామ = వేఱుప్రశ్నమునుచేయక యూరకయుండెను.

తా॥ ఓ ఉద్దాలకుఁడా! అధ్యాత్మస్వరూపములగు ప్రాణ వాక్చక్షుస్సులు మొదలైనవాటియందున్నదై, వానిచేతఁ దెలిసికొనఁబడక అవియే దేహముగాఁగలిగి వాటివాటిని నియమించుచు నాశనరహితమైన అంతర్యామి స్వరూపమగునాత్మ, చూపునకును, వినికికిని, తలంపునకును, బుద్ధిజ్ఞానమునకును, గోచరముకానిదై ఆ చక్షురాదీంద్రియములకు సమీపమైనదగుటవలన చూచునదియును వినునదియును తలంచునదియును తెలిసికొనునదియు నగుచున్నది. ఇట్లు సమస్తమునకు ద్రష్టయై దేనిచేతనున్ను చూడఁబడక సర్వాంతరమై అంతర్యామి స్వరూపమునగు పరమాత్మకంటె అన్యమగు ద్రష్టయును, శ్రోత్రయును, మన్తయును, విజ్ఞాతయును, ఏకారణమువలన లేదో ఆ కారణమువలన నాశనరహితమును, సమస్తమైన సంసారులయొక్క కర్మఫలములను విభజించునట్టినదియును, సమస్త సంసారధర్మము లేనిదియునగు ఈ ఆత్మ ఏదియో ఇదే నీయొక్క నాశనరహితమగు అంతర్యామి స్వరూపము. ఇట్టి అంతర్యామి స్వరూపమగు పరమాత్మకంటె వేరైనది యంతయు నశించునదియె అని యాజ్ఞవల్క్యుఁడు తానుచేసిన ప్రశ్నమును నిరూపించి చెప్పుటవలన అరుణపుత్రుఁడగు ఉద్దాలకుఁడు వేఱు ప్రశ్నమును చేయకయుండెను.

ఇట్లు పఞ్చమాధ్యాయము సప్తమబ్రాహ్మణము సమాప్తము.

పఞ్చమాధ్యాయము - అష్టమబ్రాహ్మణము

ఉ॥ అథ హ వాచక్నవ్యువాచ బ్రాహ్మణా భగవన్తో హన్తాహమిమం ద్వౌ ప్రశ్నౌ ప్రక్ష్యామి తౌ చేన్మే వక్ష్యతి న వై జాతు యుష్మాకమిమం కశ్చిద్బ్రహ్మోద్యం జేతేతి పృచ్ఛ గార్గీతి. ॥1॥

ప॥ అథ - హ - వాచక్నవీ - ఉవాచ - బ్రాహ్మణాః - భగవన్తం - హన్త - అహం - ఇమం - ద్వౌ - ప్రశ్నౌ - ప్రక్ష్యామి - తౌ - — - మే - వక్ష్యతి - న - వై - జాతు - యుష్మాకం - ఇమం - కః - చిత్ - బ్రహ్మోద్యం - జేతా - ఇతి- పృచ్ఛ - గార్గి - ఇతి.

ప్ర॥ అథహ = అనంతరము, వాచక్నవీ = వచక్నుని పుత్రికయగు గార్గి, ఉవాచ = పలికెను. హేబ్రాహ్మణాః = ఓ బ్రాహ్మణులారా! భగవన్తః = పూజావంతులైనమీరు, (శృణుత = వినుఁడీ), హన్త = మీకు అనుమతియైనయెడల, అహం = నేను, ఇమం = ఈ యాజ్ఞవల్క్యుని, ద్వౌప్రశ్నౌ = రెండుప్రశ్నలను, ప్రక్ష్యామి = అడిగెదను. తౌ = ఆ ప్రశ్నలను, మే = నాకు, వక్ష్యతిచేత్ = చెప్పినయెడల, యుష్మాకం = మీలోపల, కశ్చిత్ = ఎవఁడును, ఇమం = ఈ యాజ్ఞవల్క్యుని, బ్రహ్మోద్యం = బ్రహ్మసంబంధవాదమునుగూర్చి, జాతు = ఒకానొకప్పుడును, జేతా = జయించువాఁడు, న వై = లేఁడు. ఇతి = అని, (గార్గిపలికెను). హేగార్గి = ఓగార్గీ! (త్వం = నీవు), పృచ్ఛేతి = అడుగుమాయని, (బ్రాహ్మణులు పలికిరి).

తా॥ ఉద్దాలకుఁడు ఊరకున్న తరువాత పూర్వము శిరః పతన భయమువలన ఊరకయున్న గార్గి మరల పూజ్యులగు ఓ బ్రాహ్మణులారా! మీరు అంగీకరించితిరేని నేను ఈ యాజ్ఞవల్క్యుని రెండు ప్రశ్నములను అడిగెదను. ఆ ప్రశ్నములను గూర్చి యాజ్ఞవల్క్యుఁడుత్తరమును చెప్పినయెడల మీలో నెవరును బ్రహ్మసంబంధవాదమును

గూర్చి ఈ యాజ్ఞవల్క్యుని జయించువారు లేరు అని పలికి బ్రాహ్మణులను ప్రార్థింపగా బ్రాహ్మణులు, ఓగార్గీ! ఆ ప్రకారమే అడుగుమా యని పలికిరి.

ఉ॥ సా హోవాచాహం వై త్వా యాజ్ఞవల్క్య యథా కాశ్యో వా వైదేహో వోగ్ర పుత్ర ఉజ్జ్యం ధనురధిజ్యం కృత్వా ద్వౌ బాణవన్తౌ సపత్నాతి వ్యాధినౌ హస్తే కృత్వోపోత్తిష్ఠే దేవమేవాహం త్వాం ద్వాభ్యాం ప్రశ్నాభ్యా ముపోదస్థాం తౌ మే బ్రూహీతి పృచ్ఛ గార్గీతి. ॥2॥

ప॥ సా - హ - ఉవాచ - అహం - వై - త్వా - యాజ్ఞవల్క్య - యథా - కాశ్యః - వా - వైదేహః - వా - ఉగ్రపుత్రః - ఉజ్జ్యం - ధనుః - అధిజ్యం - కృత్వా - ద్వౌ - బాణవన్తౌ - సపత్నాతివ్యాధినౌ - హస్తే - కృత్వా - ఉపోత్తిష్ఠేత్ - ఏవం - ఏవ - అహం - త్వాం - ద్వాభ్యాం - ప్రశ్నాభ్యాం - ఉపోదస్థాం - తౌ - మే - బ్రూహి - ఇతి - పృచ్ఛ - గార్గి - ఇతి.

ప్ర॥ సా = ఆ గార్గి, హోవాచ = పలికెను. హే యాజ్ఞవల్క్య = ఓ యాజ్ఞవల్క్యుఁడా! అహంవై = నేను, త్వా=నిన్ను, (ద్వౌప్రశ్నౌ = రెండు ప్రశ్నములను, ప్రక్ష్యామి = అడిగెదను). కాశ్యోవా = కాశీదేశమునందు పుట్టినవాఁడైనను, వైదేహోవా = విదేహదేశమునందు పుట్టినవాఁడైనను నగు, ఉగ్రపుత్రః = శూరవంశమునందు పుట్టిన రాజపుత్రుఁడు, ఉజ్జ్యం = దింపఁబడిననారిగల, ధనుః = ధనుస్సును, అధిజ్యం = తిరిగి యెక్కు పెట్టఁబడిన నారికలదానినిగా, కృత్వా = చేసి, సపత్నాతివ్యాధినౌ = శత్రువులను మిక్కిలి వ్యథపెట్టుచుండెడి, ద్వౌ = రెండైన, బాణవన్తౌ = కొనయందు వెదురుఖండముగల శరములను, (ఇక్కడ బాణశబ్దమునకు వెదురుఖండమర్థము), హస్తే = హస్తమునందు, కృత్వా = చేసికొని, (హస్తమునందుంచుకొని), యథా = ఏప్రకారము, ఉపోత్తి

ష్ఠేత్ = సమీపముగా నుండునో, (తన్ను సమీపముగాఁజూపిం చునో) ఏవమేవ = ఈ ప్రకారముగానే, అహం = నేను, త్వాం = నిన్ను, ద్వాభ్యాం = రెండైన, ప్రశ్నాభ్యాం = ప్రశ్నములచేతను, ఉపోదస్థాం = సమీపించితిని. (నీ సమీపమునందు లేచితిని), తౌ = ఆ ప్రశ్నములను, మే = నాకొఱకు, బ్రూహి = చెప్పుమా, ఇతి = అని, (గార్గి అడిగెను). హేగార్గీ = ఓగార్గీ, పృచ్ఛ = అడుగుమా, ఇతి = అని. (యాజ్ఞవల్క్యుఁడు పలికెను).

తా॥ ఇట్లు గార్గి బ్రాహ్మణానుజ్ఞను పొంది యాజ్ఞవల్క్యుని అడిగెను. ఓ యాజ్ఞవల్క్యుఁడా! కాశీ విదేహ దేశములయందైన శూరవంశమునందు పుట్టిన రాజపుత్రుఁడు ధనుస్సు నెక్కు పెట్టుకొని శత్రువులను వ్యథ పెట్టునట్టి రెండు మంచి బాణములను హస్తమునం దుంచుకొని యెట్లు శత్రువును సమీపించునో ఆ ప్రకారముగానే నేను నిన్ను రెండు శ్రేష్ఠములైన ప్రశ్నములతో సమీపించియు న్నాను. నీవు బ్రహ్మవేత్తవు అయితివేని ఆ ప్రశ్నలకు సమాధానము లను నాకు చెప్పుమా యని గార్గి అడుగఁగా, యాజ్ఞవల్క్యుఁడు, ఓ గార్గీ! ప్రశ్నను చేయుమా యని మరల పలికెను.

ఉ॥ సా హోవాచ యదూర్ధ్వం యాజ్ఞవల్క్య దివోయదవాక్పృథి
వ్యా యదన్తరా ద్యావాపృథివీ ఇమే యద్భూతం చ భవచ్చ భ
విష్యచ్చేత్యా చక్షతే కస్మిగ్ స్తదోతం చ ప్రోతం చేతి. ॥3॥

ప॥ సా - హోవాచ - యత్ - ఊర్ధ్వం - యాజ్ఞవల్క్య - దివః - యత్ - అవాక్ - పృథివ్యాః - యత్ - అన్తరా - ద్యావాపృథివీ - ఇమే - యత్ - భూతం - చ -భవత్ - చ - భవిష్యత్ - చ - ఇతి - ఆచక్షతే - కస్మిన్ - తత్ - ఓతం -చ- ప్రోతం - చ - ఇతి.

ప్ర॥ సా = ఆ గార్గి, హోవాచ = పలికెను. హే యాజ్ఞ వల్క్య = ఓ యాజ్ఞవల్క్యుఁడా! దివః = ద్యులోకముకంటె, (అణ్డ

కపాలముకంటె), ఊర్ధ్వం = పైన, యత్ = ఏదియో, పృథివ్యాః= భూమికంటె, అవాక్ = క్రిందుగాను, (అండకపాలముకంటె క్రిందు గాను), యత్ = ఏదియో, అన్తరా = అండకపాలముల యొక్క మధ్యమునందు, ఇమేద్యావాపృథివీ = ఈ భూమ్యంతరిక్షములు, యత్ = ఏదియో, భూతంచ = గడిచిపోయినదియును, భవచ్చ = ప్రవర్తించుచున్నదియును, భవిష్యచ్చ = ముందు రాఁబోవునద యును, యత్ = ఏదియో, ఇతి = ఈ సమస్తమున్ను, (ఆగమము వలన దేనియందు ఏకీభవించియున్నదని), ఆచక్షతే = చెప్పుచు న్నారో, తత్ = ఆ సమస్తము, కస్మిన్ = దేనియందు, ఓతంచ = పడుగుగాను, ప్రోతంచ = పేకగాను, (వస్త్రముయొక్క పడుగు పేకలు వలెనే కల్పింపఁబడినది), ఇతి = అని, (గార్గి అడిగెను).

తా॥ ఓ యాజ్ఞవల్క్యుఁడా! బ్రహ్మాండముకంటె ఉపరి భాగ మునందును క్రింది భాగమునందును మధ్యమునందును భూతమును, వర్తమానమును,భవిష్యత్తును నగు ద్వైతమైన ఈ సమస్తమును దేని యందు ఏకీభవించియున్నదని ఆగమ న్యాయము వలన చెప్పుదురో, అట్టి సమస్తమును దేనియందు, వస్త్రముయొక్క పడుగు పేకలు వలెనే, ఏకముగాఁ గల్పింపఁబడియున్నదని గార్గి యడిగెను.

ఉ॥ స హోవాచ యదూర్ధ్వం గార్గి దివో యదవాక్పృథివ్యా యద
న్తరా ద్యావాపృథివీ ఇమే యద్భూతం చ భవచ్చ భవిష్య
చ్చేత్యాచక్షతే ఆకాశే తదోతం చ ప్రోతం చేతి. ॥4॥

ప॥ సః – హోవాచ – యత్ – ఊర్ధ్వం – గార్గి – దివః – యత్ – అవాక్ – పృథివ్యాః – యత్ – అన్తరా – ద్యావాపృ థివీ – ఇమే – యత్ – భూతం – చ – భవత్ – చ – భవిష్యత్ – చ – ఇతి – ఆచక్షతే – ఆకాశే – తత్ – ఓతం – చ – ప్రోతం – చ – ఇతి.

ప్ర॥ సః = ఆ యాజ్ఞవల్క్యుఁడు, హోవాచ = పలికెను,

హేగార్గి = ఓ గార్గీ, దివః = ద్యులోకముకంటె, ఊర్ధ్వం = మీఁదను, యత్ = ఏదియో. పృథివ్యాః = భూమికంటె, అవాక్ = క్రిందను, అన్తరా = మధ్యమునందు. (అణ్డముయొక్క ఊర్ధ్వాధో కపాలములగు ద్యావాపృథువులయొక్క మధ్యమునందు), ఇమేద్యావాపృథివీ = ఈ ఆకాశ భూములు, యత్ = ఏదియో, భూతం = గడిచిపోయినదియును, భవచ్చ = ప్రవర్తించుచున్నదియును, భవిష్యచ్చ = ముందు కలుగపోవునదియును, యత్ = ఏదియో, (తత్సర్వం = ఆ సమస్తమును, యత్ = ఏసూత్రము), ఇతి = అని, ఆచక్షతే = చెప్పుచున్నారో. తత్ = ఆ సూత్రము, ఆకాశే = ఆకాశమునందు, ఓతంచప్రోతంచ = వస్త్రముయొక్క పడుగుపేకలు వలెనే కల్పింపఁబడినది, ఇతి = అని, (యాజ్ఞవల్క్యుఁడు పలికెను).

తా॥ ఓగార్గీ! బ్రహ్మాండమునకంటె ఊర్ధ్వభాగమునందును క్రిందిభాగమునందును మధ్యమునందును భూతమును వర్తమానమును భవిష్యత్తునునగు వ్యాకృతమునైన సూత్రాత్మకమగు జగత్తంతయు దేనియందు ఏకముగాఁ గల్పింపఁబడియున్నదని చెప్పుదురో అట్టి సూత్రము అవ్యాకృతాకాశమునందు ఉత్పత్తి స్థితి లయ కాలములయందు వస్త్రముయొక్క పడుగుపేకలువలెనే ఏకముగాఁ గల్పింపఁబడియున్నదని యాజ్ఞవల్క్యుఁడు పలికెను.

ఉ॥ సా హోవాచ నమస్తేఽస్తు యాజ్ఞవల్క్య యో మ ఏతం
వ్యవోచో ఽపరస్మై ధారయస్వేతి పృచ్ఛ గార్గీతి. ॥5॥

ప॥ సా - హోవాచ - నమః - తే - అస్తు-యాజ్ఞవల్క్య-యః - మే - ఏతం - వ్యవచః - అపరస్మై - ధారయస్వ - ఇతి - పృచ్ఛ - గార్గి - ఇతి.

ప్ర॥ సా = ఆ గార్గి, హోవాచ = పలికెను. హే యాజ్ఞవల్క్య = ఓ యాజ్ఞవల్క్యుఁడా, యః = ఏ, (త్వం = నీవు), ఏతం = ఈ ప్రశ్నమును, మే = నాకు, వ్యవచః = విశేషముగాఁ

జెప్పితివో. (తస్మై = అటువంటి), తే = నీకొఱకు, నమః = నమస్కారము, అస్తు = అగునుగాక. పరస్మై = ఇంకొక ప్రశ్నము కొఱకు, (ఆత్మానం = నన్ను), ధారయస్వ = దృఢముగాఁ జేయుము, ఇతి = అని, (గార్గి పలికెను). హేంగార్గి = ఓ గార్గీ! (త్వం = నీవు), పృచ్ఛ = అడుగుము, ఇతి = అని, (యాజ్ఞవల్క్యుఁడు పలికెను).

తా॥ ఓ యాజ్ఞవల్క్యుఁడా! నీవు నేను అడిగిన ప్రశ్నమును విశేషముగా నాకు చెప్పితివి, గనుక నీకొఱకు నమస్కరించుచున్నాను. ఇంకొక ప్రశ్నము చేయుటకు నన్ను ధైర్యము కలదానినిగాఁ జేయుము, అని గార్గి పలుకగా ఓ గార్గీ! నీవు ప్రశ్నమును అడుగుమాయని యాజ్ఞవల్క్యుఁడు పలికెను.

ఉ॥ సా హోవాచ యదూర్ధ్వం యాజ్ఞవల్క్య దివోయదవాక్పృథి
వ్యా యదన్తరా ద్యావాపృథివీ ఇమే యద్భూతం చ భవ చ్చ
భవిష్యచ్చేత్యాచక్షతే కస్మిగ్ స్తదోతం చ ప్రోతం చేతి. ॥6॥

ప॥ సా – హోవాచ – యత్ – ఊర్ధ్వం – యాజ్ఞవల్క్య – దివః – యత్ – అవాక్ – పృథివ్యాః – యత్ – అన్తరా – ద్యావాపృథివీ – ఇమే – యత్ – భూతం – చ – భవత్ – చ – భవిష్యత్ – చ – ఇతి – ఆచక్షతే – కస్మిన్ – తత్ – ఓతం – చ – ప్రోతం – చ – ఇతి.

ప్ర॥ సా = ఆగార్గి, హోవాచ = పలికెను, హే యాజ్ఞవల్క్య = ఓ యాజ్ఞవల్క్యుఁడా! దివః = ద్యులోకము కంటె, (అండకపాలముకంటె), ఊర్ధ్వం = మీఁదను, యత్ = ఏదియో, పృథివ్యాః=భూమికంటె, అవాక్ = క్రిందుగాను, (అండ కపాలము కంటే క్రిందుగాను), యత్ = ఏదియో, అంతరా = (అండ కపాలములయొక్క మధ్యమునందు, ఇమేద్యావాపృథివీ = ఈ భూమ్యన్తరిక్షములు, యత్ = ఏదియో, భూతంచ = గడిచిపోయినదియును, భవచ్చ = జరుగుచున్నదియును, భవిష్యచ్చ = ముందు కలుగ

బోవునదియును, యత్ = ఏదియో, (తత్సర్వం= ఆ సమస్తమును,
యత్ = ఏసూత్రము) ఇతి = అని, ఆచక్షతే = చెప్పుచున్నారో,
తత్ = ఆ సూత్రము, కస్మిన్ = దేనియందు, ఓతంచప్రోతంచ =
వస్త్రముయొక్క పడుగుపేకలువలెనే కల్పింపఁబడినది. ఇతి = అని,
(గార్గి ప్రశ్నచేసెను).

తా॥ ఓ యాజ్ఞవల్క్యుఁడా! బ్రహ్మాండముకంటె ఊర్ధ్వ
భాగమునందును క్రిందిభాగమునందును మధ్యమునందును భూతమును
వర్తమానమును భవిష్యత్తును నగు ఈ సమస్తమును ఏ సూత్రమని
చెప్పుచున్నారో అది దేనియందు వస్త్రముయొక్క పడుగుపేకలు
వలెనే కల్పింపఁబడినదియని గార్గి ప్రశ్నచేసెను.

ఉ॥ స హోవాచ యదూర్ధ్వం గార్గి దివో యదవా క్పృథివ్యా య
దన్తరా ద్యావాపృథివీ ఇమే యద్భూతం చ భవచ్చ భవిష్య
చ్చే త్యాచక్షతే ఆకాశ ఏవ తదోతం చ ప్రోతం చేతి కస్మిన్ను
ఖల్వాకాశ ఓతశ్చ ప్రోతశ్చేతి. ॥7॥

ప॥ సః – హోవాచ – యత్ – ఊర్ధ్వం – గార్గి – దివః –
యత్ – అవాక్ – పృథివ్యాః – యత్ –అన్తరా – ద్యావాపృథివీ –
ఇమే – యత్ – భూతం – చ – భవత్ – చ – భవిష్యత్ – చ –
ఇతి – ఆచక్షతే – ఆకాశే – ఏవ – తత్ – ఓతం – చ –ప్రోతం–
చ – ఇతి – కస్మిన్ – ను – ఖలు – ఆకాశః – ఓతః – చ–ప్రోతః–
చ – ఇతి.

ప్ర॥ సః = ఆ యాజ్ఞవల్క్యుఁడు, హోవాచ = పలికెను.
హేగార్గి = ఓ గార్గీ, దివఃఊర్ధ్వం = ద్యులోకముకంటె మీఁదు
గాను, యత్ = ఏదియో, అవాక్పృథివ్యాః = భూమికంటె క్రిందు
గాను, యత్ = ఏదియో, అన్తరా = బ్రహ్మాండ ఊర్ధ్వాధో భాగ
ములయొక్క మధ్యయందును, ఇమేద్యావాపృథివీ = ఈ భూమ్యంత
రిక్షములు, యత్ = ఏదియో, భూతంచ = భూతమును, భవచ్చ=

వర్తమానమును, భవిష్యచ్చ = ముందు కలుగఁబోవునదియును, యత్ = ఏదియో, (తత్సర్వం = ఆసమస్తమును, యత్ = ఏ సూత్రము), ఇతి = అని, ఆచక్షతే = చెప్పుచున్నారో, తత్ = సూత్రస్వరూపమగు ఆ సమస్తము, ఆకాశఏవ = ఆకాశమునందే, ఓతంచప్రోతంచ = వస్త్రముయొక్క పడుగుపేకలువలెనే కల్పింపఁబడినది, ఇతి = అని, (యాజ్ఞవల్క్యుఁడు పలికెను). ఆకాశః = ఆకాశము, కస్మిన్నుఖలు = దేనియందు, ఓతశ్చప్రోతశ్చేతి = వస్త్రముయొక్క పడుగుపేకలువలెనే కల్పింపఁబడియున్నదని, (గార్గి మరల ప్రశ్నముచేసెను).

తా॥ ఓ గార్గి! బ్రహ్మాండముయొక్క ఊర్ధ్వాధోభాగముల యందును మధ్యభాగమునందును భూతమును భవిష్యత్తును వర్తమానమునగు ఈ సూత్రరూపమైన సమస్తమును దేనినిగాఁ జెప్పుచున్నారో ఆ సూత్రరూపమగు సర్వమును అవ్యాకృతమగు ఆకాశమునందు పడుగుపేకలుగాఁ కల్పింపఁబడియున్నదని యాజ్ఞవల్క్యుఁడు చెప్పగా, గార్గి, అవ్యాకృతాకాశ స్వరూపము అవాచ్యముగనుక అప్రతిపత్తియని, (పొందనశక్యము), అవాచ్యమైన దానిని చెప్పిన యెడల విప్రతిపత్తియని, రెండు దోషములు కలుగుచున్నవి. ఆ దోషములను పరిహరించి చెప్పుట శక్యమని తలంచి ప్రశ్న చేయుచున్నది. ఓ యాజ్ఞవల్క్యుఁడా! ఆ అవ్యాకృతాకాశము దేనియందు పడుగు పేకవలెనే కల్పింపఁబడియున్నదని ప్రశ్న చేసెను.

ఉ॥ స హోవాచైతద్వై తదక్షరం గార్గి బ్రాహ్మణా అభివదన్త్య స్థూల మనణ్వహ్రస్వ మదీర్ఘ మలోహిత మస్నేహ మచ్ఛాయ మతమోఽవాయ్వనాకాశ మసఙ్గ మరస మగన్ధ మచక్షుష్క మశ్రోత్ర మవాగమనోఽతేజస్క మప్రాణ మముఖ మమాత్ర మనన్తర మబాహ్యం న తదశ్నాతి కించన న తదశ్నాతి కశ్చన. ॥8॥

ప॥ సః - హోవాచ - ఏతత్ - వై - ఏతత్ - అక్షరం - గార్గి - బ్రాహ్మణాః - అభివదన్తి - అస్థూలం - అనణు - అహ్ర స్వం - అదీర్ఘం - అలోహితం - అస్నేహం - అచ్ఛాయం - అత మః - అవాయుః - అనాకాశం - అసఙ్గం - అరసం - అగన్ధం - అచక్షుష్కం - అశ్రోత్రం - అవాక్ - అమనః - అతేజస్కం - అప్రాణం - అముఖం - అమాత్రం - అనన్తరం - అబాహ్యం - న - తత్ - అశ్నాతి - కించన - న - తత్ - అశ్నాతి - కః - చన.

ప్ర॥ సః =ఆ యాజ్ఞవల్క్యుఁడు, హోవాచ = పలికెను; హే గార్గి = ఓగార్గీ, ఏతద్వైతత్ =ఈ పూర్వోక్తమైనదీనినే, అక్షరం = అక్షరస్వరూపమునుగా, బ్రాహ్మణాః = బ్రాహ్మణులు, (బ్రహ్మ వేత్తలు), అభివదన్తి = చెప్పుచున్నారు. (తత్ = ఆ అక్షరస్వరూ పము), అస్థూలం = లావుకాదు, అనణు = సూక్ష్మముకాదు అహ్రస్వం = పొట్టిదిగాదు. అదీర్ఘం = పొడుగుకాదు, అలోహితం= ఎఱుపుకాదు; అస్నేహం = ఉదకములయొక్క స్నేహముకాదు. అచ్ఛాయం = నీడకాదు. అతమః = చీఁకటికాదు. అవాయుః = వాయువుకాదు. అనాకాశం = ఆకాశముకాదు, అసఙ్గం = కలిసి కొనునదికాదు. అరసం = రసములేనిది. అగన్ధం = గంధములేనిది. అచక్షుష్కం = నేత్రములేనిది. అశ్రోత్రం = చెవిలేనిది. అవాక్ = వాక్కులేనిది. అమనః = మనస్సులేనిది. అతేజస్కం = తేజస్సు లేనిది. అప్రాణం = ప్రాణవాయువులేనిది. అముఖం = ముఖము లేనిది. అమాత్రం = పరిమితికానిది. అనన్తరం = వ్యవధిలేనిది. అబాహ్యం = వెలుపలలేనిది. తత్ = అది, కించన = దేనినిన్ని, నాశ్నాతి = భక్షించదు. కశ్చన = ఎవఁడున్ను, తత్ = దానిని నాశ్నాతి = భక్షించఁడు.

తా॥ ఓ గార్గీ! నీవు ఆ అవ్యాకృతాకాశము దేనియందు పడుగుపేకలవలెఁ గల్పింపఁబడి యున్నదని దేనిని అడిగితివో, అది

నశించనిదిగనుక అక్షరస్వరూపమునుగా బ్రహ్మవేత్తలు చెప్పుచు న్నారు. ఇట్లు బ్రహ్మవేత్తలు పలుకుచున్నారని చెప్పుటచేత పూర్వము కలిగిన అప్రతిపత్తి విప్రతిపత్తులనెడి దోషద్వయమును పరిహరించుచు, యాజ్ఞవల్క్యుడు పలుకగా, గార్గి, ఓ యాజ్ఞవల్క్యుడా! ఆ అక్ష రమనునది యేదియని ప్రశ్నముచేసెను. ఓ గార్గి ఆ అక్షరము స్థూలము కాదు. సూక్ష్మముకాదు. పొట్టిది కాదు. పొడుగు కాదు. ఇట్లు పదార్థ ధర్మములగు ఈ నాలుగింటిని నిషేధించుటచేత ద్రవ్య ము కాదు గనుక నశించని అక్షరస్వరూపము, మఱియు అగ్నియొక్క గుణమైనలోహితమును కాదు. ఉదకములయొక్క గుణమైన స్నేహమును కాదు. ఛాయయును కాదు. తమస్సును కాదు, వాయువును కాదు. ఆకాశమును కాదు, లక్కవలెనే వేరు వస్తువును అంటుకొనునది కాదు. రసమును కాదు. గంధమును కాదు. దీనికి నేత్రేంద్రియమును లేదు. శ్రోత్రేంద్రియమును లేదు. వాక్కును లేదు. మనస్సును లేదు. అగ్ని మొదలైనవాటికివలెనే ప్రకాశమును లేదు. ప్రాణమును లేదు. ముఖమును లేదు. పరిమితియును లేదు. రంధ్రమును లేదు. బాహ్య మును లేదు. దేనిని తినునది కాదు. దీనిని ఏదియును తినదు. ఇట్లు ఆ అక్షరస్వరూపము సమస్త విశేషణముల రహితమై ఏకమును అద్వి తీయమునై యున్నదియని యాజ్ఞవల్క్యుడు చెప్పెను.

ఉ॥ ఏతస్య వా అక్షరస్య ప్రశాసనే గార్గి సూర్యాచన్ద్రమసౌ విధృతౌ తిష్ఠతః ఏతస్య వా అక్షరస్య ప్రశాసనే గార్గి ద్యావా పృథివ్యౌ విధృతే తిష్ఠతః ఏతస్య వా అక్షరస్య ప్రశాసనే గార్గి నిమే షా ముహూర్తా అహోరాత్రాణ్యర్ధ మాసా మాసా ఋతవః సంవ త్సరా ఇతి విధృతా స్తిష్ఠన్త్యే తస్య వా అక్షరస్య ప్రశాసనే గార్గి ప్రాచ్యోనద్యః స్యన్దన్తే శ్వేతేభ్యః పర్వతేభ్యః ప్రతీచ్యోఽన్యా యాం యాం చ దిశ మన్వే తస్య వా అక్షరస్య ప్రశాసనే గార్గి దదతో మనుష్యాః ప్రశగ్ సన్తి యజమానం దేవా దర్వీం పిత

రోఽన్వాయత్తాః. ॥9॥

ప॥ ఏతస్య – వై – అక్షరస్య – ప్రశాసనే – గార్గి – సూర్యాచన్ద్రమసౌ – విధృతౌ – తిష్ఠతః – ఏతస్య – వై – అక్షరస్య – ప్రశాసనే – గార్గి – ద్యావాపృథివ్యౌ – విధృతే – తిష్ఠతః – ఏతస్య – వై – అక్షరస్య – ప్రశాసనే – గార్గి – నిమేషాః – ముహూర్తాః – అహోరాత్రాణి – అర్ధమాసాః – మాసాః – ఋతవః – సంవత్సరాః – ఇతి – విధృతాః – తిష్ఠన్తి – ఏతస్య – వై – అక్షరస్య – ప్రశాసనే – గార్గి – ప్రాచ్యః – నద్యః – స్యన్దన్తే – శ్వేతేభ్యః – పర్వతేభ్యః – ప్రతీచ్యః – అన్యాః – యాం – యాం – చ – దిశం – అను – ఏతస్య – వై – అక్షరస్య – ప్రశాసనే – గార్గి – దదతః – మనుష్యాః – ప్రశంసన్తి – యజమానం – దేవాః – దర్వీం – పితరః – అను –ఆయత్తాః.

ప్ర॥ హేగార్గి = ఓ గార్గీ । ఏతస్యవాఅక్షరస్య = ఈ అక్షరనియొక్క, ప్రశాసనే = ఆజ్ఞయందు, సూర్యాచన్ద్రమసౌ = సూర్యచంద్రులు, విధృతౌ = ధరించుచున్నవారలై, తిష్ఠతః = ఉంచున్నారు. హేగారి = ఓ గార్గీ! ఏతస్యవాఅక్షరస్య = ఈ అక్షరముయొక్క, ప్రశాసనే = ఆజ్ఞయందు, ద్యావాపృథివ్యౌ = భూమ్యంతరిక్షములు, విధృతే = ధరించుచున్నవై, తిష్ఠతః = ఉంచున్నవి. హేగార్గి = ఓ గార్గీ, ఏతస్యవాఅక్షరస్య = ఈ అక్షరముయొక్క. ప్రశాసనే = ఆజ్ఞయందు, నిమేషాః=నిమేషములును, ముహూర్తాః= ముహూర్తములును, అహోరాత్రాణి = రాత్రిపగళ్లును, అర్ధమాసాః = పక్షములును, మాసాః = మాసములును, ఋవతవః = ఋతువులును, సంవత్సరాః = సంవత్సరములును, ఇతి = అని, విధృతాః = ధరింపబడినవై, తిష్ఠన్తి = ఉండియున్నవి. హేగార్గి = ఓ గార్గీ! ఏతస్యవా అక్షరస్య = ఈ అక్షరముయొక్క, ప్రశాసనే = ఆజ్ఞయందు, శ్వేతేభ్యఃపర్వతేభ్యః = హిమవంతము మొదలైన

పర్వతములనుండి, నద్యః = గంగాదినదులు, ప్రాచ్యః = ప్రాఙ్ముఖములుగాను, అన్యాః = ఇతరములైన సింధునది మొదలైనవి. ప్రతీచ్యః = పశ్చిమాభిముఖములుగాను, (అన్యాః = ఇంకా యితరములైన నదులు), యాంయాం = ఏ యే, దిశంచ = దిక్కులను, అను = అనుసరించుచున్నవో, (తాంతాం = ఆయా దిక్కులను గూర్చి), స్యన్దన్తే = ప్రవహించుచున్నవి. హేగార్గి = ఓ గార్గీ, ఏతస్యవా అక్షరస్య = ఈ అక్షరముయొక్క, ప్రశాసనే = ఆజ్ఞయందు, దదతః = దానార్హములైన బంగారము మొదలైనవాటిని, మనుష్యాః = మనుష్యులు, ప్రశంసన్తి = శ్లాఘించుచున్నారు. దేవాః = దేవతలు, యజమానం = యజమానునిన్ని, పితరః = పితృదేవతలు, దర్వీం = దర్వీహోమమునున్ను అన్వాయత్తాః = అనుసరించి పొందుచున్నారు.

తా॥ ఇట్లు సర్వవిశేషణ శూన్యమైన అక్షరమున్నదియని శ్రుతిచేతఁ జెప్పఁబడినది. ఇప్పుడా అక్షర ముండుటకు అనుమాన ప్రమాణమును చూపించుచున్నాఁడు. ఓ గార్గీ ! ఇంతకు పూర్వము చెప్పిన అశనాయాది ధర్మాతీతమును, సమీపమును, ప్రత్యక్షమును, సర్వాంతమునగు పరబ్రహ్మమైన అక్షర స్వరూపమేది పొందఁబడినదో దానియొక్క ఆజ్ఞవలన సూర్య చంద్రులు ఆ యాకాలము లందు తప్పకుండా ప్రకాశించు చున్నారు. అదేప్రకారము భూమ్యంతరిక్షములును అక్షర పరబ్రహ్మముయొక్క ఆజ్ఞవలన వాటివాటిమితిని మీరక నిలిచియున్నవి. ఆ అక్షర పరబ్రహ్మము యొక్క ఆజ్ఞవలననే నిమేషముహూర్తము, అహోరాత్రము, పక్షము, మాసము, సంవత్సరము మొదలయిన భేదములుగల ఆ యా కాలములును తప్పకుండా కలుగుచున్నవి. హిమవంతము మొదలైన పర్వతముల నుండి తూర్పుగా ప్రవహించునట్టి నదులు తూర్పుగాను, పశ్చిమముగా ప్రవహించునట్టి నదులు పశ్చిమముగాను, ఇంక నా యా

దిక్కులకు ప్రవహించెడి నదులు ఆయా దిఙ్ముఖములుగాను, ఆ అక్షర పరబ్రహ్మము యొక్క ఆజ్ఞవలననే తప్పక ప్రవహించుచున్నవి. ప్రమాణమును గుర్తెఱిగిన మనుష్యులు దానార్హములగు బంగారు మొదలైనవాటిని అక్షరపరబ్రహ్మము యొక్క ఆజ్ఞ వలన స్తుతించుచున్నారు. దేవతలు పురోడాశము మొదలైన జీవన పదార్థముల నిమిత్తమై యజమానునిన్ని పితృదేవతలు దర్వీహోమమునున్ను అనుసరించి పొందుచున్నారు. ఇట్లు అక్షర పరబ్రహ్మము యొక్క ఆజ్ఞవలన ఈ సూర్యచంద్రులు మొదలైన వీరందరు తమ తమ క్రమములయందు రాజాజ్ఞ వలన రాజ్యము వలెనే నియతముగా ప్రవర్తించుచున్నారు.

ఉ॥ యో వా ఏతదక్షరం గార్గ్య విదిత్వాఽస్మిఁల్లోకే జుహోతి యజతే తపస్తప్యతే బహూని వర్ష సహస్రాణ్యన్తవదే వాస్యతద్భవతి। యో వా ఏ తదక్షరం గార్గ్యవిదిత్వా స్మాల్లోకా త్ప్రైతి స కృపణోఽథ య ఏ తదక్షరం గార్గి విదిత్వాఽస్మాల్లోకా త్ప్రైతి స బ్రాహ్మణః. ॥10॥

ప॥ యః – వై – ఏతత్ – అక్షరం – గార్గి – అవిదిత్వా – అస్మిన్ – లోకే – జుహోతి – యజతే – తపః – తప్యతే – బహూని – వర్షసహస్రాణి – అన్తవత్ – ఏవ – అస్య – తత్ – భవతి – యః – వై – ఏతత్ – అక్షరం – గార్గి – అవిదిత్వా – అస్మాత్ – లోకాత్ – ప్రైతి – సః – కృపణః – అథ – యః – ఏతత్ – అక్షరం – గార్గి – విదిత్వా – అస్మాత్ – లోకాత్ – ప్రైతి – సః – బ్రాహ్మణః.

ప్ర॥ హేగార్గి ! = ఓ గార్గి !, యోవై = ఎవఁడైతే, ఏతదక్షరం = ఈ అక్షరమును, అవిదిత్వా = తెలిసికొనక, అస్మిన్ = ఈ, లోకే = లోకమునందు, జుహోతి = హోమము చేయుచున్నాఁడో, యజతే = యాగమును చేయుచున్నాఁడో, బహూని

వర్షాణి = అనేకసంవత్సరములు, తపః = తపస్సును, తప్యతే = తపస్సు చేయుచున్నాఁడో, అస్య = వీనియొక్క, తత్ = ఆకర్మఫలము, అన్తవదేవా = నాశముకలదే, భవతి = అగుచున్నది. హేగార్గి ! = ఓ గార్గీ!, యోవై = ఎవఁడు, ఏ తదక్షరం = ఈ అక్షరమును, అవిదిత్వా = తెలిసికొనక, అస్మాల్లోకాత్ = ఈ లోకమునుండి, ప్రైతి = మరణమును పొందుచున్నాఁడో, సః = వాడు, కృపణః = కృపణుఁడు, (డబ్బుచే కొనుకొఁనఁబడిన దాసుడు మొదలైన వాని వంటివాడు). అథ = మఱియు, హేగార్గీ! = ఓ గార్గీ!, యః = ఎవఁడు, ఏ తదక్షరం = ఈ అక్షరమును, విదిత్వా = తెలిసికొని, అస్మాల్లోకాత్ = ఈ లోకమునుండి, ప్రైతి = మరణమును పొందు చున్నాఁడో, సః = వాడు, బ్రాహ్మణః = బ్రాహ్మణుఁడు, (బ్రహ్మవేత్త).

తా॥ ఈ చెప్పెడి హేతువువల్లనున్ను, ఆ అక్షర స్వరూపమున్నదని చూపించు చున్నాఁడు. ఓ గార్గీ! ఎవఁడు ఈ అక్షరపరబ్రహ్మమును తెలిసికొనక ఈ లోకమునందు హోమమును చేయుచున్నాఁడో, యాగమును చేయుచున్నాఁడో, తపస్సును అనేక సంవత్సరములు చేయుచున్నాఁడో ఆట్టివానియొక్క ఆకర్మఫలమంతయు నాశము కలదేఅగుచున్నది. ఎవఁడు ఈ అక్షరపరబ్రహ్మమును తెలిసికొనక ఈ లోకమునుండి మరణమునుపొందిపోవుచున్నాడో వాఁడునీచుడై జనన మరణ రూపసంసార కష్టమును ఎడతెగక పొందుచున్నాడు. ఎవఁడు ఈ అక్షరపరబ్రహ్మమును తెలిసికొని ఈలోకమునుండి మరణమును పొంది పోవుచున్నాడోవాఁడు ఆ అక్షరపరబ్రహ్మస్వరూపియగు బ్రాహ్మణుఁడగుచున్నాఁడు; అనఁగా అక్షరపరబ్రహ్మ మగుచున్నాఁడు.

ఉ॥ తద్వా ఏతదక్షరం గార్గ్యదృష్టం ద్రష్ట్రశ్రుతగ్ శ్రోత్రమతం మన్త్రవిజ్ఞాతం విజ్ఞాతృనాన్యదతోఽస్తి ద్రష్టృ నాన్య దతోఽస్తి శ్రోతృనాన్యదతోఽస్తి మన్తృ నాన్య దతోఽస్తి విజ్ఞాత్రే తస్మి

న్నుఖల్వక్షరే గార్గ్యాకాశ ఓతశ్చప్రోతశ్చేతి. ॥11॥

ప॥ తత్ – వై – ఏతత్ – అక్షరం – గార్గి – అదృష్టం – ద్రష్టృ – అశ్రుతం – శ్రోతృ – అమతం – మన్తృ – అవిజ్ఞాతం – విజ్ఞాతృ – న – అన్యత్ – అతః – అస్తి – ద్రష్టృ – న – అన్యత్ – అతః – అస్తి – శ్రోతృ – న – అన్యత్ – అతః – అస్తి – మన్తృ – న – అన్యత్ – అతః – అస్తి – విజ్ఞాతృ – ఏతస్మిన్ – ను – ఖలు – అక్షరే – గార్గి – ఆకాశః – ఓతః – చ – ప్రోతః – చ – ఇతి.

ప్ర॥ హేగార్గి = ఓ గార్గీ! తద్వై = ఆ ప్రసిద్ధమగు, ఏతత్ = ఈ, అక్షరం = అక్షరస్వరూపము, అదృష్టం = చూడఁబడనిదియై, ద్రష్టృ = చూచునదియును, అశ్రుతం = వినఁబడనిదియై, శ్రోతృ = వినునదియును, అమతం = తలంచఁబడనిదియై, మన్తృ = తలంచునదియును, అవిజ్ఞాతం = తెలిసికొనఁబడనిదియై, విజ్ఞాతృ= తెలిసికొనునదియును, (భవతి = అగుచున్నది), అతః = ఈ అక్షర పరబ్రహ్మము కంటె, అన్యత్ = ఇతరమైనది, ద్రష్టృ = చూచునది, నాస్తి = లేదు, అతః = ఈ అక్షరునికంటె, అన్యత్ = యితరమైనది, శ్రోతృ = వినునది, నాస్తి = లేదు, అతః = ఈ అక్షరునికంటె, అన్యత్ = యితరమైనది, మన్తృ = తలంచునది, నాస్తి = లేదు. అతః = ఈ అక్షరుని కంటె, అన్యత్ = ఇతరమైనది, విజ్ఞాతృ = తెలిసికొనునది, నాస్తి = లేదు. హేగార్గి = ఓగార్గీ!, ఆకాశః = ఆకాశము, ఏతస్మిన్నుఖలు అక్షరే = ఈ అక్షరమునందే, ఓతశ్చప్రోతశ్చ = వస్త్రముయొక్క పడుగుపేకలువలెనే కల్పింపబడియున్నది. ఇతి = అని, (యాజ్ఞవల్క్యుఁడు పలికెను.)

తా॥ ఓ గార్గీ! ఆ ప్రసిద్ధమగు ఈ అక్షరస్వరూపము తాను చూపునకు విషయముగాక దృక్స్వరూపమును శ్రోత్రమునకు విషయము గాక శ్రుతిస్వరూపమును మనస్సునకు విషయముగాక తలంచునదియును, బుద్ధికి విషయముగాక విజ్ఞాతృ స్వరూపము నగుచున్నది.

మఱియు ఇట్టి అక్షరపరబ్రహ్మ స్వరూపము కంటె వేఱు ద్రష్ట యును, వేఱు శ్రోతయును, వేఱు మన్తయును వేఱు విజ్ఞాతయును లేదు. ఓగార్గీ ! ఇట్టి అక్షర స్వరూపమునందే అవ్యాకృతాకాశము వస్త్రము యొక్క పడుగుపేకలు వలెనే ఏకముగా కల్పింపఁబడి యున్నది యని యాజ్ఞవల్క్యుఁడు చెప్పెను.

మూ॥ సా హోవాచ బ్రాహ్మణా భగవన్త స్తదేవ బహు మన్యేధ్వం యదస్మాన్నమస్కారేణ ముచ్యేధ్వం న వై జాతు యుష్మాక మిమం కశ్చిద్బ్రహ్మోద్యం జేతేతి తతోహ వాచక్నవ్యుపర రామ. ॥12॥

ఇతి శ్రీ బృహదారణ్యకే పఞ్చమాధ్యాయే అష్టమం బ్రాహ్మణమ్.

ప్ర॥ సా - హోవాచ - బ్రాహ్మణాః - భగవన్తః - తత్ - ఏవ - బహుమన్యేధ్వం - యత్ - అస్మాత్ - నమస్కారేణ - ముచ్యేధ్వం - న - వై - జాతు - యుష్మాకం - ఇమం - కః - చిత్ - బ్రహ్మోద్యం - జేతా - ఇతి - తతః - హ - వాచక్నవీ - ఉపరరామ.

ప్ర॥ సా = ఆ గార్గి, హోవాచ = పలికెను. హేభగవన్తః బ్రాహ్మణాః = పూజ్యులగు ఓ బ్రాహ్మణులారా !, అస్మాత్ = ఈ యాజ్ఞవల్క్యుని వలన, నమస్కారేణ = నమస్కారము చేతను, ముచ్యేధ్వంయత్ = ముక్తులు అగుఁడి అనునది యేదియో, తదేవ= దానినే (యూయం = మీరు.) బహుమన్యేధ్వం = విశేషముగా తలంచుడీ, యుష్మాకం = మీలోపల, కశ్చిత్ = ఎవఁడును, ఇమం= ఈ యాజ్ఞవల్క్యుని, బ్రహ్మోద్యం = పరబ్రహ్మ వాదమును గూర్చి, జాతు = ఒకానొకప్పుడును, జేతా = జయించువాఁడు, నవై = లేనేలేఁడు, ఇతి = అని, (గార్గి పలికెను), తతోహ = అందువలన, వాచక్నవీ = వచక్నుని పుత్రికయగు గార్గి, ఉపరరామ = ఊరక యుండెను.

తా॥ ఇట్లు యాజ్ఞవల్క్యుఁడు తాను చేసిన ప్రశ్నమును నిరూపించి చెప్పుట వలన గార్గి బ్రహ్మసభయందలి బ్రాహ్మణులనుగూర్చి పూజ్యులగు ఓ బ్రాహ్మణులారా! మీరు యాజ్ఞవల్క్యుని కొరకు నమస్కరించి ముక్తులగుటనే విశేషముగా తలంచుఁడీ! మీలో బ్రహ్మవాదమును గూర్చి ఈ యాజ్ఞవల్క్యుని నెప్పటికిని జయించువాఁడొకఁడును లేఁడు. అనిచెప్పి గార్గి వేఱొక ప్రశ్నను చేయకుండ ఊరక యుండెను.

ఇట్లు పఞ్చమాధ్యాయము అష్టమ బ్రాహ్మణము సమాప్తము.

పఞ్చమాధ్యాయము – నవమబ్రాహ్మణము

ఉ॥ అథ హైనం విదగ్ధః శాకల్యః పప్రచ్ఛ కతి దేవా యాజ్ఞవల్క్యేతి స హైతయైవ నివిదా ప్రతిపేదే యావన్తో వైశ్వదేవస్యనివిద్యుచ్యన్తే త్రయశ్చ త్రీ చ శతా త్రయశ్చ త్రీ చ సహస్రేత్యోమితి హోవాచ కత్యేవ దేవా యాజ్ఞవల్క్యేతి త్రయస్త్రింశదిత్యోమితి హోవాచ కత్యేవ దేవా యాజ్ఞవల్క్యేతి షడిత్యోమితి హోవాచ కత్యేవ దేవా యాజ్ఞవల్క్యేతి త్రయ ఇత్యోమితి హోవాచ కత్యేవ దేవా యాజ్ఞవల్క్యేతి ద్వావిత్యోమితి హోవాచ కత్యేవ దేవాయాజ్ఞవల్క్య త్యధ్యర్ధ ఇత్యోమితి హోవాచ కత్యేవ దేవా యాజ్ఞవల్క్యేత్యేక ఇత్యోమితి హోవాచ కతమే తే త్రయశ్చ త్రీ చ శతా త్రయశ్చ త్రీ చ సహస్రేతి ॥1॥

అథ – హ – ఏనం – విదగ్ధః – సాకల్యః – పప్రచ్ఛ – కతి – దేవాః – యాజ్ఞవల్క్య – ఇతి – సః – హ – ఏతయా – ఏవ – నివిదా – ప్రతిపేదే – యావన్తః – వైశ్వదేవస్య – నివిది – ఉచ్యన్తే – త్రయః – చ – త్రీ – చ – శతా – త్రయః – చ – త్రీ – చ – సహస్రా – ఇతి – ఓం – ఇతి – హోవాచ – కతి –

ఏవ – దేవాః – యాజ్ఞవల్క్య – ఇతి – త్రయస్త్రింశత్ – ఇతి–ఓం – ఇతి – హోవాచ – కతి – ఏవ – దేవాః – యాజ్ఞవల్క్య – ఇతి – షట్ – ఇతి – ఓం – ఇతి –హోవాచ– కతి – ఏవ – దేవాః– యాజ్ఞవల్క్య – ఇతి – త్రయః – ఇతి – ఓం – ఇతి – హోవాచ – కతి – ఏవ – దేవాః – యాజ్ఞవల్క్య – ఇతి – ద్వౌ – ఇతి – ఓం– – హోవాచ – కతి – ఏవ – దేవాః – యాజ్ఞవల్క్య – ఇతి – అధ్యర్థః – – ఓం – ఇతి – హోవాచ – కతి – ఏవ – దేవాః – యాజ్ఞవల్క్య – ఇతి – ఏకః – ఇతి – ఓం – ఇతి – హోవాచ – కతమే – తే – త్రయః – త్రీ – చ – శతా – త్రయః – చ – త్రీ – చ – సహస్రా – ఇతి.

ప్ర॥ అథహ = అనంతరము, శాకల్యః = శకల పుత్రుఁడగు, విదగ్ధః = విదగ్ధుఁడనువాఁడు, ఏనం = ఈ యాజ్ఞవల్క్యుని, హే యాజ్ఞవల్క్య = ఓ యాజ్ఞవల్క్యుఁడా! దేవాః = దేవతలు, కతీతి – ఎందఱని, పప్రచ్ఛ = అడిగెను, సహ = ఆ యాజ్ఞవల్క్యుడు ఏతయా = ఈ చెప్పఁబోయెడి, నివిదైవ = నివిత్తను పేరుగల మంత్రము చేతనే, (దేవ సంఖ్యను) ప్రతిపేదే =పొందెను. వైశ్వదేవస్య = వైశ్వదేవ శస్త్రముయొక్క, నివిది = నివిత్తనుమంత్రము నందు, (దేవసంఖ్యను తెలిపెడి మంత్రము నివిత్తనఁబడును.) యావన్తః = ఎంతమంది దేవతలు, ఉచ్యన్తే = చెప్పఁబడు చున్నారో, (అందఱు దేవతలు వినఁబడుచున్నారు. అది యేది యనగా), త్రయశ్చ = ముగ్గురున్ను, త్రీచశతా = మూఁడు వంద లున్ను, (మూఁడు వందల ముగ్గురు), త్రయశ్చ = ముగ్గురున్ను, త్రీచ సహస్రా = మూఁడు వేలున్ను, (మూఁడువేల ముగ్గురు), ఇతి = అని, (యాజ్ఞవల్క్యుఁడు పలికెను). (శాకల్యుఁడు మరల), ఓమితి= సరే యని, హే యాజ్ఞవల్క్య = ఓ యాజ్ఞవల్క్యుఁడా!, దేవాః=దేవ తలు, కత్యేవేతి = ఎందఱు అని, హోవాచ = పలికెను, (యాజ్ఞ

వల్క్యుఁడు) త్రయస్త్రింశదితి=ముప్పదిముగ్గురని (పలికెను,) ఓమితి= సరేయని, ( శాకల్యః = శాకల్యుఁడు ), యాజ్ఞవల్క్య = ఓయాజ్ఞ వల్క్యుఁడా! దేవాః = దేవతలు, కత్యేవేతి = ఎందరే యని, హోవాచ = పలికెను. ( యాజ్ఞవల్క్యుఁడు ), షడితి = ఆరుగురని, ( పలికెను ), ఓమితి = సరేయని, (శాకల్యుడు), యాజ్ఞవల్క్య = ఓ యాజ్ఞవల్క్యుఁడా! దేవాః = దేవతలు, కత్యేవేతి = ఎందరే యని, హోవాచ = పలికెను. (యాజ్ఞవల్క్యుఁడు). త్రయఇతి = ముగ్గురని (పలికెను). ఓమితి = సరేయని, (శాకల్యుఁడు) హేయాజ్ఞ వల్క్య = ఓ యాజ్ఞవల్క్యుఁడా! వాః = దేవతలు, కత్యేవేతి= ఎందరేయని, హోవాచ = పలికెను. (యాజ్ఞవల్క్యుఁడు), ద్వావితి = ఇద్దఱని, (పలికెను), ఓమితి = సరేయని, (శాకల్యుఁడు) హేయాజ్ఞవల్క్య = ఓ యాజ్ఞవల్క్యుఁడా!, దేవాః = దేవతలు, కత్యేవేతి = ఎందరే యని, హోవాచ = పలికెను, (యాజ్ఞవ ల్క్యుఁడు) అధ్యర్ధఇతి = ఒకటిన్నరయని, (పలికెను), ఓమితి = సరే యని, (శాకల్యుడు), హేయాజ్ఞవల్క్య = ఓ యాజ్ఞవల్క్యుఁడా! దేవాః = దేవతలు, కత్యేవేతి = ఎందరే యని, హోవాచ = పలి కెను. (యాజ్ఞవల్క్యుఁడు) ఏకఇతి = ఒకఁడని, (పలికెను). ఓమితి= సరేయని, (శాకల్యుఁడు), తే = ఆ, త్రయశ్చ త్రీ చ శతా = మూఁడువందల ముగ్గురును, త్రయశ్చ త్రీ చ సహస్రా = మూఁడువేల ముగ్గురును, కతమఇతి = ఎవరు అని, హోవాచ = పలికెను.

తా॥ ఇంతకు పూర్వము భూమి మొదలైనవాటికి సూక్ష్మ తారతమ్య క్రమముచే పూర్వ పూర్వమునకు ఉత్తరోత్తరమునందు ఓతప్రోత భావమును చెప్పుచు సర్వాన్తరమగు పరబ్రహ్మమును ప్రకాశింపఁజేసెను. ఆ పరబ్రహ్మమునకు అవ్యాకృత విషయమునందు సూత్రభేదములయందు నియన్తృత్వము చెప్పఁబడినది. ఆ పరబ్రహ్మ మును యొక్కయే సాక్షాదపరోక్షత్వములు నియమింపఁదగిన దేవతా

భేదములయొక్క సంకోచ వికాసములద్వారా పొందఁదగినవియని అందు నిమిత్తమై ఈశాకల్య బ్రాహ్మణ మారంభింపఁబడినది. గార్గి వేఱొక ప్రశ్నముచేయక యూరకున్న తరువాత శాకల్యుఁడు ఈ యాజ్ఞవల్క్యుని గూర్చి ఓ యాజ్ఞవల్క్యుఁడా! దేవతలెందరని ప్రశ్నచేసెను. అప్పుడు యాజ్ఞవల్క్యుఁడు ఓ శాకల్యుఁడా! వైశ్వదేవశస్త్రముయొక్క దేవతాసంఖ్యను తెలుపునట్టి నివిత్తను మంత్రము చేతను యెంతసంఖ్యగల దేవతలేర్పడుచున్నారో అందఱు దేవతలని చెప్పెను. శాకల్యుఁడు ఆ నివిత్తను మంత్రమునందు ఎంత సంఖ్య చెప్పుచున్నదని యడుగఁగా యాజ్ఞవల్క్యుఁడు మూడు వందల ముగ్గురు, మూడువేల ముగ్గురు, అని చెప్పుచున్నదని పలికెను. శాకల్యుఁడు మరల ఓ యాజ్ఞవల్క్యుఁడా! దేవతలెందరని అడుగఁగా యాజ్ఞవల్క్యుఁడు ముప్పదిముగ్గురని చెప్పెను. సరేనని శాకల్యుఁడు మరల ఎందరు దేవతలని యడిగెను. యాజ్ఞవల్క్యుఁడు ఆఱుగురని చెప్పెను. సరేనని శాకల్యుఁడు మరల ఎందరు దేవతలని అడిగెను. యాజ్ఞవల్క్యుఁడు ముగ్గురని చెప్పెను. సరేనని శాకల్యుఁడు మరల దేవతలెందరని అడిగెను. యాజ్ఞవల్క్యుఁడు ఇద్దఱు అని చెప్పెను. సరే అని శాకల్యుఁడు మరల ఎందరు దేవతలని అడిగెను. యాజ్ఞవల్క్యుఁడు ఒకటిన్నర దైవమని పలికెను. సరేనని శాకల్యుఁడు మరల దేవతలెందరని ప్రశ్నము చేసెను. యాజ్ఞవల్క్యుఁడు ఒక్కఁడని చెప్పెను. శాకల్యుఁడు సరేయని మూడువందల మూడు, మూడువేల మూడు, సంఖ్యగల ఆ దేవతలు ఎవరని ప్రశ్నము చేసెను.

ఉ॥ స హోవాచ మహిమాన ఏవైషామేతే త్రయస్త్రింగ్ శత్త్వేవ దేవా ఇతి కతమే తే త్రయ స్త్రింగ్ శదిత్యష్టౌవసవ ఏకాదశ రుద్రా ద్వాదశాదిత్యాస్త ఏకత్రింగ్శ దిన్ద్రశ్చైవ ప్రజాపతి శ్చత్రయ స్త్రింగ్ శావితి. ॥2॥

ప॥ సః – హోవాచ – మహిమానః – ఏవ – ఏషా – మే –

తే - త్రయస్త్రిగ్ శత్ - తు - ఏవ - దేవాః - ఇతి - కతమే - తే - త్రయస్త్రింశత్ - ఇతి - అష్టౌ - వసవః - ఏకాదశ - రుద్రాః ద్వాదశ - ఆదిత్యాః - తే - ఏక - త్రింశత్ - ఇన్ద్రః - చ - ఏవ - ప్రజాపతిః - చ - త్రయస్త్రింశౌ - ఇతి.

ప్ర॥ సః = ఆ యాజ్ఞవల్క్యుఁడు, హోవాచ = పలికెను. ఏషాం = ఈ ముప్పదిముగ్గురు దేవతలయొక్క, మహిమానఏవ = విభూతులే. ఏతే = ఈ పూర్వము చెప్పఁబడిన మూడువందలముగ్గురు దేవతలు, (పరమార్థముగానైతే), త్రయస్త్రింశత్త్వేవా దేవాః = ముప్పదిముగ్గురు దేవతలే, ఇతి = అని,(యాజ్ఞవల్క్యుఁడు పలికెను). త్రయస్త్రింశత్ = ముప్పదిముగ్గురగు, తే = ఆ దేవతలు, కతమే = ఎవరు, ఇతి = అని (శాకల్యుఁడడిగెను). అష్టౌ = ఎనమండ్రుగురగు, వసవః = వసువులును, ఏకాదశ = పదునొకండ్రుగురగు, రుద్రాః= రుద్రులును, ద్వాదశ = పండ్రెండ్రుగురగు, ఆదిత్యాః = ఆదిత్యులు నగు, తే = వారు, ఏకత్రింశత్ = ముప్పదియొక్కరును, ఇన్ద్రశ్చ = ఇంద్రుఁడును, ప్రజాపతిశ్చ = బ్రహ్మయును, త్రయస్త్రింశావితి = ముప్పదిముగ్గురని, (యాజ్ఞవల్క్యుఁడు చెప్పెను).

తా॥ ఓ శాకల్యుఁడా! ఈ ముప్పది ముగ్గురు దేవతలయొక్క విభూతులే పూర్వము చెప్పిన మూడువందల ముగ్గురు దేవతలు నిజముగా ముప్పదిముగ్గురే దేవతలని యాజ్ఞవల్క్యుఁడు పలికెను. మరల శాకల్యుఁడు ఆ ముప్పది ముగ్గురు దేవతలెవరని అడిగెను. ఓ శాకల్యుఁడా! అష్ట వసువులును, ఏకాదశ రుద్రులును, ద్వాదశాదిత్యులును, వీరు ముప్పదియొక్కరును, ఇంద్రుడును, ప్రజాపతియును, ఈ ముప్పది ముగ్గురు దేవతలని యాజ్ఞవల్క్యుఁడు పలికెను.

ఉ॥ కతమే వసవ ఇత్యగ్నిశ్చ పృథివీ చ వాయుశ్చాన్తరిక్షం చాదిత్యశ్చ ద్యౌశ్చ చన్ద్రమాశ్చ నక్షత్రాణి చైతే వసవ ఏతేషు హీదం వసు సర్వగ్ హిత మితి తస్మాద్వసవ ఇతి. ॥3॥

ప॥ కతమే - వసవః - ఇతి - అగ్నిః - చ - పృథివీ - చ - వాయుః - చ - అన్తరిక్షం - చ - ఆదిత్యః - చ - ద్యౌః - చ - చన్ద్రమాః - చ - నక్షత్రాణి - చ - ఏతే - వసవః - ఏతేషు - హి - ఇదం - వసు - సర్వం - హితం - ఇతి - తస్మాత్ - వసవః-

ప్ర॥ వసవః = వసువులు, కతమే = ఎవరు, ఇతి = అని, (శాకల్యుఁడడిగెను). అగ్నిశ్చ = అగ్నియును, పృథివీచ = భూమియును, వాయుశ్చ = గాలియును, అన్తరిక్షంచ = ఆకాశమును, ఆదిత్యశ్చ = సూర్యుఁడును, ద్యౌశ్చ = ద్యులోకమును, చన్ద్రమాశ్చ = చంద్రుఁడును, నక్షత్రాణిచ = నక్షత్రములును, ఏతే =వీరు, వసవః = వసువులు. ఏతేషు = ఈ వసువులయందు, వసు = ధనరూపమైన, ఇదంసర్వం = ఈ సమస్తజగత్తును, హితంహి = ఉంచఁబడినది. ఇతి = అని, (యాజ్ఞవల్క్యుఁడు), తస్మాత్ = అందువల్లనుంచి, వసవఇతి = వసువులని (చెప్పఁబడుచున్నారని పలికెను).

తా॥ ఆ అష్ట వసువు లెవరని శాకల్యుఁడడుగఁగా యాజ్ఞవల్క్యుఁడు, ఓ శాకల్యుఁడా! అగ్ని, భూమి, వాయువు, ఆకాశము, సూర్యుఁడు, ద్యులోకము, చంద్రుఁడు, నక్షత్రములు ఈ యెనిమిది అష్ట వసువులు. వీటియందే ధనరూపమైన ఈ సమస్త జగత్తు ఉంచబడియున్నది. గనుకనే వీరు వసువులని చెప్పఁబడుచున్నారని యాజ్ఞవల్క్యుఁడు పలికెను.

ఉ॥ కతమే రుద్రా ఇతి దశేమే పురుషే ప్రాణా ఆత్మైకాదశస్తే యదాస్మా చ్ఛరీరాన్మర్త్యాదు త్క్రామన్త్యథ రోదయన్తి తద్యద్రోదయన్తి తస్మా ద్రుద్రా ఇతి. ॥4॥

ప॥ కతమే - రుద్రాః - ఇతి - దశ - ఇమే - పురుషే - ప్రాణాః - ఆత్మా - ఏకాదశ - తే - యదా - అస్మాత్ - శరీరాత్ - మర్త్యాత్ - ఉత్క్రామన్తి - అథ - రోదయన్తి - తత్ -

యత్ - రోదయన్తి - తస్మాత్ - రుద్రాః - ఇతి.

ప్ర॥ రుద్రాః = రుద్రులు, కతమే = ఎవరు, ఇతి = అని, (శాకల్యుఁడు ప్రశ్నము చేసెను). పురుషే = పురుషునియందు, ఇమే = ఈ, ప్రాణాః = ఇంద్రియములు, (జ్ఞానేంద్రియ కర్మేంద్రియ ములు), దశ = పదియును, ఏకాదశః = పదునొకండవదియగు, ఆత్మా = మనస్సును, తే = ఆ ఏకాదశ రుద్రులును, యదా = ఎప్పుడు, అస్మాత్ = ఈ, మర్త్యాత్ = మరణధర్మముగల, శరీ రాత్ = దేహమునుండి, ఉత్క్రామన్తి= లేచిపోవుచున్నారో, అథ = అప్పుడు, రోదయన్తి = ఏడ్పుచున్నారు. తత్ = ఆ మరణ సమయమునందు, యత్ = ఏ కారణమువలన, రోదయన్తి = ఏడ్పు చున్నారో, తస్మాత్ = ఆ కారణమువలన, రుద్రాఇతి = రుద్రులని, (చెప్పఁబడుచున్నారని యాజ్ఞవల్క్యుఁడు పలికెను).

తా॥ శాకల్యుఁడు ఓ యాజ్ఞవల్క్యుఁడా! ఆ రుద్రులు ఎవరు అని ప్రశ్నము చేయఁగా, యాజ్ఞవల్క్యుఁడు పురుషుని యందలి జ్ఞానేంద్రియములగు త్వక్చక్షుశ్శ్రోత్ర జిహ్వాఘ్రాణములు అయిదును, కర్మేంద్రియములగు వాక్పాణిపాదపాయూపస్థలు అయిదును, మన స్సునొకటియును, ఇవి పదునొకండును ఏకాదశ రుద్రులని పలికి, ఇవి ఈ మరణ ధర్మమగు శరీరము నుండి లేచిపోవుటతోనే మరణమును పొందిన పురుషుని గూర్చి జనులు ఏడ్పుట వలన ఇవి రుద్రులని చెప్ప బడుచున్నవని యాజ్ఞవల్క్యుఁడు చెప్పెను.

ఉ॥ కతమ ఆదిత్యా ఇతి ద్వాదశ వై మాసాః సంవత్సరస్యైత
ఆదిత్యా ఏతే హీదగ్ సర్వమాదదానా యన్తి తే యదిదగ్
సర్వ మాదదానా యన్తి తస్మాదాదిత్యా ఇతి. ॥5॥

ప॥ కతమే - ఆదిత్యాః - ఇతి - ద్వాదశ - వై - మాసాః - సంవత్సరస్య - ఏతే - ఆదిత్యాః - ఏతే - హి - ఇదం - సర్వం -ఆద దానాః - యన్తి - తే - యత్ - ఇదం - సర్వం - ఆదదానాః -

యన్తి - తస్మాత్ - ఆదిత్యాః - ఇతి.

ప్ర॥ ఆదిత్యాః = సూర్యులు, కతమే = ఎవరు, ఇతి = అని, (శాకల్యుఁడు పలికెను). సంవత్సరస్య = సంవత్సరము యొక్క, ద్వాదశవై మాసాః = పండ్రెండు మాసములే, ఆదిత్యాః = సూర్యులు. ఏతేహి = ఈ సూర్యులే, ఇదంసర్వం = ఈ సమస్తమును, (ప్రాణులయొక్క ఆయుస్సును, కర్మఫలమును, ఈ సమస్తమును), ఆదదానాః = గ్రహించుచున్నవారై, యన్తి = పోవుచున్నారు. తే = ఆ సూర్యులు, యత్ = ఏకారణమువలన, ఇదం సర్వం = ఈ సమస్తమును, ఆదదానాః = గ్రహించుచున్నవారై, యన్తి = పోవుచున్నారో, తస్మాత్ = అందువల్లనుంచి, ఆదిత్యా ఇతి=ఆదిత్యులని, (చెప్పబడుచున్నారని యాజ్ఞవల్క్యుఁడు పలికెను).

తా॥ శాకల్యుఁడు ఓ యాజ్ఞవల్క్యుఁడా! ఆ ఆదిత్యు లెవరని ప్రశ్నము చేయఁగా, యాజ్ఞవల్క్యుఁడు సంవత్సరావయవములుగా నుండెడి పండ్రెండు మాసములే ఆ ద్వాదశాదిత్యులు. ఈ సూర్యులే ప్రాణులయొక్క ఆయుః కర్మఫలరూపమైన సమస్తమును తీసుకొని పోవుచున్నారు. ఓ శాకల్యుఁడా! ఆ ఆదిత్యులు ఏకారణమువలన ఇట్లు ప్రాణులయొక్క ఆయుః కర్మఫలములను గ్రహించుకొని పోవుచున్నారో అందువలననే ఆదిత్యులని చెప్పఁబడుచున్నారని యాజ్ఞవల్క్యుఁడు పలికెను.

ఉ॥ కతమ ఇన్ద్రః కతమః ప్రజాపతిరితి స్తనయిత్నురేవేన్ద్రో
యజ్ఞః ప్రజాపతిరితి కతమస్స్తనయిత్నురిత్యశనిరితి కతమో
యజ్ఞ ఇతి పశవఇతి. ॥6॥

ప॥ కతమః - ఇన్ద్రః - కతమః - ప్రజాపతిః - ఇతి - స్తనయిత్నుః - ఏవ - ఇన్ద్రః - యజ్ఞః - ప్రజాపతిః - ఇతి - కతమః - స్తనయిత్నుః - ఇతి - అశనిః - ఇతి - కతమః - యజ్ఞః - ఇతి - పశవః - ఇతి.

ప్ర॥ ఇన్ద్రః = ఇంద్రుఁడు, కతమః = ఎవఁడు?, ప్రజాపతిః = బ్రహ్మ, కతమః = ఎవఁడు?, ఇతి = అని, (శాకల్యుఁడు అడిగెను). స్తనయిత్నురేవ = స్తనయిత్నువే, ఇన్ద్రః = ఇంద్రుఁడు, యజ్ఞః = యజ్ఞము, ప్రజాపతిః = బ్రహ్మ, ఇతి = అని, (యాజ్ఞవల్క్యుఁడు పలికెను). స్తనయిత్నుః = స్తనయిత్నువు, కతమః = ఏది?, ఇతి = అని, (శాకల్యుఁడు పలికెను). అశనిః = వజ్రము, (వీర్యము, లేక బలము, ప్రాణియొక్క హింసనము ఇంద్రత్వము), ఇతి = అని, (యాజ్ఞవల్క్యుఁడు పలికెను). యజ్ఞః = యజ్ఞము, కతమఇతి = ఏదియని (శాకల్యుఁ డడిగెను). పశవః = పశువులు, ఇతి = అని, (యాజ్ఞవల్క్యుఁడు పలికెను).

తా॥ ఓ యాజ్ఞవల్క్యుఁడా! ఇంద్రప్రజాపతు లెవరని శాకల్యుఁడు ప్రశ్నము చేయఁగా, స్తనయిత్నువే ఇంద్రుఁడు, యజ్ఞమే ప్రజాపతి, యని యాజ్ఞవల్క్యుఁడు చెప్పెను. మరల శాకల్యుఁడు స్తనయిత్నువు, యజ్ఞము అనగా ఏవి యని ప్రశ్నము చేయగా వజ్రమే స్తనయిత్నువు, పశువే యజ్ఞము అని యాజ్ఞవల్క్యుఁడు చెప్పెను.

ఉ॥ కతమే షడిత్యగ్నిశ్చ పృథివీచ వాయుశ్చాన్తరిక్షం చాదిత్యశ్చ
ద్యౌశ్చైతే షడేతే హీదగ్ం సర్వగ్ం షడితి. ॥7॥

ప॥ కతమే – షట్ – ఇతి – అగ్నిః – చ – పృథివీ – చ – వాయుః–చ – అన్తరిక్షం – చ – ఆదిత్యః–చ– ద్యౌః – చ– ఏతే– షట్ – ఏతే– హి – ఇదం – సర్వం – షట్ – ఇతి.

ప్ర॥ షట్ = ఆరుగురు, కతమే = ఎవరు, ఇతి = అని, (శాకల్యుఁ డడిగెను). అగ్నిశ్చ = అగ్నియును, పృథివీచ = భూమియును, వాయుశ్చ = వాయువును, అన్తరిక్షంచ = ఆకాశమును, ఆదిత్యశ్చ = సూర్యుఁడును, ద్యౌశ్చ = ద్యులోకమును, ఏతే =

ఇవి, షట్ = ఆరు, ఇదంసర్వం = ఈ సమస్తప్రపంచము, ఏతేహి షట్ = ఈ ఆరే, (భవన్తి = అగుచున్నవి).

తా॥ ఓయాజ్ఞవల్క్యుఁడా! ఆఱు అనునవి ఏవియని శాకల్యుఁడు ప్రశ్నము చేయఁగా, ఓ శాకల్యుఁడా! అగ్ని, భూమి, వాయువు, అన్తరిక్షము, సూర్యుఁడు, ద్యులోకము, ఇవి ఆఱు. ఏకారణమువలన ఇదివరకు చెప్పిన ముప్పదిముగ్గురును ఈ సమస్తమును, ఈ ఆఱుగురే యగుచున్నదో, ఆ కారణము వలన ఈ ఆఱుగురే అగుచున్నారని యాజ్ఞవల్క్యుఁడు పలికెను.

ఉ॥ కతమే తే త్రయోదేవా ఇతీమ ఏవత్రయోలోకా ఏషుహీమే సర్వే దేవా ఇతి కతమౌ తౌద్వౌదేవావిత్యన్నంచైవ ప్రాణశ్చేతి కతమోఽధ్యర్ధఇతి యోఽయం పవతఇతి. ॥8॥

ప॥ కతమే - తే - త్రయః - దేవాః - ఇతి-ఇమే - ఏవ - త్రయః - లోకాః - ఏషు - హి - ఇమే - సర్వే - దేవాః - ఇతి- కతమౌ - తౌ-ద్వౌ-దేవౌ - ఇతి - అన్నం - చ - ఏవ - ప్రాణః- చ - ఇతి - కతమః - అధ్యర్ధః - ఇతి - యః - అయం - పవతే - ఇతి.

ప్ర॥ తే = ఆ పూర్వోక్తమైన, త్రయోదేవాః = ముగ్గురు దేవులు, కతమే = ఎవరు, ఇతి = అని, (శాకల్యుఁడు ప్రశ్నము చేసెను). ఇమే = ఈ, త్రయోలోకాఏవ = మూడు లోకములే, ఏషుహి = ఈ ముగ్గురు దేవతలయందే, ఇమే = ఈ, సర్వేదేవాః= అందఱు దేవతలు, (అన్తర్భవంతి = అంతర్భావమును పొందియున్నారు). ఇతి = అని, (యాజ్ఞవల్క్యుఁడు చెప్పెను), తౌ = ఆ పూర్వోక్తమైన, ద్వౌ = ఇద్దఱగు, దేవౌ = దేవతలు, కతమౌ = ఎవరు, ఇతి = అని, శాకల్యుఁడు (ప్రశ్నము చేసెను). అన్నంచైవ= అన్నమున్ను, ప్రాణశ్చ = ప్రాణమున్ను, ఇతి = అని, (యాజ్ఞవల్క్యుఁడు చెప్పెను). అధ్యర్ధః = సగము అధికముగాఁ గల ఒక

దైవము, కతమః = ఎవరు, ఇతి = అని, (శాకల్యుఁడు ప్రశ్నము చేసెను). యః = ఏది. పవతే = వీచుచున్నదో, అయం = ఈ వాయువు, ఇతి = అని, (యాజ్ఞవల్క్యుఁడు చెప్పెను).

తా॥ ఓ యాజ్ఞవల్క్యుఁడా! ఆ ముగ్గురు దేవతలు ఎవరని శాకల్యుఁడు ప్రశ్న చేయఁగా ఈ మూఁడులోకములే అనిచెప్పి ఏకారణము వలన ఈ మూఁడు లోకముల యందే సమస్త దేవతలు అన్తర్భవించి యుండియున్నారో ఆ కారణము వలన ఈ ముగ్గురు దేవతలు అని యాజ్ఞవల్క్యుఁడు చెప్పెను. ఆ ఇద్దరు దేవతలు ఎవరని శాకల్యుఁడు మరల ప్రశ్న చేయుగా అన్నమును, ప్రాణమును అని యాజ్ఞవల్క్యుఁడు చెప్పెను. అర్ధాధికమైన ఒక దైవమెవరని శాకల్యుఁడు మరల ప్రశ్న చేయగా ఈ విసరునట్టి వాయువని యాజ్ఞవల్క్యుఁడు చెప్పెను.

ఉ॥ తదాహుర్యదయమేక ఇవైవపవతేఽథకథమధ్యర్థ ఇతి యదస్మిన్నిదగ్ సర్వ మధ్యార్ధ్నోత్తేనాధ్యర్ధ ఇతి కతమ ఏకో దేవ ఇతి ప్రాణ ఇతి స బ్రహ్మత్యేదిత్యా చ తే. ॥9॥

ప॥ తత్ – ఆహుః – యత్ – అయం – ఏకః – ఇవ – ఏవ – పవతే – అథ – కథం – అధ్యర్ధః – ఇతి – యత్ – అస్మిన్ – ఇదం – సర్వం – అధ్యార్ధ్నోత్ – తేన – అధ్యర్ధః – ఇతి – కతమః – ఏకః – దేవః – ఇతి – ప్రాణః – ఇతి – సః – బ్రహ్మ – త్యత్ – ఇతి – ఆచక్షతే.

ప్ర॥ తత్ = దానియందు, ఆహుః = పలికిరి. యదయమేక ఇవైవ = ఒక్కటియగు ఈ వాయువే, పవతే = వీచుచున్నది. అథకథం = సరేయెట్లుగా, అధ్యర్ధ ఇతి = అర్ధాధికమైన ఒక దైవమని, (శంకచేయగా ఉత్తరువును చెప్పచున్నారు). యత్ = ఏ కారణము వలన, అస్మిన్ = ఈ వాయువునందు, ఇదంసర్వం = ఈ సమస్తమును, అధ్యార్ధ్నోత్ = అధికమైనబుద్ధిని పొందుచున్నదో,

తేన = దానిచేతను, అధ్యర్ధ ఇతి = అధ్యర్ధమని, (చెప్పఁబడుచున్నది) ఏకః = ఒక్కఁడగు, దేవః = దేవుఁడు, కతమః = ఎవఁడు, ఇతి = అని, (శాకల్యుఁడు అడిగెను), ప్రాణ ఇతి = ప్రాణమని, (యాజ్ఞవల్క్యుఁడు పలికెను), సః = ఆ ప్రాణము, బ్రహ్మ = మహత్తగు, త్యదితి = ఆ పరబ్రహ్మమని, ఆచక్షతే = చెప్పఁబడుచున్నది.

తా॥ వాయువు అధ్యర్ధమని చెప్పినదాని విషయమై కొందరు ఒక్కటేయగు వాయువు వీచుచుండెను. అది అర్ధాధికమగు ఒకదైవమెట్లైనది యని శంకించగా ఉత్తరువు చెప్పఁబడుచున్నది. ఏ కారణము వలన ఈ వాయువునందు సమస్తమును వృద్ధినిపొందుచున్నదో ఆ కారణము వలననే అధ్యర్ధమైనదని చెప్పిరియని యాజ్ఞవల్క్యుఁడు పలికెను. మరల శాకల్యుఁడు ఒకడైన దేవుఁడెవఁడని ప్రశ్న చేయగా ప్రాణమేయని చెప్పి యేకారణము వలన పూర్వము చెప్పిన అందరు దేవతలు ఈ ఒకటియగు ప్రాణమునందే అంతర్భవించుచు ఈ ప్రాణమే నానా విధములగు దేవతలగుట వలన ఆ ప్రాణమే బృహత్స్వరూపమైన ఆ పరబ్రహ్మమని చెప్పఁబడుచున్నదని యాజ్ఞవల్క్యుఁడు పలికెను.

ఉ॥ పృథివ్యేవ యస్యాయతన మగ్నిర్లోకో మనోజ్యోతి ర్యోవైతం
పురుషం విద్యాత్సర్వస్యాత్మనః పరాయణగ్ స వై వేదితాస్యాత్।
యాజ్ఞవల్క్య వేదవా అహంతం పురుషగ్ సర్వస్యాత్మనః పరా
యణం య మాత్థ య ఏవాయగ్ శారీరః పురుషః స ఏష వదైవ
శాకల్యతస్యకా దేవ తేత్య మృతమితి హోవాచ. ॥10॥

ప॥ పృథివీ – ఏవ – యస్య – ఆయతనం – అగ్నిర్లోకః – మనోజ్యోతిః – యః – వా – ఏతం – పురుషం – విద్యాత్ – సర్వస్య – ఆత్మనః – పరాయణం – సః – వై – వేదితా – స్యాత్ – యాజ్ఞవల్క్య – వేద – వై – అహం – తం – పురుషం – సర్వస్య – ఆత్మనః – పరాయణం – యం – ఆత్థ – యః – ఏవ – అయం – శారీ

రః – పురుషః – సః – ఏషః – వద – ఏవ – శాకల్య – తస్య – కా – దేవతా – ఇతి – అమృతం – ఇతి – హోవాచ.

ప్ర॥ యస్య = ఏ దేవునికి, పృథివ్యేవ = భూమియే, ఆయతనం = స్థానమో, అగ్నిర్లోకః = అగ్నియే లోకమో, (అగ్ని చేత చూచుటయో), మనోజ్యోతిః = మనస్సే జ్యోతిస్సో, మనస్సు చేతనే సంకల్ప వికల్పాది కార్యము చేయుచున్నదియో) ఏతం = ఈ, పురుషం = పురుషుని, యోవై = ఎవఁడైనను, సర్వస్య = సమస్తమైన, ఆత్మనః – ఆత్మకు, (ఆధ్యాత్మికమైన దేహేంద్రియాది సముదాయమునకు) పరాయణం = మిక్కిలి ఆశ్రయమును గాను, (తల్లి వలనఁ బుట్టిన త్వఙ్మాంస రుధిరరూపమగు క్షేత్రస్థానీయము చేత, తండ్రి వలనఁ బుట్టిన అస్థిమజ్జాశుక్రరూపమైన బీజస్థానీయము నగు ఇంద్రియాత్మకు మిక్కిలి ఆశ్రయమునుగాను), విద్యాత్ = తెలిసికొనునో, సవై = వాఁడే, వేదితా = తెలిసికొనువాఁడు (పండితుఁడు) స్యాత్ = అగును, హేయాజ్ఞవల్క్య = ఓ యాజ్ఞవల్క్యుఁడా, అహం = నేను, తం = ఆ, పురుషం = పురుషుని, సర్వస్యాత్మనః= సమస్తమైన దేహేంద్రియాది సముదాయమునకు, పరాయణం = మిక్కిలి ఆశ్రయమునుగాను, వేదవా = గుర్తెఱుఁగుదును. (అని), యం = ఎవనిని, ఆత్థ = పలికితివో, (తం = వానిని, అహం = నేను, వేద = గుర్తెఱుఁగుదును. త్వం = నీవు, తం పురుషం = ఆ పురుషుని, వేత్థయది = తెలిసికొనియుంటివేని, అసౌ = ఈ దేవుఁడు, కింవిశేషణః = ఏమి విశేషణము గలవాఁడు, బ్రూహి = చెప్పుమా, అని శాకల్యుఁడు ప్రశ్న చేసెను.) శారీరః = శరీరమందైన, అయం= ఈ, పురుషః = పురుషుఁడు, యఏవ = ఎవఁడో, సః = వాఁడే, ఏషః = ఈ పురుషుఁడు. (ఓ శాకల్యుఁడా నీచేత అడుగఁబడిన పురుషుఁడు వాఁడే), హే శాకల్య = ఓ శాకల్యుఁడా! (నీవు ఇంకా యేవియైనను విశేషణములు అడుగవలసి యున్నయెడల) వదైవ = అడు

గుము, (అని యాజ్ఞవల్క్యుఁడు పలికెను.) తస్య = ఆ పురుషునికి, దేవతా = దేవత, కా = ఏది, ఇతి = అని, (శాకల్యుఁడు ప్రశ్న చేసెను) అమృతమితి = అమృతము అని, హోవాచ = పలికెను. (అనుభవించిన అన్నము యొక్క రసమూ తల్లివలన పుట్టిన రక్తమునకు తండ్రి వలన పుట్టిన శుక్రమునకు కారణము. ఈ రక్తశుక్రములు శరీరోత్పత్తికి కారణములు. అవియే పురుషునకు దేవతా స్వరూపమైన అమృతమని యాజ్ఞవల్క్యుఁడు పలికెను.)

తా॥ ఇప్పుడు ఆ ప్రాణమను పరబ్రహ్మమునకే మరల యెనిమిది విధములయిన భేదములు ధ్యానము కొరకు ఉపదేశింపఁబడుచున్నవి. ఓ శాకల్యుఁడా! ఎవఁడు భూమియే స్థానముగాఁగలిగి అగ్నిచేతనే సర్వమును చూచుచున్న మనస్సనెడి జ్యోతిస్సుతో సంకల్ప వికల్పాది కార్యము చేయుచున్న ఈ పురుషుని సమస్తమైన దేహేంద్రియాది సముదాయమునకు మిక్కిలి స్థానమునుగాఁ దెలిసికొనుచున్నాఁడో, వాఁడే పండితుఁడగుచున్నాఁడని యాజ్ఞవల్క్యుఁడనెను. శాకల్యుఁడు ఓ యాజ్ఞవల్క్యుఁడా! నేను ఆ పురుషుని గుర్తెఱుఁగుదును. అని నీవు చెప్పిన పురుషుని నేను గుర్తెరుగుదును. నీవు ఆ పురుషుని గుర్తెఱింగితివేని ఆ పురుషుఁడే విశేషణములు గల వాఁడో చెప్పుమా యని ప్రశ్నముచేసెను. యాజ్ఞవల్క్యుఁడు ఓ శాకల్యుఁడా! ఆ పురుషుఁడే విశేషణములు గలవాఁడో చెప్పుచున్నాను వినుము. ఓ శాకల్యుఁడా! శరీరమందైన పురుషుఁడేయని చెప్పి ఇంకా నీవు అడుగఁదగినదేదియైనను కలదేని అడుగుమాయని యాజ్ఞవల్క్యుఁడు పలికెను. అప్పుడు శాకల్యుఁడు ఓ యాజ్ఞవల్క్యుఁడా! ఆ పురుషునికి ఏది దేవతయని ప్రశ్న చేసెను. ఓ శాకల్యుఁడా! శరీరోత్పత్తికి కారణములైన శుక్లశోణితరూపమైన అమృతమే ఆ పురుషునికి దేవతయని యాజ్ఞవల్క్యుఁడు పలికెను.

ఉ॥ కామ ఏవ యస్యాయతనగ్ హృదయం లోకో మనోజ్యోతి ర్యో వై తం పురుషం విద్యాత్సర్వస్యాత్మనః పరాయణగ్ స వై వేదితా స్యాత్ । యాజ్ఞవల్క్య వేద వా అహం తం పురుషగ్ సర్వస్యాత్మనః పరాయణం యమాత్థ య ఏవా యం కామమయః పురుషః స ఏషవదైవ శాకల్య తస్య కా దేవ తేతి స్త్రియ ఇతి హోవాచ. ॥11॥

ప॥ కామః – ఏవ – యస్య – ఆయతనం – హృదయంలోకః – మనోజ్యోతిః – యః – వా – ఏతం – పురుషం – విద్యాత్ – సర్వస్య – ఆత్మనః – పరాయణం – సః – వై – వేదితా–స్యాత్ – యాజ్ఞవల్క్య – వేద – వై – అహం – తం – పురుషం – సర్వస్య– ఆత్మనః – పరాయణం – యం – ఆత్థ – యః – ఏవ – అయం – కామమయః – పురుషః – సః – ఏషః – వద – ఏవ – శాకల్య – తస్య – కా – దేవతా – – స్త్రియః – ఇతి – హోవాచ.

ప్ర॥ యస్య = ఏ దేవునికి, కామఏవ = కామమె, (కామశరీరము), ఆయతనం = స్థానమో, హృదయంలోకః = హృదయము లోకమో, (బుద్ధిచేత చూచుటయో), మనోజ్యోతిః = మనస్సే జ్యోతిస్సో,(మనస్సుచేతనే సంకల్ప వికల్పాదికార్యము చేయుటయో), ఏతంపురుషం = ఈ పురుషుని, యోవా = ఎవఁడైనను, సర్వస్య = సమస్తమైన, ఆత్మనః = దేహేంద్రియాది సముదాయమునకు, పరాయణం = మిక్కిలి స్థానమునుగాను, విద్యాత్ = తెలిసికొనునో, సవై = వాఁడే, వేదితా = తెలిసికొనువాఁడు, (పండితుఁడు) స్యాత్ = అగును. హే యాజ్ఞవల్క్య = ఓ యాజ్ఞవల్క్యుఁడా, అహం = నేను, సర్వస్య = సమస్తమైన, ఆత్మనః = దేహేంద్రియ సముదాయమునకు, పరాయణం = మిక్కిలి ఆశ్రయమైన, తంపురుషం = ఆ పురుషుని, వేదవై = గుర్తెఱుఁగుదును (అని), యం = పురుషుని, ఆత్థ = పలికితివో, (ఆ పురుషుని నేను గుర్తెఱుఁగుదును.

నీవు ఆ పురుషుని గుర్తెఱింగితివేని ఆ పురుషుఁడేవిశేషణములు గల వాఁడో చెప్పుమాయని శాకల్యుఁడు ప్రశ్నచేసెను). కామమయః = కామరూపమైన. అయం = ఈ, పురుషః = పురుషుఁడు, యఏవ = ఎవఁడో, సః = వాఁడు, ఏషః = ఈ పురుషుఁడు. (నీచేత అడుగఁ బడిన పురుషుఁడువాఁడె), హే శాకల్య = ఓ శాకల్యుఁడా! (నీవు ఇంకను విశేషణములడుగవలసియున్నయెడలఁ వదైవ = అడుగుమా, (అని యాజ్ఞవల్క్యుఁడు పలికెను). తస్య = ఆ కామరూపుఁడైన పురుషునికి, దేవతా = దేవత, కా = ఏది, ఇతి = అని, (శాక ల్యుఁడు ప్రశ్నచేసెను). స్త్రియఇతి = స్త్రీలని, (యాజ్ఞవల్క్యుఁడు), హోవాచ = పలికెను.

తా॥ ఓ శాకల్యుఁడా! ఎవనికి స్త్రీ సంభోగాభిలాషయె ఆశ్రి యమును, బుద్ధిచేతను చూచుటయును, మనస్సను జ్యోతిస్సుచేత సం కల్పాదికమును చేయుటయును, కలదో ఇట్టి పురుషుని యెవఁడు దేహేంద్రియాది సముదాయమునకు మిక్కిలి ఆశ్రయమునుగాఁ దెలిసికొనునో, వాఁడె పండితుఁడగునని యాజ్ఞవల్క్యుఁడు పలు కగా, ఓ యాజ్ఞవల్క్యుఁడా! నేను ఆ దేహేంద్రియాది సముదాయ మునకు మిక్కిలి ఆశ్రయమైన ఆ పురుషుని గుర్తెఱుఁగుదునని నీవు చెప్పిన ఆ పురుషుని నేను గుర్తెఱుఁగుదును. గనుక వాని విశేషణ ములు చెప్పుమాయని శాకల్యుఁడు ప్రశ్నచేయగా, యాజ్ఞవల్క్యుఁడు ఓ శాకల్యుఁడా! కామరూపమైన పురుషుఁడే వాఁడని చెప్పి యింకను నీవు అడుగఁదగినదేదియైనను గలదేని అడుగుమాయని పలికెను. అప్పుడు శాకల్యుఁడు ఓ యాజ్ఞవల్క్యుఁడా! ఆ కామరూపమైన పురుషునికి దేవత ఏదియని ప్రశ్నచేయగా యాజ్ఞవల్క్యుఁడు స్త్రీల వలన కామమునకు ప్రకాశము కలుగుచున్నదిగనుక ఆ కామరూప మైన పురుషునికి స్త్రీలే దేవతయని పలికెను.

ఉ॥ రూపాణ్యేవ యస్యాయతనం చక్షుర్లోకో మనోజ్యోతిర్యో వై

తం పురుషం విద్యాత్సర్వస్యాత్మనః పరాయణగ్ స వై వేదితా స్యాత్ యాజ్ఞవల్క్య వేద వా అహం తం పురుషగ్ సర్వస్యాత్మనః పరాయణం యమాత్థ య ఏవా సావాదిత్యే పురుషః స ఏష వదైవశాకల్య తస్య కా దేవతేతి సత్యమితి హోవాచ. ॥12॥

ప॥ రూపాణి – ఏవ – యస్య – ఆయతనం – చక్షుర్లోకః – మనోజ్యోతిః – యః – వా – ఏతం – పురుషం – విద్యాత్ – సర్వస్య– ఆత్మనః – పరాయణం – సః – వై – వేదితా – స్యాత్ – యాజ్ఞవల్క్య – వేద – వై – అహం – తం – పురుషం – సర్వస్య – ఆత్మనః – పరాయణం – యం – ఆత్థ – యః – ఏవ – అసౌ – ఆదిత్యే – పురుషః – సః – ఏషః – వద – ఏవ – శాకల్య – తస్య– కా – దేవతా – ఇతి – సత్యం – ఇతి – హోవాచ.

ప్ర॥ యస్య = ఎవనికి, రూపాణ్యేవ=ఆకారములే, ఆయతనం= స్థానమో, చక్షుర్లోకః = నేత్రమేచూపో, (నేత్రముచేతనె చూచుటయో), మనోజ్యోతిః = మనస్సే జ్యోతిస్సో (మనస్సుచేతనే సంకల్పవికల్పాది కార్యమును చేయుటయో), ఏతం = ఈ, పురుషం = పురుషుని, యోవా = ఎవఁడైనను, సర్వస్య = సమస్తమైన, ఆత్మనః = దేహేంద్రియాది సముదాయమునకు, పరాయణం = మిక్కిలి స్థానమునుగాను, విద్యాత్ = తెలిసికొనునో, సవై = వాఁడే, వేదితా = తెలిసికొనువాఁడు, స్యాత్ =అగును. హేయాజ్ఞవల్క్య= ఓ యాజ్ఞవల్క్యుఁడా, అహం = నేను, సర్వస్య = సమస్తమైన, ఆత్మనః = దేహేంద్రియాది సముదాయమునకు, పరాయణం = మిక్కిలి ఆశ్రయమైన, తంపురుషం = ఆ పురుషుని, వేదవై = గుర్తెఱుఁగుదును (అని), యం = ఏ పురుషుని, ఆత్థ = పలికితివో, (ఆ పురుషుని నేను గుర్తెఱుఁగుదును). నీవు ఆపురుషుని గుర్తెఱిఁగితివేని ఆ పురుషుఁడేవిశేషములు కలవాఁడో చెప్పుమాయని శాకల్యుఁడు ప్రశ్నచేసెను). ఆదిత్యే = సూర్యునియందు, అసౌ = ఈ,

పురుషః = పురుషుఁడు, యఏవ = ఎవఁడో, సః = వాఁడె, ఏషః = ఈ పురుషుఁడు. (అని చెప్పి) హేశాకల్య = ఓ శాకల్యుఁడా, (నీవు ఇంకను విశేషణములడుగవలసి యున్న యెడల). వదైవ = అడుగుమా, (అని యాజ్ఞవల్క్యుఁడు పలికెను). తస్య = ఆ పురుషునికి, దేవతా= దేవత, కా = ఏది, ఇతి = అని, (శాకల్యుఁడు ప్రశ్న చేసెను). సత్యమితి = సత్యమని, హోవాచ = పలికెను.

తా॥ ఓ శాకల్యుఁడా ! ఎవనికి ఆకారములే నివాసమును, నేత్రముచేతనే చూపును, మనస్సను జ్యోతిస్సుచేతనే సంకల్ప వికల్పాది కార్యమును చేయుటయో, ఇట్టి పురుషుని ఎవఁడు దేహేంద్రియాది సముదాయమునకు మిక్కిలి ఆశ్రయమునుగాను తెలిసికొను వాఁడే పండితుఁడగునని యాజ్ఞవల్క్యుఁడు పలుకగా ఓ యాజ్ఞవల్క్యుఁడా ! నీవు గుర్తెఱుఁగుదునని చెప్పిన ఆపురుషుని నేను గుర్తెఱుఁగుదును. వానిని చెప్పుమాయని శాకల్యుఁడు ప్రశ్న చేసెను. యాజ్ఞవల్క్యుఁడు ఓ శాకల్యుఁడా ! ఈ సూర్యునియందున్న పురుషుఁడే ఈ దేహేంద్రియాది సముదాయమున కాశ్రయమైన పురుషుఁడు అని చెప్పి యింకా నీవడుగఁదగినదున్నయెడల అడుగుమాయని పలికెను. అప్పుడు శాకల్యుఁడు ఓ యాజ్ఞవల్క్యుఁడా ! ఆ పురుషునికి దేవతేదియని ప్రశ్న చేయగా, సత్యమని మరల యాజ్ఞవల్క్యుఁడు చెప్పెను. (ఇక్కడ సత్యమనఁగా పృథివ్యప్తేజస్సులు).

ఉ॥ ఆకాశ ఏవ యస్యాయతనగ్ శ్రోత్రం లోకో మనోజ్యోతిర్యో వై తం పురుషం విద్యాత్సర్వస్యాత్మనః పరాయణగ్ స వై వేదితా స్యాత్ యాజ్ఞవల్క్య వేద వా అహం తం పురుషగ్ సర్వస్యాత్మనః పరాయణం యమాత్థ య ఏవాయగ్ శ్రౌత్రః ప్రాతిశ్రుత్కః పురుషః స ఏషః వదైవ శాకల్య తస్య కా దేవతేతి దిశ ఇతి హోవాచ. ॥13॥

ప॥ ఆకాశః – ఏవ – యస్య – ఆయతనం – శ్రోత్రంలోకః–

మనోజ్యోతిః – యః – వా – ఏతం – పురుషం – విద్యాత్ – సర్వస్య– ఆత్మనః – పరాయణం – సః – వై – వేదితా – స్యాత్ – యాజ్ఞవల్క్య – వేద – వై – అహం – తం – పురుషం – సర్వస్య – ఆత్మనః – పరాయణం – యం – ఆత్థ – యః – ఏవ – అయం – శ్రౌత్రః – ప్రాతిశ్రుత్కః – పురుషః – సః – ఏషః – వద – ఏవ – శాకల్య – తస్య – కా – దేవతా – ఇతి – దిశః – ఇతి – హోవాచ.

ప్ర॥ యస్య = ఎవనికి, ఆకాశఏవ = ఆకాశమే, ఆయతనం= స్థానమో. శ్రోత్రంలోకః = చెవియెచూపో, మనోజ్యోతిః = మనస్సే జ్యోతిస్సో, (మనస్సుచేత తెలిసికొనుటయో), ఏతం=ఈ, పురుషం= పురుషుని, యోవా = ఎవఁడైనను, సర్వస్యాత్మనః = సమస్తమైన దేహేంద్రియాది సముదాయమునకు, పరాయణం = మిక్కిలి స్థానముగాను, విద్యాత్ = తెలిసికొనునో, సవై = వాఁడే, వేదితా= తెలిసికొనువాఁడు, స్యాత్ = అగును. హేయాజ్ఞవల్క్య = ఓయాజ్ఞవల్క్యుఁడా, అహం = నేను, సర్వస్యాత్మనః = సమస్తమైన దేహేంద్రియాది సముదాయమునకు, పరాయణం = మిక్కిలి స్థానమైన, తం = ఆ, పురుషం = పురుషుని, వేదవై = గుర్తెఱుఁగుదును. (అని) యం = ఏ పురుషుని, ఆత్థ = పలికితివో, (ఆపురుషుని నేను గుర్తెఱుఁగుదును. నీవు ఆ పురుషుని గుర్తెఱిఁగితివేని ఆ పురుషుఁడేవిశేషణములు కలవాఁడో చెప్పుమాయని శాకల్యుఁడు ప్రశ్నచేసెను). అయం = ఈ, ప్రాతిశ్రుత్కః = ప్రతిదానిని వినడమువల్లనైనవాఁడును, శ్రౌత్రః = శ్రోత్రమునందైనవాఁడునగు, పురుషః = పురుషుఁడు, యఏవ = ఎవఁడో, సః = వాఁడే, ఏషః = ఈ పురుషుఁడు, (అనిచెప్పి), హేశాకల్య = ఓ శాకల్యుఁడా, (నీవు యింకా విశేషణములడుగవలసినవి యున్నయెడల), వదైవ = అడుగుమా, (అని యాజ్ఞవల్క్యుఁడు పలికెను). తస్య = ఆ పురుషునికి, కాదేవతేతి = దేవతఏదియని, (శాకల్యుఁడు ప్రశ్నచేసెను), దిశఇతి =

దిక్కులని, హోవాచ = పలికెను. (యాజ్ఞవల్క్యుఁడు పలికెను).

తా॥ ఓ శాకల్యుఁడా! ఎవనికి ఆకాశము స్థానమును, చెవిచేత చూచుటయును, మనస్సుచేత తెలిసికొనుటయును, కలదో, ఇట్టి పురుషుని సమస్తమైన దేహేంద్రియాది సముదాయమునకు స్థానమునుగా తెలిసికొనువాఁడే పండితుడగునని యాజ్ఞవల్క్యుఁడు పలుకగా, ఓ యాజ్ఞవల్క్యుఁడా! నీవు గుర్తెఱుఁగుదునని చెప్పిన ఆ పురుషుని నేను గుర్తెఱుఁగుదును. వానిని చెప్పుమాయని శాకల్యుఁడు ప్రశ్న చేసెను. యాజ్ఞవల్క్యుఁడు ఓ శాకల్యుఁడా! ప్రతి దానిని వినడమువల్లనైనవాఁడును, చెవియందు పుట్టినవాఁడునగు ఈ పురుషుఁడే, ఆ దేహేంద్రియాది సముదాయమున కాశ్రయమైన పురుషుఁడు అనిచెప్పి యింకా నీవు అడుగఁదగినది యున్నయెడల అడుగుమాయని పలికెను. అప్పుడు శాకల్యుఁడు ఓ యాజ్ఞవల్క్యుఁడా! ఆ పురుషునికేది దేవతయని మరల ప్రశ్న చేయగా, దిక్కులు దేవతయని మరల యాజ్ఞవల్క్యుఁడు చెప్పెను.

ఉ॥ తమ ఏవ యస్యాయతనగ్ హృదయం లోకో మనోజ్యోతిర్యో వై తం పురుషం విద్యాత్సర్వస్యాత్మనః పరాయణగ్ స వై వేదితాస్యాత్ యాజ్ఞవల్క్య వేద వా అహం తం పురుషగ్ సర్వస్యాత్మనః పరాయణం యమాత్థ య ఏ వాయం ఛాయామయః పురుషః స ఏష వదైవ శాకల్య తస్య కా దేవతేతి మృత్యురితి హోవాచ. ॥14॥

ప॥ తమః – ఏవ – యస్య – ఆయతనం – హృదయం – లోకః – మనోజ్యోతిః – యః – వా – ఏతం – పురుషం – విద్యాత్ – సర్వస్య – ఆత్మనః – పరాయణం – సః – వై – వేదితా – స్యాత్ – యాజ్ఞవల్క్య – వేద – వై – అహం – తం – పురుషం – సర్వస్య – ఆత్మనః పరాయణం – యం – ఆత్థ – యః – ఏవ – అయం – ఛాయామయః – పురుషః – సః – ఏషః – వద – ఏవ –

శాకల్య – తస్య కా – దేవతా – ఇతి మృత్యుః – ఇతి – హోవాచ.

ప్ర॥ యస్య = ఎవనికి, తమఏవ = చీఁకటియె, ఆయతనం = స్థానమో, హృదయంలోకః = హృదయము చూపో, (హృదయము చేత చూచుటయో), మనోజ్యోతిః = మనస్సు తెలిసికొనుటయో, (మనస్సుచేత తెలిసికొనుటయో), ఏతం = ఈ, పురుషం = పురుషుని, యోవా = ఎవఁడైనను, సర్వస్యాత్మనః = సమస్తమైన దేహేంద్రియాది సముదాయమునకు, పరాయణం=మిక్కిలి స్థానముగాను, విద్యాత్ = తెలిసికొనునో, సవై = వాఁడే, వేదితా = తెలిసికొనువాఁడు, (పండితుఁడు), స్యాత్ = అగును. హేయాజ్ఞవల్క్య = ఓ యాజ్ఞవల్క్యుఁడా, అహం = నేను, సర్వస్యాత్మనః= సమస్తమైన దేహేంద్రియాది సముదాయమునకు, పరాయణం = మిక్కిలి స్థానమైన, తం = ఆ, పురుషం = పురుషుని, వేదవై = గుర్తెఱుఁగుదును. (అని), యం = ఏ పురుషుని, ఆత్థ = పలికితివో, (ఆ పురుషుని నేను గుర్తెఱుఁగుదును. నీవు ఆ పురుషుని గుర్తెఱిఁగితివేని ఆ పురుషుఁడేవిశేషణముకలవాఁడో చెప్పుమాయని శాకల్యుఁడు ప్రశ్నచేసెను). అయం = ఈ, ఛాయామయః = అజ్ఞానస్వరూపుఁడైన, పురుషః = పురుషుఁడు, యఏవ = ఎవఁడో, సః = వాఁడే, ఏషః = ఈ పురుషుఁడు, (అనిచెప్పి), హేశాకల్య = ఓ శాకల్యుఁడా, (నీవు ఇంకను విశేషణములడుగవలసినవి యున్నయెడల), వదైవ = అడుగుమా (అని యాజ్ఞవల్క్యుఁడు పలికెను). తస్య = ఆ పురుషునికి, కాదేవతేతి = ఏదేవతయని, (శాకల్యుఁడు ప్రశ్నచేసెను). మృత్యురితి = మృత్యువు అని, (యాజ్ఞవల్క్యుఁడు), హోవాచ = పలికెను.

తా॥ ఓ శాకల్యుఁడా ఎవనికి చీఁకటియే స్థానమును హృదయముచేత చూచుటయును మనస్సను తేజస్సుచేత తెలిసికొనుటయును కలదో ఇట్టి పురుషుని ఈ సమస్తమైన దేహేంద్రియాది సము

దాయమునకు మిక్కిలి స్థానమునుగా, దెలిసికొనువాఁడు పండితుఁ డగుచున్నాఁడని యాజ్ఞవల్క్యుఁడు చెప్పెను. అప్పుడు ఓ యాజ్ఞవల్క్యుఁడా! నీవు గుర్తెఱుఁగుదునని చెప్పిన ఆ పురుషుని నేను గుర్తెఱుఁగుదును. వానిని చెప్పుమాయని శాకల్యుఁడు ప్రశ్నచేసెను. యాజ్ఞవల్క్యుఁడు ఓ శాకల్యుఁడా! అజ్ఞాన స్వరూపుఁడైన ఈ పురుషుఁడే ఆ దేహేంద్రియాది సముదాయమునకాశ్రయుఁడైన ఆ పురుషుఁడు అని చెప్పి యింకను నీవు అడుగఁదగినది యున్నయెడల అడుగుమాయని పలికెను. అప్పుడు శాకల్యుఁడు ఓ యాజ్ఞవల్క్యుఁడా! ఆ అజ్ఞానమయ పురుషునికేది దేవతయని ప్రశ్నచేయగా మృత్యువే ఆ అజ్ఞానమయ పురుషునికి దేవతయని యాజ్ఞవల్క్యుఁడు పలికెను.

ఉ॥ రూపాణ్యేవ యస్యాయతనం చక్షుర్లోకో మనోజ్యోతిర్యో వై
తం పురుషం విద్యాత్సర్వస్యాత్మనః పరాయణగ్ స వై వేదితా
స్యాత్ యాజ్ఞవల్క్య వేద వా అహం తం పురుషగ్ సర్వస్యా
త్మనః పరాయణం యమాత్థ య ఏవాయ మాదర్శే పురుషః స
ఏష వదైవ శాకల్య తస్య కా దేవతేత్యసురితి హోవాచ. ॥15॥

ప॥ రూపాణి – ఏవ – యస్య – ఆయతనం – చక్షుః – లోకః – మనోజ్యోతిః – యః – వా – ఏతం – పురుషం – విద్యాత్ – సర్వస్య – ఆత్మనః – పరాయణం – సః – వై – వేదితా – స్యాత్ – యాజ్ఞవల్క్య – వేద – వై . అహం – తం – పురుషం – సర్వస్య – ఆత్మనః – పరాయణం – యం – ఆత్థ – యః – ఏవ – అయం – ఆదర్శే – పురుషః – సః – ఏషః – వగ – ఏవ – శాకల్య – తస్య – కా – దేవతా – ఇతి – అసుః – ఇతి – హోవాచ.

ప్ర॥ యస్య = ఎవనికి, రూపాణ్యేవ = ఆకారములే, ఆయతనం = స్థానమో, చక్షుర్లోకః = నేత్రముచూపో, మనోజ్యోతిః = మనస్సే తేజస్సో, ఏతం = ఈ, పురుషం = పురుషుని, యోవా = ఎవఁడైనను, సర్వస్యాత్మనః = సమస్తమైన దేహేంద్రియాది సము

దాయమునకు, పరాయణం = మిక్కిలి స్థానమునుగాను, విద్యాత్ = తెలిసికొనునో, సవై = వాఁడే, వేదితా = తెలిసికొనువాఁడు, (పండితుడు), స్యాత్ = అగును, హే యాజ్ఞవల్క్య = ఓ యాజ్ఞవల్క్యుఁడా, అహం = నేను, సర్వస్యాత్మనః = సమస్తమైన దేహేంద్రియాది సముదాయమునకు, పరాయణం = స్థానమైన, తంపురుషం = ఆ పురుషుని, వేదవై = గుర్తెఱుఁగుదును, (అని), యం = ఏ పురుషుని, ఆత్థ = పలికితివో, (ఆ పురుషుని నేను గుర్తెఱుఁగుదును. నీవు ఆ పురుషుని గుర్తెఱిఁగితివేని ఆ పురుషుఁడు ఏ విశేషణములు కలవాఁడో, చెప్పుమాయని శాకల్యుఁడు ప్రశ్న చేసెను). ఆదర్శే = అద్దమునందలి, అయం = ఈ, పురుషః = పురుషుఁడు, యఏవ = ఎవఁడో, సః = వాఁడు. ఏషః = ఈ పురుషుఁడు. (అని చెప్పి), హే శాకల్య = ఓ శాకల్యుఁడా. (నీవు ఇంకను విశేషణము లడుగవలసినది యున్న యెడల), వదైవ = అడుగుమా, (అని యాజ్ఞవల్క్యుఁడు పలికెను). తస్య = ఆ ప్రతిబింబ స్వరూపుఁడైన పురుషునికి, కా దేవ తేతి = దేవతఏదియని, (శాకల్యుఁడు ప్రశ్న చేసెను). ఆసురితి = ప్రాణమని, (యాజ్ఞవల్క్యుఁడు), హోవాచ = పలికెను.

తా॥ ఓ శాకల్యుఁడా! ఎవనికి రూపములే స్థానమును, నేత్రములచేతనే చూచుటయును మనస్సుచేత తెలిసికొనుటయును కలదో ఇట్టి పురుషుని సమస్తమైన దేహేంద్రియాది సముదాయమునకు ఆశ్రయునిగాఁ దెలిసికొనువాఁడు పండితుఁడని యాజ్ఞవల్క్యుఁడు చెప్పెను. అప్పుడు ఓ యాజ్ఞవల్క్యుఁడా! నీవు గుర్తెఱుఁగుదునని, చెప్పిన ఆ పురుషుని నేను గుర్తెఱుఁగుదును. వానిని చెప్పుమాయని శాకల్యుఁడు ప్రశ్న చేసెను. యాజ్ఞవల్క్యుఁడు ఓ శాకల్యుఁడా! అద్దమునందలి ప్రతిబింబముగానుండెడి ఆ పురుషుఁడే ఈ దేహేంద్రియాది సముదాయమున కాశ్రయుఁడైన పురుషుఁడు అని చెప్పి యింకను నీవు అడుగఁదగినది యున్న యెడల అడుగుమాయని పలికెను. అప్పుడు శాక

ల్యుఁడు ఓ యాజ్ఞవల్క్యుఁడా! ఆ ప్రతిబింబస్వరూపమైన పురుషుని కేది దేవతయని ప్రశ్న చేసెను. యాజ్ఞవల్క్యుఁడు ఓ శాకల్యుఁడా! ఆ ప్రతిబింబరూపుఁడైన పురుషునికి ప్రతిబింబమునకు కారణమైన ప్రాణమే దేవతయని పలికెను.

ఉ॥ ఆప ఏవ యస్యాయతనగ్ హృదయంలోకో మనోజ్యోతిర్యో వై తం పురుషం విద్యాత్సర్వస్యాత్మనః పరాయణగ్ స వై వేదితా స్యాత్ యాజ్ఞవల్క్య వేదవా అహంతం పురుషగ్ సర్వస్యాత్మనః పరాయణం యమాత్థ య ఏవాయమప్సు పురుషః స ఏషవ దైవ శాకల్య తస్య కా దేవతేతి వరుణ ఇతి హోవాచ. ॥16॥

ప॥ ఆపః – ఏవ – యస్య – ఆయతనం – హృదయం – లోకః – మనోజ్యోతిః – యః – వా – ఏతం – పురుషం – విద్యాత్ – సర్వస్య – ఆత్మనః – పరాయణం – సః – వై – వేదితా – స్యాత్ – యాజ్ఞవల్క్య – వేద – వై – అహం – తం – పురుషం– సర్వస్య – ఆత్మనః – పరాయణం – యం – ఆత్థ – యః – ఏవ – అయం – అప్సు – పురుషః – సః – ఏషః – వద – ఏవ–శాకల్య – తస్య – కా – దేవతా – ఇతి – వరుణః – ఇతి – హోవాచ.

ప్ర॥ యస్య = ఎవనికి, ఆపః = ఉదకములు, ఆయతనం = స్థానమో, హృదయంలోకః = హృదయముచూపో, (హృదయము చేత చూచుటయో), మనోజ్యోతిః = మనస్సే జ్యోతిస్సో, (మనస్సు చేతఁ దెలిసికొనునదియో). ఏతం = ఇటువంటి, పురుషం = పురుషుని, యోవా = ఎవఁడైనను. సర్వస్యాత్మనః = సమస్తమైన దేహేంద్రియాది సముదాయమునకు, పరాయణం = మిక్కిలి ఆశ్రయమునుగాను, విద్యాత్ = తెలిసికొనునో, సవై = వాఁడే, వేదితా = తెలిసికొనువాఁడు, (పండితుఁడు), స్యాత్ = అగును. హేయాజ్ఞవల్క్య = ఓ యాజ్ఞవల్క్యుఁడా! అహం = నేను, సర్వస్యాత్మనః = సమస్తమైన దేహేంద్రియాది సముదాయమునకు,

పరాయణం = మిక్కిలి ఆశ్రయమైన, తంపురుషం = ఆ పురుషుని, వేదవై = గుర్తెఱుఁగుదును, (అని), యం = ఏ పురుషుని, ఆత్థ = పలికితివో, (ఆ పురుషుని నేను గుర్తెఱుఁగుదును. నీవు ఆ పురుషుని గుర్తెఱిఁగితివేని ఆ పురుషుఁడే విశేషణములు కలవాఁడో చెప్పుమా యని శాకల్యుఁడు ప్రశ్నచేసెను). అప్సు = ఉదకములయందలి, అయం = ఈ, పురుషః = పురుషుఁడు, యఏవ = ఎవఁడో, సః = వాఁడు, ఏషః = ఈ పురుషుఁడు, (అనిచెప్పి), హేశాకల్య = ఓ శాకల్యుఁడా, (నీవడుగవలసినది యున్నయెడల), వదైవ = అడుగుమా, (యని యాజ్ఞవల్క్యుఁడు పలికెను). తస్య = ఆ పురుషునికి, కాదేవతేతి = ఏది దేవతయని, (శాకల్యుఁడు ప్రశ్నచేసెను). వరుణ ఇతి = వరుణదేవుఁడని, హోవాచ = పలికెను.

తా॥ ఓ శాకల్యుఁడా! ఎవనికి ఉదకములే స్థానమును హృదయముచేతనే చూచుటయును మనస్సుచేతనే తెలిసికొనుటయును కలదో అటువంటి పురుషుని సమస్తమైన దేహేంద్రియాది సముదాయమున కాశ్రయునిగా తెలిసికొనువాఁడు పండితుఁడగునని యాజ్ఞవల్క్యుఁడు చెప్పెను. అప్పుడు ఓ యాజ్ఞవల్క్యుఁడా! నీవు గుర్తెఱుఁగుదునని చెప్పిన ఆ పురుషుని నేను గుర్తెఱుఁగుదును. వానిని చెప్పుమాయని శాకల్యుఁడు ప్రశ్నముచేసెను. యాజ్ఞవల్క్యుఁడు ఓ శాకల్యుఁడా! ఉదకములయందలి ఈ పురుషుఁడే దేహేంద్రియాది సముదాయమున కాశ్రయుఁడైన ఆ పురుషుఁడు అని చెప్పి యింకను నీవు అడుగఁదగినది యున్నయెడల అడుగుమాయని యాజ్ఞవల్క్యుఁడు పలికెను. అప్పుడు శాకల్యుఁడు ఓ యాజ్ఞవల్క్యుఁడా! ఉదకములయందలి ఈ పురుషునికి దేవత ఏదియని ప్రశ్నముచేసెను. యాజ్ఞవల్క్యుఁడు ఓ శాకల్యుఁడా! ఉదకములయందైన ఈ పురుషునికి వరుణుఁడు దేవత యని పలికెను.

ఉ॥ రేత ఏవ యస్యాయతనగ్ హృదయం లోకో మనోజ్యోతిర్యో

వై తం పురుషం విద్యాత్సర్వస్యాత్మనః పరాయణగ్ స వై వేది
తా స్యా ద్యాజ్ఞవల్క్య వేద వా అహం తం పురుషగ్ సర్వస్యా
త్మనః పరాయణం యమాత్థ య ఏవా యం పుత్రమయః పురు
షః స ఏష వదైవ శాకల్య తస్య కా దేవ తేతి ప్రజాపతి రితి
హోవాచ. ॥17॥

ప॥ రేతః – ఏవ – యస్య – ఆయతనం – హృదయం – లోకః – మనోజ్యోతిః – యః – వా – ఏతం – పురుషం – విద్యాత్ – సర్వస్య – ఆత్మనః – పరాయణం – సః – వై – వేదితా – స్యాత్ – యాజ్ఞవల్క్య – వేద – వై – అహం – తం – పురుషం– సర్వస్య – ఆత్మనః – పరాయణం – యం – ఆత్థ – యః – ఏవ – అయం – పుత్రమయః – పురుషః – సః – ఏషః – వద – ఏవ – శాకల్య – తస్య – కా – దేవతా – ఇతి – ప్రజాపతిః – ఇతి – హోవాచ.

ప్ర॥ యస్య = ఎవనికి, రేతఏవ = రేతస్సే, ఆయతనం = స్థానమో, హృదయంలోకః = హృదయముచూపో, (హృదయము చేతనే చూచుటయో), మనోజ్యోతిః = మనస్సేజ్యోతిస్సో, (మనస్సుచేతనే తెలిసికొనుటయో), ఏతం = ఇటువంటి, పురుషం = పురుషుని, యోవా = ఎవఁడైనను, సర్వస్యాత్మనః = సమస్తమైన దేహేంద్రియాది సముదాయమునకు, పరాయణం = మిక్కిలి స్థానమునుగాను, విద్యాత్ = తెలిసికొనునో, సవై = వాఁడే, వేదితా= తెలిసికొనువాఁడు, (పండితుఁడు), స్యాత్ = అగును. హేయాజ్ఞవల్క్య = ఓ యాజ్ఞవల్క్యుఁడా! అహం = నేను, సర్వస్యాత్మనః = సమస్తమైన దేహేంద్రియాది సముదాయమునకు, పరాయణం = మిక్కిలి స్థానమైన, తంపురుషం = ఆ పురుషుని, వేదవై = గుర్తెఱుఁగుదును (అని), యం = ఏ పురుషుని, ఆత్థ = పలికితివో, (ఆ పురుషుని నేను గుర్తెఱుఁగుదును. నీవు ఆ పురుషుని గుర్తెఱిఁగితివేని

ఆ పురుషుఁడే విశేషణములు కలవాఁడో చెప్పుమాయని శాకల్యుఁడు ప్రశ్నముచేసెను). పుత్రమయః = పుత్రరూపుఁడైన, అయం = ఈ, పురుషః = పురుషుఁడు, య ఏవ = ఎవఁడో, సః = వాఁడు, ఏషః= ఈ పురుషుఁడు, (అనిచెప్పి), హేశాకల్య = ఓ శాకల్యుఁడా! (ఇంకను నీవడుగవలసిన విశేషణములున్న యెడల). వదైవ = అడుగుమా, (అని యాజ్ఞవల్క్యుఁడు పలికెను). తస్య = ఆ పుత్రరూపుఁడైన పురుషునికి, కా దేవతేతి = ఏది దేవతయని, (శాకల్యుఁడు ప్రశ్నముచేసెను). ప్రజాపతిరితి = తండ్రియని, హోవాచ=పలికెను.

తా॥ ఓ శాకల్యుఁడా! ఎవనికి రేతస్సే స్థానమును హృదయముచేతనే చూచుటయును మనస్సుచేతనే తెలిసికొనుటయునుగలదో అటువంటి పురుషుని సమస్తమైన దేహేంద్రియాది సముదాయమునకు మిక్కిలి ఆశ్రయునిగాను తెలిసికొనువాఁడే పండితుఁడగునని యాజ్ఞవల్క్యుఁడు పలుకఁగా శాకల్యుఁడు ఓ యాజ్ఞవల్క్యుఁడా! నీవు గుర్తెఱుఁగుదునని చెప్పిన ఆ పురుషుని నేను గుర్తెఱుఁగుదును. వానిని చెప్పుమాయని శాకల్యుఁడు ప్రశ్నముచేసెను. యాజ్ఞవల్క్యుఁడు, ఓ శాకల్యుఁడా! ఈ పుత్రస్వరూపుఁడైన పురుషుఁడే దేహేంద్రియాది సముదాయమున కాశ్రయుఁడైన ఆ పురుషుఁడని చెప్పి యింకను నీవడుగఁదగినది యున్నయెడల అడుగుమాయని యాజ్ఞవల్క్యుఁడు పలికెను. అప్పుడు శాకల్యుఁడు ఓ యాజ్ఞవల్క్యుఁడా! పుత్రస్వరూపుఁడైన ఆ పురుషునికి ఏది దేవతయని ప్రశ్నముచేసెను. మరల యాజ్ఞవల్క్యుఁడు - ఓ శాకల్యుఁడా పుత్రస్వరూపుఁడైన పురుషునికి తండ్రియే దేవతయని పలికెను.

ఉ॥ శాకల్యేతి హోవాచ యాజ్ఞవల్క్యస్త్వాగ్ స్విదిమే బ్రాహ్మణా అఙ్గారావక్షయణమక్రతా 3 ఇతి. ॥18॥

ప॥ శాకల్య - ఇతి - హోవాచ - యాజ్ఞవల్క్యః - త్వాం- స్విత్ - ఇమే - బ్రాహ్మణాః - అఙ్గారావక్షయణం - అక్రత -ఇతి,

ప్ర॥ హే శాకల్యేతి= ఓ శాకల్యుఁడాయని, యాజ్ఞవల్క్యః= యాజ్ఞవల్క్యుఁడు, హోవాచ = పలికెను. ఇమే = ఈ, బ్రాహ్మణాః = బ్రాహ్మణులు, త్వాంస్విత్ = నిన్నే, అఙ్గారావక్షయణం = దహింపఁదగినవానినిఁగా, అక్రత = చేసిరి, ఇతి = అని, (యాజ్ఞవల్క్యుఁడు పలికెను).

తా॥ ఇంతకు పూర్వము ఆ ప్రాణమే సూత్రాత్మయైనది. ఈ చెప్పఁబడిన సమస్తము ఆ ప్రాణభేదమగుటవలన ఆ ప్రాణము ఉపాసనకొఱకు ఎనిమిది విధములుగా ఉపదేశింపఁబడినది. ఇప్పుడు యాజ్ఞవల్క్యుఁడు ఊరకయున్న శాకల్యునిగూర్చి బుద్ధి పూర్వకముగాని, శత్రుత్వమును గలుగఁజేసికొనుటను చూపించుచు దిక్కులయొక్క విభాగముచేతను అయిదు విధములుగా విభక్తమైనదానికి హృదయమునందుప సంహారముచేయు నిమిత్తము చెప్పుచున్నాఁడు. ఓ శాకల్యుఁడా! ఈ బ్రాహ్మణులందఱు వాదమునందు భయపడిన వారలై నిన్ను నాచేత దహింపఁజేయఁదగినవానినిఁగా జేసిరి. దానిని నీవు తెలిసికొనక పోతివని యాజ్ఞవల్క్యుఁడు పలికెను.

ఉ॥ యాజ్ఞవల్క్యేతి హోవాచ శాకల్యోయదిదం కురుపాఞ్చాలానాం
బ్రహ్మణా నత్యవాదీః కిం బ్రహ్మ విద్వానితి దిశో వేద సదే
వాస్స ప్రతిష్ఠా ఇతి యద్దిశో వేత్థ సదేవాస్సప్రతిష్ఠాః. ॥19॥

ప॥ యాజ్ఞవల్క్య – ఇతి – హోవాచ – శాకల్యః – యత్ – ఇదం – కురుపాఞ్చాలానాం – బ్రాహ్మణాన్ – అత్యవాదీః – కిం – బ్రహ్మవిద్వాన్ – ఇతి – దిశః – వేద – సదేవాః – సప్రతిష్ఠాః – ఇతి – యత్ – దిశః – వేత్థ – సదేవాః – సప్రతిష్ఠాః.

ప్ర॥ శాకల్యః = శాకల్యుఁడు, హేయాజ్ఞవల్క్యేతి = ఓ యాజ్ఞవల్క్యుఁడాయని, హోవాచ = పలికెను, యదిదం = ఏ ఈ వాక్యమును, కురుపాఞ్చాలానాం = కురుపాంచాల దేశములలోని, బ్రాహ్మణాన్ = బ్రాహ్మణులను, అత్యవాదీః = అతిక్రమించి

పలికితివి. (త్వం=నీవు). కింబ్రహ్మవిద్వాన్ = బ్రహ్మవేత్తవా ఏమి, ఇతి = అని, (శాకల్యుఁడు పలికెను). (యాజ్ఞవల్క్యః = యాజ్ఞవల్క్యుఁడు అహం = నేను), సదేవాః = దేవతలతోఁగూడు కొన్నవియును, సప్రతిష్ఠాః = ప్రతిష్ఠలతోఁకూడుకొన్నవియునగు, దిశః = దిక్కులను, వేద = గుర్తెఱుఁగుదును, ఇతి = అని, (పలికెను). (శాకల్యః = శాకల్యుఁడు, యాజ్ఞవల్క్య = ఓ యాజ్ఞవల్క్యుండా, త్వ = నీవు), సదేవాః = దేవతలతోఁగూడుకొన్న, సప్రతిష్ఠాః = ప్రతిష్ఠలతోఁగూడుకొన్న, దిశః = దిక్కులను, వేత్థ యత్ = తెలిసికొంటివేని, (నీచేత ప్రతిజ్ఞచేయఁబడిన విజ్ఞానము సఫలమైనది ఆయెనేని నేను అడిగెదను చెప్పుమాయని పలికెను).

తా॥ ఇప్పుడు శాకల్యుఁడు కాలముచే ప్రేరితుఁడగుటవలన దాని కనుకూలమైన వేఱుజ్ఞానమునే గ్రహించి శంకించుచున్నాఁడు. ఓ యాజ్ఞవల్క్యుఁడాయని పిలిచి కురుపాంచాల దేశములలోని ఈ బ్రాహ్మణులు వాదమునందు భయపడినవారై నిన్ను దహింపఁ జేయఁదగిన వానినిఁగాఁ జేసిరి. నీవు దానిని తెలిసికొనక పోతివని నీవు బ్రహ్మవిద్వాంసుఁడవయ్యే ఈ బ్రాహ్మణులను ఆక్షేపించి పలుకుచున్నావా అట్లు నీకుఁగల బ్రహ్మవిజ్ఞానమేదియని శాకల్యుఁడు పలికెను. అప్పుడు యాజ్ఞవల్క్యుఁడు, ఓ శాకల్యుఁడా! నాకుఁగల బ్రహ్మవిజ్ఞానమేలాటిదనఁగా అధిష్ఠాన దేవతలతోడను స్థితులతోడను కూడుకొన్న దిగ్విషయకమగు జ్ఞానమని పలికెను. అప్పుడు శాకల్యుఁడు, ఓ యాజ్ఞవల్క్యుఁడా! నీవు అధిష్ఠానదేవతలతోడను స్థితుల తోడను కూడుకొన్న దిగ్విషయకమైన జ్ఞానమును తెలిసికొనియుంటి వేని నేను అడిగెడి దానిని చెప్పుమాయని అడిగెను.

ఉ॥ కిందేవతోఽస్యాం ప్రాచ్యాం దిశ్యసీత్యాదిత్యదేవత ఇతి స ఆదిత్యః కస్మిన్ ప్రతిష్ఠిత ఇతి చక్షుషీతి కస్మిన్ను చక్షుః ప్రతిష్ఠితమితి రూపేష్వితి చక్షుషా హి రూపాణి పశ్యతి కస్మిన్ను రూపాణి

ప్రతిష్ఠితా నీతి హృదయ ఇతి హోవాచ యస్మాద్ధృదయేన హి రూపాణి సర్వోలోకో జానాతి తస్మాద్ధృదయే హ్యేవ రూపాణి ప్రతిష్ఠితాని భవన్తీ త్యేవమేవైత ద్యాజ్ఞవల్క్య॥ ॥20॥

ప॥ కిం – దేవతః – అస్యాం – ప్రాచ్యాం – దిశి – అసి – ఇతి – ఆదిత్య దేవతః – ఇతి – సః – ఆదిత్యః – కస్మిన్ – ప్రతిష్ఠితః – ఇతి – చక్షుషి – ఇతి – కస్మిన్ – ను – చక్షుః – ప్రతిష్ఠితం – ఇతి – రూపేషు – ఇతి – చక్షుషా – హి – రూపాణి – పశ్యతి – కస్మిన్ – ను – రూపాణి – ప్రతిష్ఠితాని – ఇతి – హృదయే – ఇతి – హోవాచ – యస్మాత్ – హృదయేన – హి – రూపాణి – సర్వః – లోకః – జానాతి – తస్మాత్ – హృదయే – హి – ఏవ – రూపాణి – ప్రతిష్ఠితాని – భవన్తి – ఇతి – ఏవం – ఏవ – ఏతత్ – యాజ్ఞవల్క్య.

ప్ర॥ అస్యాం = ఈ, ప్రాచ్యాందిశి = తూర్పుదిక్కునందు, (త్వం = నీవు), కిందేవతః = ఏ దేవతాస్వరూపము, అసి = అగుచున్నావు, ఇతి = అని, (శాకల్యుఁడు ప్రశ్నముచేసెను). ఆదిత్య దేవఇతి = ఆదిత్యదేవతనని, (సూర్యుఁడనని యాజ్ఞవల్క్యుఁడు పలికెను). సః = ఆ, ఆదిత్యః = సూర్యుఁడు, కస్మిన్ = దేనియందు, ప్రతిష్ఠితః = ఉంచఁబడెను, ఇతి = అని, (శాకల్యుఁడు ప్రశ్నము చేసెను). చక్షుషీతి = నేత్రమునందని, (యాజ్ఞవల్క్యుఁడు చెప్పెను). చక్షుః = నేత్రము, కస్మిన్ను = దేనియందు, ప్రతిష్ఠితమితి=ఉంచఁబడినదియని, (శాకల్యుఁడు ప్రశ్న చేసెను). రూపేష్వితి = ఆకారములయందని, (యాజ్ఞవల్క్యుఁడు పలికెను). రూపాణి = ఆకారములను, (జనము), చక్షుషా = నేత్రముచేత, పశ్యతిహి = చూచుచున్నదిగదా. రూపాణి = ఆకారములు, కస్మిన్ను = దేనియందు, ప్రతిష్ఠితానీతి = ఉంచఁబడినవియని, (శాకల్యుఁడు ప్రశ్నముచేసెను), హృదయఇతి = హృదయమునందని, (బుద్ధి మనస్సులను ఒకటిగా చేసి ఇక్కడ హృదయమని చెప్పఁబడినది). (యాజ్ఞవల్క్యుఁడు),

హోవాచ = పలికెను. యస్మాత్ = ఏకారణమువలన, సర్వః = సమస్తమైన, లోకః = జనము, హృదయేనహి = హృదయముచేతనే, రూపాణి = ఆకారములను, జానాతి = తెలిసికొనుచున్నదో, తస్మాత్ = ఆకారణమువలన, రూపాణి = ఆకారములు, హృదయే హ్యేవ = హృదయమునందే, ప్రతిష్ఠితాని = ఉంచఁబడినవి, భవన్తీతి = అగుచున్నవని, (యాజ్ఞవల్క్యుఁడు చెప్పెను). హేయాజ్ఞవల్క్య = ఓ యాజ్ఞవల్క్యుఁడా! ఏతత్ = ఇది, ఏవమేవ = ఈ ప్రకారముగానే, (అని శాకల్యుఁడు ఒప్పుకొనెను).

తా॥ ఈ యాజ్ఞవల్క్యుఁడు తన సంబంధమైన హృదయము దిక్కులయందు దిగాత్మస్వరూపమై అయిదు విధములుగా వేఱుపఱుపఁబడియున్నది. తద్వారా సమస్త జగత్తును ఆత్మస్వరూపముగా పొంది నేను దిగాత్మస్వరూపుఁడనైతినని ప్రతిజ్ఞ చేసెను. ఆప్రతిజ్ఞానుసారముగా శాకల్యుఁడు ప్రశ్నముచేయుచున్నాఁడు. ఓ యాజ్ఞవల్క్యుఁడా! ఈ ప్రాగ్దిక్కునందు నీవు ఏదేవతాస్వరూపుఁడవైతివని శాకల్యుఁడు ప్రశ్నముచేయఁగా యాజ్ఞవల్క్యుఁడు సూర్యదేవతాస్వరూపుఁడనని చెప్పెను. మరల ఆ సూర్యుఁడెక్కడ ఉంచఁబడెనని శాకల్యుఁడు ప్రశ్నముచేయఁగా యాజ్ఞవల్క్యుఁడు నేత్రమునందుంచఁబడియున్నాఁడని చెప్పెను. మరల ఆ నేత్రమెక్కడ యుంచఁబడియున్నదని శాకల్యుఁడు ప్రశ్నముచేయఁగా యాజ్ఞవల్క్యుఁడు నేత్రముచేతనే జనము ఆకారములను చూచుచున్నదిగనుక నేత్రము ఆకారములయందుంచబడియున్నదని చెప్పెను. మరల ఆ రూపములు దేనియందుంచఁబడియున్నవని శాకల్యుఁడు ప్రశ్నముచేయఁగా యాజ్ఞవల్క్యుఁడు సర్వజనము హృదయముచేతనే ఆకారములను తెలిసికొనుచున్నది గనుక రూపములు హృదయమునందే యుంచఁబడియున్నవని చెప్పెను. ఇట్లు చెప్పఁగా శాకల్యుఁడు ఓ యాజ్ఞవల్క్యుఁడా! ఇది ఈ ప్రకారమే యని ఒప్పుకొనెను.

ఉ॥ కిం దేవతోఽస్యాం దక్షిణాయాం దిశ్యసీతి యమదేవత ఇతి స యమః కస్మిన్ప్రతిష్ఠిత ఇతి యజ్ఞ ఇతి కస్మిన్ను యజ్ఞః ప్రతిష్ఠిత ఇతి దక్షిణాయామితి కస్మిన్ను దక్షిణా ప్రతిష్ఠితేతి శ్రద్ధాయామితి యదా హ్యేవ శ్రద్ధత్తేఽథ దక్షిణాం దదాతి శ్రద్ధాయాగ్‍ం హ్యేవ దక్షిణా ప్రతిష్ఠితేతి కస్మిన్ను శ్రద్ధా ప్రతిష్ఠితేతి హృదయ ఇతి హోవాచ హృదయేన హి శ్రద్ధాం జానాతి హృదయే హ్యేవ శ్రద్ధా ప్రతిష్ఠితా భవతీత్యేవమేవైతద్యాజ్ఞవల్క్య. ॥21

ప॥ కిం దేవతః – అస్యాం – దక్షిణాయాం – దిశి – అసి – ఇతి – యమదేవతః – ఇతి – సః – యమః – కస్మిన్ – ప్రతిష్ఠితః – ఇతి – యజ్ఞే – ఇతి – కస్మిన్ – ను – యజ్ఞః – ప్రతిష్ఠితః – ఇతి – దక్షిణాయాం – ఇతి – కస్మిన్ – ను – దక్షిణా – ప్రతిష్ఠితా – ఇతి – శ్రద్ధాయాం – ఇతి–యదా – హి – ఏవ – శ్రద్ధత్తే – అథ – దక్షిణాం – దదాతి – శ్రద్ధాయాం – హి – ఏవ – దక్షిణా – ప్రతిష్ఠితా – ఇతి – కస్మిన్ – ను – శ్రద్ధా – ప్రతిష్ఠితా–ఇతి–హృదయే–ఇతి – హోవాచ – హృదయేన – హి - శ్రద్ధాం – జానాతి – హృదయే – హి – ఏవ శ్రద్ధా – ప్రతిష్ఠితా - భవతి – ఇతి – ఏవం–ఏవ – ఏతత్ – యాజ్ఞవల్క్య.

ప్ర॥ అస్యాం = ఈ, దక్షిణాయాందిశి = దక్షిణదిక్కునందు, (త్వం = నీవు), కిం దేవతః = ఏ దేవతాస్వరూపుఁడవు, అసి = అగుచున్నావు, ఇతి = అని, (శాకల్యుఁడు ప్రశ్నము చేసెను). యమదేవతఇతి = యమదేవతాస్వరూపుఁడనైతినని, (యాజ్ఞవల్క్యుఁడు చెప్పెను). సః = ఆ, యమః = యముఁడు, కస్మిన్ = దేనియందు, ప్రతిష్ఠితఇతి = ఉంచఁబడియున్నాఁడని, (శాకల్యుఁడు ప్రశ్నము చేసెను). యజ్ఞ ఇతి =యజ్ఞమునందని (యాజ్ఞవల్క్యుఁడు చెప్పెను). యజ్ఞః = యజ్ఞము, కస్మిన్ను = దేనియందు, ప్రతిష్ఠితఇతి = ఉంచఁబడియున్నదని, (శాకల్యుఁడు ప్రశ్నముచేసెను). దక్షిణాయా

మితి = దక్షిణయందని, (యాజ్ఞవల్క్యుఁడు చెప్పెను). దక్షిణా = దక్షిణ, కస్మిన్ను = దేనియందు, ప్రతిష్ఠితేతి = ఉంచఁబడియున్న దని, (శాకల్యుఁడు ప్రశ్నముచేసెను). శ్రద్ధాయామితి = శ్రద్ధయందని, (శ్రద్ధయనఁగా భక్తిసహితమైన ఆస్తిక్యబుద్ధి అని) (యాజ్ఞవల్క్యుఁడు చెప్పి ఆ శ్రద్ధయందుఁడుటనే ప్రతిపాదించుచున్నాఁడు). యదా హ్యేవ = ఎప్పుడైతే, శ్రద్ధత్తే = శ్రద్ధఁగలవాఁడగుచున్నాఁడో, అథ = అప్పుడు దక్షిణాం = దక్షిణను, దదాతి = ఇచ్చుచున్నాఁడు. (కనుక), దక్షిణా = దక్షిణ, శ్రద్ధాయాంహ్యేవ = శ్రద్ధయందే, ప్రతిష్ఠితేతి=ఉంచఁబడియున్నదని, (యాజ్ఞవల్క్యుఁడు చెప్పెను). శ్రద్ధా = శ్రద్ధ, కస్మిన్ను = దేనియందు, ప్రతిష్ఠితేతి = ఉంచఁబడియున్నదని, (శాకల్యుఁడు ప్రశ్నముచేసెను). హృదయఇతి= హృదయమునందని. (యాజ్ఞవల్క్యుఁడు చెప్పి, శ్రద్ధహృదయమునందుంఘటనే ప్రతిపాదించుచున్నాఁడు). హృదయేన హి = హృదయముచేతనే, శ్రద్ధాం = శ్రద్ధను, (జనము), జానాతి = తెలిసికొనుచున్నది. (కనుక), శ్రద్ధా = శ్రద్ధ, హృదయేహ్యేవ = హృదయమునందే, ప్రతిష్ఠితా = ఉంచఁబడినది, భవతీతి – అగుచున్నదని, (యాజ్ఞవల్క్యుఁడు), హోవాచ = పలికెను. హేయాజ్ఞవల్క్య = ఓ యాజ్ఞవల్క్యుఁడా ! ఏతత్ = ఇది, ఏవమేవ = ఈప్రకారముగానే, (అని కల్యుఁడు ఒప్పుకొనెను).

తా॥ ఓ యాజ్ఞవల్క్యుఁడా ! నీవు ఈ దక్షిణ దిక్కునందు ఏ దేవతాస్వరూపుఁడవైతివని శాకల్యుఁడు ప్రశ్నచేయగా యాజ్ఞవల్క్యుఁడు యమదేవతాస్వరూపుఁడనని చెప్పెను. మరల ఆయమ దేవత ఎక్కడ ఉంచఁబడియున్నదని శాకల్యుఁడు ప్రశ్నముచేయుఁగా యజ్ఞమునందుంచఁబడియున్నాఁడని యాజ్ఞవల్క్యుఁడు చెప్పెను. మరల ఆ యజ్ఞమెక్కడ నుంచఁబడియున్నదని శాకల్యుఁడు ప్రశ్నము చేయుఁగా యాజ్ఞవల్క్యుఁడు దక్షిణయందుంచఁబడియున్నదనెను.

మరల దక్షిణ దేనియందుంచఁబడియున్నదని శాకల్యుఁడు ప్రశ్నము చేయఁగా యాజ్ఞవల్క్యుఁడు శ్రద్ధకలవాఁడు దక్షిణను ఇచ్చుచున్నాఁడు గనుక దక్షిణ శ్రద్ధయందుంచఁబడియున్నదని చెప్పెను. అప్పుడు శాకల్యుఁడు శ్రద్ధ దేనియందుంచఁబడియున్నదని మరల ప్రశ్నముచేయఁగా యాజ్ఞవల్క్యుఁడు హృదయముచేతనే జనము శ్రద్ధను తెలిసికొనుచున్నది. గనుక శ్రద్ధ హృదయమునందే యుంచఁబడి యున్నదని చెప్పెను. ఇట్లు చెప్పఁగా శాకల్యుఁడు ఓ యాజ్ఞవల్క్యుఁడా ! ఇది ఈ ప్రకారమేయని ఒప్పుకొనెను.

ఉ॥ కిందేవతోఽస్యాం ప్రతీచ్యాం దిశ్యసీతి వరుణదేవత ఇతి స వరుణః కస్మిన్ప్రతిష్ఠిత ఇత్యప్స్వితి కస్మిన్న్వాపః ప్రతిష్ఠితా ఇతి రేతసీతి కస్మిన్ను రేతః ప్రతిష్ఠితమితి హృదయ ఇతి తస్మాదపి ప్రతిరూపం జాతమాహుర్హృదయాదివ సృప్తో హృదయాదివ నిర్మిత ఇతి హృదయే హ్యేవ రేతః ప్రతిష్ఠితం భవతీత్యేవమేవైతద్యాజ్ఞవల్క్య. ॥22॥

ప॥ కిందేవతః – అస్యాం – ప్రతీచ్యాం – దిశి – అసి – ఇతి– వరుణదేవతః – ఇతి – సః – వరుణః – కస్మిన్ – ప్రతిష్ఠితః – ఇతి– అప్సు – ఇతి – కస్మిన్ – ను – ఆపః – ప్రతిష్ఠితాః – ఇతి – రేతసి– ఇతి – కస్మిన్ – ను – రేతః – ప్రతిష్ఠితం – ఇతి – హృదయే – ఇతి – తస్మాత్ – అపి – ప్రతిరూపం జాతం – ఆహుః – హృదయాత్ – ఇవ – సృప్తః – హృదయాత్ – ఇవ – నిర్మితః – ఇతి – హృదయే – హి – ఏవ – రేతః – ప్రతిష్ఠితం – భవతి – ఇతి – ఏవం – ఏవ – ఏతత్ – యాజ్ఞవల్క్య.

ప్ర॥ అస్యాం = ఈ, ప్రతీచ్యాందిశి = పశ్చిమదిక్కునందు, (త్వం = నీవు), కిందేవతః = ఏ దేవతాస్వరూపుఁడవు, అసీతి = అగుచున్నావని, (శాకల్యుఁడు ప్రశ్నముచేసెను). వరుణ దేవత ఇతి = వరుణ దేవతాస్వరూపుఁడనని, (యాజ్ఞవల్క్యుఁడు చెప్పెను). సః =

ఆ, వరుణః = వరుణుఁడు, కస్మిన్ = దేనియందు, ప్రతిష్ఠితఇతి = ఉంచఁబడియున్నాడని, (శాకల్యుఁడు ప్రశ్నముచేసెను). అప్స్వితి=ఉదకములయందని, (యాజ్ఞవల్క్యుఁడు చెప్పెను). ఆపః = ఉదకములు, కస్మిన్ను = దేనియందు, ప్రతిష్ఠితాఇతి = ఉంచఁబడియున్నవని, (శాకల్యుఁడు ప్రశ్నచేముసెను రేతసీతి = రేతస్సునందని, (యాజ్ఞవల్క్యుఁడు చెప్పెను). రేతః = రేతస్సు, కస్మిన్ను = దేనియందు, ప్రతిష్ఠితమితి = ఉంచఁబడియున్నదని, (శాకల్యుఁడు ప్రశ్నము చేసెను). హృదయఇతి = హృదయమునందని, (యాజ్ఞవల్క్యుఁడు చెప్పి దానినే విశదపఱచుచున్నాఁడు). (యస్మాత్ = ఏకారణము వలన), హృదయాదివ=హృదయమునుండియె, (పుత్రుఁడు) సృప్తః= జారుచున్నాఁడో, హృదయాదివ = హృదయమునుండియె, నిర్మితః= నిర్మింపఁబడుచున్నాఁడో, తస్మాదపి = ఆకారణమువలన, (లౌకికాః= లోకసంబంధులగు జనులు), జాతం = పుట్టిన పుత్రుని, ప్రతిరూపం= సమానరూపముగలవానినిఁగా, ఆహుః = చెప్పుచున్నారు. ఇతి = కనుక, రేతః = రేతస్సు, హృదయేహ్యేవ = హృదయమునందే, ప్రతిష్ఠితం = ఉంచఁబడినది, భవతీతి = అగుచున్నదని, (యాజ్ఞవల్క్యుఁడు చెప్పెను). హేయాజ్ఞవల్క్య = ఓ యాజ్ఞవల్క్యుఁడా! ఏతత్ = ఇది, ఏవమేవ = ఈ ప్రకారముగానే, (అని శాకల్యుఁడు ఒప్పుకొనెను).

తా॥ ఓ యాజ్ఞవల్క్యుఁడా ! నీవు ఈ పశ్చిమదిక్కునందు ఏ దేవతాస్వరూపుఁడవైతివని శాకల్యుఁడు ప్రశ్నముచేయఁగా యాజ్ఞవల్క్యుఁడు నేను వరుణదేవతాస్వరూపుఁడనని చెప్పెను. మరల ఆవరుణుఁడు ఎక్కడనుంచఁదబయున్నాఁడని శాకల్యుఁడు ప్రశ్నము చేయఁగా యాజ్ఞవల్క్యుఁడు ఉదకములయందుంచఁబడియున్నాఁడని చెప్పెను. మరల ఆ యుదకములు దేనియందుంచఁబడినవని శాకల్యుఁడడుగఁగా రేతస్సునందుంచఁబడి యున్నవని యాజ్ఞవల్క్యుఁడు

చెప్పెను. ఆ రేతస్సు దేనియందుంచబడియున్నదని శాకల్యుఁడడుగఁగా యాజ్ఞవల్క్యుఁడు పుత్రుఁడు హృదయమునుండియె జారుచున్నాఁడనియును, హృదయమునుండియె పుత్రుఁడు బంగారమునుండి కుండలములు మొదలైన భూషణములువలెనే నిర్మింపఁబడుచున్నాఁడనియును, లోకులు పుట్టిన కుమారుని తనకు సమానరూపునిఁగాఁ జెప్పుచున్నారు గనుక రేతస్సు హృదయమునందె ఉంచఁబడియున్నదని చెప్పెను. అప్పుడు శాకల్యుఁడు ఓ యాజ్ఞవల్క్యుఁడా! ఇది ఈ ప్రకారముగానే యని ఒప్పుకొనెను.

ఉ॥ కిం దేవతోఽస్యాముదీచ్యాం దిశ్యసీతి సోమదేవత ఇతి స సోమః కస్మిన్ప్రతిష్ఠిత ఇతి దీక్షాయామితి కస్మిన్ను దీక్షా ప్రతిష్ఠితేతి సత్య ఇతి తస్మాదపి దీక్షితమాహుః సత్యం వదేతి సత్యే హ్యేవ దీక్షా ప్రతిష్ఠితేతి కస్మిన్ను సత్యం ప్రతిష్ఠితమితి హృదయ ఇతి హోవాచ హృదయేన హి సత్యం జానాతి హృదయే హ్యేవ సత్యం ప్రతిష్ఠితం భవతీత్యేవమేవైతద్యాజ్ఞవల్క్య. ॥23॥

ప॥ కిం దేవత – అస్యాం – ఉదీచ్యాం – దిశి – అసి – ఇతి – సోమదేవతః – ఇతి – సః – సోమః – కస్మిన్ – ప్రతిష్ఠితః – ఇతి – దీక్షాయాం – ఇతి – కస్మిన్ – ను – దీక్షా – ప్రతిష్ఠితా – ఇతి – సత్యే – ఇతి – తస్మాత్ – అపి – దీక్షితం – ఆహుః – సత్యం – వద – ఇతి – సత్యే – హి – ఏవ – దీక్షా – ప్రతిష్ఠితా – ఇతి – కస్మిన్ – ను – సత్యం – ప్రతిష్ఠితం – ఇతి – హృదయే – ఇతి – హోవాచ – హృదయేన – హి – సత్యం – జానాతి – హృదయే – హి – ఏవ – సత్యం – ప్రతిష్ఠితం – భవతి – ఇతి – ఏవం – ఏవ – ఏతత్ – యాజ్ఞవల్క్య.

ప్ర॥ అస్యాం = ఈ, ఉదీచ్యాందిశి = ఉత్తరదిక్కునందు, (త్వం = నీవు), కిం దేవతః = ఏ దేవతాస్వరూపుఁడవు, అసీతి = అగుచున్నావని, (శాకల్యుఁడు ప్రశ్నముచేసెను). సోమదేవతఇతి = సోము

దేవతాస్వరూపుఁడను అని, (యాజ్ఞవల్క్యుఁడు చెప్పెను). సః = ఆ, సోమః = సోముఁడను దేవత, కస్మిన్ = దేనియందు, ప్రతిష్ఠిత ఇతి = ఉంచఁబడియున్నదని, (శాకల్యుఁడు ప్రశ్నముచేసెను). దీక్షాయామితి = దీక్షయందని, (యజ్ఞదీక్ష), (యాజ్ఞవల్క్యుఁడు చెప్పెను). దీక్షా = దీక్ష, కస్మిన్ను, = దేనియందు. ప్రతిష్ఠితా = ఉంచఁబడియున్నది. ఇతి = అని, (శాకల్యుఁడు ప్రశ్నచేసెను). సత్యఇతి = సత్యమునందని, (యాజ్ఞవల్క్యుఁడు చెప్పెను; దానినే ప్రతిపాదించుచున్నాడు). (యస్మాత్ =ఏకారణమువలన), దీక్షితం = దీక్షను, పొందినవానిని, (యాజకాః = యాగమును చేయించువారలు), సత్యం = సత్యమును, వదేతి = చెప్పుమాయని, ఆహుః= చెప్పుచున్నారో, తస్మాదపి = ఆకారణమునుండియు, దీక్షా = దీక్ష, సత్యేహ్యేవ = సత్యమునందే, ప్రతిష్ఠితేతి = ఉంచఁబడియున్నదని, (యాజ్ఞవల్క్యుఁడు చెప్పెను). సత్యం = సత్యము, కస్మిన్ను = దేనియందు, ప్రతిష్ఠితమితి = ఉంచఁబడియున్నదని, (శాకల్యుఁడు ప్రశ్నముచేసెను). హృదయఇతి = హృదయమునందని, (యాజ్ఞవల్క్యుఁడు), హోవాచ = పలికెను, (ఇట్లు చెప్పిన దానినే ప్రతిపాదించుచున్నాఁడు), హృదయేనహి =హృదయముచేతనే (లోకః= జనము), సత్యం = సత్యమును, జానాతి – తెలిసికొనుచున్నది. (కనుక), సత్యం = సత్యము, హృదయేహ్యేవ=హృదయమునందే, ప్రతిష్ఠితం = ఉంచఁబడినది, భవతీతి = అగుచున్నదని, (యాజ్ఞవల్క్యుఁడు చెప్పెను). హేయాజ్ఞవల్క్య = ఓ యాజ్ఞవల్క్యుఁడా! ఏతత్ = ఇది, ఏవమేవ = ఈ ప్రకారముగానే, (అని శాకల్యుఁడు ఒప్పుకొనెను).

తా॥ ఓ యాజ్ఞవల్క్యుఁడా! నీవు ఈ యుత్తరదిక్కునందు ఏ దేవతాస్వరూపుఁడవైతివని శాకల్యుఁడు ప్రశ్నముచేయఁగా యాజ్ఞవల్క్యుఁడు నేను సోమదేవతాస్వరూపుఁడనై యున్నానని చెప్పెను.

మరల శాకల్యుఁడు సోమదేవత దేనియందుం చఁబడియున్నదని అడుగఁగా దీక్షయందని యాజ్ఞవల్క్యుఁడు చెప్పెను. ఆ దీక్ష దేని యందుంచఁబడియున్నదని శాకల్యుఁడడుగఁగా యాజ్ఞవల్క్యుఁడు యాగమును చేయించెడి వారు యజ్ఞదీక్షను పొందినవానిని, సత్యమును పలుకుమాయని చెప్పుటవలన, దీక్ష సత్యమునందుంచఁబడి యున్నదని చెప్పెను. ఆ సత్యము దేనియందుంచఁబడినదియని మరల శాకల్యుఁడు ప్రశ్నముచేయఁగా యాజ్ఞవల్క్యుఁడు హృదయము చేతనే జనము సత్యమును తెలిసికొనుచున్నది గనుక సత్యము హృదయమునందే ఉంచఁబడియున్నదని చెప్పెను, ఇట్లు చెప్పఁగా అప్పుడు శాకల్యుఁడు ఓ యాజ్ఞవల్క్యుఁడా! ఇది ఈ ప్రకారముగానే యని ఒప్పుకొనెను.

ఉ॥ కిం దేవతోఽస్యాం ధ్రువాయాం దిశ్యసీత్యగ్ని దేవత ఇతి సోఽగ్నిః కస్మిన్ప్రతిష్ఠిత ఇతి వాచీతి కస్మిన్ను వాక్ప్రతిష్ఠితేతి హృదయ ఇతి కస్మిన్ను హృదయం ప్రతిష్ఠితమితి. ॥24॥

ప॥ కిం దేవతః – అస్యాం – ధ్రువాయాం – దిశి – అసి – ఇతి – అగ్ని దేవతః – ఇతి – సః – అగ్నిః – కస్మిన్ – ప్రతిష్ఠితః – ఇతి – వాచి – ఇతి – కస్మిన్ – ను – వాక్ – ప్రతిష్ఠితా – ఇతి – హృదయే – ఇతి – కస్మిన్ – ను – హృదయం – ప్రతిష్ఠితం – ఇతి.

ప్ర॥ అస్యాం = ఈ, ధ్రువాయాందిశి = ధ్రువదిక్కునందు, (మేరు పర్వతమునకు అంతటను నివసించువారలకు ఎడతెగక ఊర్ధ్వముగానుండెడి, దిక్కు ధ్రువయని చెప్పఁబడును). కిం దేవతః = ఏ దేవతాస్వరూపుఁడవు, అసీతి = అగుచున్నావని, (శాకల్యుఁడు ప్రశ్నముచేసెను). అగ్ని దేవతఇతి = అగ్ని దేవతనని, (యాజ్ఞవల్క్యుఁడు చెప్పెను). సః=ఆ, అగ్నిః=అగ్ని, కస్మిన్=దేనియందు, ప్రతిష్ఠితఇతి = ఉంచఁబడియున్నదియని, (శాకల్యుఁడు ప్రశ్నము చేసెను). వాచీతి = వాక్కునందని, (యాజ్ఞవల్క్యుఁడు చెప్పెను),

వాక్ = వాక్కు, కస్మిన్ను = దేనియందు, ప్రతిష్ఠితేతి = ఉంచఁబడియున్నదని, (శాకల్యుఁడు ప్రశ్నముచేసెను). హృదయఇతి = హృదయమునందని, (యాజ్ఞవల్క్యుఁడు చెప్పెను). హృదయం = హృదయము, కస్మిన్ను = దేనియందు, ప్రతిష్ఠితమితి = ఉంచఁబడియున్నదని, (శాకల్యుఁడు ప్రశ్నముచేసెను).

తా॥ ఓ యాజ్ఞవల్క్యుఁడా ! నీవు ఈ ఊర్ధ్వదిక్కునందు ఏదేవతాస్వరూపుఁడవై తివని శాకల్యుఁడు ప్రశ్నముచేయఁగా యాజ్ఞవల్క్యుఁడు నేను అగ్నిదేవతాస్వరూపుఁడనని చెప్పెను. ఆ అగ్నిదేవత దేనియందుంచఁబడియున్నదని మరల శాకల్యుఁడు ప్రశ్నముచేయఁగా, యాజ్ఞవల్క్యుఁడు వాక్కునందుంచఁబడియున్నదని చెప్పెను. ఆ వాక్కు దేనియందుంచఁబడియున్నదని శాకల్యుఁడు మరల ప్రశ్నముచేయఁగా యాజ్ఞవల్క్యుఁడు హృదయమునందుంచఁబడియున్నదని చెప్పెను. ఇట్లు చెప్పఁగా శాకల్యుఁడు ఓయాజ్ఞవల్క్యుఁడా! సర్వాత్మకమగు ఈ హృదయము దేనియందుంచఁబడినదియని మరల ప్రశ్నముచేసెను.

ఉ॥ అహల్లికేతి హోవాచ యాజ్ఞవల్క్యో యత్రైతదన్యత్రాస్మన్మన్యాసై యద్ధ్యేతదన్యత్రాస్మత్స్యాచ్ఛ్వానో వైనదద్యుర్వయాగ్ంసి వైనద్విమధ్నీరన్నితి. ॥25॥

ప॥ అహల్లిక – ఇతి – హ – ఉవాచ – యాజ్ఞవల్క్యః – యత్ర – ఏతత్ – అన్యత్ర – అస్మత్ – మన్యాసై – యత్ –హి– ఏతత్ – అన్యత్ర – అస్మత్ – స్యాత్ – శ్వానః – వా – ఏనత్ – అద్యుః – వయాంసి – వా – ఏనత్ –విమధ్నీరన్ – ఇతి.

ప్ర॥ యాజ్ఞవల్క్యః = యాజ్ఞవల్క్యుఁడు, అహల్లికేతి = అహల్లికుఁడాయని, (వేఱొక పేరుతో శాకల్యుని పిలిచి, అహల్లికుఁడనఁగా పగటియందు ప్రేతత్వముతో లీనమై పోవువాఁడు). హోవాచ = పలికెను. యత్ర = ఏ కాలమునందు, (అస్య = ఈ శరీరము

నకు, ఆత్మా = ఆత్మస్వరూపమైన), ఏతత్ = ఈ హృదయము, అస్మత్ = మనవల్లనుండి, అన్యత్ర = మఱియొక ప్రదేశమునందు, (వర్తతఇతి = ఉన్నదని), మన్యాసై = తలంచుచున్నావో, ఏతత్ = ఈ హృదయము, అస్మత్ = మనకంటె, అన్యత్ర = మఱియొక ప్రదేశమునందు. స్యాద్యద్ధి = ఉండెనేని, ఏనత్ = ఈ శరీరమును, శ్వానోహ = కుక్కలైనను, అద్యుః = భక్షించును, ఏనత్ = ఈ శరీరమును, వయాంసివా = పక్షులైనను, విమధ్నీరన్ = చలింపఁ జేయును. (అనఁగా పొడిచి లాగుకొనిపోవును). ఇతి = అని, (యాజ్ఞవల్క్యుఁడు పలికెను).

తా॥ ఇట్లు ప్రశ్నముచేయఁగా యాజ్ఞవల్క్యుఁడు శాకల్యుని అహల్లికుఁడాయని వేఱొక పేరుతోఁబిలిచి నీవు ఈ హృదయము మన శరీరముకంటె అన్యమగు ప్రదేశమునందు ఏకాలమందైనను ఉండునని తలంచుచున్నావా? అట్లు ఈ హృధయము మన దేహాము కంటె వేఱు ప్రదేశమునందుండెనేని ఈ శరీరమును కుక్కలైనను తినిపోవును. కాకాదిపక్షులైనను పొడిచి ఈడ్చుకొనిపోవును గనుక నా శరీరమునందే ఈ హృదయముంచఁబడియున్నదని చెప్పెను.

ఉ॥ కస్మిన్ను త్వం చాత్మా చ ప్రతిష్ఠితౌ స్థ ఇతి ప్రాణ ఇతి కస్మిన్ను ప్రాణః ప్రతిష్ఠిత ఇత్యపాన ఇతి కస్మిన్న్వపానః ప్రతిష్ఠిత వ్యాన ఇతి కస్మిన్ను వ్యానః ప్రతిష్ఠిత ఇత్యుదాన ఇతి కస్మిన్నుదానః ప్రతిష్ఠిత ఇతి సమాన ఇతి స ఏష నేతి నేతీత్యాత్మాఽగృహ్యోన హి గృహ్యతేఽశీర్యోనహి శీర్యతేఽసఙ్గో న హి సజ్యతేఽసితో న వ్యథతేనరిష్యతి । ఏతాన్యష్టావాయతనాన్యష్టౌ లోకా అష్టౌ దేవా అష్టౌ పురుషాః స యస్తాన్పురుషాన్నిరూహ్య ప్రత్యూహ్యాత్యక్రామ త్తన్త్వౌపనిషదం పురుషం పృచ్ఛామి తం చేన్మే న వివక్ష్యసి మూర్ధా తే విపతిష్యతీతి । తగ్ంహ న మేనే శాకల్య స్తస్య హ మూర్ధా విపపాతాపి హాస్య పరిమోషి

ణోఽస్థీన్యపజహ్రురన్యన్మన్యమానాః. ॥26॥

ప॥ కస్మిన్ - ను - త్వం - చ - ఆత్మాచ - ప్రతిష్ఠౌ - స్థః - ఇతి - ప్రాణే - ఇతి - కస్మిన్ - ను - ప్రాణః - ప్రతిష్ఠితః - అపానే - ఇతి - కస్మిన్ - ను - అపానః - ప్రతిష్ఠితః - ఇతి - వ్యానే - ఇతి - కస్మిన్ - ను - వ్యానః - ప్రతిష్ఠితః - ఇతి - ఉదానే - ఇతి - కస్మిన్ - ను - ఉదానః - ప్రతిష్ఠితః - ఇతి - సమానే - ఇతి - సః - ఏషః - న - ఇతి - న - ఇతి - ఆత్మా - అగృహ్యః - న - హి - గృహ్యతే - అశీర్యః - న - హి - శీర్యతే - అసఙ్గః - న - హి - సజ్జతే - అసితః - న - వ్యథతే - నరిష్యతి - ఏతాని - అష్టౌ - ఆయతనాని - అష్టౌ - లోకాః - అష్టౌ - దేవాః - అష్టౌ - పురుషాః - సః - యః - తాన్ - పురుషాన్ - నిరూహ్య - ప్రత్యూహ్య - అత్యక్రామత్ - తం - త్వా - ఔపనిషదం - పురుషం - పృచ్ఛామి - తం - చేత్ - మే - న - వివక్ష్యసి - మూర్ధా - తే - విపతిష్యతి - ఇతి - తం - హ - న - మేనే - శాకల్యః - తస్య - హ - మూర్ధా - విపపాత - అపి - హ - అస్య - పరిమోషిణః - అస్థీని - అపజహ్రుః - అన్యత్ - మన్యమానాః.

ప్ర॥ త్వంచ = నీవును, (నీ శరీరమును), ఆత్మాచ = హృదయమును. (నీ హృదయమ్మును), కస్మిన్ను = దేనియందు, ప్రతిష్ఠితౌ = ఉంచఁబడినవై, స్థః = ఉన్నవి. ఇతి = అని, (శాకల్యుఁడు ప్రశ్నముచేసెను). ప్రాణఇతి = ప్రాణవాయువునందని, (యాజ్ఞవల్క్యుఁడు చెప్పెను). ప్రాణః = ప్రాణవాయువు, కస్మిన్ను = దేనియందు, ప్రతిష్ఠితఇతి = ఉంచఁబడియున్నదని, (శాకల్యుఁడడిగెను), అపానఇతి = అపానవాయువునందని, (యాజ్ఞవల్క్యుఁడు చెప్పెను). అపానః = అపానవాయువు, కస్మిన్ను = దేనియందు, ప్రతిష్ఠితః = ఉంచఁబడియున్నది. ఇతి = అని (శాకల్యుఁడడిగెను). వ్యానఇతి =

వ్యానవాయువునందని, (యాజ్ఞవల్క్యుఁడు చెప్పెను) వ్యానః = వ్యానవాయువు, కస్మిన్ను = దేనియందు, ప్రతిష్ఠితఇతి = ఉంచఁబడి యున్నదని, (శాకల్యుఁడడిగెను). ఉదానఇతి=ఉదానవాయువునందని (యాజ్ఞవల్క్యుఁడు చెప్పెను). ఉదానః = ఉదానవాయువు, కస్మిన్ను = దేనియందు, ప్రతిష్ఠితఇతి = ఉంచఁబడియున్నదని, (శాకల్యుఁడడిగెను). సమానఇతి = సమానవాయువునందని, (యాజ్ఞవల్క్యుఁడు చెప్పి), నేతినేతీతి = నేతినేతియని సమస్తమును నిషేధించి నిర్దేశింపఁబడిన, ఆత్మా = ఆత్మస్వరూపము, (యః = ఏదియో), సః = అటువంటి, ఏషః = ఈ ఆత్మ, అగృహ్యః = గ్రహింపశక్యము కానిది, (సమస్తమైన కార్యధర్మముల నతిక్రమించియున్నదిగనుక గ్రహింప శక్యముకానిది కనుకనే), నహిగృహ్యతే = గ్రహింపఁబడుట లేదు. అశీర్యః = నశింపనిది, (శరీరధర్మములేనిదిగనుక నశింపనిదిగనుకనే), నహిశీర్యతే = నశించుటలేదు. అసఙ్గః = కూడుకొననిది. (మూర్తస్వరూపముకాదు గనుక వేరొకదానితోఁ కూడుకొననిదిగనుకనే, నహిసజ్యతే = కూడుకొనదు. అసితః =బంధింపఁబడనిది, (దేనిచేతను బాధింపఁబడనిదిగనుకనే) నవ్యథతే = పీడింపఁబడదు. నరిష్యతి = నశింపదు. ఏతాని = ఈ పూర్వోక్తములైన, అష్టౌ = ఎనిమిదియగు, ఆయతనాని=పృథివిమొదలగు స్థానములును, అష్టౌ = ఎనిమిదియగు, లోకాః = అగ్నిలోకము మొదలైన లోకములును, అష్టౌ = ఎనమండ్రుగురగు, దేవాః = అమృతము మొదలైన దేవులును, అష్టౌపురుషాః = ఎనమండ్రుగురగు శరీరము మొదలైన పురుషులును, (ఏవియో), తాన్పురుషాన్ = ఆ పురుషులను, సయః = ఒకానొకఁడు, (ఆస్థానములను, లోకములను, దేవతలను, పురుషులను); నిరూహ్య= నిశ్చయమునుపొందించి, (ప్రాగ్దిక్కు మొదలైన వాని ద్వారా హృదయమునందు), ప్రత్యూహ్య = క్లుప్తపఱచి, అత్యక్రామత్ = అతిక్రమించుచున్నాఁడో, (ఉపాధిధర్మమగు హృదయా

ద్యాత్మత్వమును స్వస్వరూపముతో పొందినవాఁడై దీనిని అతిక్రమిం చుచున్నాఁడో), తం = అటువంటి, ఔపనిషదం = ఉపనిషత్ప్రమా ణముచేత ప్రతిపాదింపఁబడిన, పురుషం = పురుషునిగూర్చి, త్వా = నిన్ను, పృచ్ఛామి = అడుగుచున్నాను. తం = ఆ పురుషుని, మే = నా కొఱకు, నవివక్ష్యసిచేత్ = చెప్పకపోతివేని, తే = నీయొక్క, మూర్ధా = శిరస్సు. విపతిష్యతి = పడిపోఁగలదు. ఇతి = అని, (యాజ్ఞవల్క్యుఁడు పలికెను). శాకల్యః = శాకల్యుఁడు, తం = ఆ పురుషుని, నమేనేహ = తెలిసికొనకపోయెను. తస్యహ = ఆ శాక ల్యునియొక్క, మూర్ధా = శిరస్సు, విపపాత = పడిపోయెను. అస్య హ = ఈ శాకల్యునియొక్కయె, అస్థీన్యపి = ఎముకలను సయిత ము, పరిమోషిణః = దొంగలు, అన్యత్ = ఇతరమగు ధనమును గాను, మన్యమానాః = తలంచినవారలై, అపజహ్రుః = హరించిరి.

తా॥ ఇంతకుపూర్వము కార్యకారణములైన హృదయశరీ రములకు రెండును అన్యోన్యము ఒకదానియందొకటియుండుట చెప్పఁ బడినదిగనుక ఓ యాజ్ఞవల్క్యుఁడా! ఇప్పుడు నిన్నడుగుచున్నాను. ఏమనఁగా, ఈ నీ శరీరము నీహృదయమును దేనియందున్నవని శాకల్యుఁడు ప్రశ్నముచేసెను. యాజ్ఞవల్క్యుఁడు, ఓ శాకల్యుఁడా! ఆహృదయశరీరములు రెండును ప్రాణమునందుంచఁబడినవగుచున్న వని చెప్పెను. మరల శాకల్యుఁడు ప్రాణము దేనియందుంచఁబడి యున్నదని అడిగెను. యాజ్ఞవల్క్యుఁడు ప్రాణము అపానమునందుంచఁ బడినదని పలికెను. శాకల్యుఁడు అపానము దేనియందుంచఁబడి యున్నదని మరల అడిగెను. యాజ్ఞవల్క్యుఁడు ఆ అపానము వ్యానము నందుంచఁబడియున్నదని చెప్పెను. శాకల్యుఁడు వ్యానము దేనియం దుంచఁబడియున్నదని మరల అడిగెను. యాజ్ఞవల్క్యుఁడు ఆవ్యానము ఉదానమునందుంచఁబడి యున్నదనిచెప్పెను. శాకల్యుఁడు ఆ ఉదా నము దేనియందుంచఁబడియున్నదని మరల అడిగెను. యాజ్ఞ

వల్క్యుఁడు ఉదానము సమానమునందుంచఁబడియున్నదని చెప్పి శరీరమును హృదయమును ప్రాణాది వాయువులును సమూహముచేత, ఒకదానియందొకటి ఉంచఁబడినవై విజ్ఞానమయమునకు ఉపయుక్తములై నియతములుగా ప్రవర్తించుచున్నవి. ఈ సమస్తమును ఎవనిచేత నియతమైనదియో, ఎవనియందు ఆకాశాంతముదనుకనుండెడి సమస్తమును వస్త్రముయొక్క పడుగుపేకవలెనే ఉంచఁబడియున్నదో, అట్టి నిరుపాధికమగు పరబ్రహ్మముయొక్క నిర్దేశము చేయఁదగినదని మరల యాజ్ఞవల్క్యుఁడు ప్రశ్నముచేయుచున్నాఁడు. ఓ శాకల్యుఁడా! నేతినేతియను వాక్యముచేత సమస్తమును నిషేధించి ఏర్పఱుపఁబడిన ఆత్మస్వరూపము, శరీరధర్మముల నతిక్రమించియుండునది గనుక గ్రహింప శక్యముకానిదియును అటువంటిదిగనుకనే శిథిలము కానిదియును ఆకారములేనిదిగనుక దేనితోడను కూడుకొననిదియును బంధింపఁబడనిదియునైయున్నది. ఈ ఆత్మ, ఇంతకుపూర్వముచెప్పిన భూమి మొదలగు ఎనిమిదిస్థానములను, అగ్నిలోకము మొదలగు ఎనిమిదిలోకములను, అమృతము మొదలైన ఎనమండ్రుగురు దేవతలను శరీరము మొదలగు ఎనమండ్రుగురు పురుషులను స్వస్వరూపముతో నతిక్రమించినదై ప్రాగాదిదిక్కులయొక్క ఆత్మస్వరూపముతో హృదయమునందుపాధిధర్మము నతిక్రమించియున్నది. ఉపనిషత్తులయందు తెలిసికొనఁదగిన అట్టిఆత్మను నిన్ను అడుగుచున్నాను. దానిని నీవు చెప్పకపోతివేని నీశిరస్సు పగిలిపడిపోవునని యాజ్ఞవల్క్యుఁడు పలికెను. అప్పుడు శాకల్యుఁడు ఆత్మస్వరూపము తెలియనివాఁడుగనుక ఆశాకల్యుని శిరస్సుభిన్నమైపడిపోయెను. ఇట్లు బ్రాహ్మణ శాపహతుఁడైన శాకల్యునికి ఊర్ధ్వలోకక్రియలనుచేసి పుణ్యలోకావాప్తి కలుగఁజేయవలయునని శిష్యులు ఆయన అస్థులనుతీసికొనిపోవుచుండఁగా మార్గమధ్యమునందు దొంగలు ఆ అస్థులను ధనమనితలంచి యెత్తికొనిపోయిరి. గనుక బ్రహ్మవేత్తను ద్వేషించువానికి ఇహ

పర లోకములు రెండును లేకపోవుచున్నవి.

ఉ॥ అథ హోవాచ బ్రాహ్మణా భగవన్తో యో వః కామయతే స మా పృచ్ఛతు సర్వే వా మా పృచ్ఛత యో వః కామయతే తం వః పృచ్ఛామి సర్వాన్వా వః పృచ్ఛామీతి తే హ బ్రాహ్మణా న దధృషుః॥ ॥27॥

ప॥ అథ - హ - ఉవాచ - బ్రాహ్మణాః - భగవన్తః - యః - వః - కామయతే - సః - మా - పృచ్ఛతు - సర్వే - వా - మా - పృచ్ఛత - యః - వః - కామయతే - తం - వః - పృచ్ఛామి - సర్వాన్ - వా - వః - పృచ్ఛామి - ఇతి - తే - హ - బ్రాహ్మణాః - న - దధృషుః.

ప్ర॥ అథహ = అనంతరము, హేభగవన్తః = పూజ్యులగు, హేబ్రాహ్మణాః = ఓబ్రాహ్మణులారా ! (అని సంబోధించి, యాజ్ఞవల్క్యుఁడు), హోవాచ = పలికెను. వః = మీలోపల, యః = ఎవఁడు, (యాజ్ఞవల్క్యుని అడుగవలయునని), కామయతే = కోరుచున్నాఁడో, సః = వాఁడు, మా = నన్ను, పృచ్ఛతు = అడుగును గాక ! సర్వేవా = మీరందరైనను, మా = నన్ను, పృచ్ఛత = అడుగుదురుగాక ! వః = మీలోపల, యః = ఎవఁడు, (యాజ్ఞవల్క్యుఁడునన్ను అడుగునుగాకయని), కామయతే=కోరుచున్నాఁడో, వః = మీలోపల, తం = వానిని, పృచ్ఛామి = అడుగుచున్నాను. వః = మీలోపల, సర్వాన్వా = అందఱినైనను, పృచ్ఛామి = అడుగుచున్నాను. ఇతి = అని, (యాజ్ఞవల్క్యుఁడు పలికెను). తేహ బ్రాహ్మణాః = ఆబ్రాహ్మణులే, (ప్రత్యుత్తరమును చెప్పుటకు), నదధృషుః = ధైర్యముకలవారు కాకపోయిరి.

తా॥ ఇంతకుపూర్వము బ్రహ్మేతరములగు వస్తువులను నిషేధించుటచేత పరబ్రహ్మముయొక్క నిర్దేశము చేయఁబడినది. ఇప్పుడు పరబ్రహ్మమును విధిముఖముచే నిర్దేశింపవలయునని జగత్తునకు మూల

మైన పరబ్రహ్మవస్తువును చెప్పవలయునని అబ్రహ్మవేత్తలగు బ్రాహ్మణులను జయించి గోధనమును హరించుట న్యాయమనితలంచి యాజ్ఞవల్క్యుఁడు మరల కథనే ఆశ్రయించి చెప్పుచున్నాఁడు. పూజ్యులగు ఓ బ్రాహ్మణులారా! మీలో యాజ్ఞవల్క్యుఁడనైన నన్ను అడుగవలయునని కోరువాఁడు నన్ను అడుగునుగాక! లేక మీరందఱైనను అడుగుదురుగాక! మీలోనేను అడుగవలయునని కోరువానిని నేను అడుగుచున్నాను. లేక మీరందఱినైనను అడుగుచున్నాను. అని యాజ్ఞవల్క్యుఁడు ఆ బ్రాహ్మణులనుగూర్చి పలుకఁగా ఆబ్రాహ్మణులు ప్రత్యుత్తరమును చెప్పుటకు ధైర్యములేనివారలై యూరక యుండిరి.

ఉ॥ తాఁ హైతైః శ్లోకైః పప్రచ్ఛ। యథా వృక్షో వనస్పతి స్తథైవ పురుషోఽమృషా। తస్య లోమాని పర్ణాని త్వగస్యోత్పాటికా బహిః। త్వచ ఏవాస్య రుధిరం ప్రస్యన్ది త్వచ ఉత్పటః। తస్మాత్తదాతృణ్ణాత్ప్రైతి రసో వృక్షాదివాహతాత్। మాగ్ సాన్యస్య శకరాణి కినాటగ్ స్నావ తత్థిరమ్। అస్థీన్యన్తరతో దారూణి మజ్జా మజ్జోపమా కృతా। యద్వృక్షో వృక్ణో రోహతి మూలాన్నవతరః పునః। మర్త్యః స్విన్మృత్యునా వృక్ణః కస్మాన్మూలాత్ప్రరోహతి। రేతస ఇతి మా వోచత జీవతస్తత్ప్రజాయతే ధానారుహ ఇవ వై వృక్షోఽఞ్జసా ప్రేత్య సమ్భవః। యత్। మూలమావృహేయుర్వృక్షం న పునరాభవేత్। మర్త్యః స్విన్మృత్యునా వృక్ణః కస్మాన్మూలాత్ప్రరోహతి। జాత ఏవ న జాయతే కో న్వేనం జనయేత్పునః। విజ్ఞానమానన్దం బ్రహ్మ రాతిర్దాతుః పరాయణమ్। తిష్ఠమానస్య తద్విద ఇతి॥ ॥28॥

ఇతి బృహదారణ్యకే పఞ్చమాధ్యాయే నవమం బ్రాహ్మణమ్

పఞ్చమాధ్యాయస్సమాప్తః

ప॥ తాన్ - హ - ఏతైః - శ్లోకైః - పప్రచ్ఛ - యథా - వృక్షః - వనస్పతిః - తథా - ఏవ - పురుషః - అమృషా - తస్య-లోమాని - పర్ణాని - త్వక్ - అస్య - ఉత్పాటికా - బహిః - త్వచః - ఏవ - అస్య - రుధిరం - ప్రస్యన్ది - త్వచః - ఉత్పటః - తస్మాత్ - తదా - తృణ్ణాత్ - ప్రైతి - రసః - వృక్షాత్ - ఇవ-ఆహతాత్ - మాంసాని - అస్య - శకరాణి - కినాటం - స్నావ - తత్ - స్థిరం - అస్థీని - అన్తరతః - దారూణి - మజ్జా - మజ్జో పమా - కృతా - యత్ - వృక్షః - వృక్ణః - రోహతి - మూలాత్ - నవతరః - పునః - మర్త్యః - స్విత్ - మృత్యునా - వృక్ణః - కస్మాత్ - మూలాత్ - ప్రరోహతి - రేతసః - ఇతి - మా - అవోచత - జీవతః - తత్ - ప్రజాయతే - ధానారుహః - ఇవ - వై - వృక్షః అఞ్జసా - ప్రేత్య - సమ్భవః - యత్ - సమూలం - ఆవృహేయుః - వృక్షం - న - పునః - అభవేత్ - మర్త్యః - స్విత్ - మృత్యునా - వృక్ణః - కస్మాత్ - మూలాత్ - ప్రరోహతి - జాతః - ఏవ - న - జాయతే - కః - అను - ఏనం - జనయేత్ - పునః - విజ్ఞానం - ఆనన్దం - బ్రహ్మ - రాతిర్దాతుః - పరాయణం - తిష్ఠమానస్య - తద్విదః - ఇతి.

ప్ర॥ (యాజ్ఞవల్కః=యాజ్ఞవల్క్యుఁడు), ఏతైః=ఈ ముందు చెప్పెడి. శ్లోకైః = శ్లోకములచేతను, తాన్ హ = ఆ బ్రాహ్మణులను, పప్రచ్ఛ = అడిగెను. వనస్పతిః=పుష్పఫలములుగల, వృక్షః= వృక్షము, యథా = ఏ ప్రకారమో, తథైవ = ఆ ప్రకారముగానే, పురుషః = పురుషుఁడు, అమృషా = సత్యమైనవాఁడు, తస్య = ఆ పురుషునికి, లోమాని = వెంట్రుకలు, ఇతరస్య = అన్యమైన వృక్షమునకు), పర్ణాని = ఆకులు, అస్య = ఈ పురుషునికి, త్వక్ = చర్మము, (ఇతరస్య = అన్యమైన వృక్షమునకు), బహిః = వెలుపల నుండెడి, ఉత్పాటికా = బరడు. అస్య = ఈ పురుషునికి, త్వచఏవ=

చర్మసామీప్యమునుండియె, రుధిరం = రక్తము, ప్రస్యన్ది = బయలు వెడలుచున్నది. (ఇతరస్య = అన్యమగు వృక్షమునకు), త్వచః = చర్మసామీప్యమునుండి, ఉత్పటః = బంక, (ప్రస్యన్ది = బయలు వెడలుచున్నది). (ఏకారణమువలన వృక్షమునకును పురుషునికిని సమస్తము ఈ ప్రకారమేసమానమో). తస్మాత్ = ఆ కారణము నుండి, ఆతృణ్ణాత్ = ఖండింపఁబడిన పురుషునివలన, తత్ = ఆరక్తము, ప్రైతి = బయలువెడలుచున్నది. ఆహతాత్ = కొట్టఁబడిన వృక్షాదివ = వృక్షమునుండియే, రసః = రసము. (ప్రైతి = బయలువెడలుచున్నది). అస్య = ఈ పురుషునికి, మాంసాని = మాంసములు, (ఇతరస్య = అన్యమగువృక్షమునకు), శకరాణి = శకలములు, (వృక్షస్య = వృక్షముయొక్క), కినాటం = నార, (కినాటమనఁగా శకలములకంటె లోపల నారరూపమై కొయ్యయందు కలిసికొనియుండునది). తత్ = ఆ నార, (పురుషస్య = పురుషుని యొక్క), స్నావ = నరమువలెనె, స్థిరం=దృఢమైనది. (పురుషస్య= పురుషునియొక్క, స్నావ్నః = నరముకంటె), అన్తరతః = లోపలగా, అస్థీని = ఎముకలు, (భవన్తి = ఉన్నవి). తథా = ఆప్రకారముగానే, వృక్షస్య = వృక్షముయొక్క, కినాటస్యాభ్యన్తరతః = నార లోపలగా), దారూణి = కొయ్యలు, (భవన్తి = ఉన్నవి). (వృక్షస్య = వృక్షముయొక్క), మజ్జా = చేవ, (పురుషస్య = పురుషునియొక్క), మజ్జోపమా = క్రొవ్వుతో పోల్చఁదగినదిగా, కృతా= చేయఁబడినది, (ఈ చెప్పిన త్వక్కు, చర్మము, రుధిరము, మాంసము, క్రొవ్వు, ఎముకలు, ఇవి వృక్షమునకువలెనె శరీరరూపమైన పురుషునికిని, శరీరరూపమైన పురుషునికివలెనె వృక్షమునకును, సమానముగా చెప్పఁబడినది. ఇతరమైన విశేషమేమియును లేదు). వృక్ణః=ఛేదింపఁబడిన, యద్వృక్షః = వృక్షమైతే, మూలాత్ = మొదటినుండి, పునః = తిరిగి, నవతరః = మిక్కిలి నూతనమైనదై, రోహతి =

మొలుచుచున్నది. మృత్యునా = మృత్యువుచేతను, వృక్ణః=ఛేదింపఁబడిన, (చంపఁబడిన), మర్త్యస్విత్ = మనుష్యుఁడైతే, కస్మాన్మూలాత్ = ఏ మొదటినుండి, ప్రరోహతి = మొలచుచున్నాఁడు. (పుట్టుచున్నాఁడు). (అని యాజ్ఞవల్క్యుఁడు ప్రశ్నముచేసి, ఓ బ్రాహ్మణులారా! రేతస్సువలన పుట్టుచున్నాఁడని అంటిరా), రేతసఇతి = శుక్రమువల్లనని, మావోచత = చెప్పవద్దు, తత్ = ఆ రేతస్సు, జీవతః = బ్రతికియున్నవానికే, ప్రజాయతే = పుట్టుచున్నది. (అని యాజ్ఞవల్క్యుఁడు పలికెను). వృక్షః = చెట్టు, ధానారుహాఇవవై = బీజమువలన పుట్టినదే. (గనుక, వనస్పతేః = చెట్టునకు), అఞ్జసా ప్రేత్య = ప్రత్యక్షముగా చనిపోయి, (బీజమునుండి), సమ్భవః = పుట్టుట, (భవేత్ = కలుగును). వృక్షం = చెట్టును, సమూలం = మొదటితోకూడ, ఆవృహేయుర్యత్ = పెరికివేసినయెడల, నపునరాభవేత్ = తిరిగి మొలవదు. (గనుక ఓ బ్రాహ్మణులారా! మిమ్మును సమస్తజగత్తునకు మూలమైన దానిని అడుగుచున్నానని యాజ్ఞవల్క్యుఁడు), మృత్యునా = మృత్యువుచేతను, వృక్ణః = ఖండింపఁబడిన, (చంపఁబడిన), మర్త్యఃస్విత్ = మనుష్యుఁడైతే, కస్మాన్మూలాత్ = ఏమూలమునుండి, ప్రరోహతి = మొలచుచున్నాఁడు, (పుట్టుచున్నాఁడు అని ప్రశ్నముచేసెను). (అయం = ఈ పురుషుఁడు), జాతఏవ = పుట్టినవాఁడె, నజాయతే = పుట్టఁడు. (గనుక ఈ మనుష్యుని విషయమై ప్రశ్నముగలుగదు అని అంటిరా అట్లనఁగూడదు. ఏలయనిన పుట్టినవానికి చచ్చినతరువాత జన్మము లేనియెడల వీనికిచేసిన పుణ్యాపాపఫలము నశించుటయును, చేయని పుణ్యాపాపఫలము వచ్చుటయును, కలుగును. కాఁబట్టి మరణమును పొందినవాఁడు తిరిగి పుట్టుచున్నాఁడు. అందువలననే, ఓ బ్రాహ్మణులారా! మిమ్మును అడుగుచున్నానని యాజ్ఞవల్క్యుఁడు. ఏనం = మరణమునుపొందిన ఈమనుష్యుని, కోను = ఎవఁడు, పునః = తిరిగి,

జనయేత్ = పుట్టించును. (అని ప్రశ్నముచేయఁగా, ఆ బ్రాహ్మణుల చేత జగత్తునకు మూలమైన పరబ్రహ్మవస్తువు తెలిసికొనఁబడక పోవుటవలన వారు ఉత్తరువును చెప్పలేకపోయిరి. అంతట యాజ్ఞవల్క్యుఁడు ఆబ్రాహ్మణులను జయించినవాఁడై ఆ గోవులను తోలుకొనిపోయెను. ఈ యాజ్ఞవల్క్యుఁడు ప్రశ్నముచేసిన జగత్తునకు మూలమైన ఆ పరబ్రహ్మవస్తువును శ్రుతియె స్వకీయముగా చెప్పుచున్నది). విజ్ఞానం = విజ్ఞానస్వరూపమును, ఆనన్దం = ఆనందస్వరూపమునగు. బ్రహ్మ = పరబ్రహ్మము. (తత్ = ఆ పరబ్రహ్మము), రాతిర్దాతుః = ధనముఇచ్చెడివానికిని, తద్విదః = ఆ పరబ్రహ్మమును తెలిసికొనినవాఁడై, తిష్ఠమానస్య = ఉన్నవానికిని, పరాయణం = శ్రేష్ఠమైనగతి, ఇతి = అని, (శ్రుతియెచెప్పెను),

తా॥ ఇట్లసమర్థులై ఆబ్రాహ్మణులు ఊరకుండఁగా, యాజ్ఞవల్క్యుఁడు ఆబ్రాహ్మణులను ఈశ్లోకములచేత అడుగుచున్నాఁడు. ఓ బ్రాహ్మణులారా! శరీరాకృతిగల ఈపురుషుఁడును పుష్ప ఫలాదులుగల వృక్షమును సత్యమైనవి. ఈ పురుష వృక్షములకు రెంటికిని, త్వక్కు, చర్మము, రుధిరము, మాంసము, నరము, మజ్జ, ఎముకలును. శరీరమను పురుషునికిని బరడు, తొక్కు, రసము, బంక, నార, చేవ, కొయ్యయును వృక్షమునకును; ఇవి ఒకదానికొకటి లోపల నుండునవియై సమానముగానున్నవి. అయినను ఛేదింపఁబడిన వృక్షము మొదలునుండి తిరిగి మిక్కిలి నూతనమైనదై పుట్టుచున్నది. ఆప్రకారముగానె మృత్యువుచేత చంపఁబడిన ఈ శరీరమను పురుషుఁడు ఏ మొదలునుండి పుట్టుచున్నదని యాజ్ఞవల్క్యుఁడు ప్రశ్నము చేసి, ఓ బ్రాహ్మణులారా! రేతస్సువలన ఈ శరీరమను పురుషుఁడు పుట్టుచున్నాఁడని అంటిరా అట్లు అనవద్దు. ఆ రేతస్సు బ్రతికియున్న వానివలన పుట్టుచున్నదిగాని చచ్చినవానివలన పుట్టుటలేదు. చెట్టు బీజమువలన పుట్టునదేగనుక చెట్టు నశించిపోయి తిరిగి బీజమునుండి

పుట్టుట కలుగును. చెట్టును వేళ్లతోకూడ పెఱికివేసినయెడల తిరిగి మూలమునుండి మొలచుటలేనే లేదు. కాఁబట్టి, ఓబ్రాహ్మణు లారా! మిమ్మును సమస్తజగత్తునకు మూలమైనదానిని అడుగుచున్నా నని, యాజ్ఞవల్క్యుఁడు, మృత్యువుచేత చంపఁబడిన మనుష్యుఁడు ఏమూలమునుండి పుట్టుచున్నాఁడని ప్రశ్నముచేసి, ఓ బ్రాహ్మణు లారా ! పుట్టినమనుష్యుఁడు తిరిగిపుట్టఁడు గనుక మనుష్యుని విష యమై ఈ ప్రశ్నముకలుగదని అంటిరా అట్లనఁగూడదు. ఏలయనిన, పుట్టినవానికి చచ్చిన తరువాత జన్మములేనియెడల ఈ మనుష్యునికి చేసిన పుణ్యాపాపఫలమునశించుటయును, చేయని పుణ్యాపాపఫలము వచ్చుటయును, కలుగును. కాఁబట్టి మరణమునుపొందినవాఁడు తిరిగి పుట్టుచున్నాఁడు గనుక మనుష్యునివిషయమై మృత్యువుచేత చంపఁ బడిన పురుషుఁడు ఏమూలమునుండి కలుగుచున్నాఁడని నేనుచేసిన ప్రశ్నము సరియైనదియే యనిచెప్పి, ఓ బ్రాహ్మణులారా! మర ణమునుపొందిన ఈ మనుష్యుని తిరిగి యెవఁడుపుట్టించును అని యాజ్ఞ వల్క్యుఁడు ప్రశ్నముచేయఁగా, ఆజనకసభయందలి బ్రాహ్మణులు సమస్తమునకు కారణమైన పరబ్రహ్మమును తెలిసికొనకపోవుటవలన ప్రత్యుత్తరమును చెప్పలేకపోయిరి. అంతట యాజ్ఞవల్క్యుఁడు ఆబ్రాహ్మణులను జయించినవాఁడై ఆ గోవులను తోలుకొనిపోయెను. ఇట్లు యాజ్ఞవల్క్యుఁడు ప్రశ్నముచేసిన సమస్తమునకును మూల మైన ఆపరబ్రహ్మవస్తువు విజ్ఞానస్వరూపమును ఆనందస్వరూపమునగు బ్రహ్మము. ఆపరబ్రహ్మమే కర్మచేయువానికి కర్మఫలమును ఇచ్చునదియునై బ్రహ్మవేత్తయై తానుగానే నిలిచియున్నవానికి వాఁడుతానైయైనదియునై శ్రేష్ఠమైనగతిగా నున్నదియని శ్రుతియె స్వకీయముగాఁజెప్పినది.

ఇట్లు పఞ్చమాధ్యాయమునందునవమ బ్రాహ్మణము సమాప్తము.

శుక్ల యజుర్వేద - కాణ్వశాఖాయామ్.

# బృహదారణ్యకోపనిషత్

## షష్ఠాధ్యాయము.

శాం॥ ఓమ్। పూర్ణమదః పూర్ణమిదం పూర్ణాత్పూర్ణ ముదచ్యతే (చ్య) తే।
పూర్ణస్య పూర్ణమాదాయ పూర్ణ మేవా వశిష్యతే.

---

ఓమ్ శాన్తిః శాన్తిః శాన్తిః (చూ. 7, 1-1.)

ఉ॥ జనకో హ వైదేహ ఆసాఞ్చక్రేఽథ హ యాజ్ఞవల్క్య ఆవవ్రాజ। తగ్ హోవాచ యాజ్ఞవల్క్య కిమర్థమచారీః పశూనిచ్ఛన్నణ్వాన్తానీతి। ఉభయమేవ సమ్రాడితి హోవాచ. ॥1॥

ప॥ జనకః - హ - వైదేహః - ఆసాఞ్చక్రే - అథ - హ - యాజ్ఞవల్క్యః - ఆవవ్రాజ - తం - హోవాచ - యాజ్ఞవల్క్యః - కిమర్థం - అచారీః - పశూన్ - ఇచ్ఛన్ - అణ్వాన్తాన్ - ఇతి - ఉభయం - ఏవ - సమ్రాట్ - ఇతి - హోవాచ.

ప్ర॥ వైదేహః = విదేహ దేశప్రభువైన, జనకోహ = జనక మహారాజు, ఆసాఞ్చక్రే = కూర్చుండెను. అథహ = ఆ సమయము నందు, యాజ్ఞవల్కః = యాజ్ఞవల్క్యుఁడు, ఆవవ్రాజ = వచ్చెను. (జనకః = జనకమహారాజు), తం = ఆ యాజ్ఞవల్క్యునిగూర్చి, హోవాచ = పలికెను. హేయాజ్ఞవల్క్య = ఓ యాజ్ఞవల్క్యుఁడా, కిమర్థం = ఎందునిమిత్తము, అచారీః = వచ్చితివి, పశూన్ = పశువులను, ఇచ్ఛన్ = కోరినవాఁడవైయా ? (లేక), అణ్వాన్తాః = సూక్ష్మవస్తువే అన్తముగాఁగల ప్రశ్నలను. (మత్తః = నావలన, శ్రోతుం = వినుటకు, ఇచ్ఛన్ = కోరికగలవాఁడవైయా ?) ఇతి =

అని, (జనకమహారాజు పలికెను). (యాజ్ఞవల్క్య = యాజ్ఞవల్క్యుఁడు), హేసమ్రాట్ = ఓ జనకమహారాజా! ఉభయమేవ = రెంటినిగూర్చియే, ఇతి = అని, హోవాచ = పలికెను.

తా॥ పూర్వాధ్యాయమునందు జల్పన్యాయముచేతను. (జల్పన్యాయమనఁగా = పరమతమును ఖండించుచు స్వమతమును స్థాపించెడి కథ జల్పమనఁబడును). సచ్చిదానందస్వరూపమగు పరబ్రహ్మము నిర్ధారణచేయఁబడినది. ఇప్పుడు వాదన్యాయముచేతను, (నిజమును తెలిసికొనవలెనను ఇచ్ఛగలవానియొక్క వాక్యము వాదమనఁబడును). ఆ పరబ్రహ్మమునే నిర్ధారణచేయుటకు ఈ అధ్యాయమారంభింపఁబడినది. విదేహదేశప్రభువైన జనకమహారాజు తన్ను చూచుటకుఁగోరికగలవారలకు దర్శనమును ఇచ్చుటకు సభయందుఁగూర్చుండెను. ఆ సమయమునందు యాజ్ఞవల్క్యుఁడు తనయొక్క యోగక్షేమముకొఱకును, రాజుయొక్క బ్రహ్మజిజ్ఞాసనుచూచి యనుగ్రహించుటకొఱకును, వచ్చెను. అట్లువచ్చిన యాజ్ఞవల్క్యుని జనకమహారాజు యథాశాస్త్రముగాఁబూజించి, ఓ యాజ్ఞవల్క్యుఁడా! మరల పశువులను కోరియా లేక సూక్ష్మవస్తువుయొక్క నిర్ణయమే అంతముగాఁగల ప్రశ్నలను నావలన వినుటకు కోరియా యెందుకు వచ్చితివని అడిగెను. యాజ్ఞవల్క్యుఁడు, ఓ జనకమహారాజా! ఆ రెంటినిగూర్చియె వచ్చినానని పలికెను.

ఉ॥ యత్తే కశ్చిద బ్రవీత్తచ్ఛృణవామేత్యబ్రవీన్మే జిత్వా శైలిని ర్వాగ్వై బ్రహ్మేతి యథా మాతృమాన్పితృమా నాచార్యవాన్బ్రూయాత్తథా తచ్ఛైలినో బ్రవీద్వాగ్వై బ్రహ్మేత్యవదతో హి కిగ్ స్యాదిత్య బ్రవీత్తు తే తస్యాయతనం ప్రతిష్ఠాం న మేఽబ్రవీదిత్యేకపాద్వా ఏతత్సమ్రాడితి స వై నో బ్రూహి యాజ్ఞవల్క్య వాగేవాయతనమాకాశః ప్రతిష్ఠా ప్రజ్ఞేత్యేనదుపాసీత। కా ప్రజ్ఞతా యాజ్ఞవల్క్య। వాగేవ సమ్రాడితిహోవాచ।

వాచా వై సమ్రాడ్బన్ధుః ప్రజ్ఞాయతే ఋగ్వేదో యజుర్వేద స్సామవేదోఽథర్వాఙ్గిరస ఇతిహాసః పురాణం విద్యా ఉపనిషదః శ్లోకాః సూత్రాణ్యనువ్యాఖ్యానాని వ్యాఖ్యానానీష్టగ్ంహుతమాశితం పాయితమయం చ లోకః పరశ్చ లోకః సర్వాణి చ భూతాని వాచైవ సమ్రాడ్జ్ఞాయతే వాగ్వై సమ్రాట్పరమం బ్రహ్మ నైనం వాగ్జహాతి సర్వాణ్యేనం భూతాన్యభిక్షరన్తి దేవో భూత్వా దేవానప్యేతి య ఏవం విద్వానేతదుపాస్తే । హస్త్యృషభగ్ం సహస్రం దదామీతి హోవాచ జనకో వైదేహః । స హోవాచ యాజ్ఞవల్క్యః పితా మేఽమన్యత నాననుశిష్య హరేతేతి. ॥2॥

ప॥ యత్ – తే – కః – చిత్ – అబ్రవీత్ – తత్ – శృణవామ – ఇతి – అబ్రవీత్ – మే – జిత్వా – శైలినిః – వాక్ – వై – బ్రహ్మ – ఇతి – యథా – మాతృమాన్ – పితృమాన్ – ఆచార్యవాన్ – బ్రూయాత్ – తథా – తత్ – శైలినః – అబ్రవీత్ – వాక్ – వై – బ్రహ్మ – ఇతి – అవదతః – హి – కిం – స్యాత్ – ఇతి – అబ్రవీత్ – తు – తే – తస్య – ఆయతనం – ప్రతిష్ఠాం – న – మే–అబ్రవీత్ – ఏకపాత్–వా– సమ్రాట్ – ఇతి – సః – వై – నః – బ్రూహి – యాజ్ఞవల్క్య – వాక్ – ఏవ – ఆయతనం – ఆకాశః – ప్రతిష్ఠా – ప్రజ్ఞా – ఇతి – ఏనత్ – ఉపాసీత – కా – ప్రజ్ఞతా – యాజ్ఞవల్క్య – వాక్ – ఏవ–సమ్రాట్– ఇతి – హోవాచ – వాచా – వై – సమ్రాట్ – బన్ధుః – ప్రజ్ఞాయతే – ఋగ్వేదః – యజుర్వేదః – సామవేదః – అథర్వాఙ్గిరసః – ఇతిహాసః – పురాణం – విద్యాః – ఉపనిషదః – శ్లోకాః, సూత్రాణి – అనువ్యాఖ్యానాని – వ్యాఖ్యానాని – ఇష్టం – హుతం – ఆశితం– పాయితం – అయం–చ – లోకః – పరః – చ – లోకః – సర్వాణి – చ – భూతాని – వాచా – ఏవ – సమ్రాట్ – జ్ఞాయతే – వాక్ –

వై - సమ్రాట్ - పరమం - బ్రహ్మ - న - ఏనం - వాక్ - జహాతి - సర్వాణి - ఏనం - భూతాని - అభిక్షరన్తి - దేవః - భూత్వా - దేవాన్ - అపి - ఏతి - యః - ఏవం - విద్వాన్ -ఏతత్- ఉపాస్తే - హస్త్యృషభం - సహస్రం - దదామి - ఇతి - హోవాచ - జనకః - వైదేహః - సః - హోవాచ - యాజ్ఞవల్క్యః - పితా - మే - అమన్యత - న - అననుశిష్య - హరేత - ఇతి.

ప్ర॥ కశ్చిత్ = ఒకానొకఁడగు ఆచార్యుఁడు, తే= నీకొఱకు, యత్ = దేనిని, అబ్రవీత్ = చెప్పెనో, తత్ = దానిని, శ్రుణవామ = వినుదునుగాక, ఇతి = అని, (యాజ్ఞవల్క్యః = యాజ్ఞవల్క్యుఁడు, అబ్రవీత్ = పలికెను). శైలినిః = శిలుని పుత్త్రుఁడగు, జిత్వా = జిత్వయనువాఁడు, మే = నాకొఱకు, వాగ్వై = వాక్కే, బ్రహ్మేతి = బ్రహ్మమని, అబ్రవీత్ = పలికెను, (అని జనకమహారాజు చెప్పెను). మాతృమాన్ = తల్లిగలవాఁడును, పితృమాన్ = తండ్రిగలవాఁడును, ఆచార్యవాన్ = ఆచార్యుఁడు గలవాఁడునగు (జనుడు), యథా = ఏప్రకారము, బ్రూయాత్ = పలుకునో, తథా = ఆప్రకారము, శైలినః = శైలినియనువాఁడు, తత్ = ఆ, వాగ్వైబ్రహ్మేతి = వాక్కే బ్రహ్మమని, అబ్రవీత్ = పలికెను. అవదతః = పలుకనివానికి, కిం = ఏమి, స్యాత్ = అగును? వాగ్వ్యాపారములేని మూగవానికి ఏదియును సిద్ధించదు). ఇతి = గనుక, (వాక్కే బ్రహ్మమని పలికెను). (కింతు = ఇంకనేమియనిన, సః = ఆ శైలినియనువాఁడు), తే = నీకొఱకు, తస్య = ఆ వాక్బ్రహ్మమునకు, ఆయతనం = శరీరమును, ప్రతిష్ఠాం = స్థితిని, (మూఁడుకాలములయందలి ఆశ్రయమును), (కిం = ఏమి), అబ్రవీత్ = చెప్పెను, (అని యాజ్ఞవల్క్యుఁడు అడిగెను). మే = నాకొఱకు, నాబ్రవీదితి= చెప్పలేదని, (జనకమహారాజు పలికెను). హేసమ్రాట్ = సార్వభౌముఁడవగు ఓజనకమహారాజా, ఏతత్=వాగ్బ్రహ్మము, ఏకపాద్వై=

ఒకపాదమైన దే. ఇతి = అని, (యాజ్ఞవల్క్యుఁడు చెప్పెను), హే యాజ్ఞవల్క్య = ఓ యాజ్ఞవల్క్యుఁడా! సవై = అటువంటి, (త్వం = నీవు), నః = మాకొఱకు, బ్రూహి = చెప్పుమా (అని జనకుఁడు అడిగెను). వాగేవ = వాక్కే, ఆయతనం = శరీరము. ఆకాశః = అవ్యాకృతాకాశము, ప్రతిష్ఠా = ఆశ్రయము. (ఉత్పత్తి స్థితిలయకాలములయందాశ్రయమైనది). ఏతత్ = చతుర్థపాదమగు ఈ వాగ్రూపమైన బ్రహ్మమును, ప్రజ్ఞేతి = ప్రజ్ఞయని, ఉపాసీత = ఉపాసనచేయుఁడీ! (అని యాజ్ఞవల్క్యుఁడు చెప్పెను). హే యాజ్ఞవల్క్య = ఓ యాజ్ఞవల్క్యుఁడా! ప్రజ్ఞతా = ప్రజ్ఞ, కా = ఏది? (అని జనకుఁడు ప్రశ్నచేసెను). హేసమ్రాట్ = ఓ జనకమహారాజా, వాగేవేతి = వాక్కే అని, (యాజ్ఞవల్క్యుఁడు). హోవాచ = పలికెను. హేసమ్రాట్ = ఓజనకమహారాజా, వాచావై = వాక్కుచేతనే, బన్ధుః = చుట్టము, (యథా = ఏప్రకారము), ప్రజ్ఞాయతే = తెలిసికొనఁబడుచున్నాఁడో, (తథా = ఆప్రకారముగానే), ఋగ్వేదః = ఋగ్వేదమును, యజుర్వేదః = యజుర్వేదమును, సామవేదః = సామవేదమును, అథర్వాఙ్గిరసః = ఆథర్వణవేదమును, ఇతిహాసః = ఇతిహాసమును, (రామాయణము మొదలైనవియును), పురాణం = పురాణమును, (విష్ణుపురాణము మొదలైనవియును), విద్యాః = అఱువదినాలుగు విద్యలును, ఉపనిషదః = ఉపనిషత్తులును, శ్లోకాః = శ్లోకములును, (మన్వాదిస్మృతిరూపమైన శ్లోకములును), సూత్రాణి=బ్రహ్మసూత్రములును, అనువ్యాఖ్యానాని = భాష్యవ్యాఖ్యానములును, వ్యాఖ్యానాని = భాష్యములును, ఇష్టం= యాగాది నిమిత్తకమైన ధర్మమును, హుతం = హోమ నిమిత్తమైన ధర్మమును, ఆశితం = అన్నదాన నిమిత్తమైన ధర్మమును, పాయితం = ఉదకదాన నిమిత్తమైన ధర్మమును, అయంచలోకః = ఈ జన్మమున్ను, పరశ్చలోకః=ముందు పొందఁదగిన జన్మమును, సర్వా

ణిచభూతాని = సమస్తభూతములున్ను, హేసమ్రాట్ = ఓ జనక మహారాజా, వాచైవ = వాక్కుచేతనే, జ్ఞాయతే = తెలిసికొనబడు చున్నది. (గనుక), హేసమ్రాట్ = ఓ జనకమహారాజా, వాగ్వై= వాక్కే, పరమంబ్రహ్మ = పరబ్రహ్మము. వాక్ = వాక్కు, ఏనం = (ఈపూర్వముచెప్పినప్రకారము తెలిసికొనిన) వీనిని, నజహాతి = విడువదు. సర్వాణిభూతాని = సమస్తభూతములును, ఏనం = వీనిని, అభిక్షరన్తి = ప్రేమించుచున్నవి. (పూజలను కానుకలను ఇచ్చుటచేత ప్రేమించుచున్నారు). యః = ఎవఁడు, ఏవం = ఈప్రకారముగాను, విద్వాన్ = తెలిసికొనినవాఁడై, ఏతత్ = ఈ బ్రహ్మమును, ఉపాస్తే = ఉపాసనచేయుచున్నాఁడో, (సః=వాఁడు, ఇహ = ఇక్కడ), దేవోభూత్వా = దేవుఁడై, (శరీరము పడిపోయిన తరువాత) దేవాన్ = దేవతలను, అప్యేతి = పొందుచున్నాఁడు. (అని యాజ్ఞవల్క్యుఁడు చెప్పెను). వైదేహః = విదేహదేశమునకు రాజైన, జనకః = జనకుఁడు, సహస్రం = వేయి, హస్త్యృషభం = ఏనుఁగులవంటి యెద్దులను, దదామీతి = ఇచ్చుచున్నానని, హోవాచ = పలికెను. సః = ఆ, యాజ్ఞవల్క్యః = యాజ్ఞవల్క్యుఁడు, అననుశిష్య = శిష్యుని కృతార్థునిచేయక, (శిష్యాత్= శిష్యునివలన, ధనం = ధనమును), నాహరేత = తీసికొనఁగూడదు, ఇతి = అని, మే = నాయొక్క, పితా = తండ్రి, అమన్యత = బోధించెను (అని), హోవాచ = పలికెను.

తా॥ ఓ జనకమహారాజా! నీకు ఏ ఆచార్యుఁడేమి చెప్పినాఁడో దానిని నేను వినవలయును చెప్పుమాయని యాజ్ఞవల్క్యుఁడడిగెను, ఓ యాజ్ఞవల్క్యుఁడా! శిలపుత్రుఁడగు జిత్వయనువాఁడు లోకమునందు తల్లిదండ్రులచేతనున్ను ఆచార్యునిచేతనున్ను శిక్షితుఁడగు ప్రమాణభిన్నముగాని బుద్ధిగలవాఁడెట్లు ప్రమాణమునకు వేరుగాని వాక్యమును పలుకునో, ఆ ప్రకారముగానే, వాక్కులేనివానికి ఏమి

యుసిద్ధించదు గనుక వాక్కే బ్రహ్మస్వరూపమని నాకు చెప్పెనని జనకుఁడు పలికెను. మరల యాజ్ఞవల్క్యుఁడు, ఓ జనకుఁడా! ఆ శైలిని యనువాఁడు వాగ్రూపమైన బ్రహ్మమునకు శరీరమునున్ను ఆశ్రయమునున్ను చెప్పినాఁడాయని ప్రశ్నముచేయగా, జనకుఁడు నాకు చెప్పలేదని చెప్పెను. అప్పుడాయాజ్ఞవల్క్యుఁడు ఓ జనకుఁడా! ఇది యేకపాద స్వరూపమైన బ్రహ్మమని పలికెను. తరువాత ఆ జనకుఁడు ఓ యాజ్ఞవల్క్యుఁడా మాకు ఏకపాద స్వరూపమైన బ్రహ్మమును చెప్పుమాయని యడుగగా యాజ్ఞవల్క్యుఁడు ఓ జనకుఁడా ఈ వాగ్రూపమైన బ్రహ్మమునకు వాక్కే శరీరము. అవ్యాకృతాకాశమే ఆశ్రయము. ఇట్టి ఏకపాదస్వరూపమైన వాగ్రూప బ్రహ్మమును ప్రజ్ఞయని ఉపాసన చేయవలయునని పలికెను. జనకుఁడు మరల యాజ్ఞవల్క్యుఁడా! ప్రజ్ఞ ఏదియని అడిగెను. యాజ్ఞవల్క్యుఁడు ఓ జనకుఁడా! వాక్కుచేత మనకు వీఁడు బంధువు అనియును తెలిసికొనఁబడుచున్నది. మఱియు ఋగ్వేద యజుర్వేద సామవేదాథర్వణవేదములును, రామాయణాది ఇతిహాసములును, విష్ణ్వాదిపురాణములును, అఱువదినాలుగు విద్యలును, ఉపనిషత్తులును, మన్వాదిస్మృతులును, బ్రహ్మసూత్రములును, భాష్యములును, భాష్యవ్యాఖ్యానములును, యాగనిమిత్తమైన ధర్మమును, హోమనిమిత్తమైన ధర్మమును, భక్షణనిమిత్తమైన ధర్మమును, పాననిమిత్తమైన ధర్మమును, ఈ జన్మమును, పరజన్మమును, సమస్తభూతములును, వాక్కుచేతనే తెలిసికొనఁబడుచున్నవిగనుక వాక్కే ప్రజ్ఞ. వాక్కే పరబ్రహ్మము. అనిచెప్పి ఇట్లు ఉపాసనచేసెడి వానిని వాక్కు ఎప్పటికిని విడిచిపోదు. అనఁగా, అట్టివాఁడు, అధ్యయనముచేసిన బ్రహ్మవిద్యను ఎన్నటికిని మఱచిపోఁడు. వానిని సమస్తభూతములును బలిదానాదులచేత గోవు లేఁగనువలెనే ప్రేమించుచున్నవి. ఇట్లు తెలిసికొని ఉపాసించెడివాఁడు ఇక్కడనే దైవస్వరూపుఁడై దేహపాతానంతరము దేవతలను పొం

దుచున్నాఁడని చెప్పెను. ఇట్లు చెప్పఁగా విదేహ ప్రభువైన జనక మహారాజు ఓ యాజ్ఞవల్క్యుఁడా! నీకు ఏనుఁగులతో సమానము లగు వేయి వృషభములను ఇచ్చెదనని చెప్పెను. అప్పుడు యాజ్ఞవల్క్యుఁడు ఓ జనకుఁడా! మాతండ్రి శిష్యుని కృతార్థునిచేయక శిష్యునివలన ధనమును గ్రహించఁగూడదని నాకు బోధచేసెను. నాకును అదియె అభిప్రాయము గనుక నేను గ్రహించనని పలికెను.

ఉ॥ యదేవ తే కశ్చిద బ్రవీత్తచ్ఛృణవామేత్య బ్రవీన్మ ఉదఙ్కః శౌల్బాయనః ప్రాణో వై బ్రహ్మేతి యథా మాతృమాన్ పితృమానాచార్యవాన్ బ్రూయాత్తథా తచ్ఛౌల్బాయనోఽబ్రవీత్ప్రాణో వై బ్రహ్మేత్యప్రాణతో హి కిగ్ స్యాదిత్య బ్రవీత్తు తే తస్యాయతనం ప్రతిష్ఠాం న మేఽబ్రవీదిత్యేకపాద్వా ఏతత్సమ్రాడితి స వై నో బ్రూహి యాజ్ఞవల్క్య ప్రాణ ఏవాయతనమాకాశః ప్రతిష్ఠా ప్రియమిత్యేనదుపాసీత కా ప్రియతా యాజ్ఞవల్క్య ప్రాణ ఏవ సమ్రాడితి హోవాచ ప్రాణస్య వై సమ్రాట్కామాయాయాజ్యం యాజయత్య ప్రతిగృహ్యస్య ప్రతిగృహ్ణాత్యపి తత్ర వధా శఙ్కం భవతి యాం దిశమేతి ప్రాణస్యైవ సమ్రాట్కామాయ ప్రాణో వై సమ్రాట్పరమం బ్రహ్మ నైనం ప్రాణో జహాతి సర్వాణ్యేనం భూతాన్యభిక్షరన్తి దేవో భూత్వా దేవానప్యేతి య ఏవం విద్వానేతదుపాస్తే హస్త్యృషభగ్ సహస్రం దదామీతి హోవాచ జనకో వై దేహః స హోవాచ యాజ్ఞవల్క్యః పితా మేఽమన్యత నాననుశిష్య హరేతేతి. ॥3॥

ప॥ యత్ – ఏవ – తే – కః – చిత్ – అబ్రవీత్ – తత్ – శృణవామ – ఇతి – అబ్రవీత్ – మే – ఉదఙ్కః – శౌల్బాయనః – ప్రాణః – వై – బ్రహ్మ – ఇతి – యథా – మాతృమాన్ – పితృమాన్ – ఆచార్యవాన్ – బ్రూయాత్ – తథా – తత్ – శౌల్బాయనః – అబ్రవీత్ – ప్రాణః – వై – బ్రహ్మ – ఇతి – అప్రాణ

తః - హి - కిం - స్యాత్ - ఇతి - అబ్రవీత్ - తు - తే - తస్య - ఆయతనం - ప్రతిష్ఠాం - న - మే - అబ్రవీత్ - ఇతి - ఏక పాత్ - వై - ఏతత్ - సమ్రాట్ - ఇతి - సః - వై - నః - బ్రూహి - యాజ్ఞవల్క్య - ప్రాణః - ఏవ - ఆయతనం - ఆకాశః - ప్రతిష్ఠా - ప్రియం - ఇతి - ఏనత్ - ఉపాసీత - కా - ప్రియతా - యాజ్ఞవల్క్య - ప్రాణః - ఏవ - సమ్రాట్ - ఇతి - హోవాచ - ప్రాణస్య - వై - సమ్రాట్ - కామాయ - అయాజ్యం - యాజయతి - అప్రతిగృహ్యస్య - ప్రతిగృహ్ణాతి - అపి - తత్ర - వధాశఙ్కం - భవతి - యాం - దిశం - ఏతి - ప్రాణస్య - ఏవ - సమ్రాట్ - కామాయ - ప్రాణః - వై - సమ్రాట్ - పరమం - బ్రహ్మ - న - ఏనం - ప్రాణః - జహాతి - సర్వాణి - ఏనం - భూతాని - అభిక్షరన్తి - దేవః - భూత్వా - దేవాన్ - అపి - ఏతి - యః - ఏవం - విద్వాన్ - ఏతత్ - ఉపాస్తే - హస్త్యృషభం - సహస్రం - దదామి - ఇతి - హోవాచ - జనకః - వై దేహః - సః - హోవాచ - యాజ్ఞవల్క్యః - పితా - మే - అమన్యత - న - అననుశిష్య - హరేత - ఇతి.

ప్ర॥ కశ్చిత్ = ఒకానొకఁడగు ఆచార్యుఁడు, తే = నీకొఱకు, యదేవ = దేనినే. అబ్రవీత్ = చెప్పెనో, తత్ = దానిని, (అహం = నేను), శృణవామ = వినవలయును, ఇతి = అని. (యాజ్ఞవల్క్యుఁడు పలికెను). శౌల్బాయనః = శుల్బపుత్రుఁడగు, ఉదఙ్కః = ఉదంకుఁడనువాఁడు, ప్రాణోవై = ప్రాణమే, బ్రహ్మేతి = బ్రహ్మమని, మే = నాకొఱకు, అబ్రవీత్ = పలికెను. (జనకమహారాజు పలికెను). మాతృమాన్ = తల్లిగలవాఁడును, పితృమాన్ = తండ్రిగలవాఁడును, ఆచార్యవాన్ = ఆచార్యుఁడు గలవాఁడును, యథా = ఏప్రకారము, బ్రూయాత్ = పలుకునో, తథా = ఆప్రకారము, శౌల్బాయనః = శుల్బపుత్రుఁడగు ఉదంకుఁడు, అప్రాణ

తోఽహి = ప్రాణములేనివానికైతే, కింస్యాత్ = ఏమికలుగును ? (ఏమియు కలుగదు), ఇతి = అని, తత్ = ఆ, ప్రాణోవై = ప్రాణమే, బ్రహ్మేతి = బ్రహ్మమని, అబ్రవీత్ = పలికెను. (అని జనకుఁడు చెప్పగా యాజ్ఞవల్క్యుఁడు), (ఓ జనకుఁడా), తే = నీకొఱకు, తస్య = ఆ ప్రాణరూపమైన బ్రహ్మముయొక్క, ఆయతనం = శరీరమునున్ను, ప్రతిష్ఠాం = ఆశ్రయమునున్ను, అబ్రవీత్తు = చెప్పెనా? (అని ప్రశ్న చేసెను). మే = నాకొఱకు, నాబ్రవీదితి = చెప్పలేదని, (జనకుఁడు చెప్పెను). హేసమ్రాట్ = సార్వభౌముఁడవగు ఓ జనకుఁడా, ఏతత్ = ఈ ప్రాణరూపమైన బ్రహ్మము, ఏకపాద్వై = ఒకపాదమైనదే, ఇతి = అని, (యాజ్ఞవల్క్యుఁడు చెప్పెను). హే యాజ్ఞవల్క్య = ఓ యాజ్ఞవల్క్యుఁడా, సవై = అటువంటివాఁడవే యగు నీవు, నః = మాకొఱకు, బ్రూహి = చెప్పుమా, (అని జనకుఁడు అడిగెను). ప్రాణయేవ = ప్రాణమే, ఆయతనం = శరీరము. ఆకాశః = అవ్యాకృతాకాశము, ప్రతిష్ఠా = ఆశ్రయము. (ఉత్పత్తిస్థితిలయకాలములయందాశ్రయమైనది). ఏనత్ = ఈ ప్రాణరూపబ్రహ్మమును, ప్రియమితి = ప్రేమరూపమని, ఉపాసీత = ధ్యానించవలయును (అని యాజ్ఞవల్క్యుఁడు చెప్పెను). హే యాజ్ఞవల్క్య = ఓ యాజ్ఞవల్క్యుఁడా, ప్రియతా = ప్రియత్వము, కా = ఏది. (అని జనకుఁడు ప్రశ్న చేసెను). హేసమ్రాట్ = సార్వభౌముఁడవగు ఓ జనకుఁడా ! ప్రాణఏవ = ప్రాణమే, ఇతి = అని. (యాజ్ఞవల్క్యుఁడు), హోవాచ = పలికెను. హేసమ్రాట్ = సార్వభౌముఁడవగు ఓ జనకమహారాజా, (జనుఁడు), ప్రాణస్య = ప్రాణముయొక్క, కామాయవై = కామముకొఱకే, అయాజ్యం = (యాగార్హుఁడుకాని వానిని, (పతితుని), యాజయతి = యాగముచేయించుచున్నాఁడు. అప్రతిగృహ్యస్యాపి = గ్రహించుటకు అర్హముకానిదానిన్ని, ప్రతిగృహ్ణాతి = ప్రతిగ్రహించుచున్నాఁడు. హేసమ్రాట్=

సార్వభౌముఁడవగు ఓ జనకుఁడా! ప్రాణస్య = ప్రాణముయొక్క, కామాయైవ = కోరికకొఱకే, యాం = ఏ, దిశం = దిక్కును, ఏతి = పొందుచున్నాఁడో, తత్ర = అక్కడ. వధాశఙ్కం = సంహార నిమిత్తకమైన భయమున్ను, భవతి = కలుగుచున్నది.(గనుక) హేసమ్రాట్ = సార్వభౌముఁడవగు ఓ జనకుఁడా, ప్రాణోవై = ప్రాణమే, పరమంబ్రహ్మ = పరబ్రహ్మము. ఏనం = ఇటువంటివానిని, ప్రాణః = ప్రాణము, నజహాతి = విడిచిపోదు. సర్వాణి = సమస్తములైన, భూతాని = భూతములు, ఏనం = ఇట్టివానిని, అభిక్షరన్తి = స్నేహించుచున్నవి. యః = ఎవఁడు, ఏవం = ఈప్రకారముగాన్ను విద్వాన్ = తెలిసికొనినవాఁడై, ఏతత్ = ఈ ప్రాణరూపమైన బ్రహ్మమును. ఉపాస్తే = ధ్యానించుచున్నాఁడో, (సః= వాడు, ఇహ = ఇక్కడ), దేవోభూత్వా = దేవుఁడై, (శరీరము పడిపోయినతరువాత), దేవాన్ = దేవతలను, అప్యేతి = పొందుచున్నాఁడు (అని యాజ్ఞవల్క్యుఁడు చెప్పెను). వైదేహః=విదేహదేశ ప్రభువైన, జనకః = జనకమహారాజు, హస్త్యృషభం = ఏనుఁగుల వంటి యెద్దులను, సహస్రం = వెయ్యింటిని, దదామీతి = ఇచ్చుచున్నానని, హోవాచ = పలికెను. సః = ఆ, యాజ్ఞవల్క్యః = యాజ్ఞవల్క్యుఁడు, అననుశిష్య = శిష్యునిచేయక, (శిష్యునికృతార్థునిచేయక శిష్యునివలన ధనమును), నాహరేతేతి = తీసికొనఁగూడదని, మే = నాయొక్క, పితా = తండ్రి, అమన్యత = బోధించెను (అని), హోవాచ = పలికెను.

తా॥ ఓ జనకమహారాజా! ఇంకనే ఆచార్యుఁడేమి చెప్పినాఁడో దానిని నేను వినపలయును చెప్పుమాయని యాజ్ఞవల్క్యుఁడడిగెను. జనకమహారాజు, ఓ యాజ్ఞవల్క్యుఁడా! శుల్బపుత్రుఁడగు ఉదంకుఁడనువాఁడు లోకమునందు మాతాపితృ ఆచార్యులచేఁ గ్రమముగా శిక్షితుఁడైనవాఁడెట్లు సత్యముగా పలుకునో ఆప్రకారముగానే

ప్రాణములేని వానికేమియు కలుగదు గనుక ప్రాణమే బ్రహ్మస్వరూపమని సత్యముగా నాకు చెప్పెనని పలికెను. అప్పుడు యాజ్ఞవల్క్యుఁడు ఓజనకుఁడా! ఉదంకుఁడు ఆ ప్రాణరూప పరబ్రహ్మమునకు శరీరమును ఆశ్రయమును చెప్పెనాయని మరలయడుగగా జనకుఁడు నాకుచెప్ప లేదనెను. అప్పుడా యాజ్ఞవల్క్యుఁడు సార్వభౌముడవగు ఓ జనకుఁడా! ఈప్రాణబ్రహ్మమె ఏక పాదస్వరూపమైన పరబ్రహ్మమని చెప్పెను. మరల జనకుఁడు ఓయాజ్ఞవల్క్యుఁడా! దాన్ని మాకొఱకు చెప్పుమాయని అడిగెను. ఇట్లు అడుగగా యాజ్ఞవల్క్యుఁడు ఓ జనకుఁడా! ఆప్రాణరూప పరబ్రహ్మమునకు ప్రాణమే శరీరము. అవ్యాకృతాకాశమే ఉత్పత్తిస్థితిలయకాలములయందు ఆశ్రయము. ఇట్టి పరబ్రహ్మముయొక్క ఏకపాదస్వరూపమునగు ప్రాణరూపమైన బ్రహ్మమును ప్రియమని ఉపాసనచేయవలయునని చెప్పెను. అప్పుడు జనకుఁడు ఓయాజ్ఞవల్క్యుఁడా! ప్రియమనునది ఏదియని మరల ప్రశ్న చేసెను. యాజ్ఞవల్క్యుఁడు ఓజనకుఁడా! ప్రాణమెప్రియమైనది. ఏలననఁగా, జనుఁడు ప్రాణమును కాపాడుకొనవలయునను ఇచ్ఛచేత ధనమును ఆర్జించుటకు యాగముచేయుటకు అర్హుఁడుగాని పతితుని యాగముచేయించుచున్నాఁడు. గ్రహించుటకలవిగాని తీక్ష్ణములైన వాటిని గ్రహించుచున్నాఁడు. ప్రాణమును పోషించుకొనవలయున నెడి కోరికకొఱకే సంహారనిమిత్తకమైన భయముగల దిక్కునుగూర్చియును పోవుచున్నాఁడు. గనుక అన్నిటికంటె ప్రియమైనది ప్రాణమె. ఇది పరబ్రహ్మము. ఇట్లు ప్రాణము పరబ్రహ్మమని ఉపాసించెడి వానిని ప్రాణము విడిచిపోదు. సమస్తభూతములును స్నేహించుచున్నవి. ఇట్లు తెలిసికొని ప్రాణబ్రహ్మోపాసనచేసెడివాఁడు ఇక్కడనే దైవస్వరూపుఁడై దేహపాతానంతరము దేవతలను పొందుచున్నాఁడని చెప్పెను. ఇట్లు చెప్పగావిని విదేహప్రభువైన జనకమహారాజు ఓయాజ్ఞవల్క్యుఁడా! నీకు ఏనుఁగులతో సమానములగు వేయి

యెద్దులను ఇచ్చెదని చెప్పెను. అప్పుడు యాజ్ఞవల్క్యుఁడు, ఓ జనకుఁడా! మాతండ్రి శిష్యుని కృతార్థునిచేయక శిష్యునివలన ధనమును తీసికొనఁగూడదని నాకు బోధించెను. నాకును అదే అభిప్రాయము గనుక నేను గ్రహించననిపలికెను.

ఉ॥ యదేవ తే కశ్చిదబ్రవీత్తచ్ఛృణవామేత్య బ్రవీన్మే బర్కుర్వార్ష్ణశ్చక్షుర్వై బ్రహ్మేతి యథా మాతృమాన్పితృమానాచార్యవాన్బ్రూయాత్తథా తద్వార్ష్ణోఽబ్రవీచ్చక్షుర్వై బ్రహ్మేత్యపశ్యతో హి కిగ్ స్యాదిత్యబ్రవీత్తు తే తస్యాయతనం ప్రతిష్ఠాం న మేఽబ్రవీదిత్యేకపాద్వా ఏతత్సమ్రాడితి స వై నో బ్రూహి యాజ్ఞవల్క్య చక్షురేవాయతనమాకాశః ప్రతిష్ఠా సత్యమిత్యేనదుపాసీత కా సత్యతా యాజ్ఞవల్క్య చక్షురేవ సమ్రాడితి హోవాచ చక్షుషా వై సమ్రాట్ పశ్యన్తమాహురద్రాక్షీరితి స ఆహాద్రాక్షమితి తత్సత్యం భవతి చక్షుర్వై సమ్రాట్ పరమం బ్రహ్మ నైనం చక్షుర్జహాతి సర్వాణ్యేనం భూతాన్యభిక్షరన్తి దేవో భూత్వా దేవానప్యేతి య ఏవం విద్వానేతదుపాస్తే హస్త్యృషభగ్ సహస్రం దదామీతి హోవాచ జనకో వైదేహః స హోవాచ యాజ్ఞవల్క్యః పితా మేఽమన్యత నాననుశిష్య హరేతేతి. ॥4॥

ప॥ యత్ - ఏవ - తే - కః - చిత్ - అబ్రవీత్ - తత్ - శృణవామ - ఇతి - అబ్రవీత్ - మె - బర్కుః - వార్ష్ణః - చక్షుః - వై - బ్రహ్మ - ఇతి - యథా - మాతృమాన్ - పితృమాన్ - ఆచార్యవాన్ - బ్రూయాత్ - తథా - తత్ - వార్ష్ణః - అబ్రవీత్ - చక్షుః - వై - బ్రహ్మ - ఇతి - అపశ్యతః - హి - కిం - స్యాత్ - ఇతి - అబ్రవీత్ - తు - తే - తస్య - ఆయతనం - ప్రతిష్ఠాం -

న - మె - అబ్రవీత్ - ఇతి - ఏకపాత్ - వై - ఏతత్ - సమ్రా-
ట్ - ఇతి - సః-వై - నః - బ్రూహి - యాజ్ఞవల్క్య - చక్షుః -
ఏవ - ఆయతనం - ఆకాశః - ప్రతిష్ఠా - సత్యం - ఇతి - ఏనత్ -
ఉపాసీత-కా - సత్యతా - యాజ్ఞవల్క్య -చక్షుః - ఏవ - సమ్రాట్-
ఇతి - హోవాచ - చక్షుషా - వై - సమ్రాట్ - పశ్యన్తం -
ఆహుః - అద్రాక్షీః - ఇతి - సః - ఆహ - అద్రాక్షం - ఇతి -
తత్ - సత్యం - భవతి - చక్షుః - వై - సమ్రాట్ - పరమం -
బ్రహ్మ - న - ఏనం - చక్షుః - జహాతి - సర్వాణి - ఏనం -
భూతాని - అభిక్షరన్తి - దేవః - భూత్వా - దేవాన్ - అపి - ఏతి-
యః - ఏవం - విద్వాన్ - ఏతత్ - ఉపాస్తే - హస్త్యృషభం -
సహస్రం - దదామి - ఇతి - హోవాచ - జనకః - వైదేహః -
సః - హోవాచ - యాజ్ఞవల్క్యః - పితా - మే - అమన్యత -
న - అననుశిష్య - హరేత - ఇతి.

ప్రి॥ కశ్చిత్ = ఒకానొకఁడగు ఆచార్యుఁడు, తే = నీకొ-
ఱకు, యదేవ = దేనినె, అబ్రవీత్ = చెప్పెనో, తత్ = దానిని,
(అహం = నేను), శృణవామ = వినవలయును, ఇతి = అని, (యా-
జ్ఞవల్క్యుఁడుపలికెను). వార్ష్ణః = వృష్ణునిపుత్రుఁడగు, బర్కుః =
బర్కుయనువాఁడు, చక్షుర్వై = నేత్రమే, బ్రహ్మేతి = బ్రహ్మ
మని, మే = నాకొఱకు, అబ్రవీత్ = పలికెను. ఇతి = అని, (జన
కుఁడు పలికి తిరిగి) మాతృమాన్ = తల్లిగలవాఁడును, పితృమాన్ =
తండ్రిగలవాఁడును, ఆచార్యవాన్ = ఆచార్యుడుగలవాఁడును,
యథా = ఏప్రకారము, బ్రూయాత్ = పలుకునో, తథా = ఆప్ర
కారము, వార్ష్ణః = వృష్ణపుత్రుఁడగు బర్కుఁడు, అపశ్యతోహి =
చూడనివానికై తే, కింస్యాత్ = ఏమికలుగును? (ఏమియులేదు).
ఇతి = గనుక, తత్ = ఆ, చక్షుర్వై = నేత్రమే, బ్రహ్మేతి =

బ్రహ్మమని, అబ్రవీత్ = పలికెను. (ఇట్లుజనకుఁడు చెప్పగా యాజ్ఞవల్క్యుఁడు ఓ జనకుఁడా)! తే = నీకొఱకు, తస్య = ఆనేత్రరూపమైన బ్రహ్మముయొక్క, ఆయతనం = శరీరమునున్ను, ప్రతిష్ఠాం = ఆశ్రయమునున్ను, అబ్రవీత్తు = చెప్పెనా? (అనిప్రశ్నచేసెను). మే= నాకొఱకు, నాబ్రవీదితి = చెప్పలేదని, (జనకుఁడు చెప్పెను). హేసమ్రాట్ = సార్వభౌముఁడవగు ఓజనకుఁడా, ఏతత్ = ఈనేత్రరూపమైన బ్రహ్మము, ఏకపాద్వై = పరబ్రహ్మముయొక్క ఒక పాదమైనదియె. (పరబ్రహ్మముయొక్క నాలుగవభాగము), ఇతి = అని, యాజ్ఞవల్క్యుఁడు చెప్పెను). హేయాజ్ఞవల్క్య = ఓయాజ్ఞవల్క్యుఁడా, సవై = అట్టినీవు, (దానిని తెలిసికొనినసీవు), నః = మాకొఱకు, బ్రూహి = చెప్పుమా, (అనిజనకుఁడు అడిగెను). చక్షురేవ = నేత్రమె. ఆయతనం = శరీరము. ఆకాశః = అవ్యాకృతాకాశము, ప్రతిష్ఠా = ఆశ్రియమైనది. (ఉత్పత్తిస్థితిలయకాలములయందాశ్రియమైనది). ఏనత్ = ఈనేత్రిరూపమైన బ్రిహ్మమును. సత్యమితి = సత్యస్వరూపమని, ఉపాసీత = ధ్యానించవలయును (అని యాజ్ఞవల్క్యుఁడు చెప్పెను). హేయాజ్ఞవల్క్య = ఓయాజ్ఞవల్క్యుఁడా, సత్యతా = సత్యస్వరూపత, కా = ఏది. (అని జనకుఁడు ప్రిశ్నచేసెను). హేసమ్రాిట్ = సార్వభౌముఁడవైన ఓ జనకుఁడా, చక్షురేవ = నేత్రిమె, ఇతి = అని, (యాజ్ఞవల్క్యుఁడు) హూవాచ = పలికెను. హేసమ్రాిట్ = ఓజనకమహారాజా, (జనులు), పశ్యన్తం = చూచెడివానిని, అద్రాిక్షీరితి = చూచితివాయని, ఆహుః = పలుకుదురు. సః = వాఁడు, అద్రాిక్షమితి = చూచితినని, ఆహ = చెప్పెను. తత్ = అది, సత్యం = సత్యమైనది, భవతి = అగుచున్నది (గనుక), హేసమ్రాిట్ = ఓజనకమహారాజా, చక్షుర్వై = నేత్రిమె, పరమంబ్రిహ్మ = పరబ్రిహ్మము. ఏనం = ఇట్లు తెలిసికొని ఉపాసించెడి వీనిని, చక్షుః = నేత్రిము,

నజహాతి = విడిచిపోదు. ఏనం = ఈ ఉపాసకుని, సర్వాణిభూతాని= సమస్తభూతములును, అభిక్షరన్తి = స్నేహించుచున్నవి. యః = ఎవఁడు, ఏవం = ఈప్రకారము, విద్వాన్ = తెలిసికొనినవాఁడై, ఏతత్ = ఈనేత్రరూప బ్రహ్మమును, ఉపాస్తే = ధ్యానించుచున్నాఁడో, (సః = వాఁడు, ఇహ = ఇక్కడ), దేవోభూత్వా = దేవుఁడై, (శరీరముపడిపోయిన తరువాత), దేవాన్ = దేవతలను, అప్యేతి = పొందుచున్నాఁడు (అనియాజ్ఞవల్క్యుఁడుచెప్పెను). వైదేహః = విదేహదేశప్రభువైన, జనకః = జనకమహారాజు, హస్త్యృషభం = ఏనుఁగులతో సమానములగు యెద్దులను, సహస్రం = వేయింటిని, దదామీతి = ఇచ్చెదనని హూవాచ = పలికెను. సః= ఆ, యాజ్ఞవల్క్యుఁడు, అననుశిష్య = శిష్యునిచేయక, (శిష్యుని కృతార్థునిచేయక శిష్యునివలనధనమును), నాహరేతేతి = తీసికొనఁగూడదని, మే = నాయొక్క, పితా = తండ్రి, అమన్యత = బోధించెను (అని), హూవాచ = పలికెను.

తా॥ ఓ జనకమహారాజా! ఇంకనే ఆచార్యుఁడేమిచెప్పినాఁడో దానిని వినవలయును చెప్పుమాయని యాజ్ఞవల్క్యుఁడడుగఁగా జనకుఁడు ఓ యాజ్ఞవల్క్యుఁడా! వృష్ణినిపుత్రుఁడగు బర్కుఁడనువాఁడు లోకమునందు మాతాపితాచార్యులచే క్రమముగా శిక్షితుఁడైనవాఁడెట్లు సత్యముగాఁ బలుకునో ఆ ప్రకారముగానే చూపులేనివానికేమియు సిద్ధించదుగనుక నేత్రమే బ్రహ్మమని సత్యముగా నాకుచెప్పెనని పలికెను. యాజ్ఞవల్క్యుఁడు, ఓ జనకుఁడా! బర్కుఁడనువాఁడు నేత్రబ్రహ్మమునకు శరీరమును ఆశ్రయమును చెప్పినాఁడాయని తిరిగియడుగఁగా జనకుఁడు ఆ బర్కుఁడు నాకు చెప్పలేదనెను. అప్పుడాయాజ్ఞవల్క్యుఁడు సార్వభౌముఁడవగు ఓ జనకుఁడా! ఈ నేత్రబ్రహ్మమే పరబ్రహ్మముయొక్క నాలుగవభాగ స్వరూపమైనదని చెప్పెను. తిరిగి జనకుఁడు ఓ యాజ్ఞవల్క్యుఁడా! ఆ పరబ్రహ్మ

మును తెలిసికొనిన నీవు పరబ్రహ్మముయొక్క ఒక భాగమగు ఆ నేత్రబ్రహ్మమును మాకు చెప్పుమాయని అడిగెను. ఇట్లడుగగా యాజ్ఞవల్క్యుఁడు ఓ జనకుఁడా! ఆ నేత్రరూపబ్రహ్మమునకు నేత్రమే శరీరము. ఆవ్యాకృతాకాశము ఆ నేత్రబ్రహ్మమునకుత్పత్తిస్థితిలయ కాలములయందు ఆశ్రయమైనది. పరబ్రహ్మముయొక్క ఏకభాగమగు నేత్రరూపమైన పరబ్రహ్మమును సత్యస్వరూపమని ఉపాసించవలయునని చెప్పెను. అప్పుడు జనకుఁడు ఓ యాజ్ఞవల్క్యుఁడా! సత్యమనునది ఏదియని తిరిగి ప్రశ్న చేసెను. యాజ్ఞవల్క్యుఁడు ఓ జనకుఁడా! నేత్రమే సత్యస్వరూపమైనది. ఏలననఁగా, లోకమునందు నేత్రముచేత జనుఁడు దేనిని చూచుచున్నాఁడో అది సత్యమైనది యగుచున్నది. శ్రోత్రముచేత వినఁబడినది అబద్ధమైనదియునగుచున్నది. నేత్రముచే చూడఁబడినది యెప్పటికిని అసత్యముకాదు గనుక, నేత్రమె సత్యమైనదియని చెప్పి నేత్రమె పరబ్రహ్మము. ఇట్టి నేత్రబ్రహ్మమును ధ్యానించువానిని నేత్రమువిడిచిపోదు. సమస్తభూతములును వీనిని లేఁగను గోవువలెనే స్నేహించుచున్నవి. ఈ నేత్రబ్రహ్మోపాసకుఁడు ఇక్కడనే దైవస్వరూపుఁడై దేహపాతానంతరము, దేవతలను పొందుచున్నాఁడు అనిచెప్పెను. ఇట్లు చెప్పగా విని విదేహదేశపురాజైన జనకుఁడు ఓ యాజ్ఞవల్క్యుఁడా! నీకు ఏనుఁగులతో సమానములగు వేయి యెద్దులను ఇచ్చెదనని చెప్పెను. అప్పుడు యాజ్ఞవల్క్యుఁడు ఓ జనకుఁడా! మాతండ్రి శిష్యుని కృతార్థుని చేయక శిష్యునివలన ధనమును తీసికొనఁగూడదని నాకు బోధించెను గనుక నాకును అదియె అభిప్రాయము. కాఁబట్టి నేను గోధనమును తీసికొననని పలికెను.

ఉ॥ యదేవ తే కశ్చి దబ్రవీత్తచ్ఛృణవామేత్య బ్రవీన్మే గర్దభీవిపీతో భారద్వాజః శ్రోత్రం వై బ్రహ్మేతి యథా మాతృమాన్పితృమానాచార్య వాన్బ్రూయాత్తథా తద్భారద్వాజోఽబ్రవీ

వీ చ్ఛ్రోత్రం వై బ్రహ్మేత్యశృణ్వతో హి కిగ్ స్యాదిత్య బ్రవీత్తు తే తస్యాయతనం ప్రతిష్ఠాం న మేఽబ్రవీదిత్యేక పాద్వా ఏతత్సమ్రాడితి స వై నో బ్రూహి యాజ్ఞవల్క్య శ్రోత్రమే వాయతనమాకాశః ప్రతిష్ఠానన్త ఇత్యేనదుపాసీత కానన్తతా యాజ్ఞవల్క్య దిశ ఏవ సమ్రాడితి హోవాచ తస్మాద్వై సమ్రాడపి యాం కాం చ దిశం గచ్ఛ నైవాస్యా అన్తం గచ్ఛత్యనన్తా హి దిశో దిశో వై సమ్రాట్ శ్రోత్రగ్ శ్రోత్రం వై సమ్రాట్ పరమం బ్రహ్మనైనగ్ శ్రోత్రం జహాతి సర్వాణ్యేనం భూతాన్యభిక్షరన్తి దేవో భూత్వా దేవానప్యేతి య ఏవం విద్వానే తదుపాస్తే హస్త్యృషభగ్ సహస్రం దదామీతి హోవాచ జనకో వై దేహః స హోవాచ యాజవల్క్యః పితా మేఽమన్యత నాననుశిష్య హరేతేతి. ॥5॥

ప॥ యత్ – ఏవ – కః – చిత్ – అబ్రవీత్ – తత్ – శృణవామ – ఇతి – ఆబ్రవీత్ – మే – గర్ధభీవిపీతః – భారద్వాజః – శ్రోత్రం – వై – బ్రహ్మ – ఇతి – యథా – మాతృమాగ్ – పితృమాన్ – ఆచార్యవాన్ – బ్రూయాత్–తథా – తత్ – భారద్వాజః– అబ్రవీత్ – శ్రోత్రం – వై – బ్రహ్మ – ఇతి – అశృణ్వతః – హి – కిం – స్యాత్ – ఇతి – అబ్రవీత్ – తు – తే – తస్య – ఆయతనం– ప్రతిష్ఠాం – న – మే – అబ్రవీత్ – ఇతి – ఏకపాత్ – వై – ఏతత్ – సమ్రాట్ – ఇతి – సః– వై – నః – బ్రూహి – యాజ్ఞవల్క్య – శ్రోత్రం – ఏవ – ఆయతనం – ఆకాశః – ప్రతిష్ఠా – అనన్తః– ఇతి – ఏనత్ – ఉపాసీత – కా – అనన్తతా – యాజ్ఞవల్క్య – దిశః – ఏవ – సమ్రాట్ – ఇతి – హోవాచ – తస్మాత్ – వై – సమ్రాట్ – అపి – యాం–కాం – చ–దిశం – గచ్ఛతి – న– ఏవ – అస్యాః–అన్తం – గచ్ఛతి – అనన్తా – హి – దిశః – దిశః – వై – సమ్రాట్ – శ్రోత్రం – శ్రోత్రం – వై – సమ్రాట్ –

పరమం – బ్రహ్మ – న – ఏనం – శ్రోత్రం – జహాతి – సర్వాణి – ఏనం – భూతాని – అభిక్షరన్తి – దేవః – భూత్వా – దేవాన్ – అపి – ఏతి – యః – ఏవం – విద్వాన్ – ఏతత్ – ఉపాస్తే – హస్త్యృషభం – సహస్రం – దదామి – ఇతి – హోవాచ – జనకః – వైదేహః – సః – హోవాచ – యాజ్ఞవల్క్యః-పితా – మే – అమన్యత – న – అననుశిష్య – హరేత – ఇతి.

ప్ర॥ కశ్చిత్ = ఒకానొకఁడగు ఆచార్యుఁడు, తే = నీకొఱకు. యదేవ = దేనినె, అబ్రవీత్ = పలికెనో, తత్ = దానిని, (అహం = నేను), శృణవామ = వినవలయును, ఇతి = అని, (యాజ్ఞవల్క్యుఁడు పలికెను), భారద్వాజః = భరద్వాజపుత్రుఁడగు గర్దభీవిపీతః = గర్దభీవిపీతుఁడనువాఁడు, శ్రోత్రంవై = శ్రవణమె, బ్రహ్మేతి = బ్రహ్మమని, మే = నాకొఱకు. అబ్రవీత్ = పలికెను, ఇతి = అని, (జనకుఁడు పలికి, తిరిగి), మాతృమాన్ = తల్లిగలవాఁడును, పితృమాన్ = తండ్రిగలవాఁడును, ఆచార్యవాన్ = ఆచార్యుఁడుకలవాఁడును, యథా = ఏప్రకారము, బ్రూయాత్ = పలుకునో, తథా = ఆప్రకారము, భారద్వాజః = భరద్వాజపుత్రుఁడగు గర్దభీవిపీతుఁడు, అశృణ్వతోహి = వినికిలేకపోవడము వలన, కింస్యాత్ = ఏమికలుగును. (ఏమియు లేదు). ఇతి = గనుక, తత్ = ఆ, శ్రోత్రంవై = శ్రవణమె. బ్రహ్మేతి = బ్రహ్మమని, అబ్రవీత్ = పలికెను. (ఇట్లుజనకుఁడు చెప్పగా యాజ్ఞవల్క్యుఁడు ఓ జనకుఁడా), తే = నీకొఱకు, తస్య = ఆశ్రోత్రబ్రహ్మముయొక్క, ఆయతనం = శరీరమునున్ను, ప్రతిష్ఠాం = ఆశ్రయమునున్ను, అబ్రవీత్తు = చెప్పెనా? అనిప్రశ్నచేసెను). మే = నాకొఱకు, నాబ్రవీదితి = చెప్పలేదని, (జనకుఁడుపలికెను). హేసమ్రాట్ = సార్వభౌముఁడవగు ఓజనకుఁడా, ఏతత్ = ఈశ్రోత్రరూపమైన బ్రహ్మము ఏకపాద్వై = పరబ్రహ్మముయొక్క నాలుగవభాగమైనది, ఇతి =

అని, (యాజ్ఞవల్క్యుఁడు చెప్పెను). హేయాజ్ఞవల్క్య = ఓయాజ్ఞవల్క్యుఁడా! సవై = అటువంటినీవు,(దానిని తెలిసికొనినసీవు), నః= మాకొఱకు, బ్రూహి = చెప్పుమా, (అనిజనకుఁడు అడిగెను). శ్రోత్రమేవ = శ్రవణమె, ఆయతనం = శరీరము. ఆకాశః= అవ్యాకృతాకాశము, ప్రతిష్ఠా = ఆశ్రయమైనది. (ఉత్పత్తిస్థితిలయ కాలములయందు ఆశ్రియమైనది). ఏనత్ = ఈశ్రోత్ర రూపమైన బ్రహ్మమును, అనన్త ఇతి = అనన్తస్వరూపమని, ఉపాసీత = ధ్యానించవలయును. (అనియాజ్ఞవల్క్యుఁడు చెప్పెను). హేయాజ్ఞవల్క్య = ఓ యాజ్ఞవల్క్యుఁడా, అనన్తతా = అనన్తస్వరూపత్వము, కా = ఏది (అనిజనకుఁడు ప్రశ్న చేసెను). హేసమ్రాట్ = సార్వభౌముఁడవైన ఓజనకుఁడా! దిశఏవ = దిక్కులే, ఇతి = అని, యాజ్ఞవల్క్యుఁడు), హోవాచ = పలికెను, (ఓజనకమహారాజా! ఏకారణమువలన దిక్కులేశ్రోత్రముయొక్క అనన్తత్వమో), తస్మాద్వై = ఆకారణము నుండియె, హేసమ్రాట్ = ఓజనకమహారాజా, (కశ్చిదపి = ఎవ్వఁడును) యాంకాంచదిశమపి = ఏయేదిక్కును గూర్చియును, గచ్ఛతి = పోవుచున్నాఁడో, అస్యాః = ఈదిక్కుయొక్క, అన్తం = కొనను, నైవ గచ్ఛతి = పొందనేపొందఁడు. దిశః = దిక్కులు, అనన్తాహి = అంతములేనివిగదా? హేసమ్రాట్ = ఓ జనకమహారాజా! దిశోవై = దిక్కులే, శ్రోత్రం = శ్రవణము. హేసమ్రాట్ = ఓ జనకమహారాజా! శ్రోత్రంవై = శ్రవణమే, పరమంబ్రహ్మ = పరబ్రహ్మము. ఏనం = ఈశ్రోత్రబ్రహ్మోపాసకుని, శ్రోత్రం = శ్రవణము, నజహాతి = విడువదు. సర్వాణి = సమస్తములైన, భూతాని = భూతములు, ఏనం = ఈశ్రోత్రబ్రహ్మోపాసకుని, అభిక్షరన్తి = స్నేహించుచున్నవి. యః = ఎవఁడు, ఏవం =ఈప్రకారముగాను, విద్వాన్= తెలిసికొనినవాఁడై, ఏతత్ = ఈశ్రోత్రబ్రహ్మమును, ఉపాస్తే = ధ్యానించుచున్నాఁడో, (సః=వాఁడు, ఇహ = ఇక్కడ), దేవో

భూత్వా = దేవుఁడై, దేవాన్ = దేవతలను, అప్యేతి = పొందు చున్నాఁడు అని యాజ్ఞవల్క్యుఁడు పలికెను). వైదేహః = విదేహ దేశప్రభువైన, జనకః = జనకమహారాజు, హస్త్యృషభం = ఏనుఁగులవంటి యెద్దులను, సహస్రం = వేయింటిని, దదామీతి = ఇచ్చెదనని, హోవాచ = పలికెను. సః= ఆ, యాజ్ఞవల్క్యః= యాజ్ఞవల్క్యుఁడు, అననుశిష్య = శిష్యునిచేయక, (శిష్యుని కృతార్థునిచేయక, శిష్యునివలన ధనమును) నాహరేతేతి = తీసికొనఁగూడదని, మే = నాయొక్క, పితా = తండ్రి, అమన్యత = బోధించెను (అని), హోవాచ = పలికెను.

తా॥ ఓ జనకమహారాజా! ఇంకనేయాచార్యుఁడేమిచెప్పెనో దానిని నేను వినవలయును చెప్పుమాయని యాజ్ఞవల్క్యుఁడు అడిగెను. జనకుఁడు ఓ యాజ్ఞవల్క్యుఁడా! భరద్వాజపుత్రుఁడగు గర్దభీవిపీతుఁడనువాఁడు లోకమునందు మాతాపిత్రాచార్యులచేత క్రమముగా శిక్షితుఁడైన వాఁడెట్లు సత్యముగాఁ బలుకునో ఆ ప్రకారముగానే శ్రవణము లేకపోవుటవలన ఏమియు సిద్ధించదు గనుక శ్రవణమె బ్రహ్మమని సత్యముగా నాకు చెప్పెనని పలికెను. యాజ్ఞవల్క్యుఁడు ఓ జనకుడా! గర్దభీవిపీతుఁడనువాఁడు శ్రోత్రబ్రహ్మమునకు శరీరమునున్ను ఆశ్రయమునున్ను చెప్పినాఁడాయని మరల అడుగగా జనకుఁడు ఆగర్దభీవిపీతుఁడు శ్రోత్రబ్రహ్మముయొక్క శరీరాశ్రయములను నాకు చెప్పలేదని పలికెను. అప్పుడా యాజ్ఞవల్క్యుఁడు సార్వభౌముఁడవగు ఓ జనకుఁడా! ఈశ్రోత్రబ్రహ్మమే పరబ్రహ్మములో నాలుగవభాగమని చెప్పెను. మరల జనకుఁడు యాజ్ఞవల్క్యుఁడా! ఆ పరబ్రహ్మమును తెలిసికొనిన నీవు పరబ్రహ్మములో నాలుగవ భాగమగు శ్రోత్రబ్రహ్మమును మాకు చెప్పుమాయని అడిగెను. ఇట్లడుగగా యాజ్ఞవల్క్యుఁడు ఓ జనకుఁడా! ఆశ్రోత్రబ్రహ్మమునకు శ్రోత్రమే శరీరము. అవ్యాకృతాకాశము ఆశ్రోత్రబ్రహ్మమునకుత్స

త్పిస్థితిలయకాలముల యందాశ్రయమైనది. పరబ్రహ్మముయొక్క నాలుగవభాగమగు శ్రోత్రబ్రహ్మమును అనన్తమునుగా ఉపాసించవలయునని చెప్పెను. అప్పుడు జనకుఁడు ఓ యాజ్ఞవల్క్యుఁడా! అనన్తమనగా ఏది? అని మరల ప్రశ్నచేసెను. యాజ్ఞవల్క్యుఁడు ఓ జనకుఁడా! దిక్కులే అనన్తమైనవి. ఏలననఁగా లోకమునందు ఎవఁడైనను తూర్పు మొదలైన దిక్కులలో యేదిక్కునుగూర్చిగాని పోయి ఆ దిక్కుయొక్క అంతమును పొందనేలేఁడు. గనుక దిక్కులు అనన్తములైనవి. ఓ జనకుఁడా! ఆ దిక్కులే శ్రోత్రస్వరూపము. ఆశ్రోత్రమె పరబ్రహ్మస్వరూపము. ఇటువంటి శ్రోత్రబ్రహ్మమును పాసించువానిని శ్రోత్రము ఎడిచిపోదు. వానిని సమస్తభూతములును గోవు లేఁగనువలెనే స్నేహించుచున్నవి. ఈశ్రోత్రబ్రహ్మోపాసకుఁడు ఇక్కడనె దైవస్వరూపుఁడై దేహపాతానంతరము దేవతలను పొందుచున్నాఁడు అని చెప్పెను. ఇట్లు చెప్పఁగా విని విదేహదేశపు రాజైన జనకమహారాజు ఓ యాజ్ఞవల్క్యుఁడా! నీకు ఏనుఁగులతో సమానములైన వేయి యెద్దులను ఇచ్చెదనని చెప్పెను. అప్పుడు యాజ్ఞవల్క్యుఁడు ఓ జనకుఁడా! మాతండ్రి, శిష్యుని కృతార్థుని చేయక శిష్యునివలన ధనమును తీసికొనఁగూడదని నాకు బోధించెను. నాకును అదియె యభిప్రాయము. కాఁబట్టి నేను గోధనమును తీసికొననని పలికెను.

ఉ॥ యదేవ తే కశ్చిదబ్రవీత్తచ్ఛృణవామేత్యబ్రవీన్మే సత్యకామో జాబాలో మనో వై బ్రహ్మేతి యథా మాతృమాన్పితృమానాచార్యవాన్బ్రూయా త్తథా తజ్జాబాలోఽబ్రవీన్మనో వై బ్రహ్మేత్యమనసో హి కిగ్ స్యాదిత్యబ్రవీత్తు తే తస్యాయతనం ప్రతిష్ఠాం నమేఽబ్రవీదిత్యేక పాద్వా ఏతత్సమ్రాడితి స వై నో బ్రూహి యాజ్ఞవల్క్య మన ఏవాయతనమాకాశః ప్రతిష్ఠా నన్ద ఇత్యే నదుపాసీత కాఆనన్దతా యాజ్ఞవల్క్య మన

ఏవ సమ్రాడితి హోవాచ మనసా వై సమ్రాట్ స్త్రియమభిహా ర్యతే తస్యాం ప్రతిరూపః పుత్రో జాయతే స ఆనన్దో మనో వై సమ్రాట్ పరమం బ్రహ్మ నైనం మనో జహాతి సర్వాణ్యేనం భూతాన్యభిక్షరన్తి దేవో భూత్వా దేవానప్యేతి య ఏవం విద్వానేతదుపాస్తే హస్త్యృషభగ్ సహస్రం దదామీతి హోవాచ జనకో వైదేహః స హోవాచ యాజ్ఞవల్క్యః పితా మేఽమన్యత నాననుశిష్య హరేతేతి. ||6||

ప॥ యత్ – ఏవ – తే – కః – చిత్ – అబ్రవీత్ – తత్ – శృణవామ – ఇతి – అబ్రవీత్ – మే – సత్యకామః – జాబాలః – మనః – వై – బ్రహ్మ – ఇతి – యథా – మాతృమాన్ – పితృమాన్ –అచార్యవాన్ – బ్రూయాత్ – తథా – తత్ – జాబాలః – అబ్రవీత్ – మనః – వై – బ్రహ్మ – ఇతి – అమనసః – హి – కిం – స్యాత్ – ఇతి – అబ్రవీత్ – తు – తే – తస్య – ఆయతనం – ప్రతిష్ఠాం – న – మే – అబ్రవీత్ – ఇతి – ఏకపాత్ – వై – ఏతత్ – సమ్రాట్ – ఇతి – సః – వై – నః – బ్రూహి – యాజ్ఞవల్క్య – మనః – ఏవ – ఆయతనం – ఆకాశః – ప్రతిష్ఠా – ఆనన్దః – ఇతి – ఏనత్ – ఉపాసీత – కా – ఆనన్దతా – యాజ్ఞవల్క్య – మనః – ఏవ – సమ్రాట్ – ఇతి – హోవాచ – మనసా – వై – సమ్రాట్ – స్త్రియం – అభిహార్యతే– తస్యాం – ప్రతిరూపః – పుత్రః – జాయతే – సః – ఆనన్దః – మనః– వై – సమ్రాట్ – పరమం – బ్రహ్మ – న – ఏనం – మనః – జహాతి – సర్వాణి – ఏనం – భూతాని – అభిక్షరన్తి – దేవః – భూత్వా – దేవాన్ – అపి – ఏతి – యః – ఏవం – విద్వాన్ – ఏతత్ – ఉపాస్తే – హస్త్యృషభం – సహస్రం – దదామి – ఇతి – హోవాచ – జనకః – వైదేహః – సః – హ – ఉవాచ – యాజ్ఞవల్క్యః – పితా – మే – అమన్యత –న – అననుశిష్య–హరేత–ఇతి.

ప్ర॥ కశ్చిత్ = ఒకానొక ఆచార్యుఁడు, తే = నీకొఱకు, యదేవ = దేనినే, అబ్రవీత్ = పలికెనో,తత్ = దానిని,(అహం= నేను), శ్రుణవామ = వినవలయును. ఇతి = అని (యాజ్ఞవల్క్యుఁడు పలికెను). జాబాలః = జాబాలయనుదాని పుత్రుఁడగు, సత్యకామః= సత్యకాముఁడనువాఁడు, మనోవై =మనస్సే, బ్రహ్మేతి =బ్రహ్మమని, మే = నాకొఱకు, అబ్రవీత్ = పలికెను, ఇతి = అని, (జనకుఁడు పలికి మరల), మాతృమాన్ = తల్లిగలవాఁడును, పితృమాన్ = తండ్రిగలవాఁడును, ఆచార్యవాన్ = ఆచార్యుఁడు గలవాఁడును, యథా = ఏప్రకారము, బ్రూయాత్ = పలుకునో, తథా = ఆప్రకారము, జాబాలః = జాబాలపుత్రుఁడగు సత్యకాముఁడు, అమనసోహి = మనస్సులేనివానికైతే, కింస్యాత్ = ఏమికలుగును ? (ఏమియుకలుగదు), ఇతి = గనుక, తత్ = ఆ, మనోవై=మనస్సే, బ్రహ్మేతి = బ్రహ్మమని, అబ్రవీత్ = పలికెను. (ఇట్లు జనకుఁడు చెప్పఁగా యాజ్ఞవల్క్యుఁడు ఓ జనకుఁడా), తే = నీకొఱకు, తస్య= ఆ మనోబ్రహ్మముయొక్క, ఆయతనం= శరీరమునున్ను, ప్రతిష్ఠాం= ఆశ్రయమునున్ను, అబ్రవీత్తు = చెప్పెనా (అని యాజ్ఞవల్క్యుఁడు ప్రశ్న చేసెను). మే = నాకొఱకు, నాబ్రవీదితి = చెప్పలేదని, (జనకుఁడు పలికెను). హేసమ్రాట్ = సార్వభౌముఁడవగు ఓ జనకుఁడా! ఏతత్ = ఈ మనోబ్రహ్మము, ఏకపాద్వై = పరబ్రహ్మముయొక్క నాలుగవభాగమైనది, ఇతి = అని, (యాజ్ఞవల్క్యుఁడు చెప్పెను). హేయాజ్ఞవల్క్య = ఓ యాజ్ఞవల్క్యుఁడా, సవై = అటువంటినీవె, (దానిని తెలిసిననీవె), నః = మాకొఱకు, బ్రూహి = చెప్పుమా. (అని జనకుఁడు అడిగెను). మనఏవ = మనస్సే, ఆయతనం=శరీరము, ఆకాశః = అవ్యాకృతాకాశము, ప్రతిష్ఠా = ఆశ్రయమైనది. (ఉత్పత్తిస్థితిలయకాలములయందు ఆశ్రయమైనది). ఏనత్ = ఈ మనోబ్రహ్మమును, ఆనన్దఇతి = ఆనందస్వరూపమని, ఉపాసీత = ధ్యానించు

వ్యలయును (అని యాజ్ఞవల్క్యుఁడు చెప్పెను). హేయాజ్ఞవల్క్య = ఓ యాజ్ఞవల్క్యుఁడా, ఆనన్దతా = ఆనన్దస్వరూపత, కా = ఏది ? (అని జనకుఁడు ప్రశ్నచేసెను). హేసమ్రాట్ = సార్వభౌముఁడవగు ఓ జనకుఁడా ! మనఏవ = మనస్సే, ఇతి = అని, యాజ్ఞవల్క్యుఁడు హోవాచ = పలికెను. (ఏకారణమువలన మనస్సే ఆనన్దమో ఆకారణమువలన). హేసమ్రాట్ = ఓ జనకమహారాజా, మనసావై = మనస్సుచేతనే, (జనుఁడు) స్త్రియం = స్త్రీనిగూర్చి, అభిహార్యతే = కోరినవాఁడై విహరించుచున్నాఁడు. తస్యా = ఆ స్త్రీయందు ప్రతిరూపః = అనురూపుఁడగు, (సమానరూపముగల) పుత్రః = పుత్రుఁడు, జాయతే = పుట్టుచున్నాఁడు. సః = వాఁడు, ఆనన్దః = ఆనన్దము. (ఆనన్ద హేతువైనవాఁడు పుత్రుఁడు). హేసమ్రాట్ = ఓ జనకమహారాజా, మనోవై = మనస్సే, పరమంబ్రహ్మ = పరబ్రహ్మము: ఏనం = ఈ మనోబ్రహ్మోపాసకుని, మనః = మనస్సు, నజహాతి = విడిచిపోదు. ఏనం = వీనిని, సర్వాణిభూతాని = సమస్తభూతములును, అభిక్షరన్తి = స్నేహించుచున్నవి. యః = ఎవఁడు, ఏవం = ఈ ప్రకారము, విద్వాన్ = తెలిసికొనినవాఁడై, ఏతత్ = మనోబ్రహ్మమును, ఉపాస్తే = ఉపాసనచేయుచున్నాఁడో, (సః = వాఁడు, ఇహ = ఇక్కడ), దేవోభూత్వా = దేవుఁడై, దేవాన్ = దేవతలను, అప్యేతి = పొందుచున్నాఁడు (అని యాజ్ఞవల్క్యుఁడు చెప్పెను). వైదేహః = విదేహదేశప్రభువైన, జనకః = జనకమహారాజు, హస్త్యృషభం = ఏనుఁగులవంటి వృషభములను, సహస్రం = వేయింటిని, దదామీతి = ఇచ్చెదనని, హోవాచ = పలికెను. సః = ఆ, యాజ్ఞవల్క్యః = యాజ్ఞవల్క్యుఁడు, అననుశిష్య = శిష్యుని చేయక, (శిష్యుని కృతార్థునిచేయక శిష్యునివలన ధనమును), నాహరేతేతి = తీసికొనఁగూడదని, మే = నాయొక్క, పితా = తండ్రి, అమన్యత = బోధించెను. (అని), హోవాచ = పలికెను.

తా॥ ఓ జనకమహారాజా! ఇంకనేయాచార్యుఁడేమిచెప్పినాఁడో దానిని నేను వినవలయును చెప్పుమాయని యాజ్ఞవల్క్యుఁడడిగెను. జనకుఁడు ఓ యాజ్ఞవల్క్యుఁడా జాబాలపుత్రుఁడగు సత్యకాముఁడను వాఁడులోకమునందు మాతాపిత్రాచార్యులచే క్రమముగా శిక్షితుఁడైనవాఁడెట్లు సత్యముగాఁబలుకునో అప్రకారముగానె మనస్సు లేకపోవుటచే నేమియు కలుగదుగనుక మనస్సే బ్రహ్మమని సత్యముగా నాకుచెప్పెనని పలికెను. యాజ్ఞవల్క్యుఁడు ఓజనకుఁడా ఆసత్యకాముఁడనువాఁడు మనోబ్రహ్మమునకు శరీరమునున్ను ఆశ్రయమునున్ను నీకుచెప్పినాఁడాయని మరల అడుగఁగా జనకుఁడు ఓ యాజ్ఞవల్క్యుఁడా! మనోబ్రహ్మముయొక్క శరీరాశ్రియములను నాకు చెప్పలేదని పలికెను. అప్పుడు ఆ యాజ్ఞవల్క్యుఁడు సార్వభౌముఁడవగు ఓ జనకుఁడా! ఈమనోబ్రహ్మము ఆపరబ్రహ్మములో నాలుగవ భాగమైనదనిచెప్పెను. మరల జనకుఁడు ఓ యాజ్ఞవల్క్యుఁడా! ఆపరబ్రహ్మమును తెలిసిన నీవు ఆపరబ్రహ్మములో నాలుగవభాగమగు మనోబ్రిహ్మమును మాకుచెప్పుమాయని అడిగెను. ఇట్లడుగఁగా యాజ్ఞవల్క్యుఁడు ఓ జనకుఁడా! ఆమనోబ్రహ్మమునకు మనస్సే శరీరము. అవ్యాకృతాకాశమె ఉత్పత్తిస్థితిలయకాలములందు ఆశ్రయమైనది పరబ్రహ్మముయొక్క నాలుగవ భాగమగు ఈమనోబ్రహ్మమును ఆనందస్వరూపమని ధ్యానించవలయునని చెప్పెను. అప్పుడు జనకుఁడు ఓయాజ్ఞవల్క్యుఁడా! ఆనందస్వరూపత ఏది యని తిరిగి ప్రశ్న చేసెను. యాజ్ఞవల్క్యుఁడు ఓజనకుఁడా మనస్సే ఆనందస్వరూపమైనది. ఏలననఁగా లోకమునందు జనుఁడు మనస్సుచేతనే స్త్రీనికోరినవాఁడై విహరించుచున్నాఁడు. ఆ స్త్రీయందు తనకు సమానుఁడగు పుత్రుఁడు పుట్టుచున్నాఁడు. ఇట్లు ఆనంద హేతువైనవాఁడు పుత్రుఁడు గనుక ఓజనకుఁడా మనస్సే పరబ్రహ్మము. ఈ మనోబ్రహ్మమును ఉపాసించెడివానిని మనస్సు విడిచిపోదు. వీనిని సమస్త భూతములు

స్నేహించుచున్నవి. ఈప్రకారము మనోబ్రహ్మోపాసన చేయువాడు ఇక్కడనే దైవస్వరూపుఁడై దేహపాతానంతరము దేవతలను పొందుచున్నాఁడు అనిచెప్పెను. ఇట్లుచెప్పగా విని విదేహదేశపురాజైన జనకమహారాజు ఓ యాజ్ఞవల్క్యుఁడా నీకు ఏనుఁగులతో సమానములైన వేయియెద్దులను ఇచ్చెదనని చెప్పెను. అప్పుడు యాజ్ఞవల్క్యుఁడు ఓజనకుఁడా మాతండ్రి, శిష్యుని కృతార్థుని చేయక శిష్యునివలన ధనమును తీసికొనఁగూడదని నాకు బోధించెను. నాకునుఅదియే అభిప్రాయము. కాఁబట్టి నేను గోధనమును తీసికొనవని పలికెను.

ఉ॥ యదేవ తే కశ్చిద బ్రవీత్తచ్ఛృణవామేత్యబ్రవీన్మే విదగ్ధః శాకల్యో హృదయం వై బ్రహ్మేతి యథా మాతృమాన్పితృమానాచార్యవాన్బ్రూయాత్తథా తచ్ఛాకల్యోఽబ్రవీద్ధృదయం వై బ్రహ్మేత్యహృదయస్య హి కిగ్ స్యాదిత్యబ్రవీత్తు తే తస్యాయతనం ప్రతిష్ఠాంన మేఽబ్రవీదిత్యేకపాద్వా ఏతత్సమ్రాడితి స వై నో బ్రూహి యాజ్ఞవల్క్య హృదయమేవాయతనమాకాశః ప్రతిష్ఠా స్థితిరిత్యేనదుపాసీత కా స్థితతా యాజ్ఞవల్క్య హృదయమేవ సమ్రాడితి హోవాచ హృదయం వై సమ్రాట్ సర్వేషాం భూతానామాయతనగ్ హృదయం వైసమ్రాట్ సర్వేషాం భూతానాం ప్రతిష్ఠా హృదయే హ్యేవ సమ్రాట్ సర్వాణి భూతాని ప్రతిష్ఠితాని భవన్తి హృదయం వై సమ్రాట్ పరమం బ్రహ్మ నైనగ్ హృదయం జహాతి సర్వాణ్యేనం భూతాన్యభిక్షరన్తి దేవో భూత్వా దేవాన ప్యేతి య ఏవం విద్వానేతదుపాస్తే హస్త్యృషభగ్ సహస్రం దదామీతి హోవాచ జనకో వైదేహః స హోవాచ యాజ్ఞవల్క్యః పితా మేఽమన్యతనాననుశిష్య హరేతేతి. ॥7॥

ఇతి షష్ఠాధ్యాయే – ప్రథమం బ్రాహ్మణమ్.

ప॥ యత్ – ఏవ – తే – కః – చిత్ – అబ్రవీత్ – తత్ –

శృణవామ - ఇతి - అబ్రవీత్ - మే - విదగ్ధః - శాకల్యః - హృద
యం - వై - బ్రహ్మ - ఇతి - యథా - మాతృమాన్ - పితృ
మాన్ - ఆచార్యవాన్ - బ్రూయాత్ - తథా - తత్ - శాక
ల్యః - అబ్రవీత్ - హృదయం - వై - బ్రహ్మ - ఇతి - అహృద
యస్య - హి - కిం - స్యాత్ - ఇతి - అబ్రవీత్ - తు - తే -
తస్య - ఆయతనం - ప్రతిష్ఠాం - న - మే - అబ్రవీత్ - ఇతి -
ఏకపాత్ - వై - ఏతత్ - సమ్రాట్ - ఇతి - సః - వై - నః -
బ్రూహి - యాజ్ఞవల్క్య - హృదయం - ఏవ - ఆయతనం - ఆ
కాశః - ప్రతిష్ఠా - స్థితిః - ఇతి-ఏనత్ - ఉపాసీత - కా - స్థితతా-
యాజ్ఞవల్క్య - హృదయం - ఏవ - సమ్రాట్ - ఇతి - హోవాచ-
హృదయం - వై - సమ్రాట్ - సర్వేషాం - భూతానాం - ఆయ
తనం - హృదయం - వై - సమ్రాట్ - సర్వేషాం - భూతానాం-
ప్రతిష్ఠా - హృదయే - హి - ఏవ - సమ్రాట్ - సర్వాణి -
భూతాని - ప్రతిష్ఠితాని - భవన్తి - హృదయం - వై - సమ్రాట్-
పరమం - బ్రహ్మ - న - ఏనం - హృదయం - జహాతి - సర్వాణి-
ఏనం - భూతాని - అభిక్షరన్తి - దేవః - భూత్వా - దేవాన్ -
అపి - ఏతి - యః- ఏవం - విద్వాన్ - ఏతత్ - ఉపాస్తే -
హస్త్యృషభం - సహస్రం - దదామి - ఇతి - హోవాచ - జన
కః - వైదేహః - సః - హోవాచ - యాజ్ఞవల్క్యః - పితా -
మే - అమన్యత - న -అననుశిష్య - హరేత - ఇతి.

ప్ర॥ కశ్చిత్ = ఒకానొకఁడగు ఆచార్యుఁడు, తే = నీకొ
అకు, యదేవ = దేనినే, అబ్రవీత్ = పలికెనో, తత్ = దానిని,
(అహం = నేను), శృణవామ = వినవలయును, ఇతి = అని, (యా
జ్ఞవల్క్యుఁడుపలికెను). శాకల్యః = శకలపుత్రుఁడగు, విదగ్ధః =
విదగ్ధుఁడనువాడు, హృదయం వై = హృదయమే, (బుద్ధియె), బ్ర
హ్మేతి = బ్రహ్మమని, మే = నాకొఱకు, అబ్రవీత్ = పలికెను.

ఇతి = అని, (జనకుఁడు పలికి తిరిగి), మాతృమాన్ = తల్లిగలవాఁడును, పితృమాన్ = తండ్రిగలవాఁడును, ఆచార్యవాన్ = ఆచార్యుఁడుకలవాఁడును, యథా = ఏప్రకారము, బ్రూయాత్ = పలుకునో, తథా = ఆప్రకారము, శాకల్యః = శాకల్యుఁడు, అహృదయస్య = హృదయము లేనివానికి, కింస్యాత్ = ఏమికలుగును? (ఏమియుకలుగదు). ఇతి = గనుక, తత్ = ఆ, హృదయంవై = హృదయమే, బ్రహ్మేతి = బ్రహ్మమని, అబ్రవీత్ = పలికెను. (ఇట్లు జనకుఁడు చెప్పగా, యాజ్ఞవల్క్యుఁడు ఓజనకుడా), తే = నీకొఱకు, తస్య = ఆహృదయ పరబ్రహ్మముయొక్క, ఆయతనం = శరీరమునున్ను, ప్రతిష్ఠాం = ఆశ్రయమునున్ను, అబ్రవీత్ = చెప్పినాఁడా? (అని యాజ్ఞవల్క్యుఁడు ప్రశ్న చేసెను). మే = నాకొఱకు, నాబ్రవీదితి = చెప్పలేదని, (జనకుఁడు పలికెను). హే సమ్రాట్ = సార్వభౌముఁడవగు ఓజనకుఁడా! ఏతత్ = ఈహృదయబ్రహ్మము, ఏకపాద్వై = పరబ్రహ్మముయొక్క నాలుగవభాగమైనది. ఇతి = అని, (యాజ్ఞవల్క్యుఁడు చెప్పెను). హేయాజ్ఞవల్క్య = ఓ యాజ్ఞవల్క్యుఁడా! సవై = అటువంటినీవు, (దానిని తెలిసిననీవు), నః = మాకొఱకు, బ్రూహి = చెప్పుమా, (అని జనకుఁడు అడిగెను). హృదయమేవ = హృదయమె, ఆయతనం = శరీరము. ఆకాశః = అవ్యాకృతాకాశము, ప్రతిష్ఠా = ఆశ్రయము. (ఉత్పత్తిస్థితిలయకాలములయందాశ్రయమైనది). ఏనత్ = ఈ హృదయబ్రహ్మమును, స్థితిరితి = స్థితియని, ఉనికియని) ఉపాసీత = ధ్యానించవలయును. (అని యాజ్ఞవల్క్యుఁడు చెప్పెను). హే యాజ్ఞవల్క్య = ఓ యాజ్ఞవల్క్యుఁడా, స్థితతా = ఉనికి కలుగుట, కా = ఏది, (అని జనకుఁడుప్రశ్న చేసెను) హేసమ్రాట్ = సార్వభౌముఁడవగు ఓ జనకుఁడా! హృదయమేవేతి = హృదయమేయని, (యాజ్ఞవల్క్యుఁడు), హోవాచ = పలికెను. హేసమ్రాట్ = ఓజనకమహారాజా, హృదయంవై = హృదయమే;

సర్వేషాం = సమస్తములైన, భూతానాం = భూతములకు, ఆయతనం = శరీరము. హేసమ్రాట్ = ఓజనకమహారాజా, హృదయం వై = హృదయమే, సర్వేషాంభూతానాం = సమస్తభూతములకు, ప్రతిష్ఠా = ఆశ్రయము. హేసమ్రాట్ = ఓజనకమహారాజా, సర్వాణిభూతాని = సమస్తభూతములున్ను, హృదయేహ్యేవ = హృదయమునందే, ప్రతిష్ఠితాని = ఉంచఁబడినవి, భవన్తి = అగుచున్నవి. (గనుక), హేసమ్రాట్ = ఓజనకుఁడా, హృదయంవై = హృదయమె, పరమంబ్రహ్మ = పరబ్రహ్మము. ఏనం = ఈహృదయ బ్రహ్మోపాసకుని, హృదయం = హృదయము, నజహాతి = విడిచిపోదు. ఏనం=ఈహృదయబ్రహ్మోపాసకుని, సర్వాణిభూతాని= సమస్త భూతములు, అభిక్షరన్తి = స్నేహించుచున్నవి. యః=ఎవఁడు, ఏవం = ఈప్రకారము, విద్వాన్ = తెలిసికొనినవాఁడై, ఏతత్ = ఈహృదయబ్రహ్మమును, ఉపాస్తే = ధ్యానించుచున్నాఁడో, (సః = వాఁడు, ఇహ = ఇక్కడ), దేవోభూత్వా = దేవుఁడై, దేవాన్ = దేవతలను, అప్యేతి = పొందుచున్నాఁడు (అని యాజ్ఞవల్క్యుఁడు చెప్పెను). వైదేహః = విదేహ దేశప్రభువైన, జనకః = జనకమహారాజు, హస్త్యృషభం = ఏనుఁగులతో సమానములైన యెద్దులను, సహస్రం = వేయింటిని, దదామీతి = ఇచ్చుచున్నానని, హోవాచ = పలికెను. సః = ఆ, యాజ్ఞవల్క్యః = యాజ్ఞవల్క్యుఁడు, అననుశిష్య = శిష్యునిచేయక, (శిష్యునికృతార్థునిచేయక శిష్యునివలన ధనమును), నాహరేతేతి = తీసికొనఁగూడదని, మే = నాయొక్క, పితా = తండ్రి, అమన్యత = బోధించెను (అని), హోవాచ = పలికెను.

తా॥ ఓ జనకమహారాజా ! ఇంకనేయాచార్యుఁడు ఏమిచెప్పినాఁడో దానిని నేను వినవలయును చెప్పుమా యని యాజ్ఞవల్క్యుఁడు అడిగెను. జనకుఁడు ఓయాజ్ఞవల్క్యుఁడా! శకలపుత్రుఁడగు విదగ్ధుఁ

డనువాఁడు లోకమునందు మాతాపితాచార్యులచేత క్రమముగా శిక్షితుఁడైన వాఁడెట్లుసత్యముగాఁబలుకునో ఆప్రకారముగానే బుద్ధి లేకపోవుటచే నేమియుకలుగదుగనుక బుద్ధియె బ్రహ్మమని సత్యముగా నాకుచెప్పెనని పలికెను. యాజ్ఞవల్క్యుఁడు ఓజనకుఁడా! ఆశాకల్యుఁడు ఆబుద్ధిబ్రహ్మమునకు శరీరమునున్ను ఆశ్రయమునున్ను నీకు చెప్పినాఁడా యని తిరిగి ప్రశ్న చేయఁగా, జనకుఁడు ఓ యాజ్ఞవల్క్యుఁడా! బుద్ధి బ్రహ్మముయొక్క శరీరాశ్రయములను ఆశాకల్యుఁడు నాకు చెప్పలేదని పలికెను. అప్పుడు యాజ్ఞవల్క్యుఁడు సార్వభౌముఁడవగు ఓజనకుఁడా! ఈబుద్ధి బ్రహ్మము అపరబ్రహ్మములో నాలుగవభాగమైనది యనిచెప్పెను. తిరిగి జనకుఁడు ఓయాజ్ఞవల్క్యుఁడా! అపరబ్రహ్మమును తెలిసికొనిన నీవు అపరబ్రహ్మములో నాలుగవభాగమైన బుద్ధి బ్రహ్మమును మాకు చెప్పుమాయని అడిగెను. ఇట్లడుగఁగా యాజ్ఞవల్క్యుఁడు ఓజనకుఁడా! ఆబుద్ధిబ్రహ్మమునకు బుద్ధియె శరీరము. అవ్యాకృతాకాశము సర్వకాలములయందు ఆశ్రయమైనది. పరబ్రహ్మముయొక్క నాలుగవ భాగమైన ఈబుద్ధిబ్రహ్మమును స్థితిస్వరూపమని ధ్యానించవలయుననిచెప్పెను. అప్పుడు జనకుఁడు ఓయాజ్ఞవల్క్యుఁడా స్థితియనునది ఏదియని తిరిగి ప్రశ్న చేసెను. యాజ్ఞవల్క్యుఁడు ఓజనకుఁడా! బుద్ధియె స్థితియైనది. ఏలననఁగా సమస్తభూతములకు బుద్ధియె శరీరము, స్థానము, అయిన్నది గనుకనె, బుద్ధియందే సమస్తభూతములుఉంచఁబడియున్నవి. ఓ జనకుఁడా! ఇట్లు సమస్త భూతములకు ఉనికియగుటవలన బుద్ధియె పరబ్రహ్మము. ఈబుద్ధి బ్రహ్మోపాసకునిబుద్ధిని విడిచిపోదు. వీనిని సమస్త భూతములు స్నేహించుచున్నవి. ఈప్రకారము బుద్ధి బ్రహ్మోపాసనచేయువాఁడు ఇక్కడనే దైవస్వరూపుఁడై దేహము పడిపోయిన తరువాత దేవతలనుపొందుచున్నాఁడు అని చెప్పెను. ఇట్లు చెప్పగా విని విదేహదేశపురాజైన జనకమహారాజు ఓయాజ్ఞవల్క్యుఁడా

నీకుపనుఁగులతో సమానములైన వేయియెద్దులను ఇచ్చెదనని చెప్పెను. అప్పుడా యాజ్ఞవల్క్యుఁడు ఓజనకుఁడా! మాతండ్రి శిష్యుని కృతార్థుని చేయక శిష్యునివలన ధనమును తీసికొనఁగూడదని నాకుబోధించెను. నాకును అదియె అభిప్రాయము. కాఁబట్టి నేను గోధనమును తీసికొననని పలికెను.

ఇట్లు షష్ఠాధ్యాయమునందు ప్రథమబ్రాహ్మణము సమాప్తము.

---

షష్ఠాధ్యాయము – ద్వితీయబ్రాహ్మణము

ఉ॥ జనకో హ వైదేహః కూర్చాదుపావసర్పన్నువాచ నమస్తేఽస్తు యాజ్ఞవల్క్యాను మా శాధీతి స హోవాచ యథా వై సమ్రాణ్మహాన్తమధ్వానమేష్యన్ రథం వా నావం సమాదదీతైవ మేవైతాభిరుపనిషద్భిః సమాహితాత్మాఽస్యేవం బృన్దారక ఆఢ్య స్సన్నధీతవేద ఉక్తోపనిషత్కః ఇతో విముచ్యమానః క్వ గమిష్యసీతి నాహం తద్భగవన్వేద యత్ర గమిష్యామీత్యథ వై తేఽహంతద్వక్ష్యామి యత్ర గమిష్యసీతి బ్రవీతు భగవానితి.1

ప॥ జనకః – హ – వైదేహః – కూర్చాత్ – ఉప – అవసర్పన్ – ఉవాచ – నమః – తే – అస్తు – యాజ్ఞవల్క్య – అను – మా – శాధి – ఇతి – సః – హ – ఉవాచ – యథా – వై – సమ్రాట్ – మహాన్తం – అధ్వానం – ఏష్యన్ – రథం – వా – నావం – వా – సమాదదీత – ఏవం – ఏవ – ఏతాభిః – ఉపనిషద్భిః – సమాహితాత్మా – అసి – ఏవం – బృన్దారకః – ఆఢ్యః – సన్ – అధీతవేదః – ఉక్తోపనిషత్కః – ఇతః – విముచ్యమానః – క్వ – గమిష్యసి – ఇతి – న – అహం – తత్ – భగవన్ – వేద – యత్ర – గమిష్యామి – ఇతి – అథ – వై – తే – అహం – తత్ – వక్ష్యామి – యత్ర – గమిష్యసి – ఇతి – బ్రవీతు – భగవాన్ – ఇతి.

ప్ర॥ వైదేహః = విదేహదేశప్రభువైన, జనకోహ = జనక

మహారాజే, కూర్చాత్ = ఆసనమునుండి, ఉపావసర్పన్ = సమీపించినవాఁడై, హేయాజ్ఞవల్క్య = ఓయాజ్ఞవల్క్యుఁడా, తే = నీకొఱకు, నమః = నమస్కారము, అస్తు = అగునుగాక, మా = నన్ను, అనుశాధీతి = శిక్షింపుమాయని, (ఉపదేశింపుమాయని), ఉవాచ = పలికెను. సః = ఆ యాజ్ఞవల్క్యుఁడు, హేసమ్రాట్ = ఓ జనకమహారాజా, (త్వం = నీవు, లోకే = లోకమునందు, జనః= జనుఁడు), మహాన్తం = విస్తారమైన, అధ్వానం = మార్గమును, ఏష్యన్ = వెళ్లనిచ్ఛగలవాఁడై, రథంవా = రథమునైనను, నావం వా = ఓడనైనను, యథావై = ఏప్రకారముగా, సమాదదీత = గ్రహించునో, ఏవమేవ = ఈప్రకారముగానే, ఏతాభిః =ఈపూర్వోక్తములైన, ఉపనిషద్భిః = ఉపనిషత్తులతో, సమాహితాత్మా = సమాహిత = కూర్చబడిన, ఆత్మా = స్వరూపముగలవాఁడవు, అసి = అగుచున్నావు, బృన్దారకః = పూజ్యుఁడవును, ఆఢ్యః=ఈశ్వరుఁడవును, అధీతవేదః = అధ్యయనముచేయఁబడిన వేదములుగలవాఁడవును, ఉక్తోపనిషత్కః = ఉక్త = చెప్పఁబడిన, ఉపనిషత్కః= ఉపనిషత్తులుగలవాఁడవును, (ఆచార్యులచేత సర్వోపనిషత్తులుపదేశింపఁబడినవాఁడవును), ఏవంసన్ = ఈ ప్రకారమైనవాఁడవునై (భయమునుపొందినవాఁడవె అయితివి). ఇతః = ఈ దేహామువలన, విముచ్యమానః = విడువఁబడినవాఁడవై, క్వగమిష్యసీతి = ఎక్కడికిపోగలవని, (ఏవస్తువును పొందగలవని), హోవాచ= పలికెను. భగవన్= పూజ్యుఁడవగు ఓ యాజ్ఞవల్క్యుఁడా, అహం = నేను, యత్ర = ఎక్కడికి, గమిష్యామి = పోగలనో, (ఏవస్తువునుపొందగలనో), తత్ = ఆవస్తువును, నవేద = గుర్తెఱుఁగను, ఇతి = అని, (జనకుఁడుపలికెను). అథ = అట్లయితే, (నీకు తెలియకపోయినయెడల), అహంవై = నేనె, (త్వం = నీవు), యత్ర=ఎక్కడికి, గమిష్యసి = పోగలవో, తత్ = ఆవస్తువును, తే = నీకొఱకు, వక్ష్యామీతి =

చెప్పెదనని (యాజ్ఞవల్క్యుఁడుపలికెను), భగవాన్ = పూజ్యుఁడవగుసీవు, బ్రవీతు = చెప్పుదువుగాక, ఇతి = అని, (జనకుఁడుపలికెను).

తా॥ ఇట్లు యాజ్ఞవల్క్యుఁడు ఇదివరకుచెప్పిన జ్ఞానసాధనములగు బ్రహ్మోపాసనలన్నిటిని విశేషణములతోఁగూడా తెలిసికొనియున్నాఁడు గనుక జనకమహారాజు ఆచార్యకత్వమును వదిలి ఆసనవిశేషమునుండి లేచి, యాజ్ఞవల్క్యుని పాదములయందుపడి, ఓ యాజ్ఞవల్క్యుఁడా! నీకు నమస్కరించుచున్నాను. నాకు ఆత్మజ్ఞానమును ఉపదేశించుమాయని పలికెను. ఆ యాజ్ఞవల్క్యుఁడు, ఓ జనకుఁడా! నీవు లోకమునందు విస్తారమార్గమును నడిచిపో నిచ్ఛయించినవాఁడు నెరకదారియందు రథమును, నీటియందు ఓడను గ్రహించినట్లు రథనావస్థానీయములగు ఉపనిషత్తులతోఁగూడుకొనిన స్వరూపముగలవాఁడవైతివి. ఓ జనకుఁడా! నీవు ఈ ప్రకారము రాజువగుటవలన పూజ్యుఁడవును ధనికుఁడవును సమస్తవేదములను అధ్యయనముచేసినవాఁడవును ఆచార్యులచే సమస్త ఉపనిషత్తులు ఉపదేశము చేయఁబడినవాఁడవైనను పరమాత్మజ్ఞానము లేకపోవుటచేత భయమును పొందినవాఁడవై కృతార్థుఁడవేకాకపోతివి. ఈ దేహమునుండి విడువఁబడినవాఁడవై ఏవస్తువును పొందగలవని ప్రశ్నచేసెను. అప్పుడు జనకుఁడు ఓ యాజ్ఞవల్క్యుఁడా! నేను ఏవస్తువునుపొందఁగలనో దానిని గుర్తెఱుఁగను అని చెప్పెను. యాజ్ఞవల్క్యుఁడు ఓ జనకుఁడా! నీకు తెలియకపోయినయెడల నేను నీవు పొందగలవస్తువును నీకుచెప్పెదననిపలికెను. మరల జనకుఁడు యాజ్ఞవల్క్యుఁడా! నన్ను అనుగ్రహించనిచ్ఛయుండెనేని చెప్పుదువుగాక యనిపలికెను,

శ్లో॥ ఇన్ధో హ వై నామైష యోఽయందక్షిణేఽక్షన్పురుషస్తం వా ఏతమిన్ధగ్ సన్తమిన్ద్ర ఇత్యాచక్షతే పరోక్షేణైవ పరోక్షప్రియా ఇవ హి దేవాః ప్రత్యక్షద్విషః. ॥2॥

ప॥ ఇన్ధః – హ – వై – నామ – ఏషః – యః – అయం –

దక్షిణే - అక్షన్ - పురుషః - తం - వై - ఏతం - ఇన్ధం-సన్తం-ఇన్ద్రః - ఇతి - ఆచక్షతే - పరోక్షేణ - ఏవ - పరోక్షప్రియాః - ఇవ - హి - దేవాః - ప్రత్యక్షద్విషః.

ప్ర॥ దక్షిణేఽక్షన్ = దక్షిణనేత్రమునందు, అయంపురుషః= ఈపురుషుఁడు, యః = ఎవఁడో, ఏషః = వీఁడు, ఇన్ధోహవైనామ= ఇన్ధుఁడను పేరుగలవాఁడె. (ప్రకాశించువాఁడుగనుక ఇన్ధుఁడనుపేరుగలవాఁడు). ఇన్ధంసన్తం=ఇన్ధుఁడై యున్న, ఏతం = ఈ, తంవై = ఆపురుషునినే, పరోక్షేణైవ=అప్రత్యక్షముచేతనే, ఇన్ద్రఇతి = ఇన్ద్రుఁడని, ఆచక్షతే = చెప్పుచున్నారు. దేవాః = దేవతలు, పరోక్షప్రియాఇవహి = అప్రత్యక్షముగానే ప్రియమైనవారును, (పరోక్షముగా నామగ్రహణమందు ప్రియమైనవారు,) ప్రత్యక్షద్విషః = ప్రత్యక్షముగా గ్రహించుటయందు ద్వేషించువారలును, (భవన్తి = అగుచున్నారు).

తా॥ విశ్వతైజస ప్రాజ్ఞులను చెప్పుటచేతను తురీయమగు బ్రహ్మమును చూపించుటకుముందుగా విశ్వస్వరూపమును చెప్పుచున్నాఁడు. ఓ జనకుఁడా! దేవతలు అప్రత్యక్షముగా, నామగ్రహణమునందు ప్రీతిగలవారును, ప్రత్యక్షముగా నామగ్రహణమునందు ద్వేషించువారునగుచున్నారు గనుక, ఈదక్షిణనేత్రమునందు ప్రకాశించుచున్న పురుషుఁడును, ఈసూర్యమండలమునందు ప్రకాశించెడి పురుషుఁడును, ఒక్కఁడెయై ప్రకాశస్వరూపుఁడుగనుక ప్రత్యక్షముగా ఇన్ధుఁడను పేరుగలవాఁడగుచున్నాఁడు, ఈపురుషుఁడు అప్రత్యక్షముగా ఇన్ద్రుఁడని చెప్పఁబడుచున్నాఁడు, వీఁడేజాగ్రదవస్థయందు దక్షిణనేత్రమునందు ప్రకాశించుచున్న పురుషుఁడు, ఇట్టి నీవు విశ్వుఁడను పేరుగల పురుషుఁడవు నగుచున్నావని యాజ్ఞవల్క్యుఁడుచెప్పెను.

ఉ॥ అథైతద్వామేఽక్షిణి పురుషరూపమేషాస్య పత్నీ విరాట్ తయోరేష సగ్ స్తావో య ఏషోఽన్తర్హృదయ ఆకాశోఽథైన

యోరేతదన్నం య ఏషోఽన్తర్హృదయే లోహిత పిణ్డోఽథైన
యోరే తత్ప్రావరణం యదేతదన్తర్హృదయే జాలకమివా థైన
యోరేషాసృతిః సఞ్చరణీ యైషా హృదయాదూర్ధ్వా నాడ్యుచ్చ
రతి యథా కేశః సహస్రధా భిన్న ఏవమస్యైతా హితా నామ
నాడ్యోఽన్తర్హృదయే ప్రతిష్ఠితా భవన్త్యేతాభిర్వా ఏతదాస్రవదా
స్రవతితస్మాదేష ప్రవివిక్తాహారతర ఇవైవ భవత్యస్మాచ్ఛారీ
రాదాత్మనః, ॥3॥

ప॥ అథ – ఏతత్ – వామే – అక్షిణి – పురుషరూపం –
ఏషా – అస్య – పత్నీ – విరాట్ – తయోః – ఏషః – సంస్తావః–
యః – ఏషః – అన్తర్హృదయే – ఆకాశః – అథ – ఏనయోః –
ఏతత్ – అన్నం – యః – ఏషః – అన్తర్హృదయే – లోహితపిణ్డః–
అథ – ఏనయోః – ఏతత్ – ప్రావరణం – యత్ – ఏతత్ – అ
న్తర్హృదయే – జాలకం – ఇవ – అథ –ఏనయోః – ఏషా – సృతిః –
సఞ్చరణీ – యా – ఏషా – హృదయాత్ – ఊర్ధ్వా – నాడీ –
ఉచ్చరతి – యథా – కేశః – సహస్రధా – భిన్నః – ఏవం – అస్య–
ఏతాః – హితానామనాడ్యః – అన్తర్హృదయే – ప్రతిష్ఠితాః – భ
వన్తి – ఏతాభిః – వై – ఏతత్ – ఆస్రవత్–ఆస్రవతి – తస్మాత్ –
ఏషః – ప్రవివిక్తాహారతరః – ఇవ – ఏవ – భవతి – అస్మాత్ –
శారీరాత్ – ఆత్మనః.

ప్ర॥ అథ = అనంతరము, వామేఅక్షిణి = వామనేత్రమునం
దలి, ఏతత్ = ఈ, పురుషరూపం = పురుషస్వరూపము, అస్య =
ఈపురుషునికి, (దక్షిణనేత్రమునందలిపురుషునికి), ఏషా = ఇది,
_ = భార్య. విరాట్ = విరాట్స్వరూపము = అన్నము. (కుడినే
త్రమునందలిపురుషరూపము భోక్తయనుపురుషుఁడును, ఎడమనేత్ర
మునందలి పురుషరూపము భోగ్యయను స్త్రీయును. ఇట్లు జాగ్రద
వస్థయందు కుడి యెడమనేత్రములయందలి పురుషరూపమె విశ్వాశ

ద్ధము చేత చెప్పఁబడినస్త్రీపురుషద్వంద్వము). అన్తర్హృదయే= హృదయమునందలి మాంసపిండము యొక్క మధ్యమునందు, ఏషః = ఈ, ఆకాశః = ఆకాశము, (చిదాకాశము), యః = ఏదిగలదో, ఏషః = ఇది, తయోః = ఆ స్త్రీపురుషులకు, సంస్తావః = సంభోగస్థానము. అథ = అనన్తరము, అన్తర్హృదయే = హృదయమధ్యమునందు, ఏషః = ఈ, లోహితపిణ్డః = రక్తపుముద్ద, (రక్తమే పిండాకారమగుటచే లోహితపిండమనఁబడును). (యః = ఏదియో), ఏతత్ = ఇది, అనయోః = ఈస్త్రీపురుషులకు, (మిథునమునకు), అన్నం = అన్నము. అథ = అనంతరము, అన్తర్హృదయే =హృదయమధ్యమునందు, జాలకమివ = సాలెపురుగు మగ్గమువంటిది యగు, ఏతత్ = ఈముందు చెప్పఁబోయెడినాడులయొక్క సమూహము, యత్ = ఏదియో, ఏతత్ = ఈనాడీసమూహము, ఏనయోః = ఈస్త్రీపురుషులకు, (ఈస్త్రీపురుషమిథునమునకు), ప్రావరణం = వస్త్రము, (భవతి = అగుచున్నది). అథ = అనన్తరము, హృదయాత్ = హృదయప్రదేశమునుండి, ఊర్ధ్వా = ఊర్ధ్వాభిముఖమైనదై, యా = ఏ, ఏషా = ఈ, నాడీ = నాడి, ఉచ్చరతి = ఉంటున్నదో; ఏషా = ఈనాడి, ఏనయోః = ఈస్త్రీపురుషులకు, (ఈ స్త్రీపురుషమిథునమునకు) సఞ్చరణీ = సంచరించునట్టి, సృతిః = మార్గము (స్వప్నమునుండి జాగ్రత్ దేశమునకు వచ్చెడిమార్గము). కేశః = వెంట్రుక, సహస్రధా = వేయి విధములుగా, భిన్నః = ఖండింపఁబడినదై, యథా = ఏప్రకారము, (అత్యన్తసూక్ష్మః = మిక్కిలిసూక్ష్మమైనది, భవతి = అగుచున్నదో). ఏవం = ఈ ప్రకారముగా, ఏతాః = ఈ, హితానామ = హితములనిచెప్పబడెడి, నాడ్యః = నాడులు, అస్య = ఈదేహము యొక్క, అన్తర్హృదయే= హృదయమధ్యమునందు, హృదయమునందలి మాంసపిండమునందు). ప్రతిష్ఠితాః = ఉంచఁబడినవి, భవన్తి = అగుచున్నవి. (ఆనాడు

లన్నియు హృదయమునుండి, కడిమపుష్పముయొక్క కింజల్కములు వలెనే, దేహమందుఅంతటను పుట్టుచున్నవి. (ఏతాభిర్వై = ఈనాడులచేతనే, ఏతత్ = ఈఅన్నము, ఆస్రివత్ = అంతటను వ్యాపించినదై, ఆస్రివతి = వృద్ధిపొందించుచున్నది), (ఏకారణమువలన స్థూలరూపమైన అన్నముచేతను దేహము వృద్ధిపొందుచున్నదో), తస్మాత్ = ఆకారణమువలన, ఏషః = ఈలింగశరీరాత్మ, (తైజసాత్మ), అస్మాత్ = ఈ, శారీరాత్ = శరీరసంబంధమైన, ఆత్మనః = విశ్వాత్మకంటె, ప్రవివిక్తాహారతరఇవైవ = మిక్కిలి వేరుపఱచఁబడిన ఆహారముకలవాఁడుగానె, భవతి = ఆగుచున్నాఁడు. (తైజసుఁడు సూక్ష్మమగు అన్నముచేత వృద్ధిపొందినవాఁడగుచున్నాఁడు).

తా॥ ఓజనకమహారాజా! ఇంతకు పూర్వము చెప్పినకుడి నేత్రమునందలి ప్రకాశమానుఁడగు పురుషుఁడు భోక్తయును భర్తయునగు ఇంద్రుఁడును, ఎడమ నేత్రమునందలి పురుషరూపము భోగ్యమగు అన్నమును భార్యయు ఇంద్రాణియునగుచున్నది. ఇదియె జాగ్రతయందు విశ్వుఁడను పేరుతో చెప్పఁదగిన కుడియెడమ నేత్రములయందైన స్త్రీపురుషద్వంద్వము ఈ స్త్రీపురుషద్వంద్వమునకు హృదయమునందలి మాంసపిండముయొక్క మధ్యయందున్న చిదాకాశము సంభోగస్థానము. హృదయమునందు ఘనీభవించిన రక్తపుముద్దయె ఈ స్త్రీపురుషమిథునమునకన్నము. హృదయముయొక్క మాంసపిండమునందుసాలెపురుగుమగ్గమువలెనున్న నాడీసమూహమె ఈస్త్రీపురుషమిథునమునకు వస్త్రము. ఈస్త్రీపురుష మిథునము స్వప్నమునుండి జాగ్రద్దేశమున వచ్చెడి మార్గమైననాడి. అతి సూక్ష్మమై హృదయమునుండి ఊర్ధ్వాభిముఖమై మీఁదుగానుండియున్నది. ఈనాడి ఒక వెంట్రుక వేయి తునకలు చేసిన యెడల నెంత సూక్ష్మమో అంతసూక్ష్మమైనదైయున్నది. ఈ ప్రకారముగానె మిక్కిలిసూక్ష్మములగు ఈ దేహసంబంధములైన నాడులు, [illegible]యమని చెప్పఁబడెడి మాంసపిండమునందుంచఁ

బడియున్నవి. ఈనాడులద్వారా అన్నము దేహమంతా వ్యాపించినదై వృద్ధిపొందించుచున్నది. స్థూలదేహమును వృద్ధిపొందించునట్టి అన్నము స్థూలమగు మూత్రపురీషాదికముకంటె వేరైనదియె. దేవతా శరీరమగు లింగశరీరమును వృద్ధి పొందించునట్టి అన్నము దానికంటె మిక్కిలి సూక్ష్మమైనది. గనుక స్థూలదేహము వేరుపఱచ బడిన ఆహారము కలదియును, సూక్ష్మమైన లింగదేహము మిక్కిలి వేరుపఱచబడిన ఆహారము కలదియునగుచున్నది. కాఁబట్టి ఈస్థూల దేహ సంబంధమైన విశ్వాత్మకంటె సూక్ష్మదేహ సంబంధమైన తైజసాత్మ మిక్కిలి సూక్ష్మాన్నముచే వృద్ధిపొందింపఁబడుచున్నాఁడు. ఈ తైజసుఁడను పురుషుఁడు స్వప్నావస్థయందు కంఠమందుండి ప్రకాశించుచున్నాఁడు. స్వప్నావస్థయందిట్టివాఁడవగు నీవు తైజసుఁడను పేరుగలవాఁడవగుచున్నావని యాజ్ఞవల్క్యుఁడు చెప్పెను.

ఉ॥ తస్య ప్రాచీ దిక్ ప్రాఞ్చః ప్రాణా దక్షిణా దిగ్దక్షిణే ప్రాణాః ప్రతీచీ దిక్ ప్రత్యఞ్చః ప్రాణా ఉదీచీ దిగుదఞ్చః ప్రాణా ఊర్ధ్వా దిగూర్ధ్వాః ప్రాణా అవాచీ దిగవాఞ్చః ప్రాణాః సర్వా దిశః సర్వే ప్రాణాస్స ఏష నేతినేత్యాత్మాఽ గృహ్యో న హి గృహ్యతేఽశీర్యో నహి శీర్యతేఽసఙ్గో న హి సజ్యతేఽ సితో న వ్యథతే న రిష్యత్యభయం వై జనక ప్రాప్తోఽసీతి హోవాచ యాజ్ఞవల్క్యః । స హోవాచ జనకో వై దేహోఽ భయం త్వా గచ్ఛతా ద్యాజ్ఞవల్క్య యో నో భగవన్నభయం వేదయసేన మస్తేఽ స్త్విమే విదేహా అయమహమస్మి 3 ఇతి. ॥4॥

ప॥ తస్య – ప్రాచీ – దిక్ – ప్రాఞ్చః – ప్రాణాః – దక్షిణా – దిక్ – దక్షిణే – ప్రాణాః–ప్రతీచీ – దిక్ – ప్రత్యఞ్చః – ప్రాణాః – ఉదీచీ – దిక్ – ఉదఞ్చః – ప్రాణాః – ఊర్ధ్వా – దిక్– ఊర్ధ్వాః – ప్రాణాః – అవాచీ – దిక్ – అవాఞ్చః – ప్రాణాః – సర్వాః – దిశః – సర్వే – ప్రాణాః– సః– ఏషః – న – ఇతి –న–ఇతి

ఆత్మా – అగృహ్యః – న – హి గృహ్యతే – అశీర్యః – న – హి – శీర్యతే – అసఙ్గః – న – హి – సజ్యతే – అసితః – న – వ్యథతే – న – రిష్యతి – అభయం – వై – జనక – ప్రాప్తః – అసి – ఇతి – హోవాచ – యాజ్ఞవల్క్యః – సః హోవాచ – జనకః – వైదేహః – అభయం – త్వా – గచ్ఛతాత్ – యాజ్ఞవల్క్య – యః – నః – భగవన్ – అభయం – వేదయసే – నమః – తే – అస్తు – ఇమే – విదేహాః – అయం – అహం – అస్మి – ఇతి.

ప॥ తస్య = ఆప్రాజ్ఞాత్మను పొందినవానికి (క్రమముగా విశ్వాత్మనుండి తైజసాత్మను పొంది తైజసాత్మనుండి ప్రాజ్ఞాత్మను పొందిన వానికి), ప్రాఞ్చః = తూర్పుదిక్కును పొందియున్న, ప్రాణాః = ప్రాణములు, ప్రాచీదిక్ = పూర్వదిక్కు. దక్షిణే = దక్షిణ దిక్కునందైన, ప్రాణాః = ప్రాణములు, దక్షిణాదిక్ = దక్షిణదిక్కును. ప్రత్యఞ్చః = పశ్చిమదిక్కును పొందియున్న, ప్రాణాః = ప్రాణములు. ప్రతీచీదిక్ = పశ్చిమదిక్కు. ఉదఞ్చః = ఉత్తర దిక్కును పొందియున్న, ప్రాణాః = ప్రాణములు, ఉదీచీదిక్ = ఉత్తర దిక్కు. ఊర్ధ్వాః = ఊర్ధ్వ దిక్కును పొందియున్న, ప్రాణాః = ప్రాణములు, ఊర్ధ్వాదిక్ = ఊర్ధ్వదిక్కు, అవాఞ్చః = అథోదిక్కునందైన, ప్రాణాః = ప్రాణములు, అవాచీదిక్ = అథోదిక్కు, సర్వే=సమస్తములైన, ప్రాణాః= ప్రాణములు, సర్వాఃదిశః = సమస్తదిక్కులు, (ఇట్లు తెలిసికొనిన విద్వాంసుడు క్రమముగా సర్వాత్మకమైన ప్రాణమును ఆత్మస్వరూపముగా పొందినవాఁడగుచున్నాఁడు, అనఁగా సర్వాత్మకమైన ఆప్రాణమును ప్రత్యగాత్మయందుపసంహరించి నేతి నేతి యని సర్వమును నిషేధించుచు తురీయమగు ఆత్మను పొందుచున్నాఁడు), ఈ విద్వాంసుఁడు ఏఆత్మను ఈక్రమముతో పొందుచున్నాడో), సః = అటువంటి, ఏషః = ఈ, నేతినేత్యాత్మా = సర్వప్రతిషేధపూర్వకమైన ఆత్మ, అగృహ్యః =

గ్రహింపనశక్యముగానిది, (గనుక), నహిగృహ్యతే = గ్రహింపఁబడదు. అశీర్యః = శరీరధర్మములేనిది, (గనుక), నహిశీర్యతే = శిథిలముకాదు. అసఙ్గః = దేనితోను కూడుకొననిది, (గనుక), నహిసజ్యతే = కలిసికొనదు. అసితః = బన్ధింపఁబడనిది, (గనుక), నవ్యథతే= పీడింపఁబడదు. (ఆత్మ, గ్రహణము శిథిలము సఙ్గము బన్ధము ఈకార్యములు లేని దగుటవలన), నరిష్యతి = హింసను పొందదు, (నశించదు). యాజ్ఞవల్క్యః = యాజ్ఞవల్క్యుఁడు, హేజనక = ఓ జనకుఁడా! (త్వం = నీవు), అభయంవై = భయములేక పోవుటను, (జన్మమరణాదినిమిత్తకమైన భయము లేకపోవుటను). ప్రాప్తోసీతిహ= పొందితివిగదా యని, హోవాచ = పలికెను. సః = ఆ, వైదేహః= విదేహదేశప్రభువైన, జనకః = జనకమహారాజు, హోవాచ = పలికెను. హేయాజ్ఞవల్క్య = ఓయాజ్ఞవల్క్యుఁడా! త్వా = నిన్ను గూర్చియును, అభయం = భయరహితమైనబ్రహ్మమే,గచ్ఛతాత్= పొందునుగాక. హేభగవన్= పూజ్యుఁడవగు ఓ యాజ్ఞవల్క్యుఁడా! యః = ఏ, (త్వం = నీవు), నః = మమ్మును. అభయం = భయరహితమైన బ్రహ్మమును, వేదయసే = తెలియఁజేసితివో, (ఉపాధికృతమైన అజ్ఞానమును దూరముగాచేసి పోఁగొట్టుటచేతను పొందించితివో), తే = నీకొఱకు, నమః = నమస్కారము, అస్తు = అగునుగాక, ఇమేవిదేహాః = ఈ విదేహదేశములు. (తవ = నీసంబంధమైనవి. యథేష్టముగా నీవు వీటిని అనుభవించుదువుగాక).అయమహం= ఈనేను, అస్మీతి అగుచున్నావని (దాసభావమునందున్నవాఁడనైతిని యని పలికెను. నన్నున్ను రాజ్యమునున్ను యథేష్టముగా పొందుమా యని పలికెను).

తా॥ ఈహృదయమూతమైన తైజసాత్మ, సూక్ష్మమగు ప్రాణముచే ధరింబఁబడినవాఁడై ప్రాణమె (ప్రాజ్ఞుఁడె) యగుచున్నాఁడు. ఈపూర్వము చెప్పినప్రకారము క్రమముగా విశ్వాత్మవలన తైజసా

త్మను. తైజసాత్మవలన అజ్ఞాతమగు ప్రత్యగాత్మస్వరూపమైన ప్రాజ్ఞాత్మయునగుచున్నది. ఇట్టి ప్రాజ్ఞాత్మకు ప్రాగ్దిక్కు ప్రాగ్దిక్కును పొందిన ప్రాణములు. దక్షిణదిక్కునుపొందిన ప్రాణములు దక్షిణదిక్కు. పశ్చిమదిక్కునుపొందిన ప్రాణములు పశ్చిమదిక్కు. ఉత్తరదిక్కును పొందినప్రాణములు ఉత్తరదిక్కు. ఊర్ధ్వదిక్కునుపొందినప్రాణములు ఊర్ధ్వదిక్కు. అధోదిక్కునుపొందిన ప్రాణములు అధోదిక్కు, సమస్తప్రాణములు సర్వదిక్కులగుచున్నవి. ఇట్లు సర్వాత్మకమైన ప్రాణమును ప్రత్యగాత్మయందుపసంహరించి ఇదికాదు ఇదికాదు అని సర్వమును నిషేధించుచు తురీయమగు ఏ ఆత్మను విద్వాంసుఁడు క్రమముగా పొందుచున్నాఁడో అట్టి సర్వప్రతిషేధపూర్వకమగు ఈఆత్మ సమస్తకార్యధర్మాతీతమై చక్షురాదీంద్రియ గోచరముకానిది గనుక గ్రహింపఁబడనిదియును, మూర్తమగు శరీరాదికముకాదుగనుక శిథిలముకానిదియును, సంగముకానిదియును, బంధింపఁబడనిదియును, నశించనిదియు నగుచున్నది. ఓజనకుఁడా! నీవు ఈఆత్మస్వరూపుఁడవేగనుక జననమరణనిమిత్తకమైన భయములేకపోవుటను పొందినవాఁడవైతివని యాజ్ఞవల్క్యుఁడు పలికెను. ఇట్లుపలుకగా ఆ జనకుఁడు ఓ యాజ్ఞవల్క్యుఁడా నిన్నును జననమరణాది భయరహితమైన పరబ్రహ్మమె పొందునుగాకయని పూజ్యుఁడవగు ఓయాజ్ఞవల్క్యుఁడా! నీవు ఉపాధికృతమైన అజ్ఞానమును దూరముగాఁబోఁగొట్టుటచే జననమరణాది భయరహితమైన బ్రహ్మమును పొందించితివి. ఇట్లు ప్రత్యక్షముగా ఆత్మస్వరూపమును పొందించిన నీకు విద్యానిష్క్రియముకొఱకు నే నన్యము నేమినిత్తును ? గనుక నీకు నమస్కారమగునుగాకయని పలికి, ఇవిగో విదేహదేశములు. ఇదిగో ఈ దేశములకు ప్రభువునైన నేను. ఈరాజ్యమునున్ను నన్నున్ను నీవు యథేష్టముగా పొందుమాయని పలికెను.

ఇట్లు షష్ఠాధ్యాయము ద్వితీయబ్రాహ్మణము సమాప్తము

షష్ఠాధ్యాయము - తృతీయబ్రాహ్మణము

ఉ॥ జనకగ్ం హ వైదేహం యాజ్ఞవల్క్యో జగామ స మేనే న వదిష్య ఇత్యథ హ యజ్జనకశ్చ వైదేహో యాజ్ఞవల్క్యశ్చాగ్ని హోత్రే సముదాతే తస్మై హ యాజ్ఞవల్క్యో వరం దదౌ స హ కామ ప్రశ్నమేవ వవ్రే తగ్ం హాస్మై దదౌ తగ్ం హ సమ్రాడేవ పూర్వం పప్రచ్ఛ. ॥1॥

ప॥ జనకం - హ - వైదేహం - యాజ్ఞవల్క్యః - జగామ- సః - మేనే - న - వదిష్యే - ఇతి - అథ - హ - యత్ - జనకః- చ - వైదేహః - యాజ్ఞవల్క్యః - చ - అగ్నిహోత్రే - సముదాతే - తస్మై - హ - యాజ్ఞవల్క్యః - వరం - దదౌ - సహ - కామప్రశ్నం - ఏవ - వవ్రేతం - హ - అస్మై - దదౌ - తం - హ - సమ్రాట్ - ఏవ - పూర్వం - పప్రచ్ఛ.

ప్ర॥ యాజ్ఞవల్క్యః = యాజ్ఞవల్క్యుఁడు. వైదేహం = విదేహదేశ ప్రభువైన, జనకంహ = జనకమహారాజునుగూర్చి, జగామ = పోయెను. సః = యాజ్ఞవల్క్యుఁడు, (గచ్ఛన్ = పోవుచు రాజ్ఞే = రాజుకొఱకు, కించిదపి = కొంచెమును), నవదిష్యఇతి = పలుకనని, మేనే = తలంచెను. అథహ = అప్పుడు, వైదేహః = విదేహదేశప్రభువైన, జనకశ్చ = జనకమహారాజును, యత్ = దేనిని, (పృష్టవాన్ = అడిగెనో, తత్=దానిని), యాజ్ఞవల్క్యశ్చ= యాజ్ఞవల్క్యుఁడును, (ప్రతిపేదె = పొందెను). (మునుపు సంకల్పించినదానిని వేఱుగాచేయుటయందు కారణమేమనిన పూర్వము జనక యాజ్ఞవల్క్య లిద్దఱును), అగ్నిహోత్రే = అగ్నిహోత్రవిషయము నందు, సముదాతే = సంవాదమునుచేసిరి. యాజ్ఞవల్క్యః = యాజ్ఞ వల్క్యుఁడు, (జనకమహారాజు సంబంధమైన అగ్నిహోత్రవిషయక మగు విజ్ఞానమునుపొంది సంతోషించినవాఁడై), తస్మైహ = ఆజనక మహారాజుకొఱకె, వరం = వరమును, దదౌ = ఇచ్చెను. (ఇష్టమును

వరించుమాయని పలికెను). సహ = ఆ జనకమహారాజు, కామ ప్రశ్నమేవ = కోరికలను ప్రశ్నముచేయుటనే, వవ్రే = వరించెను. (యాజ్ఞవల్క్యః = యాజ్ఞవల్క్యుఁడు), తంహ = ఆవరమునే, అస్మై = ఈ జనకమహారాజుకొఱకు, దదౌ = ఇచ్చెను. (ఆకారణము చేత), సమ్రాడేవ = జనకమహారాజే, పూర్వం = ముందుగా, తంహ = ఆయాజ్ఞవల్క్యునిగూర్చి, పప్రచ్ఛ = అడిగెను.

తా॥ విజ్ఞానమయమైన ఆత్మ, అవ్యవధానమును ప్రత్యక్షమును సర్వాన్తరమును పరమునగు బ్రహ్మమే. త్రాడు, చవిటిభూమి, ముత్తైపుచిప్ప, ఆకాశము, వీనియందు క్రమముగా సర్పము, ఉదకము, వెండి, మాలిన్యము, ఇవిపరారోపణమె నిమిత్తమైకలిగినట్లు ఈ పరబ్రహ్మమునకు సంసారము అన్యమగు ఉపాధియై నిమిత్తముగాఁగలది యగుచున్నది. జ్ఞానము చేతత్రాడు మొదలైన వాటియందలి సర్పము మొదలైన వాటిని తిరస్కరించి త్రాడు మొదలైన వాటిని తెలిసికొనినట్లు యాజ్ఞవల్క్యునిచేత బ్రహ్మస్వరూపమును బోధించుటచే ఉపాధినిమిత్తకమైన సంసారము సర్వప్రతిషేధపూర్వకముగా పోఁగొట్టి ఆగమమునుండి సంక్షేపముగా జనకమహారాజు అభయస్వరూపమైన బ్రహ్మము పొందింపఁబడెను. ఇంతకు పూర్వము జాగ్రత్స్వప్న సుషుప్తి తుర్యములు చెప్పఁబడినవి. ఇప్పుడు జాగ్రత్స్వప్నాదుల ద్వారాగానే గొప్పతర్కముతో విస్తారముగా అభయస్వరూపమును పొందించవలయునని ఆత్మకు విరోధశంకలను నిరాకరించుటద్వారాగా వ్యతిరిక్తత్వమును, శుద్ధత్వమును, స్వయంజ్యోతిష్ట్వమును, అలుప్తశక్తిస్వరూపత్వమును, నిరతిశయానందస్వాభావ్యమును, అద్వైతత్వమును, పొందించవలయునని ఈబ్రాహ్మణమారంభింపఁబడుచున్నది. యాజ్ఞవల్క్యుఁడు జనకమహారాజును గూర్చి వెళ్లుచు మార్గమునందు రాజుకొఱకు కొంచెమైనను పలుకక యుండవలయునని సంకల్పించెను ఇట్లు సంకల్పించియునుయాజ్ఞవల్క్యుఁడు జనకమ

హారాజు అడిగినదానిని పొంది ఉత్తరువు చెప్పుచుండెను. ఈప్రకా రముసంకల్పమునకు విరోధముగా చేయుటకు కారణమేమనఁగా, పూర్వ ము, జనకయాజ్ఞవల్క్యులిద్దఱు అగ్ని హోత్రవిషయమై సంవాదముచే యునపుడు యాజ్ఞవల్క్యుఁడు జనకమహారాజు సంబంధమైన అగ్నిహో త్రవిషయకమగు విజ్ఞానమును పొంది సంతోషించినవాఁడై జనకునకు నీ యిష్టమును కోరుమా ఇచ్చెదనని వరమిచ్చెను; అప్పుడు జనకుఁడు నాకోరికలనడుగుటకు వరమునియ్యుమని యడిగెను. తరువాత యాజ్ఞ వల్క్యుఁడావరమును జనకునకు నిచ్చెను. ఆవరదాన సామర్థ్యము చేతనే జనకమహారాజు చెప్పనిచ్చలేనివాఁడై ఊరకయున్నను యాజ్ఞ వల్క్యుని ముందుగా అడిగెను.

ఉ॥ యాజ్ఞవల్క్య కిం జ్యోతిరయం పురుష ఇతి । ఆదిత్య జ్యోతిః
సమ్రాడితి హోవాచ ఆదిత్యే నైవ జ్యోతిషాస్తే పల్యయతే
కర్మ కురుతే విపల్యేతీత్యేవ మేవైతద్యాజ్ఞవల్క్య. ॥2॥

ప॥ యాజ్ఞవల్క్య – కిం – జ్యోతిః – అయం – పురుషః – ఇతి – ఆదిత్యజ్యోతిః – సమ్రాట్ – ఇతి – హోవాచ – ఆదిత్యేన– ఏవ – జ్యోతిషా – ఆస్తే – పల్యయతే – కర్మ – కురుతే – విప ల్యేతి – ఇతి – ఏవం – ఏవ – ఏతత్ – యాజ్ఞవల్క్యః

ప్ర॥ హేయాజ్ఞవల్క్య = ఓయాజ్ఞవల్క్యుఁడా! అయం = ఈ, పురుషః = పురుషుఁడు, కింజ్యోతిరితి = ఏ తేజస్సుగలవాఁడని (జనకుఁడు ప్రశ్న చేసెను), హేసమ్రాట్ = ఓ జనకమహారాజా! (ఈ పురుషుఁడు), ఆదిత్యజ్యోతిరితి=సూర్యుఁడే తేజస్సుకలవాఁడని, (యాజ్ఞవల్క్యుఁడు), హోవాచ = పలికెను. (ఈ పురు షుఁడు), ఆదిత్యేనైవజ్యోతిషా = సూర్యతేజస్సుచేతనే, ఆస్తే = కూర్చుండుచున్నాఁడు. పల్యయతే = తిరుగుచున్నాఁడు. కర్మ = కర్మను, (లౌకికవైదికకర్మలను), కురుతే = చేయుచున్నా ఁడు. విపల్యేతి = వచ్చుచున్నాఁడు. ఇతి = అని, (యాజ్ఞవల్క్యుఁడు

పలికెను), హేయాజ్ఞవల్క్య = ఓయాజ్ఞవల్క్యుఁడా, ఏతత్ = ఇది, ఏవమేవ = ఈప్రకారమే, (అని జనకుఁడు ఒప్పుకొనెను),

తా॥ ఓయాజ్ఞవల్క్యుఁడా! కరచరణాద్యవయవములు గల ఈ పురుషునికి గమనాది సాధనమగు తేజస్సు ఏదియని జనకుఁడు ప్రశ్న చేసెను. ఓ జనకమహారాజా ! ఈ ప్రాకృతుఁడగు పురుషుడు సూర్యతేజస్సుచేతనే కూర్చుండుచున్నాఁడు. క్షేత్రారణ్యములను గూర్చి పోవుచున్నాఁడు. తిరిగి వచ్చుచున్నాఁడు. లౌకికవైదిక కర్మలను చేయుచున్నాఁడు. గనుక సూర్యుఁడే తేజస్సని యాజ్ఞవల్క్యుఁడు చెప్పెను. జనకుఁడు ఓయాజ్ఞవల్క్యుఁడా! ఇది సరేయని ఒప్పుకొనెను.

ఉ॥ అస్తమిత ఆదిత్యే యాజ్ఞవల్క్య కిం జ్యోతిరేవాయం పురుష ఇతి చన్ద్రమా ఏవాస్య జ్యోతిర్భవతీతి చన్ద్రమసైవాయం జ్యోతిషాస్తేపల్యయతేకర్మకురుతేవిపల్యేతీత్యేవమేవైతద్యాజ్ఞవల్క్య.3

ప॥ అస్తమితే - ఆదిత్యే - యాజ్ఞవల్క్య - కింజ్యోతిః - ఏవ - అయం - పురుషః - ఇతి - చన్ద్రమాః - ఏవ - అస్య - జ్యోతిః - భవతి - ఇతి - చన్ద్రమసా - ఏవ - అయం. - జ్యోతిషా ఆస్తే - పల్యయతే - కర్మ - కురుతే - విపల్యేతి - ఇతి - ఏవం - ఏవ - ఏతత్ - యాజ్ఞవల్క్య.

ప్ర॥ హేయాజ్ఞవల్క్య = ఓయాజ్ఞవల్క్యుఁడా! ఆదిత్యే = సూర్యుఁడు, అస్తమితేసతి=అస్తమానమును పొందుచుండగా, అయం పురుషః = ఈ పురుషుఁడు, కింజ్యోతిరేవ = ఏమితేజస్సుకలవాఁడే, (భవతి = అగుచున్నాఁడు). ఇతి = అని, (జనకుఁడు ప్రశ్న చేసెను). అస్య = ఈ పురుషునికి, చన్ద్రమాఏవ = చంద్రుఁడే, జ్యోతిః = తేజస్సు, భవతీతి = అగుచున్నదని, (యాజ్ఞవల్క్యుఁడు పలికెను). అయం = ఈ పురుషుఁడు, చన్ద్రమసైవజ్యోతిషా = చంద్రతేజస్సుచేతనే, ఆస్తే = కూర్చుండుచున్నాఁడు. పల్యయతే = నడిచిపోవు

చున్నాఁడు. కర్మ = కర్మను, కురుతే చేయుచున్నాఁడు. విపల్యేతి = తిరిగివచ్చుచున్నాఁడు. ఇతి = అని, (యాజ్ఞవల్క్యుఁడు పలికెను). హేయాజ్ఞవల్క్య = ఓయాజ్ఞవల్క్యుఁడా, ఏతత్ = ఇది, ఏవమేవ = ఈప్రకారమే అని జనకుఁడు ఒప్పుకొనెను.

తా॥ ఓ యాజ్ఞవల్క్యుఁడా! కరచరణాద్యవయవములుగల ప్రాకృతుఁడగు ఈపురుషుఁడు సూర్యాస్తమానమైన తరువాత ఏ తేజస్సుకలవాఁడగుచున్నాఁడని జనకుఁడు ప్రశ్నచేసెను. ఓ జనకుఁడా! ఈప్రాకృత పురుషుఁడు సూర్యాస్తమానమైన తరువాత చంద్రతేజస్సుచేతనే కూర్చుండుచున్నాఁడు. నడిచిపోవుచున్నాఁడు. వచ్చుచున్నాఁడు. లౌకిక వైదిక వ్యాపారమును చేయుచున్నాఁడు. గనుక, ఈ పురుషునికి సూర్యాస్తమానమైన తరువాత చంద్రుఁడే తేజస్సు అగుచున్నదని యాజ్ఞవల్క్యుఁడు చెప్పెను. అప్పుడు జనకమహారాజు, ఓయాజ్ఞవల్క్యుఁడా! ఇది సరేయని ఒప్పుకొనెను.

ఉ॥ అస్తమిత ఆదిత్యే యాజ్ఞవల్క్య చన్ద్రమస్యస్తమితే కింజ్యోతిరేవాయం పురుష ఇత్యగ్నిరేవాస్య జ్యోతిర్భవతీత్యగ్నినైవాయం జ్యోతిషాస్తే పల్యయతే కర్మ కురుతేవిపల్యేతీత్యేవమేవైతద్యాజ్ఞవల్క్య. ॥4॥

ప॥ అస్తమితే – ఆదిత్యే – యాజ్ఞవల్క్య – చన్ద్రమసి – అస్తమితే – కింజ్యోతిః – ఏవ – అయం – పురుషః – ఇతి– అగ్నిః– ఏవ – అస్య – జ్యోతిః – భవతి – ఇతి – అగ్నినా – ఏవ – అయం– జ్యోతిషా – ఆస్తే – పల్యయతే – కర్మ – కురుతే – విపల్యేతి – ఇతి – ఏవం – ఏవ – ఏతత్ – యాజ్ఞవల్క్య.

ప్ర॥ హే యాజ్ఞవల్క్య = ఓ యాజ్ఞవల్క్యుఁడా! ఆదిత్యే= సూర్యుఁడు, అస్తమితేసతి = అస్తమానమును పొందుచుండఁగా, చన్ద్రమసి = చంద్రుఁడు, అస్తమితేసతి = అస్తమానమును పొందుచుండఁగా, అయంపురుషః = ఈ పురుషుఁడు, కింజ్యోతిరేవ = ఏ తేజ

స్సుగలవాఁడే, (భవతి = అగుచున్నాఁడు), ఇతి = అని, (జనకుఁడు ప్రశ్నముచేసెను). అస్య = ఈ పురుషునికి, అగ్నిరేవ = అగ్నియె, జ్యోతిః = తేజస్సు, భవతి = అగుచున్నది, ఇతి = అని, (యాజ్ఞవల్క్యుఁడు చెప్పెను). అయం = ఈ పురుషుఁడు,అగ్నినైవజ్యోతిషా= అగ్నితేజస్సుచేతనే, ఆస్తే = కూర్చుండుచున్నాఁడు, పల్యయతే = నడచిపోవుచున్నాఁడు. కర్మ = కర్మను, కురుతే = చేయుచున్నాఁడు, విపల్యేతి = తిరిగివచ్చుచున్నాఁడు, ఇతి = అని, (యాజ్ఞవల్క్యుఁడు చెప్పెను). హేయాజ్ఞవల్క్య = ఓయాజ్ఞవల్క్యుఁడా, ఏతత్ = ఇది, ఏవమేవ = ఈప్రకారమే, (అని జనకుఁడు ఒప్పుకొనెను).

తా॥ ఓ యాజ్ఞవల్క్యుఁడా! కరచరణాద్యవయవములుగల ప్రాకృతుఁడగు ఈ పురుషుఁడు సూర్యచంద్రులస్తమించునప్పుడు ఏ తేజస్సుగలవాఁడగుచున్నాఁడని జనకుఁడు ప్రశ్నముచేసెను. ఓ జనకుఁడా! ఈ ప్రాకృతపురుషుఁడు సూర్యచంద్రులు లేనప్పుడు అగ్నితేజస్సుచేతనే కూర్చుండుచున్నాఁడు, నడచిపోవుచున్నాఁడు, వచ్చుచున్నాఁడు, లౌకిక వైదికకర్మను చేయుచున్నాఁడు, కనుక ఈప్రాకృతుఁడగు పురుషునికి సూర్యచంద్రులు లేనపుడు అగ్నియే తేజస్సగుచున్నదని యాజ్ఞవల్క్యుఁడు చెప్పెను. అప్పుడు, జనకమహారాజు, ఓ యాజ్ఞవల్క్యుఁడా! ఇదిసరేయని ఒప్పుకొనెను.

ఉ॥ అస్తమిత ఆదిత్యే యాజ్ఞవల్క్య చన్ద్రమస్యస్తమితే శాన్తేఽగ్నౌ కింజ్యోతిరేవాయం పురుష ఇతి వాగేవాస్య జ్యోతిర్భవతీతి వాచైవాయం జ్యోతిషాస్తే పల్యయతే కర్మ కురుతే విపల్యేతీతి తస్మాద్వై సమ్రాడపి యత్ర స్వః పాణిర్న వినిర్జ్ఞాయతేఽథ యత్ర వాగుచ్చరత్యుపైవ తత్ర న్యేతీత్యేవమేవైతద్యాజ్ఞవల్క్య. ॥5॥

ప॥ అస్తమితే - ఆదిత్యే - యాజ్ఞవల్క్య - చన్ద్రమసి - అస్తమితే - శాన్తే అగ్నౌ - కింజ్యోతిః - ఏవ - అయం పురు-

షః - ఇతి - వాక్ - ఏవ - అస్య - జ్యోతిః - భవతి - ఇతి - వాచా - ఏవ - అయం - జ్యోతిషా - ఆస్తే - పల్యయతే - కర్మ - కురుతే - విపల్యేతి - ఇతి - తస్మాత్ - వై - సమ్రాట్ - అపి - యత్ర - స్వః - పాణిః - న - వినిర్జ్ఞాయతే - అథ - యత్ర - వాక్ - ఉచ్చరతి - ఉప - ఏవ - తత్ర - న్యేతి - ఇతి - ఏవం - ఏవ - ఏతత్ - యాజ్ఞవల్క్య.

ప్ర॥ హేయాజ్ఞవల్క్య = ఓ యాజ్ఞవల్క్యుఁడా! ఆదిత్యే= సూర్యుఁడు, అస్తమితేసతి = అస్తమానమగుచుండఁగా, చన్ద్రమసి= చంద్రుఁడు, అస్తమితేసతి = అస్తమానమగుచుండఁగా, అగ్నౌ = అగ్ని, శాన్తేసతి = శమించుచుండఁగా, అయం = ఈ, పురుషః = పురుషుఁడు, కింజ్యోతిరేవ = ఏతేజస్సుగలవాఁడు, (భవతి = అగుచున్నాఁడు), ఇతి = అని, (జనకుఁడడిగెను). అస్య = ఈపురుషునికి, వాగేవ = వాక్కే, జ్యోతిః = తేజస్సు, భవతీతి = అగుచున్నదని, (యాజ్ఞవల్క్యుఁడు పలికెను). (ఏలయనఁగా), అయం = ఈ పురుషుఁడు, వాచైవజ్యోతిషా = వాగ్జ్యోతిస్సుచేతనే, ఆస్తే= కూర్చుండుచున్నాఁడు, పల్యయతే = నచచిపోవుచున్నాఁడు, కర్మ = కర్మను, కురుతే = చేయుచున్నాఁడు, విపల్యేతి = తిరిగివచ్చుచున్నాఁడు, ఇతి = అని, (యాజ్ఞవల్క్యుఁడు చెప్పెను. ఇట్లు చెప్పఁగా జనకుఁడు వాక్కునకు తేజస్సుగలుగుట అప్రసిద్ధమైనది గనుక ఎట్లు వాక్కునకు తేజస్సుగలుగుట యని ప్రశ్నముచేయఁగా చెప్పుచున్నాఁడు), హే॰ సమ్రాట్ = ఓ జనకమహారాజా। అపియత్ర = ఏకాలమునందు, స్వః = తనదియగు, పాణిః = హస్తము, నవినిర్జ్ఞాయతే = తెలిసికొనఁబడదో, అథ = అప్పుడు, యత్ర = ఎక్కడ, వాక్= వాక్కు, ఉచ్చరతి = పలుకుచున్నదో, తత్ర = అక్కడికి, ఉపైవ = సమీపముగానే, న్యేతి = మిక్కిలి పొందుచున్నది. తస్మాద్వై = అందువల్లనే, (వాచః = వాక్కునకు, జ్యోతిష్ట్వం = తేజస్సుకలుగుట,

ప్రసిద్ధం = ప్రసిద్ధమైనది), ఇతి=అని, (యాజ్ఞవల్క్యుఁడు చెప్పెను). యాజ్ఞవల్క్య = ఓ యాజ్ఞవల్క్యుఁడా! ఏతత్ = ఇది, ఏవమేవ= ఈప్రకారమె, (అని జనకమహారాజు ఒప్పుకొనెను).

తా॥ ఓ యాజ్ఞవల్క్యుఁడా! ప్రాకృతుఁడగు కరచరణాద్యవయవములుగల ఈ పురుషుఁడు సూర్యచంద్రాగ్నులు లేనప్పుడు ఏ తేజస్సుగలవాఁడగుచున్నాఁడని జనకుఁడు ప్రశ్నముచేసెను. ఓ జనకుఁడా! మేఘముచేత కలిగిన అంధకారమునందు తన హస్తమైనను తనకు తెలిసికొన శక్యముగాని సమయమునందు కుక్క అఱచినను గాడిదకూసినను మనుష్యుఁడు మాట్లాడినను జనుఁడు శబ్దమాత్రముః చేత ఇవిసమీపముగానున్నవి దూరముగానున్నవనిమిక్కిలి తెలిసికొనుచున్నాఁడు. ఇదేప్రకారము పాకృతజనుఁడు వాఙ్మాత్రముచేతనే సర్వమును తెలిసికొని కూర్చుండుచున్నాఁడు. నడచిపోవుచున్నాఁడు. తిరిగి వచ్చుచున్నాఁడు. లౌకిక వైదిక కర్మను చేయుచున్నాఁడు. కనుకనే ఓజనకుఁడా! ఈ ప్రాకృతపురుషునికి సూర్యచంద్రాగ్నులు లేనప్పుడు వాక్కే తేజస్సగుచున్నదని యాజ్ఞవల్క్యుఁడు చెప్పెను. ఇట్లు చెప్పఁగా ఓ యాజ్ఞవల్క్యుఁడా! ఇది సరేయని జనకమహారాజ ఒప్పుకొనెను,

ఉ॥ అస్తమిత ఆదిత్యే యాజ్ఞవల్క్య చన్ద్రమస్యస్తమితే శాన్తే
ఽగ్నౌ శాన్తాయాం వాచి కింజ్యోతిరేవాయం పురుష ఇత్యాత్మై
వాస్య జ్యోతి ర్భవతీత్యాత్మ నైవాయం జ్యోతిషాస్తే పల్యయతే
కర్మకురుతే విపల్యేతీతి. ॥6॥

ప॥ అస్తమితే – ఆదిత్యే – యాజ్ఞవల్క్య – చన్ద్రమసి – అస్తమితే – శాన్తే – అగ్నౌ – శాన్తాయాం – వాచి – కింజ్యోతిః– ఏవ – అయం – పురుషః – ఆత్మా – ఏవ – అస్య-జ్యోతిః – భవతి – ఇతి – ఆత్మనా – ఏవ – అయం – జ్యోతిషా – ఆస్తే – ప్ల్యయతే – కర్మ – కురుతే – విపల్యేతి – ఇతి.

ప్ర॥ హేయాజ్ఞవల్క్య = ఓయాజ్ఞవల్క్యుఁడా! ఆదిత్యే = సూర్యుఁడు, అస్తమితేసతి = అస్తమానము పొందుచుండఁగా, చంద్రమసి=చంద్రుడు, అస్తమితేసతి=అస్తమానముపొందుచుండగా, అగ్నౌ = అగ్ని, శాన్తేసతి = శమించుచుండఁగా, వాచి = వాక్కు, శాన్తాయాంసత్యాం = శమించుచుండఁగా, అయంపురుషః = ఈ పురుషుఁడు, కింజ్యోతిః = ఏ తేజస్సుగలవాఁడుఁ (భవతి = అగుచున్నాఁడు), (ఇతి = అని, జనకమహారాజు అడిగెను). అస్య = ఈ పురుషునికి, ఆత్మైవ = ఆత్మయే, జ్యోతిః = తేజస్సు, భవతీతి = అగుచున్నదని, (యాజ్ఞవల్క్యుఁడు చెప్పెను. ఎట్లనఁగా), అయం = ఈపురుషుఁడు, ఆత్మనైవజ్యోతిషా = ఆత్మతేజస్సుచేతనే, ఆస్తే = కూర్చుండుచున్నాఁడు. పల్యయతే = నడచిపోవుచున్నాఁడు. కర్మ = కర్మను, కురుతే = చేయుచున్నాఁడు. విపల్యేతి = తిరిగివచ్చుచున్నాఁడు. ఇతి=కనుక, (ఆత్మే తేజస్సని యాజ్ఞవల్క్యుఁడుచెప్పెను).

తా॥ ఓయాజ్ఞవల్క్యుఁడా! ప్రాకృతుఁడగు కరచరణాద్యవయవములుగల ఈ పురుషుఁడు సూర్యచంద్రాగ్ని వాక్కులు లేని సమయమున ఏ తేజస్సుగలవాఁడగుచున్నాఁడని జనకుఁడు ప్రశ్నము చేసెను. ఓజనకుఁడా! ఈప్రాకృతపురుషుఁడు ఆత్మతేజస్సు చేతనే కూర్చుండుచున్నాఁడు. క్షేత్రారణ్యాదులనుగూర్చి పోవుచున్నాఁడు. మరలవచ్చుచున్నాఁడు. లౌకిక వైదిక కర్మను చేయుచున్నాఁడు గనుక, ఈపురుషునికి సూర్యచంద్రాగ్ని వాక్కులు లేనప్పుడు ఆత్మయే తేజస్సు గలవాఁడగుచున్నాఁడని యాజ్ఞవల్క్యుఁడు చెప్పెను.

మ॥ కతమ ఆత్మేతి యోఽయం విజ్ఞానమయః ప్రాణేషు హృద్యన్తర్జ్యోతిః పురుషః। స సమానస్సన్నుభౌలోకావనుసఞ్చరతి ధ్యాయతీవ లేలాయతీవ। స హి స్వప్నో భూత్వేమం లోకమతిక్రామతి మృత్యోరూపాణి. ॥7॥

ప॥ కతమః - ఆత్మా - ఇతి - యః - అయం - విజ్ఞాన

మయః - ప్రాణేషు - హృది - అన్తః - జ్యోతిః - పురుషః - సః- సమానః - సన్ - ఉభౌ - లోకౌ - అనుసఞ్చరతి - ధ్యాయతి - ఇవ - లేలాయతి - ఇవ - సః - హి - స్వప్నః - భూత్వా - ఇమం - లోకం - అతిక్రామతి - మృత్యోః - రూపాణి.

ప్ర॥ ప్రాణేషు = ప్రాణములయందు, (దేహేంద్రియప్రాణ మనస్సులయందు), యః = ఏ, అయం = ఈ, విజ్ఞానమయః = విజ్ఞానస్వరూపుఁడగు, ఆత్మా = ఆత్మ, కతమఇతి = ఏదియని, జనక మహారాజు ప్రశ్నముచేసెను). హృది = బుద్ధియందు = అన్తః = లోపలనున్న, జ్యోతిః = తేజోరూపుఁడగు, పురుషః= పురుషుఁడు, (ఆత్మయని యాజ్ఞవల్క్యుఁడు చెప్పి), సః = ఆవిజ్ఞానస్వరూపమగు ఆత్మ, (బుద్ధి ధ్యానించుచుండఁగా), ధ్యాయతీవ = ధ్యానించుచున్నది వలెనే, (బుద్ధ్యాదీంద్రియములు చలించుచుండఁగా), లేలాయతీవ = చలించుచున్నదానివలెనే, సమానస్సన్ = బుద్ధితోసమానమై, ఉభౌ లోకౌ = రెండైన ఇహపరలోకములను, అను సఞ్చరతి = అనుసరించి తిరుగుచున్నది. సహి = ఆ ఆత్మయె. స్వప్నోభూత్వా = స్వప్నస్వరూపమై, ఇమంలోకం = ఈలోకమును, (జాగ్రద్వ్యవహార లక్షణమును, దేహేంద్రియ సంఘాతస్వరూపమును, లౌకిక శాస్త్రీ యవ్యవహారాస్పదమగు ఈలోకమును), మృత్యోః = మృత్యువు యొక్క, రూపాణి = రూపములను, కర్మావిద్యాదిరూపమైన మృత్యువు యొక్క రూపములైన దేహేంద్రియములను), అతిక్రామతి= అతిక్రమించియున్నది, (సర్వవిలక్షణమై స్వయం ప్రకాశకమగు ఆత్మ తన తేజస్సుచేత బుద్ధిని ప్రకాశింపఁజేయుచు ఈబుద్ధ్యాది సర్వమును అతిక్రమించుచున్నది).

తా॥ ఓయాజ్ఞవల్క్యుఁడా! దేహేంద్రియ ప్రాణమనస్సుల యందు ఈవిజ్ఞానస్వరూపమగు ఆత్మయేది యని జనకుఁడు ప్రశ్నము చేసెను. హృదయమునందు అధోముఖముగా వ్రేలాడుచుండెడి

మాంసపిండముయొక్క మధ్యనున్న బుద్ధియందలి తేజోరూపమైన పురుషుఁడే ఆత్మయని యాజ్ఞవల్క్యుఁడు చెప్పెను. ఇట్లు చెప్పి ఓ జనకమహారాజా! అట్టిఆత్మ బుద్ధిధ్యాన వ్యాపారమును చేయుచుండఁగా తాను ధ్యానించుచున్న దానివలెను, ప్రాణమనోబుద్ధులు చలించుచుండఁగా తాను చలించుచున్న దానివలెను, ఉన్నదై బుద్ధితో సమానమై బుద్ధి ద్వారా ఇహపరలోకములను రెంటిని అనుసరించి తిరుగుచున్నదియెగాని ఆత్మకు స్వకీయముగా ఇహపరలోక సంచరణములేకయే కేవలస్వరూపమై యున్నది. అట్టి ఈ ఆత్మయె స్వప్నరూపమై జాగ్రదవస్థయందలి వ్యహారమే గుఱుతుగాఁగలదియును శరీరము ఇంద్రియములు వీనియొక్క సముదాయమె స్వరూపముగాఁగలదియును లోకసంబంధమును శాస్త్రసంబంధమునగు వ్యవహారమునకు స్థానమ్మునగు ఈ లోకమును మృత్యువుయొక్క రూపములైన శరీరేంద్రియములను అతిక్రమించుచున్నది. ఆత్మ ఇట్లు జాగ్రత్స్వప్నములను ప్రకాశింపఁజేయుచు ఈ బుద్ధి మనః ప్రాణములతోఁగూడుకొని వీనికంటెను వేత్తైనదై స్వయం జ్యోతిస్వరూపమై కర్తృక్రియాకారకఫలములు లేనిదియై పరిశుద్ధమై యున్నదియని యాజ్ఞవల్క్యుఁడు చెప్పెను.

ఉ॥ స వా అయం పురుషో జాయమానః శరీరమభిసమ్పద్యమానః
పాప్మభిః సగ్ సృజ్యతే స ఉత్క్రామన్మ్రియమాణః పాప్మనో
విజహాతి. ॥8॥

ప॥ సః – వై – అయం – పురుషః = జాయమానః – శరీరం – అభిసమ్పద్యమానః – పాప్మభిః – సంసృజ్యతే – సః – ఉత్క్రామన్ – మ్రియమాణః – పాప్మనః – విజహాతి.

ప॥ సవై = ఆయాత్మస్వరూపమేయైన, అయంపురుషః = ఈ పురుషుఁడు, జాయమానః = పుట్టినవాఁడై, శరీరం = దేహమును, అభిసమ్పద్యమానః = పొందినవాఁడై, (శరీరమునందు ఆత్మభావ

మును పొందినవాఁడై), పాప్మభిః = పాపములతో, సంసృజ్యతే = కూడుకొనుచున్నాఁడు. సః = ఆపురుషుఁడు, ఉత్క్రామన్ = వేఱొక శరీరమును పొందుచు, మ్రియమాణః = చనిపోయినవాఁడై, పాప్మనః = పాపములను, (పాపరూపములైన దేహేంద్రియములను), విజహాతి = విడుచుచున్నాఁడు.

తా॥ ఓయాజ్ఞవల్క్యుఁడా! ఆయాత్మస్వరూపమగు ఈ పురుషుడు బుద్ధితో సమానుఁడై స్వప్నజాగ్రదవస్థలయందు ప్రవర్తించెడి వాఁడగుచు పాపరూపములైన దేహేంద్రియ సముదాయములను గ్రహించుటచేతను విడుచుటచేతను ఎల్లప్పుడు ఒక దేహమునం దెట్లు సంచరించునో ఆప్రకారముగానే ఈయాత్మస్వరూపుఁడగు పురుషుఁడు పుట్టుచు దేహేంద్రియ సముదాయమె తాననెడి అభిప్రాయమును పొందినవాఁడై పాపరూపములైన దేహేంద్రియములతోఁగూడకొనుచున్నాఁడు. వెఱొక శరీరమునుపొందుచు చనిపోయినవాఁడై పాపరూపములైన దేహేంద్రియములను విడుచుచున్నాఁడు. ఇట్లు పురుషుఁడు ఇహపరలోకములను రెంటిని జన్మమరణములచేత దేహేంద్రియోపాదాన పరిత్యాగములను పొంది సంసారమును విడిచి మోక్షమునుపొందు పర్యంతము సంచరించుచున్నాఁడు. కనుక ఆత్మజ్యోతిస్సునకు పాపస్వరూపములగు దేహేంద్రియములకంటె వేఱగుట సిద్ధమైనదియని యాజ్ఞవల్క్యుఁడు చెప్పెను.

ఉ॥ తస్య వా ఏతస్య పురుషస్య ద్వే ఏవ స్థానే భవతః ఇదం చ పరలోక స్థానం చ సన్ధ్యం తృతీయగ్ స్వప్న స్థానం తస్మిన్సన్ధ్యే స్థానే తిష్ఠన్నేతే ఉభే స్థానే పశ్యతీదం చ పరలోక స్థానం చ, అథయథాక్రమోఽయం పరలోక స్థానే భవతి తమాక్రమమాక్రమ్యో భయాన్పాప్మన ఆనన్దాగ్శ్చ పశ్యతి స యత్ర ప్రస్వపిత్యస్య లోకస్య సర్వావతో మాత్రా మపాదాయ స్వయం

విహత్య స్వయం నిర్మాయ స్వేన భాసా స్వేన జ్యోతిషా ప్రస్వపిత్యత్రాయం పురుషః స్వయంజ్యోతిర్భవతి. ॥9॥

ప॥ తస్య - వై - ఏతస్య - పురుషస్య - ద్వే - ఏవ - స్థానే - భవతః - ఇదం - చ - పరలోకస్థానం - చ - సన్ధ్యం - తృతీయం - స్వప్నస్థానం - తస్మిన్ - సన్ధ్యే - స్థానే - తిష్ఠన్ - ఏతే - ఉభే - స్థానే - పశ్యతి - ఇదం - చ - పరలోక స్థానం - చ - అథ - యథా - క్రమః - అయం - పరలోకస్థానే - భవతి - తం - ఆక్రమం - ఆక్రమ్య - ఉభయాన్ - పాప్మనః - ఆనన్దాన్ - చ - పశ్యతి - సః - యత్ర - ప్రస్వపితి - అస్య - లోకస్య - సర్వావతః - మాత్రాం - అపాదాయ - స్వయం - విహత్య - స్వయం - నిర్మాయ - స్వేన - భాసా - స్వేన - జ్యోతిషా - ప్రస్వపితి - అత్ర - అయం - పురుషః - స్వయంజ్యోతిః - భవతి.

ప్ర॥ తస్యవై = ఆప్రసిద్ధుఁడగు, ఏతస్యపురుషస్య = ఈ పురుషునికి, ఇదంచ = ఈలోకస్థానమును, పరలోకస్థానంచ = పరలోకస్థానమునగు, ద్వేఏవస్థానే = రెండు స్థానములే, భవతః = అగుచున్నవి. తృతీయం = మూఁడివదియగు, సన్ధ్యం = సంధియం దైనది, (ఇహపరలోకములయొక్క సంధియందైనది), స్వప్నస్థానం= స్వప్నస్థానము, (ఈపురుషుఁడు) తస్మిన్ = ఆ, సన్ధ్యే = సంధియం దైన, = స్థానే = స్థానమునందు, తిష్ఠన్ = ఉన్నవాఁడై, ఇదంచ= ఈలోకస్థానమును, పరలోకస్థానంచ = పరలోకస్థానమునగు, ఏతే= ఈ, ఉభేస్థానే = రెండు స్థానములను, పశ్యతి = చూచుచున్నాఁడు. అయం = ఈ పురుషుఁడు, పరలోకస్థానే = పరలోకస్థానమునందు, యథాక్రమః = ఎటువంటి ఆశ్రయముగలవాఁడు, భవతి = అగుచున్నాఁడో! తంఆక్రమం = అట్టి ఆశ్రయమును, ఆక్రమ్య = ఆశ్రయించి, అథ = అప్పుడు, (స్వప్నమునందు), ఉభయాన్=రెండైన,

పాప్మనః = పాపస్వరూపములగు దుఃఖములను, (పాపఫలములైన దుఃఖములను), ఆనన్దాంశ్చ = (పుణ్యఫలములగు) సుఖములను, పశ్యతి = చూచుచున్నాఁడు. సః = ఆపురుషుఁడు, యత్ర = ఎప్పుడు, (ఏస్వప్నకాలమునందు), ప్రస్వపితి = మిక్కిలి నిద్రననుభవించుచున్నాఁడో, (తదా = అప్పుడు), సర్వావతః = సమస్తముగల, (సంసర్గ కారణములగు భూతభౌతికముల లేశములుగల), అస్య లోకస్య = ఈలోకముయొక్క, విషయవేదనతోఁ గూడుకొనిన దేహేంద్రియ సంఘాతముయొక్క, మాత్రాం = లేశమును, (ఏకదేశమును), అపాదాయ = గ్రహించి, స్వయం = తానె, (దేహం= దేహమును), నిహత్య = పడవేసి, (జాగ్రత్త లేకుండునట్లు చేసి, స్వయం = తానె), వాసనామయం = జాగ్రద్వాసనారూపమైన, స్వప్నదేహం = స్వప్నదేహమను, మాయామయమివ = మాయాస్వరూపమునువలెనే, నిర్మాయ = నిర్మించి, స్వేన = తనసంబంధమగు, భాసా = ప్రకాశముచేతను, (సమస్తవాసనాత్మకమగు అంతఃకరణవృత్తి ప్రకాశముచేతను), స్వేనజ్యోతిషా =స్వకీయ తేజస్సుతో, ఆ యంతఃకరణప్రకాశమే విషయమైన వేఱుపఱచఁబడిన లోపము చేయఁబడని దృక్స్వభావముతో వాసనాత్మకమైన ఆప్రకాశరూపమును విషయముగాఁ జేసికొనుచు), ప్రస్వపితి =మిక్కిలి స్వాపమును పొందుచున్నాఁడు. అత్ర = ఈఅవస్థయందు, అయంపురుషః = ఈ పురుషుఁడు, స్వయంజ్యోతిః = స్వయంప్రకాశమైన తేజస్సు, భవతి=అగుచున్నాఁడు. (ఎప్పుడు వాసనాత్మకమైన ఆ అంతఃకరణ ప్రకాశము గోచరమైన దగుచున్నదో అప్పుడు సమస్తమైన వానినుండి వేఱు చేయఁబడినదియును నేత్రము మొదలైన దేహేంద్రియములను వదలిన కేవల స్వరూపమైనదియును లోపముచేయఁబడని దృక్స్వరూపమునగు ఆత్మజ్యోతి, ఒరనుండి తీయఁబడిన కత్తివలెనే స్వకీయరూపముతో ప్రకాశించునదియై గ్రహింపఁబడుచున్నది. కనుక ఈ అవస్థ

యందు ఈ పురుషుఁడు స్వయంజ్యోతి యగుచున్నాఁడు).

తా॥ జనుఁడు స్వప్నజాగ్రత్తులను వలెనే జనన మరణముల చేతనుక్రమముగా ఇహపరలోకములను అనుసరించి పొందుచున్నాఁడు. స్వప్నజాగ్రత్తలన్ననో ప్రత్యక్షముగా పొందఁబడుచున్నవి. ఇహపర లోకములు ఏప్రమాణము చేతనున్ను పొందఁబడుటయు లేదు. కనుక ఈ స్వప్నజాగ్రత్తలే ఇహపరలోకములని శంకించఁగాఁజెప్పఁబడు చున్నది. ఓజనకుఁడా! పురుషునికి రెండేస్థానములు. అవియేవియనగా. జన్మశరీరేంద్రియ విషయవేదనలతోఁగూడుకొని ప్రత్యక్షముగా అను భవింపఁబడుచుండెడి ఈ లోకమును ; ఈ శరీరాదులయొక్క వియో గానంతరము కాఁదగిన పరలోకమును, ఇవియె ఆరెండు స్థానములు. స్వప్నమె పరలోకమైనయెడల రెండే స్థానములని చెప్పుట అయు క్తము. ఎట్లనఁగా, ఇహపరలోకములయొక్క సంధియందైన మూఁడ వదియగు స్థానము స్వప్నస్థానము. ఆస్వప్నస్థానమునందీ పురుషుఁ డుండి ఇహపరలోక స్థానములను రెంటిని చూచుచున్నాఁడు. కనుక ఇహపరలోకములు రెండును స్వప్నజాగ్రత్తలకంటె వేరైనవి. పురు షుఁడు పరలోక ప్రాప్తిసాధనమునై విద్యాకర్మలే ముందుగాఁగల విజ్ఞాన లక్షణముతోఁ గూడుకొనినవాఁడైపరలోకస్థానమందున్నాఁడు. అట్టి విద్యాకర్మలయొక్క విజ్ఞానము నాశ్రయించి పురుషుఁడు స్వప్న మునందు పాపఫలములగు దుఃఖములను, పుణ్యఫలములగు సుఖము లను చూచుచున్నాఁడు. ఇంతకు పూర్వము వెలుపలనుండెడి ఆది త్యాది తేజస్సులులేనప్పుడు ఈదేహేంద్రియ సంఘాతరూపమైన పురుషుఁడు విలక్షణమైన ఆత్మజ్యోతిస్సుచేతనే వ్యవహరించుచున్నాఁ డని చెప్పఁబడినది. ఆ తేజస్సులేనేలేదు. ఏలయనఁగా, ఎల్లప్పుడును ఈ దేహేంద్రియాది సంఘాతము సృజింపఁబడినదియగుచు పొందఁ బడుచున్నది. కనుక వేఱొకటి లేనిదియును స్వయం ప్రకాశమునగు ఆత్మ లేనేలేదు. ఉన్నయెడల ఆధ్యాత్మికాదులయొక్క కూడికలేని

ఈ స్వయంజ్యోతి స్వరూపమైన ఆత్మ ఎక్కడ పొందఁబడునని యనఁగా చెప్పుచున్నాఁడు. ఈఆత్మస్వాపము ననుభవించునపుడు సంసర్గ కారణములగు భూతభౌతికములుగల విషయవేదనలతోఁ గూడుకొనిన దేహేంద్రియ సంఘాతముయొక్క ఏకదేశమును గ్రహించి తానే జాగ్రత్తను విడిచి ఈ దేహమును వదలి జాగ్రద్వాసనారూపమైన స్వప్నదేహమును, మాయారూపమునువలెనే నిర్మించి సమస్తవాసనారూపమై అంతఃకరణవృత్తి ప్రకాశముచేతను ఆ అంతఃకరణ ప్రకాశమె విషయముగాఁగల వేఱుపఱచఁబడిన లోపముచేయఁబడని స్వయంప్రకాశమగు దృక్స్వరూపముతో వాసనాత్మకమైన ఆ అంతఃకరణ ప్రకాశరూపమును గోచరింపఁజేసికొనుచు మిక్కిలి స్వాపమును పొందుచున్నాఁడు. ఇట్లు వాసనాస్వరూపమగు అంతఃకరణవృత్తి ప్రకాశము గోచరమగునపుడు సమస్తమైన వానినుండి వేఱుపఱచఁబడినదియును నేత్రము మొదలైన దేహేంద్రియములను వదలిన కేవలస్వరూపమైనదియును లోపము చేయఁబడని దృక్స్వరూపమునగు ఆత్మజ్యోతి ఒరనుండి తీయఁబడిన కత్తివలెనే స్వకీయరూపముతోఁ బ్రకాశించునదియై గ్రహింపఁబడుచున్నది. కాఁబట్టి ఈఆత్మస్వయం ప్రకాశమైన తేజస్సని యాజ్ఞవల్క్యుఁడు చెప్పెను.

ఉ॥ న తత్ర రథా నరథయోగా న పన్థానో భవన్త్యథ రథాన్ రథయోగా న్పథస్సృజతే న తత్రా నన్దా ముదః ప్రముదోభవన్త్యథానన్దాన్ముదః ప్రముదః సృజతే న తత్ర వేశాన్తాః పుష్కరిణ్యః స్రవన్త్యోభవన్త్యథవేశాన్తాః పుష్కరిణ్యః స్రవన్త్యః సృజతే స హి కర్తా. ॥10॥

ప॥ న - తత్ర - రథాః - న, రథయోగాః - న - పన్థానః - భవన్తి - అథ - రథాన్ - రథయోగాన్ - పథః - సృజతే - న - తత్ర - ఆనన్దాః - ముదః - ప్రముదః - భవన్తి - అథ - ఆనన్దాన్ - ముదః - ప్రముదః - సృజతే - న - తత్ర - వేశాన్తాః -

పుష్కరిణ్యః - స్రవన్త్యః - భవన్తి - అథ - వేశాన్తాః - పుష్కరిణ్యః - స్రవన్త్యః - సృజతే - సః - హి - కర్తా.

ప॥ తత్ర = ఆస్వప్నమునందు, రథాః = రథములు, న= లేవు. రథయోగాః = రథమునకుఁ గూర్చెడి గుఱ్ఱములు, న = లేవు. పన్థానః = మార్గములు, నభవన్తి = లేవు. అథ మఱియు, (ఈపురుషుఁడు ఆస్వప్నమునందు), రథాన్ = రథములను, రథయోగాన్ = అశ్వములను, పథః = మార్గములను, సృజతే = సృజించుచున్నాఁడు. తత్ర = ఆస్వప్నమునందు, ఆనన్దాః = సుఖాతిశయములును, ముదః= సంతోషములును, (పుత్రాది లాభనిమిత్తకములైన సంతోషములను), ప్రముదః = మిక్కిలి ఆధిక్యముతోఁగూడుకొనిన ఆ సంతోషములును, నవభవన్తి = లేవు. అథ = మఱియు, (ఆత్మ ఆ స్వప్నమునందు), ఆనన్దాన్ = సుఖాతిశయములను, ముదః = సంతోషములను, ప్రముదః = మిక్కిలి ఆధిక్యముతోఁగూడుకొనిన సంతోషములను, సృజతే = సృజించుచున్నాఁడు. తత్ర = ఆ స్వప్నమునందు, వేశాన్తాః = చిన్న నీటిగుంటలును, పుష్కరిణ్యః = చెఱువులును, స్రవన్త్యః = నదులును, నభవన్తి = లేవు. అథ=మఱియు, (ఆత్మ స్వప్నమునందు), వేశాన్తాః = చిన్ననీటిగుంటలను, పుష్కరిణ్యః = తటాకములను, స్రవన్త్యః = నదులను, సృజతే = సృజించుచున్నాడు. (కనుక) సహి = ఆయాత్మయె, కర్తా = కర్త, (భవతి= అగుచున్నాఁడు).

తా॥ ఓజనకుఁడా! స్వయంజ్యోతి స్స్వరూపమైన ఆత్మ ఇంద్రియములను ఆ ఇంద్రియములకు సహాయములైన ఆదిత్యాది తేజస్సులను లేకయే స్వకీయముగా ఆ స్వప్నమునందు లేనటువంటివియును వాసనా మాత్రములునగు రథములను రథములకు కట్టిన గుఱ్ఱములను ఆరథములు సంచరించునట్టి మార్గములను సుఖాతిశయములను పుత్రాదిలాభనిమిత్తములైన సంతోషములను మిక్కిలి అతి

శయముతోఁగూడుకొనిన సంతోషములను చిన్ననీటిగుంటలను తటాకములను నదులను సృజించుటవలన కర్త యగుచున్నది. ఇట్లు ఆత్మ వాసనను ఆశ్రయించియున్న చిన్నవృత్తి పుట్టుటకు నిమిత్తమైన కర్మకు కారణమగుట చేత ఇక్కడ ఆత్మకు ఔపచారికముగా స్వప్నమునందలి రథాధి సృష్టి కర్తృత్వము కలిగి కర్తయగుచున్నదని యాజ్ఞవల్క్యుఁడు చెప్పెను.

ఉ॥ తదేతే శ్లోకా భవన్తి॥ స్వప్నేన శారీరమభిప్రహత్యాసుప్తః సుప్తానభిచాకశీతి। శుక్రమాదాయ పునరేతి స్థానగ్ హిరణ్మయః పురుష ఏకహగ్ సః. ॥11॥

ప॥ తత్ – ఏతే – శ్లోకాః – భవన్తి॥ స్వప్నేన – శారీరం– అభిప్రహత్య – అసుప్తః – సుప్తాన్ – అభిచాకశీతి – శుక్రం – ఆదాయ – పునః – ఏతి – స్థానం – హిరణ్మయః – పురుషః – ఏకహంసః.

ప్ర॥ తత్ = ఆచెప్పఁబడిన అర్థమునందు, ఏతే = ఈముందు చెప్పఁబోయెడి, శ్లోకాః = మంత్రములు, భవన్తి = అగుచున్నవి.॥ హిరణ్మయః=హిరణ్మయస్వరూపుఁడును, (బంగారు స్వరూపమైనవాని వలెనే చైతన్యజ్యోతిస్స్వభావుఁడును), ఏకహంసః=ఏకహంస స్వరూపుఁడునగు. (ఒక్కఁడె జాగ్రత్స్వప్న ఇహపరలోకములను పొందెడివాఁడునగు), పురుషః = పురుషుఁడు, స్వయం జ్యోతిస్స్వరూపమైన ఆత్మ), స్వప్నేన = స్వప్నముచేతను, శారీరం=దేహమును, అభిప్రహత్య= కొట్టి, (నిశ్చేష్టతను పొందించి), అసుప్తః = సుప్తినిపొందనివాఁడై, (తాను లోఁబఱుపఁబడని దృక్కు మొదలైన సామర్థ్య స్వభావము కలుగుటవలన సుప్తినిపొందనివాఁడై), సుప్తాన్ = సుప్తినిపొందిన వానిని, (అంతఃకరణవృత్తిని ఆశ్రయించియున్న వాసనారూపముతో పుట్టిన బాహ్యములగు ఆధ్యాత్మికాది సమస్త భావములను), అభిచాకశీతి = చూచుచున్నాఁడు. (అలుప్తమగు ఆత్మదృష్టితో ప్రకా

శింపఁజేయుచున్నాడు). శుక్రం = తేజస్సును, (తేజస్సుగల ఇంద్రియ మాత్రరూపమును), ఆదాయ = తీసికొని, పునః = తిరిగి, స్థానం = జాగరితస్థానమును, ఏతి = పొందుచున్నాఁడు.

తా॥ చైతన్యజ్యోతి స్వభావమును జాగ్రత్స్వప్నములను ఇహ పరలోకములను పొందెడి ఒక్కటియునగు స్వయంజ్యోతి స్వరూపమైన ఈ యాత్మ, తాను నిద్రించనిదియై స్వప్నావస్థచేత ఈ దేహమును నిశ్చేష్టితను పొందించి అంతఃకరణవృత్తి నాశ్రయించి జాగ్రద్వాసనతోఁబుట్టిన రథములు మొదలైన సమస్త భావములను స్వప్నమునందుచూచుచు స్వప్నదేహమునందలి తేజస్సుగఁ పరిశుద్ధమగు ఇంద్రియమాత్రరూపమును తీసికొని మరల జాగరిత స్థానమును పొందుచున్నది.

ఉ॥ ప్రాణేన రక్షన్నవరం కులాయం బహిష్కులాయాదమృతశ్చరిత్వా । స ఈయతేఽమృతో యత్ర కామగ్ం హిరణ్మయః పురుషఏకహగ్ంసః ॥12॥

ప॥ ప్రాణేన - రక్షన్ - అవరం - కులాయం - బహిః - కులాయాత్ - అమృతః - చరిత్వా - సః - ఈయతే - అమృతః - యత్ర - కామం - హిరణ్మయః - పురుషః - ఏకహంసః.

ప్ర॥ సః = ఆప్రసిద్ధుఁడును, అమృతః = మరణములేనివాఁడును, హిరణ్మయః= తేజోమయుఁడును, ఏకహంసః =ఒక్కఁడై జాగ్రత్స్వప్నములను ఇహ పర లోకములను పొందువాఁడునగు, పురుషః = పురుషుఁడు, (ఆత్మ), ప్రాణేన = ప్రాణవాయువు చేతను, అవరం = నీచమగు, కులాయం = గూటిని, (శరీరమును), రక్షన్= కాపాడుకొనుచు, కులాయాత్ = గూటికంటె, (శరీరముకంటె), బహిః = వెలుపల. చరిత్వా = తిరిగి, (సంచరించి). (విచారించఁగా ఆత్మ శరీరమందుండియె స్వప్నమును చూచుచున్నది. అయినప్పటికిని ఆశరీరసంబంధము ఆత్మకులేక పోవుటవలన ఆశరీరమందున్న ఆకా

శమువలెనే వెలుపలతిరిగియని చెప్పఁబడుచున్నది). అమృతస్సన్ = మరణమునుపొందనివాఁడై, యత్ర = ఎక్కడ, కామం = భోగ్య పదార్థము, (భవతి = ఉన్నదో, తత్ర = అక్కడ, తం = ఆభోగ్య పదార్థమును), ఈయతే = పొందుచున్నాఁడు.

తా॥ ఓజనకుఁడా! ఆప్రసిద్ధమగు తేజోమయమైన ఆత్మ, ప్రాణాపానవ్యానోదాన సమానములను అయిదు వృత్తులుగల ప్రాణ వాయువుచేతను నీచమగు ఈ దేహమును కాపాడుచు ఆ ఆత్మ ఈ శరీరమందుండియే స్వప్నమును చూచుచున్నదైనను శరీరముఁనకు ఆత్మకు సంబంధములేక పోవుటవలన ఈ శరీరమందున్న ఆకాశము వలెనే ఈ శరీరముకంటె బైట సంచరించుచు మరణములేనివాఁడై భోగ్యపదార్థమెక్కడెక్కడ నుండునో అక్కడక్కడికి పోయి ఆ భోగ్యవస్తువును పొందుచున్నాఁడని యాజ్ఞవల్క్యుఁడు చెప్పెను.

ఉ॥ స్వప్నాన్త ఉచ్చావచమీయమానో రూపాణి దేవః కురుతే బహూని । ఉతేవస్త్రీభిః సహమోదమానో జక్షదుతేవాపి భయాని పశ్యన్ ॥13॥

ప॥ స్వప్నాన్తే - ఉచ్చావచం - ఈయమానః - రూపాణి - దేవః - కురుతే - బహూని - ఉత - ఇవ - స్త్రీభిః - సహ మోదమానః - జక్షత్ - ఉత - ఇవ - అపి - భయాని - పశ్యన్.

ప్ర॥ దేవః= ప్రకాశమానమగు ఆత్మ, స్వప్నాన్తే = స్వప్న స్థానమునందు, ఉచ్చావచం= అధికనీచములను, (అధికమగు దేవాది భావమును నీచమగు తిర్యగాది భావమును), ఈయమానః= పొందిన వాఁడై, బహూని = అనేకములగు, రూపాణి = ఆకారములను, కురుతే = చేయుచున్నాఁడు. ఉత = మఱియును, స్త్రీభిస్సహ = స్త్రీలతోఁగూడ, మోదమానఇవ = సంతోషించుచున్నవాని వలెనే, జక్షదివ = నవ్వుచున్నవాఁడువలెనే, ఉత = మఱియును, భయాని= భయారూపములగు పెద్దపులులు మొదలైనవాటిని, పశ్యన్నివాపి =

చూచుచున్నవాఁడు వలెనున్న. (భవతి = అగుచున్నాడు).

తా॥ ఇంతేకాదు. ఓజనకుఁడా! మఱియును స్వయంజ్యోతి స్వరూపమైన ఈ ఆత్మ స్వప్నస్థానమునందుచ్చనీచములగు దేవతిర్య గాది భావములను పొందుచు అనేకములగు వాసనారూపములను చేయుచు స్త్రీలతో సంతోషించు వాఁడువలెను, స్నేహితులతో నవ్వు చున్నవాఁడువలెనే, భయరూపములగు పెద్దపులులు మొదలైన వాటినిచూచుచున్నవాఁడువలెనే యుంచున్నాఁడని యాజ్ఞవల్క్యుఁడు చెప్పెను.

ఉ॥ ఆరామమస్య పశ్యన్తి నతం పశ్యతి కశ్చనేతి । తం నాయతం బోధయేదిత్యాహుః । దుర్భిషజ్యగ్ హాస్మై భవతి యమేష న ప్రతి పద్యతేఽథో ఖల్వాహుర్జాగరితదేశ ఏవాస్యైష ఇతి యాని హ్యేవ జాగ్రత్పశ్యతి తాని సుప్త ఇత్యత్రాయంపురుషః స్వయంజ్యోతిర్భ వతి సో హం భగవతే సహస్రం దదామ్యత ఊర్ధ్వం విమోక్షాయ బ్రూహీతి. ॥14॥

ప॥ ఆరామం - అస్య - పశ్యన్తి న - తం - పశ్యతి కః - చన - ఇతి - తం - న - ఆయతం - బోధయేత్ - ఇతి - ఆహుః- దుర్భిషజ్యం - హ - అస్మై - భవతి - యం - ఏషః - న - ప్రతిప ద్యతే - అథో - ఖలు - ఆహుః - జాగరితదేశః - ఏవ - అస్య - ఏషః - ఇతి - యాని - హి - ఏవ - జాగ్రత్ - పశ్యతి - తాని- సుప్తః - ఇతి - అత్ర - అయం - పురుషః - స్వయంజ్యోతిః - భవతి - సః - అహం - భగవతే - సహస్రం - దదామి - అతః - ఊర్ధ్వం - విమోక్షాయ - బ్రూహి - ఇతి

ప్ర॥ (లౌకికాః = జనులు), అస్య = ఈ ఆత్మయొక్క, ఆరామం=క్రీడాస్థానమును, (గ్రామనగరస్త్రీఅన్నాదులను), పశ్యన్తి= చూచుచున్నారు. కశ్చన = ఎవఁడును, తం= ఆఆత్మను, నపశ్యతి= చూడడములేదు. ఆయతం = గాఢసుప్తినిపొందిన, తం= ఆఆత్మను,

నబోధయేదితి = లేపకూడదని, (కేచిత్ = కొందఱు), ఆహుః = చెప్పిరి. (అట్లా లేపినప్పుడు), ఏషః = ఈఆత్మ, యం = ఏఇంద్రియ ప్రదేశమును, నప్రతిపద్యతే = పొందదో, (తం=ఆఇంద్రియ ప్రదేశ మును గూర్చి), అస్మై= ఈదేహముకొఱకు, దుర్భిషజ్యంహా = దుష్టమైన వైద్యముకలుగుట, భవతి = అగుచున్నది. ఇతి = గనుక. (ఆత్మ స్వప్నమునందు స్వయంజ్యోతి స్వరూపమైనది). అథోఖలు = మఱియును. (అన్యే.= కొందఱు), అస్య = ఈ ఆత్మకు, ఏషః = ఈస్వప్నస్థానము, జాగరితదేశవేతి=జాగరితస్థానమేయని, ఆహుః= చెప్పిరి. (ఇదిసరియైనదికాదు ; ఏలయనగా, జనుఁడు), జాగ్రత్ = జాగరితస్థానముగలవాఁడై, యానిహ్యేవ= వేనినె, పశ్యతి =చూచుచున్నాఁడో, సుప్తః = నిద్రించినవాఁడై, తాన్యేవ = వానినె, పశ్యతి=చూచుచున్నాఁడు. ఇతి=గనుక, (జాగ్రత స్వప్నముకాదు). అత్ర = ఈస్వప్నమునందు, అయంపురుషః= ఈపురుషుఁడు, (ఆత్మ) స్వయంజ్యోతిః = స్వయంప్రకాశమగు తేజస్సు, భవతి = అగుచున్నది (అని యాజ్ఞవల్క్యుఁడు బోధించగా), సః= ఆ బోధింపఁబడిన, అహం = నేను, భగవతే = నీకొఱకు, (గవాం = గోవులయొక్క), సహస్రం = వేయింటిని, దదామి = ఇచ్చుచున్నాను. అతఊర్ధ్వం = అటుతరువాత, విమోక్షాయ = మోక్షముకొఱకు, బ్రూహి = చెప్పుమా, ఇతి = అని, (జనకమహారాజు పలికెను).

తా॥ ఓజనకుఁడా ! జనులు ఈఆత్మకు క్రీడాస్థానములగు గ్రామనగర స్త్రీలను శరీరము మొదలైన వాటిని చూచుచున్నారుగాని ఎవడును ఆ ఆత్మను చూచుటలేదు. ఇదిగాక కొందఱు వైద్యశాస్త్రజ్ఞులుగాఢ సుషుప్తిపొందిన ఆ యాత్మను లేపకూడదు. లేపినయెడల ఆత్మచక్షు రాదీంద్రియ ప్రదేశములను క్రమముగా పొందదు. అప్పుడు ఆ ఇంద్రియదేశములకు గ్రుడ్డి, చెవుడు మొదలైనవి కలుగును గనుక దేహము దుఃఖముతో చికిత్సచేయఁగ

దగినదియగును అని చెప్పెదరు. కాఁబట్టియె ఇదివరకు ఆత్మ, స్వప్న రూపమై మృత్యు స్వరూపమైన దేహేంద్రియాదులను అతిక్రమించి స్వయంజ్యోతి స్వరూపమై యున్నదని చెప్పఁబడినది. ఇట్లు ఆత్మ స్వప్నమునందు స్వయంజ్యోతి స్వరూపమైనది. ఇంకను మఱికొందఱు ఆత్మకు జాగరితస్థానమె ఈస్వప్నస్థానమని చెప్పెదరు. అదిసరియైనది కాదు. ఏలయనిన, ఆత్మ జాగరితస్థానమునందు చక్షురాదీంద్రియము లతోఁగూడుకొని ఏనుఁగులు గుఱ్ఱములు రథములు మొదలైన వాటిని చూచుచున్నది. తిరిగి ఆ ఆత్మ స్వప్నమునందు చక్షురాదీంద్రియ ములు లేకుండనే స్వయంజ్యోతి రూపమై జాగ్రద్వాసనతో స్వకల్పి తములైన ఆ ఏనుఁగులు గుఱ్ఱములు రథములు మొదలైన వాటిని చూచుచున్నది. ఇట్లు జాగ్రత్స్వప్నములకు భేదము కలుగుట వలన స్వప్నజాగ్రతలు రెండును వేరైనవిగాని ఒకటికాదు. ఈ ఆత్మస్వప్న మునందు స్వయంజ్యోతి స్వరూపమగుచున్నదని యాజ్ఞవల్క్యుఁడు మోక్షములో ఏకదేశముగా నుండెడి ఆత్మయొక్క స్వయంజ్యోతి స్వరూపమునుబోధించగా, ఆ జనకమహారాజు, ఓయాజ్ఞవల్క్యుడా! నేను నీకొఱకు వేయిగోవులను ఇచ్చుచున్నానని చెప్పి యిఁకమీఁదట ఇతర సాధనము అక్కఱలేదు. మోక్షముకొఱకైన సాధనమును చెప్పుమాయని అడిగెను,

ఉ॥ స వా ఏష ఏతస్మిన్ సమ్ప్రసాదే రత్వా చరిత్వా దృష్ట్వైవ పుణ్యం చ పాపం చ । పునః ప్రతిన్యాయం ప్రతియోన్యాద్రవతి స్వప్నాయైవ స యత్తత్రకించిత్పశ్యత్యనన్వాగతస్తేన భవత్య సఙ్గో హ్యయం పురుష ఇత్యేవమేవైత ద్యాజ్ఞవల్క్యసోఽహం భగవతేసహస్రందదామ్యత ఊర్ధ్వం విమోక్షాయైవ బ్రూహీతి.15

ప॥ సః – వై – ఏషః – ఏతస్మిన్ – సమ్ప్రసాదే – రత్వా– చరిత్వా – దృష్ట్వా – ఏవ – పుణ్యం – చ – పాపం – చ –పునః–

ప్రతిన్యాయం - ప్రతియోని - ఆద్రవతి - స్వప్నాయ - ఏవ - సః - యత్ - తత్ర - కించిత్ - పశ్యతి - అనన్వాగతః - తేన - భవతి - అసఙ్గః - హి - అయం - పురుషః - ఇతి - ఏవం - ఏవ - ఏతత్ - యాజ్ఞవల్క్య - సః - అహం - భగవతే - సహస్రం - దదామి - అతఊర్ధ్వం - విమోక్షాయ - ఏవ - బ్రూహి - ఇతి.

ప్ర॥ సవై = ఆస్వయంజ్యోతిస్స్వరూపమైన, ఏషః = ఈ ఆత్మ, (స్వప్నమునుండి సుషుప్తినిపొంద నిశ్చయించినవాడై స్వప్నమునందే). రత్వా = అనురాగమునుపొంది, (మిత్రబంధుజన దర్శనాదులతో అనురాగమునుపొంది), చరిత్వా = విహరించి, (అనేకవిధముల విహరించి శ్రమనుపొంది), పుణ్యంచ = పుణ్యఫలమును, పాపంచ = పాపఫలమును, దృష్ట్వైవ = చూచియె (స్వప్నానంతరము), ఏతస్మిన్ = ఈ, సమ్ప్రసాదే = సుషుప్తియందు, (జాగ్రతయందు దేహేంద్రియములయొక్క అనేక వ్యాపారములయొక్క కూడికవలనఁబుట్టిన కాలుష్యమును వదిలి ఆ దేహేంద్రియాదులను జాగ్రద్వాసనలగు స్వప్న వ్యాపారములనువిడిచి మిక్కిలి నిర్మలమైన గాఢ సుషుప్తి సమ్ప్రసాదమనఁబడును ; స్థిత్వా = ఉండి), పునః = తిరిగి, స్వప్నాయైవ = స్వప్నముకొఱకే. ప్రతిన్యాయం = న్యాయప్రకారము, (ఎట్లువచ్చెనోఅట్లాగే), ప్రతియోని = ప్రతిస్థానమును, ఆద్రవతి = పొందుచున్నది. సః = ఆ ఆత్మ, తత్ర = ఆ స్వప్నస్థానమునందు, యత్కించిత్ = ఏ పుణ్యపాపఫలమును, పశ్యతి = చూచుచున్నాఁడో. తేన = ఆ పాపఫలముతో; అనన్వాగతః = అనుసరించిపొందనివాడు, భవతి = అగుచున్నాఁడు. (గనుక), అయంపురుషః = ఈపురుషుఁడు, (ఈ ఆత్మ), అసఙ్గోహి = అసంగుడే. (దేనితోను కూడుకొననివాఁడు. అందువలన ఆత్మ మరణధర్మములేనివాఁడు), ఇతి = అని, (యాజ్ఞవల్క్యుఁడుచెప్పెను). సః = ఆ జనకమహారాజు, హేయాజ్ఞవల్క్య = ఓ యాజ్ఞవల్క్యుఁడా!

ఏతత్ = ఇది, ఏవమేవ = ఈ ప్రకారముగానే, (అని అంగీకరించి), అహం = నేను, (గవాం = గోవులయొక్క), సహస్రం = వేయింటిని, భగవతే = నీకొఱకు, దదామి = ఇచ్చుచున్నాను. అత ఊర్ధ్వం = అటుతర్వాత. విమోక్షాయైవ = మోక్షముకొఱకే, బ్రూహీతి = చెప్పుమాయని (అడిగెను).

తా॥ ఇంతకుపూర్వము శ్రుతి, స్వప్నమునందు స్వయంజ్యోతి స్వరూపమైనదని ప్రత్యక్షముగా చెప్పఁబడినది. అట్లాగును ఆ ఆత్మ స్వప్నమునందు మృత్యువుయొక్క రూపములగు దేహేంద్రియాదుల నతిక్రమించియున్నాఁడు అని చెప్పఁబడినదేగాని మృత్యువును అతిక్రమించియున్నాఁడని చెప్పలేదు. కాఁబట్టి, ఆత్మ, స్వభావమునుండి మృత్యువుచేత బద్ధింపఁబడియున్నాఁడు. అందువలన ఆత్మకు మోక్షము ఉపయోగముకాదు అని శంకచేయుఁగా, స్వభావముగావుండున దేదియు నెప్పుడును విడిచిపోనేరదు. ఆత్మయైతే కొన్ని సమయముల యందు మృత్యువును విడిచియున్నది. ఇందుచేతనే మృత్యువు ఆత్మధర్మముకాదు. గనుక ఆత్మకు మోక్షము ఉపయోగమగుచున్నది. దీనినె మిక్కిలి చూపించుటకు యాజ్ఞవల్క్యుఁడు జనకునిచేత మోక్షసాధనమునే చెప్పుమని ప్రార్థింపఁబడినవాఁడై చెప్పుచున్నాఁడు. ఓ జనకుఁడా! స్వప్నమునందు స్వయంజ్యోతి స్వరూపముగా చూపింపఁబడిన ఈ ఆత్మస్వప్నమునుండి సుషుప్తినిపొంద నిచ్ఛయించినవాఁడై స్వప్నమునందే మిత్రబంధుజనదర్శనాదులతో అనురాగమునుపొంది అనేకవిధముల విహరించి శ్రమనుపొంది పుణ్యాపాపఫలములనుచూచియే స్వప్నానంతరము ఈ సుషుప్తిని పొందియుండి తిరిగి స్వప్నస్థానముకొఱకు పూర్వము పొందినప్రకారము ప్రతిస్థానమును పొందుచున్నది. ఆ స్వయంజ్యోతిస్వరూపమైన ఆత్మ ఆ స్వప్నమందు చూచిన పుణ్యాపాపఫలములతో బంధింపఁబడదు. ఆ ఆత్మ అసంగమైనది. అందువల్లనే మరణధర్మములేనిదియగుచు

న్నది. అని యాజ్ఞవల్క్యుఁడు మోక్షపదార్థములో ఏక దేశముగా నుండెడి కర్మ వివేకము చూపించగా ఇది సరేయని ఒప్పుకొని జనక మహారాజు నీకొఱకు వేయిగోవులను ఇచ్చుచున్నానని చెప్పి ఇఁక మీఁదట మోక్షముకొఱకైన సాధనమునె చెప్పవలయునని తిరిగి అడిగెను.

ఉ॥ స వా ఏష ఏతస్మిన్ స్వప్నే రత్వా చరిత్వా దృష్ట్వైవ పుణ్యం చ పాపం చ పునః ప్రతిన్యాయం ప్రతియోన్యాద్రవతి బుద్ధాన్తాయైవ స యత్తత్ర కించిత్పశ్యత్యనన్వాగతస్తేన భవత్యసఙ్గో హ్యయం పురుష ఇత్యేవమేవైతద్యాజ్ఞవల్క్య సోఽహం భగవతే సహస్రం దదామ్యత ఊర్ధ్వం విమోక్షాయైవ బ్రూహీతి.16

ప॥ సః - వై - ఏషః - ఏతస్మిన్ - స్వప్నే - రత్వా - చరిత్వా - దృష్ట్వా - ఏవ - పుణ్యం - చ - పాపం - చ - పునః- ప్రతిన్యాయం - ప్రతియోని - ఆద్రవతి - బుద్ధాన్తాయ - ఏవ - సః - యత్ - తత్ర - కించిత్ - పశ్యతి - అనన్వాగతః - తేన - భవతి - అసఙ్గః - హి - అయం - పురుషః - ఇతి - ఏవం -ఏవ - ఏతత్ - యాజ్ఞవల్క్య - సః - అహం - భగవతే - సహస్రం - దదామి - అతఊర్ధ్వం - విమోక్షాయ - ఏవ - బ్రూహి - ఇతి.

ప్ర॥ సవై = ఆ స్వయంజ్యోతిస్స్వరూపమైన, ఏషః=ఈ ఆత్మ, ఏతస్మిన్స్వప్నే = ఈస్వప్నస్థానమునందు రత్వా = అనురాగమునుపొంది, చరిత్వా = సంచరించి, పుణ్యంచ = పుణ్యఫలమును, పాపంచ = పాపఫలమునున్ను, దృష్ట్వైవ = చూచియె, పునః = తిరిగి బుద్ధాన్తాయ = జాగరితస్థానముకొఱకు, ప్రతిన్యాయం=న్యాయప్రకారము, ప్రతియోని = ప్రతిస్థానమును, ఆద్రవతి = పొందుచున్నాడు. సః = ఆ ఆత్మ, తత్ర = ఆ స్వప్నస్థానమునందు, యత్కించిత్ = దేనినైనను (పుణ్యపాపఫలమునైనను), పశ్యతి =

చూచుచున్నాఁడో, తేన = ఆ పుణ్యపాపఫలముతో అనన్వాగతః= అనుసరించిపొందనిది, భవతి = అగుచున్నది. అయంపురుషః = ఈ పురుషుడు, (ఈఆత్మ), అసఙ్గోహి = అసంగమైనది, ఇతి = అని (యాజ్ఞవల్క్యుఁడు చెప్పగా), సః=ఆజనకమహారాజు, హేయాజ్ఞవల్క్య=ఓయాజ్ఞవల్క్యుఁడా! అహం= నేను, భగవతే= నీకొఱకు, (గవాం = గోవులయొక్క), సహస్రం = వేయింటిని, దదామి = ఇచ్చుచున్నాను. అతఊర్ధ్వం = ఇంకమీఁదట, విమోక్షాయైవ = మోక్షముకొఱకే, బ్రూహీతి = చెప్పుమాయని (అడిగెను).

తా॥ ఓజనకుఁడా! ఆస్వయంజ్యోతి స్వరూపమైన ఆత్మ, స్వప్నమునందు స్నేహితులు మొదలైన వారితో అనురాగమును పొంది అనేకవిధముల క్రీడించి శ్రమను పొంది పుణ్యపాపఫలములను చూచియె తిరిగి జాగ్రతకొఱకు యథాప్రకారము ప్రతిస్థానమును పొందుచున్నాఁడు. ఆ ఆత్మ స్వప్నమందు చూచిన పుణ్యపాప ఫలముతో బంధింపఁబడనిదే యగుచున్నది. ఆత్మ అసంగమైనది గనుకనే మరణధర్మము లేనిది యగుచున్నదని యాజ్ఞవల్క్యుఁడు చెప్పెను. అప్పుడు జనకమహారాజు ఓయాజ్ఞవల్క్యుఁడా! ఇది సరేయని ఒప్పుకొని నీ కొఱకు నేను వేయిగోవులను ఇచ్చుచున్నాను. ఇఁకమీఁదట నాకు మోక్షముకొఱకైన సాధనమును చెప్పుమాయనితిరిగి అడిగెను.

ఉ॥ స వా ఏష ఏతస్మిన్ బుద్ధాన్తే రత్వా చరిత్వా దృష్ట్వైవ పుణ్యం చ పాపం చ పునః ప్రతిన్యాయం ప్రతియోన్యాద్రవతి స్వప్నాన్తాయైవ. ॥17॥

ప॥ సః – వై – ఏషః – ఏతస్మిన్ – బుద్ధాన్తే – రత్వా – చరిత్వా – దృష్ట్వా – ఏవ – పుణ్యం – చ – పాపం – చ పునః – ప్రతిన్యాయం – ప్రతియోని – ఆద్రవతి – స్వప్నాన్తా – య – ఏవ.

ప్ర॥ సవై = అస్వయంజ్యోతిస్స్వరూపమైన, ఏషః = ఈ ఆత్మ, ఏతస్మిన్ = ఈ, బుద్ధాన్తే= జాగరిత స్థానమునందు, రత్వా=

అనురాగమునుపొంది. చరిత్వా = సంచరించి, పుణ్యంచ = పుణ్య ఫలమును, పాపంచ= పాపఫలమును దృష్ట్వైవ= చూచియె, పునః= తిరిగి, స్వప్నాన్తాయైవ = స్వప్నస్థానము కొఱకే, ప్రతిన్యాయం = న్యాయప్రకారము, ప్రతియోని = ప్రతిస్థానమును, ఆద్రవతి = పొందుచున్నాఁడు.

తా॥ ఓజనకుఁడా! స్వయంజ్యోతిః స్వరూపమైన ఆత్మ స్వప్న మందువలెనే ఈ జాగరిత స్థానమునందును బంధు మిత్రాదులతో అనురాగమును అనుభవించి నానావిధముగా క్రీడించి శ్రమను పొంది పుణ్య పాపఫలమును చూచియే పుణ్యపాప లములచేత బద్ధుఁడు గాక అసంగుఁడై తిరిగి స్వప్నస్థానము కొఱకు యథాప్రకారము ప్రతి స్థానమును పొందుచున్నాఁడు.

ఉ॥ తద్యథా మహామత్స్య ఉభే కూలే అను సఞ్చరతి పూర్వం
　చాపరం చైవ మేవాయం పురుష ఏతావుభావన్తావను సఞ్చరతి
　స్వప్నాన్తం చ బుద్ధాన్తం చ.　18

ప॥ తత్ - యథా - మహామత్స్యః - ఉభే - కూలే - అను సఞ్చరతి - పూర్వం - చ - అపరం - చ - ఏవం- ఏవ - అయం- పురుషః - ఏతౌ - ఉభౌ - అన్తౌ - అనుసఞ్చరతి - స్వప్నాన్తం - చ - బుద్ధాన్తం - చ,

ప్ర॥ తత్ = అది, యథా = ఎట్లనఁగా, మహామత్స్యః = గొప్పచేఁప పూర్వం చాపరంచ = ఇవతల అవతలనుండెడి, ఉభే = రెండైన, కూలే = ఒడ్డులను, అనుసఞ్చరతి = అనుసరించి తిరుగు చున్నది. ఏవమేవ = ఈ ప్రకారముగానే, అయంపురుషః = ఈ పురుషుఁడు, (ఈఆత్మ), స్వప్నాన్తంచ = స్వప్నస్థానమును, బుద్ధాన్తంచ = జాగరితస్థానమునను ఏతౌ = ఈ, ఉభౌ = రెండైన, అన్తౌ = స్థానములను, అనుసఞ్చరతి=అనుసరించి తిరుగుచున్నాఁడు.

తా॥ ఈ పూర్వముచెప్పిన ప్రకారము స్వయంజ్యోతి స్వరూ

పము'ను దేహేంద్రియ విలక్షణమును అసంగమునగు ఈఆత్మ లోక మునందు గొప్పచేప నదీప్రవాహముచేతను తీసికొనిపోబడినదై స్వేచ్ఛగా సంచరించుచు నదియొక్క ఇవతలి అవతలి ఒడ్డులను క్రమ ముగా అనుసరించి తిరుగునట్లు సుషుప్తి స్వప్నజాగరములను పొం దుచు స్వప్నమునుండి జాగరిత స్థానమును, జాగరిత స్థానమునుండి స్వప్నమును, పొందుచు, అనాత్మధర్మమగు దేహేంద్రియ సంఘా తముకంటె వేరై యుంచున్నది.

ఉ॥ తద్యథాస్మిన్నాకాశే శ్యేనో వా సుపర్ణోవా విపరిపత్య శ్రాన్త స్సగ్ం హత్య పక్షౌ సల్లయాయైవ ధ్రియత ఏవమేవాయం పురుష ఏతస్మా అన్తాయ ధావతి యత్ర సుప్తో న కంచన కామం కామ యతే న కంచన స్వప్నం పశ్యతి ॥19॥

ప॥ తత్ - యథా - అస్మిన్ - ఆకాశే - శ్యేనః - వా - సువర్ణః - వా - విపరిపత్య - శ్రాన్తః - సంహత్య - పక్షౌ - సల్ల యాయ - ఏవ - ధ్రియతే - ఏవం - ఏవ - అయం - పురుషః - ఏతస్మై - అన్తాయ - ధావతి - యత్ర - సుప్తః - న - కం - చన - కామం - కామయతే - న - కం - చన - స్వప్నం - పశ్యతి,

ప్ర॥ తద్యథా = అదియెట్లనగా, శ్యేనోవా = డేగైనను, సుపర్ణోవా = గరుత్మంతుడైనను, అస్మిన్ = ఈ, ఆకాశే = ఆకా శమునందు, (ఈ భౌతికాకాశమునందు), విపరిపత్య = విహరించి, శ్రాన్తః = శ్రమనుపొందినదై, పక్షౌ = రెక్కలను, సంహత్య = ఒకటిగాచేర్చి, యథా = ఏప్రకారము, సల్లయాయైవ = గూటికో అకే, ధ్రియతే = ధరించుచున్నదో, (స్వకీయముగానే గూడుధరించు చున్నదో), ఏవమేవ = ఈప్రకారముగానే, అయం = ఈ; పురు షః = పురుషుడు, (ఆత్మ), యత్ర = ఏస్థానమునందు, సుప్తః = నిద్రించినదై, కంచన = ఒకానొక, కామం = కామమును, నకా

మయ తే = కోరదో, కంచన = ఒకానొక, స్వప్నం=స్వప్నమును, నపశ్యతి = చూడదో, ఏతస్మై = ఇటువంటి, అన్తాయ = స్థానము కొఱకు, ధావతి = పోవుచున్నది.

తా॥ జాగరితస్థానమునందాత్మ అవిద్యచేత సంగముతోను మృత్యువుతోను దేహేంద్రియ సంఘాతముతోను కూడుకొనదై చూడబడుచున్నది. స్వప్నమునందు కామముతోఁ గూడుకొనినదై మృత్యురూపములగు దేహేంద్రియాదులను విడిచినదై పొందబడు చున్నది. సుషుప్తియందు నిర్మలమై అసంగముగా నుండియున్నది. అట్లు సుషుప్తియందు ఆసంగముగా నుండెడి ఆత్మను దృష్టాంత పూర్వకముగా తెలియఁజేయుటకు చెప్పుచున్నాఁడు. అది యెట్లనఁగా, ఓ జనకమహారాజా! డేగయును గరుత్మంతుడును భూతసంబంధమగు ఈ ఆకాశమునందు మిక్కిలి సంచరించి బడలికను పొందినవై ఆ ఆయాసమును తీర్చికొనుటకు తమంతట తామె రెక్కలను ఒకటిగా చేర్చుకొని గూటిని పొందినట్లు ఈ స్వయంజ్యోతి స్వరూపమును దేహేంద్రియ విలక్షణమును అసంగమునగు ఆత్మ జాగ్రత్స్వప్నములయందలి శ్రమ నివారించుకొనుటకు ఏ కామమును ఏ స్వప్నమును లేనిదియును సర్వసంసార ధర్మవిలక్షణమును సమస్తమైన క్రియాకారకఫలాయాస శూన్యమునగు తన్ను తాను పొందుచున్నది.

ఉ. తా వా అస్యైతా హితా నామ నాడ్యో యథా కేశః సహస్రధాభిన్నస్తావ తాణిమ్నాతిష్ఠన్తి శుక్లస్య నీలస్య పిఙ్గళస్య హరితస్య లోహితస్య పూర్ణా అథ యత్రైనం ఘ్నన్తీవ జినన్తీవ హస్తీవ విచ్ఛాయయతి గర్తమివ పతతి । యదేవ జాగ్రద్భయం పశ్యతి తదత్రా విద్యయా మన్యతే అథ యత్ర దేవ ఇవ రా జేవాహమే వేదగ్ం సర్వోఽస్మీతి మన్యతే సోఽస్యపరమో లోకః. ॥20॥

ప॥ తాః – వై – అస్య – ఏతాః – హితానామనాడ్యః – యథా – కేశః – సహస్రధా – భిన్నః – తావతా – అణిమ్నా –

తిష్ఠన్తి – శుక్లస్య – నీలస్య – పిఙ్గళస్య – హరితస్య – లోహితస్య – పూర్ణాః – అథ – యత్ర – ఏనం – ఘ్నన్తి – ఇవ – జినన్తి – ఇవ– హస్తీ – ఇవ – విచ్ఛాయయతి – గర్తం – ఇవ – పతతి – యత్ – ఏవ – జాగ్రత్ – భయం – పశ్యతి – తత్ – అత్ర – అవిద్యయా– మన్యతే – అథ – యత్ర – దేవః – ఇవ – రాజా – ఇవ – అహం– ఏవ – ఇదం – సర్వః – అస్మి – ఇతి – మన్యతే – సః – అస్య – పరమః – లోకః,

ప్రః అస్య = శిరః పాణ్యాదిలక్షణమైన ఈ పురుషునియొక్క, తాః = ఆ ప్రసిద్ధములగు, ఏతాః = ఈ, హితానామనాడ్యః = హితానామకములగు నాడులు, (నరములు), సహస్రధా = వేయి విధములుగా, భిన్నః = ఖండింపఁబడిన, కేశః = వెంట్రుక, యథా= ఏ ప్రకారము (సూక్ష్మమగునో), తావతా అణిమ్నా = అటువంటి సూక్ష్మరూపముతో, శుక్లస్య = తెల్లని రంగు యొక్కయు, నీలస్య = నల్లని రంగు యొక్కయు, పిఙ్గళస్య = పసుపురంగు యొక్కయు, హరితస్య = ఆకుపచ్చరంగు యొక్కయు, లోహితస్య = ఎఱుపు రంగు యొక్కయు, (రసైః = రసముల చేతను), పూర్ణాః = నిండినవై, తిష్ఠన్తి = ఉండియున్నవి. (వేయి విధములుగా ఖండింపఁబడిన వెంట్రుకవలెనే సూక్ష్మములగు నాడులు వాతపిత్త శ్లేష్మములు పరస్పరము కూడుకొనుటవలన కలిగెడి తర తమ విశేషము నుండి శుక్ల నీల పీతాది అనేక రంగులు గల రసములచే నిండింపఁ బడినవగుచున్నవి). అథ = ఇట్లగుచుండగా, యత్ర=ఏకాలమునందు, ఏనం = స్వప్నదృక్కుగల ఈ ఆత్మను (శత్రువులు మొదలైనవారు), ఘ్నన్తీవ = కొట్టుచున్నట్టు వలెనున్ను, జినన్తీవ=(ఇతరులు) స్వాధీన పఱుచుకొనుచున్నట్టువలెనున్ను, హస్తీ=ఏనుఁగు, విచ్ఛాయయతీవ= పరుగెత్తుకొని వచ్చుచున్నది వలెనున్ను, గర్తం = గుంటనుగూర్చి, పతతీవ = పడినదానివలెనున్ను, (నీచమగు అంతఃకరణవృత్తి ఆశ్ర

యముగాఁగల అటునంటి మిథ్యయగు జాగ్రద్వాసన ఈఆత్మను కలుగు చున్నది). (ఈ ఆత్మ), జాగ్రద్భయం = జాగరిత స్థానమునందు భయ రూపమగు, యదేవ = దేనినే, (ఏనుఁగు మొదలైన చిహ్నములుగల భయమునే), పశ్యతి = చూచుచున్నదో, తత్=దాన్ని, అత్ర=ఈ స్వప్నమునందు, అవిద్యయా=అవిద్యచేతను, (ఏనుఁగులు మొదలైనవి లేకుండానే మిథ్యగా పుట్టిన అజ్ఞానముచేత), మన్యతే = తలంచు చున్నాఁడు, అథ = తిరిగి, యత్ర = ఏ కాలమునందు, దేవఇవ = దేవుఁడువలెనున్ను, రాజేవ = రాజువలెనున్ను, ఇదంసర్వః = ఈ సమస్తము, అహమేవ = నేనే. అస్మి = అగుచున్నాను, ఇతి = అని, మన్యతే=తలంచుచున్నదో, (ఎప్పుడు జాగరిత కాలమునందు అవిద్య క్షయమై సర్వాత్మ విషయకమైన ఈ విద్య పుట్టునో అప్పుడు జాగ్ర ద్వాసనచే స్వప్నమునందును తన్ను దేవునివలెనున్ను రాజువలెనున్ను ఈ సర్వము తానే అయితినని తలంచుచున్నాడు). సః=అది, అస్య= ఈ ఆత్మకు, పరమః = శ్రేష్ఠమైన, లోకః = లోకము (మోక్షము).

తా॥ సమస్తమైన అనర్థములకు బీజమైన అవిద్యయొక్క నిజ మును నిర్ధారణ చేయుటకు చెప్పఁబడుచున్నది. శిరస్సును హస్తమును పాదములు మొదలైనవి యే గుఱుతుగాఁగల ఈ పురుషునియొక్క హితనామకములగు నరములు వేయి విధముల ఖండింపఁబడిన వెంట్రుక వలెనే మిక్కిలి సూక్ష్మరూపములై యున్నవి. పురుషుఁడు భక్షించిన అన్నముయొక్క పరిణామ విశేషము, వాతము అతిశయించినపుడు నల్లగానున్ను, పిత్త మతిశయ మగునపుడు పసుపుగానున్ను, శ్లేష్మ మతిశయించునపుడు తెల్లగానున్ను, పిత్తము తగ్గినప్పుడు ఆకుపచ్చగా నున్ను, వాతపిత్త శ్లేష్మములు సమానముగా నుండునపుడు ఎఱ్ఱగా నున్ను అగుచున్నది. ఇట్లు వాతాది ధాతువులకు అన్యోన్యముకూడిక యొక్క తారతమ్య విశేషమువల్లనున్ను సమానతవల్లనున్ను అన్న రసము బహుచిత్రములుగా నగుచున్నవి. అట్టి అన్నిరసములచే

వ్యాప్తములైన ఆ నరములు ఆ రంగు కలవే యగుచున్నవి. ఇట్లు శుక్లాదిరస పూర్ణములును సమస్త దేహమును వ్యాపించినవియు నగు ఈ సూక్ష్మనాడులయందు పంచభూతములును, జ్ఞానేంద్రియ కర్మేంద్రియములు పదియును, ప్రాణమును అంతఃకరణమును ఇవి పదియేడును స్వరూపముగాఁగల లింగశరీర మగుచున్నది. వాసనలకు ఆశ్రయమును సూక్ష్మమగుటవలన స్వచ్ఛమును స్ఫటికమణీ సమానమునగు ఆ లింగ శరీరము స్వప్నమునందు ఆ నాడులను పొందిన శుక్లాది రసోపాధుల యొక్క కూడికయొక్క స్వాధీనమునుండి ధర్మాధర్మ ప్రేరితమై పుట్టిన వృత్తి విశేషము కలదియై స్త్రీలు రథములు ఏనుఁగులు మొదలైన ఆకార విశేషములుగల వాసనలు మొదలైన వాటితో ప్రకాశించుచున్నది. ఇట్లుండగా, ఆ లింగశరీరాభిమానముగల స్వయం జ్యోతి స్వరూపమైన ఆత్మ, జాగ్రద్వాసనగల అంతఃకరణముతోఁ గూడుకొనినదై శత్రువులు దొంగలు మొదలైనవారిచే కొట్టఁబడుచున్నదివలెనున్ను ఇతరులచే స్వాధీనము చేసికోఁబడుచున్నదివలెనున్ను ఏనుఁగు తరుముకొని వచ్చుచున్నది వలెనున్ను పాడుపడిన నూతి గుంటలు మొదలైన వాటియందు పడుచున్నది వలెనున్ను భయమును పొందుచున్నది. జాగ్రతయందు ఆత్మ వేటివేటిని భయమును గాఁజూచునో వాటివాటిని ఈ స్వప్నమునందును ఆయా వస్తువులు లేకుండానే అజ్ఞానముచేత భయమునుగా తలంచుచున్నది. తిరిగి జాగ్రతయందు జ్ఞానముచేత ఆత్మ తన్నె దేవునిగాను తన్నె రాజునుగాను ఈ సర్వము తన్నుగానే భావించుటచేత తనకు వేఱుగా సర్వమును తోఁపింపఁజేసెడి అజ్ఞానము క్షీణించగా స్వప్నమునందును ఈ సర్వము నేనై తినని తలంచుచున్నది. ఆ సర్వాత్మభావమే స్వయం జ్యోతి స్వరూపమైన ఆత్మకు స్వాభావికమగు శ్రేష్ఠమైన ఆత్మభావము. ఇదియే మోక్షము ఈ సమస్తము ఆత్మస్వరూపమైన తనయందు రజ్జువునందు సర్పమువలెనే వేఱుగా తోఁపింపఁజేసెడి అవిద్య, రజ్జు

జ్ఞానముచేత సర్వజ్ఞానము పోయినట్టు ఆత్మజ్ఞానముచేత నశించి ఈ సర్వము నేనై తినినెడి జ్ఞానరూపమైన విద్య దృఢమగుచుండగా ఈ మోక్షము, స్వయంజ్యోతిస్వరూపమైన ఆత్మ స్వప్నమునందు ప్రత్యక్షముగా పొందఁబడినట్టు పొందఁబడుచున్నది.

ఉ॥ తద్వా అస్యైతదతిచ్ఛన్దా అపహతపాప్మాఽభయగ్ రూపం । తద్యథా ప్రియయా స్త్రియా సమ్పరిష్వక్తో న బాహ్యం కించన వేద నాన్తర మేవమేవాయం పురుషః ప్రాజ్ఞేనాత్మనా సమ్పరిష్వక్తో న బాహ్యం కించన వేద నాన్తరం । తద్వా అస్యై తదాప్తకామమాత్మ కామమకామగ్ రూపగ్ శోకాన్తరమ్. ॥21॥

బ॥ తత్ – వై – అస్య – ఏతత్ – అతిచ్ఛన్దా – అపహత పాప్మా – అభయం – రూపం – తత్ – యథా – ప్రియయా – స్త్రియా – సమ్పరిష్వక్తః – న – బాహ్యం – కించన – వేద – న- అన్తరం – ఏవం – ఏవ అయం – పురుషః – ప్రాజ్ఞేన – ఆత్మనా – సమ్పరిష్వక్తః – న – బాహ్యం – కించన – వేద – న – అన్తరం – తత్ – వై – అస్య – ఏతత్–ఆప్తకామం – అకామం–ఆత్మకామం–రూపం–శోకాన్తరం

ప్ర॥ అస్య = ఈ ఆత్మకు, తద్వై = అదియె, (రూపం = రూపము), ఎక్కడ ఆత్మ సుషుప్తిని పొందినదై కామమును కోరక స్వప్నమును చూడకయుండునో అదియె ఆత్మకు రూపము), ఏతత్ = ఇది, అతిచ్ఛన్దా = అతిక్రమించిన కోరిక కలదియును (కామరహిత మైనదియును), అపహతపాప్మా = పోఁగొట్టఁబడిన పాపము గలదియును, (ధర్మాధర్మవర్జితమైనదియును), అభయం = భయరహిత మైనదియునగు, రూపం = స్వరూపము, తత్ = అక్కడ, (లోకే = లోకమునందు, జనః = జనుఁడు), యథా = ఏ ప్రకారముగాను, ప్రియయా = ఇష్టురాలైన, స్త్రియా = స్త్రీతో, సమ్పరిష్వక్తః = మిక్కిలి ఆలింగనము చేసికోఁబడినవాఁడై, బాహ్యం = వెలపలయైన

దానిని, కించన = కొంచెమును, నవేద = తెలిసికొనఁడో, ఏవమేవ అన్తరం = లోపల నున్నదానిని, న = తెలిసికొనఁడో, = ఈ ప్రకారముగానే, అయం = ఈ, పురుషః = పురుషుఁడు, (ఈ ఆత్మ), ప్రాజ్ఞేన = ప్రాజ్ఞుఁడగు, ఆత్మనా = ఆత్మతో, (స్వాభావికమగు పరమార్థ స్వరూపమైన స్వకీయాత్మతో), సమ్పరిష్వక్తః = మిక్కిలి కూడుకొనినదై, (ఏకస్వరూపమైనదై), బాహ్యం = వెలుపలనున్నదానిని, కించన = కొంచెమును, న వేద = తెలిసికొనఁడు, అన్తరం = లోపలనున్నదానిని, నవేద = తెలిసికొనడు. తద్వై = అదియె, అస్య = ఈ ఆత్మకు, (రూపం = స్వరూపము), ఏతత్ = ఇది. ఆప్తకామం = పొందబడిన కామము గలదియును, (తనకు వేఱుగాని కోరిక గలది గనుక ఆప్తకామమైనది), ఆత్మకామం=ఆత్మయె కామముగాఁ గలదియును, (ఆత్మకంటె వేఱైనది కోరఁదగినది లేదు గనుక ఆత్మయె కోరికగాఁగలది). అకామం = కామము లేనిదియును, (కోరఁదగిన విషయము లేకపోవుటవలన అకామమును), శోకాన్తరం = శోకచ్ఛిద్రమైనదియు నగు, (శోకశూన్యమైనదియునగు), రూపఁ = స్వరూపము (భవతి = అగుచున్నది).

తా॥ సర్వము ఆత్మస్వరూపమనెడి భావముగల ఈ మోక్షము విద్యాఫలమును క్రియాకారక ఫలశూన్యమునైన దగుచున్నది. అది ఇప్పుడు ప్రత్యక్షముగాఁ జూపింపఁబడుచున్నది. ఇదివఱకు సర్వము ఆత్మస్వరూపమనెడి భావము మోక్షమని చెప్పఁబడినది. ఓజనకుఁడా! స్వయంజ్యోతి స్వరూపమైన ఆత్మ అజ్ఞానముచేత తనకు వేఱగు వస్తువులను కనుపఱచుచుండెడి జాగ్రత్స్వప్నములను వదలి తనంతటతానే వేఱురూపములేని కేవల తనస్వరూపమునగు సుషుప్తియను ఆత్మస్థానమును పొందినదై సర్వము తానే యగుచు ఏ స్వప్నమును ఏ కోరికను చూడక యుండును. ఇదియె ఆత్మకు సర్వస్వరూపమగు రూపము. ఇదియె మోక్షము. ఇది కామరహితమును ధర్మాధర్మ

శూన్యమును భయరహితమునగు స్వరూపము. దానిని ఇక్కడ దృష్టాంత పూర్వకముగా చూపింపబడుచున్నది. ఎట్లనగా, లోకము నందు జనుడు ఇష్టురాలగు స్త్రీతో మిక్కిలి ఐక్యమును పొంది కూడిన వాడై నాకంటె వేఱగు ఈ వస్తువు ఉన్నదనియు నేను సుఖము కలవాడనై యుంటిననిగానిదుఃఖముగలవాడనై యుంటిననిగాని యెట్లు ఇతరమును తన్ను కూడ తెలిసికొనలేక యుండునో ఆ ప్రకారము గానే ఈ స్వయం స్వరూపమైన ఆత్మ సుషుప్తియందు వేఱుగ క పారమార్థికమగు కేవలాత్మ మాత్రమైన ప్రాజ్ఞాత్మతో నైక్యమును పొందినది. తన్ను ఇతరమును తెలిసికొనక యుండియున్నది. అదియె ఆత్మయొక్క రూపము. ఇది తనకు వేఱుగా కోరిక లేకపోవుటవలన ఆప్తకామమైనదియును, ఆత్మకంటె అన్యమగు కోరదగినది లేకపోవుట వలన ఆత్మకామమైనదియును, కోరదగిన విషయమే లేకపోవుటవలన అ కామమును, శోకశూన్యమునగు రూపముగ లదియు నగుచున్నది. ఇదే విద్యాఫలమును, క్రియాకారక ఫలశూన్యమునగు మోక్షమని యాజ్ఞవల్క్యుడు చెప్పెను.

ఉ॥ అత్ర పితాఽపితా భవతి మాతాఽమాతా లోకా అలోకా దేవా అదేవా వేదాఅవేదాః।అత్ర స్తేనోఽస్తేనోభవతి భ్రూణహాఽభ్రూణహాచాణ్డాలోఽచాణ్డాలః పౌల్కసోఽ పౌల్కసః శ్రమణోఽశ్రమణస్తాపసోఽ తాపసోఽనన్వాగతం పుణ్యేనా నన్వాగతం పాపేన తీర్ణోహి తదా సర్వాఞ్ఛోకా న్హృదయస్య భవతి. ॥22॥

ప॥ అత్ర – పితా – అపితా – భవతి–మాతా – అమాతా – లోకాః – అలోకాః – దేవాః – అదేవాః – వేదాః – అవేదాః – అత్ర – స్తేనః – అస్తేనః – భవతి – భ్రూణహా – అభ్రూణహా – చాణ్డాలః – అచాణ్డాలః – పౌల్కసః – అపౌల్కసః – శ్రమణః – అశ్రమణః – తాపసః – అతాపసః – అనన్వాగతం – పుణ్యేన – అనన్వాగతం – పాపేన – తీర్ణః – హి – తదా – సర్వాన్ – శోకాన్ – హృదయస్య – భవతి.

ప్ర॥ అత్ర = ఈ సుషుప్తిస్థానమునందు, పితా = తండ్రి, అపితా = తండ్రికానివాఁడు, భవతి = అగుచున్నాఁడు. మాతా = తల్లి, అమాతా = తల్లికానిది, (భవతి = అగుచున్నది), లోకాః = లోకములు, అలోకాః = లోకములు కానివి, (భవన్తి=అగుచున్నవి). దేవాః = దేవతలు, అదేవాః = దేవతలు కానివారు, (భవన్తి = అగుచున్నారు). వేదాః = వేదములు, అవేదాః=వేదములు కానివి, (భవన్తి = అగుచున్నవి). అత్ర = ఈ సుషుప్తియందు, స్తేనః = దొంగతనము చేయువాఁడు, అస్తేనః = దొంగతనము చేయనివాఁడు, భవతి = అగుచున్నాఁడు. భ్రూణహా = గర్భమునందలి శిశువును హత్య చేయువాఁడు, అభ్రూణహా = గర్భమునందలి శిశువును హత్య చేయనివాఁడు, (భవతి = అగుచున్నాఁడు). చాణ్డాలః=చండాలుఁడు, (శూద్రునివలన బ్రాహ్మణ స్త్రీయందు పుట్టినవాఁడు). అచాణ్డాలః= చండాలుఁడు కానివాఁడు, (భవతి = అగుచున్నాఁడు), పౌల్కసః = పుల్కసుఁడు, (శూద్రుని వలననె క్షత్రియస్త్రీయందు పుట్టినవాఁడు), అపౌల్కసః = పుల్కసుఁడు కానివాఁడు, (భవతి = అగుచున్నాఁడు). శ్రమణః = యత్యాశ్రమముయొక్క కర్మముకలవాఁడు, అశ్రమణః= యతియొక్క కర్మలేనివాఁడు, (భవతి = అగుచున్నాఁడు). తాపసః= వానప్రస్థుఁడు, అతాపసః = వానప్రస్థుఁడు కానివాఁడు, (భవతి = అగుచున్నాఁడు), పుణ్యేన = పుణ్యకర్మముతో, (శాస్త్రవిహీనమైన కర్మముతో), అనన్వాగతం = అనుసరించి పొందనివాఁడును, పాపేన = పాపకర్మముతో, (శాస్త్రనిషిద్ధమైన పాపకర్మముతో), అనన్వాగతం = అనుసరించి పొందనివాఁడునునై, తదా=ఆ సుషుప్తికాలము నందు, హృదయస్య = బుద్ధిసంబంధములైన, సర్వాన్ = సమస్తములైన, శోకాన్ = కామములను, (కామములు వానివిషయములను పొందనప్పుడు శోకమును పొందుచున్నవి. కాఁబట్టి కామములే శోకములని చెప్పఁబడినవి), తీర్ణోహి = అతిక్రమించినవాఁడే, భవతి = అగుచున్నాఁడు.

తా॥ ఇంతకు పూర్వము ఆత్మస్వయంజ్యోతిస్స్వరూపమనియును అవిద్యా కామ కర్మ వినిర్ముక్తమైనదియునని చెప్పినదాని విషయమై ఆత్మసుషుప్తియందు పొందఁబడక పోవుటవలన ఆత్మకు స్వయంజ్యోతి స్స్వరూపమును అవిద్యా కామ కర్మలు మొదలైనవానివలెనే స్వభావము కాదని శంకించగా స్వయంజ్యోతి స్వరూపమైన ఆత్మ సుషుప్తి యందు ప్రాజ్ఞాత్మతోఁజేరి ఏకత్వమును పొంది మిక్కిలి ప్రియమైన స్త్రీతోఁగూడుకొని ఏకరూపమై సుఖమును పొందియున్న పురుషుఁడు తన్ను ఇతరమును తెలిసికొనక యుండినట్లు స్వభావమైన స్వయం జ్యోతి స్వరూపముతో ఆనందరూపమై ఏమియు తెలియకయే యున్న దని చెప్పఁబడినది. ఇట్లు ఆసుషుప్తియందు ఏకమై ఆనందరూపమగు ఆత్మకు బాహ్యమునందలి ఏవస్తువులతో సంబంధములేక పితా పుత్ర సంబంధ నిమిత్తకమైన కర్మ విడిచిపోవుటవలన తండ్రి లేఁడు. తల్లియును లేదు. పుత్రత్వమునులేదు. కర్మ సంబంధము లేకపోవుటవలన లోకములు లేవు. కర్మాంగభూతులైన దేవతలులేరు. ఆ కర్మ ప్రతిపాదకములగు వేదములును లేవు. ఇట్లు ఆత్మ సుషుప్తియందు శుభకర్మలను మాత్రమే అతిక్రమించియున్నది కాదు. అశుభకర్మలను అతిక్రమించే యున్నది. ఎట్లనఁగా, ఆత్మకు సుషుప్తియందు సువర్ణమును హరించుటలేదు. భ్రూణహత్యచేయుటలేదు. చణ్డాలత్వమునులేదు. పుల్కసత్వమునులేదు. శ్రమనిమిత్తకమైన కర్మసంబంధమును లేక పోవుటవలన సన్న్యాసాశ్రమ నిమిత్తకమగు కర్మమును లేదు. వాన ప్రస్థత్వమునులేదు. ఇంకను ఆత్మ శాస్త్రవిహితమైన పుణ్యకర్మమును అనుసరించి పొందునది కాదు. శాస్త్రవిహితముకాని పాపకర్మమును అనుసరించి పొందునదియును కాదు. ఇట్లు సుషుప్తియందు స్వయం జ్యోతి స్వరూపమైన ఆత్మ మనస్సంబంధములగు సమస్తములైన కోరికలను అతిక్రమించినదై స్వస్వరూపముతో నున్నది.

ఉ॥ యద్వై తన్న పశ్యతి పశ్యన్వై తన్న పశ్యతి । న హి ద్రష్టు

ద్రష్టేర్విపరిలోపోవిద్యతేఽ వినాశిత్వాత్॥ నతుతద్ద్వితీయమస్తి తతోఽన్యద్విభక్తం యత్పశ్యేత్. ॥23॥

ప॥ యత్ - వై - తత్ - న - పశ్యతి - పశ్యన్ - వై - తత్ - న - పశ్యతి - న - హి - ద్రష్టుః - దృష్టేః - విపరిలోపః- విద్యతే - అవినాశిత్వాత్ - న - తు - తత్ - ద్వితీయం - అస్తి- తతః - అన్యత్ - విభక్తం - యత్ - పశ్యేత్.

ప్ర॥ (సుషుప్తే = సుషుప్తియందు), యద్వై = ఏదియో, తత్ = అది, నపశ్యతి = చూచుటలేదు. తత్ = ఆ సుషుప్తి యందు, పశ్యన్వై = చూచుచునే, నపశ్యతి=చూచుటలేదు. (ఆత్మ గాఢ సుషుప్తియందు బుద్ధ్యాది సాధనములు లేక స్వేతరములగు వస్తువులను చూడకపోయినను జాగ్రత్తయందు సుషుప్తిలో నేను చూచుటలేదని చెప్పుటవలన ఆ సుషుప్తియందు ప్రాజ్ఞాత్మతో ఏకీభ వించి కేవల ద్రష్టృస్వరూపమై చూచుచునే చూచుటలేదని బాహ్యము నందు చెప్పుచున్నది). ద్రష్టుః = ద్రష్టయగు ఆత్మయొక్క, దృష్టేః= చూపునకు, విపరిలోపః = లోపము, (నాశనము), నవిద్యతేహి = లేనేలేదు, అవినాశిత్వాత్ = నాశము లేనిదగుటవలన, (లోపము లేదు). తతః = ద్రష్టయగు ఆ ఆత్మకంటె, అన్యత్ = అన్యముగా, విభక్తం = వేఱుచేయఁబడిన, యత్ = ఏది, పశ్యేత్ = చూచునో, (పొందునో), తత్ = ఆ, ద్వితీయం = రెండవది, (విషయభూతమైన రెండవ వస్తువు), నాస్తి = లేదు.

తా॥ ద్రష్టయగు ఆత్మయొక్క దృష్టి నశించనిది యగుటవలన ఆత్మ దృష్టికి నాశనము లేనేలేదు. కాఁబట్టియే గాఢసుషుప్తియందు ఆత్మ బుద్ధ్యాది సాధనములు లేకపోవుటవలన, తనకు వేఱగు వస్తువు లను చూడకపోయినను జాగ్రత్తయందు సుషుప్తిలో నేను చూచుట లేదని చెప్పుటవలన ప్రాజ్ఞాత్మతో నేకీభవించి కేవల ద్రష్టస్వరూపమగు ఆత్మకంటె వేఱుగా విభజింపఁబడిన ఇంద్రియములును శబ్దాది విషయ

జాతమును అగు వేఱొక వస్తువు గాఢసుషుప్తియందు లేకపోవుటవలన స్వయం ప్రకాశమగు ఆత్మ కేవల ద్రష్టయగు తానై నిలిచి దేనిని చూడకపోయినను చూచుచున్నదే యగుచున్నది.

ఉ॥ యద్వై తన్న జిఘ్రతి జిఘ్రన్వై తన్న జిఘ్రతి న హి ఘ్రాతు ర్ఘ్రాతే ర్విపరిలోపో విద్యతేఽ వినాశిత్వాన్నతు తద్ద్వితీయమస్తి తతోఽన్యద్విభక్తం యజ్జిఘ్రేత్. ॥24॥

ప॥ యత్ - వై - తత్ - న - జిఘ్రతి - జిఘ్రన్ - వై - తత్ - న - జిఘ్రతి - న - హి - ఘ్రాతుః - ఘ్రాతేః - విపరిలోపః - విద్యతే - అవినాశిత్వాత్ - న - తు - తత్ - ద్వితీయం - అస్తి - తతః - అన్యత్ - విభక్తం - యత్ - జిఘ్రేత్

ప్ర॥ (సుషుప్తే = సుషుప్తియందు), యద్వై = ఏదియో, తత్ = అది, నజిఘ్రతి = ఆఘ్రాణించదు. తత్ =ఆ సుషుప్తియందు, జిఘ్రన్వై = ఆఘ్రాణించుచునే, నజిఘ్రతి=ఆఘ్రాణించదు, (ఘ్రాణేంద్రియములు లేకపోవుట వలన), అవినాశిత్వాత్ =నాశనము లేనిదగుట వలన, ఘ్రాతుః=ఆఘ్రాణించెడి వానియొక్క, ఘ్రాతేః=ఆఘ్రాణమునకు, విపరిలోపః = నాశము, నవిద్యతేహి = లేనేలేదు, తతః = ఆఘ్రాణించునట్టి ఆత్మకంటె, అన్యత్ = వేఱుగా, విభక్తం = విభజింపఁబడిన, యత్ = దేనిని, జిఘ్రేత్ = ఆఘ్రాణించునో, తత్ = ఆ, ద్వితీయంతు = రెండవది, (సుషుప్తియందు), నాస్తి = లేదు.

ఉ॥ యద్వైతన్న రసయతే రసయన్వై తన్న రసయతే నహిరసయితూ రసయతే ర్విపరి లోపో విద్యతేఽవినాశిత్వా న్న తు తద్ద్వితీయ మస్తి తతోఽన్యద్విభక్తం యద్రసయేత్ ॥25॥

ప॥ యత్ వై - తత్ - న - రసయతే - రసయన్ - వై - తత్ - న - రసయతే - న - హి - రసయితుః - రసయతేః - విపరిలోపః - విద్యతే - అవినాశిత్వాత్ - న - తు - తత్ - ద్వితీయం - అస్తి - తతః - అన్యత్ - విభక్తం - యత్ - రసయేత్.

ప్ర॥ (సుషుప్తే = సుషుప్తియందు), యద్వై = ఏదియో, తత్ = అది, నరసయతే = రుచిచూడదు, తత్=ఆ సుషుప్తియందు, రసయన్వై = రుచిచూచుచునే, నరసయతే = రుచిచూచుటలేదు; (రసనేంద్రియము లేకపోవుటవలన), అవినాశిత్వాత్=నాశనము లేని దగుటవలన, రసయితుః = రుచిచూచెడి వానియొక్క, రసయతేః= రుచిచూచుటకు, విపరిలోపః = నాశనము, నవిద్యతేహి = లేనేలేదు, తతః = ఆ రుచిచూచెడి వానికంటె, అన్యత్ = వేఱుగా, విభక్తం= విభజింపఁబడిన, యత్ = దేనిని, రసయేత్=రుచిచూచునో, తత్= ఆ, ద్వితీయంతు = రెండవది, (సుషుప్తియందు), నాస్తి = లేదు.

ఉ॥ యద్వై తన్న వదతి వదన్వై తన్న వదతి న హి వక్తుర్వక్తేర్వి పరిలోపో విద్యతేఽవి శిత్వాన్న తు తద్ద్వితీయమస్తి తతోఽ న్యద్విభక్తం యద్వదేత్. ॥26॥

ప॥ యత్ - వై - తత్ - న - వదతి - వదన్ - వై - తత్ - న - వదతి - న - హి - వక్తుః - వక్తేః - విపరిలోపః - విద్యతే - అవినాశిత్వాత్ - న - తు - తత్ - ద్వితీయం - అస్తి- తతః - అన్యత్ - విభక్తం - యత్ - వదేత్.

ప్ర॥ (సుషుప్తియందు), యద్వై = ఏదియో, తత్ = అది, నవదతి=పలుకదు, తత్=ఆ సుషుప్తియందు, వదన్వై=పలుకుచునే, నవదతి = పలుకదు. (పలుకుటకు సాధనమైన వాగింద్రియము లేక పోవుటవలన), అవినాశిత్వాత్ = నాశనములేని దగుటవలన, వక్తుః = పలికెడి వానియొక్క, వక్తేః=పలుకుటకు, విపరిలోపః=నాశనము, నవిద్యతేహి = లేనేలేదు, తతః = ఆ పలికెడి ఆత్మకంటె, అన్యత్ = వేఱుగా, విభక్తం = విభజింపఁబడిన, యత్ = దేనిని, వదేత్ = పలుకునో, తత్ = ఆ, ద్వితీయంతు = రెండవది, (సుషుప్తియందు), నాస్తి = లేదు.

ఉ॥ యద్వై తన్న శృణోతి న హి శ్రోతుః శ్రుతేర్విపరిలోపో విద్య

తేఽవినాశిత్వా న్న తు తద్ద్వితీయమ స్తి తతోఽన్యద్విభ క్తం య
చ్ఛృణుయాత్. ॥27॥

ప॥ యత్ - వై - తత్ - న - శృణోతి - శృణ్వాన్ - వై - తత్ - న - శృణోతి - న - హి - శ్రోతుః - శ్రుతేః - విపరిలోపః - విద్యతే - అవినాశిత్వాత్ - న - తు - తత్ - ద్వితీయం - అ స్తి - తతః - అన్యత్ - విభ క్తం - యత్ - శృణుయాత్.

ప్ర॥ (సుషు ప్తియందు), యద్వై = ఏదియో, తత్ - అది, నశృణోతి = వినదు. తత్ = ఆ సుషు ప్తియందు, శృణ్వాన్వై = వినుచునె, నశృణోతి = వినదు. (శ్రవణేంద్రియము లేకపోవుటవలన), అవినాశిత్వాత్ = నాశనము లేనిదగుటవలన, శ్రోతుః=వినెడి ఆత్మ యొక్క, శ్రుతేః = వినికికి, విపరిలోపః = నాశనము, నవిద్యతేహి= లేనేలేదు, తతః = ఆ వినునట్టి ఆత్మకంటె, అన్యత్ = వేఱుగా, విభ క్తం = విభజింపఁబడని, యత్ = దేనిని, శృణుయాత్=వినునో, తత్=ఆ, ద్వితీయంతు=రెండవది, (సుషు ప్తియందు), నా స్తి=లేదు.

ఉ॥ యద్వై తన్న మనుతే మన్వానో వై తన్న మనుతే నహి మన్తు ర్మతే ర్విపరిలోపో విద్యతేఽవినాశిత్వాన్న తు తద్ద్వితీయమ స్తి తతోఽన్యద్విభ క్తం యన్మన్వీత. ॥28॥

ప॥ యత్ - వై - తత్ - న - మనుతే - మన్వానః - వై - తత్ - న - మనుతే - న - హి - మన్తుః - మతేః - విపరిలోపః - విద్యతే - అవినాశిత్వాత్ - న - తు - తత్ - ద్వితీయం - అ స్తి - తతః - అన్యత్ - విభ క్తం - యత్ - మన్వీత.

ప్ర॥ (సుషు ప్తియందు), యద్వై = ఏదియో, తత్ = అది, నమనుతే = తలంచదు, తత్ = ఆ సుషు ప్తియందు, మన్వానోవై= తలంచుచునే, నమనుతే=తలంచుటలేదు. (మనస్సు లేకపోవుటవలన), అవినాశిత్వాత్ = నాశనము లేనిదగుటవలన, మన్తుః = తలంచునట్టి, ఆత్మయొక్క, మతేః = తలంపునకు, విపరిలోపః=నాశనము, నవిద్య

తేహి = లేనేలేదు, తతః = ఆ తలంచునట్టి ఆత్మకంటె, అన్యత్ = వేఱుగా, విభక్తం = విభజింపఁబడిన, యత్ = దేనిని, (ఏ గంధాది విషయజాతమును), మన్వీత=తలంచునో, తత్=ఆ, ద్వితీయంతు= రెండవది, (సుషుప్తియందు), నాస్తి = లేదు.

ఉ॥ యద్వై తన్న స్పృశతి స్పృశన్వై తన్న స్పృశతి నహి స్ప్రష్టుః స్పృష్టే ర్విపరిలోపో విద్యతేఽవినాశిత్వాన్న తు తద్ద్వితీయమస్తి తతోఽన్యద్విభక్తం యత్స్పృశేత్. ॥29॥

ప॥ యత్ - వై - తత్ - న - స్పృశతి - స్పృశన్ - వై - తత్ - న - స్పృశతి - న - హి - స్ప్రష్టుః-స్పృష్టేః - విపరిలోపః- విద్యతే - అవినాశిత్వాత్ - న - తు - తత్ - ద్వితీయం - అస్తి- తతః - అన్యత్ - ద్వితీయం - విభక్తం - యత్ - స్పృశేత్.

ప్ర॥ (సుషుప్తియందు), యద్వై = ఏదియో, తత్ = అది, నస్పృశతి = తాకదు. తత్ = ఆ సుషుప్తియందు, స్పృశన్వై = తాకుచునె, నస్పృశతి = తాకుటలేదు, (త్వగింద్రియము లేకపోవుట వలన), అవినాశిత్వాత్ = నాశము లేనిదగుటవలన, స్ప్రష్టుః = తాకెడి ఆత్మయొక్క, స్పృష్టేః = తాకునకు, విపరిలోపః=నాశనము, నవిద్యతేహి = లేనేలేదు, తతః = ఆతాకునట్టి ఆత్మకంటె, అన్యత్ = వేఱుగా, విభక్తం = విభజింపఁబడిన, యత్ = దేనిని, (ఇంద్రియములు విషయములు మొదలైన దానిని), స్పృశేత్ = తాకునో, తత్=ఆ, ద్వితీయంతు=రెండవది, (సుషుప్తియందు), నాస్తి=లేదు.

ఉ॥ యద్వై తన్న విజానాతి విజానన్వై తన్న విజానాతి న హి విజ్ఞాతు ర్విజ్ఞాతే ర్విపరిలోపో విద్యతేఽవినాశిత్వాన్న తు తద్ద్వితీయమస్తి తతోఽన్యద్విభక్తం యద్విజానీయాత్. ॥30॥

ప॥ యత్ - వై - తత్ - న - విజానాతి - విజానన్ - వై - తత్ - న - విజానాతి - న - హి - విజ్ఞాతుః - విజ్ఞాతేః - విపరిలోపః - విద్యతే - అవినాశిత్వాత్-న - తు తత్ - ద్వితీయం-

అస్తి - తతః - అన్యత్ - విభక్తం - యత్ - విజానీయాత్.

ప్ర॥ (సుషుప్తియందు), యద్వై = ఏదియో, తత్ = అది, నజానాతి = తెలిసికొనదు. తత్ = ఆ సుషుప్తియందు, విజానన్వై = తెలిసికొనుచునె, నవిజానాతి = తెలిసికొనుటలేదు (బుద్ధి లేక పోవుటవలన), అవినాశిత్వాత్ = నాశము లేనిదగుటవలన, విజ్ఞాతుః= తెలిసికొనెడివానియొక్క, విజ్ఞాతేః = విజ్ఞానమునకు, విపరిలోపః = నాశము, నవిద్యతేహి = లేనేలేదు, తతః=ఆ తెలిసికొనునట్టి ఆత్మ కంటె, అన్యత్ = వేఱుగా, విభక్తం = విభజింపఁబడిన, యత్ = దేనిని, (ఇంద్రియము విషయములు మొదలైనదానిని), విజానీయాత్ = తెలిసికొనునో, తత్ = .., ద్వితీయంతు = రెండవది, (సుషుప్తి యందు), నాస్తి = లేదు.

తా॥ సుషుప్తియందు ప్రాజ్ఞాత్మతో కలిసికొని ఏకస్వరూప మైన ఆత్మ, పురుషుఁడు ప్రియమగు స్త్రీతోఁగూడుకొని ఏకాకృతి గలవాఁడై సుఖించునపుడు తన్నును ఇతరమునును తెలిసికొనని యట్లు బాహ్యాంతరములు రెండును తెలియనిదియై ఏమియు లేక యొకటియై యున్నది. సుషుప్తియందు బాహ్యములగు విషయములను చూచుటకు సాధనములైన అంతఃకరణమును ఇంద్రియములును విషయములు లేకపోవుటవలన, ఆత్మ, వాసనచూచుటలేదు. రుచిచూచుటలేదు. పలుకుటలేదు. వినుటలేదు. తలంచుటలేదు. తాకుటలేదు. తెలిసి కొనుటలేదు. అయినను ఆ ఆత్మ నాశనము లేనిదగనుక వాసనచూచు టకును, రుచిచూచుటకును, పలుకుటకును, వినుటకును, తలంచుటకును, తాకుటకును, తెలిసికొనుటకును, ఆ యాత్మకుండెడి ఆ యాజ్ఞానము నకు నాశమెన్నటికిని లేనేలేదు అని యాజ్ఞవల్క్యుఁడు జనకునితో చెప్పెను.

ఇది 24వ మంత్రము మొదలు 30వ మంత్రము వఱకు తాత్పర్యము.

ఉ. యత్ర వా అన్యదివ స్యాత్తత్రాన్యోఽన్యత్పశ్యేదన్యోఽన్యజ్జి

ఘ్రేదన్యోఽన్యద్రసయేదన్యోఽన్యద్వదేదన్యోఽ న్యచ్ఛృణుయా
దన్యోఽన్యన్మన్వీతాన్యోఽ న్యత్స్పృశేదన్యోఽ న్యద్విజానీయాత్ .31

ప॥ యత్ర - వై - అన్యత్ - ఇవ - స్యాత్ - తత్ర - అన్యః- అన్యత్ - పశ్యేత్ - అన్యః - అన్యత్ - జిఘ్రేత్ - అన్యః - అన్యత్ - రసయేత్ - అన్యః - అన్యత్ -వదేత్ -అన్యః - అన్యత్ - శృణుయాత్ - అన్యః - అన్యత్ - స్పృశేత్ - అన్యః - అన్యత్ - విజానీయాత్ .

ప్ర॥ యత్రవై = ఏకాలమునందైతే, (జాగ్రత్స్వప్న కాలములయందు), అన్యదివ = వేఱొక వస్తువువలెనే, స్యాత్ =అగునో, (అజ్ఞానముచేత ఆత్మకు వేఱొక వస్తువువలెనే పొందింపఁబడినదగునో.), తత్ర = ఆ కాలమునందు. (ఆ జాగ్రత్స్వప్న సమయములయందు), అన్యః=ఇతరుఁడు, అన్యత్=వేఱొక వస్తువును, పశ్యేత్=చూచును. అన్యః = ఇతరుఁడు, అన్యత్ = వేఱొక దానిని, జిఘ్రేత్ = ఆఘ్రాణించును, అన్యః = ఇతరుఁడు, అన్యత్=వేఱొకదానిని, రసయేత్= రుచిచూచును. అన్యః = ఇతరుఁడు, అన్యత్ = వేఱొకదానిని, వదేత్ = పలుకును, అన్యః = ఇతరుఁడు, అన్యత్=వేఱొకదానిని, శృణుయాత్ = వినును. అన్యః = ఇతరుఁడు, అన్యత్ = వేఱొక దానిని, మన్వీత =తలంచును, అన్యః=ఇతరుఁడు, అన్యత్ = వేఱొక దానిని, స్పృశేత్ = తాకును. అన్యః=ఇతరుఁడు, అన్యత్ = వేఱొక దానిని, విజానీయాత్ = తెలిసికొనును.

తా॥ ఇంతకుపూర్వము సుషుప్తియందు ఆత్మకంటె వేఱుగా విభజింపఁబడినది లేనేలేదని చెప్పఁబడినది. కనుక సుషుప్తియం దేవిశేషమును తెలిసికొనుటలేదు. ఇట్లు ఏమియు తెలిసికొనక ఏకస్వరూపమై యుండుటయే ఆత్మకు స్వభావమైన యెడల ఏకారణమువలన ఆస్వభావమును విడిచి వేఱువేఱుగా నుండెడి చూచుట, వినుట ఈ మొదలైన నానావిధమగు విశేషవిజ్ఞానము కలుగుచున్నది ? ఇట్లు నానా

విధమగు విశేషవిజ్ఞానమె ఆత్మకు స్వభావమైనయెడల ఎందువలన ఆత్మ నానావిధమగు విశేషజ్ఞానమును తెలిసికొనుటలేదని యంటివేని చెప్పుచున్నాను వినుము. ఓ జనకుఁడా! ఆత్మకు ఏమియు తెలిసికొనక ఏకాకృతియై యుండుటయే స్వభావమైనను జాగ్రత్తయందు అజ్ఞానము చేత ఆత్మకు తనయందు లేనటువంటి వేఱువస్తువులను స్వప్నమునందు వలెనే కల్పించి పొందింపఁబడుటవలన ఆత్మ తన్ను వేఱైనవానివలెనే తలంచినదై తాను అజ్ఞానకల్పితములైన వస్తువులకు వేఱై అన్యమును చూచుచు ఆఘ్రాణించుచు రుచిచూచుచు పలుకుచు తలంచుచు తెలిసికొనుచు జాగ్రత్తయందు భిన్నమైన జ్ఞానము కలదై యున్నది యని యాజ్ఞవల్క్యుఁడు చెప్పెను.

ఉ॥ సలిల ఏకో ద్రష్టాఽద్వైతో భవత్యేష బ్రహ్మలోకః సమ్రాడితి హైనమనుశశాస యాజ్ఞవల్క్య ఏషాస్య పరమా గతి రేషాస్య పరమా సమ్పదేషోఽస్య పరమో లోక ఏషోఽస్య పరమ ఆనన్ద ఏతస్యైవానన్దస్యాన్యాని భూతాని మాత్రాముపజీవన్తి.

ప్ర॥ సలిలే - ఏకః - ద్రష్టా - అద్వైతః - భవతి - ఏషః - బ్రహ్మలోకః - సమ్రాట్ - ఇతి - హ - ఏనం - అనుశశాస - యాజ్ఞవల్క్యః - ఏషా - అస్య - పరమా - గతిః - ఏషా - అస్య - పరమా - సమ్పత్ - ఏషః - అస్య - పరమః - లోకః - ఏషః - అస్య - పరమః - ఆనన్దః - ఏతస్య - ఏవ - ఆనన్దస్య - అన్యాని - భూతాని - మాత్రాం - ఉపజీవన్తి.

ప్ర॥ సలిలే = ఉదకమునందు, (సలిలమివ = ఉదకమువలెనే, స్వచ్ఛమైన ఉదకము ఉదకమునందు వలెనే సుషుప్తియందు), ఏకః= రెండవదిలేని, (ద్రష్టా = ద్రష్టయగు ఆత్మ, అద్వైతః=చూడఁదగిన రెండవ వస్తువులేనిది, భవతి = అగుచున్నది. హేసమ్రాట్ = ఓ జనకమహారాజా! ఏషః=ఈ ఆత్మ, (దేహేంద్రియోపాధి భేదములేని ఈ ఆత్మ ఈ సుషుప్తికాలమునందు స్వకీయమైన ఆత్మ తేజస్సునం

దున్నది. ఈ ఆత్మ), బ్రహ్మలోకః = బ్రహ్మలోకమైనది. (బ్రహ్మ స్వరూపమాత్రమైన లోకము). ఇతిహ=ఈ ప్రకారముగానే, యాజ్ఞ వల్క్యః=యాజ్ఞవల్క్యఋషి. ఏనం = ఈ జనకమహారాజునుగూర్చి, అనుశశాస=అనుసరించి శిక్షించెను, (బోధించెను=చెప్పెను). అస్య = ఈ విజ్ఞానమయాత్మకు, ఏషా = ఇది, పరమా = శ్రేష్ఠమై , గతిః= పొందఁదగిన స్థానము, ఏషా = ఇది, అస్య = ఈ విజ్ఞానమయాత్మకు, పరమా = శ్రేష్ఠమైన, సమ్పత్ = సంపత్తు, ఏషః = ఇది, అస్య = ఈ విజ్ఞానమయాత్మకు, పరమః = శ్రేష్ఠమైన, లోకః = లోకము, ఏషః = ఇది, అస్య = ఈ విజ్ఞానమయాత్మకు, పరమః = శ్రేష్ఠమైన, ఆనన్దః = ఆనన్దము, (సంతోషము). అన్యాని = ఇతరములైన, భూతాని = భూతములు, (జంతువులు), ఏతస్యైవానన్దస్య = ఈ ఆనన్దముయొక్కయె, మాత్రాం = కళను, (అంశమును=అజ్ఞానము చేత పొందింపఁబడిన విషయములు, ఇంద్రియములు, వీనియొక్క సంబంధకాలమునందు కలిగెడి బ్రహ్మానందాంశమును), ఉపజీవన్తి= అనుసరించి జీవించుచున్నవి.

తా॥ ఓ జనకమహారాజా ! సుషుప్తియందు ఆత్మకంటె నన్య ములగు దేహేంద్రియాది వస్తువులను కల్పించెడి అవిద్య నశించగా ఆత్మ స్వయంజ్యోతి స్స్వభావమును స్వకీయమునగు ప్రజ్ఞాత్మతో కూడుకొనినదియై ఉదకము ఉదకమునందుచేరి ఒకటియైనట్లు రెండవది కానిదియై చూడఁదగిన వేఱువస్తువులేని ద్రష్టృస్వరూపమాత్ర మగు చున్నది. ఇదియె పరబ్రహ్మమాత్రమైన లోకము. ఇదియె ఈ జీవా త్మకు పొందఁదగిన శ్రేష్ఠస్థానము. ఇదియే ఈ జీవాత్మకు అన్ని సంప త్తులలో శ్రేష్ఠమైన సంపత్తు. ఇదియె ఈ జీవాత్మకు సమస్తమైన స్వర్గాది లోకములలో శ్రేష్ఠమైన లోకము. ఇదియే ఈ జీవాత్మకు విషయ ములు ఇంద్రియములు వీనిగయొక్క సంబంధమువలన పుట్టిన అన్ని ఆనందములకంటె శ్రేష్ఠమైన ఆనన్దము. సమస్త భూతములు ఈ ఆన

ముయొక్కయె కళామాత్రమగు అజ్ఞానకల్పితమైన విషయేంద్రియ ములయొక్క సంబంధకాలమునందు పుట్టిన ఆనందాంశమును అనుస రించి జీవించుచున్నవి. అని యాజ్ఞవల్క్యుడు జనకమహారాజును గూర్చి చెప్పెను.

ఉ॥ స యో మనుష్యాణాగ్ రాద్ధః సమృద్ధో భవత్యన్యేషా మధిపతి స్సర్వైర్మానుష్యైర్భోగై స్సమ్పన్నతమః స మనుష్యాణాం పరమ ఆనన్దోఽథ యే శతం మనుష్యాణామానన్దాః స ఏకః పితౄణాం జితలోకానామానన్దోఽథ యేశతం పితౄణాం జితలోకానామా నన్దాః స ఏకో గంధర్వలోక ఆనన్దోఽథ యే శతం గన్ధర్వలోక ఆనన్దాః స ఏకః కర్మదేవానామానన్దో యే కర్మణా దేవత్వమభి సమ్పద్యన్తే । అథ యే శతం కర్మదేవానామానన్దాః స ఏక ఆజానదేవానామానన్దో యశ్చ శ్రోత్రియోఽవృజినోఽకామహ తోఽథ యే శత మాజానదేవానామానన్దాః స ఏకః ప్రజా పతిలోక ఆనన్దో యశ్చశ్రోత్రియోఽ వృజినోఽ కామహతో థ యే శతం ప్రజాపతి లోక ఆనన్దాః స ఏకో బ్రహ్మలోక ఆనన్దో యశ్చశ్రోత్రియోఽవృజినోఽకామహతోఽ థైష ఏవ పరమ అనన్దః ఏష బ్రహ్మలోకస్సమ్రాడితి హోవాచ యాజ్ఞవల్క్యః సోఽహంభగవతే సహస్రం దదామ్యత ఊర్ధ్వం విమోక్షాయైవ బ్రూహీత్యత్రహ యాజ్ఞవల్క్యో బిభయాఞ్చకార మేధావీ రాజా సర్వేభ్యోమాఽన్తేభ్య ఉదరాత్సీది తి. ॥33॥

ప॥ సః – యః – మనుష్యాణాం – రాద్ధః – సమృద్ధః-భవతి- అన్యేషాం – అధిపతిః – సర్వైః – మానుష్యైః – భోగైః – సమ్ప న్నతమః – సః – మనుష్యాణాం – పరమః – ఆనన్దః – అథ – యే- శతం – మనుష్యాణాం – ఆనన్దాః – సః – ఏకః – పితౄణాం – జిత లోకానాం - ఆనన్దః – అథ – యే – శతం – పితౄణాం – జితలోకా నాం – ఆనన్దాః - సః – ఏకః – గన్ధర్వలోక – ఆనన్దః – అథ –

యే - శతం - గన్ధర్వలోకే - ఆనన్దాః - సః - ఏకః - కర్మదేవానాం - ఆనన్దః - యే - కర్మణా - దేవత్వం - అభిసమ్పద్యన్తే - అథ - యే - శతం - కర్మదేవానాం - ఆనన్దాః - సః ఏకః - ఆజానదేవానాం - ఆనన్దః - యః - చ - శ్రోత్రియః - అవృజినః - అకామహతః - అథ - యే - శతం - ఆజానదేవానాం - ఆనన్దాః - సః - ఏకః ప్రజాపతిలోకే - ఆనన్దః - యః - చ - శ్రోత్రియః - అవృజినః - అకామహతః - అథ - యే - శతం - ప్రజాపతిలోకే - ఆనన్దాః - సః - ఏకః - బ్రహ్మలోకే - ఆనన్దః - యః - చ - శ్రోత్రియః - అవృజినః - అకామహతః - అథ - ఏషః - ఏవ - పరమః - ఆనన్దః - ఏషః - బ్రహ్మలోకః - సమ్రాట్ - ఇతి-హ - ఉవాచ - యాజ్ఞవల్క్యః - సః - అహం - భగవతే - సహస్రం - దదామి - అతః - ఊర్ధ్వమ్ - విమోక్షాయ - ఏవ - బ్రూహి - ఇతి - అత్ర - హ - యాజ్ఞవల్క్యః - బిభయాఞ్చకార - మేధావీ రాజా - సర్వేభ్యః - మా - అన్తేభ్యః - ఉదరౌత్సీత్ - ఇతి.

మనుష్యాణాం = మనుష్యులలో, రాద్ధః = సంసిద్ధుఁడగు. (సమగ్రమైన అవయవములు గలవాఁడగు) సయః = ఒకానొకఁడైన జనుఁడు, సమృద్ధః = సంపత్తిగలవాఁడును, (ఉపభోగోపకరణ సంపత్తి గలవాఁడును), అన్యేషాం = ఇతరులకు అధిపతిః = స్వతంత్ర ప్రభువునై, సర్వైః = సమస్తములైన, మానుష్యైః = మనుష్య సంబంధములగు, భోగైః = భోగములచేతను, సమ్పన్నతమః = సంపన్నులగు వారలలోఅతిశయముగాసంపన్నుఁడగువాఁడు, భవతి=అగుచున్నాఁడు, సః=అది, మనుష్యాణాం = మనుష్యులకు, పరమః = శ్రేష్ఠమైన, ఆనన్దః = ఆనందము. (భవతి = అగుచున్నది,) (ఇక్కడ పరమానందముయొక్క ఈకళామాత్రమె విషయి విషయములయొక్క ఆకారముతో వ్యాప్తమైనదని మనుష్యానందములకు రెంటికిని అభేదముగాఁ జెప్పఁబడినది). అథ = అనంతరము, మనుష్యాణాం = మనుష్యుల

యొక్క, శతం = నూటింతలగు, ఆనన్దాః = ఆనన్దములు, యే = ఏవియో, (తే = అవి), జితలోకానాం = జయింపఁబడిన లోకములు గల, పితౄణాం = పితృదేవతలయొక్క, ఏకః = ఒకటియగు, సః = ఆ, ఆనన్దః = ఆనన్దము. (భవతి = అగుచున్నది). అథ = అనంతరము, జితలోకానాం = జయింపఁబడిన లోకములుగల, పితౄణాం= పితృదేవతలయొక్క, శతం = నూటింతలైన, ఆనన్దాః=ఆనన్దములు, యే = ఏవియో. (తే = అవి), ఏకః = ఒక్కటియగు, సః = ఆ, గన్ధర్వలోక ఆనన్దః = గన్ధర్వలోక=గన్ధర్వలోకముయొక్క, ఆనన్దః = ఆనన్దము, (భవతి = అగుచున్నది). అథ = అనంతరము, శతం= నూటింతలైన, గన్ధర్వలోక ఆనన్దాః = గన్ధర్వలోక=గంధర్వలోకము యొక్క, ఆనన్దాః = ఆనన్దములు, యే = ఏవియో, (తే = అవి), యే = ఎవరు. కర్మణా = కర్మచేతను, దేవత్వం = దేవత్వమును, (దేవభావమును), అభిసమ్పద్యన్తే = పొందుచున్నారో, (అగ్నిహో త్రాది శ్రౌతకర్మచేత దేవభావమును పొందువారు కర్మదేవులనఁ బడుదురు). (తేషాం = అటువంటి), కర్మదేవానాం = కర్మదేవతల యొక్క, ఏకః = ఒక్కటియగు, సః = ఆ, ఆనన్దః = ఆనన్దము, (భవతి = అగుచున్నది). అథ = అనన్తరము, కర్మదేవానాం=కర్మ చేత దేవత్వము పొందినవారలయొక్క, శతం = నూటింతలైన, ఆనన్దాః = ఆనన్దములు, యే = ఏవియో, (తే = అవి), ఆజాన దేవానాం = ఆజానదేవతలయొక్క, (పుట్టుటతోడనె దేవత్వము పొందినవారు ఆజానదేవు లనఁబడుదురు), ఏకః = ఒక్కటియగు, సః = ఆ, ఆనన్దః = ఆనన్దము, (భవతి=అగుచున్నది). శ్రోత్రియః= శ్రోత్రియుఁడును, (అధ్యయనము చేయఁబడిన వేదము గలవాఁడును), అవృజినః = పాపము లేనివాఁడును, అకామహతః = కామహతుఁడు కానివాఁడునగు జనుఁడు, (ఆశలేని జనుఁడు), యః = ఎవఁడో, (సః= వాఁడు, ఆజానదేవతలతో సమానమైన ఆనన్దమగుచున్నాఁడు). అథ

= అనంతరము, ఆజానదేవానాం = ఆజానదేవతలయొక్క, శతం = నూఱింతలైన, ఆనన్దాః = ఆనన్దములు, యే = ఏవియో, (తే=అవి), ఏకః = ఒక్కటియగు, సః = ఆ, ప్రజాపతిలోక ఆనన్దః = ప్రజాపతి లోకే = ప్రజాపతి లోకముయొక్క, (విరాట్టుయొక్క). ఆనన్దః = ఆనన్దము, (భవతి = అగుచున్నది), శ్రోత్రియః = శ్రోత్రియుఁడును, అవృజినః = పాపము లేనివాఁడును, అకామహతః = కామహతుఁడు కానివాఁడునగుజనుఁడు, (ఆశలేనివాఁడునగు జనుఁడు), యః=ఎవఁడో (సః = వాఁడు, ప్రజాపతితో సమానమైన ఆనన్దము గలవాఁడగుచున్నాఁడు). అథ = అనంతరము, ప్రజాపతిలోకే=ప్రజాపతిలోకము యొక్క, విరాట్టుయొక్క), శతం = నూఱింతలైన, ఆనన్దాః=ఆనన్దములు. యే = ఏవియో, (తే = అవి), ఏకః = ఒక్కటియైన, సః= ఆ, బ్రహ్మలోక ఆనన్దః = బ్రహ్మలోక = బ్రహ్మలోకముయొక్క, (హిరణ్యగర్భునియొక్క), ఆనన్దః=ఆనన్దము, (భవతి=అగుచున్నది), శ్రోత్రియః = శ్రోత్రియుఁడును, అవృజినః = పాపము లేనివాఁడును, అకామహతః = కామహతుఁడు కానివాఁడు నగు జనుఁడు, యః = ఎవఁడో, (సః = వాఁడు, హిరణ్యగర్భానందముతో సమానమైన ఆనన్దము గలవాఁడగుచున్నాఁడు). అథ = అనంతరము, ఏషఏవ = ఇదియే, పరమః = శ్రేష్ఠమైన, ఆనన్దః = ఆనన్దము, (ఇఁకమీఁదట ఆనన్దమును ఎన్నుటకు శక్యముకాదు). హేసమ్రాట్=ఓజనకుఁడా, ఏషః = ఇది, బ్రహ్మలోకః = బ్రహ్మలోకము, కేవల బ్రహ్మమే (యైనలోకము). ఇతి = అని, యాజ్ఞవల్క్యః = యాజ్ఞవల్క్యఋషి, హోవాచ = పలికెను. సః = ఆ, అహం = నేను, (ఇట్లుపదేశింపఁబడిన నేను = అనఁగా జనకుఁడు), భగవతే = నీకొఱకు, (గవాం = గోవులయొక్క), సహస్రం = వేయింటిని, దదామి=ఇచ్చుచున్నాను, అత ఊర్ధ్వం = ఇఁకమీఁదటను, విమోక్షాయైవ=మోక్షముకొఱకే, బ్రూహీతి = చెప్పుమా అని (జనకుఁడు యాజ్ఞవల్క్యుని అడిగెను),

అత్రహ = ఈ వాక్యమునందు, యాజ్ఞవల్క్యః=యాజ్ఞవల్క్యుఁడు, మేధావీ = బుద్ధిమంతుఁడైన, రాజా = జనకమహారాజు, సర్వేభ్యః = సమస్తములైన, అన్తేభ్యః = ప్రశ్న నిర్ణయావసానముల నుండి, (ప్రశ్న నిర్ణయములయొక్క అంత్యభాగములనుండి), మా = నన్ను, ఉదరౌత్సీత్ = ఆవరించును, (అడ్డగించును), ఇతి = అని, బిభయాఞ్చకార = భయపడెను.

తా॥ బ్రహ్మ మొదలుకొని మనుష్యులవఱకుండెడి భూతముల చేతను ఏ పరమానన్దముయొక్క అవయవములగు ఆనందాంశములు అనుసరించి జీవింపఁబడుచున్నవో, ఆ ఆనందాంశములద్వారా పరమానందమును పొందింప నిశ్చయించి చెప్పుచున్నాఁడు. ఓ జనకుఁడా! జనుఁడు సర్వావయవసంపదకలిగి చక్రవర్తియై సమస్తములైన మానుషభోగములతోఁ గూడినయెడల అన్నిసంపదలలో అధిక సంపద గలవాఁడగుచున్నాఁడు. ఇట్లగుటయె మనుష్యులయొక్క పరమానన్దము. ఇట్టి మనుష్యానందములు నూఱైనయెడల లోకమును జయించిన పితృదేవతలయొక్క ఒక ఆనందమగుచున్నది ఇట్టి పితృదేవతలయొక్క నూఱుఆనందములు గన్ధర్వులయొక్క ఒక ఆనందమగుచున్నది. ఇట్టి నూఱు గంధర్వానందములు, శ్రౌతాది కర్మచే దేవత్వమును పొందిన కర్మదేవతలయొక్క ఒక ఆనందమగుచున్నది. ఇట్టి కర్మదేవతలయొక్క నూఱు ఆనందములు జన్మమాత్రముతోడనె దేవత్వమును పొందిన ఆజాన దేవతలయొక్క ఒక ఆనందమగుచున్నది. ఈ ఆజానదేవతానందము శ్రోత్రియుఁడును పాపరహితుఁడును వీతతృష్ణుఁడునగు వానికిని కలదు. ఇట్టి ఆజానదేవతలయొక్క నూఱు ఆనందములు విరాట్పురుషునియొక్క ఒక ఆనందమగుచున్నది. ఈ విరాట్పురుషానందము శ్రోత్రియుఁడును పాపరహితుఁడును వీతతృష్ణుఁడునగు వానికి కలదు. ఇట్టి విరాట్పురుషానందములు నూఱు, హిరణ్యగర్భునియొక్క ఒక ఆనందమగుచున్నది. ఈ హిరణ్యగర్భానందము

శ్రోత్రియుఁడును పాపరహితుఁడును వీతతృష్ణుఁడునగు వానికి కలదు. ఇది పరమానందము. ఇదియె పరబ్రహ్మ మాత్రమైన ఆనందము అని యాజ్ఞవల్క్యుఁడు చెప్పెను. మరల, జనకమహారాజు, ఓ యాజ్ఞవల్క్యుఁడా! నీకు వేయి గోవులను ఇచ్చెదను. ఇఁకమీఁద మోక్షము కొఱకై నాకు చెప్పుమా యనెను. ఇట్లడుగఁగా, జనకమహారాజు, మిక్కిలి ప్రజ్ఞగలవాఁడు గనుక సమస్తములైన ప్రశ్ననిర్ణయముల యొక్క అంతములనుండి నిరోధించునని యాజ్ఞవల్క్యుఁడు భయపడెను.

ఉ॥ స వా ఏష ఏతస్మిన్ స్వప్నాన్తే రత్వా చరిత్వాదృష్ట్వైవ పుణ్యం చ పాపం చ పునః ప్రతిన్యాయం ప్రతియోన్యా ద్రవతి బుద్ధాన్తాయైవ. ॥34॥

ప॥ సః – వై – ఏషః – ఏతస్మిన్ – స్వప్నాన్తే – రత్వా – చరిత్వా – దృష్ట్వా – ఏవ – పుణ్యం – చ – పాపం – చ – పునః – ప్రతిన్యాయం – ప్రతియోని – ఆద్రవతి – బుద్ధాన్తాయ – ఏవ.

ప్ర॥ సవాఏషః = ఆ పరమానన్దస్వరూపమైన ఆత్మయె, ఏతస్మిన్ = ఈ, స్వప్నాన్తే = స్వప్నస్థానమునందు, రత్వా=అనురాగమును పొంది, చరిత్వా = సంచరించి, పుణ్యం = పుణ్యఫలమును, పాపంచ = పాపఫలమును, దృష్ట్వైవ = చూచియె, పునః = తిరిగి, బుద్ధాన్తాయైవ = జాగరిత స్థానముకొఱకే, ప్రతిన్యాయం = న్యాయప్రకారము, ప్రతియోని=ప్రతిస్థానమును ఆద్రవతి=పొందుచున్నది.

తా॥ ఓ జనకుఁడా! ఈపరమానంద స్వరూపమగు ఆత్మ ఈ స్వప్నముఁనందు మాయాకల్పితులగు బంధుమిత్రాదులయొక్క అనురాగమును అనుభవించి నానావిధములుగా క్రీడించి శ్రమను పొంది పుణ్యపాపఫలములను చూచియె వానితో బద్ధత్వమును పొందకయె తిరిగి జాగరిత స్థానముకొఱకు యథాప్రకారము, ప్రతిస్థానమును పొందుచున్నదని యాజ్ఞవల్క్యుఁడు చెప్పెను.

ఉ॥ తద్యథాఽనస్సుసమాహితముత్సర్జద్యాయాదేవమేవాయగ్
శారీర ఆత్మా ప్రాజ్ఞేనాత్మనాన్వారూఢ ఉత్సర్జన్యాతి యత్రైత
దూర్ధ్వోచ్ఛ్వాసీ భవతి. ॥35॥

ప॥ తత్ – యథా – అనః – సుసమాహితం – ఉత్సర్జత్ – యాయాత్ – ఏవం – ఏవ – అయం – శారీరః–ఆత్మా – ప్రాజ్ఞేన–ఆత్మనా - అన్వారూఢః – ఉత్సర్జన్ – యాతి – యత్ర – ఏతత్ – ఊర్ధ్వోచ్ఛ్వాసీ – భవతి.

ప్ర॥ తత్ = అక్కడ, (లోకే = లోకమునందు), అనః = బండి, సుసమాహితంసత్ = మిక్కిలి భారముతోఁ గూడుకొనినదై, ఉత్సర్జత్ = ధ్వనిచేయుచు, యథా = ఏ ప్రకారము, యాయాత్ = పోవునో, ఏవమేవ = ఈ ప్రకారముగానే, అయం = ఈ, శారీరః = శరీరమందైన, ఆత్మా = ఆత్మ, (లింగాత్మ అనఁగా జీవుఁడు) ప్రాజ్ఞేనఆత్మనా = పరమాత్మచేత, (స్వయంజ్యోతి స్స్వభావముగు పరమాత్మచేత), అన్వారూఢస్సన్ = అధిష్ఠింపఁబడినదై, (తదా=ఆకాలమునందు), ఉత్సర్జన్ = ధ్వనిచేయుచు, యాతి = పోవుచున్నది, యత్ర = ఎప్పుడు, ఏతత్ = ఈశరీరము, ఊర్ధ్వోచ్ఛ్వాసీ = ఊర్ధ్వశ్వాసము కలది, భవతి = అగుచున్నదో. (అప్పుడు పోవుచున్నదని పూర్వముతో నన్వయము).

తా॥ ఇది మొదలుకొని ఈ ఆత్మకు సంసారము కలుగుట వర్ణింపఁబడుచున్నది. ఆత్మ ఏ ప్రకారముగాను స్వప్నస్థానమునుండి జాగరితస్థానమును పొందునో ఆ ప్రకారము గానే ఆత్మ ఈ దేహము నుండి ఇంకొక దేహమును పొందుచున్నది. ఎట్లనఁగా, ఓజనకుఁడా! లోకమునఁదు శకటము బరువుచే నిండింపఁబడి బండివానిచే అధిష్ఠింపఁబడినదై ధ్వనిచేయుచు మఱియొక స్థానమును పొందినట్లు ఈదేహము ఊర్ధ్వశ్వాసము కలదై యుండునపుడు ఈ లింగాత్మ, (జీవుఁడు). ప్రాజ్ఞాత్మచే నధిష్ఠింపఁబడినదై ధ్వనిచేయుచు వేఱొక దేహమును

పొందుచున్నది.

ఉ॥ స యత్రాయ మణిమానం న్యేతి జరయా వో పతపతా వా ణిమానం నిగచ్ఛతి తద్య థా మ్రం వోదుమ్బరం వా పిప్పలం వా బన్ధనాత్ప్రముచ్యతే ఏవమేవాయం పురుష ఏభ్యోఽఙ్గేభ్య సమ్ప్రముచ్య పునః ప్రతిన్యాయం ప్రతియోన్యాద్రవతి ప్రాణాయైవ. ॥36

ప॥ సః – యత్ర – అయం–అణిమానం – ని–ఏతి – జరయా–వా – ఉపతపతా – వా – అణిమానం–నిగచ్ఛతి – తత్ – యథా–ఆమ్రం – వా – ఉదుమ్బరం – వా – పిప్పలం – వా – బన్ధనాత్ – ప్రముచ్యతే – ఏనం – ఏవ – అయం–పురుషః – ఏభ్యః – అఙ్గేభ్యః–సమ్ప్రముచ్య – పునః – ప్రతిన్యాయం – ప్రతియోని – ఆద్రవతి – ప్రాణాయ – ఏవ.

ప్ర॥ సః = ఆ పూర్వోక్తమైన, అయం = ఈ శరీరము, (శిరః పాణ్యాదులతోఁ గూడుకొనిన దేహము), యత్ర = ఏకాలమునందు, అణిమానం=అణుత్వమును, (కృశత్వమును), న్యేతి=పొందుచున్నదో, జరయావా = వృద్ధత్వము చేతగాని, (ముసలితనము చేతనుగాని), ఉపతపతావా = జ్వరాదిరోగముచేత గాని, అణిమానం = అణుత్వమును, నిగచ్ఛతి = పొందుచున్నదో. (అప్పుడు ఈ దేహము ఊర్ధ్వశ్వాసము కలది యగుచున్నది). తద్యథా = అది యెట్లనఁగా, ఆమ్రంవా = మామిడిపండుగాని, ఔదుమ్బరంవా = మేడిపండుగాని, పిప్పలంవా = రావిపండుగాని, (యథా = ఏ ప్రకారము). బన్ధనాత్ = తొడిమనుండి, ప్రముచ్యతే = విడుచుచున్నదో, ఏవమేవ = ఈ ప్రకారముగానే, అయం = ఈ, పురుషః = పురుషుఁడు, (జీవుఁడు), ఏభ్యః = ఈ, అఙ్గేభ్యః = అవయవములనుండి, సమ్ప్రముచ్య = మిక్కిలి విడిచి, పునః = తిరిగి, ప్రతిన్యాయం = యథాప్రకారము, ప్రతియోని = ప్రతి యోనిని, ప్రాణాయైవ = ప్రాణముకొఱకే, ఆద్రవతి = పొందుచున్నాఁడు.

తా॥ ఓ జనకుఁడా! ఈ కరచరణాద్యవయవయుక్తమైన ఈ దేహము ముసలితనముచేతఁ గాని జ్వరము మొదలైనరోగములచేతఁ గాని కృశించునపుడు ఊర్ధ్వశ్వాసము గలది యగుచున్నది. అప్పుడు ఈ జీవుఁడు, మామిడిపండు, మేడిపండు, రావిపండు, తొడిమనుండి విడిపోయినట్లు, ఈ సమస్తములైన శిరఃపాణ్యాద్యవయవములను మిక్కిలి విడిచిపెట్టి యథాప్రకారము ప్రాణముతోఁగూడ వేఱొక దేహమును పొందుచున్నాఁడు.

మ॥ తద్యథా రాజానమాయాన్తముగ్రాః ప్రత్యేనసః సూతగ్రామణ్యో ఽన్నైః పానైరావసథైః ప్రతికల్పన్తేఽయమాయాత్యయమాగ చ్ఛతీత్యేవగ్ం హైవంవిదగ్ం సర్వాణి భూతాని ప్రతికల్పన్త ఇదం బ్రహ్మాయాతీ దమాగచ్ఛతీతి. ॥37॥

ప॥ తత్ - యథా - రాజానం - ఆయాన్తం - ఉగ్రాః - ప్రత్యేనసః - సూతగ్రామణ్యః - అన్నైః - పానైః - ఆవసథైః - ప్రతికల్పన్తే - అయం - ఆయాతి - అయం - ఆగచ్ఛతి - ఇతి - ఏవం - హ - ఏవంవిదం - సర్వాణి - భూతాని - ప్రతికల్పన్తే - ఇదం - బ్రహ్మ - ఆయాతి - ఇదం - ఆగచ్ఛతి - ఇతి.

ప్ర॥ తత్ = అది, యథా = ఏ ప్రకారమనఁగా, ఉగ్రాః = క్రూరకర్మలను జేయువారును, ప్రత్యేనసః = ప్రతిపాపులను శిక్షించుటకుగాను నియోగింపఁబడినవారునగు, (చోరులు మొదలైనవారిని శిక్షించుటయందు నియోగింపఁబడిన), సూతగ్రామణ్యః = సూత = సూతులును, (సంకర వర్ణములోఁబుట్టిన జాతి సంకరులును), గ్రామణ్యః = గ్రామాధికారులును, ఆయాంతం=వచ్చుచున్న, రాజానం= రాజును, అన్నైః = అన్నములతోడను, పానైః = మద్యము మొదలైన పానద్రవ్యములతోడను, ఆవసథైః = నివసించుటకు యోగ్యములైన మేడలతోడను, అయం=ఈరాజు, ఆయాతి=వచ్చుచున్నాఁడు. అయం = ఈరాజు, ఆగచ్ఛతీతి = వచ్చుచున్నాఁడని, (యథా =

ఏ (ప్రకారము), ప్రతికల్పన్తే = నిరీక్షించుచున్నారో, ఏవంహా = ఈ ప్రకారముగానే, ఏవంవిదం=కర్మఫలమును తెలిసిన జీవుని, (సంసారి యగు జీవుని), సర్వాణి = సమస్తములైన, భూతాని = భూతములు, (దేహవ్యాపారమును జేయునట్టి సూర్యుఁడు మొదలైనవి), ఇదం బ్రహ్మ = బ్రహ్మస్వరూపమగు ఈ జీవాత్మ. ఆయాతి = వచ్చుచున్నది. ఇదం = ఈ జీవాత్మ. ఆగచ్ఛతీతి = వచ్చుచున్నదని. ప్రతి కల్పన్తే = నిరీక్షించుచున్నవి.

తా॥ ఓ జనకుఁడా! జీవుఁడు మరణమును పొంది దేహాంతరమును పొందునపుడు దేహసంబంధమైన వ్యాపారములను చేయునట్టి సూర్యుఁడు మొదలైన సమస్త భూతములును, లోకమునందు దొంగలు మొదలైన వారలను శిక్షించుటయందు నియోగింపఁబడి ఉగ్రకర్మములుగల సంకరజాతి వలనఁ బుట్టిన సూతులును, గ్రామాధికారులును, వచ్చెడి రాజునుగూర్చి భక్ష్య భోజ్యాదన్నములతోడను, మద్యము మొదలైన పానద్రవ్యములతోడను, మేడలు మొదలైన నివాసములతోడను, కూడుకొని ఇదిగో వచ్చుచున్నాఁడు, ఇదిగో వచ్చుచున్నాఁడని నిరీక్షించుచున్నట్లు కర్మఫలమును తెలిసియున్న ఈ జీవునిగూర్చి ఈ బ్రహ్మము వచ్చుచున్నది, బ్రహ్మము వచ్చుచున్నదని నిరీక్షించుచున్నవి.

ఉ॥ తద్యథా రాజానం ప్రయియాసన్త ముగ్రాః ప్రత్యేనసః సూతగ్రామణ్యోఽభిసమాయన్త్యేవమేవేమమాత్మానమన్తకాలే సర్వే ప్రాణా అభిసమాయన్తి యత్రైతదూర్ధ్వోచ్ఛ్వాసీ భవతి. ॥38॥

ఇతి షష్ఠాధ్యాయే తృతీయం బ్రాహ్మణమ్.

ప॥ తత్ – యథా – రాజానం–ప్రయియాసన్తం – ఉగ్రాః – ప్రత్యేనసః – సూతగ్రామణ్యః – అభిసమాయన్తి – ఏవం – ఏవ – ఇమం – ఆత్మానం – అన్తకాలే – సర్వే – ప్రాణాః – అభిసమా

య న్తి - యత్ర - ఏతత్ - ఊర్ధ్వోచ్ఛ్వాసీ - భవతి.

ప్ర॥ తద్యథా = అదెట్లనఁగా, ఉగ్రాః = క్రూరులును, ప్రత్యేనసః = పాపుల నందఱిని శిక్షించుటకుగాను నియోగింపఁబడినవారు నగు, సూతగ్రామణ్యః = సూతులును గ్రామాధికారులును, ప్రయియాస న్తం = మిక్కిలి పోవుటకుఁ గోరుచున్న, రాజానం = రాజును, (యథా = ఏ ప్రకారము), అభిసమాయ న్తి = పొందుచున్నారో, ఏవమేవ = ఈ ప్రకారముగానే, (తదా = అప్పుడు), సర్వే=సమస్తములైన, ప్రాణాః = ప్రాణములు, (వాగాదీంద్రియములు), అన్తకాలే = మరణకాలమునందు, ఇమం = ఈ, ఆత్మానం=భోక్తను, (జీవుని), అభిసమాయ న్తి = పొందుచున్నవి, యత్ర = ఎప్పుడు, ఏతత్ = ఈ శరీరము, ఊర్ధ్వోచ్ఛ్వాసీ = ఊర్ధ్వశ్వాసము గలది, భవతి = అగుచున్నదో, (అప్పుడు పొందుచున్నది

తా॥ ఓ జనకుఁడా! ఈ శరీరము ఊర్ధ్వశ్వాసము గలదై మరణము పొందునపుడు ఈ భోక్తయగు జీవుని, వాక్కు మొదలైన ఇంద్రియము లన్నియు, లోకమునందు ప్రయాణమై వెళ్ళుట కిచ్ఛయించిన రాజును గ్రామాధికారులు మొదలైనవారు ఎదురుగా వచ్చి పొందినట్లు, పొందుచున్నవి.

ఇట్లు షష్ఠాధ్యాయమునందు తృతీయ బ్రాహ్మణము సమాప్తము.

---

## షష్ఠాధ్యాయము - చతుర్థ బ్రాహ్మణము

ఉ॥ స యత్రాయమాత్మా బల్యం న్యేత్యసమ్మోహమివ న్యేత్యథైన మేతే ప్రాణా అభిసమాయ న్తి స ఏతా స్తేజో మాత్రాః సమభ్యాదదానో హృదయమేవాన్వవక్రామతి స యత్రైష చాక్షుషః పురుషః పరాఙ్పర్యావర్తతే.తథాఽరూపజ్ఞో భవతి ॥1॥

ప॥ సః - యత్ర - అయం - ఆత్మా - అబల్యం - ని - ఏత్య - సమ్మోహం - ఇవ - ని - ఏతి - అథ - ఏనం - ఏతే -

ప్రాణాః - అభిసమాయన్తి - సః - ఏతాః - తేజోమాత్రాః - సమభ్యాదదానః - హృదయం - ఏవ - అను - అవక్రామతి - సః- యత్ర - ఏషః - చాక్షుషః - పురుషః - పరాఙ్పర్యావర్తతే - తథా - అరూపజ్ఞః -

ప్ర॥ సః = ఆ, అయం = ఈ, ఆత్మా = ఆత్మ, యత్ర = ఏ కాలమునందు, ఆబల్యం = దుర్బలత్వమును, (తాను దుర్బలము లేనివాఁడైనను మరణకాలమునందలి శరీర దుర్బలమును), న్యేత్య = పొంది, (తాను మూర్తస్వరూపుఁడు కాకపోవుటవలన దుర్బలుఁడు కాకపోయినను శరీరదుర్బలమును తనదిగా నుపచరించుకొని), సమ్మోహమివ = అవివేకమును వలెనే, న్యేతి = పొందుచున్నాఁడు. అథ = అప్పుడు, ఏతే = ఈ, ప్రాణాః = ప్రాణములు, (వాగాదీంద్రియములు), ఏనం = ఈ ఆత్మను, అబిసమాయన్తి = అభిముఖముగా పొందుచున్నవి, సః = ఆ ఆత్మ, తేజోమాత్రాః = తేజస్సుయొక్క అవయవములుగా నుండు, ఏతాః = ఈ వాగాదీంద్రియములను, సమభ్యాధదానః = బాగుగా అభిముఖముగా పొందినవాఁడై, హృదయమేవ=హృదయమునే, (హృదయకమలమునందలి ఆకాశమునే), అన్వక్రామతి = అనుసరించి పొందుచున్నాఁడు. సః = అట్టి, ఏషః= ఈ, చాక్షుషః = నేత్రమందైన, (సూర్యునియొక్క అంశస్వరూపుఁడగు), పురుషః = పురుషుఁడు, యత్ర = ఎప్పుడు, పరాఙ్ = విముఖుఁడై, పర్యావర్తతే = అంతటను పొందుచున్నాఁడో, తథా = అప్పుడు, అరూపజ్ఞః = రూపము తెలియనివాఁడు, భవతి = అగుచున్నాఁడు, (అప్పుడు స్వప్నకాలమునందు వలెనే ఆత్మచక్షురాదీంద్రియములయొక్క తేజోంశములను పొందినవాఁడగుచున్నాఁడు).

తా॥ ఇంతవఱకు ఈ పురుషుఁడు ఈ అవయవములనుండి విడిపోయి దేహాంతరమును పొందుచున్నాఁడని చెప్పఁబడినది. ఏ కాలమునందెట్లు విడుచునో దానినంతయు సవిస్తరముగా వర్ణించవలయునని ఈ

బ్రాహ్మణము ఆరంభింపఁబడినది. ఓ జనకుఁడా! ఈ స్వయంప్రకాశ మగు ఆత్మ మరణకాలమునందు దేహసంబంధమైన దుర్బలత్వమును తనదిగా నుపచరించుకొని మోహామోహములు లేని తాను, మోహము కలవానివలె నగుచున్నాఁడు. అట్టి సమయమునందు ఈ ఆత్మను ఈ వాగాదీంద్రియములు అభిముఖముగా వచ్చి పొందుచున్నది. ఈ తేజోంశములుగా నుండెడి ఈ వాగాదీంద్రియములను ఆ ఆత్మ పొంది హృదయాకాశమునే అనుసరించి ప్రవేశించుచున్నది. సూర్యునియొక్క అంశమగు నేత్రమునందైన ఈ పురుషుఁడు మరణకాలమునందు, వాగాదీంద్రియములు వాని వాని యధిష్ఠానదేవతలగు అగ్ని మొదలైన వానిని పొందుటతోడనె, విముఖుఁడై యంతటను పొందినవాఁడై స్వప్నకాలమునందు వలెనే చక్షురాదీంద్రియములయొక్క తేజోంశములను పొంది రూపము తెలియనివాఁ డగుచున్నాఁడు.

ఉ॥ ఏకీభవతి న పశ్యతీత్యాహు రేకీభవతి న జిఘ్రతీత్యాహు రేకీభవతి న రసయత ఇత్యాహు రేకీభవతి న వదతీత్యాహు రేకీభవతి న శృణోతీత్యాహు రేకీభవతి న మనుత ఇత్యాహు రేకీభవతి న స్పృశతీత్యాహు రేకీభవతి న విజానాతీత్యాహుస్తస్య హైతస్య హృదయస్యాగ్రం ప్రద్యోతతే తేన ప్రద్యోతేనైష ఆత్మా నిష్క్రామతి । చక్షుషో వా మూర్ధ్నో వాఽన్యేభ్యో వా శరీరదేశేభ్యస్తము త్క్రామన్తం ప్రాణోఽనూత్క్రామతి ప్రాణ మనూత్క్రామన్తగ్ సర్వే ప్రాణా అనూత్క్రామన్తి సవిజ్ఞానో భవతి సవిజ్ఞానమేవాన్వవక్రామతి । తం విద్యాకర్మణీ సమన్వారభేతే పూర్వప్రజ్ఞా చ. ॥2॥

ప॥ ఏకీభవతి – న – పశ్యతి – ఇతి – ఆహుః – ఏకీభవతి – న – జిఘ్రతి – ఇతి – ఆహుః – ఏకీభవతి – న – రసయతే – ఇతి – ఆహుః – ఏకీభవతి – న – వదతి – ఇతి – ఆహుః – ఏకీభవతి – న – శృణోతి – ఇతి – ఆహుః – ఏకీభవతి – న–మనుతే – ఇతి – ఆహుః

ఏకీభవతి – న – మనుతే – ఇతి – ఆహుః – ఏకీభవతి – న – స్పృశతి – ఇతి – ఆహుః – ఏకీభవతి – న – విజానాతి – ఇతి – ఆహుః– తస్య – హ – ఏతస్య – హృదయస్య – అగ్రం – ప్రద్యోతతే – తేన – ప్రద్యోతేన – ఏషః – ఆత్మా – నిష్క్రామతి – చక్షుషః – వా – మూర్ధ్నః – వా – అన్యేభ్యః – వా – శరీరదేశేభ్యః – తం– ఉత్క్రామన్తం – ప్రాణః – అనూత్క్రామతి – ప్రాణం – అనూత్క్రామన్తం – సర్వే – ప్రాణాః – అనూత్క్రామన్తి – సవిజ్ఞానః– భవతి – సవిజ్ఞానం – ఏవ – అన్వవక్రామతి – తం – విద్యాకర్మణీ– సమన్వారభేతే – పూర్వప్రజ్ఞా – చ

ప్ర॥ (యదా=ఎప్పుడు, కరణజాతం=ఇంద్రియసముదాయము, స్వేనలిఙ్గాత్మనా = స్వకీయమగు లింగాత్మతో అనఁగా జీవునితో), ఏకీభవతి = కూడుకొని ఒకటి యగుచున్నదో, (తదా = అప్పుడు, పార్శ్వస్థాః = ప్రక్కన నుండెడి జనులు, ఏనం = ఈ పురుషుని), నపశ్యతీతి = చూడఁడని, ఆహుః = చెప్పి, (యదా = ఎప్పుడు), ఏకీభవతి = ఒకటి యగుచున్నాఁడో, (ఈ పురుషుఁడు ఎప్పుడు లింగాత్మతోఁ గూడుకొని ఒకటి యగుచున్నాఁడో అప్పుడు), నజిఘ్రతీతి = ఆఘ్రాణించఁడని, ఆహుః = చెప్పిరి, ఏకీభవతి = (ఎప్పుడు) ఒకటి యగుచున్నాఁడో, నరసయతే=(అప్పుడు) రుచిచూడఁడు, ఇతి = అని, ఆహుః = చెప్పిరి, ఏకీభవతి = (ఎప్పుడు) ఒకటి యగుచున్నాఁడో, (అప్పుడు), నవదతీతి = పలుకఁడని, ఆహుః = చెప్పిరి, ఏకీభవతి = (ఎప్పుడు) ఒకటి యగుచున్నాఁడో, (అప్పుడు), నశృణోతీతి = వినఁడని, ఆహుః=చెప్పిరి, (ఎప్పుడు), ఏకీభవతి=ఒకటియనుచున్నాఁడో, (అప్పుడు), నమనుతఇతి = తలంచఁడని, ఆహుః=చెప్పిరి, (ఎప్పుడు), ఏకీభవతి=ఒకటియగుచున్నాఁడో, (అప్పుడు), నస్పృశతీతి=తాకఁడని, ఆహుః = చెప్పిరి, (ఎప్పుడు) ఏకీభవతి = ఒకటియగుచున్నాఁడో, (అప్పుడు) నవిజానాతీతి= తెలిసికొనఁడని, ఆహుః=చెప్పిరి, తస్యహ =

ఆ ప్రసిద్ధమగు, ఏతస్య = ఈ, హృదయస్య = హృదయరంధ్రము యొక్క, అగ్రం = ముఖము, (ద్వారము), ప్రద్యోతతే = ప్రకాశించుచున్నది. తేన = ఆ ప్రద్యోతేన = ఆత్మప్రకాశము చేతను, (హృదయాగ్రముచేతను), ఏషః = ఈ, ఆత్మా = ఆత్మ, (లింగ శరీరోపాధికుఁడగు విజ్ఞానమయాత్మ), నిష్క్రామతి=బయలు వెడలు చున్నాఁడు చక్షుషోవా = నేత్రమునుండి యైనను, మూర్ధ్నోవా = శిరస్సునుండి యైనను, అన్యేభ్యః=ఇతరములైన, శరీర దేశేభ్యోవా = దేహప్రదేశములనుండి యైనను, ఉత్క్రామన్తం = లేచిపోవుచున్న, తం = ఆవిజ్ఞానాత్మను, ప్రాణః = ప్రాణము, (సర్వమునకు అధికారి యగు దేహమునందలి ప్రాణము), అనూత్క్రామతి = అనుసరించి పోవుచున్నది, అనూత్క్రామంతం = అనుసరించిపోవుచున్న, ప్రాణం = ప్రాణమును, సర్వే = సమస్తములైన ప్రాణాః = వాగాదీంద్రియములు, అనూత్క్రామన్తి = అనుసరించి పోవుచున్నవి. సవిజ్ఞానః = విజ్ఞానముతోఁ గూడుకొనునది, భవతి = అగుచున్నది. (ఆత్మ కర్మాధీనములవల్లనుండి స్వప్నమునందు వలెనే విశేష విజ్ఞానము గలది యగుచున్నది). సవిజ్ఞానమేవ = విజ్ఞానముతోఁ గూడుకొనినదానినే, అన్వవక్రామతి = అనుసరించి పొందుచున్నది. (విశేష విజ్ఞానముచేతఁ బ్రకాశింపఁబడినదానినే పొందుచున్నది) తం=ఆ పరలోకము కొఱకు పోవుచున్న ఆత్మను, విద్యాకర్మణీ= విద్యాకర్మలు, సమన్వారభేతే=అనుసరించిపొందుచున్నవి. పూర్వప్రజ్ఞాచ=పూర్వమందనుభవింపఁబడిన విషయ ప్రజ్ఞయును, (అతిక్రమించిపోయిన కర్మఫలములయొక్క అనుభవ రూపమగు వాసనయును), (సమన్వారభేతే = అనుసరించి పొందుచున్నది).

తా॥ ఓ జనకుఁడా! ఇంద్రియ సముదాయము విజ్ఞానమయాత్మతోఁ గూడుకొని ఒకటియైనప్పుడు ఈ పురుషుని, పార్శ్వమునందుండెడి జనులు, చూడఁడనియును, వాసన చూడఁడనియును, రుచి

చూడఁడనియును, పలుకఁడనియును, వినఁడనియును, తలంచఁడని యును, స్పృశించఁడనియును, తెలిసికొనఁడనియును చెప్పుదురు. ఇట్లు సర్వేంద్రియములు పరమమునొంది విజ్ఞానమయాత్మతోఁగూడుకొను నప్పుడు ఆ హృదయ రంధ్రముయొక్క జీవనిర్గమ స్థానమగు నాడీ ద్వారము ఆత్మప్రకాశముతోఁ బ్రకాశించుచున్నది. ఆ ప్రకాశము తోనే ఈ లింగశరీరోపాధికుఁడగు విజ్ఞానమయాత్మ నేత్రము ద్వారాగా గాని శిరస్సుద్వారాగాగాని ఇతరములగు శరీరప్రదేశములద్వారాగా గాని బయలు వెడలుచున్నది. ఇట్లు ఈ దేహమునుండి బయలు వెడ లిన విజ్ఞానమయాత్మను, ఈ దేహేంద్రియాది సర్వమున కధికారి యగు ప్రాణము అనుసరించి పొందుచున్నది. అట్టి ప్రాణమును వాగా దీంద్రియము లన్నియు అనుసరించి పొందుచున్నవి ఆత్మ, కర్మా ధీనము వలన స్వప్నమునందువలెనే విశేష విజ్ఞానము కలదియై ఆ విశేష విజ్ఞానముచేతఁ బ్రకాశించెడి విశేషజ్ఞానసహితమైన దానినే పొందుచున్నది. ఇట్లు పరలోకమును పొందుచున్న ఆత్మను విధిప్రతి షేధరూపమైన విద్యయును, విధిప్రతిషేధరూపమైన కర్మయును, అతి క్రమించిపోయిన కర్మఫలములయొక్క అనుభవరూపమైన వాసన యును, అనుసరించి పొందుచున్నవి.

ఉ॥ తద్యథా తృణజలాయుకా తృణస్యాన్తం గత్వాఽన్యమాక్రమ
మాక్రమ్యాత్మాన ముపసగ్ హరత్యేవమేవాయ మాత్మేదగ్
శరీరం నిహత్యావిద్యాం గమయిత్వాన్యమాక్రమమాక్రమ్యా
త్మానముపసగ్ హరతి ॥3॥

ప॥ తత్ – యథా – తృణజలాయుకా – తృణస్య – అన్తం- గత్వా – అన్యం – ఆక్రమం – ఆక్రమ్య – ఆత్మానం – ఉపసంహ రతి – ఏవం – ఏవ – అయం – ఆత్మా – ఇదం – శరీరం – నిహత్య- అవిద్యాం – గమయిత్వా – అన్యం-ఆక్రమం-ఆక్రమ్య – ఆత్మానం- ఉపసంహరతి.

ప్ర॥ తత్ = అది, యథా = ఏ ప్రకారమనఁగా, (వేఱొక దేహమునందు సంచరించుటయందు ఇది దృష్టాంతమేలాగనఁగా), తృణజలాయుకా = గరికయందలి పురుగు, తృణస్య = గరికయొక్క, అన్తం = కొనను, గత్వా = పొంది, (అన్యం = మఱియొకటియగు, ఆక్రమం = ఆక్రమణమును, (మఱియొకటియైన తృణముయొక్క ఆధారమును), ఆక్రమ్య = ఆవరించుకొని, యథా = ఏ ప్రకారము, ఆత్మానం = తన్ను, ఉపసంహరతి=లాగుకొనుచున్నదో, ఏవమేవ = ఈ ప్రకారముగానే, అయం = ఈ, ఆత్మా = ఆత్మ, (సంసారియగు జీవుఁడు), ఇదం = ఈ, శరీరం = దేహమును, నిహత్య = చంపి, (విడిచి), అవిద్యాం = అచేతనమును, గమయిత్వా = పొందించి, అన్యం = వేఱయిన, ఆక్రమం=ఆక్రమణమును, (ఆధారమైన అన్య శరీరమును), ఆక్రమ్య = ఆవరించుకొని, ఆత్మానం = తన్ను, ఉప సంహరతి = లాగుకొనుచున్నాఁడు (పూర్వవాసనచే ఆ దేహము నందు ఆత్మభావమును చేయుచున్నాఁడు).

తా॥ ఓ జనకుఁడా! పూర్వదేహమునందలి ప్రజ్ఞయను పేరు గల వాసన హృదయమునం దుండియె వేఱుదేహము నుపక్రమించి పూర్వదేహమును విడుచుచున్నది. ఇందుకు ఇక్కడ దృష్టాంతము చెప్పఁబడుచున్నది. ఎట్లనఁగా, లోకమునందు తోటకూరయందలి పురుగు తానున్న దాని కొనకు చేరి వేఱొక దానిని ఆక్రమించి పూర్వపు దానిని విడిచినట్లు ఈ సంసారియగు జీవాత్మయును ప్రకృత దేహమును విడిచి అచేతనమును పొందించి వేఱొక దేహమును పొంది పూర్వ వాసనచే తిరిగి తాను పొందిన దేహమునందు ఆత్మ భావమును చేయు చున్నాఁడు.

ఉ॥ తద్యథా పేశస్కారీ పేశసో మాత్రాముపాదాయాన్యన్నవతరం కళ్యాణతరగ్ రూపం తనుత ఏవమేవాయ మాత్మేదగ్ శరీరం నిహత్యా విద్యాం గమయిత్వాన్యన్నవతరం కల్యాణతరగ్ రూపం

కురు తే పిత్ర్యం వా గాన్ధర్వం వా దైవం వా ప్రాజాపత్యం వా బ్రాహ్మం వాఽ న్యేషాం వా భూతానామ్ ॥4॥

ప॥ తత్ - యథా - పేశస్కారీ - పేశసః - మాత్రాం - ఉపాదాయ - అన్యత్ - నవతరం-కల్యాణతరం - రూపం - తనుతే- ఏవం - ఏవ - అయం - ఆత్మా - ఇదం - శరీరం - నిహత్య - అవిద్యాం - గమయిత్వా - అన్యత్ - నవతరం-కల్యాణతరం - రూపం - కురుతే-పిత్ర్యం - వా - గాన్ధర్వం - వా - దైవం - వా - ప్రాజాపత్యం -వా - బ్రాహ్మం - వా - అన్యేషాం - వా - భూతానాం.

ప్ర॥ తత్ = అది, యథా=ఏ ప్రకారమనఁగా (మఱియొక దేహమును ఆరంభించుటయందు ఇది దృష్టాంతమేలాగనఁగా), పేశస్కారీ=స్వర్ణకారుఁడు, (అగసాలవాఁడు), పేశసః=బంగారుయొక్క, మాత్రాం = లేశమును, ఉపాదాయ=తీసికొని, అన్యత్=ఇతరమైన, నవతరం = మిక్కిలి నూతనమగు, కల్యాణతరం = మిక్కిలి శుభమైన, రూపం = ఆకారమును, (యథా = ఏ ప్రకారము), కురుతే= చేయుచున్నాఁడో, ఏవమేవ = ఈ ప్రకారముగానే, అయం = ఈ, ఆత్మా = ఆత్మ, (సంసారియగు జీవుఁడు), ఇదం = ఈ, శరీరం = దేహమును, నిహత్య = చంపి, (విడిచి), అవిద్యాం = అచేతనమును, గమయిత్వా = పొందించి, అన్యత్ = ఇతరమైన, నవతరం=మిక్కిలి నూతనమైన, కల్యాణతరం = మిక్కిలి శుభమైన, పిత్ర్యంవా=పితృ సంబంధమైన దైనను, గాన్ధర్వంవా = గన్ధర్వసంబంధమైన దైనను, దైవంవా = దేవసంబంధమైన దైనను, ప్రాజాపత్యంవా = ప్రజాపతి సంబంధమైన దైనను, బ్రాహ్మంవా = బ్రహ్మసంబంధమైన దైనను, అన్యేషాం= ఇతరములైన, భూతానాం వా=భూతముల సంబంధమైన, రూపం = ఆకారములు, కురుతే = చేయుచున్నాఁడు.

తా॥ ఓ జనకుఁడా! లోకమునందు బంగారుపని చేయునట్టి అగసాలవాఁడు బంగారముయొక్క లేశములను తీసికొని మిక్కిలి

నూతనమును శుభతరమునగు వేఱొకవస్తు రూపమునుచేసినట్లు ఈ జీవుఁడు ప్రకృతిదేహమును పరిత్యజించుట వలన అచేతనత్వమును పొందించి పితృదేవతా సంబంధమునుగాని గంధర్వసంబంధమునుగాని దేవసంబంధమునుగాని ప్రజాపతి సంబంధమునుగాని బ్రహ్మసంబంధమునుగాని ఇతరములగు భూతముల సంబంధమునుగాని వీనిలో దేనినైనను మిక్కిలి నూతనమును శుభతరము నగు అన్యమైన రూపముచేయుచున్నాఁడు.

ఉ. స వా అయమాత్మా బ్రహ్మ విజ్ఞానమయో మనోమయః ప్రాణమయశ్చక్షుర్మయః శ్రోత్రమయః పృథివీమయ ఆపోమయో వాయుమయ ఆకాశమయ స్తేజోమయోఽ తేజోమయః కామమయోఽ తేజోమయః కామమయోఽ కామమయః క్రోధమయోఽ క్రోధమయో ధర్మమయోఽధర్మమయః సర్వమయ స్తద్యదేత దిదంమయోఽథోమయ ఇతి యథాకారీ యథా చారీ తథా భవతి సాధుకారీ సాధుర్భవతి పాపకారీ పాపో భవతి పుణ్యః పుణ్యేన కర్మణా భవతి పాపః పాపేన । అథోఖల్వాహుః కామమయ ఏవాయం పురుష ఇతి స యథాకామో భవతి తత్క్రతుర్భవతి యత్క్రతుర్భవతి తత్కర్మ కురుతే యత్కర్మ కురుతే తదభిసమ్పద్యతే. ॥5॥

సః – వై – అయం – ఆత్మా – బ్రహ్మ – విజ్ఞానమయః – మనోమయః – ప్రాణమయః – చక్షుర్మయః – శ్రోత్రమయః – పృథివీమయః – ఆపోమయః – వాయుమయః – ఆకాశమయః – తేజోమయః – అతేజోమయః–కామమయః – అకామమయః – క్రోధమయః – అక్రోధమయః ధర్మమయః–అధర్మమయః – సర్వమయః – తత్ – యత్ – ఏతత్ – ఇదంమయః – అదోమయః – ఇతి – యథాకారీ యథాచారీ – తథా – భవతి – సాధుకారీ – సాధుః– భవతి – పాపకారీ – పాపః – భవతి – పుణ్యః – పుణ్యేన-కర్మణా –

భవతి - పాపః - పాపేన - అథో - ఖలు - ఆహుః - కామమయః - ఏవ - అయం - పురుషః - ఇతి - సః - యథా - కామః-భవతి -తత్క్రతుః - భవతి - యత్క్రతుః - భవతి - తత్ - కర్మ - కురుతే - యత్ - కర్మ - కరుతే - తత్ - అభిసమ్పద్యతే.

ప్రి॥ స్వై = ఆప్రసిద్ధమగు, అయం = ఈ, విజ్ఞానమయః = విజ్ఞానస్వరూపమగు, ఆత్మా = ఆత్మ, (ఏ ఆత్మసంసారిగానున్నాడో అట్టి ఈ ఆత్మ), బ్రహ్మ = పరబ్రహ్మము, (ఆపరబ్రహ్మము బుద్ధితోఁ గూడుకొని విజ్ఞానమయ మగుచున్నది. అదేప్రకారము), మనోమయః = మనోస్వరూపుఁడును, ప్రాణమయః = ప్రాణస్వరూపుఁడును, చక్షుర్మయః = నేత్రస్వరూపుఁడును, శ్రోత్రమయః=శ్రోత్రస్వరూపుఁడును, పృథివీమయః = భూస్వరూపుఁడును. అపోమయః = ఉదకస్వరూపుఁడును, వాయుమయః = వాయుస్వరూపుఁడును, ఆకాశమయః = ఆకాశ స్వరూపుఁడును. తేజోమయః = తేజోరూపుఁడును, అతేజోమయః = తేజోరహితమైన స్వరూపుఁడును. కామమయః = కామరూపుఁడును, అకామమయః = అకామస్వరూపుఁడును, క్రోధమయః = క్రోధరూపుఁడును, అక్రోధమయః = క్రోధరహితస్వరూపుఁడును, ధర్మమయః = ధర్మస్వరూపుఁడును, అధర్మమయః = అధర్మస్వరూపుఁడును, (భూత్వా = అయి), సర్వమయః = సర్వస్వరూపుఁడును, (భవతి = అగుచున్నాఁడు). ఏతత్ = ఇది, యత్ = ఏదియో, తత్ = అది, (ప్రత్యక్షాప్రత్యక్షముగానుండెడి సర్వమయమగు అది), ఇదంమయః = ఈప్రత్యక్షమగు ఇంద్రియ గోచరమైన శబ్దాదివిషయ స్వరూపమైనది. అథోమయః = అప్రత్యక్షముగా అంతఃకరణమునందుండెడి శబ్దాదివిషయరూపమైనది. ఇతి = సంక్షేపముగానైతే, (జనః = జనుఁడు), యథాకారీ = ఎట్లుచేయుటకు స్వభావముగలవాఁడును, యథాచారీ = ఎట్లాచరించుటకు స్వభావము గలవాఁడును, (భవతి = అగుచున్నాఁడో), తథాభవతి = అట్లే అగుచున్నాఁడు.

సాధుకారీ = మంచిచేయువాఁడు, సాధుః = మంచివాఁడు, భవతి = అగుచున్నాఁడు, పాపకారీ=పాపము చేయువాఁడు, పాపః=పాపుఁడు, భవతి = అగుచున్నాఁడు, పుణ్యేనకర్మణా = పుణ్యాకర్మముచేతను, పుణ్యః = పుణ్యాత్ముఁడు, భవతి = అగుచున్నాఁడు. పాపేన = పాప కర్మముచేతను, పాపః = పాపాత్ముఁడు, (భవతి = అగుచున్నాఁడు). అథోఖలు = మఱియును, (అన్యే = ఇతరులు), అయం=ఈ, పురుషః = పురుషుఁడు, కామమయఇతి=కామస్వరూపుఁడని, ఆహుః=చెప్పిరి. సః = ఆ పురుషుఁడు, యథాకామః = (ఏ కోరికతోఁ గూడుకొనిన వాఁడు), ఏ కోరిక గలవాఁడు, భవతి = అగుచున్నాఁడో, తత్క్రతుః = ఆ నిశ్చయమే, (భవతి= అగుచున్నది). యత్క్రతుః = ఏదినిశ్చయము, భవతి = అగుచున్నదో, తత్కర్మ = ఆ కర్మను, కురుతే = చేయుచున్నాఁడు, యత్కర్మ=ఏకర్మను, కురుతే=చేయుచున్నాఁడో, తత్ = దానిని, (ఆ ఫలమును), అభిసమ్పద్యతే = పొందుచున్నాఁడు,

తా॥ ఈ జీవునికి బంధన సంజ్ఞకములైన యుపాధులేవియో వానినన్నిటిని చేర్చి యిక్కడ చెప్పఁబడుచున్నది. ఓ జనకుఁడా! జననమరణప్రవాహరూపమైన సంసారముగల ఈజీవుఁడు పరిపూర్ణమైన పరబ్రహ్మమే. ఆ పరబ్రహ్మము ఈ దేహమునందు బుద్ధితోఁ గూడుకొని విజ్ఞానరూపుఁడును, మనస్సుతోఁగూడుకొని మనోరూపుఁడును, ప్రాణముతోఁ గూడుకొని ప్రాణరూపుఁడును, నేత్రముతోఁ గూడుకొని నేత్రరూపుఁడును, శ్రోత్రముతోఁగూడుకొని శ్రోత్రరూపుఁడును, అదే ప్రకారము భూరూపుఁడును, ఉదకరూపుఁడును, వాయురూపుఁడును, ఆకాశరూపుఁడును, తేజోరూపుఁడును, తేజోరహితమైన రూపము గలవాఁడును, కామరూపుఁడును, అకామరూపుఁడును, క్రోధరూపుఁడును, అక్రోధరూపుఁడును, ధర్మరూపుఁడును, అధర్మరూపుఁడును, అయి సమస్తస్వరూపుఁడగుచున్నాఁడు. ఇట్లు చక్షురాదిఇంద్రియములకు ప్రత్యక్షమైన ఈసమస్త స్వరూపమును ఇట్లుచక్షురాదిఇం

ద్రియములకు ప్రత్యక్షమై అంతఃకరణమునం దుండెడి శబ్దాదివిషయ రూపమునై, జీవరూపుఁడుగా నుండి పుణ్యకర్మము చేయువాఁడై పుణ్యాత్ముఁడుగాను, పాపకర్మము చేయువాఁడై పాపాత్ముఁడుగాను అగుచున్నాఁడు. మఱియు కొందఱు ఈ జీవుఁడు కామస్వరూపుఁడని చెప్పుచున్నారు. ఆ కామరూపుఁడగు పురుషుఁడు తన కోరిక ప్రకారము నిశ్చితుఁడై యేకర్మను చేయునో ఆ కర్మఫలమును పొందుచున్నాఁడు

ఉ॥ తదేష శ్లోకో భవతి తదేవ సక్తస్సహ కర్మణైతి లిఙ్గం మనో యత్రనిషక్తమస్య । ప్రాప్యాన్తం కర్మణస్తస్య యత్కించేహ కరోత్యయం । తస్మాల్లోకాత్పునరేత్యస్మై లోకాయ కర్మణ ఇతి ను(ను) కామయమానోఽథాకామయమానో యోఽకామో నిష్కామ ఆప్తకామ ఆత్మకామః న తస్య ప్రాణా ఉత్క్రామన్తి బ్రహ్మైవసన్ బ్రహ్మాప్యేతి. ॥6॥

ప॥ తత్ - ఏషః - శ్లోకః - భవతి - తత్ - ఏవ - సక్తః - సహ - కర్మణా - ఏతి - లిఙ్గం - మనః - యత్ర - నిషక్తం - అస్య - ప్రాప్య - అన్తం - కర్మణః - తస్య - యత్ - కించ - ఇహ - కరోతి - అయం - తస్మాత్ - లోకాత్ - పునః - ఏతి - అస్మై - లోకాయ - కర్మణః - ఇతి - ను (ను)- కామయమానః - అథ - అకామయమానః - యః - అకామః - నిష్కామః - ఆప్తకామః - ఆత్మకామః - న - తస్య - ప్రాణాః - ఉత్క్రామన్తి - బ్రహ్మ - ఏవ - సన్ - బ్రహ్మ - అప్యేతి.

ప్ర॥ తత్ = ఆ పూర్వార్థమునందు, ఏషః = ఈ, శ్లోకః = మంత్రము, భవతి=అగుచున్నది. (జనుఁడు కర్మఫలమునందాసక్తుఁడై యే కర్మను చేయుచున్నాఁడో), సక్తః = ఆసక్తుఁడై, కర్మణాసహ = కర్మతోఁగూడ, తదేవ = ఆ ఫలమునే, ఏతి = పొందుచున్నాఁడు. (అది యేదియనఁగా), అస్య=ఈ పురుషునియొక్క, మనః=మనస్సు, యత్ర = దేనియందు, సక్తం = ఆసక్తమైనదో, (తత్ = అది),

లిఙ్గం = లింగము. (కర్మ లింగమగుచున్నది). అయం = ఈ సంసారి యగు పురుషుఁడు, ఇహ=ఇక్కడ, (ఈ లోకమునందు), యత్కించ= ఏ కర్మను, కరోతి = చేయుచున్నాఁడో, తస్య = ఆ, కర్మణః = కర్మముయొక్క. (ఫలం=ఫలమును, భుక్త్వా = అనుభవించి), అన్తం = అవసానమును, ప్రాప్య = పొంది, తస్మాత్ = ఆ, లోకాత్ = లోకమునుండి, పునః = మరల, అస్మై = ఈ, లోకాయ = లోకము కొఱకు, కర్మణే = కర్మచేయుటకై, ఏతి = వచ్చుచున్నాఁడు. ఇతితు = ఈ ప్రకారముగానైతే, కామయమానః = (కర్మఫలమును) కోరు వాఁడు, (జనన మరణ రూప సంసారమును పొందుచున్నాఁడు). అథ = కనుక. యః = ఎవఁడు. అకామయమానః=కర్మఫలమును కోరని వాఁడును, అకామః = కోరికలేనివాఁడును, నిష్కామః = తనవలన సమస్తమైన కోరికలు పోయినవాఁడును, ఆప్తకామః = పొందఁబడిన కోరికలుగలవాఁడునునై, (శేషము లేకుండునట్లన్ని కోరికల ఫలమును పొందినవాఁడు), ఆత్మకామః = తనస్వరూపమును మాత్రము కోరు వాఁడు, (భవతి = అగుచున్నాఁడో), తస్య=వానియొక్క, ప్రాణాః= వాగాదీంద్రియములు, నోత్క్రామన్తి = విడిచిపోవు. (సః=వాఁడు, ఇహ = ఇక్కడనే), బ్రహ్మైవసన్ = బ్రహ్మమేయై, బ్రహ్మ = పర బ్రహ్మమును, అప్యేతి = నాపొందుచున్నఁడు.

తా॥ ఈ పూర్వార్థమును వివరించుటయంత దీమంత్రము కలిగి నది. ఓ జనకుఁడా! ఈ జీవుఁడు, తన మనస్సు ఏ కర్మ ఫలాసక్త మగునో అది యే గుఱుతుగాఁగల కర్మము గలవాఁడై ఈ లోకము నందు ఏయే కర్మను చేయునో ఆయా కర్మఫలములను పరలోకము నందనుభవించి కర్మఫలాంతమును పొంది ఆ లోకమునుండి మరల కర్మచేయుట కీలోకమునకు వచ్చుచున్నాఁడు. ఈ ప్రకారముగానే కర్మఫలమును కోరెడివాఁడు జనన మరణ రూప సంసారమును పొందు చున్నాఁడు. కనుక సర్వస్వరూపమైన ఆత్మనుకోరువాఁడు సర్వకామ

ముల ఫలమును పొందినవాఁడగును, గనుకనే తనవలనసర్వకామములు నివర్తించినవాఁడై కోరికలేనివాఁడై, దేనిని కోరకయే యుండి ముక్తుఁడగుచున్నాఁడు. ఇట్లు సమస్త కోరికలను విడిచి సర్వస్వరూపమై ఆత్మయైన వానియొక్క వాగాదీంద్రియములు లోకాన్తర గమనములను చేయవు. అట్టివాఁడు ఇక్కడనె పరబ్రహ్మమై పరిపూర్ణమగు బ్రహ్మమును పొందుచున్నాఁడు.

ఉ॥ తదేష శ్లోకో భవతి యదా సర్వే ప్రముచ్యన్తే కామా యేస్య హృది శ్రితాః । అథ మర్త్యోఽమృతో భవత్యత్ర బ్రహ్మ సమశ్నుత ఇతి తద్యథాఽహి నిర్ల్వయనీ వల్మీకే మృతా ప్రత్యస్తా శయీతైవమేవేదగ్ం శరీరగ్ం శేతేఽథాయమ శరీరోఽమృతః ప్రాణో బ్రహ్మైవ తేజ ఏవ సోఽహం భగవతే సహస్రం దదామీతి హోవాచ జనకో వైదేహః ॥7॥

ప॥ తత్ - ఏషః - శ్లోకః - భవతి - యదా - సర్వే - ప్రముచ్యన్తే - కామాః - యే - అస్య - హృది - శ్రితాః - అథ - మర్త్యః - అమృతః - భవతి - అత్ర - బ్రహ్మ - సమశ్నుతే - ఇతి - తత్ - యథా - అహినిర్ల్వయనీ - వల్మీకే - మృతా - ప్రత్యస్తా - శయీత - ఏవం - ఏవ - ఇదం - శరీరం - శేతే - అథ - అయం - అశరీరః - అమృతః - ప్రాణః - బ్రహ్మ - ఏవ - తేజః - ఏవ - సః - అహం - భగవతే - సహస్రం - దదామి - ఇతి - హ - ఉవాచ - జనకః - వైదేహః.

ప్ర॥ తత్=ఆ యర్థమునందు, ఏషః=ఈ, శ్లోకః=మంత్రము, భవతి = అగుచున్నది. అస్య = ఈ పురుషునియొక్క, హృది = బుద్ధియందు, యే=ఏవి, (ఇహలోక పరలోకోపయోగములగు పుత్రవిత్తలోకేషణాది లక్షణములగు కోరికలు), శ్రితాః = ఆశ్రయించి యున్నవో, (తే = ఆ) సర్వే = సమస్తమైన, కామాః = కోరికలు, యదా = ఎప్పుడు, (ఈ బ్రహ్మవేత్తకు), ప్రముచ్యన్తే = మిక్కిలి

విడిచిపోవుచున్నవో, అథ = అప్పుడు, మర్త్యః = మరణధర్మముగల మనుజుఁడు, అమృతః=మరణము లేనివాఁడు, భవతి=అగుచున్నాఁడు. అత్ర = ఈ శరీరమునందే, బ్రహ్మ = పరబ్రహ్మమును, సమశ్నుతే= పొందుచున్నాఁడు, ఇతి = అని ఉక్తం = చెప్పఁబడినది). తత్ = దానియందు (దృష్టాంతము చెప్పఁబడుచున్నది). యథా = ఏ ప్రకారము, అహినిర్ల్వయనీ = అహి = సర్పముయొక్క, నిర్ల్వయనీ = కుబుసము, వల్మీకే = పుట్టయందు, ప్రత్యస్తా = ఉంచఁబడినదై, మృతా = మరణమును పొందినదై, శయీత = పండుకొనునో, ఏవమేవ = ఈ ప్రకారముగానే, ఇదం శరీరం = ఈ దేహము, శేతే = పడియున్నది. అథ = అనంతరము. అశరీరః = శరీరములేని వాఁడును, (ఈ దేహము నాదియనిగాని లేక నేనని గాని అభిమానము లేనివాఁడు శరీరమునందున్నను శరీరము లేనివాఁడే). అమృతః=మరణము లేనివాఁడునగు, (అయం = ఈ ప్రాణః = ఆత్మ, బ్రహ్మైవ = పరమాత్మయే. (అది యేదియనఁగా), తేజఏవ = తేజస్సే. (ఏ ఆత్మ చేత ఈ జగత్తు ప్రకాశించుచున్నదో అట్టి విజ్ఞానమగు ఆత్మ తేజస్సు అని యాజ్ఞవల్క్యుఁడు ఉపదేశించఁగా), వైదేహః = విదేహదేశ ప్రభువైన, జనకః = జనకమహారాజు, సః = ఆ ప్రసిద్ధుఁడనగు, అహం = నేను, భగవతే = నీకొఱకు, (గవాం = గోవులయొక్క, సహస్రం = వేయింటిని, దదామీతి = ఇచ్చుచున్నానని, హోవాచ = పలికెను.

తా॥ ఇంతకుపూర్వము జననమరణ రూపమైన ఈ దేహమను సంసారమునకు కామమె ముఖ్యకారణమని నిర్ణయించి సర్వస్వరూపమైన ఆత్మ కామముచేత జనుఁడు ఆప్తకాముఁడైన యెడల ముక్తుఁడగుచున్నాఁడనిచెప్పి ఆ ఆప్తకామత్వమునకు బ్రహ్మజ్ఞానము ముఖ్యకారణము గనుక బ్రహ్మవిద్యయె మోక్షమునకు కారణమైనదని చెప్పఁబడినది. దానినే దృఢపఱచుటకు వేఱుమంత్రి ముదాహరింపబడు

చున్నది. ఓ జనకుఁడా! జననమరణరూప సంసారమును పొందియున్న ఈ జీవుఁడు తనయొక్క బుద్ధియందలి కోరికలన్నియు నెప్పుడు విడిపోయి నిష్కాముఁడగునో అప్పుడే మరణములేనివాఁడై ముక్తుఁడై వేఱు ప్రదేశమునకు పోవకయే ఈ శరీరమునందే పరబ్రహ్మమును పొందు చున్నాఁడు. పరబ్రహ్మమగుచున్నాఁడు. దానికిక్కడ ఒకదృష్టాంతము చెప్పఁబడుచున్నది. ఎట్లనఁగా, పాము కుబుసము. దాని నివాసమగు పుట్టయందుంచఁబడి మృతిబొంది యున్నట్లు ఈ శరీరము జీవుఁడు తానుకాని బుద్ధ్యాదీంద్రియములయందు నేననిగాని నావియనిగాని యనెడి తాదాత్మ్య తద్ధర్మాధ్యాసలను విడిచి పరబ్రహ్మమైనప్పుడు, నిశ్చేష్టితమై, యెక్కడయున్న దక్కడనే యుండును. అట్లు పరబ్రహ్మ స్వరూపియై ముక్తుఁడైన జీవుఁడు ఈ దేహమునందుండియును అభి మాన రహితుఁడగుటచే దేహమందుండని వాఁడు, మరణము లేని వాఁడునై పరమాత్మ యగుచున్నాఁడు. అట్టి పరమాత్మ యేది యనఁగా, ఈ బుద్ధ్యాది సర్వప్రపంచమును ప్రకాశింపఁజేయుచున్న ఆత్మ తేజస్సేయని యాజ్ఞవల్క్యుఁ డుపదేశించఁగా, విదేహదేశప్రభు వైన జనకమహారాజు, ఓ యాజ్ఞవల్క్యుఁడా! నీకు నేను వేయి గోవులను ఇచ్చుచున్నానని పలికెనని జనక యాజ్ఞవల్క్య ఖ్యాయి కారూపమును ధరించిన శ్రుతిచేత స్వకీయముగా జనులకొఱకు సంసార విమోక్షోపాయము చెప్పఁబడినది.

ఉ॥ తదేతే శ్లోకా భవన్తి । అణుః పన్థా వితతః పురాణో మాగ్ స్పృష్టోఽనువిత్తో మయైవ । తేన ధీరా అపి యన్తి బ్రహ్మవిద స్స్వర్గం లోకమిత ఊర్ధ్వా విముక్తాః. ॥8॥

ప॥ తత్ – ఏతే – శ్లోకాః – భవన్తి – అణుః – పన్థాః – వితతః – పురాణః – మాం – స్పృష్టః – అనువిత్తః – మయా – ఏవ – తేన – ధీరాః – అపియన్తి – బ్రహ్మవిదః – స్వర్గం – లోకం– ఇతః – ఊర్ధ్వాః విముక్తాః.

ప్ర॥ తత్-ఆ అర్థమునందు, (ఆత్మకాముఁడగు బ్రహ్మవేత్తకు మోక్షము కలుగుననెడి అర్థమునందు), ఏతే = ఈ ముందు చెప్పఁబోయెడి, శ్లోకాః = మంత్రములు, భవన్తి = అగుచున్నవి పురాణః = ప్రాచీనమును, అణుః = సూక్ష్మమును, వితతః = తరింపఁజేయునదియు నగు, పన్థాః = జ్ఞానమార్గము, మాం = నన్ను, స్పృష్టః = స్పృశించుచున్నది. (నన్ను పొందినది). మయైవ = నాచేతనే, అనువిత్తః = అనుసరించి తెలిసికొనఁబడినది. తేన = ఆ మార్గముచేతను, ధీరాః = ధీరులగు, (ప్రజ్ఞావంతులగు), బ్రహ్మవిదః=బ్రహ్మవేత్తలు, విముక్తాస్సంతః = జీవించియుండఁగానే ముక్తులై, ఇతః = ఈ దేహపాతముకంటె, ఊర్ధ్వా = అనంతరము, స్వర్గంలోకం=మోక్షమును, (ఇక్కడ స్వర్గలోకమనఁగా మోక్షమర్థము), అపియన్తి = పొందుచున్నారు.

తా॥ ఇంతకుపూర్వము ఆత్మకాముఁడగు బ్రహ్మవేత్తకు మోక్షము కలుగునని చెప్పిన మంత్రబ్రాహ్మణముయొక్క అర్థమును విస్తరించి చెప్పునవి ఈ చెప్పఁబోయెడి మంత్రములు. ఓ యాజ్ఞవల్క్యుఁడా ! జననమరణరూపసంసారమునుండి తరింపఁజేయునట్టిదియును ప్రాచీనమును సూక్ష్మమునగు జ్ఞానమార్గము నన్ను పొందినది. నాచేతే ఆ జ్ఞానమార్గ మనుసరించి తెలిసికొనఁబడినది. ఆ జ్ఞానమార్గముచేతనే ప్రజ్ఞావంతులగు బ్రహ్మవేత్తలు జీవించియుండఁగానే ముక్తులై ఈ దేహము పడిపోయిన తరువాత మోక్షమును పొందుచున్నారు.

శ్లో॥ తస్మిఞ్ఛుక్లముత నీలమాహుః పిఙ్గళగ్ం హరితం లోహితం చ ।
ఏష పన్థా బ్రహ్మణా హానువిత్తః తేనైతి బ్రహ్మవిత్పుణ్యకృత్తైజసశ్చ. ॥9॥

ప॥ తస్మిన్ - శుక్లం - ఉత - నీలం - ఆహుః - పిఙ్గళం - హరితం - లోహితం - చ - ఏషః - పన్థాః - బ్రహ్మణా - హా -

అనువి_త్తః - తేన - ఏతి - బ్రహ్మవిత్ - పుణ్యకృత్ - తైజసః - చ.

ప్ర॥ తస్మిన్=ఆ జ్ఞానమార్గము విషయమై, (కేచిత్=కొందఱు), శుక్లం=తెల్లనినాడిని, ఉత = మఱియును, (అన్యే = మఱికొందఱు), నీలం=నల్లనినాడిని, (ఇంకకొందఱు), పిఙ్గళం = పసుపురంగు నాడిని, (మఱికొందఱు) హరితం = పచ్చనినాడిని, లోహితంచ=ఎఱ్ఱనినాడిని, మోక్షమార్గమని), ఆహుః = చెప్పిరి (వాత పి_త్త శ్లేష్మరసములచే నిండింపఁబడిన సుషుమ్న మొదలైన నాడులలో ఈ శుక్లాదినాడులు మోక్షమార్గములని కొందఱు తలంచుదురు ఇట్లు చెప్పఁబడిన బ్రహ్మ విద్యా మార్గముకంటె అన్యములగు ఈ శుక్లాదినాడులు సంసారవిష యములైనవిగాని మోక్షవిషయములైనవి కావు. కనుక), ఏషః = ఈ, పన్థాః=బ్రహ్మవిద్యారూపమైన మోక్షమార్గము, బ్రహ్మణాహ = పరమాత్మ స్వరూపమైన బ్రాహ్మణునిచేతను, అనువి_త్తః = తెలిసి కొనఁబడినది. తేన=బ్రహ్మవిద్యాస్వరూపమైన ఆ మోక్షమార్గము చేతనే, పుణ్యకృత్ = పుణ్యము చేసిన, తైజసశ్చ=పరమాత్మస్వరూ పుఁడగు, బ్రహ్మవిత్ = బ్రహ్మజ్ఞాని, ఏతి = పొందుచున్నాఁడు.

తా॥ ఓ జనకుఁడా! కొందఱుయోగులు ఆ మోక్షమార్గము నందు వాత పి_త్త శ్లేష్మరసములచే నిండింపఁబడిన శుక్లనీలపీతహరిత లోహితములగు సుషుమ్నాదినాడులు మోక్షమునకు ముఖ్యమార్గము లని చెప్పుదురు. ఆ శుక్లాదిరంగులు మోక్షమార్గమునం దెట్లు కలు గును ? కలుగనేరవు. అయినను, ఆ శుక్లనీలపీతాదినాడులు, తమ ద్వారా జీవాత్మ, ఈ శరీరప్రదేశమునుండి బయలువెడలుటయొక్క సంబంధమువలన ఆ జీవాత్మను బ్రహ్మాదిలోకములను పొందించు చున్నవి. కనుక, ఎవఁడు, ఆత్మను కోరుటచేత సర్వకామములు నశిం చఁగా ఆ_ప్తకాముఁడై లోకాంతరములగు అన్యదేశములకు పోవుట సంభవించనందున, దీపము చల్లాఱినట్లు నేత్రము మొదలైన దేహేం ద్రియములకు ఇక్కడనే లీనము కలిగి ఆత్మగా శేషించుచున్నాఁడో,

ఇదియె బ్రహ్మవిద్యాస్వరూపమైన మోక్షమార్గము పూర్వము పుణ్యముచేసినవాఁడై మరల విడువఁబడిన పుత్రాద్యేషణలుకలవాఁడై పరమాత్మ తేజస్సునందుతన్ను చేర్చి ఆత్మస్వరూపుఁడైన బ్రహ్మవేత్త, ఈ పూర్వము చెప్పఁబడిన బ్రహ్మవిద్యా స్వరూపమగు మోక్షమార్గ ముచే ఇక్కడనే బ్రహ్మస్వరూపియై దీపనిర్వాణమువలెనే పరబ్రహ్మ తేజస్సునం దైక్యమగుచున్నాఁడు

ఉ॥ అన్ధం తమః ప్రవిశన్తి యేఽవిద్యాముపాసతే । తతో భూయ ఇవ తే తమో య ఉ విద్యాయాగ్ రతాః. ॥10॥

ప॥ అన్ధం – తమః – ప్రవిశన్తి – యే – అవిద్యాం – ఉపాసతే – తతః – భూయః – ఇవ – తే – తమః – యే – ఉ – విద్యాయాం – రతాః.

ప్ర॥ యే = ఎవరు, అవిద్యాం = కర్మను, (జ్ఞానముకంటె వేఱయిన సాధ్యసాధనలక్షణమగు కర్మను), ఉపాసతే = ఉపాసించుచున్నారో, (తే = వారు), అన్ధంతమః = గాఢమైన అజ్ఞానమును, (సంసారనియామకమును), ప్రవిశన్తి = పొందుచున్నారు. య ఉ = ఎవరైతే, విద్యాయాం = వేదమునందు, (అవిద్యావస్తు ప్రతిపాదకమును కర్మప్రయోజకమునగు వేదమునందు), రతాః = ఆసక్తిగలవారో, తే = వారు, తతః = ఆ పూర్వాజ్ఞానముకంటె, భూయఇవ = మిక్కిలి అధికమైనదే యైన తమః = అజ్ఞానమును, (ప్రవిశన్తి= పొందుచున్నారు).

తా॥ ఓ జనకుఁడా! ఈ పూర్వోక్త జ్ఞానమార్గముకంటె నన్యమగు కర్మను సేవించువారును, ఆకర్మ ప్రతిపాదకమగు ఉపనిషద్వ్యతిరిక్తమైన వేదమం దాసక్తి గలవారును, దేహేంద్రియాది సంసార నియామకమగు అధికమైన అజ్ఞానమును పొందుచున్నారు.

ఉ॥ అనన్దా నామ తే లోకా అన్ధేన తమసావృతాః । తాగ్ స్తే ప్రేత్యాభిగచ్ఛన్త్యవిద్వాగ్ సోఽబుధో జనాః. ॥11॥

ప॥ అనన్దాః – నామ – తే – లోకాః – అన్ధేన – తమసా –

ఆవృతాః - తాన్ - తే - ప్రేత్య - అభిగచ్ఛన్తి - అవిద్వాంసః - అబుధః - జనాః.

ప్ర॥ తే = ఆ, లోకాః = లోకములు, అనన్దానామ=మిక్కిలి అసుఖకరములైనవై, అన్ధేనతమసా = గాఢాంధకారముచేతను, (గాఢాజ్ఞానముచేతను), ఆవృతాః=ఆవరింపఁబడినవి. అవిద్వాంసః= పండితులు కానివారును, ఆబుధః=ఆత్మజ్ఞానములేనివారునగు, నా జః= జనులు, (యే = ఎవరో), తే = వారు, ప్రేత్య=మరణమునుపొంది, తాన్=ఆ పూర్వము చెప్పఁబడిన లోకములను, (ఆ అజ్ఞానావృతములైన లోకములను), అభిగచ్ఛన్తి = పొందుచున్నారు.

తా॥ ఓ జనకుఁడా! అజ్ఞానావృతములగు అసుఖకరములైన లోకములుకలవు. అట్టి లోకములనుగూర్చి అపండితులై అజ్ఞానముచే ఆవరింపఁబడి, కర్మలనుచేయుచు, ఆత్మజ్ఞానములేక దేహమును సంసారమును పొందియున్న ఈ జనులు మరణమునుపొంది పోవుచున్నారు.

ఉ॥ ఆత్మానం చేద్విజానీయాదయమస్మీతి పూరుషః। కిమిచ్ఛన్కస్య కామాయ శరీరమనుసంజ్వరేత్. ॥12॥

ప॥ ఆత్మానం - చేత్ - విజానీయాత్ - అయం - అస్మి - ఇతి - పూరుషః - కిం - ఇచ్ఛన్ - కస్య - కామాయ - శరీరం - అనుసంజ్వరేత్

ప్ర॥ పూరుషః = పురుషుఁడు, అయమస్మీతి = పరమాత్మయగుచున్నానని, ఆత్మానం = తన్ను, (హృదయమునందు అశనాయాది ధర్మములు లేని పరమాత్మ స్వరూపమగు తన్ను), విజానీయాచ్చేత్ = తెలిసికొనినయెడల కిం = దేనిని, ఇచ్ఛన్ =కోరుచు, కస్య = ఆత్మవ్యతిరిక్తమైన దేనియొక్క, కామాయ=ప్రయోజనము కొఱకు, శరీరం=దేహమును, అనుసంజ్వరేత్ = అనుసరించి తాపమును పొందించును.

తా॥ ఓ జనకుఁడా ! అనేకులలో ఒకానొకఁడగు పురుషుఁడు పరమాత్మ స్వరూపము నేనే యగుచున్నానని హృదయమునందలి అశనాయాది ధర్మములులేని పరమాత్మ స్వరూపమగు తన్ను తెలిసికొని తానుగానే నిలిచనేని దేనిని కోరినవాఁడై ఆత్మవ్యతిరిక్తమైన యే ప్రయోజనము కొఱకును శరీరమును అనుసరించి సంతాపమును పొందఁడు. వాడు సర్వదా ఆత్మగానే యుండుటవలన తదితరమైన కోరిక యే వానికి కలుగదు.

ఉ॥ యస్యానువిత్తః ప్రతిబుద్ధ ఆత్మాఽస్మిన్సన్దేహ్యే గహనే ప్రవిష్టః ।
స విశ్వకృత్స హి సర్వస్య కర్తా తస్య లోకస్సఉలోక ఏవ. ॥13॥

ప॥ యస్య – అనువిత్తః – ప్రతిబుద్ధః – ఆత్మా – అస్మిన్ – సన్దేహ్యే – గహనే – ప్రవిష్టః – సః – విశ్వకృత్ – సః – హి – సర్వస్య – కర్తా – తస్య – లోకః – సః – తు – లోకః – ఏవ.

ప్ర॥ గహనే = విషమమైన, అస్మిన్ = ఈ, సన్దేహ్యే = పృథివ్యాది భూతములచే వృద్ధిపొందింపఁబడిన దేహమునందు, ప్రవిష్టః = ప్రవేశించియున్న, ఆత్మా = ఆత్మ, యస్య=ఎవనికి, (ఎవనిచేత), అనువిత్తః = అనుసరించి పొందఁబడినదై, ప్రతిబుద్ధః=ప్రత్యక్షముగాఁ జేసికొనఁబడెనో, (ఈ దేహమునందు పరబ్రహ్మము నేనైతినని తెలిసికొనఁబడినదో), సః = వాఁడు, విశ్వకృత్ = ప్రపంచమునకు కర్త, (యత్=ఏ కారణమువలన); సహి=వాఁడె, సర్వస్య=సమస్తమునకు, కర్తా = కర్త, (భవతి = అగుచున్నాఁడో), తస్య = వానికి, లోకః =ఆత్మ, (ఇక్కడ లోకశబ్దమునకు ఆత్మ అర్థము చెప్పఁబడుచున్నది.) లోకఏవ = ఆత్మయె, సతు = వాఁడు, (భవతి = అగుచున్నాఁడు).

తా॥ ఓ జనకుఁడా! విషమమై పృథివ్యాదిభూతములచే నిర్మింపఁబడి అనేక సంకటములతోఁ గూడి వృద్ధిగల ఈ దేహమునందు ప్రవేశించియున్న ఆత్మ ఎవనిచేత తెలిసికొనఁబడి పరబ్రహ్మము నేనైతినని ప్రత్యక్షము చేసికొనఁబడునో వాఁడె సర్వమునకు కర్తయగుట

వలన ప్రపంచమునకు కర్తయగుచున్నాఁడు. వాఁడే ఆత్మయు ఆత్మే వాఁడును అగుచున్నాఁడు. వానికి సర్వము ఆత్మ. సర్వమునకు వాఁడు ఆత్మయగుచున్నాఁడు, గనుక అద్వితీయమును ఏకము నగు పరమాత్మ నేనని తలంపవలయును.

ఉ॥ ఇహైవ సన్తోఽథ విద్మస్తద్వయం న చేద వేదిర్మహతీ వినష్టిః ।
యే ఏతద్విదురమృతాస్తే భవన్త్యథేతరే దుఃఖమేవాపి యన్తి.14

ప॥ ఇహ - ఏవ - సన్తః - అథ - విద్మః - తత్ - వయం- న - చేత్ - అవేదిః - మహతీ - వినష్టిః - యే - ఏతత్ - విదుః- అమృతాః - తే - భవన్తి - అథ - ఇతరే - దుఃఖం - ఏవ - అపియన్తి.

ప్ర॥ ఇహైవ = ఈ దేహమునందే, సన్తః = ఉన్నవారలై, (అజ్ఞానమనెడి దీర్ఘనిద్రచే మోహపెట్టఁబడినవారలైయుండి), తత్ = బ్రహ్మమును, వయం = మేము, అథ=అతిప్రయత్నముతో, విద్మః = తెలిసికొనుచున్నారము. (బ్రహ్మతత్త్వ తత్త్వమును మా స్వరూపముగానే తెలిసికొని మేము కృతార్థుల మగుచున్నామనెడి జ్ఞానము, నచేత్ = లేనియెడల, మహతీ = అధికమైన, వినష్టిః=నాశముగల, (అనంతముగా పరిణమించుచున్న జన్మమరణాది లక్షణమైన నాశము గల), అవేదిః = అజ్ఞానము. (భవతి=కలుగుచున్నది). యే=ఎవరు, ఏతత్ = ఈ పరబ్రహ్మమును, విదుః = తెలిసికొనిరో, తే=వారు, అమృతాః = మరణము లేనివారు, భవన్తి = అగుచున్నారు. అథ= అనంతరము, ఇతరే=అన్యులు, (పరబ్రహ్మమును తెలిసికొననివారు). దుఃఖమేవ = దుఃఖమునే, (జనన మరణాది దుఃఖమును), అపియన్తి= పొందుచున్నారు.

తా॥ ఇక్కడ బ్రహ్మవేత్త కృతార్థుఁడనుటకు శ్రుతిసమ్మతిని చూపించుచున్నాఁడు. ఓ జనకుఁడా! పురుషులు అనేక సంకటములు గల ఈ దేహమందే అజ్ఞానమను దీర్ఘనిద్రచే మోహపెట్టబడిన

వారలై యుండి పరబ్రహ్మస్వరూపము మేము అని తెలిసికొని కృతార్థులమగుచున్నారమని తెలిసికొననియెడల వారికి ఆ అజ్ఞానముచేత అనంతముగా పరిణమించుచున్న జన్మమరణాదిలక్షణమగు గొప్ప నాశము కలుగుచున్నది. ఆ పరబ్రహ్మమే మేమైతిమని తెలిసికొను వారు మరణము లేనివారై ముక్తులగుచున్నారు. ఇట్లు తెలిసికొనని అజ్ఞానులు జననమ్మరణాది దుఃఖమును పొందుచున్నారు.

ఉ॥ యదైతమనుపశ్యత్యాత్మానం దేవమఞ్జసా । ఈశానం భూతభవ్యస్య న తతో విజుగుప్సతే. ॥15॥

ప॥ యదా – ఏతం – అను – పశ్యతి – ఆత్మానం – దేవం– అఞ్జసా – ఈశానం – భూతభవ్యస్య – న – తతః – విజుగుప్సతే.

ప్ర॥ (పురుషః = పురుషుఁడు) పరమకారుణికం = మిక్కిలి దయాళుఁడగు, ఆచార్యం = అచార్యుని, ప్రాప్య = పొంది, తతః = ఆ గురువు వలన, లబ్ధప్రసాదస్సన్ = పొందఁబడిన అనుగ్రహము గలవాఁడై), అను = అనంతరము, భూతభవ్యస్య = కాలత్రయము నకు, ఈశానం = ప్రభువైన, దేవం = ప్రకాశమానమైన, ఏతం= ఈ, ఆత్మానం = ఆత్మస్వరూపమును, యదా = ఎప్పుడు, అఞ్జసా= శీఘ్రముగా, పశ్యతి = చూచుచున్నాఁడో, (ప్రత్యక్షము చేసికొను చున్నాఁడో), (తదా = అప్పుడు), తతః = ఆ ఈశ్వరునివలన, (ఆత్మానం = తన్ను), నవిజుగుప్సతే = కాపాడుకొనఁగోరఁడు. (లేక ఎప్పుడు స్వప్రకాశకుఁడును సర్వనియంతయునగు ఈశ్వరుని తన్నుగాఁ దెలిసికొనుచున్నాఁడో అప్పుడు జనుఁడు ఎవనిని నిందింపఁడు).

తా॥ ఇప్పుడు జ్ఞానికి, శాస్త్రవిహితమైన కర్మనుచేయకపోవుట వల్ల కలిగెడి భయము లేదని బ్రహ్మవిద్యను స్తుతించుటకై చెప్పఁబడుచున్నది. ఓ జనకమహారాజా! భూతభవిష్యద్వర్తమానకాల త్రయమునకు నియామకుఁడగు ఈ ఈశ్వరుని తన ఆత్మగా (తన్నుగా) తెలిసికొనువాఁడు సర్వస్వరూపుఁడై తనకు వేఱొకవస్తువు లేకపోవుట

వలన దేనివల్లను భయములేనివాఁడై ఈశ్వరునివల్ల తన్ను కాపాడు కొనఁగోరఁడు ఇట్లు ఈశ్వరుఁడై తానగుటవల్లను తనకు అన్యుఁడు లేకపోవుట వల్లను ఎవనిని నిందింపఁడు. సర్వమును తన్నుగా నె చూచును.

ఉ। యస్మాదర్వాక్సంవత్సరోఽహోభిః పరివర్తతే। తద్దేవా జ్యోతి
షాం జ్యోతిరాయుర్హోపాసతేఽమృతం. ॥16॥

ప॥ యస్మాత్ – అర్వాక్ - సంవత్సరః – అహోభిః – పరి వర్తతే – తత్ – దేవాః – జ్యోతిషాం – జ్యోతిః – ఆయుః - హ– ఉపాసతే – అమృతం.

ప్ర॥ యస్మాత్ = ఏ ఈశ్వరునికంటె, అర్వాక్=అన్యవిషయ మైన, సంవత్సరః = సంవత్సరము, (కాలాత్మ), అహోభిః = కాలా వయవములగు దినములచేతను, పరివర్తతే = అంతటను ఉన్నది. తత్ = ఆ, జ్యోతిషాం = సూర్యాది తేజస్సులకు, జ్యోతిః=ప్రకాశక మగు, అమృతః = మరణరహితమైన తేజస్సును, దేవాః= దేవతలు, ఆయుః = ఆయుస్సు అని, ఉపాసతే = ధ్యానించుచున్నారు.

తా॥ ఇప్పుడు ఈశ్వరునికిని కాలము అన్యముకాగా కాలము ఈశ్వరేతర వస్తువగుటవలన, లోకమునందు కాలమునుండి ఘటము వలెనే ఈశ్వరత్వము కాలత్రయముతోఁగూడుకొన్నది యని శంకిం పఁగా జెప్పుచున్నాఁడు. ఓ జనకుఁడా! ఈశ్వరునికి తక్కువై అన్య విషయముగానుండు కాలాత్మ కాలావయవములగు రాత్రిం బగళ్ళచే నేర్పడియున్నది, ఇట్టి కాలము పుట్టుకగల సర్వమునకు వేఱువస్తువై కూడుకొనుచున్నదియె గాని పుట్టుకలేని ఈశ్వరునికి అట్లు కానేరదు. దేవతలు సూర్యాది తేజస్సులకు ప్రకాశకమైన మరణరహితమగు ఆ తేజస్సును ఆయుస్సు అని యుపాసించుచున్నారు కనుకనే దేవతలు విశేష ఆయుర్దాయము కలవారలగుచున్నారు. కాఁబట్టి ఆయుష్కా మునిచే బ్రహ్మము ఆయుర్గుణమని యుపాసింపఁదగినది

ఉ॥ యస్మిన్పఞ్చపఞ్చజనా ఆకాశశ్చ ప్రతిష్ఠితః । తమేవ మన్య
ఆత్మానం విద్వాన్బ్రహ్మ మృతో౽మృతం ॥17॥

ప॥ యస్మిన్ - పఞ్చ - పఞ్చజనాః - ఆకాశః - చ - ప్రతిష్ఠితః - తం - ఏవ - మన్యే - ఆత్మానం - విద్వాన్ - బ్రహ్మ - అమృతః - అమృతం.

ప్ర॥ పఞ్చ = అయిదుసంఖ్యగల, పఞ్చజనాః = గంధర్వులు మొదలైనవారును, (గంధర్వులు, పితరులు, దేవతలు, అసురులు, రక్షస్సులు), ఆకాశశ్చ = ఆకాశమును, యస్మిన్ = దేనియందు, (అక్షరస్వరూపమునందు), ప్రతిష్ఠితః = ఉంచఁబడినదో, తమేవ = ఆ పరమాత్మనే, ఆత్మానం = ఆత్మస్వరూపమునుగానే, మన్యే = తలంచుచున్నాను. (అహం = నేను), అమృతం = నాశరహితమగు, బ్రహ్మ=పరబ్రహ్మమును, విద్వాన్ = తెలిసికొనినవాఁడై, అమృతః= మరణములేని పరమాత్మనైతిని.

తా॥ పూర్వమంత్రమునందు సూర్యాది తేజస్సులకు ప్రకాశకమగు తేజస్సుఅమృతమని చెప్పఁబడినది. దానికే సర్వమునకు అధిష్ఠానమగుటచే అమృతత్వము ఇక్కడ సాధించుచున్నాఁడు. ఓ జనకుఁడా! పంచసంఖ్యగలగంధర్వాదులును, అవ్యాకృతి ఆకాశమును, ఏ అక్షర పరబ్రహ్మమునందు ఆధారముగానున్నదో ఆ అక్షరస్వరూపమగు పరబ్రహ్మమునే ఆత్మనుగాఁదలంచుచున్నాను. ఇట్లు తలంచినను నీవు మనుష్యుఁడవుగానే యుంటివేయనిన, నేను అజ్ఞానముచేత మనుష్యుఁడనైనప్పటికిని నా ఆత్మను అక్షరపరబ్రహ్మమునుగాఁ దెలిసికొనినవాఁడనై మరణధర్మముగల మనుష్యత్వముపోయి పరబ్రహ్మమునగుచున్నాను ఆయుక్షీణము అజ్ఞానముచేతనేగాని జ్ఞానముచేత అమృతమె యగుచున్నది.

ఉ॥ ప్రాణస్య ప్రాణముత చక్షుష శ్చక్షురుత. శ్రోత్రస్య శ్రోత్రం ।
మనసో యే మనోవిదుః। తే నిచిక్యుర్బ్రహ్మ పురాణ మగ్ర్యం.॥18॥

ప॥ ప్రాణస్య - ప్రాణం - ఉత-చక్షుషః - చక్షుః - ఉత - శ్రోత్రస్య - శ్రోత్రం - మనసః - యే - మనః - విదుః - తే-నిచిక్యుః - బ్రహ్మ - పురాణం - అగ్ర్యం.

ప్ర॥ యే = ఎవరు, (తత్ = ఆపరబ్రహ్మ తేజస్సును), ప్రాణస్య = ప్రాణమునకు, ప్రాణం = ప్రాణముగాను, (ప్రాణమునకు ఆధారముగాను), ఉత = మఱియును, చక్షుషః = నేత్రమునకు, చక్షుః = నేత్రముగాను, ఉత=మఱియును, శ్రోత్రస్య = శ్రోత్రమునకు శ్రోత్రం = శ్రోత్రముగాను, మనసః = మనస్సునకు, మనః = మనస్సుగాను, విదుః = తెలిసికొనిరో, తే = వారు, అగ్ర్యం = మొట్ట మొదటిదియైన, పురాణం = ప్రాచీనమగు, బ్రహ్మ = పరబ్రహ్మమును, నిచిక్యుః = నిశ్చయముగాఁ దెలిసికొనిన వారగుచున్నారు.

తా॥ ఓ జనకుఁడా! ఇంతకుపూర్వము సర్వాధారముగాఁ జెప్పఁబడిన అక్షరస్వరూపమును ప్రాణ వ్యాపారమునకు ఆధారముగాను నేత్రమునకు ఆధారమునుగాను శ్రోత్రమునకు ఆధారముగాను మనస్సునకు మనస్సుగాను తెలిసికొని చక్షురాదీంద్రియ వ్యాపారముల ద్వారా ప్రత్యగాత్మస్వరూపమైన ఆత్మయున్నదని ఊహించి తెలిసికొనువారు ప్రాచీనమగు మొట్టమొదటి పరబ్రహ్మమును నిశ్చయముగాఁ దెలిసికొనుచున్నారు.

ఉ॥ మనసైవాను ద్రష్టవ్యం నేహ నానాస్తి కిఞ్చన । మృత్యోస్స మృత్యుమాప్నోతి య ఇహ నానేవ పశ్యతి. ॥19॥

ప॥ మనసా - ఏవ - అనుద్రష్టవ్యం - న - ఇహ - నానా - అస్తి - కిఞ్చన - మృత్యోః - సః - మృత్యుం - ఆప్నోతి - యః - ఇహ - నానా - ఇవ - పశ్యతి.

ప్ర॥ (తత్ = పరబ్రహ్మమును), మనసైవ = మనస్సుచేతనే, అను ం = అనుసరించి చూడఁదగినది. ఇహ = ఈపరబ్రహ్మ

దర్శన విషయమునందు, కిఞ్చన = కొంచెమును, నానా = అనేకత్వ మును, నాస్తి = లేదు. యః= ఎవఁడు, ఇహ = పరబ్రహ్మదర్శనము నందు, నానేవ=అనేకవిధమైనదివలెనే, పశ్యతి=చూచుచున్నాఁడో, సః = వాఁడు, మృత్యోః = మరణమువల్ల, మృత్యుం = మరణ మును, ఆప్నోతి = పొందుచున్నాఁడు.

తా॥ ఆ పరబ్రహ్మదర్శనమునకు సాధనమిక్కడ చెప్పఁబడు చున్నది. ఓ జనకమహారాజా! సద్గురూపదేశముచే పరమార్థజ్ఞానము నందు సంస్కారముగలదిగాఁ జేయఁబడిన మనస్సుచేతనే పరబ్రహ్మము తెలిసికొనఁదగినది. పరబ్రహ్మము వాఙ్మనస్సులకతీతమైనది. అట్టి పరబ్రహ్మమును చూచుటకు మనస్సు ఎట్లుగా సాధనమగుననిన, మనస్సు, పరబ్రహ్మమును గోచరించనిదైనను శ్రవణ మనన నిదిధ్యాసలచే సంస్కారముగలదై ఆ పరబ్రహ్మాకారముగుచున్నది. అట్టి మనస్సుచే పరబ్రహ్మము అనుసరించి చూడఁదగినది పరబ్రహ్మ దర్శన విషయమై కొంచమైనను నానాత్వములేదు. పరబ్రహ్మదర్శన విషయమునందు నానాత్వమును చూచువాఁడు మరణమువలన మర ణమును పొందుచున్నాఁడు.

ఉ॥ ఏకధైవానుద్రష్టవ్యమేతదప్రమేయం ధ్రువం। విరజః పర ఆకాశా
దజ ఆత్మా మహాన్ ధ్రువః. ॥20॥

ప॥ ఏకధా - ఏవ - అనుద్రష్టవ్యం - ఏతత్ - అప్రమేయం- ధ్రువం - విరజః - పరః - ఆకాశాత్ - అజః - ఆత్మా-మహాన్ - ధ్రువః.

ప్ర॥ ధ్రువం = నిత్యమును, (కూటస్థమును, అచలమును), అప్రమేయం = దేనిచేతను పరిమితిచేయ నలవిగానిదియునగు, ఏతత్ = ఈ పరబ్రహ్మమును, ఏకధైవ = ఏకరీతిగా, (ఒకటే విధముగా), అనుద్రష్టవ్యం = అనుసరించి చూడఁదగినది. ఆత్మా = ఆత్మ, మహాన్ = గొప్పదియును, ధ్రువః = నిత్యమైనదియును, అజః =

జన్మములేనిదియును, విరజః = ధర్మాధర్మాది మలములు లేనిదియును, ఆకాశాత్ = ఆకాశమునకంటె. పరః = వేఱైనదియును. (సూక్ష్మమైనదియును, భవతి = అగుచున్నది).

తా॥ ఓ జనకుఁడా! వేఱొకదానిచేత పరిమితిచేయ నలవిగానిదియును నిత్యమైనదియును చలింపనిదియునగు ఈ బ్రహ్మమును ఒక్కటిగాఁజూడఁదగినది. ఇట్టి ఆత్మస్వరూపము పరిమితివలన మిక్కిలి గొప్పదియును నశింపనిదియును ధర్మాధర్మములను మైల లేనిదియునై ఆకాశముకంటె వేఱుగా సూక్ష్మమై వ్యాపించియున్నది.

ఉ॥ తమేవ ధీరో విజ్ఞాయ ప్రజ్ఞాం కుర్వీత బ్రాహ్మణః। నానుధ్యాయా ద్బహూఞ్ఛబ్దా న్వాచో విగ్లాపనగ్ం హి తదితి, ॥21॥

ప॥ తం – ఏవ – ధీరః – విజ్ఞాయ – ప్రజ్ఞాం – కుర్వీత – బ్రాహ్మణః – న–అనుధ్యాయాత్ – బహూన్ – శబ్దాన్ – వాచః– విగ్లాపనం – హి –

ప్ర॥ ధీరః = విజ్ఞానియగు, బ్రాహ్మణః = బ్రాహ్మణుఁడు, తమేవ = ఆపరమాత్మనే, విజ్ఞాయ = తెలిసికొని, ప్రజ్ఞాం = ప్రజ్ఞను. (ఆచార్యోపదేశ విషయమై తెలిసికొనవలయునను ఇచ్ఛకు పరిసమాప్తియైన ప్రజ్ఞను), కుర్వీత = చేయవలయును. బహూన్ = అనేకములగు, శబ్దాన్ = శబ్దములను, నానుధ్యాయాత్ = చింతింపఁగూడదు. తత్ =ఆ అనేకశబ్దములను అధ్యయనము చేయుట వాచః= వాక్కునకు, విగ్లాపనంహి = శ్రమకలుగఁజేయుటయే; ఇతి = సమాప్తము.

తా॥ ఓ జనకుఁడా! జ్ఞానవంతుఁడగు బ్రాహ్మణుఁడు అవినాశియును అచలమును సర్వవ్యాపియునగు ఆ ఆత్మను తెలిసికొని ఆచార్యోపదేశమువలన గోచరించునట్టిదియును వేఱొకటి తెలిసికొనఁదగినది యను ఇచ్ఛను కలుగఁజేయునట్టిదియునగు ప్రజ్ఞను కలుగఁజేసికొనుటకు సాధనములైన సన్న్యాస శమ దమో పరతి తితిక్షా సమా

ధాన ములను అభ్యాసము చేయవలయును. అన్యములగు అనేకశబ్ద ములను ధ్యానింపఁగూడదు అట్లు అనేకశబ్దములను చింతించుట వాక్కునకు శ్రమయేగాని యేమియు ప్రయోజనము లేదు.

ఉ॥ స వా ఏష మహానజ ఆత్మా యోఽయం విజ్ఞానమయః ప్రాణేషు య ఏషోఽన్తర్హృదయ ఆకాశస్తస్మిఞ్ఛేతే సర్వస్య వశీ సర్వస్యేశానః సర్వస్యాధిపతిః స న సాధునా కర్మణా భూయాన్నో ఏవాసాధునా కనీయాన్ । ఏష సర్వేశ్వర ఏష భూతాధిపతిరేష భూతపాల ఏష సేతుర్విధరణ ఏషాం లోకానామసంభేదాయ తమేతం వేదానువచనేన బ్రాహ్మణా వివిదిషన్తి । యజ్ఞేన దానేన తపసాఽనాశకేనై తమేవ విదిత్వా మునిర్భవతి । ఏతమేవ ప్రవ్రాజినోలోకమిచ్ఛన్తః ప్రవ్రజన్తి ఏతద్ధస్మ వైతత్పూర్వే విద్వాగ్ంసః ప్రజాం న కామయన్తే కిం ప్రజయా కరిష్యామః । యేషాం నోఽయమాత్మాఽయం లోక ఇతి తే హ స్మ పుత్రైషణాయాశ్చ విత్తైషణాయాశ్చ లోకైషణాయాశ్చ వ్యుత్థాయాథ భిక్షాచర్యం చరన్తి । యా హ్యేవ పుత్రైషణా సా విత్తైషణా యా విత్తైషణా సా లోకైషణోభే హ్యేతే ఏషణే ఏవ భవతః । స ఏష నేతి నేత్యాత్మాఽగృహ్యో నహి గృహ్యతేఽశీర్యో నహి శీర్యతేఽసఙ్గో నహి సజ్యతేఽసితో న వ్యథతే న రిష్యత్యేతముహైవైతే న తరత ఇతి । అతః పాపమకరవమిత్యతః కల్యాణమకరవమిత్యుభే ఉ హైవైష ఏతే తరతి నైనం కృతాకృతే తపతః. ॥22॥

ప॥ సః – వై – ఏషః – మహాన్ – అజః – ఆత్మా – యః – అయం – విజ్ఞానమయః – ప్రాణేషు – యః – ఏషః – అన్తర్హృదయే – ఆకాశః – తస్మిన్ – శేతే – సర్వస్య – వశీ – సర్వస్య – ఈశానః – సర్వస్య – అధిపతిః – సః – న – సాధునా – కర్మణా – భూయాన్ – నో – ఏవ – అసాధునా – కనీయాన్ – ఏషః – సర్వేశ్వరః – ఏషః –

భూతాధిపతిః - ఏషః - భూతపాలః - ఏషః - సేతుః - విధరణః - ఏషాం - లోకానాం - అసంభేదాయ - తం - ఏతం - వేదానువచనేన - బ్రాహ్మణాః - వివిదిషన్తి - యజ్ఞేన - దానేన - తపసా - అనాశకేన - ఏతం - ఏవ - విదిత్వా - మునిః - భవతి - ఏతం - ఏవ - ప్రవ్రాజినః - లోకం - ఇచ్ఛన్తః - ప్రవ్రజన్తి - ఏతత్ - హ - స్మ - వై - తత్ - పూర్వే - విద్వాంసః - ప్రజాం - న - కామయన్తే - కిం - ప్రజయా - కరిష్యామః - యేషాం - నః - అయం - ఆత్మా - అయం - లోకః - ఇతి - తే - హ - స్మ - పుత్రైషణాయాః - చ - విత్తైషణాయాః - చ - లోకైషణాయాః - చ - వ్యుత్థాయ - అథ - భిక్షాచర్యం - చరన్తి - యా - హి - ఏవ - పుత్రైషణా - సా - విత్తైషణా - యా - విత్తైషణా - సా - లోకైషణా - ఉభే - హి - ఏతే - ఏషణే - ఏవ - భవతః - సః - ఏషః - న - ఇతి - న - ఇతి - ఆత్మా - అగృహ్యః - న - హి - గృహ్యతే - అశీర్యః - న - హి - శీర్యతే - అసఙ్గః - న - హి - సజ్యతే - అసితః - న - వ్యథతే - న - రిష్యతి - ఏతం - ఉ - హైవ - ఏతే స - తరతః - ఇతి - అతః - పాపం-అకరవం - ఇతి - అతః - కల్యాణం - అకరవం - ఇతి - ఉభే - ఉ - హైవ - ఏషః - ఏతే - తరతి - న - ఏనం - కృతాకృతే - తపతః.

ప్ర॥ ప్రాణేషు = ప్రాణములయందు, అయం = ఈ, విజ్ఞానమయః = విజ్ఞానస్వరూపుఁడు, (అనఁగా జీవుఁడు). యః = ఎవఁడో ఏషః = ఈ విజ్ఞానస్వరూపుఁడు, మహాన్ = గొప్పవాఁడును, అజః= పుట్టువులేనివాఁడునగు, సవై = ఆ పూర్వోక్తమైన పరమాత్మయే, (అట్టి పరమాత్మయే), ఆత్మా = ఆత్మస్వరూపుఁడు (అని చెప్పఁబడినది). (సః = అట్టి పరమాత్మ). అన్తర్హృదయే = హృత్పుండరీకము యొక్క మధ్యమందు, య ఏషః = ఏ ఈ, ఆకాశః = ఆకాశమో, (బుద్ధియొక్క విజ్ఞానమునకు ఆశ్రయమైన ఆకాశమో), తస్మిన్ =

దానియందు, (ఆ ఆకాశమునందు), శేతే = ఉన్నాఁడు (సచ = ఆ పరమాత్మ), సర్వస్య = సమస్తముయొక్క, వశీ = స్వాధీనము కల వాఁడును, (బ్రహ్మేంద్రాదులను తన స్వాధీనమునందు ప్రవర్తింపఁ జేసికొనినవాఁడును), సర్వస్య = అందఱికిని, ఈశానః = నియామకుఁడును, సర్వస్య = అందఱికిని, అధిపతిః = ప్రభువును, (అధిష్ఠించి పాలించువాఁడును, స్వతంత్రుఁడును, (భవతి = అగుచున్నాఁడు), సః= ఆ పరమాత్మ సాధునా = మంచిదియగు, కర్మణా = కర్మముచేత, (పుణ్య కర్మముచే), భూయాన్ = అధికుఁడు, న=కాఁడు, అసాధునా= మంచిది కాని, కర్మణా=కర్మముచేత, (పాపకర్మముచేతను), కనీయాన్ = అధికుఁడు కానివాఁడును, (అల్పమైన వాఁడును), నోఏవ = కానే కాఁడు. ఏషః = ఈ పరమాత్మ, సర్వేశ్వరః = సర్వమునకు నియామకుఁడు. ఏషః = ఈ పరమాత్మ, భూతాధిపతిః = భూత=బ్రహ్మాది భూతములకు, అధిపతిః = ప్రభువు, ఏషః = ఈ పరమాత్మ, భూతపాలః = సమస్తభూతములను రక్షించువాఁడు, ఏషః=ఈ పరమాత్మ, ఏషాం = ఈ లోకానాం = భూరాదిలోకములకు, అసంభేదాయ= భిన్నమర్యాదలు లేకపోవుటకొఱకు (వర్ణాశ్రమాది సాంకర్యము లేకపోవుటకొఱకు), సేతుః = హద్దై, విధరణః = వర్ణాశ్రమాదివ్యవస్థను చేయువాఁడు, తం = అటువంటి, ఏతం=ఈ పరమాత్మను, బ్రాహ్మణాః = బ్రాహ్మణులు (బ్రహ్మ క్షత్రియ వైశ్యులు), వేదానువచనేన=మంత్ర బ్రాహ్మణరూపమైన వేదవాక్యముచేతను, (వేదమందు చెప్పఁబడిన నిత్యకర్మానుష్ఠానముచే శుద్ధాంతః కరణులై ఉపనిషత్ప్రతిపాదిత పరమాత్మను), వివిదిషన్తి = తెలిసికొనుటకు కోరుచున్నారు. (అదెట్లనఁగా, బ్రాహ్మణుఁడు), యజ్ఞేన = కర్మచేతను, దానేన = దానముచేతను, తపసా = తపస్సుచేతను, (కృచ్ఛ్రచాంద్రాయణాది తపస్సుచేతను), అనాశకేన = కోరిక లేకపోవుటచేతను, (ఇక్కడ అనాశక శబ్దమునకు కర్మఫలాపేక్ష లేకపోవుట యర్థము),

తమేవ = ఆ పరమాత్మనే, విదిత్వా = తెలిసికొని, మునిః = మనన శీలుఁడు, (ఆత్మ మనస్సంధానముచేయునట్టి యోగి) భవతి = అగుచున్నాఁడు. ఏతమేవలోకం = ఈ పరమాత్మరూపమైన లోకమునే ఇచ్ఛన్తః = కోరుచున్న, (ప్రవ్రాజినః=సన్న్యసించునట్టి స్వభావము గల సన్న్యాసులు. ప్రవ్రజన్తి = సన్న్యసించుచున్నారు. (సమస్త కర్మలను సన్న్యసించుచున్నారు). తదేతత్=ఇదియె, (సన్న్యాసస్య= సన్న్యాసమునకు, కారణం = కారణము. భవతి = అగుచున్నది). హస్మవై = అగుచున్నది గదా! పూర్వే=ప్రాచీనులగు, (యే=ఏ.) విద్వాంసః = పండితులు, ప్రజయా=సంతానముతో, కింకరిష్యామః = ఏమి చేయగలము (అని) ప్రజాం = సంతానమును న కామయన్తే = కోరుటలేదో, యేషాం = ఏ, నః = మనకు, అయం = ఇది, ఆత్మా=ఆత్మ స్వరూపమో, (మనకు అశనాయాది ధర్మములేని ధర్మాధర్మాతీతమగు ఈ పరమాత్మయె ఆత్మస్వరూపము). అయం=ఈ పరమాత్మ, లోకః=ఫలరూపమైన లోకము, (భవతి=అగుచున్నది). ఇతి = అని, (సన్యసించువారో,) తేహస్మ = వారే, పుత్రైషణాయాశ్చ = పుత్రేచ్ఛవల్లను, విత్తైషణాయాశ్చ = ధనేచ్ఛవల్లను, లోకైషణాయాశ్చ = లోకేచ్ఛవల్లను, వ్యుత్థాయ=లేచి, (ఇచ్ఛను వదలి), అథ = అనంతరము, భిక్షాచర్యం = భిక్షాటనమును, చరన్తి = చేయుచున్నారు, పుత్రైషణా = పుత్రేచ్ఛ, యాహి=ఏదియో, సా=అది, విత్తైషణా=ధనేచ్ఛ, విత్తైషణా=ధనేచ్ఛ, యా = ఏదియో, సా=అది, లోకైషణా = లోకేచ్ఛ, ఏతే=ఈ, ఉభేహి = రెండైన, ఏషణే ఏవ = ఇచ్ఛలు, (కోరికలు, ఇహలోక పరలోకేచ్ఛలు), భవతః =అగుచున్నవి, నేతినేతీతి=ఇదికాదు, ఇదికాదు అని సమస్తమును నిషేధించి నిర్దేశింపఁబడిన, ఆత్మా=ఆత్మస్వరూపము, (యః = ఏదియో), సః = అటువంటి, ఏషః = ఈ ఆత్మ, అగృహ్యః = గ్రహింపశక్యము కానిది, (సమస్తమైన కార్యధర్మముల నతిక్రమించి

ష్ము న్నది గనుక గ్రహింపశక్యము కానిది గనుకనె, న్హిగృహ్యాతే= గ్రహింపఁబడుటలేదు., అశీర్యః = నశింపనిది, (శరీరధర్మము లేనిది గనుక నశించనిది కనుకనె, నహిశీర్యతే = నశించుటలేదు. అసఙ్గః = కూడుకొననిది, (మూర్తస్వరూపము కాదు గనుక వేఱొకదానితోఁ గూడుకొననిది గనుకనే), నహిసజ్యతే = కూడుకొనదు. అసితః = బాధింపఁబడనిది, (దేనిచేతను బాధింపఁబడనిది గనుకనే), నవ్యథతే= పీడింపఁబడదు, నరిష్యతి=హింసనుపొందదు (నశింపదు). (అటువంటి, ఈ పూర్వము చెప్పిన సర్వకామములను విడిచిన ఈ ఆత్మ నేతి నేతి యను వాక్యముచేత సర్వమును నిషేధించి తన్ను ఆత్మనుగాఁ దెలిసి కొనుట వలన), ఏతము హైవ = వీనినే, (ఇట్లు తెలిసికొనినవానినే), ఏతే = ఈ ముందు చెప్పఁబోయెడి పుణ్యపాపములు, నతరతః = పొందవు. ఇతి = సమాప్తము. అతః = ఈ శరీరధారణమను నిమిత్తము వలన, (అహం = నేను), పాపం = పాపమును, అకరవమితి = చేసితినని (సంతాపమును), కళ్యాణం = శుభమును, (పుణ్యమును). అకరవమితి = చేసితినని (సంతోషమును), ఇవి రెండును. (తం = ఆ బ్రహ్మవేత్తను, నతరతః = పొందవు). ఏషః=ఈ బ్రహ్మవేత్త, ఏతే=ఈ, ఉభేఉహైవ = పుణ్యపాపముల రెంటిని. తరతి = అతిక్రమించుచున్నాఁడు. (పుణ్యపాపములు నశించుచున్నవి). కృతాకృతే = కృత = నిత్యకర్మలను చేయుట, అకృత = నిత్యకర్మలను చేయుకపోవుట, (ఇవి రెండు అనఁగా శాస్త్రవిహితకర్మలను, చేయుట, చేయక పోవుట,) ఏనం = ఈ బ్రహ్మవేత్తను, నతపతః = తపింపఁ జేయవు.

తా॥ ఇంతకుపూర్వము మంత్రబ్రాహ్మణములచేత బంధమోక్షములు సహేతుకములుగాఁ జెప్పఁబడినవి. ఈ పూర్వశ్లోకములచేతను మరల మోక్షస్వరూపమే విస్తారముగాఁ బ్రతిపాదింపఁబడినది. ఈ ప్రకారముగానే ఈ ఆత్మవిషయమునందు వేదమంతయు నెట్లుపయోగ

మగుచున్నదో ఆ ప్రకారముగానే చెప్పఁదగినదియని అందు నిమిత్తమై ఈ మంత్ర మారంభింపఁబడుచున్నది. ఓ జనకుఁడా! ఈ ప్రాణముల యందున్న విజ్ఞానమయ స్వరూపుఁడైన ఈ జీవుఁడు, అఖండ స్వరూపమును, పుట్టుకలేనివాఁడునగు ఆ పరమాత్మే యగుచున్నాడు. ఆ పరమాత్మ హృత్పుండరీకమునందలి బుద్ధియొక్క విజ్ఞానమునకు ఆశ్రయమైన ఆకాశమునం దున్నాడు. ఆ పరమాత్మ బ్రహ్మ, ఇంద్రుఁడు మొదలైనవారి నందఱిని తన స్వాధీనమునందుఁ బ్రవర్తింపఁజేసికొనువాఁడును, అందఱికిని నియామకుఁడును, అందఱిని అధిష్ఠించి పాలించువాఁడునై స్వతంత్రుఁడుగా నున్నాఁడు. ఆపరమాత్మ పుణ్యకర్మచేత అధికమైనవాఁడును పాపకర్మచేతఁ దగ్గిపోయినవాఁడును కాఁడు. ఇట్లు సర్వనియామకుఁడును, సర్వభూతాధిపతియు నగు ఈ పరమాత్మ, ఈ భూరాది సమస్తలోకములలో వర్ణాశ్రమాదిసాంకర్యములు కలుగక యుండుటకు హద్దై, వర్ణాశ్రమాదివ్యవస్థను చేయుచున్నాఁడు. అట్టి ఈ పరమాత్మను బ్రహ్మక్షత్రియ వైశ్యులు వేదమునందు చెప్పఁబడిన నిత్యకర్మానుష్ఠానముచే శుద్ధాంతఃకరణులై, ఉపనిషత్ప్రతిపాదిత పరమాత్మను తెలిసికొనుటకు కోరుచున్నారు. అదెట్లనఁగా, ఈ బ్రహ్మక్షత్రాదులు యజ్ఞాదికర్మముచేతను దానముచేతను కృచ్ఛ్ర చాంద్రాయణాది తపస్సుచేతను శుద్ధాంతఃకరణులై కోరిక లేకపోవుట చేతను, ఆ పరమాత్మను తెలిసికొని ఆత్మ మనస్సంధానముచేయునట్టి యోగియగుచున్నాఁడు. సర్వకర్మ సన్న్యాసముచేయు స్వభావము గలవారలు ఈ పరమాత్మ లోకమునే కోరుచు సర్వకర్మత్యాగము చేయుచున్నారు. ఇదియె సన్న్యాసమునకు ముఖ్యకారణము. మనకు బాహ్య లోకసాధనమగు సంతానముతో ఏమి ప్రయోజనము కాఁగలదని తిరస్కార భావమును పొంది సంతానమును కోరకయె అశనాయాది ధర్మములులేని ధర్మాధర్మాతీతమగు ఆత్మలోకాపేక్ష గల ప్రాచీనులగు విద్వాంసులు విరక్తులై పుత్రైషణ విత్తైషణ లోకై

షణలను విడిచి భిక్షాటనము చేయుచున్నారు. లోకమునందు ఇహలోకసాధనము పుత్రేషణము. ఈ పుత్రేషణమే విత్తేషణము. విత్తేషణమే లోకేషణము అగుటవలన జనులకు ఇహపరలోకములయొక్క కోరికలు రెండు మాత్రమే యగుచున్నది. ఇదికాదు ఇదికాదు అని సమస్తమును నిషేధించి నిర్దేశింపఁబడిన ఆత్మ సమస్తకార్యధర్మములు లేనిది గనుక గ్రహింపఁబడుట లేదు. శరీరధర్మము లేనిది గనుక చిక్కిపోవుట లేదు. మూర్తధర్మము లేనిదిగనుక దేనితోను కలిసికొనుట లేదు. దేనిచేతను బాధింపఁబడదు గనుక, బాధనుపొందుట లేదు, నశించుట లేదు. ఇట్టి ఆత్మస్వరూపమే తానని తెలిసికొనిన బ్రహ్మవేత్తను పుణ్యపాపములు పొందవు. ఇట్లు పుణ్యపాపరహితుఁడైన బ్రహ్మవేత్త ఈ ఈ శరీరధారణానిమిత్తమువలన నేను పాపమును చేసితిని గనుక ఆ పాపముచే నాకు నరకము వచ్చునని సంతాపమును, ఈ శరీరధారణానిమిత్తమువలన నేను పుణ్యము చేసితిని గనుక ఆ పుణ్యముచే నాకు స్వర్గాదిపుణ్యలోకము వచ్చునని సంతోషమును, పొందఁడు ఇట్లు ఈ బ్రహ్మవేత్త పుణ్యపాపములను రెంటిని అతిక్రమించుచున్నాఁడు. విహితకర్మను చేయుటయును విహితకర్మను చేయకపోవుటయును ఈ రెండును ఈ బ్రహ్మవేత్తను సంతాపము నొందింపఁజాలవు.

ఉ॥ తదేతదృచాభ్యుక్తం। ఏష నిత్యో మహిమా బ్రాహ్మణస్య న వర్ధతే కర్మణా నో కనీయాన్ । తస్యైవ స్యాత్పదవిత్తం విదిత్వా న లిప్యతే కర్మణా పాపకేనేతి । తస్మాదేవంవిచ్ఛాన్తో దాన్త ఉపరతస్తితిక్షుస్సమాహితో భూత్వాత్మన్యేవాత్మానం పశ్యతి సర్వమాత్మానం పశ్యతి నైనం పాప్మా తరతి సర్వం పాప్మానం తరతి నైనం పాప్మా తపతి సర్వం పాప్మానం తపతి విపాపో విరజోఽవిచికిత్సో బ్రాహ్మణో భవత్యేష బ్రహ్మలోకః సమ్రాడితి హోవాచ యాజ్ఞవల్క్యః సోఽహం భగవతే విదేహాన్ దదామి

మాం చాపి సహ దాస్యాయేతి. ॥23॥

ప॥ తత్ – ఏతత్ – ఋచా – అభ్యుక్తం – ఏషః – నిత్యః – మహిమా – బ్రాహ్మణస్య – న – వర్ధతే – కర్మణా – నో – కనీయాన్ – తస్య – ఏవ – స్యాత్ – పదవిత్ – తం – విదిత్వా – న – లిప్యతే – కర్మణా – పాపకేన – ఇతి – తస్మాత్ – ఏవంవిత్ – శాన్తః – దాన్తః – ఉపరతః – తితిక్షుః – సమాహితః – భూత్వా – ఆత్మని – ఏవ – ఆత్మానం – పశ్యతి – సర్వం – ఆత్మానం – పశ్యతి – న – ఏనం – పాప్మా – తరతి – సర్వం – పాప్మానం – తరతి – న – ఏనం – పాప్మా – తపతి – సర్వం – పాప్మానం – తపతి – విపాపః – విరజః – అవిచికిత్సః – బ్రాహ్మణః – భవతి ఏషః – బ్రహ్మలోకః – సమ్రాట్ – ఇతి – హ – ఉవాచ – యాజ్ఞవల్క్యః – సః – అహం – భగవతే – విదేహాన్ – దదామి – మాం – చ – అపి – సహ – దాస్యాయ – ఇతి. ॥23॥

ప్ర॥ తదేతత్ = ఈ పరబ్రహ్మము, ఋచా = మంత్రము చేతను, అభ్యుక్తం = చెప్పఁబడినది. ఏషః = ఈ, (నేతి నేతియను సర్వనిషేధమే లక్షణముగాఁగల), నిత్యః=శాశ్వతమగు, మహిమా= సామర్థ్యముగల పరమాత్మ, బ్రాహ్మణస్య = బ్రహ్మవేత్తయొక్క, కర్మణా = కర్మముచేతను, నవర్ధతే=వృద్ధిపొందఁడు. నోకనీయాన్ = తగ్గిపోఁడు. (బ్రహ్మవేత్త). తస్యైవ = సర్వనిషేధలక్షణమైన ఆ మహిమయొక్కయె, పదవిత్=స్థానమును తెలిసినవాఁడు, స్యాత్ = అగును. తం = ఆ మహిమను, విదిత్వా = తెలిసికొని, పాపకేన = పాపరూపమగు, కర్మణా = కర్మముచేతను, (ధర్మాధర్మలక్షణరూపమైన పాపకర్మముచేతను), నలిప్యతే = పూయఁబడఁడు, (సంబంధింపఁడు). ఇతి = సమాప్తము. తస్మాత్ = ఆకారణమువలన, ఏవంవిత్ = ఇట్లు తెలిసికొనినవాఁడు, శాన్తః = బాహ్యములగు చక్షురాదీంద్రియ నిగ్రహముగలవాఁడును. దాన్తః = అంతరింద్రియ

నిగ్రహముగలవాఁడును, ఉపరతః = సమస్తకోరికలనుండి విడువఁ బడినవాఁడును, తితిక్షుః=ఓర్పుగలవాఁడును, (శీతోష్ణ సుఖ దుఃఖాది ద్వంద్వములను సహించువాఁడును), సమాహితః = ఏకాగ్రచిత్తము గలవాఁడును, (ఇంద్రియములయొక్కయు అంతఃకరణములయొక్కయు చలనము వలన మరలిన నిశ్చలుఁడు), భూత్వా=అయి, ఆత్మన్యేవ = తనయందే, (తనయొక్క దేహేంద్రియాది సంఘాతమునందు), ఆత్మానం = తన్ను, పశ్యతి = చూచుచున్నాఁడు, సర్వం = సమస్తమును, ఆత్మానం = తన్నుగానే, పశ్యతి = చూచుచున్నాఁడు. ఏనం = ఈ బ్రహ్మవేత్తను, పాప్మా = పాపము, నతరతి=పొందదు. సర్వం = సమస్తమైన, పాప్మానం = పాపమును, తరతి = దాటుచున్నాఁడు. (ఆత్మభావముచేతనే పొందుచున్నాఁడు; అతిక్రమించుచున్నాఁడు). ఏనం = ఈ బ్రహ్మవేత్తను, పాప్మా = పాపము, నతపతి = తపింపఁజేయదు. (బ్రహ్మవేత్త), సర్వం = సమస్తమైన, పాప్మానం = పాపమును, తపతి=తపింపఁజేయుచున్నాఁడు. (జ్ఞానాగ్నిచేత భస్మము చేయుచున్నాఁడు). (ఇట్టివాఁడు), విపాపః = పోయిన ధర్మాధర్మములను పాపముగలవాఁడును, విరజః = పోయిన కామము గలవాఁడును, అవిచికిత్సః = పోయిన సంశయము గలవాఁడునై, బ్రాహ్మణః = బ్రాహ్మణుఁడు, (సర్వస్వరూపమైన పరబ్రహ్మమె నేననెడి నిశ్చయబుద్ధిగల బ్రాహ్మణుఁడు), భవతి=అగుచున్నాఁడు. హేసమ్రాట్ = ఓజనకమహారాజా! ఏషః = ఇది, బ్రహ్మలోకః= పరబ్రహ్మలోకము, (పరబ్రహ్మమైన లోకము), ఇతి = అని, యాజ్ఞవల్క్యః = యాజ్ఞవల్క్యుఁడు, హోవాచ = పలికెను. (ఓ యాజ్ఞవల్క్యుఁడా!) సః = ఆ, అహం = నేను, భగవతే = నీకొఱకు, విదేహాన్=విదేహదేశములను, మాంచ=నన్ను, సహ=కూడ, దాస్యాయ=దాస్యకర్మకొఱకు, (విదేహదేశములతోఁగూడ నన్ను నీకు సేవ చేయుటకు), దదామీతి=ఇచ్చుచున్నానని (జనకమహారాజుచెప్పెను).

తా॥ ఓ జనకమహారాజా! ఇంతవఱకు పరబ్రహ్మము ఈ మంత్రముచేతఁ జెప్పఁబడినది. నేతి నేతి యనెడి వాక్యముచే సర్వమును నిషేధించుటయే లక్షణముగాఁగలదియును శాశ్వతమునగు సామర్థ్యముగల ఈ పరబ్రహ్మము బ్రాహ్మణునియొక్క పుణ్యాపాపరూపమైన కర్మముచేత వృద్ధిపొందునది కాదు. తగ్గిపోవునది కాదు. ఈ పరబ్రహ్మమును తెలిసికొనినవాఁడు అనఁగా జ్ఞానముచేసర్వముతిరస్కరించి తన్ను తాను తెలిసికొనిన బ్రహ్మవేత్త సర్వనిషేధ లక్షణమగు మహిమయొక్క స్థానము తెలిసినవాఁడగును. ఇట్లు తెలిసికొనినవాఁడు ధర్మాధర్మలక్షణమగుపాపకర్మముతో సంబంధింపఁడు. అందువలన ఈ తెలిసినవాఁడు బాహ్యేంద్రియ నిగ్రహముగలవాఁడును అంతరింద్రియ నిగ్రహము గలవాఁడును కోరిక లేనివాఁడును శీతోష్ణసుఖదుఃఖాది ద్వంద్వములను సహించువాఁడును బాహ్యేంద్రియాంత రింద్రియముల యొక్క చలనమును విడిచి నిశ్చలుఁడునై తన దేహేంద్రియాది సముదాయమునందు తన్ను చూచుచున్నాఁడు. సమస్తమును తన్నుగానే చూచుచున్నాఁడు. ఇట్టి బ్రహ్మవేత్తను పాపము పొందదు. ఈ జ్ఞాని, వేఱువస్తువు లేకపోవుటచే పాపమునంతయు ఆత్మనుగానే పొందుచున్నాఁడు. కనుక పాప మంతమును పొందుచున్నది. ఈ బ్రహ్మజ్ఞుని విహిత నిషిద్ధ కర్మానుష్ఠానములు సంతోష దుఃఖములను పొందింపవు. బ్రహ్మజ్ఞుఁడు విహిత నిషిద్ధకర్మానుష్ఠానములవల్లనైన పుణ్యపాపములను సర్వాత్మ దర్శనమను అగ్నిచేత భస్మము చేయుచున్నాఁడు. ఇట్టి బ్రహ్మవేత్త, అజ్ఞానమువలన కలిగిన ధర్మాధర్మరూపమగు పాపమును కోరికను సంశయమును లేనివాఁడై సర్వస్వరూపము నేననెడి నిశ్చితబుద్ధిగల బ్రాహ్మణుఁడగుచున్నాఁడు. ఈ స్థితియందున్న వీఁడే ముఖ్యబ్రాహ్మణుఁడు. వీనికి ఈ పరబ్రహ్మస్వరూపస్థితికంటె పూర్వమునందలి బ్రాహ్మణ్యము గౌణమైనది ఓ జనక మహారాజా! సర్వాత్మభావలక్షణమైన ఇదియె పరబ్రహ్మలోకము

అని యాజ్ఞవల్క్యుఁ డుపదేశింపఁగా జనకమహారాజు ఓ యాజ్ఞవల్క్యుఁడా! నేను నీకు విదేహరాజ్యముతోఁ గూడ నా శరీరమును సేవ చేయుట కర్పించుచున్నానని పలికెను

ఉ॥ స వా ఏష మహాన జ ఆత్మాన్నాదో వసుదానో విన్దతే వసు య ఏవం వేద. ॥24॥

ప॥ సః - వై - ఏషః - మహాన్ - అజః - ఆత్మా - అన్నాదః - వసుదానః - విన్దతే - వసు - యః - ఏవం - వేద.

ప్ర॥ సవై = ఆ ప్రసిద్ధమగు, (జనక యాజ్ఞవల్క్య సంవాదమునందు చెప్పఁబడిన ప్రసిద్ధమగు), ఏషః=ఈ, మహాన్=గొప్పదియగు, అజః = పుట్టుకలేని, ఆత్మా = ఆత్మస్వరూపము, అన్నాదః= అన్నమును భక్షించునదియును, వసుదానః = కర్మఫలమును ఇచ్చునదియును, (ప్రాణులయొక్క కర్మఫలమును కూర్చునదియును, భవతి = అగుచున్నది). యః = ఎవఁడు, ఏవం = ఈ ప్రకారము, వేద = తెలిసికొనుచున్నాఁడో, (సః = వాఁడు, సర్వభూతేషు = సమస్తభూతములయందును, ఆత్మభూతః = ఆత్మస్వరూపుఁడై, అన్నం = అన్నమును, అత్తి = భక్షించుచున్నాఁడు). వసు = సమస్త కర్మఫలమును, విన్దతే = పొందుచున్నాఁడు.

తా॥ జనక యాజ్ఞవల్క్య సంవాదమునందు చెప్పఁబడిన ప్రసిద్ధమగు గొప్పదియును పుట్టుకలేనిదియునగు ఈ ఆత్మ, సర్వభూతములయందున్నదై అన్నమును భక్షించునదియును ప్రాణులయొక్క సమస్త కర్మఫలము కూర్చునదియును అగుచున్నది. ఇట్లు ఆత్మస్వరూపమును తెలిసికొని ధ్యానించువాఁడు సమస్తభూతములయందును ఆత్మస్వరూపుఁడై, అన్నమును భక్షించుచున్నాఁడు, కర్మఫలమును పొందుచున్నాఁడు.

ఉ॥ సవాఏష మహానజఆత్మాఽజరోఽమరోఽమృతోఽభయోబ్రహ్మాభయం వై బ్రహ్మాభయగ్ హి వై బ్రహ్మ భవతియఏవంవేద 25

ఇతి షష్ఠాధ్యాయే చతుర్థం బ్రాహ్మణమ్.

ప॥ సః - వై - ఏషః - మహాన్ - అజః - ఆత్మా-అజరః - అమరః - అమృతః - అభయః - బ్రహ్మ - అభయం - హి - వై - బ్రహ్మ - భవతి - యః - ఏవం - వేద.

ప్ర॥ సవై = ఆ ప్రసిద్ధమును, మహాన్ = గొప్పదియును. అజః = పుట్టుకలేనిదియునగు, ఆత్మా = ఆత్మస్వరూపము, (ఆత్మస్వరూపము పుట్టుకలేనిది గనుకనె), అజరః = జీర్ణముకానిదియును, (జీర్ణమనఁగా శిధిలముగానిది గనుకనే), అమరః = మరణములేనిదియును, (నాశనము లేనిది గనుకనే), అమృతః = మృత్యువులేనిదియును, (జన్మాదివికారములు లేకపోవుటవలన మృత్యువులేనిది గనుకనే), అభయః = భయరహితమైనదియునై, బ్రహ్మ = పరబ్రహ్మస్వరూపము, (అనఁగా పరమాత్మ, భవతి = అగుచున్నది). ఏవం = ఈ ప్రకారము, యః = ఎవఁడు, వేద = తెలిసికొనునో, (సః = వాఁడు, అభయం హివై బ్రహ్మ = భయరహితమగు పరబ్రహ్మస్వరూపమే, భవతి = అగుచున్నాఁడు).

తా॥ ఇంతవఱకు చెప్పిన ఆరణ్యకముయొక్క అర్థమంతయు ఈ ఖండికయందు నిర్దేశించి చెప్పఁబడుచున్నది. ఈ యుపనిషత్తునందు ప్రతిపాదింపఁబడిన గొప్పదైన ఈ యాత్మ. పుట్టుకలేనిది గనుక జీర్ణమై శిధిలము కానిదియును, శిధిలము కానిది గనుకనే నాశనము లేనిదియును, ఇట్లు జన్మజరానాశాదులు లేనిది గనుకనే మృత్యువు లేనిదియునై భయరహితమై బ్రహ్మస్వరూపమగుచున్నది. బ్రహ్మస్వరూపమును ఈ ప్రకారముగాఁ దెలిసికొనువాఁడు భయరహితమగు పరబ్రహ్మస్వరూపమె యగుచున్నాఁడు. ఈ యుపనిషత్తునందు, ఏకాదిపరార్థమువఱకుండెడి సంఖ్యను తెలియఁజేయుటకు రేఖయందు; ఒకటి, పది, నూఱు, వేయి యని ఆరోపించి తెలియపఱచినట్లు ఒకటి యగు పరబ్రహ్మమునందు జన్మాద్యనేకోపాయములను కల్పించి నేతి నేతి వాక్యముచేత సమస్త ఉపాయనిషేధమును చేసి అద్వితీయమగు పరబ్రహ్మ తత్త్వము తెలియఁజేయఁబడినది.

ఇట్లు షష్ఠాధ్యాయమునందు చతుర్థబ్రాహ్మణము సమాప్తము.

షష్ఠాధ్యాయము – పంచమ బ్రాహ్మణము.

ఉ॥ అథ హ యాజ్ఞవల్క్యస్య ద్వే భార్యే బభూవతు ర్మైత్రేయీ చ కాత్యాయనీ చ తయోర్హ మైత్రేయీ బ్రహ్మవాదినీ బభూవ స్త్రీప్రజ్ఞైవ తర్హి కాత్యాయన్యథ హ యాజ్ఞవల్క్యోఽన్యద్వృత్త ముపాకరిష్యన్. ॥1॥

ప॥ అథ – హ – యాజ్ఞవల్క్యస్య – ద్వే – బభూవతుః – మైత్రేయీ – చ – కాత్యాయనీ – చ – తయోః – హ – మైత్రేయీ – బ్రహ్మవాదినీ – బభూవ – స్త్రీప్రజ్ఞా – ఏవ – తర్హి – కాత్యాయనీ – అథ – హ – యాజ్ఞవల్క్యః – అన్యత్ – వృత్తం – ఉపాకరిష్యన్.

ప్ర॥ అథహ = అనంతరము, యాజ్ఞవల్క్యస్య=యాజ్ఞవల్క్య ఋషికి, మైత్రేయీచ = మైత్రేయియును, కాత్యాయనీచ=కాత్యాయని యును, ద్వే = ఇద్దఱు, భార్యే = భార్యలు, బభూవతుః = ఉండిరి, తయోః=ఆ యిద్దఱు భార్యలలో మైత్రేయీహ=మైత్రేయి యనునదియె, బ్రహ్మవాదినీ = పరబ్రహ్మమును చెప్పునట్టి స్వభావము కలది, బభూవ = ఆయెను, తర్హి = అప్పుడు, కాత్యాయనీ=కాత్యాయని యనునది, స్త్రీప్రజ్ఞైవ = స్త్రీకి ఉచితమైన జ్ఞానము కలది, (గృహమున కుపయోగమైన ప్రయోజనమును వెతకునది, బభూవ= ఆయెను), అథహ = ఈప్రకారము కాఁగా, యాజ్ఞవల్క్యః = యాజ్ఞవల్క్యుఁడు, అన్యత్ = ఇతరమైన, (గృహస్థాశ్రమముకంటె నన్యమైన), వృత్తం = సన్న్యాసాశ్రమమును, ఉపాకరిష్యన్ సన్ = పొందనిచ్ఛయించినవాఁడై.

భా॥ ఈ షష్ఠాధ్యాయమునందు శిష్యాచార్య సంబంధముతో ప్రశ్న ప్రతివచన న్యాయముగా పరబ్రహ్మతత్త్వము సవిస్తరముగా విచారించి యుపసంహారము చేయఁబడినది. ఇప్పుడు ఆగమప్రధాన

ముచే ప్రతిజ్ఞాతమైన అర్థమును నిగమనముచేయుటకు దృష్టాంతస్థానీయముగా నున్న మైత్రేయీచేత ఈ బ్రాహ్మణము ఆరంభింపఁబడుచున్నది. యాజ్ఞవల్క్యఋషికి మైత్రేయి కాత్యాయని యను పేర్లుగల ఇద్దఱు భార్యలుగలరు. వారిలో ప్రథమభార్యయగు మైత్రేయి, బ్రహ్మజ్ఞానమం దభిలాషగలదిగాను, రెండవ భార్యయగు కాత్యాయని స్త్రీలకుఁదగియున్న గృహమున కుపయోగమైన ప్రయోజనముఁను వెదకునదిగాను, ఉండిరి. అప్పుడు యాజ్ఞవల్క్యుఁడు గృహస్థాశ్రమముకంటె వేఱగు సన్న్యాసాశ్రమమును పొందుటకు ఇచ్ఛగలవాఁడాయెను.

ఉ॥ మైత్రేయీతి హోవాచ యాజ్ఞ్యవల్క్యః ప్రవ్రజిష్యన్వా అరేఽహమస్మాత్స్థానా దస్మి హన్త తేఽనయా కాత్యాయన్యాన్తం కరవాణీ తి. ॥2॥

ప॥ మైత్రేయి - ఇతి - హోవాచ - యాజ్ఞవల్క్యః - ప్రవ్రజిష్యన్ - వై - అరే - అహం - అస్మాత్ - స్థానాత్ అస్మి - హన్త - తే - అనయా - కాత్యాయన్యా - అన్తం-కరవాణి - ఇతి.

ప్ర॥ యాజ్ఞవల్క్యః=యాజ్ఞవల్క్యుఁడు, మైత్రేయీతి=మైత్రేయీయనిపిలిచి, అరే= ఓమైత్రేయీ! అహం=నేను, అస్మాత్=ఈ, స్థానాత్ = గృహస్థాశ్రమమునుండి, ప్రవ్రజిష్యన్వై = సన్యసింపనిచ్ఛగలవాఁడను, అస్మి = అగుచున్నాను. హన్త = కోరితివేని, తే = నీకు, అనయా = ఈ, కాత్యాయన్యా = కాత్యాయనితో, అన్తం = స్నేహము, కరవాముణీతి = చేయుచున్నానని, హోవాచ = పలికెను.

తా॥ సన్న్యసించుటకు ఇచ్ఛగలవాఁడై యాజ్ఞవల్క్యుఁడు మైత్రేయీ యని పిలిచి ఓ మైత్రేయీ! నేను ఈగృహస్థాశ్రమము నుండి సన్యసింప నిచ్ఛగలవాఁడనైతిని. గనుక నీకు ఇష్టమున్న యెడల ఈ కాత్యాయనితో స్నేహమును చేయించెదనని పలికెను.

ఉ॥ సా హోవాచ మైత్రేయీ యన్ను మ ఇయం భగో స్సర్వా
పృథివీ విత్తేన పూర్ణాస్యాత్స్యాన్న్వహం తేనా మృతా ఆహో
నేతి నేతి హోవాచ యాజ్ఞవల్క్యో యథైవోపకరణ తాం
జీవితం తథైవ తే జీవితగ్ స్యాద మృతత్వస్యతు నా శా స్తి
విత్తేనేతి. ॥3॥

ప॥ సా - హోవాచ - మైత్రేయీ - యత్ - ను - మే -
ఇయం - భగోః - సర్వా - పృథివీ- విత్తేన - పూర్ణా - స్యాత్ -
స్యాం - ను - అహం - తేన - అమృతా - ఆహో - న - ఇతి
న-ఇతిహోవాచ-యాజ్ఞవల్క్యః- యథా - ఏవ - ఉపకరణవతాం-
జీవితం - తథా - ఏవ - తే - జీవితం - స్యాత్ - అమృతత్వస్య -
తు - న - ఆశా - అస్తి - విత్తేన - ఇతి.

ప్ర॥ సా = ఆ, మైత్రేయీ=మైత్రేయి, హోవాచ=పలికెను,
హేభగోః =పూజ్యుఁడవగు ఓ యాజ్ఞవల్క్యుఁడా! విత్తేన = ధనము
చేత, సర్వా = సమస్తమైన, ఇయం = ఈ, పృథివీ = భూమి,
పూర్ణా = నిండింపఁబడినది, స్యాన్నుయత్ = ఆయెనేని, తేన =
ఆధనముచేత, అహం = నేను, అమృతా = ముక్తురాలను, (మర
ణము లేనిదానను), స్యాంను = అగుదునా ? అహోనేతి = కానా ?
అని, (మైత్రేయి అడిగెను). యాజ్ఞవల్క్యః = యాజ్ఞవల్క్యుఁడు,
నేతి = లేదని, హోవాచ = పలికెను. విత్తేన = ధనముచేతను,
ఉపకరణవతాం = సాధనములుగలవారలకు, జీవితం = జీవనము,
యథైవ= ఏప్రకారముగానో, తథైవ=ఆ ప్రకారముగానే, జీవితం =
జీవనము, స్యాత్ = కలుగును. అమృతత్వస్య= మోక్షముయొక్క,
ఆశాతు = అపేక్షయన్ననో, నాస్తి = లేదు. ఇతి = అని, (యాజ్ఞ
వల్క్యుఁడు పలికెను).

తా॥ ఓ యాజ్ఞవల్క్యుఁడా! ఈ సమస్తభూమియు నిండిన
ధనము కలిగినయెడల అట్టి ధనముచేతను నేను ముక్తురాలనగుదునా?

కానా? యని ఆ మైత్రేయి యడుగఁగా యాజ్ఞవల్క్యుఁడు ఓ మైత్రేయీ! లోకమునందు సమస్తసాధన సంపదగలవారలకు సుఖజీవనము కలుగునట్లు ధనముచేత సుఖజీవనము కలుగునేగాని ముక్తియొక్క ఆశ యెంతమాత్రమును లేదనిచెప్పెను.

ఉ॥ సా హోవాచ మైత్రేయీ యేనాహం నామృతా స్యాం కిమహం తేన కుర్యాం యదేవ భగవాన్వేత్థ తదేవ మే విబ్రూహీతి. ॥4॥

ప॥ సా - హోవాచ - మైత్రేయీ - యేన - అహం - న- అమృతా - స్యాం - కిం - అహం - తేన - కుర్యాం - యత్ - ఏవ - భగవన్ - వేత్థ - తత్ - ఏవ - మే - విబ్రూహి - ఇతి.

ప్ర॥ సా = ఆ, మైత్రేయీ = మైత్రేయి, హోవాచ = పలికెను. అహం = నేను, యేన = దేనిచేతను, అమృతా = మరణములేనిదానను, (ముక్తురాలను) నస్యాం= కానో, తేన= దానిచేతను, అహం = నేను, కింకుర్యాం = ఏమిచేయుదును ? హేభగవాన్ = పూజ్యుఁడవగు ఓయాజ్ఞవల్క్యుఁడా, యదేవ = దేనినే, (త్వం = నీవు), వేత్థ = గుర్తెఱుఁగుదువో, తదేవ = దానినే. మే = నాకు, విబ్రూహి = చెప్పుమా, ఇతి = అని. (మైత్రేయి పలికెను).

తా॥ ఓ యాజ్ఞవల్క్యుఁడా! నేను దేనిచేతను ముక్తురాలను కానో దానితో నాకేమియు ప్రయోజనములేదు. మరణరహితమైన ముక్తినిపొందుటకు తగియున్న దేనిని నీవు తెలిసికొనియున్నావో, దానిని నాకు చెప్పుమా యని మైత్రేయి యాజ్ఞవల్క్యుని ప్రార్థించెను.

ఉ॥ స హోవాచ యాజ్ఞవల్క్యః ప్రియా వై ఖలునో భవతీ సతీ ప్రియ మవృధద్ధన్త తర్హి భవత్యై తద్వ్యాఖ్యాస్యామి తే వ్యాచక్షాణస్యతుమేనిదిధ్యాసస్వేతి. ॥5॥

ప॥ సః - హోవాచ - యాజ్ఞవల్క్యః - ప్రియా - వై - ఖలు - నః - భవతీ - సతీ - ప్రియం-అవృధత్ - హన్త - తర్హి - భవతి - ఏతత్ - వ్యాఖ్యాస్యామి - తే - వ్యాచక్షాణస్య - తు - మే - నిదిధ్యాసస్వ - ఇతి.

ప్ర॥ సః = ఆ, యాజ్ఞవల్క్యః = యాజ్ఞవల్క్యుడు, హోవాచ = పలికెను. నః = మాకొఱకు. (పూర్వం= పూర్వము), ప్రియావైఖలు = ప్రియురాలవుగానె, భవతీసతీ = అయి, ప్రియం = ప్రియమును, అవృధత్ = వృద్ధిపొందించినదానవైతివి. హేభవతి = పూజ్యురాలవగు ఓమైత్రేయీ, (త్వం=నీవు), (అమృతత్వసాధనం = మోక్షసాధనమును), హన్తత ర్హి = కోరితివేని, తే = నీకొఱకు, ఏతత్ = ఈ మోక్షసాధనమును, వ్యాఖ్యాస్యామి = చెప్పెదను. వ్యాచక్షాణస్య = చెప్పుచున్న, మే = నాయొక్క, (వాక్యం = వాక్యమును'. నిదిధ్యాసస్వ = ఏకాగ్రచిత్తముతో ధ్యానింపుము. (ఏకాగ్రచిత్తముతో వినుము).

తా॥ ఓ మైత్రేయీ! నీవు నాకు ప్రియురాలవై ప్రియమునే వృద్ధిపొందించినదానవైతివి. కనుక నీవు మోక్షసాధనమును కోరితివేని నీకు దానిని చెప్పెదను. ఈ చెప్పెడి నాయొక్క వాక్యమును సావధాన మనస్సుతో వినుమని యాజ్ఞవల్క్యుడు పలికెను.

ఉ॥ స హోవాచ న వా అరే పత్యుః కామాయ పతిః ప్రియో భవత్యాత్మనస్తుకామాయ పతిః ప్రియో భవతి । న వా అరే జాయాయై కామాయ జాయా ప్రియా భవత్యాత్మనస్తు కామాయ జాయా ప్రియా భవతి।న వా అరే పుత్రాణాం కామాయ పుత్రాః ప్రియా భవన్త్యాత్మనస్తు కామాయ పుత్రాః ప్రియా భవన్తి । న వా అరే విత్తస్య కామాయ విత్తం ప్రియం భవత్యాత్మనస్తు కామాయ విత్తం ప్రియం భవతి।న వా అరేపశూనాం కామాయ పశవః ప్రియా భవన్త్యాత్మనస్తు కామాయ పశవః ప్రియా భవన్తి। న వా అరే బ్రహ్మణః కామాయ బ్రహ్మ ప్రియం భవత్యాత్మనస్తు కామాయ బ్రహ్మ ప్రియం భవతి । న వా అరే క్షత్రస్య కామాయ క్షత్రం ప్రియం భవత్యాత్మనస్తు కామాయ క్షత్రం ప్రియం భవతి । న వా అరే లోకానాం కామాయలోకాః ప్రియా

భవన్త్యాత్మనస్తు కామాయ లోకాః ప్రియాభవన్తి । న వా అరే దేవానాం కామాయ దేవాః ప్రియాభవన్త్యాత్మనస్తు కామాయ దేవాః ప్రియా భవన్తి । న వా అరే వేదానాం కామాయ వేదాః ప్రియాభవన్త్యాత్మనస్తు కామాయ వేదాః ప్రియా భవన్తి । న వా అరే భూతానాం కామాయ భూతాని ప్రియాణి భవన్త్యాత్మనస్తు కామాయ భూతాని ప్రియాణి భవన్తి । న వా అరే సర్వస్య కామాయ సర్వం ప్రియం భవత్యాత్మనస్తు కామాయ సర్వం ప్రియం భవతి । ఆత్మా వా అరే ద్రష్టవ్యః శ్రోతవ్యో మన్తవ్యో నిదిధ్యాసితవ్యో మైత్రేయ్యాత్మని ఖల్వరే దృష్టే శ్రుతే మతే విజ్ఞాత ఇదగ్ం సర్వం విదితమ్. ॥6॥

ప॥ సః – హ – ఉవాచ – న – వై – అరే – పత్యుః – కామాయ – పతిః – ప్రియః – భవతి – ఆత్మనః–తు – కామాయ– పతిః – ప్రియః – భవతి – న – వై – అరే–జాయాయై – కామాయ– జాయా – ప్రియా – భవతి – ఆత్మనః – తు – కామాయ–జాయా– ప్రియా – భవతి – న – వై – అరే – పుత్రాణాం – కామాయ – పుత్రాః – ప్రియాః – భవన్తి – ఆత్మనః – తు – కామాయ – పుత్రాః – ప్రియాః – భవన్తి – న – వై – అరే – విత్తస్య – కామాయ – విత్తం – ప్రియం – భవతి – ఆత్మనః – తు – కామాయ – విత్తం – ప్రియం – భవతి న – వై – అరే – పశూనాం – కామాయ – పశవః – ప్రియాః – భవన్తి – ఆత్మనః – తు – కామాయ – పశవః – ప్రియాః – భవన్తి – న – వై –అరే – బ్రహ్మణః – కామాయ – బ్రహ్మ – ప్రియం–భవతి– ఆత్మనః–తు – కామాయ–బ్రహ్మ–ప్రియం–భవతి–న–వై –అరే–క్షత్రస్య–కామాయ– క్షత్రం – ప్రియం – భవతి – ఆత్మనః – తు – కామాయ–క్షత్రం – ప్రియం – భవతి – న – వై – అరే – లోకానాం – కామాయ – లోకాః – ప్రియాః – భవన్తి – ఆత్మనః – తు – కామాయ –

లోకాః - ప్రియాః - భవన్తి - న - వై - అరే - దేవానాం - కామాయ - దేవాః - ప్రియాః - భవన్తి - ఆత్మనః - తు - కామాయ - దేవాః - ప్రియాః - భవన్తి - న - వై - అరే - వేదానాం - కామాయ - వేదాః - ప్రియాః - భవన్తి - ఆత్మనః - తు - కామాయ - వేదాః - ప్రియాః - భవన్తి - న - వై - అరే - భూతానాం - కామాయ - భూతాని - ప్రియాణి - భవన్తి - ఆత్మనః - తు - కామాయ - భూతాని - ప్రియాణి - భవన్తి - న - వై - అరే - సర్వస్య - కామాయ - సర్వం - ప్రియం - భవతి - ఆత్మనః - తు - కామాయ - సర్వం - ప్రియం - భవతి - ఆత్మా - వై - అరే - ద్రష్టవ్యః - శ్రోతవ్యః - మన్తవ్యః - నిదిధ్యాసితవ్యః - మైత్రేయి - ఆత్మని - ఖలు - అరే - దృష్టే - శ్రుతే - మతే - విజ్ఞాతే - ఇదం - సర్వం - విదితం.

ప్ర॥ సః = ఆ యాజ్ఞవల్క్యుఁడు, హోవాచ = పలికెను. అరే = ఓ మైత్రేయి! పతిః = భర్త, (పెనిమిటి), పత్యుః = భర్త యొక్క, కామాయ = కామముకొఱకు, (ఇష్టముకొఱకు), ప్రియః = ఇష్టమైనవాఁడు, నవై భవతి = కానేకాఁడు. పతిః = భర్త, ఆత్మనస్తు = ఆత్మయొక్కయె, కామాయ = కామముకొఱకు, ప్రియః = ప్రియుఁడగువాఁడు, భవతి = అగుచున్నాఁడు. అరే=ఓ మైత్రేయీ! జాయా = భార్య, జాయాయై=భార్యయొక్క, (షష్ఠీవిభక్తికి చతుర్థి) కామాయ = కామముకొఱకు, జాయా = భార్య, ప్రియా = ప్రియురాలు, నవై భవతి = కానేకాదు. ఆత్మనస్తు = ఆత్మయొక్కయె, కామాయ = కామముకొఱకు, జాయా = భార్య, ప్రియా = ప్రియురాలు, భవతి = అగుచున్నది. అరే = ఓ మైత్రేయీ! పుత్రాః = పుత్రులు, పుత్రాణాం = పుత్రులయొక్క, కామాయ = కామముకొఱకు, ప్రియాః = ఇష్టమైనవారు, నవై భవన్తి = కానేకారు. పుత్రాః = పుత్రులు, ఆత్మనస్తు = ఆత్మయొక్కయె, కామాయ =

కామముకొఱకు, ప్రియాః = ఇష్టులు, భవన్తి = అగుచున్నారు. అరే = ఓ మైత్రేయీ! విత్తం = ధనము, విత్తస్య = ధనముయొక్క, కామాయ = కామముకొఱకు, ప్రియం = ఇష్టమైనది, నవైభవతి = కానేరాదు. విత్తం = ధనము, ఆత్మనస్తు = ఆత్మయొక్కయె, కామాయ = కామముకొఱకు, ప్రియం = ఇష్టమైనది, భవతి = అగుచున్నది. అరే = ఓ మైత్రేయీ! పశవః = పశువులు, పశూనాం = పశువులయొక్క, కామాయ = కామముకొఱకు, ప్రియాః = ఇష్టములైనవి, నవైభవన్తి = కానేకావు. పశవః = పశువులు, ఆత్మనస్తు = ఆత్మయొక్కయె, కామాయ = కామముకొఱకు, ప్రియాః = ఇష్టములైనవి, భవన్తి = అగుచున్నవి. అరే = ఓ మైత్రేయీ! బ్రహ్మ = బ్రహ్మజాతి, (బ్రహ్మత్వము), బ్రహ్మణః = బ్రాహ్మణత్వముయొక్క, కామాయ = కామముకొఱకు, ప్రియం = ఇష్టమైనది, నవైభవతి = కానేకాదు. బ్రహ్మ = బ్రాహ్మణత్వము, ఆత్మనస్తు = ఆత్మయొక్కయె, కామాయ = కామముకొఱకు, ప్రియం = ఇష్టమైనది, భవతి = అగుచున్నది, అరే = ఓ మైత్రేయీ! క్షత్రం = క్షత్రియత్వము, (క్షత్రియజాతి), క్షత్రస్య = క్షత్రియజాతియొక్క, కామాయ = కామముకొఱకు, ప్రియం = ఇష్టమైనది, నవైభవతి = కానేకాదు. క్షత్రం = క్షత్రియజాతి, ఆత్మనస్తు = ఆత్మయొక్కయె, కామాయ = కామముకొఱకు, ప్రియం = ఇష్టమైనది, భవతి = అగుచున్నది. అరే = ఓ మైత్రేయీ! లోకాః = లోకములు, లోకానాం = లోకములయొక్క, కామాయ = కామముకొఱకు, ప్రియాః = ఇష్టమైనవి, నవైభవన్తి = కానేకావు. లోకాః = లోకములు, ఆత్మనస్తు = ఆత్మయొక్కయె, కామాయ = కామముకొఱకు, ప్రియాః = ఇష్టములైనవి. భవన్తి = అగుచున్నవి. అరే = ఓ మైత్రేయీ! దేవాః = దేవతలు, దేవానాం = దేవతలయొక్క, కామాయ = కామముకొఱకు, ప్రియాః = ఇష్టమైనవారు, నవైభవన్తి = కానేకారు. దేవాః = దేవతలు, ఆత్మనస్తు = ఆత్మయొక్కయె,

కామాయ = కామముకొఱకు, ప్రియాః = ఇష్టమైనవారు, భవన్తి= అగుచున్నారు. అరే = ఓ మైత్రేయీ! వేదాః = వేదములు, వేదానాం = వేదములయొక్క, కామాయ=కామముకొఱకు, ప్రియాః = ఇష్టములైనవి, నవై భవన్తి = కానేకావు వేదాః = వేదములు, ఆత్మనస్తు=ఆత్మయొక్కయె, కామాయ=కామముకొఱకు, ప్రియాః = ఇష్టములైనవి, భవన్తి = అగుచున్నవి. అరే = ఓ మైత్రేయీ! భూతాని=భూతములు, భూతానాం=భూతములయొక్క, కామాయ= కామముకొఱకు, ప్రియాణి=ఇష్టములైనవి, నవై భవన్తి=కానేకావు. భూతాని = భూతములు, ఆత్మనస్తు = ఆత్మయొక్కయె, కామాయ కామముకొఱకు, ప్రియాణి = ఇష్టములైనవి, భవన్తి=అగుచున్నవి. సర్వం = సమస్తము, సర్వస్య = సర్వముయొక్క, కామాయ = కామముకొఱకు, ప్రియం = ఇష్టమైనది, నవై భవతి = కానేకాదు. సర్వం = సమస్తము, ఆత్మనస్తు = ఆత్మయొక్కయె, కామాయ = కామముకొఱకు, ప్రియం = ఇష్టమైనది, భవతి = అగుచున్నది. అరే = ఓ మైత్రేయీ, ఆత్మావై = ఆత్మయె, ద్రష్టవ్యః=చూడదగినది. శ్రోతవ్యః = వినఁదగినది. మన్తవ్యః = మననము చేయఁదగినది. నిదిధ్యాసితవ్యః = మరలమరల ధ్యానముచేయఁదగినది. అరేమైత్రేయీ= ఓ మైత్రేయీ! ఆత్మనిఖలు = ఆత్మస్వరూపమె, దృష్టేసతి=చూడఁబడుచుండఁగా,(ఆత్మ ఎట్లుచూడఁబడుచున్నదనిన చెప్పఁబడుచున్నది.) శ్రుతే = వినఁబడినదై, ఆచార్యునిచేతను ఆగమముచేతను వినఁబడినదై), మతే = విచారింపఁబడినదై, (తిరిగి తర్కముతో ఉపపత్తిచేత విచారింపఁబడినదై), విజ్ఞాతేసతి = తెలియఁబడినదగుచుండఁగా, (ఆత్మ శ్రవణ మననములచేత నిశ్చయింపఁబడినదగుచుండఁగా), ఇదం = ఈ, సర్వం = ఈ సమస్తము, విదితం = తెలియఁబడినది, (భవతి = అగుచున్నది).

తా॥ ఓ మైత్రేయీ! భర్తృ జాయా పుత్రాదులందఱును

ఆభర్తృజాయా పుత్రాదుల కామము కొఱకు ఇష్టులు కారు; మఱి యేమియనిన, భర్తృజాయా పుత్రాదులు ఆత్మ కామము కొఱకే ఇష్టులగుచున్నారు. సర్వమును సర్వముయొక్క కామము కొఱకిష్టమైనది కాదు. ఆత్మయొక్క కామముకొఱకే ఇష్టమైనది యగుచున్నది. కనుక ఓ మైత్రేయీ! ఆత్మయే చూడఁదగినది. (తానై యుండఁదగినది). ఆచార్యాగమము వలన వినఁదగినది. తర్కముతోను ఉపపత్తితోను విచారించఁదగినది. (మననము చేయఁదగినది). ధ్యానించఁదగినది. ఇట్లు శ్రవణ మనన నిదిధ్యాసనములచే ఆత్మ చూడఁబడి తన్నుగా తెలిసికొనఁబడినయెడలసర్వమును తెలియఁబడినదియే యగుచున్నది యని యాజ్ఞవల్క్యుఁడు మైత్రేయితోఁ జెప్పెను.

ఉ॥ బ్రహ్మ తం పరాదాద్యోఽన్యత్రాత్మనో బ్రహ్మ వేద క్షత్రం తం పరాదాద్యోఽన్యత్రాత్మనః క్షత్రం వేద లోకా స్తం పరాదుర్యోఽన్యత్రాత్మనో లోకాన్వేద దేవా స్తం పరాదుర్యోఽన్యత్రాత్మనో దేవాన్వేద వేదా స్తం పరాదుర్యోఽన్యత్రాత్మనో వేదాన్వేద భూతాని తం పరాదుర్యోఽన్యత్రాత్మనో భూతాని వేద సర్వం తం పరాదాద్యోఽన్యత్రాత్మన స్సర్వం వేదేదం బ్రహ్మేదం క్షత్రమిమే లోకా ఇమే దేవా ఇమే వేదా ఇమాని సర్వాణి భూతానీదగ్ సర్వం యదయ మాత్మా. ॥7॥

ప॥ బ్రహ్మ - తం - పరాదాత్ - యః - అన్యత్ర-ఆత్మనః- బ్రహ్మ - వేద - క్షత్రం - తం - పరాదాత్ - యః - అన్యత్ర- ఆత్మనః - క్షత్రం-వేద-లోకాః - తం - పరాదుః-యః-అన్యత్ర - ఆత్మనః - లోకాన్ - వేద - దేవాః - తం - పరాదుః - యః - అన్యత్ర - ఆత్మనః - దేవాన్ - వేద - వేదాః - తం - పరాదుః - యః - అన్యత్ర - ఆత్మనః - వేదాన్ - వేద-భూతాని - తం - పరాదుః - యః - అన్యత్ర - ఆత్మనః - భూతాని వేద -

సర్వం - తం - పరాదాత్ - యః - అన్యత్ర - ఆత్మనః - సర్వం - వేద - ఇదం - బ్రహ్మ - ఇదం - క్షత్రం - ఇమే - లోకాః - ఇమే - దేవాః - ఇమే - వేదాః - ఇమాని-సర్వాణి - భూతాని - ఇదం-సర్వం - యత్ - అయం - ఆత్మా.

ప్ర॥ యః = ఎవఁడు, బ్రహ్మ = బ్రాహ్మణజాతిని, ఆత్మనః = ఆత్మస్వరూపముకంటె, అన్యత్ర = వేఱుగా, వేద= తెలిసికొనునో, తం = వానిని, బ్రహ్మ = బ్రాహ్మణజాతి, పరాదాత్ = వేఱుగాఁ జేయును. యః = ఎవఁడు, క్షత్రం = క్షత్రియజాతిని, ఆత్మనః = ఆత్మస్వరూపముకంటె, అన్యత్ర = వేఱుగా, వేద = తెలిసికొనునో, తం = వానిని, క్షత్రం = క్షత్రియజాతి, పరాదాత్ = వేఱుగాఁ జేయును. యః = ఎవఁడు, లోకాన్ = లోకములను, ఆత్మనః = ఆత్మస్వరూపముకంటె, అన్యత్ర = వేఱుగా, వేద = తెలిసికొనునో, తం = వానిని, లోకాః = లోకములు, పరాదుః = వేఱుగాఁజేయుచున్నవి. యః = ఎవఁడు, దేవాన్ = దేవతలను, ఆత్మనః = ఆత్మస్వరూపముకంటె, అన్యత్ర = వేఱుగా, వేద = తెలిసికొనునో, తం = వానిని, దేవాః = దేవతలు, పరాదుః = వేఱుచేయుదురు. యః = ఎవఁడు, వేదాన్ = వేదములను, ఆత్మనః = ఆత్మస్వరూపముకంటె, అన్యత్ర = వేఱుగా, వేద= తెలిసికొనునో, తం=వానిని, వేదాః = వేదములు, పరాదుః = వేఱుచేయును. యః = ఎవఁడు, భూతాని = భూతములను, ఆత్మనః=ఆత్మస్వరూపముకంటె, అన్యత్ర = వేఱుగా, వేద = తెలిసికొనుచున్నాఁడో, తం=వానిని, భూతాని= భూతములు,పరాదుః = వేఱుగాఁజేయును. యః = ఎవఁడు, సర్వం= సమస్తమును, ఆత్మనః = ఆత్మస్వరూపముకంటె, అన్యత్ర= వేఱుగా, వేద = తెలిసికొనునో, తం = వానిని, సర్వం = సమస్తము, పరాదాత్ = అన్యముగాఁజేయును. ఇదం = ఈ, బ్రహ్మ = బ్రాహ్మణజాతి, ఇదం = ఈ, క్షత్రం = క్షత్రియజాతి, ఇమే=ఈ, లోకాః=

లోకములు, ఇమే = ఈ, దేవాః = దేవతలు, ఇమే = ఈ, వేదాః = వేదములు, ఇమాని = ఈ, సర్వాణి = సమస్తములైన, భూతాని = భూతములు, ఇదం = ఈ, సర్వం = సమస్తము, యత్ = ఏ కారణమువలన, అయం = ఈ, ఆత్మా = ఆత్మస్వరూపము, (భవతి= అగుచున్నదో, ఆ కారణమువలన ఈ బ్రాహ్మణజాత్యాది సర్వమును ఆత్మకంటె వేఱుగాఁజూచెడు వానిని వేఱుగానే చేయునని పూర్వముతో నన్వయము).

తా॥ ఓ మైత్రేయీ! ఏ కారణమువలన ఈ బ్రహ్మక్షత్రాదికమంతయు ఆత్మస్వరూపమయ్యే యున్నదో ఆ కారణమువలన ఈ మంత్రమువందుఁజెప్పిన బ్రహ్మక్షత్రాది సర్వమును ఆత్మకంటె వేఱుగాఁజూచెడివానిని గూర్చి బ్రహ్మ క్షత్రాదికము అన్యమేయగునని యాజ్ఞవల్క్యుఁడు పలికెను.

ఉ॥ స యథా దున్దుభేర్హన్యమానస్య న బాహ్యాన్ శబ్దాన్ శక్నుయాద్గ్రహణాయ దున్దుభేస్తు గ్రహణేన దున్దుభ్యాఘాతస్య వా శబ్దో గృహీతః. ॥8॥

ఉ॥ స యథా శఙ్ఖస్య ధ్మాయమానస్య న బాహ్యాఞ్ శబ్దాఞ్ శక్నుయాద్గ్రహణాయ శఙ్ఖస్యతు గ్రహణే న శఙ్ఖధ్మస్య వా శబ్దో గృహీతః. ॥9॥

ఉ॥ సయథావీణాయై వాద్యమానాయై న బాహ్యాన్ శబ్దాఞ్ శక్నుయాద్గ్రహణాయ వీణాయైతు గ్రహణేన వీణావాదస్య వా శబ్దో గృహీతః. ॥10॥

ప॥ సః - యథా - దున్దుభేః - హన్యమానస్య - న - బాహ్యాన్ - శబ్దాన్ - శక్నుయాత్ - గ్రహణాయ - దున్దుభేః - తు - గ్రహణేన - దున్దుభ్యాఘాతస్య - వా - శబ్దః - గృహీతః

ప॥ సః - యథా - శఙ్ఖస్య - ధ్మాయమానస్య - న - బాహ్యాఞ్ - శబ్దాన్ - శక్నుయాత్ - గ్రహణాయ - శఙ్ఖస్య - తు -

గ్రహణేన - శఙ్ఖధ్మస్య - వా - శబ్దః - గృహీతః.

ప॥ సః - యథా - వీణాయై-వాద్యమానాయై-న బాహ్యాన్-శబ్దాన్ - శక్నుయాత్ - గ్రహణాయ - వీణాయై - తు - గ్రహణేన - వీణావాదస్య - వా - శబ్దః - గృహీతః.

ప్ర॥ **సయథా** = అదెట్లనఁగా, దున్దుభేః = భేరి, హన్యమానస్యసతః = కొట్టఁబడుచుండగా, (వాయించుచుండఁగా), బాహ్యాన్= ఇతరములైన, శబ్దాన్ = శబ్దములను, (ధ్వనులను), గ్రహణాయ = గ్రహించుటకొఱకు, (యథా = ఏప్రకారము), నశక్నుయాత్ = సమర్థముకాదో, దున్దుభేః = భేరియొక్క, గ్రహణేన= తెలిసికొనుట చేతను, దున్దుభ్యాఘాతస్య = భేరిదెబ్బయొక్క, శబ్దోవా = ధ్వనియును, (యథా = ఏప్రకారము), గృహీతః = గ్రహింపఁబడుచున్నదో (ఆప్రకారముగానున్న).

ప్ర॥ సయథా = అదెట్లనఁగా, శఙ్ఖస్య = శంఖము, ధ్మాయమానస్యసతః= ఊఁదఁబడుచుండఁగా, (శంఖము పూరించుచుండఁగా), బాహ్యాన్ = వెలుపలనుండెడి యితరములగు, శబ్దాన్ = శబ్దములను, (ధ్వనులను), గ్రహణాయ = తెలిసికొనుటకొఱకు, (యథా = ఏప్రకారము), నశక్నుయాత్ = సమర్థముకాదో, శఙ్ఖస్య = శఙ్ఖముయొక్క, గ్రహణేనతు = తెలిసికొనుటచేతనే, శఙ్ఖధ్మస్యవా = శంఖము ఊఁదుటయొక్కయు, శబ్దః = శబ్దము, (యథా= ఏప్రకారముగా), గృహీతః = తెలిసికొనఁబడునో (ఆప్రకారముగానున్న);

ప్ర॥ సయథా = అదియేప్రకారమనఁగా, వీణాయై = వీణ, (వల్లకి), వాద్యమానాయై = వాయించఁబడుచుండగా. బాహ్యాన్ = వెలుపలివైన, శబ్దాన్ = శబ్దములను, గ్రహణాయ = తెలిసికొనుటకొఱకు, (యథా = ఏప్రకారము), నశక్నుయాత్ = సమర్థముకాదో, వీణాయై = వీణయొక్క, (ఇక్కడనంతయు షష్ఠికి చతుర్థీవిభక్తి చెప్పఁబడియున్నది). గ్రహణేనతు = తెలిసికొనుట చేతనే, వీణావాదస్య = వీణవాయించుటయొక్క, శబ్దోవా = ధ్వని

యున్న, (యథా = ఏ ప్రకారము), గృహీతః = తెలిసికొనఁబడునో (ఆ ప్రకారముగానున్న).

తా॥ ఓ మైత్రేయీ! ఆత్మకంటె వేఱైనదేదియును లేక అంతయును ఆత్మమాత్రమేయైయుండుటవలన ఆత్మను తెలిసికొనుటచే ఇదియంతయు తెలిసికొనఁబడుచున్నది. ఎట్లనఁగా, భేరి వాయింపఁబడుచుండగా ఇతర ధ్వనులు తెలిసికొనశక్యముగాక భేరిని తెలిసికొనినప్పుడు భేరిధ్వనిని తెలిసికొనినట్లును, శంఖమును ఊఁదుచుండగా ఇతర ధ్వనులు తెలిసికొన శక్యముగాక శంఖమును తెలిసికొనినప్పుడు శంఖధ్వని తెలిసినట్లును, వీణవాయించుచుండఁగా ఇతర శబ్దములు తెలిసికొన శక్యముగాక వీణను తెలిసికొనినప్పుడు వీణాధ్వనిని తెలిసినట్లును, ఆత్మకంటె వేఱైనదేదియును ఆత్మకు వేఱుగా లేక పోవుటవలన ఆత్మను తేలిసికొనినతోడనే ఆత్మస్వరూపమైన యంతయును తెలియఁబడినదగుచున్నది యని యాజ్ఞవల్క్యుఁడు పలికెను.

ఉ॥ సయథార్ద్రైధాగ్నే రభ్యాహితస్య పృథగ్ధూమా వినిశ్చరన్త్యేవం వా అరేఽస్య మహతో భూతస్య నిశ్వసిత మేతద్యదృగ్వేదో యజుర్వేద స్సామవేదోఽథర్వాఙ్గిరస ఇతిహాసః పురాణం విద్యా ఉపనిషదః శ్లోకాః సూత్రాణ్యనువ్యాఖ్యానాని వ్యాఖ్యానానీష్టగ్ హుతమాశితం పాయితమయం చ లోకః పరశ్చ లోకస్సర్వాణిచ భూతాన్యస్యై వైతాని సర్వాణి నిశ్వసితాని. ॥11॥

ప॥ సః – యథా – ఆర్ద్రైధాగ్నేః – అభ్యాహితస్య – పృథక్ – ధూమాః – వినిశ్చరన్తి – ఏవం – వై – అరే – అస్య – మహతః – భూతస్య – నిశ్వసితం – ఏతత్ – యత్ – ఋగ్వేదః – యజుర్వేదః – సామవేదః – అథర్వాఙ్గిరసః – ఇతిహాసః – పురాణం – విద్యా – ఉపనిషదః – శ్లోకాః – సూత్రాణి – అనువ్యాఖ్యానాని – ఇష్టం –

హుతం - అశితం - పాయితం - అయం - లోకః - పరః - చ - లోకః - సర్వాణి - భూతాని - అస్య - ఏవ - ఏతాని - సర్వాణి-నిశ్వసితాని.

ప్ర॥ సయథా = అది యెట్లనఁగా, అభ్యాహితస్య=ఉంచఁబోఁబడిన, ఆర్ద్రైధాగ్నేః=తడికట్టెల నిప్పుయొక్క, ధూమాః=పొగలు, పృథక్ = వేఱుగా, (యథా = ఏ ప్రకారము), వినిశ్చరన్తి=బైలు వెడలుచున్నవో, ఏవంవై =ఈప్రకారముగానే, అరే=ఓమైత్రేయీ! ఏతత్ = ఈ ముందు చెప్పెడి సర్వము, అస్య = ఈ, మహతోభూతస్య = మహత్స్వరూపమైన పరమాత్మయొక్క, (బ్రహ్మయొక్క), నిశ్వసితం = నిట్టూర్పు, ఋగ్వేదః = ఋగ్వేదమున్ను, యజుర్వేదః= యజుర్వేదమున్ను, సామవేదః = సామవేదమున్ను, అధర్వాఙ్గిరసః = అధర్వణవేదమున్ను, ఇతిహాసః = భారతాదిగ్రంథములున్ను, పురాణం = స్కాందాదిపురాణములున్ను, విద్యాః = వ్యాకరణాది విద్యలున్ను, ఉపనిషదః = ఉపనిషత్తులున్ను, శ్లోకాః = మంత్రములున్ను, లేక శ్లోకములున్ను, సూత్రాణి = వ్యాససూత్రములున్ను, అనువ్యాఖ్యానాని = భాష్యములున్ను, వ్యాఖ్యానాని = వ్యాఖ్యానములున్ను, ఇష్టం = యాగమున్ను, హుతం = హోమద్రవ్యమున్ను, అశితం = అన్నము మొదలైనదియున్ను, పాయితం = ఉదకము మొదలైనదియున్ను, అయంచలోకః = ఇహలోకమున్ను, పరశ్చలోకః = పరలోకమున్ను, సర్వాణి = సమస్తములైన, భూతాని = భూతములున్ను, యత్ = ఏవియో, ఏతానిసర్వాణి = ఇవియన్నియున్ను, అస్యైవ = ఈపరమాత్మయొక్కయే, నిశ్వసితాని = నిట్టూర్పులు, (భవన్తి = అగుచున్నవి).

తా॥ ఈ సర్వమున్ను ఆత్మవలననే యెట్లు కలుగుచున్నదియనఁగా, ఓమైత్రేయీ! తడికట్టెల నిప్పువలన పొగలు అగ్నికి వేఱుగా బైలువెళ్ళుచున్నట్లు ఆ పరమాత్మవలన ఋగ్వేద యజుర్వేద సామ

వేద అథర్వణవేదములును, ఇతిహాస పురాణాదికములును, ఇహలోక పరలోకములును, సమస్త భూతములును, ఇవియన్నియును. ఈ పరమాత్మ యొక్కయే నిట్టూర్పు వాయువులై కలుగుచున్నవని యాజ్ఞవల్క్యుడు చెప్పెను.

ఉ॥ స యథా సర్వాసామపాగ్ సముద్ర ఏకాయనమేవగ్ సర్వేషాగ్ స్పర్శానాం త్వగేకాయనమేవగ్ సర్వేషాగ్ రసానాం జిహ్వైకాయనమేవగ్ సర్వేషాం గన్ధానాం నాసికే ఏకాయనమేవగ్ సర్వేషాగ్ రూపాణాం చక్షురేకాయనమేవగ్ సర్వేషాగ్ శబ్దానాగ్ శ్రోత్రమేకాయనమేవగ్ సర్వేషాగ్ సంకల్పానాం మన ఏకాయనమేవగ్ సర్వాసాం విద్యానాగ్ హృదయమేకాయనమేవగ్ సర్వేషాగ్ కర్మణాగ్ హస్తావేకాయనమేవగ్ సర్వేషామానన్దానాముపస్థ ఏకాయనమేవగ్ సర్వేషాం విసర్గాణాగ్ పాయురేకాయనమేవగ్ సర్వేషామధ్వనాం పాదావేకాయనమేవగ్ సర్వేషాం వేదానాగ్ వాగేకాయనం. ॥12॥

ప॥ సః - యథా - సర్వాసాం - అపాం - సముద్రః - ఏకాయనం - ఏవం - సర్వేషాం - స్పర్శానాం - త్వక్ - ఏకాయనం - ఏవం - సర్వేషాం - రసానాం - జిహ్వా - ఏకాయనం - ఏవం - సర్వేషాం - గన్ధానాం - నాసికా - ఏకాయనం - ఏవం-సర్వేషాం-రూపాణాం - చక్షుః - ఏకాయనం - ఏవం - సర్వేషాం-శబ్దానాం-శ్రోత్రం - ఏకాయనం - ఏవం - సర్వేషాం - సంకల్పానాం-మనః-ఏకాయనం - ఏవం - సర్వాసాం - విద్యానాం - హృదయం - ఏకాయనం - ఏవం - సర్వేషాం - కర్మణాం - హస్తౌ - ఏకాయనం - ఏవం - సర్వేషాం - ఆనన్దానాం - ఉపస్థః - ఏకాయనం - ఏవం - సర్వేషాం - విసర్గాణాం - పాయుః - ఏకాయనం - ఏవం-సర్వేషాం - అధ్వనాం - పాదౌ - ఏకాయనం - ఏవం - సర్వేషాం - వేదానాం - వాక్ - ఏకాయనం.

ప్ర॥ సయథా = అది యెట్లనఁగా, (యథా = ఏప్రకారము), సముద్రః = సముద్రము, సర్వాసాం = సమస్తములైన అపాం = ఉదకములకు, ఏకాయనం = ముఖ్యమైన స్థానమో, ఏవం = ఈ ప్రకారము, సర్వేషాం = సమస్తములైన, స్పర్శానాం = స్పర్శములకు, త్వక్ = త్వగింద్రియము, ఏకాయనం=ముఖ్యస్థానము, ఏవం= ఈ ప్రకారము, జిహ్వా = నాలుక, సర్వేషాం = సమస్తములైన, రసానాం = రసములకు, ఏకాయనం = ముఖ్యస్థానము. ఏవం = ఈప్రకారము, నాసికా = ఘ్రాణేంద్రియము, సర్వేషాం = సమస్తలైన, గన్ధానాం = గంధములకు, ఏకాయనం = ముఖ్యస్థానము, ఏవం = ఈప్రకారము, చక్షుః = నేత్రము, సర్వేషాం = సమస్తములైన, రూపాణాం = రూపములకు, ఏకాయనం = ముఖ్యస్థానము. ఏవం = ఈప్రకారము, శ్రోత్రం = శ్రవణేంద్రియము, సర్వేషాం = సమస్తములైన, శబ్దానాం = శబ్దములకు, ఏకాయనం = ముఖ్యస్థానము. ఏవం = ఈప్రకారము, మనః = మనస్సు, సర్వేషాం = సమస్తములైన, సంకల్పానాం = సంకల్పములకు, ఏకాయనం = ముఖ్యస్థానము. ఏవం = ఈప్రకారము, హృదయం = బుద్ధి, సర్వాసాం = సమస్తములైన, విద్యానాం = విద్యలకు, ఏకాయనం = ముఖ్యస్థానము. ఏవం = ఈప్రకారము, హస్తౌ = హస్తములు, సర్వేషాం = సమస్తములైన, కర్మణాం = కర్మములకు, ఏకాయనం = ముఖ్యస్థానము. ఏవం = ఈప్రకారము, ఉపస్థః = యోని, సర్వేషాం = సమస్తములైన, ఆనన్దానాం = ఆనందములకు, ఏకాయనం= ముఖ్యస్థానము. ఏవం = ఈప్రకారము, పాయుః = గుదము, సర్వేషాం = సమస్తములైన, విసర్గాణాం = మలోత్సర్జనాదులకు, ఏకాయనం = ముఖ్యస్థానము. ఏవం = ఈప్రకారము, పాదౌ = పాదములు, సర్వేషాం = సమస్తములైన, అధ్వానాం = మార్గములకు, (మార్గగమనమునకు), ఏకాయనం = ముఖ్యస్థానము. ఏవం = ఈప్రకారము,

వాక్ = వాగింద్రియము, సర్వేషాం = సమస్తములైన, వేదానాం= వేదములకు, ఏకాయనం = ముఖ్యస్థానము.

తా॥ సర్వము ఆత్మయొక్క నిట్టూర్పులై యున్నవని చెప్పిన దానినే యిక్కడ విశదీకరించుచున్నాఁడు. ఎట్లనఁగా, ఓ మైత్రేయీ! సముద్రము సమస్త ఉదకములకును ముఖ్యస్థానమైనట్లు సమస్తస్పర్శ ములకు త్వాగింద్రియమును, సర్వరసములకు జిహ్వేంద్రియమును, సమస్తగంధములకు ఘ్రాణేంద్రియమును, సమస్తరూపములకు చక్షు రింద్రియమును, సమస్త శబ్దములకు శ్రోత్రేంద్రియమును, సమస్త సంకల్పములకు మనస్సును, సమస్త విద్యలకు హృదయమును=బుద్ధి యును, సమస్తకర్మలకు హస్తములును, సమస్తానందములకు ఉపస్థ మును, సమస్త విసర్గములకు గుదమును, సమస్త గమనములకు పాదము లును, సమస్త వేదములకు వాక్కును, ముఖ్యస్థానములై యున్నవని యాజ్ఞవల్క్యుఁడు చెప్పెను.

ఉ॥ స యథా సైన్ధవఘనోఽనన్తరోఽబాహ్యః కృత్స్నో రసఘన ఏవైవం వా అరేఽయమాత్మాఽనన్తరోఽబాహ్యః కృత్స్నః ప్రజ్ఞానఘన ఏవైతేభ్యో భూతేభ్యః సముత్థాయ తాన్యేవా ను వినశ్యతి న ప్రేత్య సంజ్ఞాసీత్యరే బ్రవీమీతి హోవాచ యాజ్ఞ వల్క్యః. ॥13॥

ప॥ సః – యథా – సైన్ధవఘనః – అనన్తరః – అబాహ్యః – కృత్స్నః – రసఘనః – ఏవ – ఏవం – వై – అరే – అయం – ఆత్మా- అనన్తరః – అబాహ్యః – కృత్స్నః – ప్రజ్ఞానఘనః – ఏవ – ఏతేభ్యః- భూతేభ్యః – సముత్థాయ – తాని – ఏవ – అనువినశ్యతి – న – ప్రేత్య- సంజ్ఞా – అస్తి – ఇతి – అరే – బ్రవీమి – ఇతి – హోవాచ – యాజ్ఞ వల్క్యః.

ప్ర॥ సయథా = అదియెట్లనఁగా, సైన్ధవఘనః = ఉప్పురాయి, అనన్తరః = అంతరావయవములు కానిదియును, (అంతర స్వరూపము

కానిదియును), అబాహ్యః = బాహ్యావయవము కానిదియునగు, (బాహ్యస్వరూపము కానిదియునగు), కృత్స్నః = సర్వము, (ఉప్పు కల్లుయొక్క సర్వావయవము), (యథా = ఏప్రకారము, రస ఘన ఏవ = నీటియొక్క గడ్డగానే, (భవతి = అగుచున్నదో) ఏవంవై = ఈప్రకారముగానే, అరే = ఓ మైత్రేయీ! అయం = ఈ, ఆత్మా= ఆత్మస్వరూపము, అనన్తరః = అంతరము లేనిదియును, అబాహ్యః = బాహ్యము లేనిదియునై, కృత్స్నః = సర్వము, ప్రజ్ఞానఘనఏవ = విశేషజ్ఞానముయొక్క ఘనస్వరూపమే, (ప్రజ్ఞానముయొక్క కూడిక యగు ఒకటియగు ఆత్మయై యే, అవతిష్ఠతే=ఉండియున్నది) (ఇట్టి యాత్మ), ఏతేభ్యః = ఈ, భూతేభ్యః = భూతములనుండి, సముత్థాయ = లేచి, తాన్యేవ = ఆభూతములనే, అనువినశ్యతి = అనుసరించి నశించుచున్నది. (అనుసరించి లీనమగుచున్నది). ప్రేత్య = మరణమునుపొంది, సంజ్ఞా = సూచన, నాస్తి = లేదు. ఇతి = అని, అరే = ఓ మైత్రేయీ! బ్రవీమీతి = చెప్పుచున్నానని, యాజ్ఞవల్క్యః = యాజ్ఞవల్క్యుఁడు, హోవాచ = పలికెను.

తా॥ దృశ్యమగు కార్యజాతమునకు విలయముకలుగునపుడు సర్వము బ్రహ్మమాత్రముగానే యెట్లగుచున్నది యనఁగా ఓ మైత్రేయీ! బాహ్యాంతరభేదములేని ఉప్పుకల్లుయొక్క సర్వావయవమున్ను నీటిగడ్డ యైనట్లు బాహ్యాంతరములులేని ఈ సర్వాత్మయును ప్రజ్ఞానముయొక్క ఘనీభావమే యగుచున్నది. ఇట్టియాత్మ ఈ భూతములనుండి పుట్టి ఆభూతముల ననుసరించియే మరణమునుపొందుచున్నది. జ్ఞానోదయమునకు పూర్వము పొందఁబడిన విశేషజ్ఞానము కలదియై మరణానంతరము భేదవిషయకసూచనలేనిదై బ్రహ్మమాత్రమే యైనదని చెప్పుచున్నానని యాజ్ఞవల్క్యుఁడు పలికెను.

ఉ॥ సా హోవాచ మైత్రేయ్యత్రైవ మా భగవాన్ మోహాన్తమాపీపిపన్న వా అహమిమంవిజానామీతి స హోవాచ న వాఅరేఽ

హంమోహం బ్రవీమ్య వినాశీ వా అరేఽయ మాత్మాఽనుచ్ఛిత్తి ధర్మా. ॥14॥

ప॥ సా - హోవాచ - మైత్రేయీ - అత్ర - ఏవ - మా - భగవాన్ - మోహా న్తం - ఆపీపిపత్ - న - వై - అహం - ఇమం - విజానామి - ఇతి - సః - హోవాచ - న - వై - అరే - అహం - మోహం - బ్రవీమి - అవినాశీ - వై - అరే - అయం - ఆత్మా - అనుచ్ఛిత్తిధర్మా.

ప్ర॥ సా = ఆ, మైత్రేయీ = మైత్రేయి, హోవాచ = పలికెను. భగవాన్ = పూజ్యుఁడవగు నీవు, మా = నన్ను, అత్రైవ = ప్రజ్ఞానఘనస్వరూపమగు ఈ ఆత్మవస్తువునందే, మోహా న్తం=మోహమధ్యమును, ఆపీపిపత్ = పడవేయుచున్నావు. (పొందించుచున్నావు). అహం = నేను, ఇమం = ఈ ఆత్మను, నవైజానామీతి = తెలిసికొనలేనని (పలికెను). సః=ఆ యాజ్ఞవల్క్యుఁడు, అరే=ఓమైత్రేయీ! అహం = నేను, మోహం = మోహమును. నవైబ్రవీమీతి = చెప్పనేలేదని, హోవాచ = పలికెను. అరే=ఓ మైత్రేయీ! అయం= ఈ, ఆత్మా = ఆత్మ, అవినాశీవై = నాశస్వభావములేనిదియును, అనుచ్ఛిత్తిధర్మా = నాశనధర్మములేనిదియును, (వికారరూపమైన నాశమును, అభావరూపమైన నాశమును ఏనాశమును, లేనిదియును, భవతి = అగుచున్నది).

తా॥ ఆ మైత్రేయి, ఓ యాజ్ఞవల్క్యుఁడా! పూజ్యుఁడవగు నీవు నన్ను ఈ ప్రజ్ఞానఘనస్వరూపమైన ఆత్మవస్తువు విషయమై మోహమును పొందించుచున్నావు. ఈ ఆత్మస్వరూపమును నేను తెలిసికొనలేను అని పలికెను. ఓ మైత్రేయీ! నేను మోహమును చెప్పనేలేదని యాజ్ఞవల్క్యుఁడు పలికి ఈ ఆత్మస్వరూపము వినాశస్వభావములేనిదియును, వికారరూపమైన నాశమునుగాని అభావరూపమైన నాశమునుగాని ఏనాశమునుగాని లేనిదై యున్నదని యాజ్ఞవల్క్యుఁడు పలికెను.

ఉ॥ యత్ర హి ద్వైతమివ భవతి తదితర ఇతరం పశ్యతి తదితర ఇతరం జిఘ్రతి తదితర ఇతరగ్ రసయతే తదితర ఇతర మభివదతి తదితర ఇతరగ్ శృణోతి తదితర ఇతరం మనుతే తదితర ఇతరగ్ స్పృశతి తదితర ఇతరం విజానాతి యత్ర త్వస్య సర్వమాత్మైవా భూత్తత్కేన కం పశ్యేత్తత్కేన కం జిఘ్రేత్తత్కేన కగ్ రసయేత్తత్కేన క మభివదేత్తత్కేన కగ్ శృణుయాత్తత్కేన కం మన్వీత తత్కేన కగ్ స్పృశేత్తత్కేన కం విజానీయాద్యేనేదగ్ సర్వం విజానాతి తం కేన విజానీయాత్స ఏష నేతి నేత్యాత్మాఽగృహ్యోన హి గృహ్యతేఽశీర్యో న హి శీర్యతేఽ సఙ్గో న హి సజ్యతేఽసితో న వ్యథతేన రిష్యతి విజ్ఞాతారమరే కేన విజానీయాదిత్యుక్తానుశాసనాసి మైత్రేయ్యేతావదరే ఖల్వమృతత్వమితి హోక్త్వా యాజ్ఞవల్క్యో విజహార. ॥15॥

ఇతి బృహదారణ్యకే షష్ఠాధ్యాయే పఞ్చమబ్రాహ్మణమ్.

ప॥ యత్ర - హి - ద్వైతం - ఇవ - భవతి-తత్ - ఇతరః- ఇతరం - పశ్యతి - తత్ - ఇతరః - ఇతరం - జిఘ్రతి - తత్ - ఇతరః - ఇతరం - రసయతే - తత్ - ఇతరః - ఇతరం-అభివదతి - తత్ - ఇతరః - ఇతరం - శృణోతి - తత్ - ఇతరః - ఇతరం - మనుతే - తత్ - ఇతరః - ఇతరం - స్పృశతి - తత్ - ఇతరః - ఇతరం - విజానాతి - యత్ర - తు - అస్య - సర్వం - ఆత్మా - ఏవ - అభూత్ - తత్ - కేన - కం - పశ్యేత్ - తత్ - కేన - కం - జిఘ్రేత్ - తత్ - కేన - కం - రసయేత్ - తత్ - కేన - కం - అభివదేత్ - తత్ - కేన - కం - శృణుయాత్ - తత్ - కేన - కం - మన్వీత - తత్ - కేన - కం - స్పృశేత్ - తత్ - కేన - కం - విజానీయాత్ - యేన - ఇదం - సర్వం - విజానాతి- తం - కేన - విజానీయాత్ - సః - ఏషః - న - ఇతి - న - ఇతి- ఆత్మా - అగృహ్యః - న - గృహ్యతే - అశీర్యః - న-హి-

శీర్యతే - అసఙ్గః - న - హి - సజ్యతే - అసితః - న - వ్యథతే - న - రిష్యతి - విజ్ఞాతారం - అరే - కేన - విజానీయాత్ - ఇతి - ఉక్తానుశాసనా - అసి - మైత్రేయీ - ఏతావత్ - అరే - ఖలు - అమృతత్వం - ఇతి - హ - ఉక్త్వా - యాజ్ఞవల్క్యః - విజహార.

ప్ర॥ యత్రహి = ఎప్పుడైతే, (ఆత్మ), ద్వైతమివ=వేరైనది వలెనే, (భేదముగలది వలెనే), భవతి = అగుచున్నదో, తత్ = అప్పుడు, ఇతరః = వేఱొకఁడు, ఇతరం = మఱియొకనిని, పశ్యతి = చూచుచున్నాఁడు. తత్ = అప్పుడు ఇతరః = అన్యుఁడు, ఇతరం= అన్యమును, జిఘ్రతి = ఆఘ్రాణించుచున్నాఁడు. తత్ = అప్పుడు, ఇతరః = అన్యుఁడు. ఇతరం = అన్యమును, రసయతే = రుచిచూచుచున్నాఁడు (తినుచున్నాఁడు). తత్ = అప్పుడు, ఇతరః = అన్యుఁడు, ఇతరం = అన్యమును, అభివదతి=పలుకుచున్నాఁడు. తత్=అప్పుడు, ఇతరః = అన్యుఁడు, ఇతరం=అన్యమును, శృణోతి=వినుచున్నాఁడు. తత్ = అప్పుడు, ఇతరః=అన్యుఁడు, ఇతరం=అన్యమును, మనుతే= తెలిసికొనుచున్నాఁడు. (తలంచుచున్నాఁడు). తత్ = అప్పుడు, ఇతరః = అన్యుఁడు, ఇతరం = అన్యమును, స్పృశతి=తాకుచున్నాఁడు. తత్ = అప్పుడు, ఇతరః = ఇతరుఁడు, ఇతరం = అన్యమును, విజానాతి = మిక్కిలి తెలిసికొనుచున్నాఁడు. అస్య = ఈ జీవాత్మకు, యత్రతు = ఎప్పుడైతే, సర్వం=సమస్తము, ఆత్మైవ = ఆత్మస్వరూపమగు తానుగానే. అభూత్ = ఆయెనో, తత్ = అప్పుడు, (ఆత్మ), కేన = దేనిచేతను, (ఏ సాధనములచేతను), కం = దేనిని, పశ్యేత్ = చూచును? తత్ = అప్పుడు, కేన = దేనిచేత, కం = దేనిని, జిఘ్రేత్ = ఆఘ్రాణించును? తత్ = అప్పుడు, కేన = దేనిచేత, కం = దేనిని, రసయేత్ = రుచిచూచును ? తత్ = అప్పుడు, కేన =దేనిచేతను, కం=దేనిని, అభివదేత్=పలుకును ? తత్ = అప్పుడు, కేన = దేనిచేత, కం = దేనిని, శృణుయాత్ = వినును? తత్ =

అప్పుడు, కేన = దేనిచేత, కం = దేనిని, మన్వీత = తలంచును? తత్ = అప్పుడు, కేన = దేనిచేత, కం=దేనిని, స్పృశేత్ =తాకును? తత్ = అప్పుడు, కేన = దేనిచేత, కం = దేనిని, విజానీయాత్ = తెలిసికొనును? యేన = దేనిచేత, ఇదం = ఈ, సర్వం = సమస్తము, విజానాతి = తెలిసికొనుచున్నాఁడో, తం = దానిని, కేన = దేనిచేత, విజానీయాత్ = తెలిసికొనును? సః = ఆ ప్రసిద్ధమగు, ఏషః=ఈ, నేతినేతీతి=ఇదికాదు, ఇదికాదు యని సర్వనిషేధముతో నిశ్చయింపఁబడిన, ఆత్మా=ఆత్మస్వరూపము, అగృహ్యః=గ్రహింపనలవిగానిదియై, (స్వరూపము లేనిది గనుక కర్మేంద్రియములచే గ్రహింప శక్యమైనది కానిదై), నహిగృహ్యతే = గ్రహింపఁబడడము లేదు. అశీర్యః = శిథిలము కానిదియై (మూర్తరూపముకాదుగనుక శిథిలము కానిదై), నహిశీర్యతే = చిక్కిపోవడములేదు. అసఙ్గః = కూడుకొననిదియై, (అమూర్తస్వరూపము గనుకనే దేనితోను కూడుకొననిదియై), నహిసజ్యతే = కలిసికొనుటలేదు. అసితః = దుఃఖము లేనిదియై, (అమూర్త స్వరూపము గనుకనే దేనిచేతను బాధింపబడనిదియై), నవ్యథతే = బాధపొందుటలేదు. నరిష్యతి = నశించుటలేదు. అరే = ఓ మైత్రేయీ! విజ్ఞాతారం = సర్వమును తెలిసికొనునట్టి ఆత్మను, కేన = దేనిచేతను, విజానీయాత్ = తెలిసికొనును? (ఆత్మయే ఆత్మను తెలిసికొనును). ఇతి= ఈ ప్రకారము, ఉక్తానుశాసనా=చెప్పఁబడిన ఆజ్ఞగలదానవు, అసి=అయితివి. అరే మైత్రేయి= ఓమైత్రేయీ! అమృతత్వం = ముక్తత, ఏతావత్ఖలు = ఇంతియగదా! ఇతిహ = ఈ ప్రకారముగానే, యాజ్ఞవల్క్యః = యాజ్ఞవల్క్యుఁడు, ఉక్త్వా = చెప్పి, విజహార = సన్యసించెను.

తా॥ ఓ మైత్రేయీ! ఆత్మ ఎప్పుడు భేదముగలది వలెనే యుగుచున్నదో అప్పుడు ఆ యాత్మయే తాను వేరై తనకు వేరుగా నుండు రూప రస గంధాదులను నేత్ర జిహ్వా ఘ్రాణాదులద్వారా తెలిసి

గొనుచున్నాఁడు. ఆత్మ, అజ్ఞానావస్థయందు భేదమైనదివలెనే యుండి, జ్ఞానావస్థయందు సర్వాత్మ స్వరూపమగు తాను తనకు వేఱు మొకటిగానే యున్నప్పుడు, దేనితో దేనిని చూచును ? దేనితో దేనిని ఆఘ్రాణించును ? దేనితో దేనిని రుచిచూచును ? దేనితో దేనిని పలుకును ? దేనితో దేనిని వినును ? దేనితో దేనిని తలంచును ? దేనిని దేనితో తాకును ? దేనితో దేనిని తెలిసికొనును ? ఈ జీవుఁడు ఏ ఆత్మస్వరూపముచేత ఈ సమస్తమును తెలిసికొనుచున్నాఁడో ఆ ఆత్మస్వరూపమును ఇంక దేనిచేత తెలిసికొనవచ్చును? దానికి అన్యమైనదేదియును లేకపోవుటవలన అది దేనిచేతను తెలిసికొన శక్యమైనదికాదు. 'నేతి నేతి' యను మహా వాక్యముచే ఆత్మకంటె వేఱుగానుండెడి సర్వమును ఇదికాదు ఇదికాదు యని నిషేధించి సర్వశేషిగా నిశ్చయింపఁబడిన ఆ ఈ ఆత్మ, ఆకారము లేనిది గనుక కర్మేంద్రియమగు హస్తాదులచే గ్రహింపనలవిగానిదియును, ఆకారము లేనిదిగనుకనే చిక్కిపోనిదియును ఆకారము లేనిది గనుకనే దేనితోను చేరక అసంగమై యుండునదియును, ఆకారము లేనిదిగనుకనే దేనిచేతను బాధను పొందనిదియును, నశించనిదియునై యున్నది. ఓమైత్రేయీ ! సర్వమును తెలిసికొనునట్టి ఆత్మను దేనిచేత తెలిసికొనవచ్చును ? ఆత్మయే ఆత్మను తెలిసికొనును. ఇట్లు ఆజ్ఞాపింపఁబడినదానవైతివి. ఓ మైత్రేయీ ! ఆత్మ తనకు వేఱులేకపోవుటచే సర్వవిజ్ఞాతగా తాను నిలుచునట్టి ఇదియే ముక్తిగదా యని యాజ్ఞవల్క్యుఁడు భార్యయైన మైత్రేయికి స్వస్వరూపము నుపదేశించి సన్యసించెను.

ఇట్లు పఞ్చమబ్రాహణము సమాప్తము.

## షష్ఠాధ్యాయము – షష్ఠబ్రాహ్మణము

ఉ॥ అథవగ్ంశః పౌతిమాష్యాత్పౌతిమాష్యో గౌపవనాద్గౌపవనః పౌతిమాష్యాత్పౌతిమాష్యో గౌపవనాద్గౌపవనో కౌశికాత్కౌశికః కౌణ్డిన్యాత్కౌణ్డిన్యః శాణ్డిల్యాచ్ఛాణ్డిల్యః కౌశికాచ్చ గౌతమాచ్చ గౌతమః ॥1॥

ఉ॥ ఆగ్నివేశ్యాదాగ్నివేశ్యో గార్గ్యాద్గార్గ్యో గార్గ్యాద్గార్గ్యో గౌతమా
ద్గౌతమః సైతవాత్సైతవః పారాశర్యాయణాత్పారాశర్యాయణో
గార్గ్యాయణాద్గార్గ్యాయణ ఉద్దాలకాయనాదుద్దాలకాయనో జాబా
లాయనా జ్జాబాలయనో మాధ్యన్దినాయనా న్మాధ్యన్దినాయన
స్సౌకరాయణాత్సౌకరాయణః కాషాయణాత్కాషాయణః సాయ
కాయనా త్సాయకాయనః కౌశికాయనేః కౌశికాయనిః ॥2॥

ఉ॥ ఘృతకౌశికాద్ఘృతకౌశికః పారశర్యాయణా త్పారాశర్యాయణః
పారాశర్యాత్పారాశర్యో జాతూకర్ణ్యా జ్జాతూకర్ణ్య ఆసురా
యణాచ్చ యాస్కాచ్చాసురాయణస్త్రైవణే రౌపజన్ధనె రౌపజ
న్ధని రాసురేరాసురి ర్భారద్వాజాద్భారద్వాజ ఆత్రేయాదా
త్రేయో మాణ్టేర్మాణ్టి ర్గౌతమాద్గౌతమో గౌతమాద్గౌతమో
వాత్స్యాద్వాత్స్యః శాణ్డిల్యాచ్ఛాణ్డిల్యః కైశోర్యాత్కాప్యాత్కై
శోర్యః కాప్యః కుమార హారితాత్కుమార హారితో గాలవాద్గా
లవో విదర్భికౌణ్డిన్యాద్విదర్భి కౌణ్డిన్యో వత్సనపాతో బాభ్రవాద్వ
త్సనపాద్బాభ్రవః పథస్సౌభరాత్పన్థాస్సౌభరోఽయాస్యాదాఙ్గిర
సాదయాస్య ఆఙ్గిరస ఆభూతేస్త్వాష్ట్రాదాభూతి స్త్వాష్ట్రో విశ్వ
రూపాత్త్వాష్ట్రా ద్విశ్వరూపస్త్వాష్ట్రో శ్విభ్యామశ్వినౌ దధీచ
ఆథర్వణాద్దధ్యఙ్ఙాథర్వణోఽథర్వణో దైవాదథర్వా దైవో మృత్యోః
ప్రాధ్వగ్ సనాన్మృత్యుః ప్రాధ్వంసనః ప్రధ్వగ్ సనాత్ప్రధ్వగ్ సన
ఏకఋషే రేకర్షి ర్విప్రచిత్తేర్విప్రచిత్తి ర్వ్యష్టేర్వ్యష్టి స్సనారోః సనా
రుః సనాతనాత్సనాతనః సనకాత్సనకః పరమేష్ఠినః పరమేష్ఠీ బ్రహ్మ
ణో బ్రహ్మ స్వయమ్భు బ్రహ్మణే నమః ॥3॥

ఇతి షష్ఠాధ్యాయే షష్ఠబ్రాహ్మణమ్ షష్ఠాధ్యాయస్సమాప్తః

ఈ మూడు మంత్రములకును, బృహదారణ్యకము, చతుర్థా
ధ్యాయము, షష్ఠబ్రాహ్మణమునందు, పదవిభాగము, ప్రతిపదార్థము
తాత్పర్యములు, వ్రాయబడియున్నవి. గనుక వానిని చూచుకొను
నది. చూడుఁడు బృహదారణ్యకము, పుటలు 274 నుండి 279వఱకు.

షష్ఠాధ్యాయము సమాప్తము.

శుక్ల యజుర్వేద - కాణ్వశాఖాయామ్.

# బృహదారణ్యకోపనిషత్

## సప్తమాధ్యాయః - ప్రథమ బ్రాహ్మణమ్.

ఉ॥ హరిః ఓమ్॥ పూర్ణమదః పూర్ణమిదం పూర్ణాత్పూర్ణముదచ్యతే।
పూర్ణస్య పూర్ణమాదాయ పూర్ణమేవా వశిష్యతే. ॥1॥

ప॥ పూర్ణం - అదః - పూర్ణం-ఇదం- పూర్ణాత్ -పూర్ణం - ఉదచ్యతే - పూర్ణస్య - పూర్ణం - ఆదాయ - పూర్ణం - ఏవ - అవశిష్యతే.

ప్ర॥ అదః = ఇది, (పరోక్షమగు), పూర్ణం = కారణమగు పరబ్రహ్మము. (సృష్టికి పూర్వమునందలి సర్వకారణమగు పరబ్రహ్మము). ఇదం = ఇది, (ప్రత్యక్షమగు), పూర్ణం = కార్యమగు పరబ్రహ్మము. (సృష్ట్యనంతరము ఆ కారణమగు పరబ్రహ్మమే నామరూపాత్మకమైన కార్యజాతమగు పరబ్రహ్మమైనది). పూర్ణాత్ = కార్యరూపమగు పరబ్రహ్మముకంటె, పూర్ణం= కారణస్వరూపమగు పరబ్రహ్మము, ఉదచ్యతే = అతిక్రమించియుంటూమున్నది. పూర్ణస్య = కార్యముయొక్క, పూర్ణం = కారణమును, ఆదాయ= గ్రహించి, (నామరూపాత్మకమైన దేహాదికమునకు లక్ష్యముగానుండెడి కారణరూపమైన అద్వితీయమగు అఖండబ్రహ్మమును తెలిసికొని నేనే పరబ్రహ్మమైతినని), పూర్ణమేవ = కారణస్వరూపముగానే, (నామరూపాదులులేని కారణమగు పరబ్రహ్మముగానే), అవశిష్యతే = శేషించుచున్నది.

తా॥ ఇంతకు పూర్వము నాలుగు అధ్యాయములయందును చెప్పిన పరబ్రహ్మముయొక్క క్రమముక్తిసాధనములైన ముందు చెప్పని యుపాసనములను చెప్పవలయునని వేఱొక కాణ్డము నుపక్ర

మించుచున్నాఁడు. చక్షురాదీంద్రియములకు గోచరముగాకుండ, నామరూపాత్మకముగానిది కారణ పరబ్రహ్మము. అట్టి కారణపర బ్రహ్మమే ఈ చక్షురాదీంద్రియములకు గోచరమగు ప్రత్యక్షమైన కార్యముగా నగుచున్నది ఇట్టి కారణ కార్యముల రెంటిలో కారణ స్వరూపమగు పరబ్రహ్మము కార్యరూపముకంటె శ్రేష్ఠమైయున్నది. అందు కార్యమునందలి కల్పితములగు నామరూపాదులను పరిత్యజించి కార్యమునకు లక్ష్యమైన కారణాత్మకమగు పరబ్రహ్మమును తెలిసి కొనుటచే కల్పితమగు నామరూపాదికముపోయి కారణస్వరూపము గానే శేషించుచున్నది.

ఉ॥ ఓం 3 ఖంబ్రహ్మ । ఖంపురాణంవాయురం ఖమితి హ స్మాహ కౌరవ్యాయణీ పుత్రో వేదోఽయం బ్రాహ్మణా విదుర్వే దైనేన యద్వేదితవ్యమ్. ॥2॥

ఇతి సప్తమాధ్యాయే ప్రథమ బ్రాహ్మణమ్.

ప॥ ఓం - ఖం - బ్రహ్మ - ఖం - పురాణం - వాయురం - ఖం - ఇతి - హ - స్మ - ఆహ - కౌరవ్యాయణీపుత్రః - వేదః - అయం - బ్రాహ్మణాః - విదుః - వేద - ఏనేన - యత్ - వేది తవ్యం

ప్ర॥ ఓం = ఓంకారము, ఖం = పరమాత్మాకాశమగు, బ్రహ్మ = పరబ్రహ్మము; (ఓం ఖంబ్రహ్మ అను ఈ మంత్రము బ్రాహ్మణులచేత ధ్యానకర్మయందు వినియోగింపఁబడుచున్నది). కౌరవ్యాయణీపుత్రః = కౌరవ్యాయణీపుత్రుఁడను ఒకఋషి, (ఆ ఓం కారమును), పురాణం = ప్రాచీనమగు, ఖం = పరమాత్మాకాశ మనియును, (చిదాకాశమనియును), వాయురం=వాయువు ఉండెడి, ఖమితి = అకాశమనియును, ఆహస్మహ = చెప్పెను. యత్ = ఏ కారణమువలన, (సాధకః = సాధకుఁడగు జనుఁడు), ఏనేన = ఈ

ఓంకారముచేతను, వేదితవ్యం = తెలిసికొనఁదగిన బ్రహ్మమును, వేద= తెలిసికొనుచున్నాఁడో, (తత్ =ఆ కారణమువలన) బ్రాహ్మణాః= బ్రాహ్మణులు, అయం = ఇవి, (ఈఓంకారము), వేదః= వేదమని, విదుః = తెలిసికొనిరి.

తా॥ విస్తారమగు చిదాకాశమును పరమాత్మాకాశము ఓంకారము. ఈ ఓంకారము బ్రాహ్మణులచేత పరబ్రహ్మధ్యానకర్మయందు వినియోగింపఁబడుచున్నది. ఈ ఓంకారము ప్రతీకాభిధానములచేతను ధ్యానోపయోగమైనది. ఎట్లనఁగా, విష్ణ్వాదిప్రతిమలకు అభేదముగానే ఓంకారమును పొంది ధ్యానించుట ప్రతీకమను పేరుగల ధ్యానమనియును, చక్షురాదీంద్రియములకు గోచరముగాని అఖండస్వరూపమగు పరమాత్మాకాశము శ్రద్ధాభక్తులనైన భావవిశేషముచేత ఓంకారమునందు ప్రవేశించుచున్నది. ఆ ఓంకారము పరమాత్మాకాశముగా ధ్యానించుట అభిధానమనియును, లేక, ఆలంబనమనియును, చెప్పఁబడును. ఇట్లు ఓమ్ కారము ప్రతీకాలంబనోపాసనలకు ఆధారమైయున్నది. కనుకనే, కౌరవ్యాయణీ పుత్రుఁడగు ఋషి ప్రాచీనమగు చక్షురాదీంద్రియాగోచరమును అఖండమును నిరుపాధికమునగు పరమాత్మాకాశమును, వాయ్వధిష్ఠానమైన సోపాధికమగు ఆకాశమును, ఓంకారమని చెప్పెను. సాధకుఁడగు జనుఁడు, ఈ ఓంకారముచేతనే పరస్వరూపమగు సర్వేంద్రియాతీతమైన పరమాత్మాకాశమును, (పరబ్రహ్మమును), విష్ణ్వాది విగ్రహములనువలెనే అపరస్వరూపమగు ఆకాశాదిసర్వమును, తెలిసికొనుచున్నాఁడు. ఇందువల్లనే బ్రాహ్మణులు ఈ ఓంకారమే సమస్తమైన వేదమని తెలిసికొనిరి.

ఇట్లు సప్తమాధ్యాయము, ప్రథమబ్రాహ్మణము సమాప్తము

## సప్తమాధ్యాయము - ద్వితీయబ్రాహ్మణము

ఉ॥ త్రయాః ప్రాజాపత్యాః ప్రజాపతౌ పితరి బ్రహ్మచర్య మూషుర్దేవా మనుష్యా అసురా ఉషిత్వా బ్రహ్మచర్యం దేవా ఊచుర్బ్రవీతు నో భవానితి తేభ్యో హైతదక్షరమువాచ ద ఇతి వ్యజ్ఞాసిష్టా 3 ఇతి వ్యజ్ఞాసిష్మేతి హోచు ర్దామ్యతేతి న ఆత్థేత్యోమితి హోవాచ వ్యజ్ఞాసిష్టేతి. ॥1॥

ప॥ త్రయాః - ప్రాజాపత్యాః - ప్రజాపతౌ - పితరి - బ్రహ్మచర్యం - ఊషుః - దేవాః - మనుష్యాః - అసురాః - ఉషిత్వా - బ్రహ్మచర్యం - దేవాః - ఊచుః - బ్రవీతు - నః - భవాన్ - ఇతి - తేభ్యః - హ - ఏతత్ - అక్షరం - ఉవాచ - దః - ఇతి - వ్యజ్ఞాసిష్ట - ఇతి - వ్యజ్ఞాసిష్మ - ఇతి - హోచుః - దామ్యత - ఇతి - నః - ఆత్థ - ఇతి - ఓం - ఇతి - హోవాచ - వ్యజ్ఞాసిష్ట - ఇతి.

ప్ర॥ త్రయాః = మూడు సంఖ్యగల, ప్రాజాపత్యాః=బ్రహ్మ పుత్రులు, పితరి = తండ్రియైన, ప్రజాపతౌ = బ్రహ్మవిషయమై, బ్రహ్మచర్యం = బ్రహ్మచర్య నియమముగూర్చి, ఊషుః = ఉండిరి. (శిష్యవృత్తితో బ్రహ్మచర్యమును పొందియుండిరి. వారెవరనఁగా), దేవాః = దేవతలును, మనుష్యాః = మనుష్యులును, అసురాః = రాక్షసులును, (వీరు), బ్రహ్మచర్యం=బ్రహ్మచర్యమునుగూర్చి ఉషిత్వా = ఉండి, (వారిలో), దేవాః = దేవతలు, భవాన్ = నీవు, నః = మాకొఱకు, (శాసనం = ఆజ్ఞను), బ్రవీతు = చెప్పుదువుగాక, ఇతి= అని, (పితరం = తండ్రియైన బ్రహ్మనుగూర్చి), ఊచుః = పలికిరి. (ప్రజాపతిః = బ్రహ్మ), తేభ్యః = ఆ దేవతలకొఱకు, ఏతత్ =ఈ, ద ఇతి = ద అను, అక్షరం = వర్ణమును, ఉవాచ = పలికెను. (పితా = తండ్రియగు బ్రహ్మ, తాన్ =ఆ దేవతలను), వ్యజ్ఞాసిష్టేతి= తెలిసికొంటిరాయని, (పప్రచ్ఛ = అడిగెను). (అప్పుడు మరల దేవతలు), వ్యజ్ఞాసిష్మేతి = తెలిసికొంటిమని, హోచుః = పలికిరి, (తిరిగి

బ్రహ్మ ఓ దేవతలారా! మీరు తెలిసికొనినయెడల నాచేత ఏమి చెప్పఁబడినదో, దానిని చెప్పుఁడీ యని అడిగెను) (అప్పుడు దేవతలు ఓ బ్రహ్మదేవుఁడా! నీవు), దామ్యతేతి = ఇంద్రియ నిగ్రహము గలవారలు కండు అని, నః = మమ్మునుగూర్చి, (ఆత్థేతి= చెప్పుచున్నావని, హోచుః = పలికిరి). (ప్రజాపతిః = బ్రహ్మ), ఓమితి = సరేయని, (యూయం = మీరు), వ్యజ్ఞాసిష్టేతి = బాగుగాఁ దెలిసికొంటిరి యని, హోవాచ = పలికెను.

తా॥ బ్రహ్మపుత్రులగు మూఁడు విధములైన దేవ మనుష్య రాక్షసులు, తండ్రియగు బ్రహ్మవిషయమై శిష్యవృత్తితో బ్రహ్మచర్య నియమమును పొందియుండిరి. ఈ ప్రకారమున్న ఆ మూఁడు విధములైన వారిలో దేవతలు ఓ బ్రహ్మదేవుఁడా! నీవు మాకు నియమము నుపదేశించుమని పలికిరి. అప్పుడు బ్రహ్మ, దేవతలకొఱకు ద అను వర్ణము నుపదేశించెను. ఇట్లుపదేశించి ఓ దేవతలారా! నేను ఉపదేశించిన అక్షరముయొక్క అర్థమును తెలిసికొంటిరా యని బ్రహ్మ యడిగెను. మరల, దేవతలు, బ్రహ్మనుగూర్చి తెలిసికొంటిమని పలుకగా, బ్రహ్మ, ఓ దేవతలారా! మీరు తెలిసికొనినయెడల నాచేత ఏమి చెప్పఁబడినదో దానిని చెప్పుఁడీ యని అడిగెను. అప్పుడు దేవతలు, ఓ బ్రహ్మదేవుఁడా! ఇంద్రియ నిగ్రహములేని మీరు ఇంద్రియ నిగ్రహము కలవారలు కండు అని మమ్మునుగూర్చి యుపదేశించితివని పలికిరి. ఇట్లు పలుకుటతోడనే, బ్రహ్మ, ఓ దేవతలారా! మీరు సరే; బాగుగా తెలిసికొంటిరి యని పలికెను.

ఉ॥ అథ హైనం మనుష్యా ఊచుర్బ్రవీతు నో భవానితి తేభ్యో హైతదేవాక్షరము వాచ ద ఇతి వ్యజ్ఞాసిష్టా 3 ఇతి వ్యజ్ఞాసిష్మేతి హోచు ర్దత్తేతి న ఆత్థేత్యోమితి హోవాచ వ్యజ్ఞాసిష్టేతి. ॥2॥

ప॥ అథ – హ – ఏనం – మనుష్యాః – ఊచుః – బ్రవీతు - నః - భవాన్ – ఇతి – తేభ్యః - హ - ఏతత్ – ఏవ - అక్షరం–

ఉవాచ - దః - - వ్యజ్ఞాసిష్ట - ఇతి - వ్యజ్ఞాసిష్మ - ఇతి - హోచుః - ద_త్త - ఇతి - నః - ఆత్థ - ఇతి - ఓం-ఇతి-హోవాచ-వ్యజ్ఞాసిష్ట - ఇతి.

ప్ర॥ అథహ = అనంతరము, మనుష్యాః = మనుష్యులు, ఏనం = ఈ బ్రహ్మనుగూర్చి, నః = మాకొఱకు, భవాన్ = నీవు, (శాసనం = ఆజ్ఞను), బ్రవీతు = చెప్పుదువుగాక, ఇతి=అని, ఊచుః = పలికిరి (బ్రహ్మ), తేభ్యః = ఆ మనుష్యులకొఱకు, ఏతత్=ఈ, ద ఇతి = ద అనెడి, అక్షరమేవ = వర్ణమునే, ఉవాచహ=పలికెను. (పితా = తండ్రియగు బ్రహ్మ, తాన్ = ఆ మనుష్యులనుగూర్చి), వ్యజ్ఞాసిష్టేతి = తెలిసికొంటిరాయని, (ప్రపచ్ఛ=అడిగెను). (అప్పుడు తిరిగి మనుష్యులు), వ్యజ్ఞాసిష్మేతి = తెలిసికొంటిమని. హోచుః = పలికిరి. (తిరిగి బ్రహ్మ ఓ మనుష్యులారా! మీరు తెలిసికొనినయెడల నాచేత ఏమి చెప్పఁబడినదో, దానిని చెప్పుడీ యని అడిగెను. తిరిగి మనుష్యులు ఓ బ్రహ్మదేవుఁడా! నీవు), దత్తేతి = దానముచేయుఁడీ యని, నః = మమ్మును గూర్చి, ఆత్థేతి=చెప్పుచున్నావని, (హోచుః = పలికిరి). (ప్రజాపతిః = బ్రహ్మ), ఓమితి=సరేయని, (యూయం= మీరు), వ్యజ్ఞాసిష్టేతి = బాగుగా తెలిసికొంటిరి యని, హోవాచ = పలికెను.

తా॥ బ్రహ్మపుత్రులగు మనుష్యులు ఓ బ్రహ్మదేవుఁడా! నీవు మాకు నియమము నుపదేశింపుమని పలికిరి. అప్పుడా ప్రజాపతి మనుష్యులకొఱకు ద అను అక్షరమును ఉపదేశించెను. ఇట్లుపదేశించి ఓ మనుష్యులారా! నేను ఉపదేశించిన అక్షరముయొక్క అర్థమును తెలిసికొంటిరాయని బ్రహ్మ యడిగెను. తిరిగి మనుష్యులు బ్రహ్మను గూర్చి తెలిసికొంటిమని పలుకగా, బ్రహ్మ ఓ మనుష్యులారా! మీరు తెలిసికొనినయెడల నాచేత నేమి చెప్పఁబడినదో దానిని చెప్పుఁడీయని యడిగెను. అప్పుడు మనుష్యులు ఓ బ్రహ్మదేవుఁడా!—దానము లేని

మీరు దానమును చేయుఁడీ యని మమ్మును గూర్చి యుపదేశించితి వని పలికిరి. ఇట్లు పలుకుటతోనే, బ్రహ్మ ఓ మనుష్యులారా! మీరు, సరే, బాగుగా తెలిసికొంటిరి యని పలికెను.

ఉ॥ అథ హైన మసురా ఊచు ర్బ్రవీతు నో భవానితి తేభ్యో హైత దేవాక్షరమువాచ ద ఇతి వ్యజ్ఞాసిష్టా 3 ఇతి వ్యజ్ఞాసిష్మేతి హోచు ర్దయధ్వ మితి న ఆత్థే త్యోమితి హోవాచ వ్యజ్ఞాసిష్టేతి తదేతదేవైషా దైవీవాగనువదతి స్తనయిత్నుర్ద ద ద ఇతి దామ్యత దత్త దయధ్వమితి తదేతత్త్రియగ్ శిక్షే ద్దమం దానం దయా మితి. ॥3॥

ఇతి సప్తమాధ్యాయే ద్వితీయ బ్రాహ్మణమ్.

ప॥ అథ - హ - ఏనం - అసురాః - ఊచుః - బ్రవీతు - నః - భవాన్ - ఇతి - తేభ్యః - హ - ఏతత్ - ఏవ - అక్షరం - ఉవాచ - దః - ఇతి - వ్యజ్ఞాసిష్ట - ఇతి - వ్యజ్ఞాసిష్ట - ఇతి-వ్యజ్ఞాసిష్ట - ఇతి - వ్యజ్ఞాసిష్మ - ఇతి - హోచుః - దయధ్వం - ఇతి - నః - ఆత్థ - ఇతి - ఓం - ఇతి - హోవాచ - వ్యజ్ఞాసిష్ట - ఇతి - తత్ - ఏతత్ - ఏవ - ఏవా - ఏషా - దైవీ - వాగ్-అనువదతి-స్తనయిత్నుః - దదదః - ఇతి - దామ్యత - దత్త - దయధ్వం - ఇతి - దామ్యత - దత్త - దయధ్వం - ఇతి - తత్ - ఏతత్ - త్రయం - శిక్షేత్ - దమం - దానం - దయాం - ఇతి.

ప్ర॥ అథహ = అనంతరము, అసురాః = రాక్షసులు, ఏనం= ఈ బ్రహ్మను గూర్చి, నః = మాకొఱకు, భవాన్ = నీవు, (శాసనం = ఆజ్ఞను), బ్రవీతు = చెప్పుదువుగాక, ఇతి=అని, ఊచుః=పలికిరి. (బ్రహ్మ), తేభ్యః = ఆ రాక్షసులకొఱకు, ఏతత్ = ఈ, ద ఇతి = ద అను. అక్షరమేవ = వర్ణమునే, ఉవాచహ = పలికెను. పితా = తండ్రియగు బ్రహ్మ, తాన్ =ఆ రాక్షసులను గూర్చి), వ్యజ్ఞాసిష్టేతి= తెలిసికొంటిరా యని, (పప్రచ్ఛ = అడిగెను). (అప్పుడు తిరిగి రాక్ష

సులు), 'వ్యజ్ఞాసిష్మేతి = తెలిసికొంటిమని, హోచుః = పలికిరి. (తిరిగి బ్రహ్మ ఓ రాక్షసులారా! మీరు తెలిసికొనిన యెడల నాచేత ఏమి చెప్పఁబడినదో దానిని చెప్పుఁడీ యని అడిగెను. రాక్షసులు తిరిగి ఓ బ్రహ్మదేవుఁడా! నీవు) దయధ్వమితి = ప్రాణులయందు దయను చేయుఁడీ యని, నః = మమ్మునుగూర్చి, ఆత్థేతి = చెప్పు చున్నావని, (హోచుః = పలికిరి.) (ప్రజాపతిః = బ్రహ్మ) ఓమితి= సరేయని, (యూయం = మీరు), వ్యజ్ఞాసిష్టేతి = బాగుగా తెలిసి కొంటిరని, హోవాచ = పలికెను. తత్ = ఆ, ఏత దేవ = దీనినే; స్తనయిత్నుః = మేఘము, దదదఇతి = దదదయని, (మూఁడుసార్లు దకారమును), దామ్యత = ఇంద్రియ నిగ్రహమును చేయుఁడీ; దత్త= దానము చేయుఁడీ; దయధ్వమితి=ప్రాణులయందు దయను చేయుఁడీ; యని. అనువదతి = అనుసరించి పలుకుచున్నది. ఏషా = ఇదియె, దైవీవాక్ = దైవసంబంధమైన వాక్కు. తదేతత్ = ఆ ఈ, త్రయం= మూఁడు దకారములును, దమం = ఇంద్రియ నిగ్రహము, దానం = దానమును, దయామితి = కరుణనే, శిక్షేత్ = శిక్షించును. (తెలియఁ జేయును).

తా॥ బ్రహ్మపుత్రులగు రాక్షసులు ఓ బ్రహ్మదేవుఁడా! నీవు మాకు నియమము నుపదేశింపుమని పలికిరి. అప్పుడా బ్రహ్మరాక్షసులకొఱకు ద యను అక్షరమును ఉపదేశించి ఓ రాక్షసులారా! ఈ అక్షరముయొక్క అర్థమును మీరు తెలిసికొంటిరా యని అడిగెను. తిరిగి రాక్షసులు బ్రహ్మనుగూర్చి తెలిసికొంటిమని పలుకగా, బ్రహ్మ, ఓ రాక్షసులారా! మీరు తెలిసికొనిన యెడల నాచేత ఏమి చెప్పఁబడినదో దానిని చెప్పుఁడీ అని అడిగెను. అప్పుడు రాక్షసులు ఓ బ్రహ్మదేవుఁడా! ప్రాణులయందు దయలేని మీరు ప్రాణులయందు దయను కలిగియుండుఁడీ అని మమ్మునుగూర్చి నీవు ఉపదేశించితివని పలికిరి. ఇట్లు పలుకుటతోనే, బ్రహ్మ, ఓ రాక్షసులారా! మీరు సరే,

బాగుగా తెలిసికొంటిరని పలికెను. ఇట్లు దేవ మనుష్య రాక్షసులను గూర్చి ప్రజాపతి చెప్పిన దకారత్రయమునే ఈ మేఘమున్ను ద ద ద యని మూడు సార్లు దకారమును పలుకుచున్నది. ఇదియే దైవవాక్కు— ఈ దేవ మనుష్య రాక్షసులు ముగ్గురు తమ తండ్రియైన ప్రజాపతి యొద్దకు పోయి ప్రార్థించగా వారియందలి లోపమును తెలిసికొని ప్రజాపతి ద ద ద యని దకారమును మూడు సార్లుచ్చరించుటతోనే వారి వారి సందేహముల ప్రకారము పూర్వము చెప్పినట్లు వేఱు వేఱు అర్థములను గ్రహించిరి. దీని యభిప్రాయమేమి అనఁగా, దేవాసురులు మనుష్యులకంటె వేఱుగా లేరు. గనుక మనుష్యులలోనే సమస్త గుణ సంపత్తు కలిగి ఇంద్రియ నిగ్రహము లేక దేవతలగు వారిని ఇంద్రియ నిగ్రహము చేయుఁడు అనియును. దానములేక మనుష్యులగు వారిని దానము చేయుఁడు అనియును, ప్రాణులయందు దయలేక రాక్షసులగువారిని ప్రాణులయందు దయను కలిగియుండుఁడు అనియును, మనుష్యులను గూర్చియె, ఈ దకారత్రయము, ఇంద్రియ నిగ్రహమును, దానమును, భూతదయను, శిక్షించుచున్నది. కాఁబట్టి మనుష్యులు ఇంద్రియ నిగ్రహమును, దానమును, భూతదయను, పొంది యుండవలయునని భావము.

ఇట్లు సప్తమాధ్యాయము ద్వితీయ బ్రాహ్మణము సమాప్తము.

సప్తమాధ్యాయ – తృతీయ బ్రాహ్మణము.

ఉ॥ ఏష ప్రజాపతి ర్యద్ధృదయ మేతద్బ్రహ్మైతత్సర్వం తదేతత్ర్యక్షరగ్ హృదయమితి హృ ఇత్యేక మక్షరమభిహరన్త్యస్మై స్వాశ్చాన్యే చ య ఏవం వేద ద ఇత్యేకమక్షరం దదత్యస్మై స్వాశ్చాన్యే చ య ఏవం వేద య మిత్యేకమక్షరమేతి స్వర్గం లోకం య ఏవం వేద. ॥1॥

ఇతి సప్తమాధ్యాయే తృతీయబ్రాహ్మణమ్.

ప॥ ఏషః – ప్రజాపతిః – యత్ – హృదయం – ఏతత్ – బ్రహ్మ – ఏతత్ – సర్వం – తత్ – ఏతత్–త్ర్యక్షరం – హృదయం – ఇతి – హృ – ఇతి – ఏకం – అక్షరం – అభిహరన్తి – అస్మై – స్వాః – చ – అన్యే – చ – యః – ఏవం – వేద – దః – ఇతి – ఏకం – అక్షరం – దదతి – అస్మై – స్వాః – చ – అన్యే – చ – యః – ఏవం – వేద – యం – ఇతి – ఏకం – అక్షరం – ఏతి – స్వర్గం – లోకం – యః – ఏవం – వేద.

ప్ర॥ ఏషః = ఈ పూర్వోక్తమైన, ప్రజాపతిః = బ్రహ్మ, (సృష్టికర్తయగు బ్రహ్మ, యః = ఎవఁడో, సః = వాఁడు, ఏతత్ = ఈ హృదయము), హృదయం = హృదయము, యత్ = ఏదియో, ఏతత్ = ఈ హృదయము, బ్రహ్మ = బ్రహ్మస్వరూపము. (సర్వస్వరూపమగు పరబ్రహ్మము), ఏతత్ = ఈ హృదయము, సర్వం = సమస్తము. (గనుక హృదయమును పరబ్రహ్మమునుగా నుపాసించవలయును). తత్ = ఆ, ఏతత్ = ఈ, హృదయమితి = హృదయమను నది, త్ర్యక్షరం = మూఁడు అక్షరములు కలది; (ఆ అక్షరములేవి యనఁగా), హృ ఇతి = హృ అనెడి, ఏకం అక్షరం = ఒక వర్ణమును, (హృదయ మను నామమునందలి హృ అను ఒక అక్షరమును), యః = ఎవఁడు, ఏవం = ఈ పూర్వోక్తప్రకారము, వేద = తెలిసికొనుచున్నాఁడో, అస్మై=ఇట్లు తెలిపిన విద్వాంసునికొఱకు, స్వాశ్చ= జ్ఞాతులును, అన్యేచ = ఇతరులగు బంధువులును, (బలిం=పూజను), అభిహరన్తి = తీసికొనివచ్చి అర్పించుచున్నారు. (ఏకారణమువలన ఇంద్రియములును విషయములును తమతమ కార్యములను హృదయ పరబ్రహ్మము కొఱకు పొందించుచున్నవో ఆకారణమువలన ఇట్లు తెలిసికొని యుపాసించువానికొఱకు జ్ఞాతులును బంధువులు ను పూజను అర్పించుచున్నారు). ద ఇతి = ద అనెడి, ఏకం అక్షరం = ఒక అక్షరమును, (హృదయమను నామమునందలి ద యను ఒక అక్షరమును),

యః=ఎవఁడు. ఏవం=ఈ ప్రకారము, వేద=తెలిసికొనుచున్నాఁడో. అస్మై = ఇట్లు తెలిసికొని యుపాసించువానికొఱకు, స్వాశ్చ = ఇంద్రియములును, అన్యేచ = విషయములును, (వాటి వాటి కార్యములను), దదతి = ఇచ్చుచున్నవి. య మితి = య అనెడి, ఏకం అక్షరం = ఒక అక్షరమును. (హృదయమను నామమునందలి య అను ఒక అక్షరమును), యః = ఎవఁడు, ఏవం=ఈ ప్రకారము వేద=తెలిసికొనుచున్నాఁడో, సః = వాఁడు), స్వర్గలోకం = స్వర్గలోకమును, ఏతి= పొందుచున్నాఁడు.

తా॥ జనుఁడు, దమ దాన దయలు మూఁడును గలవాఁడైన, సర్వోపాసనలయందును అధికారి యగుచున్నాఁడు. ఇంతకుపూర్వము నిరుపాధిక పరబ్రహ్మోపాసన చెప్పఁబడినది. ఇప్పుడు సోపాధిక పరబ్రహ్మము యొక్కయే, యుపాసన వలన కలిగెడి అభివృద్ధి ఫలములను చెప్పవలయునని ఈ మంత్రమారంభింపఁబడినది. ఇదివఱకు దాంత దాన దయలను యుపదేశించిన సృష్టికర్తయగు బ్రహ్మ, ఎవఁడనఁగా, ఈ హృదయమే. ఈ హృదయమే పరబ్రహ్మము ఈ హృదయమే సర్వము గనుక హృదయమే పరబ్రహ్మమని యుపాసించవలయును. ఇంతియకాదు. ఈ హృదయమను నామమునందలి మూఁడు అక్షరములలో ఒక్కొక అక్షరమును ఉపాసించుటవల్లనే జనుఁడు విశేష ఫలము పొందుచున్నాఁడు. ఎట్లనఁగా, హృదయమను నామమునందలి హృ అను ఒక అక్షరమును బ్రహ్మస్వరూపముగాఁ దెలిసికొని యుపాసించువాని కొఱకు హృదయబ్రహ్మోపాసనచేయు వానికి ఇంద్రియములును విషయములును వాటి వాటి కార్యములను పొందించినట్లు జ్ఞాతులును బంధువులును పూజను అర్పించుచున్నారు. హృదయమను నామము నందలి ద యను అక్షరమును బ్రహ్మమునుగా యుపాసించు వానికొఱకు ఇంద్రియములును విషయములును వాటి వాటి శక్తులను ఇచ్చుచున్నవి. హృదయ మను నామమునందలి

య అను అక్షరమును బ్రహ్మముగా ఉపాసించువాఁడు స్వర్గలోకమును పొందుచున్నాఁడు. ఇట్లు హృదయమను నామమునందలి యొక్కొక అక్షరమును ఉపాసించుటచేతనే ఇట్టి ఫలములను పొందునప్పుడు హృదయమను నామమును పరబ్రహ్మముగా ఉపాసించువాని ఫలమేమని చెప్పవచ్చును? ఇట్లనుటచేత, హృదయబ్రహ్మోపాసనమునకు విశేషఫలమని యభిప్రాయము. ఇక్కడ హృదయమను నామమునందలి వర్ణములు మూఁడును హృదయ మను నామ మొదటియును ఈ నాలుగును నాలుగు ఉపాసనలుగా వివక్షచేయఁబడినవి,

ఇట్లు సప్తమాధ్యాయము - తృతీయబ్రాహ్మణము సమాప్తము.

## సప్తమాధ్యాయము – చతుర్థబ్రాహ్మణము

ఉ॥ తద్వై తదేతదేవ తదాస సత్యమేవ స యో హైతం మహద్యక్షం ప్రథమజం వేద సత్యం బ్రహ్మేతి జయ తీమాల్లోకాన్జిత ఇన్న్వసావసద్య ఏవమేతం మహద్యక్షం ప్రథమజం వేద సత్యం బ్రహ్మేతి సత్యగ్ హ్యేవ బ్రహ్మ. ॥1॥

ప॥ తత్ - వై - తత్ - ఏతత్ - ఏవ - తత్ - ఆస - సత్యం - ఏవ - సః - యః - హ - ఏతం - మహత్ - యక్షం - ప్రథమజం - వేద - సత్యం - బ్రహ్మ - ఇతి - జయతి - ఇమాన్ - లోకాన్ - జితః - ఇన్ను - అసౌ - అసత్ - యః - ఏవం - ఏతం - మహత్ - యక్షం - ప్రథమజం - వేద - సత్యం - బ్రహ్మ - ఇతి - సత్యం - హి - ఏవ - బ్రహ్మ.

ప్ర॥ తత్ = ఆహృదయ బ్రహ్మము, వై = స్మరింపఁబడుచున్నది. తదేతదేవ = ఆ ఈ హృదయబ్రహ్మము, (ఆ హృదయబ్రహ్మము వేఱొక విధముగా, ఉచ్యతే = చెప్పఁబడుచున్నది). తత్ = ఆ హృదయబ్రహ్మము, సత్యమేవ = సత్యస్వరూపమే అయి, (మూర్తస్వరూపములగు పృథివ్యప్తేజస్సులును, అమూర్తస్వరూపములగు

ఆకాశ వాయువులును, ఈ పంచభూతములు సత్యమనఁబడును, అనఁగా పంచభూతములుగానే), ఆస = ఉండెను. ఏతం = ఈ పంచ భూతస్వరూపమును, మహత్ = అధికమును, యక్షం = పూజ్యము ను, ప్రథమజం = మొదట పుట్టినదియునగు, (ఈ సమస్తసంసారి కంటె ముందుపుట్టిన), సత్యం = సత్యస్వరూపమగు. (మూర్తా మూర్త స్వరూపమగు), బ్రహ్మేతి = పరబ్రహ్మమని, యః = ఎవఁడు, వేద= తెలిసికొనుచున్నాఁడో, సః = వాఁడు, ఇమాన్ = ఈ, లోకాన్= లోకములను, జయతి = జయించుచున్నాఁడు. (స్వాధీనము చేసికొను చున్నాఁడు). ఇన్ను = ఈ ప్రకారము, జితః = జయింపఁబడిన, (స్వాధీనముచేసికొనఁబడిన), అసౌ = ఈ శత్రువు, అసత్ = లేని వాఁడుగానే, (భవేత్ = అగును). యః = ఎవఁడు, మహత్ =అధిక మును, యక్షం = పూజ్యమును, ప్రథమజం = మొదట పుట్టిన, ఏతం = మూర్తామూర్తస్వరూపమగు ఈ పంచభూత సముదాయ మును, సత్యంబ్రహ్మేతి = పంచభూత స్వరూపమగు హృదయపర బ్రహ్మమని, వేద = తెలిసికొనుచున్నాఁడో, (యస్మాత్ = ఏకార ణమువలన), బ్రహ్మ = హృదయబ్రహ్మము, సత్యగ్ హ్యేవ = మూర్తా మూర్త స్వరూపమగు పంచభూతాత్మకమైనదో, (ఆకార ణమువలన ఇట్లు తెలిసికొని హృదయ బ్రహ్మోపాసన చేయువాఁడు శత్రువులేనివాఁడగుచున్నాఁడని పూర్వవాక్యముతో నన్వయము).

తా॥ ఇంతకు పూర్వము చెప్పిన హృదయపరబ్రహ్మము మూర్తామూర్తస్వరూపముగా నుండెడి పంచభూతాత్మకమైయున్నది. అధికమును పూజ్యమును మొదట పుట్టినదియు నగు మూర్తామూర్త మగు ఈ పంచభూతములను పంచభూతాత్మకమైన హృదయబ్రహ్మ మునుగాఁ దెలిసికొని యుపాసించువాఁడు ఈ సర్వలోకములను స్వాధీన పఱచుకొనుచున్నాఁడు. ఇట్లు హృదయబ్రహ్మము పంచభూతాత్మక మగుటవలన దానిని తెలిసికొని యుపాసించువానికి తనకంటె వేఱేది

యు లేకపోవుటవలన సర్వము స్వాధీనమై శత్రువే లేనివాఁడగు చున్నాఁడు.

ఉ॥ ఆప ఏవేద మగ్ర ఆసుస్తా ఆపః సత్య మసృజన్త సత్యం బ్రహ్మ బ్రహ్మ ప్రజాపతిం ప్రజాపతిర్దే వాగ్ స్తే దేవా స్సత్యమేవో పాసతే తదేత త్త్ర్యక్షరగ్ సత్యమితి స ఇత్యేకమక్షరం తీ త్యేక మక్షరం యమిత్యేకమక్షరం ప్రథమోత్తమే అక్షరే సత్యం మధ్యతో౽నృతం తదేత దనృతము భయత స్సత్యేన పరిగృహీత గ్ సత్యభూయమేవ భవతి నైనం విద్వాగ్స మనృతగ్ హి నస్తి.

ఇతి సప్తమాధ్యాయే చతుర్థం బ్రాహ్మణమ్.

---

ప॥ ఆపః - ఏవ - ఇదం - అగ్రే - ఆసుః - తాః - ఆపః- సత్యం-అసృజన్త - సత్యం - బ్రహ్మ - బ్రహ్మ - ప్రజాపతిం - ప్రజా పతిః - దేవాన్ - తే - దేవాః - సత్యం - ఏవ - ఉపాసతే - తత్ - ఏతత్ - త్ర్యక్షరం - సత్యం - ఇతి - సః - ఇతి - ఏకం - అక్షరం- తి - ఇతి - ఏకం - అక్షరం - యం - ఇతి - ఏకం - అక్షరం - ప్రథమోత్తమే - అక్షరే - సత్యం - మధ్యతః - అనృతం - తత్ - ఏతత్ - అనృతం - ఉభయతః - సత్యేన - పరిగృహీతం - సత్య భూయం - ఏవ - భవతి - న - ఏనం - విద్వాంసం - అనృతం - హినస్తి.

ప్ర॥ ఇదం = ఈ వికారజాతమగు జగత్తు, అగ్రే = సృష్టికి పూర్వము, ఆపఏవ = ఉదకములుగానే, ఆసుః = ఉండెను. తాః= ఆ, అపః = ఉదకములు, సత్యం=అవ్యాకృతభూతసముదాయమును, (నామ రూపములతో స్ఫుటములు గాని పంచభూతములు సత్యమనఁ బడును). అసృజన్త = సృష్టించెను. సత్యం = అవ్యాకృతభూత సముదాయము, బ్రహ్మ = హిరణ్యగర్భుని, (చతుర్ముఖబ్రహ్మను), (అసృజన్త = సృష్టించెను). బ్రహ్మ = చతుర్ముఖుఁడు, ప్రజాపతింహ్హ

విరాజపురుషుని, (సూర్యాదులకధికరణమైన విరాట్పురుషుని), (సృష్టించెను). ప్రజాపతిః = విరాజపురుషుఁడు, దేవాన్ = దేవతలన, (సృష్టించెను). తే = ఆ, దేవాః = దేవతలు, సత్యమేవ = సత్యమునే, (అవ్యాకృతపంచభూతాత్మకమగు సత్యబ్రహ్మమునే), ఉపాసతే = ధ్యానించుచున్నారు. తదేతత్ = అయీ, సత్యమితి = సత్యమనునది, త్ర్యక్షరం = మూఁడు అక్షరములు గలది. (అవి యేవి యనఁగా), స ఇతి = స అనునది, ఏకం అక్షరం = ఒక అక్షరము. తీ తి = తీ యనునది, ఏకం అక్షరం = ఒక అక్షరము. యమితి=య అనునది, ఏకం అక్షరం = ఒక అక్షరము, (తత్ర = ఆ అక్షరముల మూఁటిలో), ప్రథమోత్తమే = మొదటిదియును కడపటిదియునగు, అక్షరే = సకార యకారములను అక్షరములు రెండును, సత్యం = మృత్యువు లేకపోవుటవలన సత్యములైనవి. (ఎప్పటికిని నశింపనివి). మధ్యతః = మధ్యమునందలి తకారము. అనృతం = అబద్ధమైనది. (మృత్యుస్వరూపమైనది). ఉభయతః = రెండైన సకార యకారములే లక్షణముగాఁగల, సత్యేన = సత్యస్వరూపముచేతను, పరిగృహీతం = గ్రహింపఁబడిన, (వ్యాప్తమైన), తదేతత్ = ఆ యీ, అనృతం = మృత్యుస్వరూపము, సత్యభూయమేవ=సత్యాధిక్యమును గలదిగానే, భవతి = అగుచున్నది. (మృత్యువు స్వల్పమగుచున్నది. ఇట్లు ఎవఁడు మృత్యువును అల్పమైనదానినిగాఁ దెలిసికొనుచున్నాఁడో), ఏనం = ఈ, విద్వాంసం = తెలిసికొనినవానిని, అనృతం = మృత్యువు, నహినస్తి = హింసింపదు.

తా॥ పూర్వము మహత్స్వరూపమైన పూజ్యమగు అవ్యక్తమైన పృథివ్యాది భూత పంచకము మొదట పుట్టినదని చెప్పఁబడినది, అవి యెట్లనఁగాఁ జెప్పఁబడుచున్నది, సృష్టికంటెపూర్వము ఈ ప్రపంచమంతయు ఉదకములుగానే యుండెను. ఆ యుదకములే అవ్యక్తమగు పృథివ్యాదిభూత పంచకమును సృజించెను. ఆ సత్యరూపమగు

భూతపంచకమే హిరణ్యగర్భుఁడను చతుర్ముఖ బ్రహ్మను సృజించెను. ఆ చతుర్ముఖ బ్రహ్మ, విరాజపురుషుని సృజించెను. ఆ విరాజ పురుషుఁడె సమస్త దేవతలను సృజించెను. ఆ దేవతలందఱును తమ్మును పుట్టించిన తండ్రియగు విరాజపురుషుని వదలి మొట్ట మొదటిదియగు సత్యాత్మకమను భూతపంచకమునే ధ్యానించిరి. ఆ సత్యమనునది సకార తకార యకారములను మూఁడు అక్షరములు కలది, అందు సకార యకారములు రెండు అక్షరములు మృత్యువులేనివగుటవలన సత్యములైనవి. మధ్యమునందలి తకారము మాత్రము అనృతమైనది.= మృత్యుస్వరూపమైనది. ఈ మృత్యువు రెండు భాగములయందును సత్యముతో వ్యాపించియున్నది గనుక అదియును సత్యమేయగు చున్నది. ఇట్లు మృత్యువును తెలిసికొనినవానిని ఆ మృత్యువు ఎప్పుడును హింసింపదు.

ఇట్లు సప్తమాధ్యాయమునందు చతుర్థ బ్రాహ్మణము సమాప్తము.

## సప్తమాధ్యాయము - పంచబ్రాహ్మణము

ఉ॥ తద్యత్సత్యమసౌ స ఆదిత్యో య ఏష ఏతస్మిన్మణ్డలే పురుషో యశ్చాయం దక్షిణేఽక్షన్పురుషస్తా వేతావన్యోన్యస్మిన్ప్రతిష్ఠితౌ రశ్మిభిరేషోఽస్మిన్ప్రతిష్ఠితః ప్రాణైరయమముష్మిన్స యదోత్క్రమిష్యన్భవతి శుద్ధమేవైతన్మణ్డలం పశ్యతి నైనమేతే రశ్మయః ప్రత్యాయన్తి. ॥1॥

ప॥ తత్ - యత్ - సత్యం - అసౌ - సః - ఆదిత్యః - యః - ఏషః - ఏతస్మిన్ - మణ్డలే - పురుషః - యః - చ - అయం - దక్షిణే - అక్షన్ - పురుషః - తౌ - ఏతౌ - అన్యోన్యస్మిన్ - ప్రతిష్ఠితౌ - రశ్మిభిః - ఏషః - అస్మిన్ - ప్రతిష్ఠితః - ప్రాణైః - అయం - అముష్మిన్ - సః - యదా - ఉత్క్రమిష్యన్ - భవతి - శుద్ధం - ఏవ - ఏతత్ - మణ్డలం - పశ్యతి - న - ఏనం - ఏతే - రశ్మయః - ప్రత్యాయన్తి.

ప్ర॥ తత్ = ఆ, సత్యం = సత్యస్వరూపము, (అవ్యక్తమగు పృథివ్యాది పంచభూతములయొక్క సారాంశము సత్యస్వరూపము). యత్ = ఏదియో, అసౌ = ఈ సత్యము, సః = ఆ ప్రసిద్ధుఁడగు, ఆదిత్యః = సూర్యుఁడు. ఏతస్మిన్ = ఈ, మణ్డలే = సూర్యమండలమునందలి, ఏషః = ఈ, పురుషః = పురుషుఁడు, యః=ఎవఁడో, దక్షిణేఽక్షన్ = కుడినేత్రమునందలి, అయం = ఈ, పురుషః = పురుషుఁడు, యః = ఎవఁడో, తౌ = ఆ ప్రసద్ధులగు, ఏతౌ = ఈ ఆదిత్యాక్షి పురుషులిద్దఱును, అన్యోన్యస్మిన్ = ఇతరేతరమునందు, (ఒకరియందొకరు), ప్రతిష్ఠితౌ = ఉంచఁబడియున్నారు. రశ్మిభిః = కిరణములచేతను, ఏషః = ఈ సూర్యుఁడు. అస్మిన్ = ఆధ్యాత్మిస్వరూపమగు నేత్రమునందు. ప్రతిష్ఠితః = ఉంచఁబడియున్నాఁడు. ప్రాణైః = ప్రాణములచేతను. అయం = ఈ చాక్షుష పురుషుఁడు, (జీవుఁడు), అముష్మిన్ = ఈ అధిదైవస్వరూపమగు సూర్యునియందు, (ప్రతిష్ఠితః = ఉంచఁబడియున్నాఁడు). సః = ఆ జీవుఁడు. (ఈ శరీరమునందలి విజ్ఞానమయుఁడగు జీవుఁడు). యదా = ఎప్పుడు, ఉత్క్రమిష్యన్ = శరీరమును విడుచుటకు కోరికనుగలవాఁడు, భవతి = అగుచున్నాఁడో, (తదా = అప్పుడు, అసౌ = చాక్షుష స్వరూపుఁడగు ఆదిత్యపురుషుఁడు, రశ్మీన్ = కిరణములను, ఉపసంహృత్య = ఉపసంహరించుకొని. కేవలేనా దాసీన్యేన రూపేణ = కేవలతటస్థరూపముతో, వ్యవతిష్ఠతే = ఉంటున్నాఁడు). తదా = అప్పుడు, అయం = ఈ విజ్ఞానమయుఁడగు జీవుఁడు, ఏతత్ = ఈ, మణ్డలం = సూర్యమండలమును, శుద్ధమేవ = కేవలపరిశుద్ధమైన దానినిగానే, (చంద్రమండలమును వలెనే), పశ్యతి = చూచుచున్నాఁడు. ఏనం= ఈ పురుషుని, (ఈ ఆదిత్య అక్షి పురుషోపాసనలను చేయునట్టివానిని), ఏతే = ఈ, రశ్మయః = కిరణములు, నప్రత్యాయన్తి = పొందవు.

తా॥ ఇప్పుడు పూర్వోక్తమైన సత్యస్వరూప బ్రహ్మము

యొక్క స్థితి విశేషమగు ఉపాసనము చెప్పఁబడుచున్నది. అవ్యక్తమగు పృథివ్యాది పంచభూతములయొక్క సారాంశము సత్యమనఁబడును. ఈ సత్యమె ప్రసిద్ధుఁడగు సూర్యుఁడు. ఈ ఆదిత్యమండలమునందలి సూర్యుఁడును, ఈ దేహమునందలి కుడినేత్రమునందలి విజ్ఞానస్వరూపుఁడగు జీవుఁడును, వీరిరువురును, ఒకరియందొకరు, ఉంచబడియున్నారు. అది యెట్లనఁగా, ఈ సూర్యుఁడు కిరణములచేత అధ్యాత్మరూపమగు నేత్రమునందును, జీవుఁడు ప్రాణములచేత అధిదైవస్వరూపమగు సూర్యమండలమునందును, ఉంచఁబడియున్నారు. ఇట్లు తెలిసికొనిన జీవుఁడెప్పుడు దేహమును విడుచుటకు ఇచ్ఛగలవాఁడగునో అప్పుడె ఈ చక్షుష స్వరూపుఁడైన ఆ సూర్యుఁడు తన కిరణముల నుపసహరించుకొని కేవల తటస్థరూపముతో నుంటున్నాఁడు. అప్పుడీజీవుఁడు కిరణములులేని ఈ సూర్యమండలమును చంద్రమండలమును వలెనే పరిశుద్ధమైన దానినిగాఁ జూచుచున్నాఁడు, ఈ సూర్యునిన్ని నేత్రమునందలి విజ్ఞాన స్వరూపునిని ఒకటిగాఁ దెలిసికొని యుపాసించెడి వానిని ఈ సూర్యకిరణములు పొంది బాధింపవు.

ఉ॥ య ఏష ఏతస్మిన్మణ్డలే పురుష స్తస్య భూరితి శిర ఏకగ్ం శిర ఏకమేతదక్షరం భువ ఇతి బాహూ ద్వౌ బాహూ ద్వే ఏతే అక్షరే సు వరితి ప్రతిష్ఠా ద్వే ప్రతిష్ఠే ద్వే ఏతే అక్షరే తస్యోపనిషద హరితి హన్తి పాప్మానం జహాతి చ య ఏవం వేద. ॥2॥

ప॥ యః – ఏషః – ఏతస్మిన్ – మణ్డలే – పురుషః – తస్య – భూః – ఇతి – శిరః – ఏకం – శిరః – ఏకం – ఏతత్ – అక్షరం – భువః – ఇతి – బాహూ – ద్వౌ – బాహూ – ద్వే – ఏతే – అక్షరే – సువః – ఇతి – ప్రతిష్ఠా – ద్వే ఏతే – అక్షరే – తస్య – ఉపనిషత్ – అహః – ఇతి – హన్తి – పాప్మానం – జహాతి – చ – యః – ఏవం – వేద.

ప్ర॥ ఏతస్మిన్ = ఈ, మణ్డలే = సూర్యమండలమునందలి,

ఏషః = ఈ, పురుషః = పురుషుఁడు, యః = ఎవఁడో తస్య = ఆ పురుషునకు, భూరితి = భూః అనువ్యాహృతి, శిరః = శిరస్సు, ఏకం = ఒక్కటియగు, శిరః = శిరస్సు, ఏకం = ఒక్కటియగు, ఏతత్ = ఈ, అక్షరం = భూ అను అక్షరము, భువ ఇతి = భువః అనువ్యాహృతి, బాహూ = భుజములు, ద్వే బాహూ = రెండుభుజములును, ద్వే = రెండగు, ఏతే = ఈ, అక్షరే = భువ యను అక్షరములు, సువరితి = సువః అనువ్యాహృతి, ప్రతిష్ఠా=పాదములు, ద్వే = రెండగు, ఏతే = ఈ, అక్షరే = సువ యను అక్షరములు. తస్య = భూరాది వ్యాహృతులే అవయవములుగాఁగల ఆ సత్య స్వరూపమగు సూర్యమండలాంతర్గత పురుషునకు, అహరితి = అహః అనునది, ఉపనిషత్ = రహస్యమైన పేరు. యః = ఎవఁడు. ఏవం= ఈ ప్రకారము, వేద = తెలిసికొనుచున్నాఁడో, (సః = వాఁడు), పాప్మానం = పాపమును, హన్తి = నాశనము చేయుచున్నాఁడు. జహాతిచ = విడిచిపెట్టుచున్నాఁడు. (గనుకనే, సత్యరూప అధిదైవ పరబ్రహ్మమునకు అహః అను పేరు కలిగినది).

తా॥ పూర్వమందు చెప్పిన అధిదైవమును అధ్యాత్మకము నైన సత్యాత్మకములగు పురుషులిద్దఱిలో నధిదైవ పురుషున కిక్కడ శిరస్సు మొదలైన అవయవములు చెప్పఁబడుచున్నవి. ఈ సూర్య మండలము నందున్న ఆ సత్యపురుషునకు భూః భువః సువః అను మూఁడు వ్యాహృతులయొక్క మూఁటిలో మొదటిదియగు భూ యను వ్యాహృతియె శిరస్సు. భువ యను వ్యాహృతియందలి రెండక్షర ములే రెండు భుజములు. సువ యను వ్యాహృతియందలి రెండక్షర ములే రెండు పాదములు. ఇట్లు భూరాది వ్యాహృతులే అవయవ ములుగాఁగల ఆ సత్య స్వరూపుఁడగు సూర్యమండలాంతర్గతుఁడైన అధిదైవ పురుషుఁడు, సర్వపాపములకును, హనన త్యాగములు కలుగఁజేయుటవలన, అహః యను రహస్యమైన పేరుగలవాఁ

డాయెను. ఇట్లు అధిదైవ సత్యపురుషుని తెలిసికొనువాఁడు పాపమును నశింపఁజేయుచున్నాఁడు. పాపమును విడుచుచున్నాఁడు.

ఉ॥ యోఽయందక్షిణేఽక్షన్పురుషస్తస్య భూరితి శిర ఏకగ్ శిరఏకమే తదక్షరం భువ ఇతి బాహూ ద్వౌబాహూ ద్వే ఏతే అక్షరేసువ రితి ప్రతిష్ఠా ప్రతిష్ఠే ద్వే ద్వే ఏతే అక్షరే తస్యోపనిషదహ మితి హన్తి పాప్మానం జహాతి చ య ఏవం వేద, ॥౩॥

ఇతి సప్తమాధ్యాయే పఞ్చమంబ్రాహ్మణమ్.

ప॥ యః – అయం – దక్షిణే – అక్షన్ – పురుషః – తస్య – భూః – – శిరః – ఏకం – శిరః – ఏకం – ఏతత్ – అక్షరం – భువః – – బాహూ – ద్వౌ – బాహూ – ద్వే – ఏతే – అక్షరే – సువః – – ప్రతిష్ఠా – ప్రతిష్ఠే – ద్వే – ద్వే – ఏతే – అక్షరే – తస్య – ఉపనిషత్ – అహం – – హన్తి – పాప్మానం – జహాతి – చ – యః – ఏవం – వేద.

ప్ర॥ దక్షిణే అక్షన్ = కుడినేత్రమునందలి, అయం = ఈ, పురుషః = పురుషుఁడు, యః = ఎవఁడో, తస్య = ఆ పురుషునకు, భూః ఇతి = భూ అనెడి వ్యాహృతి, శిరః = శిరస్సు. ఏకం = ఒక్కటియగు, శిరః = శిరస్సు, ఏకం = ఒక్కటియగు, ఏతత్ = ఈ. అక్షరం = భూ అను అక్షరము. భువఇతి = భువః అను వ్యాహృతి, ద్వౌ = రెండైన, బాహూ = భుజములు. ద్వే = రెండగు, బాహూ = భుజములు, ఏతే = ఈ, అక్షరే = భువ యను రెండక్షరములు. సువఇతి = సువః అను వ్యాహృతి, ద్వే = రెండగు, ప్రతిష్ఠా= పాదములు, ద్వేప్రతిష్ఠే = రెండు పాదములు, ఏతే = ఈ, అక్షరే= సువ యను రెండక్షరములు. తస్య = ఆ నేత్రాంతర్గతమైన అధ్యాత్మ పురుషునకు, అహమితి = అహమనునది, ఉపనిషత్ = రహస్యమైన పేరు. యః = ఎవఁడు, ఏవం = ఈ ప్రకారము, వేద = తెలిసికొను చున్నాఁడో, (సః = వాఁడు), పాప్మానం = పాపమును, హన్తి =

నాశనముచేయుచున్నాఁడు. జహాతిచ = విడుచుచున్నాఁడు. (గనుక సత్యస్వరూపమగు అధ్యాత్మ పరబ్రహ్మమునకు అహామను పేరు కలిగినది).

తా॥ పూర్వమందు చెప్పిన అధ్యాత్మకమైన సత్యపురుషునకు ఇక్కడ శిరస్సు మొదలైన అవయవములు చెప్పఁబడుచున్నవి. ఈ దేహమునందలి దక్షిణ నేత్రమునందున్న సత్యాత్మకమగు అధ్యాత్మపురుషునకు భూః భువః సువః అను వ్యాహృతులయొక్క మూటిలో మొదటిదియగు భూ అను వ్యాహృతి యగు అక్షరమొక్కటియె శిరస్సు. భువ అను వ్యాహృతి యందలి రెండు అక్షరములే రెండు భుజములు. సువ అను వ్యాహృతియందలి రెండు అక్షరములే రెండుపాదములు. ఇట్లు భూరాది వ్యాహృతులే అవయవములుగాఁగల ఆ సత్యస్వరూపుని కుడికంటియందున్న అధ్యాత్మపురుషుఁడు, సమస్త పాపమునకు హనన త్యాగములు కలుగఁజేయుటవలన అహామను రహస్యమైన పేరుగల వాఁడాయెను. ఇట్లు ఆధ్యాత్మిక సత్యపురుషుని తెలిసికొనినవాఁడు పాపమును నశింపఁజేయుచున్నాఁడు = పాపమును విడిచిపెట్టుచున్నాఁడు.

ఇట్లు సప్తమాధ్యాయమునందు పఞ్చమబ్రాహ్మణము సమాప్తము.

సప్తమాధ్యాయము – షష్ఠంబ్రాహ్మణము

ఉ॥ మనోమయోఽయం పురుషో భాస్సత్యస్తస్మిన్నన్తర్హృదయే యథా వ్రీహిర్వా యవో వా స ఏష సర్వస్యేశానః సర్వస్యాధిపతి స్సర్వమిదం ప్రశాస్తి యదిదం కిఞ్చ. ॥1॥

ఇతి సప్తమాధ్యాయే షష్ఠంబ్రాహ్మణమ్

ప॥ మనోమయః – అయం – పురుషః – భాస్సత్యః – తస్మిన్ – అన్తర్హృదయే – యథా – వ్రీహిః – వా – యవః – వా – సః – ఏషః – సర్వస్య – ఈశానః – సర్వస్య – అధిపతిః – సర్వం – ఇదం – ప్రశాస్తి – యత్ – ఇదం – కిఞ్చ.

ప్ర॥ అయం=ఈ, మనోమయః = మనోరూపమైన, పురుషః= పురుషుఁడు, భాస్సత్యః = కాంతియె సత్యస్వరూపముగాఁగలవాఁడై, (ప్రకాశ స్వరూపుఁడై), తస్మిన్ = ఆ, అన్తర్హృదయే = హృదయ మధ్యమునందు, వ్రీహిర్యథావా = బుడమవడ్లగింజవలెను, యవోయ థావా = యవధాన్యపుగింజవలెను, (పరిమాణతః = పరిమితివలన, నిర్దిశ్యతే = నిర్దేశింపఁబడుచున్నాఁడో), సః = ఆ, ఏషః = ఈపురు షుఁడు, సర్వస్య = సమస్తమునకు, ఈశానః = నియామకుఁడు, సర్వస్య = సమస్తమునకు, అధిపతిః = ప్రభువు. ఇదంకిఞ్చ = ఈ సర్వ మును, యత్ = ఏదియో, (తత్ = ఆ), ఇదంసర్వం = ఈ సమస్త మును, ప్రశాస్తి = మిక్కిలి నియమించుచున్నాఁడు.

తా॥ ఆ పరబ్రహ్మమునకు ఉపాధులనేకములు కలిగియుండుట వలనను, అనేక విశేషణములు కలిగియుండుటవలనను, మనఉపాధితోఁ గూడుకొనియున్న ప్రకృతమగు ఆ పరబ్రహ్మముయొక్కయే యుపా సనమును విధింప నిచ్ఛయించినవాఁడై యిక్కడఁ జెప్పుచున్నాఁడు. ఈ మనోమయమగు పురుషుఁడు ప్రకాశమానుఁడై పరిపూర్ణుఁడైనను మనస్సనెడి యుపాధితోఁగూడుకొనిన వాఁడగుటవలన, బుడమగింజ వలెనే, యవగింజవలెనే, సూక్ష్మరూపియై యున్నాఁడు. ఆ యీ పురు షుఁడె సర్వమునకు నియామకుఁడును సర్వమునకును ప్రభువునై ఈ సర్వమును నియమించుచున్నాఁడు. ఇట్లు మనోమయపురుషో పాసనచేయువాఁడుసర్వనియంతృత్వాదిధర్మమును పొందుచున్నాఁడు.

ఇట్లు సప్తమాధ్యాయమునందు షష్ఠంబ్రాహ్మణము సమాప్తము.

---

సప్తమాధ్యాయము - సప్తమబ్రాహ్మణము.

ఉ॥ విద్యుద్బ్రహ్మేత్యాహుర్విదానా ద్విద్యుద్విద్యత్యేనం పాప్మనో
యఏవం వేద విద్యుద్బ్రహ్మేతి విద్యుద్ధ్యేవ బ్రహ్మ. ॥1॥
సప్తమాధ్యాయే సప్తమం బ్రాహ్మణమ్

ప॥ విద్యుత్ - బ్రహ్మ - ఇతి - ఆహుః - విదానాత్ - విద్యుత్ - విద్యతి - ఏనం - పాప్మనః - యః - ఏవం - వేద - విద్యుత్ - బ్రహ్మ - ఇతి - విద్యుత్ - హి - ఏవ - బ్రహ్మ.

ప్ర॥ విద్యుత్ = మెఱుపు, (తమః = చీఁకటిని), విదానాత్ = ఖండించుటవలన, బ్రహ్మేతి = పరబ్రహ్మమని, ఆహుః = చెప్పిరి. ఏనం = ఈ ఆత్మనుగురించి, (ప్రతికూలభూతాః = విరోధములైన), పాప్మనః = పాపములు. (యే = ఏవియో, తాన్ = వాటిని), విద్యుత్ = మెఱుపు రూపమగు పరబ్రహ్మము, విద్యతి = ఖండించు చున్నది. (నశింపఁజేయుచున్నది). యః = ఎవఁడు, ఏవం = ఈప్రకారము, విద్యుత్ = మెఱుపు, బ్రహ్మేతి = పరబ్రహ్మమని, వేద = తెలిసికొనుచున్నాఁడో, (సః = వాఁడు), బ్రహ్మ = బ్రహ్మస్వరూపమగు, విద్యుద్ధ్యేవ = మెఱుపే, (భవతి = అగుచున్నాఁడు).

తా॥ కొందఱు మెఱుపునందు పరబ్రహ్మదృష్టి చేయఁదగినదని చెప్పుచున్నారు. ఎట్లనఁగా, మెఱుపు చీఁకటిని నశింపఁజేయునదియగుటవలన పరబ్రహ్మమని చెప్పిరి. ఆత్మకు ప్రతికూలముగా నుండెడి పాపములను విద్యుద్రూప పరబ్రహ్మము నశింపఁజేయును, గనుక అట్లు తెలిసికొని మెఱుపునే పరబ్రహ్మమునుగా నుపాసించెడి వాఁడు ఆ విద్యుత్పరబ్రహ్మమె యగుచున్నాఁడు.

ఇట్లు సప్తమాధ్యాయమునందు సప్తమబ్రాహ్మణము సమాప్తము

## సప్తమాధ్యాయము - అష్టమబ్రాహ్మణము.

ఉ॥ వాచం ధేను ముపాసీత తస్యాశ్చత్వారః స్తనాః స్వాహాకారో వషట్కారో హన్తకార స్స్వధాకార స్తస్యా ద్వౌ స్తనౌ దేవా ఉపజీవన్తి స్వాహాకారం చ వషట్కారం చ హన్తకారం మనుష్యా స్స్వధాకారం పితర స్తస్యాః ప్రాణ ఋుషభో మనో వత్సః. ॥1॥

సప్తమాధ్యాయే - అష్టమం బ్రాహ్మణమ్,

ప॥ వాచం - ధేనుం - ఉపాసీత - తస్యాః - చత్వారః - స్తనాః - స్వాహాకారః - వషట్కారః - హన్తకారః - స్వధాకారః - తస్యాః - ద్వౌ - స్తనౌ - దేవాః - ఉపజీవన్తి - స్వాహాకారం - చ - వషట్కారం - చ - హన్తకారం - మనుష్యాః - స్వధాకారం - పితరః - తస్యాః - ప్రాణః - ఋషభః - మనః - వత్సః.

ప్ర॥ వాచం = వాక్కును, (వేదమును), ధేనుం = కామధేనువునుగాను, (గోవునుగాను), ఉపాసీత = ధ్యానించవలయును, తస్యాః = ఆ కామధేనువునకు, స్వాహాకారః = స్వాహా యనునదియును, వషట్కారః = వషట్ అనునదియును, హన్తకార = హన్త యనునదియును, స్వధాకారః=స్వధాయనునదియును, చత్వారః = నాలుగు, స్తనాః = స్తనములు. తస్యాః = ఆ కామధేనువుయొక్క, ద్వౌ = రెండగు, స్వాహాకారంచ = స్వాహాకారమును, వషట్కారంచ = వషట్కారమునగు, స్తనౌ = స్తనములనుగూర్చి, దేవాః = దేవతలు, ఉపజీవన్తి = అనుసరించి జీవించుచున్నారు. (జనులు స్వాహాకార వషట్కారములచేత దేవతలకొఱకు హావిస్సులను ఇచ్చుచున్నారు). మనుష్యాః = మనుష్యులు, హన్తకారం = హన్తయను స్తనమును, (ఉపజీవన్తి = అనుసరించి జీవించుచున్నారు). (హన్తయనుదానితో మనుజులకు అన్నము ఇయ్యఁబడుచున్నది). పితరః = పితృదేవతలు, స్వధాకారం = స్వధా యనుదానిని, (ఉపజీవన్తి = అనుసరించి జీవించుచున్నారు. పితరులకు స్వధాయను స్తనముతో కవ్యము (కవ్యమనఁగా పితరులకు ఇచ్చెడి అన్నము పేరు ఇయ్యఁబడుచున్నది). తస్యాః = ఆ వాక్కు అను కామధేనువునకు, ప్రాణః = ప్రాణము, ఋషభః = వృషభము, (ప్రాణముచేతనే వాక్కు పుట్టింపఁబడుచున్నది). మనః = మనస్సు, వత్సః = దూడ (మనస్సు ఆలోచించుచుండగా వాక్కులు పుట్టింపఁబడుచున్నవి. = మనస్సుచేతనే వాక్కు అనెడి క్షీరములు స్రవింపఁ

జేయఁబడుచున్నవి).

తా॥ ఆ పరబ్రహ్మముయొక్క పేరు, ఉపాసనము, ఇక్కడ చెప్పఁబడుచున్నది. ఏమనఁగా, వాక్కనునది శబ్దము = వేదము. ఆ వాక్కునే కామధేనువునుగా నుపాసించవలయును. ఈ వాగ్రూప కామధేనువునకు స్వాహా యనునదియును వషట్ అనునదియును హన్త యనునదియును స్వధా అనునదియును, నాలుగు స్తనములు గలవు. వీటిలో మొదటి స్వాహా వషట్ అను రెండు స్తనములచేతను దేవతల కొఱకు హవిస్సులు ఇయ్యఁబడుచున్నవి. హన్తయను ఒక స్తనముచే మనుష్యులకొరకు అన్నము ఇయ్యఁబడుచున్నది. స్వధా యను ఒక స్తనముచేత పితృదేవతలకొఱకు కవ్యము ఇయ్యఁబడుచున్నది. ఈ వాగ్రూప కామధేనువు ప్రాణముచే పుట్టింపఁబడుచున్నది. కనుక దీనికి ప్రాణమే వృషభము. మనస్సుచేత వాక్కను క్షీరములు స్రవింపఁజేయఁబడుచున్నవి గనుక మనస్సే దూడగానున్నది. కాఁబట్టి ఇట్లు వాగ్రూప కామధేనువును తెలిసికొని దానిని యుపాసించ వలయును.

ఇట్లు సప్తధ్యాయమునందు అష్టమబ్రాహ్మణము సమాప్తము.

---

సప్తమాధ్యాయము - నవమబ్రాహ్మణము.

ఉ॥ అయమగ్నిర్వైశ్వానరో యోఽయమన్తః పురుషే యేనేద మన్నం పచ్యతే యదిదమద్యతే తస్యైష ఘోషో భవతి యమే తత్కర్ణావపిధాయ శృణోతి స యదోత్క్రమిష్యన్భవతి నైనం ఘోషగ్ శృణోతి. ॥1॥

ఇతి సప్తమాధ్యాయే - నవమంబ్రాహ్మణమ్.

ప॥ అయం - అగ్నిః - వైశ్వానరః - యః - అయం - అన్తః - పురుషే - యేన - ఇదం - అన్నం - పచ్యతే - యత్ - ఇదం - అద్యతే - తస్య - ఏషః - ఘోషః - భవతి - యం - ఏతత్ - కర్ణా-

అపిధాయ - శృణోతి - సః - యదా - ఉత్క్రమిష్యన్ - భవతి - న - ఏనం - ఘోషం -

అయం = ఇది, వైశ్వానరః = వైశ్వానరమను, అగ్నిః = అగ్ని. (ఈ అగ్ని ఏది?) అన్తఃపురుషే = పురుషుని లోపలనున్న, అయం = ఈ అగ్ని; (జాఠరాగ్ని) యః = ఏదియో, యేన = ఏ అగ్నిచేతను, ఇదం = ఈ; అన్నం = అన్నము, పచ్యతే = పాకము చేయఁబడుచున్నదో, (ఆ యగ్నియే వైశ్వానరమను అగ్ని). ॥అన్న మేదియనఁగా), (ప్రజాభిః = ప్రజలచేతను), యత్ = ఏ, ఇదం = ఈ అన్నము, అద్యతే = భక్షింపఁబడుచున్నదో, (ఈ జఠరాగ్ని పచనము చేయునట్టి అన్నము). తస్య = అన్నమును పచనము చేయు నట్టి అగ్నికి, ఏషః = ఈ, ఘోషః = ధ్వని, భవతి = కలుగు చున్నది. (ఆ ధ్వని యేదియనఁగా), (పురుషః = పురుషుఁడు), కర్ణౌ = చెవులను, అపిధాయ = మూసికొని, యం = ఏధ్వనిని, ఏతత్ = ఇప్పుడు, శృణోతి = వినుచున్నాఁడో, (అదియే ధ్వని). (తం = అగ్నిని, ప్రజాపతిం = బ్రహ్మమునుగా, ఉపాసీత = ధ్యానించవలయును); సః = ఈ శరీరమునందు భోక్తయగు ఆ పురుషుఁడు, యదా = ఎప్పుడు, ఉత్క్రమిష్యన్ = శరీరములోనుండి లేచిపోవుట కిచ్ఛగల వాఁడు, భవతి = అగుచున్నాఁడో, (తదా = అప్పుడు), ఏనం = ఈ; ఘోషం = ధ్వనిని, నశృణోతి = వినఁడు.

తా॥ ఇప్పుడు జాఠరాగ్నియొక్క యుపాసన చెప్పఁబడు చున్నది. జనులచేత భక్షింపఁబడెడి అన్నమును పచనముచేయుచున్న దేహములో నున్న జాఠరాగ్నియె వైశ్వానరమను పేరుగల అగ్ని. దీనినె బ్రహ్మమునుగా ఉపాసించవలయును. భక్షింపఁబడిన అన్న మును హృదయమునందు పచనముచేయునట్టి అగ్నియొక్క ధ్వనిని దేహమునందలి భోక్తయగు పురుషుఁడు హస్తాంగుళములతో చెవు లను మూసికొని వినుచున్నాఁడు. ఆ పురుషుఁడు శరీరమునుండి లేచి

పోవుట కిచ్ఛయించునపుడు ఆ ధ్వనిని వినఁడు.

ఇట్లు సప్తమాధ్యాయమునందు నవమబ్రాహ్మణము సమాప్తము.

---

సప్తమాధ్యాయము – దశమబ్రాహ్మణము.

ఉ॥ యదా వై పురుషోఽస్మాల్లోకాత్ప్రైతి స వాయుమాగచ్ఛతి తస్మై స తత్ర విజిహీతే యథా రథచక్రస్య ఖం తేన స ఊర్ధ్వ ఆక్రమతే స ఆదిత్యమాగచ్ఛతి తస్మై స తత్ర విజిహీతే యథా డమ్బరస్య ఖం తేన స ఊర్ధ్వ ఆక్రమతే స చన్ద్రమసమాగచ్ఛతి తస్మై స తత్ర విజిహీతే యథా దున్దుభేః ఖం తేన స ఊర్ధ్వ ఆక్రమతే స లోకమాగచ్ఛత్యశోక మహిమం తస్మిన్వసతి శాశ్వతీః సమాః.

ఇతి సప్తమాధ్యాయే దశమబ్రాహ్మణమ్.

ప॥ యదా – వై – పురుషః – అస్మాత్ – లోకాత్ – ప్రైతి – సః – వాయుం – ఆగచ్ఛతి – తస్మై – సః – తత్ర – విజిహీతే – యథా – రథచక్రస్య – ఖం – తేన – సః – ఊర్ధ్వ – ఆక్రమతే – సః – ఆదిత్యం – ఆగచ్ఛతి – తస్మై – సః – తత్ర – విజిహీతే – యథా – ఆడమ్బరస్య – ఖం – తేన – స. – ఊర్ధ్వ – ఆక్రమతే – సః – చన్ద్రమసం – ఆగచ్ఛతి – తస్మై – సః – తత్ర – విజిహీతే – యథా – దున్దుభేః – ఖం – తేన – సః – ఊర్ధ్వ – ఆక్రమతే – సః – లోకం – ఆగచ్ఛతి – అశోకం – అహిమం – తస్మిన్ – వసతి – శాశ్వతీః – సమాః. ॥1॥

ప్ర॥ పురుషః = ఉపాసకుఁడగు జనుఁడు, యదావై = ఎప్పుడైతే, అస్మాత్ = ఈ, లోకాత్ = లోకమునుండి, ప్రైతి = శరీరమును విడిపోవుచున్నాఁడో, (తదా = అప్పుడు) సః = ఆ పురుషుఁడు, వాయుం = వాయువును, ఆగచ్ఛతి = పొందుచున్నాఁడు. తత్ర = అక్కడ, సః = ఆవాయువు, తస్మై = ఆ పురుషునికొఱకు,

రథచక్రస్య = రథ చక్రముయొక్క, ఖం యథా = రంధ్రమువంటి దారిని, విజిహీతే = తన దేహావయవములనుండి యిచ్చుచున్నాఁడు. తేన = ఆ మార్గముతో. సః = ఆ పురుషుఁడు, ఊర్ధ్వఆక్రమతే = పైకి పోవుచున్నాఁడు. (తరువాత), సః = ఆ పురుషుఁడు, ఆదిత్యం= సూర్యుని, ఆగచ్ఛతి = పొందుచున్నాఁడు. తత్ర = అక్కడ, సః = ఆ సూర్యుఁడు, తస్మై = ఆ పురుషుని కొఱకు, ఆడమ్బరస్య = ఆడమ్బరమను వాద్యవిశేషముయొక్క, ఖంయథా = రంధ్రమువంటి మార్గమును, విజిహీతే=తన మండలములోనుండి యిచ్చుచున్నాఁడు. తేన = ఆ మార్గముతో, సః = ఆ పురుషుఁడు, ఊర్ధ్వ ఆక్రమతే= పైకిపోవుచున్నాఁడు. (తరువాత), సః = ఆ పురుషుఁడు, చన్ద్రమసం = చంద్రుని, ఆగచ్ఛతి=పొందుచున్నాఁడు, సః=ఆ చంద్రుఁడు, తత్ర = అక్కడ, తస్మై=ఆ పురుషుని కొఱకు, దున్దుభేః=భేరియొక్క, ఖంయథా = రంధ్రమువంటి మార్గమును, విజిహీతే=తన మండలము నుండి యిచ్చుచున్నాఁడు. తేన = ఆ మార్గముతో, సః = ఆ పురుషుఁడు, ఊర్ధ్వ ఆక్రమతే = పైకి పోవుచున్నాఁడు. (తరువాత), సః= ఆ పురుషుఁడు, అహిమం = మంచులేని, (చలిలేని), అశోకం = దుఃఖములేని, లోకం = బ్రహ్మలోకమును, ఆగచ్ఛతి = పొందుచున్నాఁడు, తస్మిన్ = ఆ బ్రహ్మలోకమునందు, శాశ్వతీః=నిత్యములైన, సమాః = సంవత్సరములు, (అనేక కల్పములు), వసతి = ఉంటున్నాఁడు.

తా॥ పూర్వము చెప్పిన యుపాసనలు చేయునట్టి పురుషుఁడు ఈ లోకమునుండి శరీరము విడిచి మరణమైపోయి వాయువును పొందుచున్నాఁడు. ఆ వాయువు ఆ పురుషునికొఱకు రథచక్రము యొక్క రంధ్రమువంటి మార్గము నిచ్చుచున్నది. ఆ మార్గముద్వారా పురుషుఁడు వాయుమండలము నతిక్రమించి సూర్యుని పొందుచున్నాఁడు. తదనంతరము సూర్యుఁడు ఆ పురుషునికొఱకు తన మండ

లమునందు ఆడంబరమను వాద్యవిశేషముయొక్క రంధ్రమువంటి మార్గమును ఇచ్చుచున్నాఁడు. ఆ మార్గముద్వారా ఆ పురుషుఁడు సూర్యమండలము నతిక్రమించి చంద్రుని పొందుచున్నాఁడు. తరువాత చంద్రుడు ఆ పురుషునికు తన మండలమునందు భేరీవాద్యముయొక్క రంధ్రమువంటి మార్గమును ఇచ్చుచున్నాఁడు. ఆ మార్గముద్వారా ఆ పురుషుఁడు చంద్రమండలము నతిక్రమించి పైకిపోయి చలిలేనిది యు ను దుఃఖరహితమునగు బ్రహ్మలోకమును పొంది అక్కడ అనేక కల్పములు నివసించి యుంటున్నాఁడు.

ఇట్లు సప్తమాధ్యాయమునందు దశమ బ్రాహ్మణము సమాప్తము.

---

సప్తమాధ్యాయము - ఏకాదశ బ్రాహ్మణము

ఉ॥ ఏతద్వై పరమం తపో యద్వ్యాహిత స్తప్యతే పరమగ్ హైవ లోకం జయతి య ఏవం వేదై తద్వై పరమం తపో యం ప్రేత మరణ్యాగ్ హర న్తి పరమగ్ హైవ లోకం జయతి య ఏవం వేదైతద్వై పరమం తపో యం ప్రేతమగ్నావభ్యా దధతి పరమగ్ హైవ లోకం జయతి య ఏవం వేద. ॥1॥

ఇతి సప్తమాధ్యాయే ఏకాదశం బ్రాహ్మణమ్.

ప॥ ఏతత్ - వై - పరమం - తపః - యత్ - వ్యాహితః - తప్యతే - పరమం - హ - ఏవ - లోకం - జయతి - యః- ఏవం - వేద - ఏతత్ - వై - పరమం - తపః - యం - ప్రేతం-అరణ్యాం- హరన్తి - పరమం - హ - ఏవ - లోకం - జయతి - యః-ఏవం - వేద - ఏతత్ - వై - పరమం - తపః - యం - ప్రేతం - అగ్నౌ- అభ్యాదధతి - పరమం - హ - ఏవ - లోకం - జయతి - యః - ఏవం - వేద.

ప్ర॥ (జీవః = జీవుఁడు), వ్యాహితః=జ్వరాదిరోగపీడితుఁడై, తప్యతేయత్ = సంతాపము నొందుట యనునది ఏదియో ఏతద్వై=

ఇదియే, పరమం = శ్రేష్ఠమగు, తపః = తపస్సు, (ఇతి = అని), ఏవం=ఈ ప్రకారము, యః=ఎవఁడు, వేద=తెలిసికొనుచున్నాఁడో, (సః = వాఁడు), పరమం = శ్రేష్ఠమైన, లోకం హైవ = లోకమునే, జయతి = జయించుచున్నాఁడు. (ఋత్విజః = ఋత్విక్కులు), యం= ఏ, ప్రేతం = మరణమును పొందిన వానిని, (అన్త్యకర్మణే = అంత్య కర్మము కొఱకు), (గ్రామాత్=గ్రామమునుండి), అరణ్యం=అడవిని గూర్చి, హరన్తి = తీసికొనిపోవుచున్నాఁడో, ఏతద్వై = ఇదియె, పరమం = శ్రేష్ఠమైన, తపః = తపస్సు, (ఇతి = అని), ఏవం = ఈ ప్రకారము, యః = ఎవఁడు, వేద = తెలిసికొనుచున్నాఁడో, (సః= వాఁడు), పరం = శ్రేష్ఠమగు, లోకం హైవ = లోకమునే, జయతి = జయించుచున్నాఁడు. యం ప్రేతం = ఏ మరణము పొందినవానిని. (ఋత్విజః = ఋత్విక్కులు, అగ్నౌ = అగ్నియందు, అభ్యాదధతి = ఉంచుచున్నారో, ఏతద్వై = ఇదియె, పరమం = శ్రేష్ఠమైన, తపః= తపస్సు, (ఇతి = అని), ఏవం = ఈ ప్రకారము, యః = ఎవఁడు, వేద = తెలిసికొనుచున్నాఁడో, (సః = వాఁడే), పరం = శ్రేష్ఠమైన. లోకం హైవ = లోకమునే, జయతి = జయించుచున్నాఁడు.

తా॥ బ్రహ్మోపాసనా ప్రసంగముచే ఆబ్రహ్మోపాసనమ్మునన్ను ఫలవంతముగానే చెప్పఁబడుచున్నది. జీవుఁడు రోగాదిపీడితుఁడై సంతాపము నొందుటయే శ్రేష్ఠమైన తపస్సు యని తెలిసికొని యుపాసించువాఁడు శ్రేష్ఠమగు లోకమును జయించుచున్నాఁడు. మరణమును పొందినవాని అంత్యకర్మకొఱకు ఋత్విక్కులు గ్రామమునుండి అరణ్యమునకు తీసికొని పోవుటయే శ్రేష్ఠమైన తపస్సని తెలిసికొనువాఁడు శ్రేష్ఠమగు లోకమును జయించుచున్నాఁడు. మరణమును పొందిన వాని శరీరమును ఋత్విక్కులు అగ్నియందుంచుట శ్రేష్ఠ తపస్సు అని తెలిసికొనువాఁడు శ్రేష్ఠలోకమును జయించుచున్నాఁడు. ఏలనఁగా. లోకమునందు దేహమును కృచ్ఛ్రములు మొదలైన

వాటిచే సంతాపము నొందించుటయును, అరణ్యమును పొందుట యును, అగ్నిప్రవేశము చేయుటయును, సాధారణముగా పుణ్యసాధనము లగుటచే ఈ పూర్వము చెప్పఁబడిన మూటిని తపస్సుగాఁ దెలిసికొనువాఁడు శ్రేష్ఠమైన లోకమును జయించుచున్నాఁడని తాత్పర్యము.

ఇట్లు సప్తమాధ్యాయమునందు ఏకాదశ బ్రాహ్మణము సమాప్తము.

సప్తమాధ్యాయము - ద్వాదశ బ్రాహ్మణము.

ఉ॥ అన్నం బ్రహ్మేత్యేక ఆహుస్తన్న తథా పూయతి వా అన్న మృతే ప్రాణాత్ప్రాణో బ్రహ్మేత్యేక ఆహుస్తన్న తథా శుష్యతి వై ప్రాణ ఋతేఽన్నాదేతే హ త్వేవ దేవతే ఏకధా భూయం భూత్వా పరమతాం గచ్ఛతస్తద్ధ స్మాహ ప్రాతృదః పితరం కిగ్ స్విదేవైవం విదుషే సాధు కుర్యాం కిమేవాస్మా అసాధు కుర్యామితి స హ స్మాహ పాణినా మా ప్రాతృద కస్త్వేన యోరేకధా భూయం భూత్వా పరమతాం గచ్ఛతీతి తస్మా ఉ హైతదువాచ వీత్యన్నం వై వి అన్నే హీమాని సర్వాణి భూతాని విష్టాని ర మితి ప్రాణో వైరం ప్రాణే హీమాని సర్వాణి భూతాని రమన్తే సర్వాణి హ వా అస్మిన్భూతాని విశన్తి సర్వాణి భూతాని రమన్తే య ఏవం వేద, 1॥

ఇతి సప్తమాధ్యాయే ద్వాదశం బ్రాహ్మణమ్.

ప॥ అన్నం - బ్రహ్మ - ఇతి - ఏకే - ఆహుః - తత్ - న - తథా - పూయతి - వై - అన్నం - ఋతే - ప్రాణాత్ - ప్రాణః - బ్రహ్మ - ఇతి - ఏకే - ఆహుః - తత్ - న - తథా - శుష్యతి - వై - ప్రాణః - ఋతే - అన్నాత్ - ఏతే - హ - తు - ఏవ. - దేవతే - ఏకధాభూయం - భూత్వా-పరమతాం-గచ్ఛతః - తత్-హ-స్మ ఆహ-ప్రాతృదః-పితరం-కిం - స్విత్ - ఏవంవిదుషే -

సాధు-కుర్యాం-కిం-ఏవ-అస్మై-అసాధు-కుర్యాం-ఇతి-సః - హ - స్మ-ఆహ-పాణినా-మా-ప్రాతృద-కః తు - ఏనయోః - ఏకధాభూయం--భూత్వా - పరమతాం - గచ్ఛతి - ఇతి - తస్మై - ఉ --ఏతత్ - ఉవాచ - వి - ఇతి - అన్నం - వై - వి - అన్నే -హి-ఇమాని - సర్వాణి - భూతాని - విష్టాని - రం - ఇతి - ప్రాణః - వై-రం - ప్రాణే - హి - ఇమాని - సర్వాణి - భూతాని - రమన్తే-సర్వాణి-హ - వై - అస్మిన్ - భూతాని - విశన్తి - సర్వాణి - భూతాని - రమన్తే - యః - ఏవం - వేద.

ప్ర॥ ఏకే = కొందఱు, అన్నం = అన్నము బ్రహ్మేతి = పరబ్రహ్మమని, ఆహుః = చెప్పిరి. తత్ = అది, తథా = ఆప్రకారము, న = కాదు, అన్నం = అన్నము. ప్రాణాదృతే = ప్రాణము లేకుండ, పూయతివై =పూతీభావమును పొందుచున్నది.(దుర్గంధమగుచున్నది.) ఏకే= మఱికొందఱు,ప్రాణః=ప్రాణము, (ప్రాణవాయువు). బ్రహ్మేతి= పరబ్రహ్మమని. ఆహుః=చెప్పిరి. తత్ = అది, తథా=ఆ ప్రకారము; న=కాదు. ప్రాణః= పాణము, అన్నాదృతే=అన్నము లేకుండ, శుష్యతివై =శోషించిపోవుచున్నది. (ఈఅన్న ప్రాణములకు రెంటికిని ఒక్కొక దానికిని ఏకారణమువలన బ్రహ్మత్వముపపన్నముకాదో ఆ కారణము వలననే), ఏతేహతు ఏవదేవతే = ఈ అన్నప్రాణములను రెండు దేవతలే, ఏకధాభూయం = ఏకభావమును, భూత్వా = అయి, (పొంది), పరమతాం = పరత్వమును, (బ్రహ్మత్వమును), గచ్ఛతః = పొందుచున్నవి. తద్ధ=దానినే, ప్రాతృదః=ప్రాతృదుఁడను పేరుగలపుత్రుఁడు, పితరం = తండ్రినిగూర్చి, ఏవంవిదుషే = ఇట్లు తెలిసికొనిన పరబ్రహ్మము కొఱకు, కింస్విదేవసాధు = ఏమిశుభమును (పూజను), కుర్యాం = చేయుదును. అస్మై = ఈ పరబ్రహ్మముకొఱకు, కిమేవాసాధు = ఏ అమంగళమును, కుర్యామితి = చేయుదునని, ఆహస్మ = పలికెను (తోడుగ పుట్టిన అన్నప్రాణములను బ్రహ్మమునుగాఁ దెలిసి

కొనిన వాఁడు, చెడుగును చేయుటచే ఖండింపఁబడిన వాఁడును కాఁడు, మంచిని చేయుటచే పూజ్యుఁడును కాఁడు, అని భావము). సః = ఆ తండ్రి, ప్రాతృద = పాతృదుఁడను ఓ పుత్రుఁడా! ఏనయోః = ఈ అన్నప్రాణముల రెంటిలో, కస్తు = ఏది, ఏకధాభూయం = ఏకభావమును, భూత్వా = అయి, పరమతాం=బ్రహ్మత్వమును, గచ్ఛతీతి= పొందుచున్నదని, మా = పలుకవద్దు, (అని) పాణినా=హస్తముతో (నివారించుచు), ఆహస్మ = పలికెను. తస్మైఉహ=ఆ పుత్రునికొఱకె, ఏతత్ = ఈముందు చెప్పఁబోయెడి, వీతి = వి అను వాక్యమును, రమితి = రం అను వాక్యమును, ఉవాచ = పలికెను. (యస్మాత్ = ఏ కారణమువలన), అన్నేహి=అన్నమునందే. ఇమాని=ఈ, సర్వాణి = సమస్తములైన భూతాని = భూతములు, విష్టాని = ఆశ్రయించి యున్నవో, (తస్మాత్ = ఆ కారణము వలన), అన్నంవై=అన్నమె, వి = వి అనునది, (యస్మాత్ = ఏ కారణమువలన), ప్రాణేహి = ప్రాణమునందే, ఇమాని = ఈ, సర్వాణి భూతాని = సమస్త భూతములును, రమన్తే = క్రీడించుచున్నవో, (తస్మాత్ = ఆ కారణము వలన), ప్రాణోవై = ప్రాణమె, రం = రం అనునది, యః=ఎవఁడు, ఏవం = ఈ ప్రకారము, వేద = తెలిసికొనునో, అస్మిన్ = వీని యందు, సర్వాణిహవాభూతాని = సమస్త భూతములును, విశన్తి = ప్రవేశించుచున్నవి. సర్వాణిభూతాని = సమస్త భూతములును, (వీని యందే), రమన్తే = క్రీడించుచున్నవి.

తా॥ ఇక్కడ వేఱొక యుపాసనను చెప్పుచున్నాఁడు. కొందఱు అన్నమునే బ్రహ్మమని చెప్పిరి. అయితే అన్నము ప్రాణము వినాగా పూతిభావమును పొందుటవలన పరబ్రహ్మముకాదు. కొందఱు ప్రాణమే బ్రహ్మస్వరూపమని చెప్పిరి. అయితే ఆ ప్రాణమున్ను అన్నము లేకపోవుటవలన శోషించుచున్నది గనుక ప్రాణమున్ను బ్రహ్మముకాదు. ఇట్లు ప్రత్యేకముగా అన్నప్రాణములకు రెంటికిని

బ్రహ్మాత్వము సిద్ధించకపోవుటవలన దేవతాస్వరూపములగు ఈ అన్న ప్రాణములు రెండును ఏకస్వరూపమై బ్రహ్మత్వమును పొందుచున్నవి. ఇట్లు అన్నప్రాణములను బ్రహ్మస్వరూపమైన వాటినిగాఁ దెలిసికొనిన వాఁడు దుష్టత్వమును చేసినను ఖండింపఁబడఁడు. మంచిని చేసినను పూజింపఁబడఁడు. కాఁబట్టి ఇట్లు నాచేఁ దెలిసికొనఁబడిన ఈ పర బ్రహ్మము కొఱకు, నేను, ఏమి మంచిని చేయుదును? ఏమి చడుగు చేయుదును? అని ప్రాతృదుఁడను పుత్రుఁడు తన తండ్రినిగూర్చి అడిగెన. ఇట్లు అడిగిన ఆ పుత్రుని గూర్చి తండ్రి హస్తముతో ఇట్లు పలుక వద్దని నివారించుచు, ఓ పుత్రుఁడా! ఈ సమస్త భూతములు అన్నము నాశ్రయించియున్నవి. కనుక అన్నము వి అనియును, ఈ భూతము లన్నియు ప్రాణమునందు క్రీడించుచున్నవి కాఁబట్టి ప్రాణము రం అనియును, చెప్పఁబడుచున్నవి. ఇట్లు అన్నప్రాణములను సమస్త భూతముల కాశ్రయ క్రీడాకరములనుగా దెలిసికొనిన వానియందు సమస్త భూతములు ఆశ్రయమును క్రీడను చేయుచున్నవి; అనఁగా అట్టివాఁడు సర్వమునకు ఆశ్రయుఁడును బలవంతుఁడు నగుచున్నాఁడు.

సప్తమాధ్యాయమునందు ద్వాదశ బ్రాహ్మణము సమాప్తము.

సప్తమాధ్యాయము - త్రయోదశ బ్రాహ్మణము.

ఉ॥ ఉక్థం ప్రాణో వా ఉక్థం ప్రాణో హీదగ్ం సర్వముత్థాపయత్యు ద్ధాస్మాదుక్థ విద్వీర స్తిష్ఠత్యుక్థస్య సాయుజ్యగ్ం సలోకతాం జయతి య ఏవం వేద. ॥1॥

ప॥ ఉక్థం - ప్రాణః - వై - ఉక్థం - ప్రాణః - హి - ఇదం- సర్వం - ఉత్థాపయతి - ఉత్ - హ - అస్మాత్ - ఉక్థవిత్ - ధీరః - తిష్ఠతి - ఉక్థస్య - సాయుజ్యం - సలోకతాం - జయతి - యః - ఏవం - వేద.

ప్ర॥ ఉక్థం = శస్త్రము, (క్రతువునందు శస్త్రమను పేరుగల

మంత్రము ఋగ్వేదము. అది యేది యనఁగా), ప్రాణో వై=ప్రాణమే. ఉక్థం = శస్త్రము, (ప్రధానమగు శస్త్రము), (ఏలననఁగా), ప్రాణో హి = ప్రాణమే ఇదం = ఈ, సర్వం = సమస్తమును, ఉత్థాపయతి= లేపుచున్నది యః = ఎవఁడు, ఏవం = ఈ ప్రకారము, వేద = తెలిసికొనుచున్నాఁడో, (సః = అటువంటి), ఉక్థవిత్ = ప్రాణవేత్త యగు, ధీరః = పుత్రుఁడు, అస్మాత్ = ఈ ప్రాణవేదనము వలన, ఉత్తిష్ఠతి = లేచుచున్నాఁడు. ఉక్థస్య = ప్రాణముయొక్క, సాయుజ్యం = ఐక్యమును, సలోకతాం = సమానలోకత్వమును, జయతి= జయించుచున్నాఁడు (పొందుచున్నాఁడు).

తా॥ ఇక్కడ వేఱొక యుపాసన చెప్పఁబడుచున్నది. ఈ ప్రాణమునె క్రతువునందలి ప్రధానమగు శస్త్రమగు ఋగ్వేదమునుగా నుపాసించవలయును. ఏలననఁగా, ప్రాణము సర్వమును నిలుపుచున్నది గనుక ప్రధానమైన శస్త్రముగా నున్నది ఇట్లు ప్రాణమును తెలిసికొనునట్టి ప్రాణవేత్తయగు పుత్రుఁడు ఈ తెలివివలన ప్రత్యక్షము నందు నిలిచియుంటున్నాఁడు. అపరోక్షమునందు ఈ యుపాసకుఁడు ప్రాణముయొక్క ఐక్యమును,సమానలోకత్వమును,పొందుచున్నాఁడు.

ఉ॥ యజుః ప్రాణో వై యజుః ప్రాణే హీమాని సర్వాణి భూతాని
యుజ్యన్తే యుజ్యన్తే హాస్మై సర్వాణి భూతాని శ్రైష్ఠ్యాయ
యజుషః సాయుజ్యగ్ సలోకతాం జయతి య ఏవం వేద. ॥2॥

ప॥ యజుః - ప్రాణః - వై - యజుః - ప్రాణే - హి - ఇమాని - సర్వాణి - భూతాని - యుజ్యన్తే - యుజ్యన్తే హ-అస్మై - సర్వాణి -భూతాని - శ్రైష్ఠ్యాయ - యజుషః - సాయుజ్యం - సలోకతాం - జయతి - యః - ఏవం - వేద.

ప్రి॥ యజుః = యజుర్వేదమును, ప్రాణమితి = ప్రాణమని, ఉపాసీత=ఉపాసించవలయును. (ఏలననఁగా), ప్రాణో వై=ప్రాణమే, యజుః = యజుర్వేదము, (ఎందువల్లననఁగా), ప్రాణేహి=ప్రాణము

నందే, ఇమాని = ఈ, సర్వాణి = సమస్తములగు, భూతాని=భూతములు, యుజ్యన్తే = కూర్చఁబడుచున్నవి. యః = ఎవఁడు, ఏవం= ఈ ప్రకారము వేద = తెలిసికొనుచున్నాఁడో అస్మై = ఈ తెలిసికొనినవానికొఱకైన, శ్రైష్ఠ్యాయ=శ్రేష్ఠతకొఱకు,సర్వాణిభూతాని= సమస్త భూతములు, యుజ్యన్తే = కూర్చఁబడుచున్నవి. (వాఁడు), యజుషః = ప్రాణముయొక్క, సాయుజ్యం=ఐక్యమును, సలోకతాం= సమానలోకత్వమును, జయతి = పొందుచున్నాఁడు.

తా॥ ప్రాణమే హవిస్సును కూర్చునట్టి యజుర్వేదముగా (యజుర్మంత్రములచే హవిస్సు ఇవ్వఁబడును గనుక) ఉపాసించవలయును. ఏలననగా, ప్రాణమే యజుస్సుగా నున్నది. కనుకనే ప్రాణమునందె ఈ సమస్త భూతములు కూర్చఁబడియున్నవి. కాఁబట్టి ఇట్లు ప్రాణమునె యజుస్సునుగాఁ దెలిసికొనిన వానికొఱకు సమస్త భూతములు ప్రత్యక్షమునందు శ్రైష్ఠ్యమును కూర్చుచున్నవి. ఇట్టి యుపాసకుఁడు పరోక్షమునందు ప్రాణముయొక్క ఐక్యమును సమానలోకతను పొందుచున్నాఁడు.

ఉ॥ సామ ప్రాణో వై సామ ప్రాణే హీమాని సర్వాణి భూతాని సమ్యఞ్చి సమ్యఞ్చిహాస్మై సర్వాణి భూతాని శ్రైష్ఠ్యాయ కల్పన్తే సామ్నస్సాయుజ్యగ్ సలోకతాం జయతి య ఏవం వేద. ॥3॥

ప॥ సామ - ప్రాణః - వై - సామ - ప్రాణే - హి - ఇమాని - సర్వాణి - భూతాని - సమ్యఞ్చి - సమ్యఞ్చి - హ - అస్మై - సర్వాణి - భూతాని - శ్రైష్ఠ్యాయ - కల్పన్తే - సామ్నః - సాయుజ్యం - సలోకతాం - జయతి - యః - ఏవం - వేద.

ప్ర॥ (ప్రాణం = ప్రాణమును), సామ = సామవేదమునుగా, (ఉపాసీత = ఉపాసన చేయవలయును). ప్రాణోవై = ప్రాణమే, సామ = సామవేదము, ప్రాణేహి = ప్రాణమునందే, ఇమాని = ఈ, సర్వాణి = సమస్తములైన, భూతాని = భూతములు, సమ్యఞ్చి =

మిక్కిలి కలిసికొనుచున్నవి. యః = ఎవఁడు, ఏవం = ఈప్రకారము, వేద = తెలిసికొనుచున్నాఁడో, అస్మై = వీనికొఱకు, (వీనియొక్క), సమ్యఞ్చిహ=మిక్కిలి కలిసికొనియున్న, సర్వాణి భూతాని=సమస్త భూతములు, శ్రైష్ఠ్యాయ = శ్రేష్ఠతకొఱకు, కల్పన్తే = సమర్థములగుచున్నవి. (ఇట్లు తెలిసికొనినవాఁడు), సామ్నః=ప్రాణముయొక్క, సాయుజ్యం = ఐక్యమును, సలోకతాం = సమాన లోకత్వమును, జయతి = పొందుచున్నాఁడు.

తా॥ ప్రాణమును సామమని యుపాసించవలయును. ఏలననఁగా ఈ సమస్త భూతములు ప్రాణమునందే మిక్కిలి కలిసికొనియున్నవి. కనుక ప్రాణమే సామమైయున్నది. ఇట్లు తెలిసికొని యుపాసించువానియొక్క శ్రేష్ఠతకొఱకు సమస్త భూతములు ప్రత్యక్షమునందు సమర్థము లగుచున్నవి. ఈ యుపాసకుఁడు అపరోక్షమునందు ప్రాణముయొక్క ఐక్యమును సమానలోకత్వమును పొందుచున్నాఁడు.

ఉ॥ క్షత్రం ప్రాణో వై క్షత్రం ప్రాణో హి వై క్షత్రం త్రాయతే హైనం ప్రాణః క్షణితోః ప్రక్షత్రమత్ర మాప్నోతి క్షత్రస్య సాయుజ్యగ్ం సలోకతాం జయతి య ఏవం వేద. ॥4॥

ఇతి సప్తమాధ్యాయే త్రయోదశం బ్రాహ్మణమ్.

వి॥ క్షత్రం - ప్రాణః - వై - క్షత్రం - ప్రాణః - హి - వై - క్షత్రం - త్రాయతే - హ - ఏనం - ప్రాణః - క్షణితోః - ప్రక్షత్రం - అత్రం - అప్నోతి - క్షత్రస్య - సాయుజ్యం - సలోకతాం - జయతి - యః - ఏవం - వేద.

ప్ర॥ (ప్రాణం = ప్రాణమును), క్షత్రం = క్షత్రమునుగాను, (హింసవలన రక్షించువానినిగాను), (ఉపాసీత=ఉపాసించవలయును). ప్రాణోవై = ప్రాణమే, క్షత్రం = క్షత్రస్వరూపము. ప్రాణోహవై= ప్రాణమే, క్షత్రం = క్షత్రస్వరూపము. ప్రాణః = ప్రాణము, క్షణితోః = హింసవలన, ఏనం = ఈ దేహమును, త్రాయతేహ =

రక్షించుచున్నది. యః = ఎవఁడు, ఏవం = ఈ ప్రకారము, వేద = తెలిసికొనుచున్నాఁడో, (సః = వాఁడు), అత్రిం=వేఱొకనిచేత రక్షింపఁబడని, ప్రక్షత్రం=మిక్కిలి హింసవలన రక్షించునట్టి ప్రాణమును ఆప్నోతి = పొందుచున్నాఁడు. క్షత్రస్య=ప్రాణముయొక్క, సాయుజ్యం = ఐక్యమును, సలోకతాం = సమానలోకత్వమును, జయతి = పొందుచున్నాఁడు.

తా॥ ప్రాణమును హింసవలన రక్షించునట్టి క్షత్రస్వరూపమునుగా ఉపాసించవలయును. ఏలననఁగా, ప్రాణమె ఈ దేహమును హింసవలన రక్షించుచున్నది, కనుక ప్రాణము క్షత్రస్వరూపమై యున్నది. ఇట్లు తెలిసికొని యుపాసించువాఁడు ఎవనిచేతను రక్షింపఁబడని సర్వమును, హింసవలన రక్షించునట్టి ప్రాణమును పొందుచున్నాఁడు. పరోక్షమందు ప్రాణముయొక్క ఐక్యమును సమానలోకతను పొందుచున్నాఁడు.

ఇట్లు సప్తమాధ్యాయము త్రియోదశ బ్రాహ్మణము సమాప్తము.

## సప్తమాధ్యాయము – చతుర్దశ బ్రాహ్మణము.

ఉ॥ భూమిరన్తరిక్షం ద్యౌరిత్యష్టావక్షరాణ్యష్టాక్షరగ్ం హ వా ఏకం గాయత్ర్యై పదమేతదు హైవాస్యా ఏతత్స యావదేషు త్రిషు లోకేషు తావద్ధ జయతి యోఽస్యా ఏతదేవం పదం వేద. ॥1॥

ప॥ భూమిః – అన్తరిక్షం – ద్యౌః – ఇతి – అష్టౌ – అక్షరాణి – అష్టాక్షరం – హ – వై – ఏకం – గాయత్ర్యై – పదం – ఏతత్ – ఉ – హ – ఏవ – అస్యాః – ఏతత్ – సః – యావత్ – ఏషు – త్రిషు – లోకేషు – తావత్ – హ – జయతి–యః–అస్యాః–ఏతత్ – ఏవం – పదం – వేద.

ప్రి॥ భూమిః = భూమియును, అన్తరిక్షం = ఆకాశమును, ద్యౌః = స్వర్గలోకమును, ఇతి = ఈ, అష్టౌ=ఎనిమిది, అక్షరాణి =

అక్షరములు, (భూమిః అను పదమునందలి భూ అను అక్షరము మొదలు కడపటి ద్యౌః అను పదమునందలి దకార యకారముల రెంటితోఁకూడ ఎనిమిది అక్షరములు), గాయత్ర్యై=గాయత్రియొక్క, అష్టాక్షరంహ్యై = ఎనిమిది అక్షరములు గల, ఏకం = ఒక్కటి యగు, పదం = పదము. ఏతదుహైవ = ఈ త్రిలోకస్వరూపమే, అస్యాః = ఈ గాయత్రియొక్క, ఏతత్ = ఈ ఎనిమిది అక్షరములు గల పదము. ఏవం = ఈ ప్రకారము, యః = ఎవఁడు, అస్యాః = ఈ గాయత్రియొక్క, ఏతత్ = ఈ, పదం = పాదమును, వేద = తెలిసికొనుచున్నాఁడో, సః = వాఁడు, ఏషు = ఈ, త్రిషులోకేషు= మూఁడు లోకముల యందును, యావత్=ఎంత, (జేతవ్యం=జయించ తగినదో) తావద్ధ = అ సర్వమును, జయతి = జయించుచున్నాఁడు.

తా॥ ఇక్కడ గాయత్ర్యుపాధితోఁ గూడుకొనిన బ్రహ్మోపాసన చెప్పఁబడుచున్నది. 'భూమి అంతరిక్ష ద్యౌ' అనునట్టి ఈ పదము నందలి కడవటి దకార యకారములచు రెండు అక్షరములతోఁ గూడ ఎనిమిది యక్షరములును గాయత్రియొక్క ఎనిమిది అక్షరములు గల ఒక పాదముగా నున్నది. గనుక భూమ్యంతరిక్ష స్వర్గములను ఈ మూఁడు లోకముల స్వరూపము గాయత్రియొక్క ఏక పాదమై యున్నది. ఈ ప్రకారము గాయత్రియొక్క పాదమును తెలిసికొని యుపాసించువాఁడు, ఈ మూఁడు లోకములయందును తాను జయించఁదగిన దానినంతయు జయించుచున్నాఁడు.

ఉ॥ ఋచో యజూగ్ంషి సామానీత్యష్టావక్షరాణ్యష్టాక్షరగ్ం హ వా ఏకం గాయత్ర్యైపదమేతదు హైవాస్యా ఏతత్స యావతీయం త్రయీ విద్యా తావద్ధ జయతి యోఽస్యా ఏత దేవం పదం వేద. ॥2॥

ప॥ ఋచః - యజూంషి - సామాని - ఇతి - అష్టౌ - అక్షరాణి - అష్టాక్షరం - హ్యై - ఏకం - గాయత్ర్యై - పదం-ఏతత్-ఉ - హ - ఏవ - అస్యాః - ఏతత్ - సః - యావతీ - ఇయం -

త్రయీ - విద్యా - తావత్ - హ - జయతి - యః - అస్యాః - ఏతత్ - ఏవం - పదం - వేద.

ప్ర॥ ఋచః = ఋగ్వేదమంత్రములును, యజూంషి = యజుర్మంత్రములును, సామాని = సామమంత్రములను, ఇతి = ఈ వేదత్రయముయొక్క నామాక్షరములైన, అష్టౌ = ఎనిమిదియైన, అక్షరాణి = వర్ణములు, గాయత్ర్యై = గాయత్రియొక్క, అష్టాక్షరం హవై = ఏనిమిది అక్షరములేగల, ఏకం = ఒక్కటియైన, పదం = రెండవపాదము. ఏతదు హైవ = ఈ వేదత్రయమమే, అస్యాః = ఈ గాయత్రియొక్క. ఏతత్ = రెండవపాదము. ఏవం = ఈప్రకారము, యః = ఎవఁడు, అస్యాః=ఈ గాయత్రియొక్క ఏతత్ = ఈ, పదం = పాదమును, వేద = తెలిసికొనుచున్నాఁడో, సః=వాఁడు, ఇయం = ఈ, త్రయీవిద్యా=ఋగ్యజుస్సామ రూపమైన వేదవిద్య, యావతి =ఎంత ఫలసముదాయము కలదో, తావద్=దానినంతయు, జయతి = జయించుచున్నాఁడు. (పొందుచున్నాఁడు).

తా॥ ఈ మంత్రమునందు చెప్పఁబడిన ఋగ్యజుస్సామరూపమైన వేదత్రయముయొక్క నామాక్షరములు ఎనిమిది గాయత్రియొక్క ఏనిమిది అక్షరములుగల రెండవపాదము. ఈ గాయత్రియొక్క రెండవ పాదము ఋగ్యసాజుస్సామరూపమైన త్రయీవిద్యనుగాఁ దెలిసికొని యుపాసించెడివాఁడు ఋగ్యజుస్సామములను వేదత్రయమునందలి ఫలమునంతను పొందుచున్నాఁడు.

ఉ॥ ప్రాణోఽపానో వ్యాన ఇత్యష్టావక్షరాణ్యష్టాక్షరగ్ం హ వా ఏకం గాయత్ర్యై పదమేతదు హైవాస్యా ఏతత్స యావదిదం ప్రాణి తావద్ధ జయతి యోఽస్యా ఏతదేవం పదం వేదాథాస్యా ఏతదేవ తురీయం దర్శతం పదం పరోరజా య ఏష తపతి యద్వై చతుర్థం తత్తురీయం దర్శతం పదమితి దదృశ ఇవ హ్యేష పరోరజా ఇతి సర్వము హ్యేవైష రజ ఉపర్యుపరి తపత్యేవగ్ం హైవ శ్రియా

యశసా తపతి యోఽస్యా ఏత దేవం పదం వేద. ||3||

ప|| ప్రాణః - అపానః - వ్యానః - ఇతి - అష్టౌ - అక్షరాణి-అష్టాక్షరం - హవై - ఏకం - గాయత్ర్యై - పదం - ఏతత్ - ఉ-హ - ఏవ - అస్యాః - ఏతత్ - సః - యావత్ - ఇదం - ప్రాణి-తావత్ - హ - జయతి - యః - అస్యాః - ఏతత్ - ఏవం-పదం-వేద - అథ - అస్యాః - ఏతత్ - ఏవ - తురీయం - దర్శతంపదం-పరోరజాః - యః - ఏషః - తపతి - యత్ - వై - చతుర్థం - తత్ - తురీయం - దర్శతంపదం - ఇతి - దదృశే - ఇవ - హి - ఏషః - పరోరజాః - ఇతి - సర్వం - ఉ - హి - ఏవ - ఏషః - రజః - ఉపరి - ఉపరి - తపతి - ఏవం - హ - ఏవ - శ్రియా - యశసా - తపతి - యః - అస్యాః - ఏతత్ - ఏవం - పదం-వేద.

ప్ర|| ప్రాణః=ప్రాణమును,అపానః=అపానమును,=వ్యానః=వ్యానమును,ఇతి=ఈప్రాణాపాన వ్యానములను మూడుపదములయందలి వర్ణములు,(కడపటి వ్యానశబ్దమునందు, వి, అ, న, యని మూడుర్ణవములుగాఁదెలిసికొనవలయును). అష్టౌ=ఎనిమిదియగు, అక్షరాణి=అక్షరములు, గాయత్ర్యై = గాయత్రియొక్క, అష్టాక్షరంహవై=ఎనిమిది అక్షరములే గల, ఏకం = ఒక్కటియైన, పదం=పాదము. (మూడవ పాదము). ఏతదుహైవ = ఈప్రాణత్రయమే, అస్యాః = ఈగాయత్రి యొక్క, ఏతత్ = ఈ మూడవపాదము. యః = ఎవఁడు, ఏవం = ఈ ప్రకారము, అస్యాః = ఈ గాయత్రియొక్క, ఏతత్ = ఈ. పదం = మూడవపాదమును, వేద = తెలిసికొనుచున్నాఁడో. సః = వాఁడు, ఇదం = ఈ, ప్రాణి = ప్రాణిసమూహము, యావత్ = ఎంతయో, తావద్ధ = దానినంతయును, జయతి=జయించుచున్నాఁడు అథ = అనంతరమునందు, (మూడు పాదములను చెప్పిన తరువాత), యఏషః = ఈ ప్రత్యక్షమగు సూర్యమండలము, పరోరజాః = పరో రజయనునట్టి పదము, (శ్రేష్ఠమై రజస్సు గలదియై). తపతి = ప్రకా

శించుచున్నదో, ఏతదేవ = ఇదియె, అస్యాః=ఈ గాయత్రియొక్క, తురీయం = తురీయమనునట్టి, దర్శతంపదం = దర్శతమనుపాదము. (ఇక్కడ పరోరజా, తురీయం, దర్శతపదం, అను ఈ మూటికిని శ్రుతియె స్వీయముగా అర్థమును ప్రకటించుచున్నది). చతుర్థం = నాలుగవది. యద్వై = ఏదియో, తత్ = అది, తురీయం=తురీయ మనునది. దర్శతం పదమితి = దర్శతంపదం అనునది, దదృశఇవహి= కనఁబడ్డదివలెనే యుండునట్టి, ఏషః=ఈ మండలాంతర్గత పురుషుఁడు. పరోరజాఇతి = పరోరజాయనునది, ఏషఏవ = ఈ మండలాంతర్గత పురుషుఁడే; (ఈ పురుషుఁడు), సర్వముహ = సమస్తమైన, రజః = రజస్సునుగూర్చి, (సమస్త లోకమును), ఉపర్యుపరి=మీఁదు మీఁదుగా, (వీప్సార్థమునందు ద్విరుక్తి. ఈ ఉపర్యుపరియను పదమునకు మీఁదుగానుండు సూర్యుఁడు కాఁడని తెలియపఱచుటకుగా వీప్సార్థము), తపతి = ప్రకాశించుచున్నాఁడు. యః = ఎవఁడు ఏవం = ఈ ప్రకారము, అస్యాః = ఈ గాయత్రియొక్క, ఏతత్ = ఈ, పదం = నాలుగవ పాదమును, వేద = తెలిసికొనుచున్నాఁడో, (సః= వాఁడు). ఏవంహైవ=ఈ పూర్వోక్తమైన సూర్యుఁడువలెనే, శ్రియా= సర్వాధిపత్య లక్షణమైన సంపదతోను, యశసా=ఖ్యాతితోను, తపతి = ప్రకాశించుచున్నాఁడు.

తా॥ ఈ మంత్రమునందు చెప్పఁబడిన ప్రాణాపాన వ్యానములను మూటియొక్క నామాక్షరములు ఎనిమిది, గాయత్రియొక్క ఏనిమిది అక్షరములుగల మూడవపాదము. ఇట్లు గాయత్రియొక్క మూడవపాదమును ప్రాణాపాన వ్యాన రూపముగాను తెలిసికొని యుపాసించువాఁడు ఈ ప్రాణిసమూహము నంతయును జయించుచున్నాఁడు. ఇట్లు గాయత్రి మూఁడుపాదములను తెలిసికొనిన పిమ్మట ప్రత్యక్షముగాఁ కనబడుచున్నవాఁడు వలెనే యున్నట్టివాఁడును, ఊర్ధ్వముగానుండి సమస్తలోకమును ప్రకాశింపఁజేయువాఁడునగు

సూర్యమండలాంతర్గత పురుషుఁడే ఈ గాయత్రియొక్క చతుర్థపాద మగు పరోరజా యనునదియె యని తెలిసికొని యుపాసించువాఁడు సూర్యుఁడువలె సర్వాధిపత్య లక్షణమైన సంపదతోను ఖ్యాతితోను ప్రకాశించుచున్నాఁడు.

ఉ॥ సైషా గాయత్ర్యే తస్మిగ్ స్తురీయే దర్శతే పదే పరోరజసి ప్రతిష్ఠితా తద్వై తత్సత్యే ప్రతిష్ఠితం చక్షుర్వై సత్యం చక్షుర్హి వై సత్యం తస్మాద్యదిదానీం ద్వౌ వివదమానా వేయాతా మహమదర్శ మహమశ్రౌషమితి య ఏవ బ్రూయాదహ మదర్శ మితి తస్మా ఏవ శ్రద్ధధ్యామ తద్వై తత్సత్యం బలే ప్రతిష్ఠితం ప్రాణో వై బలం తత్ప్రాణే ప్రతిష్ఠితం తస్మాదాహుర్బలగ్ స త్యా దోగీ య ఇత్యేవమేషా గాయత్ర్యధ్యాత్మం ప్రాణే ప్రతి ష్ఠితా సా హైషాగయాగ్ స్తత్రే ప్రాణా వై గయా స్తత్ప్రా ణాగ్ స్తత్రేతద్యద్గయాగ్ స్తత్రే తస్మాద్గాయత్రీ నామ స యా మేవా మూగ్ సావిత్రీ మన్వాహై షైవ స యస్మా అన్వాహ తస్య ప్రాణాగ్ స్త్రాయతే. ॥4॥

ప॥ సా – ఏషా – గాయత్రీ – ఏతస్మిన్ – తురీయే – దర్శతే – పదే – పరోరజసి – ప్రతిష్ఠితా – తత్ – వా – ఏతత్ – సత్యే – ప్రతిష్ఠితం – చక్షుః – వై – సత్యం – చక్షుః – హి – వై – సత్యం – తస్మాత్ – యత్ ఇదానీం – ద్వౌ – వివదమానౌ – ఏయాతాం – అహం – అదర్శం – అహం – అశ్రౌషం – ఇతి – యః – ఏవ – బ్రూయాత్ – అహం అదర్శం – ఇతి – తస్మై – ఏవ – శ్రద్ధధ్యామ – తత్ – వా – ఏతత్ – సత్యం – బలే – ప్రతిష్ఠితం – ప్రాణః – వై – బలం – తత్ – ప్రాణే – ప్రతిష్ఠితం – తస్మాత్ – ఆహుః – బలం – సత్యాత్ – ఓగీయః – ఇతి – ఏవం – ఏషా – గాయత్రీ – అధ్యాత్మం – ప్రాణే – ప్రతిష్ఠితా – సా – హ – ఏషా – గయాన్ – తత్రే – ప్రాణాః – వై – గయాః – తత్ – ప్రాణాన్ – తత్రే –

తత్ - యత్ - గయాన్ - తత్రే - తస్మాత్ - గాయత్రీ - నామ- సః - యాం - ఏవ - అమూం - సావిత్రీం - అను - ఆహ - ఏషా - ఏవ - సః - యస్మై - అను - ఆహ - తస్య - ప్రాణాన్ - త్రాయతే

ప్ర॥ సా = ఆ పూర్వోక్తమైన, ఏషా = ఈ, గాయత్రీ = మూడు పాదములుగల గాయత్రి, పరోరజసి = పరోరజసియను, దర్శతే పదే = చూడఁబడినదివలెనే యుండెడి సూర్యమండలాంతర్గత పురుషుఁడె స్థానముగాఁగల, తురీయే = తురీయమునందు, (గాయత్రి యొక్క నాలుగవ పాదమునందు), ప్రతిష్ఠితా = ఉంచఁబడియున్నది, (మూర్తా మూర్తస్వరూపమైన జగత్తు, మూఁడుపాదములుగల గాయత్రియైనది. ఆ గాయత్రి సూర్యునియొక్క సారమగుటవలన మూఁడు పాదములతోఁగూడ నాలుగవ పాదమగు సూర్యునియందుంచఁబడి యున్నది). తద్వైతత్ = ఆ ప్రసిద్ధమగు సూర్యాత్మకమగు నాలుగవపాదము, సత్యే = సత్యమునందు, ప్రతిష్ఠితం = ఉంచఁబడియున్నది. (ఆ సత్యమేదియనఁగాఁ జెప్పఁబడుచున్నది). చక్షుర్వై = నేత్రమే, సత్యం = సత్యమైనది. (నేత్రమెట్లు సత్యమైనదియంటే చెప్పుచున్నాఁడు). చక్షుః = నేత్రము, సత్యంహివై = ప్రసిద్ధముగా సత్యమైనది. (ప్రసిద్ధమెట్లనఁగాఁ జెప్పుచున్నాఁడు). తస్మాత్ = ఆ కారణమువలన, ఇదానీం = ఇప్పుడు. అహం = నేను, అదర్శం= చూచితిని. అహం = నేను, అశ్రౌషం = వింటిని. ఇతి = అని, వివదమానౌ = కలహించుచు, ద్వౌ = ఇద్దఱు మనుష్యులు, ఏయాతాంయత్ = వచ్చినప్పుడు, యఏవ = ఎవఁడైతే, అహం = నేను, అదర్శమితి = చూచితినని, బ్రూయాత్ = పలుకునో, తస్మాఏవ = వానికొఱకే, (వయం = మనము), శ్రద్ధధ్యామ = నమ్మెదము. (విశ్వసించుదము). (గనుక), తద్వైతత్ = ఆ ఈ ప్రసిద్ధమైన, సత్యం = సత్యము, (తురీయపదమగు సూర్యునకాశ్రయమైన నేత్రము), బలే= బలమునందు, ప్రతిష్ఠితం= ఉంచఁబడియున్నది. (ఆ బలమేదియనఁగా),

ప్రాణోవై = ప్రాణమే, బలం = బలము. తత్ = ఆ సత్యాత్మకమగు నేత్రము, ప్రాణే = ప్రాణమునందు, ప్రతిష్ఠితం = ఉంచఁబడియున్నది. తస్మాత్ = ఆ కారణమువలన, బలం = ప్రాణము, సత్యాత్ = సత్యాత్మకమైన నేత్రముకంటె, ఓగీయ ఇతి = బలిష్ఠమైనదియని, ఆహుః = చెప్పుచున్నారు. ఏవం = ఈ ప్రకారముగ, ఏషా = ఈ, గాయత్రీ = గాయత్రి, అధ్యాత్మం = అధ్యాత్మ స్వరూపమైన, (పరమాత్మస్వరూపమైన), ప్రాణే = ప్రాణమునందు, ప్రతిష్ఠితా = ఉంచఁబడియున్నది. సైషాహ = ఈ గాయత్రియే, (ప్రాణరూపమైన ఆ గాయత్రియే), గయాన్ = గయలను, (వాగాదీంద్రియములను), తత్రే = పరిపాలించెను. (రక్షించెను). ప్రాణావై = వాక్కు మొదలైన ఇంద్రియములె, గయాః = గయలు (అనఁబడును). తత్ = ఆ, ప్రాణాన్ = వాగాదీంద్రియములను, (ఆ ప్రాణరూపమైన గాయత్రి), తత్రే = రక్షించెను. తత్ = అక్కడ, యత్ = ఏకారణమువలన, గయాన్ = వాగాదీంద్రియములను, (ఆ గాయత్రి), తత్రే = రక్షించెనో, తస్మాత్ = ఆ కారణమువలన, గాయత్రీ నామ=గాయత్రియను పేరు, (ప్రథితా=ప్రసిద్ధమైనది). సః=ఆ ఆచార్యుడు, (అష్టవర్షం=ఎనిమిది సంవత్సరముల వయస్సుగల, మాణవం=చిన్నవానిని, ఉపనీయ = ఉపనయన సంస్కారము కలవానినిగాఁజేసి), యామేవామూం = ఏ ఈ, సావిత్రీం = సవితృ దేవతాకమైన సావిత్రిని, (పచ్ఛోర్ధర్చశస్సమస్తాంచ = పాదపాదముగాను, సగము సగముగాను, సర్వముగాను), అన్వాహ = చెప్పెనో, (సా = ఆ సావిత్రి), ఏషైవ = ఈ గాయత్రియె. (ఎట్లనఁగా), సః = ఆ ఆచార్యుఁడు, యస్మై = ఏబాలునికొఱకు, అన్వాహ = చెప్పుచున్నాఁడో, (సావిత్రిని యుపదేశించుచున్నాఁడో), తస్య=ఆ బాలుని యొక్క, ప్రాణాన్ = ప్రాణములను, (నరకాదుల యందు పడకుండ, ఆ సావిత్రి), త్రాయతే = రక్షించుచున్నది (గనుకనె గాయత్రి

యనఁబడును).

తా॥ భూలోక భువర్లోక సువర్లోకములును, ఋగ్యజుస్సామ వేదములును, ప్రాణాపానవ్యానములును, ఇవి క్రమముగా నెనిమిదేసి అక్షరములుగల గాయత్రియొక్క ప్రథమ• ద్వితీయ తృతీయములను మూడుపాదములై యున్నవి. అట్టి మూడు పాదములుగల ఈ గాయత్రి పరోరజసి యని చెప్పఁబడుచుండెడిదియును చూడఁబడుఁదివలెనె యుండుఁదియు నగు సూర్యమండలాంతర్గత పురుషరూపమైన గాయత్రి యొక్క నాలుగవ పాదమునందుంచఁబడియున్నది. ఆ ప్రసిద్ధమగు సూర్యమండలాంతర్గతమైన పురుషరూపమగు గాయత్రి చతుర్థపాదము సత్యమునందుంచఁబడియున్నది. ఆ సత్యము ప్రసిద్ధమగు నేత్రమై యున్నది. అది యెట్లనఁగా, లోకమునందు ఒక వస్తువునుగూర్చి చూచినానని ఒకఁడును, విన్నానని యొకఁడును, చెప్పునపుడు, చూచి నానని చెప్పినవానినే మనము ముఖ్యముగా నమ్ముదుము గనుక ప్రసిద్ధమగు ఈ సత్యము, గాయత్రీ చతుర్థపాదమగు సూర్యమండలాంతర్గత పురుషునకాశ్రయమైన నేత్రమే. (నేత్రేంద్రియమే). ఈ సత్యాత్మకమైన నేత్రము. బలరూపమగు ప్రాణమునందుంచఁబడి యున్నది గనుకనే ప్రాణము నేత్రేంద్రియముకంటె బలిష్ఠమైన దాని నిగాఁ జెప్పుచున్నారు. ఈ ప్రకారముగానే మూడు పాదములుగల ఈ గాయత్రి, పరమాత్మస్వరూపమైన ఈ ప్రాణమునందుంచఁబడి యున్నది. ఇట్లుంచఁబడి ప్రాణరూపమైన గాయత్రి వాగాదీంద్రియము లను కాపాడుచున్నది. ఈ ప్రకారము వాగాదీంద్రియములను. కాపా డుటవల్లనే గాయత్రియను పేరుకలిగెను. లోకమునందు ఆచార్యుఁడు ఎనిమిది సంవత్సరముల వయస్సుగల బాలునికి ఉపనయన సంస్కా రము కలుగఁజేసి సవితృ దేవతాకమైన సావిత్రిని యుపదేశించు చున్నాఁడు. ఆ సావిత్రియే ఉపదేశమునుపొందిన బాలుని ప్రాణము లను రక్షించుటవలననే గాయత్రి యనఁబడును.

ఉ॥ తాఁగ్ హైతా మేకే సావిత్రీ మనుష్టుభమన్వాహుర్వాగనుష్టు బేతద్వాచమనుబ్రూమ ఇతి న తథాకుర్యాద్గాయత్రీమేవ సావిత్రీ మనుబ్రూయాద్యదిహ వా అప్యేవం విద్బహ్వివ ప్రతిగృహ్ణాతి న హైవ తద్గాయత్ర్యా ఏకఞ్చ న పదమ్ప్రతి. ॥5॥

ప॥ తాం - హ - ఏతాం - ఏకే - సావిత్రీం - అనుష్టుభం- అను - ఆహుః - వాక్ - అనుష్టుప్ - ఏతత్ - వాచం - అను బ్రూమః - ఇతి - న - తథా - కుర్యాత్ - గాయత్రీం - ఏవ - సావిత్రీం - అనుబ్రూయాత్ - యది - హ - వై - అపి - ఏవం విత్ - బహు - ఇవ - ప్రతిగృహ్ణాతి - న - హ - ఏవ - తత్ - గాయత్ర్యాః - ఏకం - చ - న - పదం - ప్రతి.

ప్ర॥ ఏకే = కొందఱు, తాంహ = ఆ ప్రసిద్ధమైన, ఏతాం= ఈ, సావిత్రీం = సావిత్రిని అనుష్టుభం = అనుష్టుప్ఛందస్సువలనఁ బుట్టినదానినిగా, అన్వాహుః = అనుసరించి చెప్పిరి. (ఏలననఁగా), వాక్ = వాక్కు, అనుష్టుప్ = అనుష్టుప్ఛందస్సు, (గనుక), ఏత ద్వాచం = ఈ వాక్కును, (ఈ సరస్వతిని), అనుబ్రూమః = అను సరించి చెప్పుచున్నాము, ఇతి = అని. (అన్వాహుః = అనుసరించి పలికిరి). తథా = ఆ ప్రకారము, నకుర్యాత్ = చేయఁగూడదు. (తెలిసికొనఁగూడదు). యదిహవాఅపి = అట్లు తెలిసికొనినయెడల, గాయత్రీమేవ = గాయత్రినే, సావిత్రీం=సావిత్రినిగా, అనుబ్రూయత్= అనుసరించి చెప్పఁదగినదగును. (కనుక అట్లు తెలిసికొనఁగూడదని ఇట్లు ప్రసంగవశముగాఁ జెప్పి గాయత్రిని తెలిసికొనినవానిని స్తుతించు చున్నాఁడు). ఏవం విత్ = ఈ పూర్వోక్త ప్రకారము గాయ త్రిని తెలిసికొనినవాఁడు, బహ్వివ=అనేకమైనదానినివలెనె, (యాత్= దేనిని), ప్రతిగృహ్ణాతి = ప్రతిగ్రహించుచున్నాఁడో, (తీసికొను చున్నాఁడో), తత్ = అది, గాయత్ర్యాః = గాయత్రియొక్క, ఏక ఞ్చన = ఒకటియైనను, పదంప్రతి = పాదమునుగూర్చి, నహైవ =

సమర్థముకాదు.

తా॥ ఇక్కడ శ్రీలోకమతమును భావన చేయుచున్నాఁడు. కొందఱు వాక్కే అనుష్టుప్ఛందస్సు గనుక ప్రసిద్ధమగు ఈ సావిత్రిని అనుష్టుప్ఛందస్సువలనఁ బుట్టినదానినిగాఁ జెప్పుచున్నారు. ఆ ప్రకారము తెలిసికొనఁగూడదు. ఏలననఁగా ప్రాణమే గాయత్రిగాఁ జెప్పఁబడుటవలన, ప్రాణము చెప్పఁబడినయెడల వాగ్రూపమైన సరస్వతియును ఇతరములగు చక్షురాది ప్రాణములును అన్నియును బాలునికి అర్పింపఁబడినవగును. కనుక గాయత్రినె సావిత్రినిగాఁ జెప్పవచ్చును. అట్లు చెప్పుట సరికాదు; అని ప్రస్తావనవశముచే నిట్లు చెప్పి గాయత్రి స్వరూపము తెలిసికొనినవానిని స్తుతించుచున్నాఁడు. ఎట్లనఁగా ఈ పూర్వముచెప్పినప్రకారము గాయత్రిని తెలిసికొనినవాఁడు అనేకమైనవాటిని ప్రతిగ్రహించినను ఆ ప్రతిగ్రహము గాయత్రీయొక్క ఏకపాదమునుగూర్చియైనను సమర్థముకాదు. అనఁగా అప్రతిగ్రహసమూహముచే ఒక్కటియగు గాయత్రి పాదముయొక్కయైనను విజ్ఞానఫలము అపహరింపఁబడదు.

ఉ॥ స య ఇమాగ్ స్త్రీన్లోకాన్పూర్ణాన్ప్రతిగృహ్ణీయాత్సోఽస్యా ఏతత్ప్రథమం పదమాప్నుయాదథ యావతీయం త్రయీ విద్యా యస్తావత్ప్రతిగృహ్ణీయాత్సోఽస్యా ఏతద్ద్వితీయం పదమాప్నుయాదథ యావదిదం ప్రాణి యస్తావత్ప్రతిగృహ్ణీయాత్సోఽస్యా ఏతత్తృతీయం పదమాప్నుయాదథాఽస్యా ఏతదేవ తురీయం దర్శతం పదం పరోరజా య ఏష తపతి నైవ కేన చనాప్యం కుత ఉ ఏతావత్ప్రతిగృహ్ణీయాత్. ॥6॥

ప॥ సః – యః – ఇమాన్ – త్రీన్ – లోకాన్ – పూర్ణాన్ – ప్రతిగృహ్ణీయాత్ – సః – అస్యాః – ఏతత్ – ప్రథమం – పదం – ఆప్నుయాత్ – అథ – యావతీ – ఇయం – త్రయీ – విద్యా – యః – తావత్ – ప్రతిగృహ్ణీయాత్ – సః – అస్యాః – ఏతత్ –

ద్వితీయం - పదం - ఆప్నుయాత్ - అథ - యావత్ - ఇదం - ప్రాణి - యః - తావత్ - ప్రతిగృహ్ణీయాత్ - సః - అస్యాః - ఏతత్ - తృతీయం - పదం - ఆప్నుయాత్ - అథ - అస్యాః - ఏతత్ - ఏవ - తురీయం - దర్శతం - పదం - పరోరజాః - యః - ఏషః - తపతి - న - ఏవ - కేన - చన - ఆప్యం - కుతః - ఉ - ఏతావత్ - ప్రతిగృహ్ణీయాత్.

ప్ర॥ సః = ఆ గాయత్రిని తెలిసికొనిన. యః = ఎవఁడు, ఇమాన్ = ఈ, త్రీన్ = మూఁడగు, లోకాన్ = లోకములను, (గో అశ్వాది ధనములచే నిండింపఁబడిన భూ మ్యంతరిక్ష స్వర్గలోకములను), ప్రతిగృహ్ణీయాత్ = పొందునో, సః = వాఁడు, అస్యాః = ఈ గాయత్రియొక్క, ఏతత్ = ఈ, ప్రథమంపదం = మొదటిపాదమును, ఆప్నుయాత్ = పొందును. అథ = అనంతరము, ఇయం = ఈ, త్రయీవిద్యా = వేదవిద్య, యావతీ = ఎంతయో, తావత్ = దాని నంతను, యః = ఎవఁడు, ప్రతిగృహ్ణీయాత్ = పొందునో, సః = వాఁడు. అస్యాః = ఈ గాయత్రియొక్క, ఏతత్ = ఈ, ద్వితీయం = రెండవదియైన, పదం = పాదమును, ఆప్నుయాత్ = పొందును. అథ = అనంతరము, ఇదం = ఈ, ప్రాణి = ప్రాణిసమూహము, యావత్ = ఎంతయో, తావత్ = దానినంతను, యః = ఎవఁడు, ప్రతిగృహ్ణీయాత్ = పొందునో, సః = వాఁడు. అస్యాః = ఈ గాయత్రియొక్క, ఏతత్ = ఈ, తృతీయంపదం = మూఁడవ పాదమును, ఆప్నుయాత్ = పొందును. అథ = అనంతరము, యఏషః = ఏ ఈ సూర్యుఁడు, తపతి = ప్రకాశించుచున్నాఁడో, ఏతదేవ = ఇదియె, అస్యాః = ఈ గాయత్రియొక్క, పరోరజాః = పరోరజా యను, తురీయం = నాలుగవదియగు, దర్శతం = చూడఁబడినదివలెనెయుండెడి, పదం = పాదము. (తత్ = ఆ నాలుగవ పాదము), కేనచన = ఎవనిచేతనుచున్న, నైవఆప్యం = పొందఁదగి

న దేకాదు. (పూర్వముచెప్పిన మూడున్నూ ఎవని చేతనున్ను పొంద శక్యమైనవికావు. అయినను కల్పించి చెప్పఁబడినది. పరమార్థముగా), ఏతావత్ = ఇంతఫలము, కుతఉ = దేనివలన. ప్రతిగృహ్ణీయాత్ = పొందవచ్చును ? (ఎవనిచేతనున్ను పొందశక్యముకాదని భావము).

తా॥ ఇంతకు పూర్వము గాయత్రిని తెలిసికొనినవానికి ప్రతిగ్రహమువలన దోషము లేదని సామాన్యముగాఁజెప్పఁబడినది. ఇప్పుడు విశేషముగా ఆ దోషము లేదని చెప్పఁబడుచున్నది. ఈ మూడులోకములను పొందువానిచే గాయత్రియొక్క ప్రథమపద విజ్ఞాన ఫలమనుభవింపఁబడిఁదగుచున్నది. ఋగ్యజుస్సామ వేదములను తెలిసికొనువానిచేత గాయత్రి ద్వితీయ పాద విజ్ఞాన ఫలమనుభవింపఁబడినదగుచున్నది. ఈ సమస్త ప్రాణిజాతమును పొందువానిచేత గాయత్రి తృతీయ పాద విజ్ఞాన ఫలమనుభవింపఁబడినదగుచున్నది. ఇట్లు గాయత్రి మూడు పాదములయొక్కయు విజ్ఞానఫలమును పొందిన తరువాత ఈ ప్రకాశించునట్టి సూర్యమండలాంతర్గత పురుష స్వరూపమగు గాయత్రియొక్క పరోరజసి యను తురీయపాదము ఎవనిచేతనున్ను పొందుటకు శక్యమైనదికాదు. ఇట్లు కల్పించి చెప్పుటయెగాక యథార్థముగా ఈ త్రిలోకాదులకును సమముగానుండెడి గాయత్రి ఫలము ఎవని చేతనున్ను పొంద శక్యమైనదికాదు, అని తెలిసికొని గాయత్రిని ఉపాసించువాఁడు సమస్త దోషములను దూరముగా విడుచుచున్నాఁడు.

ఉ॥ తస్యా ఉపస్థానం గాయత్ర్యస్యేకపదీ ద్విపదీ త్రిపదీ చతుష్పద్యపదసి నహి పద్యసే నమస్తే తురీయాయ దర్శతాయ పదాయ పరోరజసేఽసావదో మా ప్రాపదితి యం ద్విష్యా దసావస్మై కామో మా సమర్ధి వా న హైవాస్మై స కామ ఋధ్యతే యస్మా ఏవముపతిష్ఠతేఽహ మదః ప్రాపమితి వా. ॥7॥

ప॥ తస్యాః – ఉపస్థానం – గాయత్రి – అసి – ఏకపదీ –

ద్విపదీ - త్రిపదీ - చతుష్పదీ - అపదసి - న - హి - పద్యసే - నమః - తే - తురీయాయ - దర్శతాయ - పదాయ - పరోరజసే - అసౌ - అదః - మా - ప్రాపత్ - ఇతి - యం - ద్విష్యాత్ - అసౌ - అస్మై - కామః - మా - సమర్ధి - ఇతి - వా - న - హ - ఏవ - అస్మై - సః - కామః - ఋధ్యతే - యస్మై - ఏవం - ఉపతిష్ఠతే - అహం - అదః - ప్రాపం - ఇతి - వా.

ప్ర॥ తస్యాః = ఆ గాయత్రియొక్క, ఉపస్థానం = నమస్కారము, (నమస్కారమంత్రము, ఉచ్యతే = చెప్పబడుచున్నది). హే గాయత్రి = ఓ గాయత్రీ! (త్వం = నీవు), ఏకపదీ = త్రిలోకాత్మకమైన ఒక పాదము కలదానవును, ద్విపదీ = (త్రయీవిద్యా స్వరూపముతో) రెండవపాదముగల దానవును, త్రిపదీ = ప్రణాది రూపమగు మూడవపాదము గలదానవును. అసి = అగుచున్నావు. (చతుర్థేన = నాలుగవదియైన, పదేన=పాదముచేతను), చతుష్పదీ= నాలుగవపాదముగలదానవును, అసి = అగుచున్నావు. (నిరుపాధికేన = ఆకారములేని, స్వేనాత్మనా = స్వకీయమగు రూపముతో); అపత్ = పాదములేనిదానవు. అసి = అగుచున్నావు. (యస్మాత్= ఏకారణమువలన), నహిపద్యసే = తెలియఁబడడములేదో, (అతః= ఆ కారణమువలన), తురీయాయ = తురీయమగు పరోరజసే = పరోరజ యను, దర్శతాయపదాయ = చూడఁబడినదినలెనేయుండెడి పాదముగల, తే = నీ కొఱకు, నమః = నమస్కారము. అసౌ = ఈ శత్రువు, (నిన్ను పొందుటకు విఘ్నము చేయునట్టి శత్రువు), అదః = ఈ కార్యమును, (నిన్ను పొందుటకు విఘ్నము చేయుటను), మాప్రాపత్ = పొందకపోవునుగాక, ఇతి = అని. (స్వయం = స్వకీయముగా, విద్వాన్ = గాయత్రి స్వరూపమును తెలిసినవాఁడు = జ్ఞాని), యం = ఎవనినిగూర్చి, ద్విష్యాత్ = ద్వేషము కలవాఁడగునో, (తంప్రతి = వానిని గూర్చి), అసౌ = ఈ శత్రువు, (అముకనా

మేతినామ = ఈ పేరుగలవాఁడనెడి ప్రసిద్ధమగు పేరును, అగృహ్ణీయాత్ = (గ్రహించవలయును). అస్మై = ఈ పేరుగల శత్రువు కొఱకు, కామః = ఇష్టమగు కోరిక, మాసమర్ధితివా = సమృద్ధిని పొందక పోవుగాక యని, యస్మై = ఏ శత్రువు కొఱకు, ఏవం = ఈ ప్రకారము (గాయత్రీం = గాయత్రిని గూర్చి), ఉపతిష్ఠతే=నమస్కరించుచున్నాఁడో, అస్మై = ఈ శత్రువుకొఱకు, సః = ఆ, కామః = కోరిక, నహైవబుధ్యతే = సమృద్ధిగలదికాదు. అహం=నేను, అదః = ఈ శ్రేయస్సును, ప్రాపమితివా=పొందినవాఁడనయితినని, (యః= ఎవఁడు, గాయత్రీం = గాయత్రినిగూర్చి, ఉపతిష్ఠతే = ధ్యానించు చున్నాఁడో, సః = వాఁడు, తత్ = దానిని, ప్రాప్నోతి = పొందు చున్నాఁడు).

తా॥ గాయత్రియొక్క ధ్యానించఁదగిన రూపముచు చెప్పి, తెలిసికొనఁదగిన గాయత్రియొక్క రూపమును చెప్పుచున్నాఁడు. ఓ గాయత్రి! నీవు త్రిలోకములే ప్రథమపాదము కలదానవును, ఋగ్యజుస్సామములే ద్వితీయ పాదముగాఁగల దానవును, ప్రాణాపానాదికమె తృతీయ పాదము కలదానవును, అగుచున్నావు. నాలుగవది యగు తురీయపాదముచే నాలుగు పాదములను కలదాన వగుచున్నావు. ఏ కారణము వలన నీనాలుగవ పాదము తెలియఁబడదో ఆ కారణము వలన నిరుపాధికమగు స్వస్వరూపముతో పాదము లేనిదానవే యగు చున్నావు. అటువంటి పరోరజసీ యను నీ యొక్క తురీయపాదము కొఱకు నమస్కారము. ఈ నీపదప్రాప్తికి విఘ్నమును చేయునట్టి శత్రువు విఘ్నకార్యమును పొందక పోవుగాక యనియును, ఈ గాయత్రి స్వరూపమును తెలిసిన జ్ఞాని స్వకీయముగా నెవనిని ద్వేషించునో, వానిని గూర్చి, వీఁడు ఈ పేరుగల వాఁడనియును, ఈ శత్రువునకు ఇష్టసంపద కలుగక పోవుగాక యనియును, ఏ శత్రువు నిమిత్తమై గాయత్రిని గూర్చి ఈ ప్రకారము అభిచారక ప్రార్థనను

చేయునో ఆ శత్రువునకు ఇష్టప్రాప్తి కలగదు. నేను ఇష్టమగు శ్రేయస్సును పొందుదునని గాయత్రినిగూర్చి అభ్యుదయిక ప్రార్థనను చేయువాఁడు ఆతని ఇష్టము పొందుచున్నాఁడు.

ఉ॥ ఏతద్ధ వై తజ్జనకో వైదేహో బుడిల మాశ్వతరాశ్వి మువాచ యన్ను హో యద్గాయత్రీవిద బ్రూథా అథ కథగ్ హస్తీభూతో వహసీతి ముఖగ్ హ్యస్యాస్సమ్రాణ్ణ విదాఞ్చకారేతి హోవాచ తస్యా అగ్నిరేవ ముఖం యదిహ వా అపి బహ్వివాగ్నావభ్యాదధతి సర్వమేవ తత్సన్దహ్యత్యేవగ్ హైవైవం విద్యద్యపిబహ్వివ పాపం కురుతే సర్వమేవ తత్సమ్సాయ శుద్ధః పూతోఽజరోఽమృతస్సమ్భవతి. ॥8॥

సప్తమాధ్యాయే చతుర్దశం బ్రాహ్మణమ్.

ప॥ ఏతత్ - హ - వై - తత్ - జనకః - వైదేహః - బుడిలం - ఆశ్వతరాశ్విం - ఉవాచ - యన్ను - హో - యత్ - గాయత్రీవిత్ - అబ్రూథాః - అథ - కథం - హస్తీభూతః-వహసి- ఇతి - ముఖం - హి - అస్యాః - సమ్రాట్ - న - విదాఞ్చకార - ఇతి - హోవాచ - తస్యాః - అగ్నిః - ఏవముఖం - యది - హవై - అపి - బహు - ఇవ - అభ్యాదధతి - సర్వం - ఏవ-తత్ - సన్దహ్యతి- ఏవం - హ - ఏవ - ఏవంవిత్ - యది - అపి-బహు - ఇవ - పాపం - కురుతే - సర్వం - ఏవ - తత్ - సంప్సాయ - శుద్ధః - పూతః - అజరః - అమృతః - సంభవతి.

ప్ర॥ వైదేహః = విదేహదేశ ప్రభువైన, జనకః = జనక మహారాజు, తత్ = ఆ గాయత్రి విషయమై, బుడిలం=బుడిలుఁడను పేరుగల, అశ్వతరాశ్విం = అశ్వతరుని పుత్రుని గూర్చి, ఏతద్ధవై = ఈ ముందు చెప్పఁబోయెడిదానినె, ఉవాచ = పలికెను. యన్నుహో= ఏమియనఁగా, (త్వం = నీవు, అహం = నేను), గాయత్రీవిత్ = గాయత్రిని తెలిసినవాఁడను అని, యత్ =ఏ వాక్యమును, అబ్రూథాః

= పలికితివో; అథ = అట్లు తెలిసికొంటివేని, హస్తీభూతః=హస్తము కలవాఁడవై, కథం = ఎట్లుగా), (ప్రతిగ్రహదోషమును), వహసీతి = వహించుచున్నావని, (ఉవాచ = పలికెను). హేసమ్రాట్ = ఓ జనకమహారాజా! (అహం = నేను), అస్యాః = ఈగాయత్రియొక్క, ముఖం = ముఖమును, నవిదాఞ్చకారేతి = తెలిసికొనకపోతినని, హోవాచ = పలికెను. తస్యాః = ఆ గాయత్రికి, అగ్నిరేవ=అగ్నియె, ముఖం = ముఖము, (లౌకికాః = లౌకులు = జనులు), అగ్నౌ = అగ్నియందు, బహ్వేవ = విస్తారమైన కట్టెలనున్ను, అభ్యాదధతి యదిహ వా అపి = ఉంచిన యెడల, (అగ్ని), తత్=ఆ, సర్వమేవ= సమస్తమునున్ను, సందహ్యాతి = దహించుచున్నది. ఏవంహైవ=ఈ ప్రకారముగానే (యః = ఎవఁడు), ఏవంవిత్ యద్యపి = ఇట్లు గాయత్రిని అగ్నిముఖము కలదానినిగాఁ దెలిసికొనినవాఁడై, బహు= అధికమైన, పాపమివ = పాపమునున్ను, కురుతే= చేయుచున్నాఁడో, (సః = వాఁడు), తత్=ఆ, సర్వమేవ=సమస్త పాపమునే, సంప్సాయ = దహింపఁజేసి, శుద్ధః = పరిశుద్ధుఁడును, పూతః = పవిత్రుఁడును, అజరః = ముసలితనము లేనివాఁడును, అమృతః = మరణములేని వాఁడును, సమ్భవతి = అగుచున్నాఁడు.

తా॥ ఇక్కడ గాయత్రికి ముఖవిధానము కొఱకై అర్థవాదము చెప్పఁబడుచున్నది. విదేహదేశ ప్రభువైన జనకమహారాజు అశ్వతరుని కుమారుఁడగు బుడిలుఁడను వానినిగూర్చి, ఓ బుడిలుఁడా! నీవు గాయత్రిని తెలిసికొంటివని పలికితివే. అట్లు తెలిసికొంటివేని హస్తములు కలవాఁడవై యెటుల ప్రతిగ్రహదోషమును వహించుచున్నావని అడిగెను. ఇట్లడుగఁగా, బుడిలుఁడనువాఁడు, ఓ జనక మహారాజా! నేను ఈ గాయత్రియొక్క ముఖమును తెలిసికొనక పోతిని. అందువల్లనే ఈ పాపమును వహించుచున్నానని పలికెను. గనుక అగ్నియందు జనులు అనేకమైన కట్టెలు ఉంచుచుండగా ఆ

కట్టెల నన్నిటిని ఆ అగ్ని దహింపఁజేసినట్లు ఆ అగ్నియె ముఖముగాఁ గలిగిన గాయత్రిని తెలిసికొనినవాఁడు తాను చేయునట్టి ప్రతిగ్రహ రూపమైన సర్వపాపములను దహింపఁజేసి గాయత్రీస్వరూపుఁడై పరిశుద్ధుఁడును పవిత్రుఁడును జరామరణములు లేనివాఁడును అగుచున్నాఁడు.

ఇట్లు సప్తమాధ్యాయమునందు చతుర్దశ బ్రాహ్మణము సమాప్తము.

సప్తమాధ్యాయము - పఞ్చదశ బ్రాహ్మణము.

ఉ॥ హిరణ్మయేన పాత్రేణ సత్యస్యాపి హితం ముఖం । తత్త్వం పూషన్నపావృణు సత్యధర్మాయ దృష్టయే । పూషన్నేకర్షేయమ సూర్యప్రాజాపత్య వ్యూహరశ్మీన్। సమూహ తేజో యత్తే రూపం కల్యాణతమం తత్తే పశ్యామి। యోఽసావసౌ పురుషః సోఽహమస్మి । వాయురనిలమమృతమథేదం భస్మాన్తగ్ం శరీరం। ఓం 3 క్రతోఽస్మర క్రతగ్ం స్మర కృతో స్మర కృతగ్ం స్మర । అగ్నే నయ సుపథా రాయే అస్మాన్విశ్వాని దేవ వయునాని విద్వాన్। యుయోధ్యస్మజ్జుహురాణమేనో భూయిష్ఠాం తే నమ ఉక్తిం విధేమ. ॥1॥

ఇతిసప్తమాధ్యాయేపఞ్చదశబ్రాహ్మణమ్సప్తమోధ్యాయస్సమాప్తః

ప॥ హిరణ్మయేన - పాత్రేణ - సత్యస్య - అపిహితం-ముఖం - తత్ - త్వం - పూషన్ - అపావృణు - సత్యధర్మాయ-దృష్టయే- పూషన్ - ఏకర్షే - యమ - సూర్య - ప్రజాపత్య - వ్యూహ - రశ్మీన్ - సమూహ - తేజః - యత్ - తే - రూపం - కల్యాణ తమం - తత్ - తే - పశ్యామి - యః - అసౌ - అసౌ - పురుషః - సః - అహం - అస్మి - వాయుః - అనిలం - అమృతం - అథ - ఇదం - భస్మాన్తం - శరీరం - ఓం క్రతో - స్మర -కృతం-స్మర - క్రతో - స్మర - కృతం - స్మర - అగ్నే-నయ -సుపథా- రాయే-

అస్మాన్ - విశ్వాని - దేవ - వయునాని - విద్వాన్ - యుయోధి - అస్మత్ - జుహురాణం - ఏనః - భూయిష్ఠాం - తే - నమఉక్తిం - విధేమ.

ప్ర॥ హిరణ్మయేన=తేజోరూపమైన, పాత్రేణ=పాత్రముచేత, సత్యస్య=సత్యమను పేరుగల బ్రహ్మముయొక్క, ముఖం = ముఖము, అపిహితం = కప్పఁబడినది. హేపూషన్ = జగత్పోషకుఁడవగు ఓ సూర్యుఁడా! త్వం = నీవు, సత్యధర్మాయ = సత్యము ధర్మముగాఁ గల నాకొఱకు, దృష్టయే = సత్యమను బ్రహ్మమును చూపించుట కొఱకు, తత్ = ఆ పాత్రమును, (ఆ సత్యమను బ్రహ్మమునకు మఱుఁగైన తేజోరూపమగు పాత్రమును), అపావృణు = తీసివేయుము. హేపూషన్ = జగత్పోషకుఁడవును, ఏకర్షే = ఏక ఋషియైన వాఁడును, (జగత్తునకు నేత్రమై సర్వమును చూచువాఁడును, లేక, ఒకఁడుగా గమనమును చేయువాఁడును), యమ = సమస్త జగత్తును నియమించువాఁడును, సూర్య = కిరణములను జగత్తుయొక్క ప్రాణములను మిక్కిలి ప్రేరేపణ చేయువాఁడును, ప్రాజాపత్య = ఈశ్వర పుత్రుఁడవును, లేక హిరణ్యగర్భ పుత్రుఁడవునగు ఓ సూర్యుఁడా! (త్వం = నీవు), రశ్మీన్ = కిరణములను, వ్యూహ = పోఁగొట్టుమా! తేజః = తేజస్సును, సమూహ=ఉపసంహరించుమా! తే=నీయొక్క, కల్యాణతమం = శుభములన్నిటిలో అతిశయమైన శుభమగు, రూపం = స్వరూపము, యత్ = ఏదియో, తే = నీయొక్క, తత్ = ఆ రూపమును, పశ్యామి = చూచుచున్నాను. అసౌ=ఈ పురుషుఁడు, (భూః భువః సువః అను వ్యాహృతి రూపమైన ఈ పురుషుఁడు), యః= ఎవఁడో, సః = అటువంటి, అసౌ = ఈ, పురుషః = పురుషుఁడునగు, అహం = నేను, అమృతం = అమృతస్వరూపము, (మరణము లేని వాఁడను), అస్మి = అగుచున్నాను. (నా శరీర పాతానంతరము శరీర మందుండెడి), వాయుః = ప్రాణవాయువు, (యః = ఏదియో, సః= ఆ వాయువు), అనిలం = బాహ్యవాయువును; (ప్రతిగచ్ఛతు =

పొందును), అథ = అనంతరము, ఇదం = ఈ శరీరం = దేహము, భస్మాన్తంసత్ = బూడిద అన్తముగాఁ గలదియై, (పృథివీం = భూమిని, యాతు = పొందునుగాక ! ఇప్పుడు ఆత్మయొక్క సంకల్ప రూపమై మనస్సునందున్న అగ్ని దేవతను ప్రార్థించుచున్నాఁడు) ఓం క్రతో = ప్రణవమే ఆకారముగాఁగల మనోమయ స్వరూపుఁడవగు ఓఅగ్నిహోత్రుఁడా ! స్మర=తలంచవలయును. (మయా=నాచేతను), కృతం = చేయఁబడినదానిని, స్మర = స్మరించుము. హేక్రతో = ఓ మనోమయుఁడువగు అగ్నిహోత్రుఁడా! స్మర = స్మరించవలయును. కృతం = నాచేతఁ జేయఁబడిన దానిని, స్మర = స్మరించుము. ఇట్లు రెండుసార్లు చెప్పుటఆదరణము కొఱకని తెలియవలయును). హేఅగ్నే = ఓ అగ్ని హోత్రుఁడా! అస్మాన్=మమ్మును, సుపథా= శుభమైన మార్గముతో, (ఉత్తరాయణ మార్గము ద్వారా), రాయే = ధనము కొఱకు, (కర్మఫల ప్రాప్తికొఱకు), నయ=తీసికొనిపొమ్ము, హే దేవ= స్వప్రకాశుఁడవగు ఓ స్వామీ! విశ్వాని = సమస్తములైన, వయునాని = ప్రజ్ఞానములను, (సమస్త ప్రాణులయొక్క ప్రజ్ఞానములను), విద్వాన్ = తెలిసినవాఁడవు, (అసి = అగుచున్నావు). జుహురాణం = కుటిలమైన, ఏనః = పాపమును, అస్మత్=మా వలన, యుయోధి = పోఁగొట్టుము. భూయిష్ఠాం = మిక్కిలి అధికమైన, నమ ఉక్తిం= నమస్కార వాక్యమును తే = నీ కొఱకు, విధేమ = చేసెదము.

తా॥ జ్ఞానకర్మలను సముచ్చయముగా ఆచరించువాఁడు సూర్యుని గుఱించి ప్రార్థించుచున్నాఁడు. ఓ సూర్యుఁడా! ఇష్టమగు వస్తువును ఒక పాత్రముతో మఱుగుపఱచి దాఁచినట్లు సత్యమను పేరుగల పరబ్రహ్మము నీతేజోమయమైన మండలముతో కప్పఁబడి యున్నది. జగత్పోషకుఁడైన సూర్యుఁడా! మండలమును సత్యధర్ముఁడనైన నాకు ఆ సత్యరూపబ్రహ్మమును చూపుటకు తీసివేయుము. ఓ సూర్యుఁడా ! కిరణములను పోఁగొట్టుము. నీ తేజస్సును ఉపసంహా

రించుము. అన్నిటిలో శుభతరమైన నీ రూపమును మేము చూచె దము. భూరాది వ్యాహృతి త్రయాత్మకుఁడైన ఈ ప్రత్యక్షమగు సూర్యాత్మక పురుషుఁడనైన నేను అమృతస్వరూపుఁడ నగుచున్నాను. ఈ శరీరపాతానంతరము ఈ దేహమందున్న ప్రాణవాయువు వెలు పల నుండెడి వాయువును పొందునుగాక. ఈ దేహము భస్మమైనదై భూమిని పొందునుగాక యని ప్రార్థించి, అనంతరముఆత్మసంకల్పరూప మైన మనస్సునందలి అగ్ని దేవతను ప్రార్థించుచున్నాఁడు. ఓ అగ్ని హోత్రుఁడా! నాచేతఁ జేయఁబడు పుణ్యమును తలంచి మమ్మును శుభమైన ఉత్తరాయణ మార్గముద్వారా కర్మఫల ప్రాప్తికొఱకు తీసికొనిపొమ్ము. స్వయంప్రకాశుఁడవగు ఓ స్వామీ! నీవు ప్రాణుల యొక్క అన్ని ప్రజ్ఞలను తెలిసినవాఁడవు గనుక కుటిలమైన పాప మును మా వలన పోఁగొట్టుము. నీ కొఱకు మిక్కిలి అధికమైన నమ. స్కార వాక్కును చేయుదుము అని ప్రార్థించుచున్నాఁడు.

సప్తమాధ్యాయము సమాప్తము.



శుక్ల యజుర్వేద - కాణ్వశాఖాయామ్.

# బృహదారణ్యకోపనిషత్

## అష్టమాధ్యాయము

హరిః ఓమ్: పూర్ణమదః పూర్ణమిదం పూర్ణాత్పూర్ణ ముదచ్యతే (చ్యతే).
పూర్ణస్య పూర్ణమాదాయ పూర్ణ మేవా వశిష్యతే.

---

ఓమ్ శాన్తిః శాన్తిః శాన్తిః (చూ. 7, 1 1.)

ఉ॥ యో హ వై జ్యేష్ఠం చ శ్రేష్ఠం చ వేద జ్యేష్ఠశ్చ శ్రేష్ఠశ్చ స్వానాం భవతి ప్రాణో వై జ్యేష్ఠశ్చ శ్రేష్ఠశ్చ జ్యేష్ఠశ్చ శ్రేష్ఠశ్చ స్వానాంభవ త్యపి చ యేషాం బుభూషతి య ఏవంవేద. ॥1॥

ప॥ యః - హ - వై - జ్యేష్ఠం - చ - శ్రేష్ఠం- చ-వేద - ష్ఠః - చ - శ్రేష్ఠః - చ - స్వానాం - భవతి - ప్రాణః - వై- ష్ఠః - చ - శ్రేష్ఠః - చ - జ్యేష్ఠః - చ - శ్రేష్ఠః - చ-స్వానాం - భవతి - అపి - చ - యేషాం - బుభూషతి - యః - ఏవం - వేద.

ప్ర॥ యోహవై = ఎవఁడైతే, (ప్రాణము యొక్క), జ్యేష్ఠం చ = జ్యేష్ఠత్వమునున్ను, శ్రేష్ఠంచ = శ్రేష్ఠత్వమునున్ను, వేద = తెలిసికొనుచున్నాఁడో, (సః = వాఁడు), స్వానాం = జ్ఞాతులలో, జ్యేష్ఠశ్చ = జ్యేష్ఠుఁడును, (పెద్దవాఁడును), శ్రేష్ఠశ్చ = శ్రేష్ఠుఁడును, భవతి = అగుచున్నాఁడు. ప్రాణోవై = ప్రాణమె, (సమస్త ఇంద్రియములలో), జ్యేష్ఠశ్చ = జ్యేష్ఠమైనదియును, (నిషేకకాలము మొదలుకొని గర్భమును పోషించునది ప్రాణము గనుక చక్షురాదులలో ప్రాణమె జ్యేష్ఠత్వమును పొందినది). శ్రేష్ఠశ్చ = శ్రేష్ఠమైనదియును, (భవతి = అగుచున్నది). (ప్రాణముయొక్క శ్రేష్ఠతను

ఇక్కడనే సంవాదముతో చూపించెదము). యః = ఎవఁడు, ఏవం= ఈ ప్రకారము, (ప్రాణముయొక్క జ్యేష్ఠత్వ శ్రేష్ఠత్వములను), వేద = తెలిసికొనుచున్నాఁడో, (సః = వాఁడు), స్వానాం=జ్ఞాతులలో, జ్యేష్ఠశ్చ = జ్యేష్ఠుఁడును, శ్రేష్ఠశ్చ = శ్రేష్ఠుఁడును, భవతి= అగుచున్నాఁడు. అపిచ = మఱియును, యేషాం = ఎవరిలోపల, (జనుఁడు జ్యేష్ఠత్వ శ్రేష్ఠత్వములను), బుభూషతి = అవుటకు కోరుచున్నాఁడో, (తేషాం = వారిలోపల, జ్యేష్ఠశ్చ = శ్రేష్ఠశ్చ = శ్రేష్ఠుఁడును, భవతి = అగుచున్నాఁడు).

తా॥ ఇంతకు పూర్వము ప్రాణమే గాయత్రియని చెప్పఁబడినది. వాగాదీంద్రియములు గాయత్రిగాఁ జెప్పకపోవుటకు గారణమేమనఁగా వాగాదీంద్రియము లన్నిటిలో ప్రాణమునకే జ్యేష్ఠత్వ శ్రేష్ఠత్వములు కలిగియుండుటవలన అట్లు చెప్పఁబడినది. అట్టి ప్రాణముయొక్క జ్యేష్ఠత్వ శ్రేష్ఠత్వములను వివరించుటకై ఇది ఆరంభింపఁబడుచున్నది. ముందు ప్రాణోపాసనా ఫలమును చెప్పుచున్నాఁడు. ప్రాణమే సమస్త ఇంద్రియములలో అధికమని శ్రేష్ఠమని తెలిసికొని యుపాసించువాఁడు జ్ఞాతులలో అధికుఁడును శ్రేష్ఠుఁడును అగుచున్నాఁడు. ఇట్టి ప్రాణోపాసనా ఫలమును అపేక్షించెడి వానికి ప్రాణముయొక్క జ్యేష్ఠ శ్రేష్ఠములు వివరింపఁబడుచున్నవి. ప్రాణమే సర్వేంద్రియములలో నిషేకకాలము మొదలుకొని గర్భమును పోషించునది గనుక ఇదియే చక్షురాదీంద్రియము లన్నిటికిని జ్యేష్ఠమైనదియును శ్రేష్ఠమైనదియునై యున్నది, ఇట్లు ప్రాణముయొక్క జ్యేష్ఠత్వ శ్రేష్ఠత్వములను తెలిసికొని యుపాసించువాఁడు జ్ఞాతులలో జ్యేష్ఠుఁడును శ్రేష్ఠుఁడును అగుటయే గాక తాను ఎవరిలో జ్యేష్ఠత్వశ్రేష్ఠత్వములను కోరుచున్నాఁడో, వారియందఱిలోనున్న, జ్యేష్ఠుఁడును శ్రేష్ఠుఁడు నగుచున్నాఁడు.

**ఉ॥ యో హ వై వసిష్ఠాం వేద వసిష్ఠస్స్వానాం భవతి వాగ్వై వసిష్ఠా**

వసిష్ఠస్స్వానాం భవత్యపి చ యేషాం బుభూషతి య ఏవం వేద. ॥2॥

ప॥ యః - హా వై - వసిష్ఠాం - వేద - వసిష్ఠః - స్వానాం- భవతి - వాక్ - వై - వసిష్ఠా - వసిష్ఠః - స్వానాం - భవతి - అపి - చ - యేషాం - బుభూషతి - యః - ఏవం - వేద.

ప్ర॥ యోహావై = ఎవఁడైతే, వసిష్ఠాం = వసిష్ఠతను, (వాచాలత్వమును), వేద= తెలిసికొనుచున్నాఁడో, (సః=వాఁడు), స్వానాం = జ్ఞాతులలో, వసిష్ఠః = వసిష్ఠు, (వాచాలుఁడు), భవతి = అగుచున్నాఁడు. వాగ్వై = వాక్కే, వసిష్ఠా = వాచాలకమైనది. యః = ఏవఁడు, ఏవం = ఈ ప్రకారము. వేద= తెలిసికొనుచున్నాఁడో, (సః = వాఁడు), స్వానాం = జ్ఞాతులలో, వసిష్ఠః = వాచాలుఁడు, భవతి = అగుచున్నాఁడు. అపిచ = మఱియును, యేషాం = ఎవరిలోపల, బుభూషతి=(వాచాలుఁడగుటకు) కోరుచున్నాఁడో, (తేషాం = వారిలోపల, వసిష్ఠః = వాచాలుఁడు, భవతి = అగుచున్నాఁడు),

తా॥ వాచాలత్వమును తెలిసికొని యుపాసించువాఁడు జ్ఞాతులందఱిలో వసిష్ఠ ఋషివలెనే మిక్కిలి వాచాలుఁడగుచున్నాఁడు. వాగింద్రియమె వాచాలకమైనది గనుక అట్టి వాగింద్రియము వసిష్ఠరూపముగా (వాచాలరూపమునుగా) తెలిసికొని యుపాసించువాఁడు జ్ఞాతులలోనున్న ఇంకను తాను కోరెడి అందఱిలోనున్న మిక్కిలి నిర్భయముగా మాట్లాడునట్టి వాచాలుఁడగుచున్నాఁడు.

ఉ॥ యో హ వై ప్రతిష్ఠాం వేద ప్రతితిష్ఠతి సమే ప్రతితిష్ఠతి దుర్గే చక్షుర్వై ప్రతిష్ఠా చక్షుషా హి సమే చ దుర్గే చ ప్రతితిష్ఠతి ప్రతితిష్ఠతి సమే ప్రతితిష్ఠతి దుర్గే య ఏవం వేద. ॥3॥

ప॥ యః - హా వై - ప్రతిష్ఠాం - వేద - ప్రతితిష్ఠతి - సమే- ప్రతితిష్ఠతి - దుర్గే - చక్షుః - వై - ప్రతిష్ఠా - చక్షుషా - హి - సమే - చ - దుర్గే - చ - ప్రతితిష్ఠతి - ప్రతితిష్ఠతి - సమే - ప్రతితిష్ఠతి - దుర్గే - యః - ఏవం - వేద.

ప్ర॥ యోహవై = ఎవఁడైతే, ప్రతిష్ఠాం = స్థితిని, వేద = తెలిసికొనుచున్నాఁడో, (సః = వాఁడు), సమే = సమదేశమునందు, లేక, మంచికాలమునందు, ప్రతితిష్ఠతి = ఉంటున్నాఁడు. దుర్గే = విషమమైన, దేశమునందు లేక, దుర్భిక్షకాలమునందు, ప్రతితిష్ఠతి = ఉంటున్నాఁడు. చక్షుర్వై = నేత్రమే, ప్రతిష్ఠా = స్థితియైనది. చక్షుషాహి = నేత్రముచేతనే, సమేచ=సమ దేశ సమకాలములయందును, దుర్గేచ=విషమ దేశ దుర్భిక్ష కాలములయందును, ప్రతితిష్ఠతి=ఉంటున్నాఁడు. యః = ఎవఁడు, ఏవం = ఈ ప్రకారము, (సమస్తమునకు నేత్రమే స్థితియైనదని), వేద = తెలిసికొనుచున్నాఁడో, (సః = వాఁడు), సమే = సమదేశమునందు, సమకాలమునందు, ప్రతితిష్ఠతి = ఉంటున్నాఁడు. దుర్గే = విషమదేశమునందును, దుర్భిక్షకాలమునందును, ప్రతితిష్ఠతి = ఉంటున్నాఁడు.

తా॥ స్థితిని తెలిసికొనువాఁడు సమ విషమ దేశములయందును సుభిక్ష దుర్భిక్ష కాలములయందును మంచి స్థితిని పొందియుంటున్నాఁడు. నేత్రముచేతనే సర్వము సమ విషమ దేశములయందును మంచి చెడు కాలములయందును మంచి స్థితిని చెందియుంటున్నది. కనుక నేత్రమే సర్వమునకు స్థితియైయున్నదని తెలిసికొని యుపాసించువాఁడు సమ విషమ దేశములయందును సుభిక్ష దుర్భిక్ష కాలములయందును మంచి స్థితిని పొందియుంటున్నాఁడు.

ఉ॥ యో హ వై సంపదం వేద సగ్ హాస్మై పద్యతే యం కామం కామయతే శ్రోత్రం వై సమ్పత్ శ్రోత్రే హీమే సర్వే వేదా అభిసమ్పన్నాః సగ్ హాస్మై పద్యతే యం కామం కామయతే య ఏవం వేద. ॥4॥

ప॥ యః – హవై – సంపదం – వేద – సం – హ – అస్మై – పద్యతే – యం – కామం – కామయతే – శ్రోత్రం – వై – సమ్పత్ – శ్రోత్రే – హి – ఇమే – సర్వే-వేదాః – అభిసమ్పన్నాః

– సం – హ – అస్మై – పద్యతే – యం – కామం – కామయతే – యః – ఏవం – వేద.

ప్ర॥ యోహవై = ఎవఁడైతే, సంపదం = సంపద్గుణముతోఁ గూడుకొనిన దానిని, వేద = తెలిసికొనుచున్నాఁడో, (సః=వాఁడు), యం = ఏ, కామం = కోరికను, కామయతే = కోరుచున్నాఁడో, (సః = ఆ కోరిక), అస్మై = ఈ తెలిపిన వానికొఱకు, సంపద్యతేహ = ఈ కలుగుచున్నది. శ్రోత్రంవై=శ్రోత్రమె, సమ్పత్ =సంపద్గుణముతోఁ గూడుకొనినది. శ్రోత్రేహి = శ్రోత్రేంద్రియ ముండగానే, ఇమే = ఈ, సర్వేవేదాః = సమస్త వేదములు, అభిసమ్పన్నాః = సమృద్ధములైనవి, (భవన్తి = అగుచున్నవి). యః=ఎవఁడు, ఏవం = ఈప్రకారము, (శ్రోత్రేంద్రియము సంపద్గుణముతోఁగూడుకొనినదని), వేద = తెలిసికొనుచున్నాఁడో, (సః = వాఁడు), యంకామం = ఏ కోరికను, కామయతే = కోరుచున్నాఁడో. (సః=ఆ కోరిక), అస్మై= ఈ తెలిపిన వానికొఱకు, సమ్పద్యతేహ = కలుగుచున్నది. (వాని కోరిక ఫలించుచున్నది).

తా॥ శ్రోత్రేంద్రియముండగా ఈ సమస్త వేదములు సమృద్ధము లగుచున్నవి గనుక శ్రోత్రేంద్రియమె సంపద్గుణయుక్తమని తెలిసికొని యుపాసించువాఁడు తాను కోరిన కోరికల యొక్క ఫలమును పొందుచున్నాఁడు.

ఉ॥ యో హ వా ఆయతనం వేదాయతనగ్ స్వానాం భవత్యాయతనం జనానాం మనో వా ఆయతనమాయతనగ్ స్వానాం భవత్యాయతనం జనానాం య ఏవం వేద. ॥5॥

ప॥ యః – హవై – ఆయతనం–వేద - ఆయతనం–స్వానాం– భవతి – ఆయతనం – జనానాం – మనః – వై – ఆయతనం – ఆయతనం – స్వానాం – భవతి – ఆయతనం – జనానాం – యః – ఏవం – వేద.

ప్ర॥ యోహవై = ఎవఁడైతే, ఆయతనం = ఆశ్రయమును, వేద = తెలిసికొనుచున్నాఁడో, (సః = వాఁడు), స్వానాం = జ్ఞాతులకు, ఆయతనం = ఆశ్రయము, భవతి=అగుచున్నాఁడు. (అన్యేషాం = ఇతరులగు), జనానాం = జనులకును, ఆయతనం = ఆశ్రయము, (భవతి = అగుచున్నాఁడు), మనోవై = మనస్సే, ఆయతనం = ఆశ్రయమైనది. (ఇంద్రియములకును విషయములకును ఆశ్రయమైనది). యః = ఎవఁడు, ఏవం = ఈ ప్రకారముగా, వేద = తెలిసికొనుచున్నాఁడో, (సః = వాఁడు). స్వానాం = జ్ఞాతులకు, ఆయతనం = ఆశ్రయము, భవతి = అగుచున్నాఁడు. జనానాం = ఇతర జనులకును, ఆయతనం = ఆశ్రయము, (భవతి = అగుచున్నాఁడు).

తా॥ ఇంద్రియములకును విషయములకును అన్నిటికిని మనస్సే ఆశ్రయమైనది యని తెలిసికొని సర్వాశ్రయమగు మనోపాసన చేయువాఁడు జ్ఞాతులకును ఇతరులకును ఆశ్రయ మగుచున్నాఁడు.

ఉ॥ యో హ వై ప్రజాపతిం వేద ప్రజాయతే హ ప్రజయా పశుభీ రేతో వై ప్రజాపతిః ప్రజాయతే హ ప్రజయా పశుభిర్య ఏవం వేద. ॥6॥

ప॥ యః - హవై - ప్రజాపతిం - వేద - ప్రజాయతే-హ - ప్రజయా - పశుభిః - రేతః - వై - ప్రజాపతిః - ప్రజాయతే - హ - ప్రజయా - పశుభిః - యః - ఏవం - వేద.

ప్ర॥ యోహవై = ఎవఁడైతే, ప్రజాపతిం = సృష్టికర్తయైన బ్రహ్మను, వేద = తెలిసికొనుచున్నాఁడో, (సః=వాఁడు), ప్రజయా = సంతానముతోను, పశుభిః = పశువులతోను, ప్రజాయతేహ = పుట్టుచున్నాఁడు. (సంపన్నుఁ డగుచున్నాఁడు). రేతోవై = రేతస్సే, (శుక్రము), ప్రజాపతిః = బ్రహ్మము; (రేతపా యని చెప్పుటచే ప్రజననేంద్రియము చూడఁబడుచున్నది). యః = ఎవఁడు, ఏవం=ఈప్రకారము, వేద = తెలిసికొనునో, (సః = వాఁడు), ప్రజయా = సంతా

నముతోను, పశుభిః = పశువులతోను, ప్రజాయతేహ = మిక్కిలి సంపన్నుఁడగుచున్నాఁడు.

తా॥ ఉపస్థేంద్రియము సృష్టికర్తయగు బ్రహ్మనుగాఁ దెలిసికొనువాఁడు సంతానముతో పశుధనములతో సంపన్నుఁడగుచున్నాఁడు.

ఉ॥ తే హేమే ప్రాణా అహగ్ శ్రేయసే వివదమానా బ్రహ్మ జగ్ముస్తద్ధోచుః కో నో వసిష్ఠ ఇతి తగ్ హోవాచ యస్మిన్వ ఉత్క్రాన్త ఇదగ్ శరీరం పాపీయోమన్యతే స వో వసిష్ఠ ఇతి. ॥7॥

ప॥ తే - హ - ఇమే - ప్రాణాః - అహం - శ్రేయసే-వివదమానాః - బ్రహ్మ - జగ్ముః - తత్ - హ - ఊచుః - కః - నః - వసిష్ఠః - ఇతి - తం - హోవాచ - యస్మిన్ - వః - ఉత్క్రాన్తే-ఇదం - శరీరం - పాపి - యః - మన్యతే - సః - వః-వసిష్ఠః- ఇతి.

ప్ర॥ తే = ఆ ప్రసిద్ధములగు, ఇమేహప్రాణాః = ఈ వాగాదీంద్రియములు, అహం = నేను, శ్రేయసే = శ్రేయస్సుకొఱకు, (శ్రేయముగల దానవగుచున్నానని), వివదమానాః = కలహించినవై, బ్రహ్మ = ప్రజాపతిని గూర్చి, జగ్ముః = పోయినవి తం = ఆ ప్రజాపతిని గూర్చియే, నః = మాలోపల, వసిష్ఠః = వసిష్ఠుఁ, (నివసించువాఁడును, నివసింపఁజేయువాఁడును). కః = ఎవఁడు, ఇతి=అని, ఊచుః = పలికినవి. తత్ = ఆ ప్రజాపతి, వః=మీలోపల, యస్మిన్ = ఎవఁడు, ఉత్క్రాన్తే = లేచిపోవుచుండఁగా, ఇదం = ఈ, శరీరం = దేహమును, పాపియః = మిక్కిలి పాపమైన దానినిగా, (లోకః = లోకము), మన్యతే = తలంచుచున్నదో, సః = అది, వః = మీలోపల, వసిష్ఠఇతి = వసిష్ఠుఁఅని. (నివసించునది, నివసింపజేయునది, యని), హోవాచ = పలికెను.

తా॥ ఇంతకు పూర్వము చెప్పఁబడిన వసిష్ఠత్వాది గుణములు వాగాదీంద్రియములను పొందినవి కావు. ఇవి యన్నియును ముఖ్యమైన

ప్రాణమునే పొందియున్నవని నిరూపించుటకు ఈ కథను చెప్పుచు న్నాడు. ప్రసిద్ధములగు ఈ వాగాదీంద్రియము లన్నియుఁ గూడుకొని నేను అభివృద్ధికొఱకగుచున్నాను; నేను అభివృద్ధికొఱకగుచున్నా నని అన్యోన్యము కలహించుకొని సృష్టికర్త యగు ప్రజాపతియొద్దకు పోయి, ఓ ప్రజాపతీ! మాలోపల తాను ఉండి సర్వమును నిలిపెడిది యేది యని అడిగినవి. ఇట్లు అడుగఁబడిన, ఆ ప్రజాపతి, ఓ వాగాదీంద్రియములారా! మీలోపల ఎవఁడు ఈ శరీరమును విడిచినప్పుడు లోకులు ఈ శరీరము మిక్కిలి పాపమని నీచముగాఁ దలంచు చున్నారో అదియే మీలోపల తాను నిలిచియుండి సర్వమును నిల్పు నట్టిది యగుచున్నది గనుక వసిష్ఠమని చెప్పెను.

ఉ॥ వాగ్ఘోచ్చక్రామ సా సంవత్సరం ప్రోష్యాగత్యోవాచ కథ మశకత మదృతే జీవితుమితి తే హోచుర్యథా కలా అనదన్తో వాచా ప్రాణన్తః ప్రాణేన పశ్యన్తశ్చక్షుషా శృణ్వన్తః శ్రోత్రేణ విద్వాగ్ సో మనసా ప్రజాయమానా రేతసైవ మజీవిష్మేతి ప్రవివేశ హ వాక్. ॥8॥

ప॥ వాక్ - హ - ఉచ్చక్రామ - సా - సంవత్సరం-ప్రోష్య-ఆగత్య - ఉవాచ - కథం - అశకత - మదృతే - జీవితుం - ఇతి - తే - హ - ఊచుః - యథా - కలాః - అవదన్తః - వాచా - ప్రాణన్తః - ప్రాణేన-పశ్యన్తః - చక్షుషా-శృణ్వన్తః - శ్రోత్రేణ-విద్వాంసః - మనసా - ప్రజాయమానాః-రేతసా - ఏవం అజీవిష్మ-ఇతి - ప్రవివేశ - హ - వాక్.

ప్ర॥ వాక్ = వాక్కు, (అస్మాత్ = ఈ శరీరమునుండి), ఉచ్చక్రామహ = లేచిపోయెను. సా = ఆ వాక్కు, సంవత్సరం = సంవత్సరము, ప్రోష్య=మఱియొక దేశమునందుండి, ఆగత్య=వచ్చి, (యూయం = మీరు), మదృతే = నేను లేకుండ, జీవితుం=జీవించుటకు, కథం = ఎట్లుగా, అశకత = సమర్థులరైతిరి, ఇతి = అని,

ఉవాచ = పలికెను. తే=వాగింద్రియమునకు వేఱైన ఆ ప్రాణములు, హోచుః = పలికినవి. యథా = ఏ ప్రకారము, (లోకే = లోకము నందు), కలాః = మూఁగలు, వాచా = వాక్కుతో, అవదన్తః = పలుకనివారై, ప్రాణేన = ప్రాణముచేత, ప్రాణన్తః = ప్రాణవ్యాపారమును చేయుచు, చక్షుషా = నేత్రముతో, పశ్యన్తః=చూచుచు, శ్రోత్రేణ = చెవితో, శృణ్వన్తః = వినుచు, మనసా=మనస్సుతో, విద్వాంసః = (కార్యాకార్యములను) తెలిసికొనుచు, రేతసా= రేతస్సు చేత, ప్రజాయమానాః = సంతానమును కనుచు, (భవంతి=ఉంటూ యున్నారో), ఏవం = ఈ ప్రకారము, (వయం = మేము), అజీవిష్మేతి = జీవించుచున్నామని, (తే = ఆ ప్రాణములు, హోచుః = పలికెను), (ఇట్లు వాగింద్రియేతరములైన చక్షురాది ప్రాణములచే పలుకఁబడిన), వాక్ = వాక్కు, (శరీరం=శరీరమును), ప్రవివేశహ= ప్రవేశించెను.

తా॥ ఈ ప్రకారము ఆ వాగాదింద్రియము లన్నియు బ్రహ్మ చేత పలుకఁబడినవై తమ సామర్థ్యమును పరీక్షించుటకు క్రమముగా దేహమును విడిచిపోయెను. వాటిలో మొదటిదియగు వాగింద్రియము దేహమును విడిచిపోయి, ఒక సంవత్సరము వేఱొక ప్రదేశమునం దుండి, తిరిగివచ్చి, తక్కిన వానినిగూర్చి, ఓ చక్షురాంద్రియము లారా! మీరు నేను లేకుండ నెట్లుగా జీవించుటకు సమర్థులైతిరని యడుగఁగా, తక్కిన ఇంద్రియము లన్నియు; ఓ వాగింద్రియమా! లోకమునందు మూఁగవారు వాక్కుతో పలుకనివారైనను ప్రాణముతో ప్రాణవ్యాపారమును చేయుచు నేత్రముతో చూచుచు శ్రోత్రముతో వినుచు మనస్సుతో కార్యాకార్యములను తెలిసికొనుచు రేతస్సుతో సంతానమును కనుచు నెట్లు జీవించియుండిరో, ఈ ప్రకారముగానే, మేమున్ను జీవించుచున్నామని పలికిరి. ఇట్లు ఇంద్రియములచే పలుకఁబడి, వాక్కు, తాను ఈ శరీరమందుండి

తక్కిన వాటిని నిలుపుటకు శక్తికలదానను కాను గనుక నాకు వసిష్ఠత్వము లేదని తెలిసికొని, తిరిగి ఆ దేహమునందే ప్రవేశించెను.

ఉ॥ చక్షుర్హోచ్చక్రామ తత్సంవత్సరం ప్రోష్యాగత్యోవాచ కథమశకత మదృతే జీవితుమితి తే హోచుర్యథా అన్ధా అపశ్యన్తశ్చక్షుషా ప్రాణన్తః ప్రాణేన వదన్తో వాచా శృణ్వన్తః శ్రోత్రేణ విద్వాంసో మనసా ప్రజాయమానా రేతసైవమజీవిష్మేతి ప్రవివేశ హ చక్షుః. ॥9॥

ప॥ చక్షుః - హ - ఉచ్చక్రామ - తత్ - సంవత్సరం - ప్రోష్య - ఆగత్య - ఉవాచ - కథం - అశకత - మదృతే-జీవితుం-ఇతి - తే - హోచుః - యథా - అన్ధాః - అపశ్యన్తః - చక్షుషా-ప్రాణన్తః - ప్రాణేన - వదన్తః - వాచా - శృణ్వన్తః-శ్రోత్రేణ - విద్వాంసః - మనసా - ప్రజాయమానాః - రేతసా - ఏవం - అజీవిష్మ - ఇతి ప్రవివేశ - హ - చక్షుః.

ప్ర॥ చక్షుర్హ = నేత్రమును, (అస్మాత్=ఈ శరీరమునుండి), ఉచ్చక్రామ = లేచిపోయెను. తత్ = ఆ నేత్రము, సంవత్సరం = సంవత్సరము, ప్రోష్య=పరదేశమందుండి, అగత్య=వచ్చి, (యూయం = మీారు), మదృతే = నేను లేకుండ, జీవితుం = జీవించుటకు, కథం = ఎట్లుగా, అశకత=సామర్థ్యము కలవారైతిరి, ఇతి=అని, ఉవాచ = పలికెను. (లోకే = లోకమునందు), అన్ధాః=గ్రుడ్డివాండ్రు, చక్షుషా = నేత్రముతో, అపశ్యన్తః=చూడనివారై, ప్రాణేన=ప్రాణముతో, ప్రాణన్తః = ప్రాణవ్యాపారమును చేయుచున్నవారై, వాచా = వాక్కుతో, వదన్తః=పలుకుచున్నవారై, శ్రోత్రేణ=శ్రోత్రముతో, శృణ్వన్తః = వినుచున్నవారై, మనసా=మనస్సుతో, విద్వాంసః = (కార్యాకార్యములను) తెలిసికొనుచున్నవారై, రేతసా=రేతస్సుతో, ప్రజాయమానాః = సంతానము కనుచున్నవారై, యథా=ఏ ప్రకారము, (భవంతి = ఉంటున్నారో), ఏవం = ఈ ప్రకారముగానే,

(వయం = మేము), అజీవిష్మేతి = జీవించుచున్నామని, తే = నేత్రే తరములైన ఆ యింద్రియము లన్నియు, హోచుః = పలికెను. (ఇట్లు చక్షురింద్రియేతరములైన వాగాదీంద్రియములచేఁ బలుకఁబడిన), చక్షుః = నేత్రము, (శరీరం = దేహమును), ప్రవివేశహ = ప్రవేశించెను.

తా॥ ఆ యింద్రియములలో నేత్రేంద్రియము దేహమును విడిచిపోయి ఒక సంవత్సరము వేఱొక దేశమునందుండి తిరిగి వచ్చి తక్కినవాటిని గూర్చి, ఓ వాగాదీంద్రియములారా! మీరు నేను లేకుండ నెట్లుగా జీవించుటకు సమర్థులైతిరని యడుగఁగా, తక్కిన యింద్రియము లన్నియు, ఓ నేత్రేంద్రియమా! లోకమునందు గ్రుడ్డివారలు నేత్రముతో చూడనివారైనను ప్రాణముతో ప్రాణవ్యాపారమును జేయుచు వాక్కుతో పలుకుచు చెవితో వినుచు మనస్సుతో కార్యాకార్యములను తెలిసికొనుచు రేతస్సుతో సంతానమునుకనుచు నెట్లు జీవించియుండిరో ఈ ప్రకారమే మేమున్ను జీవించుచున్నామని పలికెను. ఇట్లు వాగాదీంద్రియములచే పలుకఁబడిన, నేత్రము, తాను శరీరమందుండి తక్కిన వాటిని నిలుపుటకు శక్తికలదానను కాదు గనుక నాకు వసిష్ఠత్వము లేదని తెలిసికొని, తిరిగి ఆ దేహమునందే ప్రవేశించెను.

ఉ॥ శ్రోత్రగ్ హోచ్చక్రామ తత్సంవత్సరం ప్రోష్యాగత్యోవాచ కథమశకత మదృతే జీవితు మితి తే హోచుర్యథా బధిరా అశృణ్వన్తః శ్రోత్రేణ ప్రాణన్తః ప్రాణేన వదన్తో వాచా పశ్యన్తశ్చక్షుషా విద్వాగ్ సో మనసా ప్రజాయమానా రేతసైవమజీవిష్మేతి ప్రవివేశ హ శ్రోత్రం. ॥10॥

ప॥ శ్రోత్రం - హ - ఉచ్చక్రామ - తత్ - సంవత్సరం - ప్రోష్య - ఆగత్య - ఉవాచ - కథం - అశకత - మదృతే-జీవితుం- ఇతి - తే - హ - ఊచుః - యథా - బధిరాః - అశృణ్వన్తః -

శ్రోత్రేణ - ప్రాణన్తః - ప్రాణేన - వదన్తః-వాచా - పశ్యన్తః-చక్షుషా - విద్వాంసః - మనసా - ప్రజాయమానాః - రేతసా - ఏవం - అజీవిష్మ - ఇతి - ప్రవివేశ - హ - శ్రోత్రం.

ప్ర॥ శ్రోత్రంహ = చెవియే, (అస్మాత్=ఈ శరీరమునుండి), ఉచ్చక్రామ = లేచిపోయెను. తత్ = ఆ శ్రోత్రము, సంవత్సరం= సంవత్సరము, ప్రోష్య = ఇతర దేశమునందుండి, ఆగత్య = వచ్చి, (తక్కిన ఇంద్రియములను గూర్చి, ఓ వాగాదీంద్రియములారా! మీరు), మదృతే = నేను లేకుండ, జీవితుం = జీవించుటకు, కథం = ఎట్లు, అశకతేతి = సమర్థులైతిరని, ఉవాచ = పలికెను. తే = ఆ వాగాదీంద్రియములు, హోచుః=పలికినవి. (ఓ శ్రోత్రేంద్రియమా! లోకమునందు), బధిరాః = చెవిటివారు, శ్రోత్రేణ = చెవితో, అశృణ్వన్తః = విననివారై, ప్రాణేన = ప్రాణముతో, ప్రాణన్తః= ప్రాణవ్యాపారము చేయువారై, వాచా = వాక్కుతో, వదన్తః = పలుకుచున్నవారై, చక్షుషా = నేత్రముతో, పశ్యన్తః = చూచు చున్నవారై, మనసా = మనస్సుతో, విద్వాంసః = మంచి చెడుగు లను తెలిసికొనినవారై, రేతసా = రేతస్సుతో, ప్రజాయమానాః= సంతానమును కనుచున్నవారై, యథా = ఏ ప్రకారము (జీవించు చున్నారో), ఏవం = ఈ ప్రకారముగానే, (వయం = మేము), అజీ విష్మేతి = జీవించుచున్నామని, (ఆ వాగాదీంద్రియములు పలికినవి. ఇట్లు పలుకఁబడిన), శ్రోత్రం = శ్రోత్రేంద్రియము, (శరీరం=శరీ రమును), ప్రవివేశహ = ప్రవేశించెను.

తా॥ ఇంద్రియములలో శ్రోత్రేంద్రియము దేహమును విడిచి పోయి ఒక సంవత్సరము వేఱొక దేశమునందుండి తిరిగివచ్చి తక్కిన వాటిని గూర్చి, ఓ యింద్రియములారా! మీరు నేను లేకుండ జీవిం చుటకు ఎట్లు సమర్థులైతిరని యడుగఁగా, తక్కిన ఇంద్రియములు, ఓ శ్రోత్రేంద్రియమా! లోకమునందు చెవిటివారు చెవితోవినని

వారైనను ప్రాణముతో ప్రాణవ్యాపారమును చేయుచున్నవారై వాక్కుతో బలుకుచున్నవారై నేత్రముతో చూచుచున్నవారై మనస్సుతో మంచి చెడుగులను తెలిసికొనుచున్నవారై రేతస్సుతో సంతానమును కనుచున్నవారై జీవించియున్నట్లు మేమున్ను జీవించుచున్నామని పలుకఁగా, శ్రోత్రేంద్రియము తాను శరీరమందుండి తక్కిన వాటిని నిలుపుటకు శక్తికలదికాదు గనుక నాకు వసిష్ఠత్వము లేదని తెలిసికొని తిరిగి ఆ దేహమునందే ప్రవేశించెను.

ఉ॥ మనో హోచ్చక్రామ తత్సంవత్సరం ప్రోష్యాగత్యోవాచ కథమశకత మదృతే జీవితుమితి తే హోచుర్యథా ముగ్ధా అవిద్వాగ్ంసో మనసా ప్రాణన్తః ప్రాణేన వదన్తో వాచా పశ్యన్తశ్చక్షుషా శృణ్వన్తశ్శ్రోత్రేణ ప్రజాయమానా రేతసైవమజీవిష్మేతి ప్రవివేశ హ మనః. ॥11॥

ప॥ మనః - హ - ఉచ్చక్రామ - తత్ - సంవత్సరం - ప్రోష్య - ఆగత్య - ఉవాచ - కథం - అశకత-మదృతే-జీవితుం - ఇతి - తే - హ - ఊచుః - యథా - ముగ్ధాః - అవిద్వాంసః - మనసా - ప్రాణన్తః - ప్రాణేన - వదన్తః - వాచా - పశ్యన్తః- చక్షుషా - శృణ్వన్తః - శ్రోత్రేణ - ప్రజాయమానాః - రేతసా- ఏవం - అజీవిష్మ - ఇతి - ప్రవివేశ - హ - మనః.

ప్ర॥ మనోహ=మనస్సు, (ఈ శరీరమునుండి), ఉచ్చక్రామ= లేచిపోయెను. తత్ = ఆ మనస్సు, సంవత్సరం = సంవత్సరము ప్రోష్య = పరదేశమునకు పోయియుండి, ఆగత్య = వచ్చి, (తక్కిన ఇంద్రియములను గూర్చి, ఓ వాగాదీంద్రియములారా! మీరు), మదృతే = నేను లేకుండా, జీవితుం = జీవించుటకు, కథం=ఎట్లు, అశకతేతి = సమర్థులైతిరని, ఉవాచ = పలికెను. తే = ఆ వాగాదీంద్రియములు, హోచుః=పలికినవి (ఓ మనస్సా! లోకమునందు), ముగ్ధాః = మూఢులు, మనసా = మనస్సుతో, అవిద్వాంసః=(కార్యా

కార్యములను) తెలిసికొననివారై, ప్రాణేన=ప్రాణముతో, ప్రాణన్తః = ప్రాణవ్యాపారమును చేయుచున్నవారై, వాచా = వాక్కుతో, వదన్తః = పలుకుచున్నవారై, చక్షుషా = నేత్రముతో, పశ్యన్తః = చూచుచున్నవారై, శ్రోత్రేణ = చెవితో, శృణ్వన్తః = వినుచున్నవారై, రేతసా = రేతస్సుతో, ప్రజాయమానాః=సంతానము కనుచున్నవారై, యథా=ఏ ప్రకారము (జీవించుచున్నారో), ఏవం= ఈ ప్రకారముగానే, (వయం = మేము), అజీవిష్మేతి=జీవించుచున్నామని, (ఆ వాగాదీంద్రియములు పలికినవి. ఇట్లు పలుకఁబడిన), మనః = మనస్సు, (శరీరం = దేహమును), ప్రవివేశహ = ప్రవేశించెను.

తా॥ ఈ యింద్రియములలో అంతరింద్రియమగు మనస్సు ఈ దేహమునువిడిచిపోయి ఒక సంవత్సరము వేఱొక తావున ఉండి తిరిగివచ్చి తక్కినవాటినిగూర్చి, ఓవాగాదీంద్రియములారా ! మీరు నేను లేకుండా జీవించుటకు ఎట్లు సమర్థులైతిరని యడుగఁగా, ఆ యింద్రియములు. ఓమనస్సా ! లోకమునందు మూఢులు మనస్సుతో కార్యాకార్యములను తెలిసికొననివారైనను ప్రాణముతో ప్రాణవ్యాపారమును చేయుచున్నవారై వాక్కుతో పలుకుచున్నవారై నేత్రముతో చూచుచున్నవారై రేతస్సుతో సంతానమునుకనుచున్న వారై జీవించియున్నట్లు మేమున్నూ జీవించుచున్నామని పలుకఁగా, మనస్సు, తాను శరీరమునందుండి తక్కినవాటిని నిలుపుటకు శక్తి కలదికాదు గనుక నాకు వసిష్ఠత్వము లేదని తెలిసికొని ఆ మనస్సు తిరిగి ఆ దేహమునందే ప్రవేశించెను.

ఉ॥ రేతో హోచ్చక్రామ తత్సంవత్సరం ప్రోష్యాగత్యోవాచకథ మశకత మదృతే జీవితుమితి తే హోచుర్యథా క్లీబా అప్రజాయమానా రేతసా ప్రాణన్తః ప్రాణేన వదన్తో వాచా పశ్యన్తశ్చక్షుషా శృణ్వన్తశ్శ్రోత్రేణ విద్వాꣳసో మనసైవ మజీవిష్మేతి ప్రవివేశ హ రేతః. ॥12॥

ప॥ రేతః - హ - ఉచ్చక్రామ - తత్ - సంవత్సరం - ప్రోష్య - ఆగత్య - ఉవాచ - కథం - అశకత - మదృతే - జీవితుం - ఇతి - - తే - హ -ఊచుః - యథా క్లీబాః - అప్రజాయమానాః - రేతసా - ప్రాణన్తః- ప్రాణేన - వదన్తః - వాచా- పశ్యన్తః - చక్షుషా - శృణ్వన్తః - శ్రోత్రేణ - విద్వాంసః - మనసా - ఏవం - అజీవిష్మ - ఇతి - ప్రవివేశ - హ - రేతః.

ప్ర॥ రేతః = రేతస్సు. (ఈశరీరమునుండి), ఉచ్చక్రామ = లేచిపోయెను. తత్ = ఆ రేతస్సు, సంవత్సరం = సంవత్సరము, ప్రోష్య = పర దేశమునకుపోయియుండి, ఆగత్య = వచ్చి, (తక్కిన వాగాదీంద్రియములను గూర్చి, ఓ ఇంద్రియములారా! మీరు), మదృతే = నేనులేకుండా, జీవితుం = జీవించుటకు, కథం = ఎట్లు, అశకతేతి = సమర్థులైతిరని, ఉవాచ = పలికెను. తేహ = ఆ వాగాదీంద్రియములు. ఊచుః = పలికినవి. (ఓ రేతస్సా! లోకమునందు) క్లీబాః = నపుంసకులు, రేతసా =రేతస్సుతో, అప్రజాయమానాః= సంతానమునుకననివారై, ప్రాణేన = ప్రాణముతో, ప్రాణన్తః = ప్రాణనవ్యాపారమును చేయుచున్నవారై, వాచా = వాక్కుతో, వదన్తః = పలుకుచున్నవారై, చక్షుషా = నేత్రముతో, పశ్యన్తః= చూచుచున్నవారై, శ్రోత్రేణ = శ్రోత్రముతో, శృణ్వన్తః = వినుచున్నవారై, మనసా = మనస్సుతో, విద్వాంసః = (కార్యాకార్యములను) తెలిసికొనినవారై, యథా = ఏప్రకారము, (జీవించుచున్నారో), ఏవం = ఈప్రకారము, (వయం= మేము), అజీవిష్మేతి= జీవించుచున్నామని. (ఆవాగాదీంద్రియములుపలికినవి. ఇట్లుపలుకఁబడిన), రేతః = రేతస్సు. (శరీరం = దేహమును), ప్రవివేశహ = ప్రవేశించెను.

తా॥ ఈ ఇంద్రియములలో ఉపస్థేంద్రియము దేహమును విడిచిపోయి ఒక సంవత్సరము వేఱొకతావునందుండి తిరిగివచ్చి తక్కిన

వాగాదీంద్రియములను గూర్చి, ఓ వాగాదీంద్రియములారా! మీరు నేను లేకుండ నెట్లు జీవించుటకు సమర్థులైతిరి యని యడుగఁగా, ఆ యింద్రియములు ఓ యుపస్థేంద్రియమా! లోకమునందు నపుంసకులు రేతస్సుతో సంతానమును కననివారై నను ప్రాణవాయువుతో ప్రాణనవ్యాపారమును చేయువారై వాక్కుతో పలుకుచున్నవారై నేత్రముతోఁ జూచుచున్నవారై శ్రోత్రముతో వినుచున్నవారై మనస్సుతో కార్యాకార్యములను తెలిసికొనుచున్నవారై జీవించుచున్నట్లు మేమున్ను జీవించుచున్నామని పలుకఁగా ఉపస్థేంద్రియము తాను శరీరమునందుండి తక్కిన వానిని నిలుపుటకు శక్తి కలదు కాదు, కనుక నాకు వసిష్ఠత్వము లేదని తెలిసికొని ఆ యుపస్థేంద్రియము తిరిగి ఆ దేహమునందే ప్రవేశించెను.

ఉ॥ అథ హ ప్రాణ ఉత్క్రమిష్యన్యథా మహాసుహయః సైన్ధవః పడ్వీశశఙ్కూన్సంబృహేదేవగ్ం హైవేమాన్ప్రాణా న్సంబబర్హ తే హోచుర్మా భగవ ఉత్క్రమీర్న వై శక్ష్యామ స్త్వదృతే జీవితు మితి తస్యో మే బలిం కురుతేతి తథేతి. ॥13॥

ప॥ అథ – హ – ప్రాణః – ఉత్క్రమిష్యన్ – యథా–మహాసుహయః – సైన్ధవః – పడ్వీశశఙ్కూన్ – సంబృహేత్ – ఏవం – హ – ఏవ - ఇమాన్ – ప్రాణాన్ – సంబబర్హ – తే-హ-ఊచుః– మా – భగవః – ఉత్క్రమీః – న – వై – శక్ష్యామః-త్వదృతే – జీవితుం – ఇతి - తస్య – ఉ – మే – బలిం – కురుత - ఇతి-తథా – ఇతి.

ప్ర॥ అథహ = అనంతరము, ప్రాణః = ముఖ్యప్రాణము, ఉత్క్రమిష్యన్ = లేచిపోవుటను చేయునదియై, సైన్ధవః = సింధుదేశమునందుఁ బుట్టిన, మహాసుహయః = గొప్పదియును శుభలక్షణము గలదియునగు గుఱ్ఱము, పడ్వీశశఙ్కూన్ = పాదబన్ధన శంకువులను, (కట్టుకొయ్యలను), యథా = ఏ ప్రకారము, సంబృహేత్ =

పెకలించునో, ఏవంహైవ = ఈ ప్రకారముగానే, ఇమాన్ = ఈ, ప్రాణాన్ = వాగాదీంద్రియములను, సంబబర్హ = ఎత్తి వేసెను. (ఆయా స్థానములనుండి భ్రష్టములగునట్లు చేసెను). (అప్పుడు), తేహ = ఆ వాగాదీంద్రియములు, ఊచుః=పలికినవి, హేభగవః = శ్రేష్ఠమగు ఓ ముఖ్యప్రాణమా! (త్వం = నీవు), మోత్క్రమీః = లేచి పోకుము. త్వదృతే = నీవు లేకుండా, (వయం = మేము), జీవితుం = జీవించుటకు, నవై శక్ష్యామఇతి = సమర్థులము కామని, (ఊచుః = పలికినవి). (అప్పుడు ముఖ్యప్రాణము ఆ ఇంద్రియములనుగూర్చి, ఓ ఇంద్రియములారా! మీరు), తస్యైఉ = ఆ ప్రసిద్ధమైన, మే=నాకు, బలిం = పూజను, కురుతేతి=చేయుఁడీ! యని, (ఉవాచ=పలికెను). (అనంతరము ఆ వాగాదీంద్రియములు), తథేతి = సరేనని, (ఊచుః = పలికినవి).

తా॥ ఇట్లు సర్వేంద్రియములు క్రమముగా తమతమ శక్తిని పరిక్షించుకొనిన తరువాత ముఖ్యప్రాణమున్ను దేహమును వీడిచిపోవ నిచ్ఛయించినదై, లోకమునందు, సింధుదేశమునందుఁ బుట్టిన శుభ లక్షణముగల గొప్ప గుఱ్ఱము పరీక్షించుటకు అశ్వశిక్షకునిచే నెక్కఁ బడినదై పాదబంధనములగు మేకులను పెకికినట్లు ఈవాగాదీంద్రియముల నన్నిటిని వాటి వాటి స్థానములనుండి భ్రష్టములగునట్లు చేయఁగా ఆ వాగాదీంద్రియములు, శ్రేష్ఠమగు ఓ ముఖ్య ప్రాణమా! నీవు లేచి పోకుము. నీవు లేకుండా మేము జీవించుటకు సమర్థులము కామని పలికెను. అప్పుడా ముఖ్యప్రాణము, ఓ వాగాదీంద్రియములారా! మీరు ఆ ప్రసిద్ధమైన పూజను నాకు చేయుఁడీ యని పలికెను. అప్పుడా వాగాది ప్రాణములన్నియు ఆ ప్రకారమే చేసెదమని ప్రతిజ్ఞను చేసెను.

ఉ॥ సా హ వాగువాచ యద్వా అహం వసిష్ఠాస్మి త్వం తద్వసిష్ఠోఽసీతి యద్వా అహం ప్రతిష్ఠాస్మి త్వం తత్ప్రతిష్ఠోఽసీతి చక్షుర్య

ద్వా అహాగ్ సమ్పదస్మిత్వం తత్సమ్పదసీతి శ్రోత్రం యద్వా అహామాయతనమస్మి త్వం తదాయ తనమసీతి మనో యద్వా అహం ప్రజాతి రస్మిత్వం తత్ప్రజాతి రసీతి రేత స్తస్యో మే కిమన్నం కిం మే వాస ఇతి యదిదం కించాశ్వభ్య ఆక్రిమిభ్య ఆకీట పతఙ్గేభ్య స్తత్తేఽన్నమాపో వాస ఇతి న హ వా అస్యానన్నం జగ్ధం భవతి నానన్నం ప్రతిగృహీతం య ఏవమే తదనస్యాన్నం వేద తద్విద్వాగ్ సః శ్రోత్రియా అశిష్య న్త ఆచామ న్త్య శిత్వా చా చామ న్త్యేత మేవ తదనమనగ్నం కుర్వన్తో మన్య న్తే. ॥14॥

ఇత్యష్టమాధ్యాయే ప్రథమబ్రాహ్మణమ్.

ప॥ సా - హ - వాక్ - ఉవాచ - యత్ - వై - అహం-వసిష్ఠా - అస్మి - త్వం - తద్వసిష్ఠః - అసి - ఇతి - యత్ - వై-అహం - ప్రతిష్ఠా - అస్మి - త్వం - తత్ప్రతిష్ఠః - అసి - ఇతి - చక్షుః - యత్ - వై - అహం - సమ్పత్ - అస్మి - త్వం - తత్సమ్పత్ - అసి - ఇతి - శ్రోత్రం - యత్-వై - అహం-ఆయతనం-అస్మి - త్వం - తదాయతనం - అసి - ఇతి - మనః - యత్ - వై - అహం - ప్రజాతిః - అస్మి - త్వం - తత్ప్రజాతిః - అసి - ఇతి-రేతః - తస్య - ఉ - మే - కిం - అన్నం - కిం - మే - వాసః - ఇతి - యత్ - ఇదం - కించ - ఆశ్వభ్యః - ఆక్రిమిభ్యః - ఆకీట పతఙ్గేభ్యః - తత్ - తే - అన్నం - ఆపః - వాసః - ఇతి - న - హ వై - అస్య - అనన్నం - జగ్ధం- భవతి - న - అనన్నం - ప్రతి గృహీతం - యః - ఏవం - ఏతత్ - అనస్య - అన్నం - వేద - తత్ - విద్వాంసః - శ్రోత్రియాః - అశిష్య న్తః - ఆచామ న్తి - అశిత్వా - చ - ఆచామ న్తి - ఏతం - ఏవ - తదనం - అనగ్నం-కుర్వ న్తః - మన్య న్తే.

ప్ర॥ సాహా = ఆ ప్రసిద్ధమగు; వాక్ = వాక్కు, ఉవాచ = పలికెను. అహం = నేను, యద్వై = ఏ, వసిష్ఠా = వసిష్ఠత్వము

కలదానను, అస్మి = అగుచున్నానో, (ఓ ముఖ్యప్రాణమా!) త్వం= నీవు, తద్వసిష్ఠః = ఆ వసిష్ఠత్వము గలదానవు, అసి=అగుచున్నావు. ఇతి = అని, (పలికెను). చక్షుః = నేత్రేంద్రియము, అహం=నేను, యద్వై = ఏ, ప్రతిష్ఠా = స్థితిగలదానను, అస్మి = అగుచున్నాను. (ఓ ముఖ్యప్రాణమా), త్వం = నీవు, తత్ప్రతిష్ఠః=ఆ స్థితిగలదానవు, అసీతి = అగుచున్నావని, (ఉవాచ = పలికెను). శ్రోత్రం=శ్రోత్రేంద్రియము, అహం = నేను, యద్వై = ఏ, సమ్పత్ = సంపద్గుణము కలదానను, అస్మి = అగుచున్నానో, (ఓ ముఖ్యప్రాణమా), త్వం= నీవు, తత్సమ్పత్ = ఆ సంపద్గుణము కలదానవు, అసీతి=అగుచున్నావని, (ఉవాచ = పలికెను). మనః = మనస్సు, అహం = నేను, యద్వై = ఏ, ఆయతనం = ఆశ్రయ గుణము కలదానను, అస్మి = అగుచున్నానో, (ఓ ముఖ్యప్రాణమా), త్వం = నీవు, తదాయతనం = ఆ ఆశ్రయము కలదానవు, అసి = అగుచున్నావు. ఇతి = అని, (ఉవాచ = పలికెను). రేతః = రేతస్సు, అహం = నేను, ప్రజాతిః = సంతానోత్పాదక గుణము కలదానను, అస్మి = అగుచున్నాను. (ఓ ముఖ్యప్రాణమా), త్వం = నీవు, తత్ప్రజాతిః=ఆ సంతానమును కనునట్టి గుణము కలదానవు, అసి = అగుచున్నావు. ఇతి = అని, (ఉవాచ = పలికెను). (ఇట్లు వాగాదీంద్రియములు పలుకఁగా ఆ ముఖ్య ప్రాణము), తస్యఉ = అటువంటి, మే = నాకు, అన్నం = అన్నము, కిం = ఏది ? మే = నాకు, వాసః = వస్త్రము, కిం=ఏది? ఇతి = అని, (ఉవాచ = పలికెను). (తరువాత ఆ వాగాదీంద్రియములు), ఆశ్వభ్యః = కుక్కల పర్యంతమున్ను, ఆక్రిమిభ్యః = పురుగుల పర్యంతమున్ను, ఆకీటపతఙ్గేభ్యః = పురుగులు, పక్షులు మొదలగు వాని వఱకున్ను, (లోకే = లోకమునందు), ఇదం=ఈ, కించ= కొంచెమైనను, (అన్నంనామ = అన్నమను పేరుగలది), యత్ = ఏదియో, తత్ = అది, తే = నీకు, అన్నం = అన్నము, ఆపః =

ఉదకము, వాసః = వస్త్రము, ఇతి=అని, (ముఖ్యప్రాణమునుగూర్చి, ఉవాచ = పలికెను). అస్య = ఈ ప్రాణమునకు, జగ్ధం = తినఁబడినది, అనన్నం = తినఁగూడనిది, నహవై భవతి = కానేకాదు. ప్రతిగృహీతం = పరిగ్రహింపఁబడినది, అనన్నం = తినఁగూడనిది, న = కాదు, యః = ఎవఁడు, ఏవం = ఈ ప్రకారము, అనస్య= ప్రాణము యొక్క, ఏతత్ = ఈ, అన్నం = అన్నమును, వేద = తెలిసికొనుచున్నాఁడో, (ప్రాణాత్మదర్శినః = ప్రాణభూతమైన ఆత్మను చూచెడివానికి, భక్షింపఁగూడనిదియును భక్షింపఁదగినదియె యగును, గ్రహింపఁగూడనిదియును గ్రహింపఁదగినదియె యగును). (ఏ కారణము వలన ప్రాణమునకు ఉదకమే వస్త్రముగా నున్నదో, ఆ కారణమువలన), విద్వాంసః = జ్ఞానులగు, శ్రోత్రియాః = వేదాధ్యయనమును చేసిన బ్రాహ్మణులు, అశిష్యన్తః = భోజనము చేయఁబోవువారై, ఆచామన్తి=ఆచమనీయమును చేయుచున్నారు. అశిత్వాచ= భోజనము చేసియును, ఆచామన్తి=ఆచమనమును చేయుచున్నారు. ఏతమేవ=ఈఆచమనమునే, కుర్వన్తః = చేయుచున్నవారై, తదనం = ఆప్రాణమును, అనగ్నం = వస్త్రము కలదానినిగా, మన్యన్తే = తలంచుచున్నారు.

తా॥ ఇట్లు వాగాదీంద్రియము లన్నియు ముఖ్యప్రాణమును గూర్చి తమకుండెడి వసిష్ఠత్వాది గుణములన్నియు, ఓ ముఖ్య ప్రాణమా ! నీకున్ను కలిగి యున్నవని పలుకఁగా, అప్పుడా ముఖ్యప్రాణము, ఓ వాగాదీంద్రియములారా ! మీయొక్క వసిష్ఠత్వాది గుణములు గల నాకు అన్నమేది ? వస్త్రమేది ? యని ప్రశ్నచేయఁగా, అప్పుడా వాగాదీంద్రియములు, ఓ ముఖ్యప్రాణమా ! ఈ భూలోకమునందలి సమస్త ప్రాణులయొక్క అన్నమే నీకు అన్నము, ఉదకమే నీకు వస్త్రమని పలికినవి. ఇట్లు ప్రాణముయొక్క అన్నమును తెలిసికొనినవానికి భక్షించఁగూడని అన్నమును, గ్రహించఁగూడని అన్నమును లేనే

లేదు. ఆ ప్రాణమునకు ఉదకమే వస్త్రమగుటవలననే లోకమునందలి పండితులగు వేదాధ్యయనమును చేసినవారు, భోజనము చేయుటకు ముందును, భోజనము చేసినతరువాతను, ఆచమనమును చేయుచు, దీనినె ప్రాణమునకు వస్త్రమునుగా భావించుచున్నారు.

ఇట్లు అష్టమాధ్యాయమునందు ప్రథమ బ్రాహ్మణము సమాప్తము.

## అష్టమాధ్యాయము - ద్వితీయ బ్రాహ్మణము

ఉ॥ శ్వేతకేతుర్హ్వా ఆరుణేయః పఞ్చాలానాం పరిషద మాజగామ స ఆజగామ జైబలిం ప్రవాహణం పరిచార యమాణం త ముదీక్ష్యాభ్యువాద కుమారా 3 ఇతి స భో 3 ఇతి ప్రతి శుశ్రావాను శిష్టోఽన్వసి పిత్రేత్యోమితి హోవాచ. ॥1॥

ప॥ శ్వేతకేతుః - హ - వై - ఆరుణేయః - పఞ్చాలానాం- పరిషదం - ఆజగామ - సః - ఆజగామ - జైబలిం - ప్రవాహణం- పరిచారయమాణం - తం - ఉదీక్ష్య - అభ్యువాద - కుమారా 3 - ఇతి - సః - భో 3 - ఇతి - ప్రతిశుశ్రావ - అనుశిష్టః - అను - అసి - పిత్రా - ఇతి - ఓం - ఇతి - హ - ఉవాచ.

ప్ర॥ ఆరుణేయః = అరుణియను వాని కుమారుడగు, శ్వేతకేతుర్హ్వై = శ్వేతకేతువను పేరు గలవాడు, (యశఃప్రధానాయ = కీర్తియొక్క ప్రాధాన్యము కొఱకు, పిత్రా = తండ్రియైన అరుణి చేత, అనుశిష్టః = ఆజ్ఞాపింపఁబడినవాఁడై), పఞ్చాలానాం = పాంచాల దేశములయొక్క, పరిషదం = సభను, (గత్వా = పొంది, జిత్వా = జయించి), (రాజుయొక్క సభను జయించెదనను గర్వముతో), జైబలిం = జీబలుఁడను వాని కుమారుఁడును, (భృత్యైః = సేవకులచేత), పరిచారయమాణం = సేవింపఁబడుచున్న వాఁడునగు, ప్రవాహణం=ప్రవాహణుఁడను రాజునుగూర్చి, ఆజగామ=వచ్చెను. సః = ఆ రాజు, ఆజగామ = వచ్చుచున్న, తం = ఆ శ్వేతకేతు

వును, ఉదీక్ష్య = చూచి, కుమారా 3 ఇతి = ఓ కుమారా యని సంబోధించి, అభ్యువాద = పలికెను. సః = ఆ శ్వేతకేతువు, భో 3 ఇతి = ఓ రాజా యని, ప్రతిశుశ్రావ=తిరిగి పలికెను. (రాజా=రాజు). పిత్రా = తండ్రిచేత, అనుశిష్టః = అనుసరించి ఆజ్ఞాపింపఁబడినవాఁడు, అన్వసి = అగుచున్నావా, ఇతి=అని, (ఉవాచ=పలికెను). (ఇతరః= అన్యుఁడగు శ్వేతకేతువు), ఓమితి = అవునని, హోవాచ=పలికెను.

తా॥ సప్తమాధ్యాయముయొక్క అంతమునందు జ్ఞానకర్మల సముచ్చయమును చేయువానిచే అగ్నివలన మంచిమార్గము యాచింపఁబడెను. ఆమార్గములెన్నియో, యే మార్గముచే నేది పొందఁదగి యున్నదియో, దానినంతయు చెప్పవలయునని ఈ బ్రాహ్మణ ముప క్రమింపఁబడుచున్నది. ఇక్కడ కర్మద్వారా పంచాగ్ని దర్శనము ఉత్తరమార్గమును పొందుటకు సాధనమని విధింపఁబడెను. ఈ ప్రకారము సమస్తమైన సంసారగతియొక్క యుపసంహారమగుచున్నది. ఇదియె కర్మకాండయొక్క నిష్ఠయని దీనిని తెలియపఱచుటకు నిచ్ఛగలవాఁడై ఈకథను చెప్పుచున్నాఁడు. అరుణపుత్రుఁడగు శ్వేతకేతువనువాఁడు తండ్రియగు అరుణిచేత లోకమునందు యశస్సును సంపాదించుటకు ఆజ్ఞాపింపఁబడినవాఁడై పంచాలదేశములలోని గొప్పసభను గూర్చి పోయి జయించి రాజుయొక్క సభనుకూడ జయించవలయునను గర్వముతో అనేకులగు సేవకులచే సేవింపఁబడుచుండెడి జీబలుఁడను రాజు కుమారుఁడైన ప్రవాహణుఁడను వానినిగూర్చి పోయెను. ఆ రాజు ఇట్లు గర్విష్ఠుఁడై వచ్చుచున్న ఆ శ్వేతకేతువును చూచి ఓ కుమారుఁడా యని సంబోధించి యడుగఁగా ఆ శ్వేతకేతువు కోపముగలవాఁడై ఓ రాజా యని తిరిగి పలికెను. అప్పుడా రాజు ఓ శ్వేతకేతూ! నీవు మీ తండ్రిచే ఆజ్ఞాపింపఁబడినవాఁడవైతివా యని పలికెను. అనంతరము ఆ శ్వేతకేతువు ఓ రాజా! అవునని తిరిగి పలికెను

ఉ॥ వేత్థ యథేమాః ప్రజాః ప్రయత్యో విప్రతి పద్యన్తా 3 ఇతి నేతి హోవాచ వేత్థోయథేమం లోకం పునరాపద్యన్తా 3 ఇతి నేతి హోవాచ వేత్థోయథాఽసౌ లోక ఏవం బహుభిః పునః పునః ప్రయద్భిర్న సమ్పూర్యతా 3 ఇతి నేతి హోవాచ వేత్థోయతిథ్యా మాహుత్యాగ్ హుతాయామాపః పురుషవాచో భూత్వా సము త్థాయ వదన్తీ 3 ఇతి నేతి హైవోవాచ వేత్థో దేవయానస్య వా పథః ప్రతిపదం పితృయాణస్యవా యత్కృత్వా దేవయానంవా పన్థానం ప్రతిపద్యన్తే పితృయాణం వాపి హి న ఋషేర్వచ శ్శ్రుతం । ద్వే సృతీ అశృణవం పితౄణామహం దేవానాముత మర్త్యానాం । తాభ్యామిదం విశ్వమేజత్సమేతి యదన్తరా పితరం మాతరం చేతి । నాహమత ఏకంచ న వేదేతి హోవాచ. ॥2॥

ప॥ వేత్థ – యథా – ఇమాః – ప్రజాః – ప్రయత్యః – విప్రతి పద్యన్తా 3 - ఇతి – న – ఇతి – హోవాచ – వేత్థ – ఉ – యథా – ఇమం – లోకం – పునః – అపద్యన్తా 3 – ఇతి – న – ఇతి – హోవాచ – వేత్థ – ఉ – యథా – అసౌ – లోకః – ఏవం–బహుభిః – పునః – పునః – ప్రయద్భిః – న – సమ్పూర్యతా 3 – ఇతి – న– ఇతి – హోవాచ – వేత్థ – ఉ – యతిథ్యాం – ఆహుత్యాం-హుతా యాం – ఆపః – పురుషవాచః – భూత్వా – సముత్థాయ – వదన్తీ 3 – ఇతి – న – ఇతి – హ – ఏవ – ఉవాచ – వేత్థ – ఉ – దేవ యానస్య – వా – పథః – ప్రతిపదం – పితృయాణస్య – వా – యత్ - కృత్వా – దేవయానం – వా – పన్థానం – ప్రతిపద్యన్తే - పితృయాణం – వా – అపి – హి – నః–ఋషేః - వచః – శ్రుతం- ద్వే - సృతీ – అశృణవం - పితౄణాం – అహం – దేవానాం–ఉత- మర్త్యానాం – తాభ్యాం – ఇదం – విశ్వం – ఏజత్ – సమేతి – యదన్తరా – పితరం – మాతరం – చ - ఇతి – న – అహం – అతః – ఏకం – చ – న – వేద – ఇతి – హ – ఉవాచ.

ప్ర॥ (రాజా = ప్రవాహణుఁడను రాజు), ఇమాః = ఈ, ప్రజాః = ప్రజలు, ప్రయత్యః = మరణమును పొందినవారై, యథా = ఏప్రకారము, విప్రతిపద్యన్తాఇతి = ఏమార్గముచేత దేని పొందుదురూ యని విచారణగలవారైరో, (తత్ = దానిని, త్వం=నీవు), వేత్థ = తెలిసికొంటివా, (అని ఆ శ్వేతకేతువునుగూర్చి పలికెను. ఆ శ్వేతకేతువు), నేతి = తెలియదని, హోవాచ = పలికెను. (ఈ ప్రజలు), ఇమం = ఈ, లోకం = లోకమును, యథా = ఏ ప్రకారము, పునః = తిరిగి, ప్రతిపద్యన్తాఇతి = పొందుచున్నారో, (దీనిని నీవు), వేత్థఉ = తెలిసికొంటివా యని, (ఆ రాజు శ్వేతకేతువును అడిగెను. అప్పుడు శ్వేతకేతువు), నేతి = గుర్తెఱుఁగనని, హోవాచ = పలికెను. ఏవం = ఈ ప్రకారము, పునః పునః = తిరిగి తిరిగి, ప్రయద్భిః = మరణమును పొందుచున్న, బహుభిః = అనేకులచేతను, అసౌలోకః = స్వర్గలోకము, యథా = ఏ ప్రకారము, న సమ్పూర్యతా ఇతి = నిండింపఁబడడములేదో, (దీనిని నీవు), వేత్థ ఉ= తెలిసికొంటివా యని (ఆ రాజు అడిగెను. శ్వేతకేతువు), నేతి = తెలిసికొనలేదని, హోవాచ = పలికెను. యతిథ్యాం = ఎన్నిసంఖ్యగల, ఆహుత్యాం = ఆహుతి, హుతాయాం = హోమము చేయఁబడుచుండగా, ఆపః = ఉదకములు, పురుషవాచః = పురుషవాక్కులు, భూత్వా = అయి, సముత్థాయ = పుట్టినవై, వదన్తీఇతి = ధ్వని చేయుచున్నవో, (దీనిని నీవు), వేత్థ ఉ = తెలిసికొంటివా యని, (ఆ రాజు అడిగెను. అప్పుడు శ్వేతకేతువు), నేతిహైవ = లేనేలేదని, హోవాచ = పలికెను. (జనులు), యత్ = ఏ కర్మను, కృత్వా = చేసి, దేవయానంవాపన్థానం = దేవయానమును ఉత్తరాయణ మార్గము గాని, పితృయాణంవా = పితృయానమను దక్షిణాయణమార్గమునుగాని, ప్రతిపద్యన్తే = పొందుచున్నారో, దేవయానస్యవాపథః = దేవయానమను ఉత్తరాయణ మార్గముయొక్క దైనను, పితృ

యాణస్యవా = పితృయాణమను దక్షిణాయన మార్గముయొక్క-మైనను, (తత్ = ఆ పూర్వోక్తమైన), ప్రతిపదం = ప్రతిపదమను కర్మను, వేత్థ= తెలిసికొంటివా యని, (ఆ రాజు అడుగఁగా, శ్వేతకేతువు నేను ఎఱుఁగనని పలికెను). అపిహి = మఱియును, నః = మాకు, శ్రుతం = వినఁబడిన, ఋషేః = మంత్రముయొక్క-, వచః= వాక్యము, (అస్తి = కలదు). ద్వే = రెండైన, సృతీ=మార్గములను, అహం = నేను, అశ్రుణవం = వింటిని. (ఆ రెండుమార్గములలో నొకటియగు దక్షిణాయనమార్గము). పితౄణాం=పితృదేవతలయొక్క-(లోకం = లోకమును, పొందించునది). (రెండవదియగు ఉత్తరాయణమార్గము), దేవానాం= దేవతలయొక్క-, (లోకం=లోకమును, పొందించునది). ఉత = మఱియును, మర్త్యానాం = మనుష్యులకు, ఏజత్ = చలనాత్మకమైన ప్రాణిసమూహముగల, ఇదం = ఈ, విశ్వం = ప్రపంచము, తాభ్యాం=ఆ రెండు మార్గములతో, సమేతి= మిక్కిలి పొందుచున్నది. (ఆ రెండుమార్గము లెక్క-డ యున్నవి యనఁగా), యదంతరా=ఏ తల్లిదండ్రులమధ్య యందున్నవో, (అటువంటి), పితరం = తండ్రియును, మాతరంచ = తల్లియును, (వీరిద్దఱియొక్క- మధ్యయందున్నవి. ఆ తల్లిదండ్రు లెవరనిన, భూమ్యంతరిక్షముల మధ్యమందున్నవి). ఇతి = అని, (అహం = నేను, అశ్రుణవం= వింటినని, నీవు తెలిసికొంటివా యని ఆ రాజు శ్వేతకేతువునుగూర్చి పలికెను. తిరిగి ఆ శ్వేతకేతువు), అహం = నేను, అతః = ఈప్రశ్న సముదాయమునుండి, ఏకంచన = ఒక ప్రశ్ననున్ను, నవేద=గుర్తెఱుఁగను, ఇతి = అని, హోవాచ = పలికెను.

తా॥ అప్పుడా రాజు, ఓ శ్వేతకేతూ! నీవు ఈ ప్రజలు మరణమును పొందిన తరువాత ఏ మార్గముతో ఏ లోకమును పొందుదురోయని విచారణగలవారైతి యనిన్ని, ఈ ప్రజలు తిరిగి ఈ లోకమును ఎట్లు పొందుచున్నారు అనిన్ని, ఈ మరణమును పొందు

చున్న జనులచేత స్వర్గలోకము ఎట్లు నింపఁబడలేదనిన్ని, ఎంతసంఖ్య గల ఆహుతి హోమము చేయఁబడుచుండగా ఉదకములు పురుష వాక్కులై పుట్టి శబ్దించుననిన్ని, మనుష్యులను పితృలోక దేవలోకములను పొందించునట్టి ప్రతిపత్తను కర్మయేదియనిన్ని, శ్వేతకేతువుకు గూర్చి ప్రశ్నచేయఁగా ఆ శ్వేతకేతువు ఓ రాజా! నేను వీటిని తెలిసికొనలేదని పలికెను. తదనంతరము ఆ రాజు ఓ శ్వేతకేతూ! మంత్రమందు రెండు మార్గము లున్నవనియును, అందులో ఒకటి యగు దక్షిణాయన మార్గము పితృలోకమును పొందించునది యనియును, రెండవదియగు ఉత్తరాయణ మార్గము దేవలోకమును పొందించునది యనియును, మనుష్యులు అ రెండుమార్గములచేతనె ఈ సమస్త ప్రపంచమును పొందుచున్నారనియును, ఆ రెండు మార్గములు మంత్రమునందు తల్లిదండ్రులని చెప్పఁబడుచుండెడి భూమ్యంతరిక్షముల మధ్యమందున్నవనియును, నేను వింటిని. నీవు దానిని తెలిసికొంటివా యని అడుగఁగా శ్వేతకేతువు, ఓ రాజా! నీవడిగిన ఈ ప్రశ్నల సమూహములో ఒక ప్రశ్ననున్ను నేను తెలిసికొనలేదని పలికెను.

ఉ॥ అథైనం వసత్యోప మన్త్రియాఞ్చక్రేఽ నాదృత్య వసతిం కుమారః ప్రదుద్రావ స ఆజగామ పితరం తగ్ం హోవాచేతి వావ కిల నో భవాన్ పురానుశిష్టాన వోచదితికథగ్ం సుమేధ ఇతి పఞ్చ మా ప్రశ్నాన్రాజన్యబన్ధు రప్రాక్షీత్తతో నైకఞ్చన వేదేతి కతమే త ఇతీమ ఇతి హ ప్రతీకాన్యుదాజహార. ॥3॥

ప॥ అథ – ఏనం – వసత్యా – ఉపమన్త్రియాఞ్చక్రే –అనాదృత్య – వసతిం – కుమారః – ప్రదుద్రావ – సః–ఆజగామ-పితరం–తం – హోవాచ – ఇతి – వావకిల – నః – భవాన్ – పురా – అనుశిష్టాన్ – అవోచత్ – ఇతి – కథం – సుమేధః – ఇతి – పఞ్చ – మా – ప్రశ్నాన్ – రాజన్యబన్ధుః – అప్రాక్షీత్ – తతః – న –

ఏకం - చ - న - వేద - ఇతి - కతమే - ఇతి - తే - ఇతి - ఇమే- ఇతి - హ - ప్రతీకాని - ఉదాజహార.

ప్ర॥ అథ=అనంతరము, (రాజా=రాజు), ఏనం=ఈ శ్వేతకేతువును, వసత్యా = నివాసముతో, (ఆసనమునందు కూర్చుండుటకు), ఉపమన్త్రియాఞ్చక్రే=సమీపమునకు పలిచెను. కుమారః = శ్వేతకేతువు, వసతిం=నివాసమును, అనాదృత్య = తిరస్కరించి, (తండ్రిని గూర్చి), ప్రదుద్రావ=పరుగెత్తి పోయెను. సః=ఆ శ్వేతకేతువు, పితరం=తండ్రినిగూర్చి, ఆజగామ=వచ్చెను. తం = ఆ తండ్రినిగూర్చి, హోవాచ=పలికెను. ఇతివావకిల=ఈప్రకారముగానే గదా, భవాన్ =నీవు, (సమస్త విద్యలతో). అనుశిష్టాన్=శిక్షితులమైన వారినిగా, నః=మమ్మునుగూర్చి, పురా=పూర్వమునందు, (సమావర్తన కాలమునందు), అవోచదితి=పలికితివని, (హోవాచ=పలికెను) (పితా=తండ్రి) హేసుమేధః=మంచిబుద్ధిగల ఓ శ్వేతకేతూ! కథమితి = ఏప్రకారముగానని, (నీకు ఈ దుఃఖము ఎట్లు కలిగెనని పలికెను). రాజన్యబన్ధుః =రాజన్యబంధువు, (కోపముతో వాస్తవరాజు కాడు. ఆ భాసరాజు అని తెలుపుటకై రాజన్యబంధువుడని చెప్పబడినది). మా= నన్ను, పఞ్చ=అయిదు, ప్రశ్నాన్=ప్రశ్నలను. అప్రాక్షీత్=అడిగెను. తతః =దానివలన, ఏకంచన=ఒక ప్రశ్ననున్ను, నవేదేతి = తెలిసికొనక పోతినని, (శ్వేతకేతువు పలికెను). తే=ఆ ప్రశ్నలు, కతమే = ఏవి, ఇతి=అని, (తండ్రి అడిగెను). ఇమేఇతి = ఇవియని, (శ్వేతకేతువు), ప్రతీకాని = ప్రశ్నైకదేశములను, (ప్రశ్నలయొక్క సూచనలను), ఉదాజహారహ=చెప్పెను,

తా॥ అనంతరము ఆ ప్రవాహణ మహారాజు గర్వితుడైన శ్వేతకేతువును ఆసనపాద్యమర్ఘ్యాదులను గ్రహించుటకు సమీపమునకు పిలిచెను. అప్పుడా శ్వేతకేతువు ఆ ఆసనాదులను తిరస్కరించి తండ్రియొద్దకు వచ్చి ఓ తండ్రీ! సమస్త విద్యలచేతను శిక్షితులమైతి

మని మమ్మునుగూర్చి నీవు సమావర్తనకాలమునందు ఈ ప్రకారము పలికితివిగదా! ఆ రాజమాత్రుఁడు నన్ను అయిదు ప్రశ్నలను అడిగెను. అందులో ఒక ప్రశ్ననున్ను నేను తెలిసికొనకపోతినని తండ్రిని గూర్చి పలికెను. మంచి బుద్ధిగల ఓ శ్వేతకేతూ! నీకేల ఇంత దుఃఖము కలిగెను. ఆ రాజు అడిగిన ప్రశ్నలు ఏవి యని తండ్రి తిరిగి యడిగెను. శ్వేతకేతువప్పుడా ప్రశ్నలు ఇవియని ప్రశ్నలయొక్క సూచనలను తండ్రికి తెలియపఱచెను.

ఉ॥ స హోవాచ తథా నస్త్వం తాత జానీథాః యథా యదహం కించన వేద సర్వమహం తత్తుభ్య మవోచం ప్రేహి తు తత్ర ప్రతీత్య బ్రహ్మచర్యం వత్స్యావ ఇతి భవా నేవగచ్ఛత్వితి స ఆజగామ గౌతమో యత్ర ప్రవాహణస్య జైబలేరా సాతస్మా ఆసనమాహృత్యోదక మాహారయాఞ్చకారాథ హాస్మాఅర్ఘ్యం చకార తగ్ హోవాచ వరం భగవతే గౌతమాయ దద్మఇతి ॥4

ప॥ సః-హ-ఉవాచ-తథా-నః-త్వం-తాత-జానీథాః-యథా-యత్-అహం-కించన-వేద-సర్వం-అహం-తత్-తుభ్యం - అవోచం-ప్రేహి-తు-తత్ర-ప్రతీత్య-బ్రహ్మచర్యం-వత్స్యావః-ఇతి - భవాన్-ఏవ-గచ్ఛతు-ఇతి-సః-ఆజగామ-గౌతమః - యత్ర - ప్రవాహణస్య-జైబలేః-అసా-తస్మై-ఆసనం-ఆహృత్య-ఉదకం-ఆహారయాఞ్చకార - అథ-హ-అస్మై-అర్ఘ్యం-చకార-తం - హోవాచ-వరం - భగవతే - గౌతమాయ - దద్మః - ఇతి.

ప్ర॥ సః=ఆ ఆరుణియను తండ్రి, హోవాచ=పలికెను. హే తాత =ఓ చిన్నవాఁడా! అహం=నేను, యత్కించన=ఏ ఈవిజ్ఞాన జాతము నంతయును, యథా=ఏ ప్రకారము, వేద=తెలిసికొంటినో, తథా = ఆ ప్రకారము, అహం=నేను, తత్సర్వం=ఆ సమస్తమును, తుభ్యం= నీ కొఱకు, అవోచం=చెప్పితిని అని, త్వం = నీవు, నః = మమ్మును, జానీథాః= తెలిసికొనుము. (నీకంటె నాకు ఎవఁడును ఇష్టుఁడులేఁడు.

ఆ రాజుచేత నడుగఁబడినది నాకున్ను తెలియదు. గనుక నీవు) ప్రైహి=రమ్ము, (ఆవాం=మనమిద్దఱము). తత్ర=ఆ రాజుయొద్దకు, ప్రతీత్యతు=పోయి, (విద్యార్థం = విద్యనిమిత్తము), బ్రహ్మచర్యం = బ్రహ్మచర్యనుగూర్చి, వత్స్యామః = నివసించుదము, ఇతి = అని, (తండ్రి పలికెను). (సః=ఆ శ్వేతకేతువు, అహం=నేను, తస్య=ఆరాజు యొక్క, ముఖం=ముఖమును, నిరీక్షితుం=చూచుటకు, నోత్సహే = ఇచ్ఛయించను), భవానేవ=నీవే, గచ్ఛత్విత్=పోవుదువుగాక యని, (ఉవాచ=పలికెను). జైబలేః=జీబలుని పుత్రుఁడగు, ప్రవాహణస్య= ప్రవాహణ మహారాజుయొక్క, ఆసా=ఉనికి, యత్ర = ఎక్కడనో, (తత్ర=అక్కడికి), గౌతమః=గౌతమగోత్రోత్పన్నుఁడైన, సః = ఆ ఆరుణి, ఆజగామ=వచ్చెను. తస్మై = ఆగౌతమునికొఱకు, ఆసనం=పీఠమును, ఆహృత్య=తీసికొనివచ్చి, ఉదకం=నీళ్ళను, (భృత్యైః=నౌకరుల చేతను), ఆహారయాఞ్చకార=తెప్పించెను. అథహ = అనంతరము, (ఆరాజు), అస్మై=ఈగౌతమునికొఱకు, అర్ఘ్యం=పూజను, చకార = చేసెను. (పూజనుచేసి), తం=ఆ గౌతమునిగూర్చి, భగవతే=పూజ్యుఁడవైన, గౌతమాయ=గౌతమగోత్రోత్పన్నుఁడవైన, (తుభ్యం = నీకొఱకు), వరం=వరమును, (గవాశ్వాది లక్షణమగు వరమును), దద్మః ఇతి=ఇచ్చుచున్నామని, హోవాచ = పలికెను.

తా॥ అనంతరము ఆరుణి, ఓ శ్వేతకేతూ! నీకంటె అన్యుఁడగు ఇష్టుఁడు నాకు లేకపోవుట వలన నేను తెలిసికొనిన విజ్ఞానజాతము నంతయు నీకు చెప్పితినని తెలిసికొనుమని పలికెను. తరువాత, ఓ చిన్నవాఁడా! ఆ రాజు అడిగిన ప్రశ్నలు నాకున్ను తెలియవు, గనుక మన మిద్దఱమును ఆ రాజునొద్దకు పోయి విద్యానిమిత్తము బ్రహ్మచర్యమును చేయుచు ఉందము రమ్ము అని తండ్రి పలికెను. అప్పుడా శ్వేతకేతువు నాకు ఆ రాజు ముఖమును చూచుటకు ఇష్టములేదు గనుక నీవే పొమ్ము అని పలికెను. అప్పుడు ఆ యారుణి ఆ ప్రవా

హణ మహారాజు ఉండెడి ప్రదేశమునకు పోయెను. ఇట్లు వచ్చిన ఆరుణి కొఱకు ఆసనోదకములను భృత్యులచేఁ దెప్పించి యిచ్చి పూజనుచేసి ఓ ఆరుణీ! పూజ్యుఁడవగు నీ కొఱకు గవాశ్వాదికమును ఇచ్చెదనని పలికెను.

ఉ॥ స హోవాచ ప్రతిజ్ఞాతో మ ఏ ష వరో యాం తు కుమార స్యాన్తే వాచమభాషథాస్తామేవ బ్రూహీతి. ॥5॥

ప॥ సః హోవాచ-ప్రతిజ్ఞాతః- మే-ఏషః - వరః-యాం-తు-కుమారస్య-అన్తే- వాచం- అభాషథాః - తాం - ఏవ - బ్రూహి-ఇతి.

ప్ర॥ సః=ఆ గౌతముఁడు, హోవాచ=పలికెను. (త్వయా = నీచేత), ఏషః=ఈ, వరః= వరము, మే=నాకు, ప్రతిజ్ఞాతః= ప్రతిజ్ఞ చేయఁబడినది. (ఈ ప్రతిజ్ఞయందు మనస్సును దృఢముచేయుము). కుమారస్య=బాలుఁడగు శ్వేతకేతువుయొక్క, అన్తే = సమీపము నందు, యాంతువాచం = ఏవాక్కును, అభాషథాః = పలికితివో, తామేవ=ఆ వాక్కునే. బ్రూహి=చెప్పుము. (ఇదియె నాకు వరము), ఇతి=అని, (హోవాచ=పలికెను).

తా॥ ఓ ప్రవాహణ మహారాజా! నీచేతనాకు ఈ వరము ప్రతిజ్ఞ చేయఁబడెను. ఆ ప్రతిజ్ఞయందు దృఢమనస్సుగల వాఁడవై శ్వేతకేతువు సమీపమునందుఁ బలికిన ప్రశ్నరూపమైన వాక్కును నాకు చెప్పుమా! ఇదియె వరమని ఆరుణి పలికెను.

ఉ॥ స హోవాచ దైవేషు వై గౌతమోతద్వరేషు మానుషాణాం బ్రూహీతి. ॥6॥

ప॥ సః-హోవాచ-దైవేషు-వై-గౌతమ- ఉ-తత్ - వరేషు - మానుషాణాం-బ్రూహి-ఇతి.

ప్ర॥ సః= ఆప్రవాహణమహారాజు, హోవాచ = పలికెను. హేగౌతమ = ఓగౌతముఁడా, (త్వం=నీవు, యత్ = ఏవరమును,

ప్రార్థయసే=ప్రార్థించుచున్నావో), తత్=అదియే, దైవేషు = దైవ సంబంధములైన, వరేషు=వరములయందుండునది. (గనుక), మానుషాణాం=మనుష్యులలోపలి, (వరం=వరమును), బ్రూహీతి = పలుకుమాయని, (కోరుమాయని), (హోవాచ=పలికెను).

తా॥ ఓగౌతముఁడా! నీవు కోరెడివరము దైవవరములలోనిది గనుక మనుష్యుల లోపలివరమును కోరుమాయని ఆ ప్రవాహణ మహారాజు పలికెను.

ఉ॥ స హోవాచ విజ్ఞాయతే హాస్తి హిరణ్యస్యాపాత్తంగోఅశ్వానాం దాసీనాం ప్రవారాణాం పరిధానస్య మా నో భవాన్బహోరనన్తస్యా పర్యన్తస్యా భ్యవదాన్యోఽభూదితి స వై గౌతమ తీర్థేనేచ్ఛాసా ఇత్యుపైమ్యహంభవన్త మితి వాచా హ స్మైవై పూర్వ ఉపయన్తి సహోపాయన కీర్త్యోవాస. ॥7॥

ప॥ సః-హోవాచ-విజ్ఞాయతే హ-అస్తి-హిరణ్యస్య-అపాత్తం-గోఅశ్వానాం-దాసీనాం-ప్రవారాణాం-పరిధానస్య-మా-నః-భవాన్-బహోః-అనన్తస్య-అపర్యన్తస్య-అభి-అవదాన్యః-అభూత్-ఇతి-సః-వై-గౌతమ-తీర్థేన-ఇచ్ఛాసై-ఇతి-ఉపైమి-అహం-భవన్తం-ఇతి-వాచ-హ-స్మ-వై-పూర్వే-ఉపయన్తి-సః-హ-ఉపాయనకీర్త్యా-ఉవాస.

ప్ర॥ సః=ఆ గౌతముఁడు, హోవాచ=పలికెను. (మమ=నాకు), హిరణ్యస్య = బంగారముయొక్కయు, గోఅశ్వానాం = గోవుల యొక్కయు, అశ్వములయొక్కయు, దాసీనాం=దాసీలయొక్కయు, ప్రవారాణాం=పరిచారకులయొక్కయు, పరిధానస్య = కట్టువస్త్రము యొక్కయు, అపాత్తం = ప్రాప్తి, అస్తిహ=కలదు, (ఇతి=అని, భవతా=నీచేతను), విజ్ఞాయతే=తెలిసికొనఁబడుచున్నది. భవాన్ = నీవు. నఃఅభి=మమ్ముననుగూర్చి. బహోః=అధికమైన, అనన్తస్య = అనన్తఫలముగల, అపర్యన్తస్య= పరిసమాప్తముగాని ధనమునకు,

(పుత్రపౌత్రాదికమును పొందిన ధనమునకు), అవదాన్యః = దాతవు కానివాఁడవు, మాభూత్=కావు, ఇతి=అని, (హోవాచ=పలికెను), సవై=ఆరాజు, హేగౌతమ=ఓగౌతముఁడా! (త్వం=నీవు), తీర్థేన = శాస్త్రవిధిచేతను, (విద్యాం=విద్యను, మత్తః=నావలన), ఇచ్ఛాసై= కోరుచున్నావా, ఇతి=అని, (హోవాచ = పలికెను), (సః = ఆగౌతముఁడు), అహం=నేను, భవన్తం= నిన్ను, ఉపైమి = (శిష్యుఁడనై) పొందుచున్నాను. ఇతి=అని, (హోవాచ=పలికెను). పూర్వే= ప్రాచీనులగు బ్రాహ్మణులు. వాచాహస్మవై= వాక్కుచేతనేగదా, (రాజులనుగూర్చి), ఉపయన్తి=(శిష్యులుగా) పొందుచున్నారు. (గనుక), సః=ఆ గౌతముఁడు, ఉపాయనకీర్త్యాహ=ఉపాయనము చెప్పుటచేతనె, (శిష్యత్వమునుచేయక శిష్యుఁడనై పొందుచున్నాననిచెప్పుటచేతనె), ఉవాస=ఉండెను.

తా॥ ఓరాజా! పుత్రపౌత్రాదులను పొందునట్టి ధనమునంతయు నిచ్చుటకు నీవు మాకు ముఖ్యమైన దాతవు. నీవుమాకు ఇవ్వకూడనిది యేమియునులేదు. బంగారము గోవులు గుఱ్ఱములు దాసీలు పరిచారకులు కట్టు వస్త్రములు ఈ మొదలైన ధనమంతయు మాకు సమృద్ధిగా నున్నది. కాఁబట్టి మనుష్యులలో నేను కోరఁదగిన దేమియును లేదు. ఈ సంగతి నీకు బాగుగ తెలిసియేయున్నది, గనుక నీప్రతిజ్ఞప్రకారము ముఖ్యమైనవరమును మాకు ఇమ్మాయని గౌతముఁడు ఆ రాజును అడిగెను. ఆ రాజు ఓ గౌతముఁడా! నీవు శాస్త్రవిధితో నావలన విద్యను అపేక్షించుచున్నావాయని పలికెను. తరువాత, అ గౌతముఁడు, ఓరాజా! ప్రాచీనులగు బ్రాహ్మణులు రాజులనుగూర్చి, శుశ్రూషను చేయకయే శిష్యుల మగుచున్నామను వాఙ్మాత్రము చేతనే శిష్యులుగా పొందుచున్నారు, గనుక నేనును నిన్ను విద్యకొఱకు శిష్యుఁడనై పొందుచున్నానని పలికి ఆరాజుయొద్ద వాఙ్మాత్రముతోనే శిష్యుఁడై యుండెను,

ఉ॥ స హోవాచ తథా న స్త్వం గౌతమ మాపరాధా స్తవ చ పితా మహా యథేయం విద్యేతః పూర్వంన కస్మిగ్శ్చన బ్రాహ్మణ ఉవాస తాం త్వహం తుభ్యం వక్ష్యామి కో హి త్వైవం బ్రువన్త మర్హతి ప్రత్యాఖ్యాతుమితి. ॥8॥

ప॥ సః-హోవాచ-తథా-నః-త్వం-గౌతమ-మా-అపరాధాః-తవ-చ-పితామహాః-యథా-ఇయం-విద్యా-ఇతఃపూర్వం-న-కస్మిన్-చన-బ్రాహ్మణే-ఉవాస-తాం-తు-అహం-తుభ్యం-వక్ష్యామి-కః-హి-త్వా-ఏవం-బ్రువన్తం-అర్హతి-ప్రత్యాఖ్యాతుం-ఇతి.

ప్ర॥ సః=ఆ రాజు, హోవాచ=పలికెను. హే గౌతమ= ఓ గౌతముఁడా! తవ=నీయొక్క, పితామహాః= పితామహులు, (అస్మత్ పితామహేషు = మాపితామహులయందు), యథా= ఏప్రకారము, (అపరాధం = అపరాధమును, నజగృహుః= గ్రహించకపోయిరో), తథా=ఆప్రకారము, త్వం=నీవు, నః=మమ్మునుగూర్చి, మాపరాధాః = అపరాధమును చేయకుమా! ఇయం=ఈ, విద్యా=విద్య, (పంచాగ్ని విద్య), ఇతఃపూర్వం=ఇంతకుపూర్వము, కస్మింశ్చన బ్రాహ్మణే = ఏ బ్రాహ్మణునియందును, నోవాస=ఉండలేదు. తాంతు=ఆ విద్యను, అహం=నేను, తుభ్యం = నీకొఱకు, వక్ష్యామి = చెప్పెదను. కః= ఎవఁడు, ఏవం బ్రువన్తం=ఇట్లు పలుకుచున్న వానిని, (ఈప్రకారము శిష్యుఁడనై యుంటున్నానని పలికెడి వానిని), హిత్వా=విడిచి, ప్రత్యాఖ్యాతుం=తిరస్కరించుటకు, అర్హతి= తగుచున్నాఁడు? (ఎవఁడును తిరస్కరించఁడు), ఇతి=అని. (హోవాచ=పలికెను).

తా॥ అప్పుడా రాజు ఓగౌతముఁడా! మీపితామహులు మా పితామహులయందు తప్పిదమును గ్రహించక యుండినట్లు నీవును మమ్మునుగూర్చి తప్పిదమును గ్రహించకుమా! ఈపంచాగ్నివిద్య ఇంతకు పూర్వము ఏ బ్రాహ్మణునియందును లేదు. ఈవిద్యక్షత్రియ పరంపరగావచ్చినది. అయినను శిష్యుఁడనై యుండెదనని యిట్లు

ప్రార్థించెడి వానిని విడిచిపెట్టి తిరస్కరించుటకు ఎవఁడును యుక్తమైనవాఁడు కాఁడు గనుక నేను నీకు ఆ పంచాగ్ని విద్యను చెప్పెదనని పలికెను.

ఉ॥ అసౌ వై లోకోఽగ్నిర్గౌతమ తస్యాదిత్య ఏవ సమిద్రశ్మయో ధూమో హరర్చిర్దిశోఽఙ్గారా అవాన్తరదిశో విస్ఫులిఙ్గాస్తస్మిన్నేతస్మిన్నగ్నౌ దేవాశ్శ్రద్ధాం జుహ్వతి తస్యా ఆహుత్యై సోమో రాజా సమ్భవతి. ॥9॥

ప॥ అసౌ-వై-లోకః-అగ్నిః-గౌతమ-తస్య - ఆదిత్యః-ఏవ - సమిత్-రశ్మయః-ధూమః-అహః-అర్చిః-దిశః-అఙ్గారాః - అవాన్తరదిశః-విస్ఫులిఙ్గాః-తస్మిన్-ఏతస్మిన్-అగ్నౌ-దేవాః-శ్రద్ధాం-జుహ్వతి-తస్యై-ఆహుత్యై-సోమః-రాజా-సమ్భవతి.

ప్ర॥ హే గౌతమ=ఓ గౌతముఁడా! అసౌ వై లోకః=ఈ ద్యులోకము, అగ్నిః=అగ్ని; తస్య=ఆ అగ్నికి, ఆదిత్య ఏవ=సూర్యుఁడే, సమిత్=ఇన్ధనము; (కట్టెలు). రశ్మయః=కిరణములు, ధూమః=పొగ, అహః=పగలు, అర్చిః=జ్వాల, దిశః=దిక్కులు, అఙ్గారాః=నిప్పులు, అవాన్తరదిశః=మూలదిక్కులు, విస్ఫులిఙ్గాః=మిణుగురులు,తస్మిన్= ఆ, ఏతస్మిన్=ఈ, అగ్నౌ=ద్యులోకాగ్నియందు, దేవాః=దేవతలు, శ్రద్ధాం=శ్రద్ధను=ఉదకమును, (ఇక్కడ శ్రద్ధావా ఆపః అను శ్రుతిచేత ఉదకము అర్థము). జుహ్వతి = హోమము చేయుచున్నారు తస్యై ఆహుత్యై=ఆ ఆహుతివలన (ఇక్కడ చతుర్థికి పంచమ్యర్థము) రాజా = రాజు, సోమః = చంద్రుఁడు, సమ్భవతి = అగుచున్నాఁడు, (కలుగు చున్నాఁడు).

తా॥ ప్రవాహణ మహారాజు శ్వేతకేతువును తానడిగిన ప్రశ్నలలో నాలుగవదియగు, 'వేత్థో యతి థ్యామాహుత్యాగ్ హుతాయామాపః పురుషవాచో భూత్వాసముత్థాయవదన్తి' అను ప్రశ్నకుత్తరమును, తక్కిన ప్రశ్నలయొక్క నిజమును, నిర్ణయించుటకు ఇక్కడ

ముందుగా చెప్పుచున్నాఁడు. ఓ గౌతముఁడా! ద్యులోకమే = స్వర్గలోకమే అగ్ని ఆ అగ్నికి సూర్యుఁడు కట్టెలు. సూర్యకిరణములే పొగ. పగలు=దినము జ్వాల. దిక్కులే నిప్పులు. మూలదిక్కులే మిణుగురులు. అటువంటి ఈ ద్యులోకాగ్నియందు ఇంద్రాది దేవతలు శ్రద్ధను హోమము చేయుచున్నారు. ఆ ఆహుతివలన పితృదేవతలకును బ్రాహ్మణులకును రాజైన చంద్రుఁడు పుట్టుచున్నాఁడు. దీనిని గుఱించి కర్మప్రకరణమందు నిర్ణయింపఁబడియున్నది. ఎట్లనఁగా, ఈ లోకమునందు ఈ అగ్నిహోత్రాహుతులు రెండును ఆహవనీయాగ్నియందు హోమము చేయఁబడినవై లేచి అన్తరిక్షలోకమును పొంది, అంతరిక్షమును ఆహవనీయమునుగాను, వాయువును సమిత్తుగాను, కిరణములనే ఆహుతినిగాను, చేసి, అంతరిక్షమును తృప్తిపఱచినవై, ద్యులోకమును ప్రవేశించుచున్నవి. ఇట్లు ప్రవేశించి ద్యులోకము ఆహవనీయము అని సూర్యుని సమిత్తు అని ఈ మొదలైనది చెప్పఁబడినది. అక్కడనుండి అగ్నిహోత్రాహుతులు తమ సాధనములతో కూడా లేచినవై ఈ వ్యవహారలోకమునందు అగ్నిగాను సమిత్తుగాను ధూమముగాను అఙ్గారముగాను మిణుగురులుగాను పాలు మొదలైన ఆహుతిద్రవ్యముగాను అగుచున్నవి. ఇవి సృష్ట్యాదియందున్న అవ్యాకృతావస్థయందుసూత్మరూపముతో పరమాత్మయందుంటున్నవి. ఇట్లుండెడిసాధనసహితమగుఅగ్నిహోత్రలక్షణమైన కర్మఅపూర్వమనురూపముతో నున్నదై వ్యక్తమైన రూపము గలుగునపుడు అన్తరిక్షాది లోకములలో ఆహవనీయాగ్న్యాదిభావమును పొందుచున్నది. ఇట్లు ఈ సమస్త జగత్తు అగ్నిహోత్రాహుతులయొక్క అపూర్వమగు విపరిణామ స్వరూపమైనది యని కర్మకాండ యందు చెప్పఁబడియున్నది. ఇక్కడ కర్మపరిపాక వివక్షయందు ద్యులోకాగ్ని మొదలైన పంచాగ్నులయొక్క దర్శనము ఉత్తరమార్గప్రాప్తి సాధనముగా విశిష్టకర్మఫలములయొక్క యుపభోగము కొఱకు విధింపఁబడినది. ఈ లోకము

నందు అగ్నిహోత్రమునకు హోతలుగా నుండెడి ఆధ్యాత్మికములగు ప్రాణములు ఆధిదైవికరూపముతో పరిణమించి ఇంద్రాది దేవతలై ద్యులోకాగ్నియందు హోతలగుచున్నారు. ఈ లోకమునందు ఆహవనీయమనుఅగ్నియందుంచఁబడిన అగ్నిహోత్ర కర్మాశ్రయమైన పయోద్రవ్యము అగ్నిచే భక్షింపఁబడినదై అదృష్టమగు సూక్ష్మరూపముతో పరిణమించినదై యజమానునితో కూడా ఈ లోకమును పొందినదై ధూమాది మార్గముతో అంతరిక్షమును అంతరిక్షమువలన ద్యులోకమును ప్రవేశించుచున్నది. ఇట్లు ప్రవేశించిన ఆహుతి కార్యములైన సూక్ష్మరూపములగు ఉదకములు కర్తతోఁగూడా అగ్నిహోత్రమునందున్నవై సోమలోకమునందు కర్తకు వేఱొక శరీరమును ఉపక్రమింపఁజేయుటకొఱకు ద్యులోకమును ప్రవేశించినవై హోమము చేయఁబడుచున్నవని చెప్పఁబడుచున్నవి. కనుకనె దేవతలు శ్రద్ధను ద్యులోకాగ్నియందు హోమము చేయుచున్నారనిన్ని ఆ ఆహుతికి చంద్రుఁడు రాజు అగుచున్నాఁడనిన్ని చెప్పఁబడినది. ఇందువల్లనే ఉదకములకు శరీరమును చేయుటయందు ప్రాధాన్యము. దీనిచేత ఉదకములు పురుషవాక్కులని నిర్ణయము. ఇట్లు ద్యులోకాగ్ని దర్శనమును చేయవయులనని పలికెను.

ఉ॥ పర్జన్యోవా అగ్నిర్గౌతమతస్య సంవత్సర ఏవ సమిదభ్రాణి ధూమో విద్యుదర్చిరశనిరఙ్గారా హ్రాదునయో విస్ఫులిఙ్గా స్తస్మిన్నే తస్మిన్నగ్నౌ దేవాస్సోమగ్ం రాజానం జుహ్వాతి తస్యా ఆహుత్యై వృష్టి స్సమ్భవతి. ॥10॥

ప॥ పర్జన్యః-వై-అగ్నిః-గౌతమ-తస్య - సంవత్సరః - ఏవ - సమిత్-అభ్రాణి-ధూమః-విద్యుత్-అర్చిః-అశనిః-అఙ్గారాః - హ్రాదునయః-విస్ఫులిఙ్గాః-తస్మిన్-ఏతస్మిన్-అగ్నౌ-దేవాః-సోమం - రాజానం-జుహ్వాతి-తస్యై ఆహుత్యై-వృష్టిః-సమ్భవతి.

ప్ర॥ హేగౌతమ=ఓ గౌతముఁడా! పర్జన్యోవై = వర్షాధిష్ఠాన

దేవతయే, అగ్నిః=అగ్ని, తస్య=ఆ అగ్నికి. సంవత్సరఏవ = సంవత్సరమే, సమిత్=సమిత్తు. (కట్టెలు). అభ్రాణి=మేఘములు, ధూమః = పొగ, విద్యుత్=మెఱుపు, అర్చిః=జ్వాల, అశనిః=పిడుగు, అఙ్గారాః= అంగారములు. (నిప్పులు). హ్రాదునయః=మేఘములు, విస్ఫులిఙ్గాః = మిణుగురులు. తస్మిన్=అటువంటి, ఏతస్మిన్=ఈ, అగ్నౌ = అగ్నియందు, దేవాః=దేవతలు, రాజానం=రాజైన, సోమం = చంద్రుని, జుహ్వతి=హోమము చేయుచున్నారు. తస్యైఆహుత్యై = ఆ ఆహుతి వలన, వృష్టిః=వర్షము, సమ్భవతి=కలుగుచున్నది.

తా॥ ఓగౌతముఁడా! వర్షాధిష్ఠాన దేవత యనునదియె అగ్ని. ఆ అగ్నికి ప్రకాశకమగు శరదాది ఋతువులతోఁగూడిన సంవత్సరమే ఇంధనము. మేఘములే పొగ. మెఱుపే జ్వాల. పిడుగె అంగారములు మేఘములు మిణుగురులు. ఇట్లు అగ్ని ఇంధనము జ్వాల ధూమము అంగారములు మిణుగురులను పదార్థ షట్కముగల ఈపర్జన్యాగ్ని యందు దేవతలు పితృదేవతలకును బ్రాహ్మణులకును రాజైన చంద్రుని హోమము చేయుచున్నారు. అటువంటి ఆహుతివలననె వర్షము కలుగుచున్నది. ఇట్లు పర్జన్యాగ్ని దర్శనమును చేయవలయునని ప్రవాహణరాజు పలికెను.

ఉ॥ అయం వై లోకోఽగ్నిర్గౌతమ తస్య పృథివ్యేవ సమిదగ్నిర్ధూమో రాత్రిరర్చిశ్చన్ద్రమా అఙ్గారా నక్షత్రాణి విస్ఫులిఙ్గాస్తస్మిన్నే తస్మిన్నగ్నౌ దేవా వృష్టిం జుహ్వతి తస్యా ఆహుత్యా అన్నగ్ సమ్భవతి. ॥11॥

ప॥ అయం-వై-లోకః-అగ్నిః-గౌతమ-తస్య-పృథివీ - ఏవ - సమిత్-అగ్నిః-ధూమః-రాత్రిః-అర్చిః-చన్ద్రమాః - అఙ్గారాః - నక్షత్రాణి-విస్ఫులిఙ్గాః-తస్మిన్-ఏతస్మిన్-అగ్నౌ- దేవాః-వృష్టిం-జుహ్వతి-తస్యై-ఆహుత్యై-అన్నం-సమ్భవతి.

ప్ర॥ హేగౌతమ=ఓ గౌతముఁడా! అయంవైలోకః = ఈ

లోకమే (ప్రాణులయొక్క జన్మోపభోగములకాశ్రయమైన క్రియా కారకఫలములతోఁ గూడుకొనిన ఈ లోకము), అగ్నిః=అగ్ని, తస్య =ఆ అగ్నికి, పృథివ్యేవ=భూమియె, సమిత్=సమిత్తు అగ్నిః=అగ్ని, ధూమః=పొగ, రాత్రిః=రాత్రియె, అర్చిః = జ్వాల, చన్ద్రమాః = చంద్రుఁడు, అఙ్గారాః=అంగారములు, నక్షత్రాణి = నక్షత్రములు, విస్ఫులిఙ్గాః=మిణుగురులు, తస్మిన్=అటువంటి, ఏతస్మిన్=ఈ, అగ్నౌ =అగ్నియందు, దేవాః=దేవతలు, వృష్టిం = వర్షమును, జుహ్వతి= హోమము చేయుచున్నారు. తస్యైఆహుత్యై = ఆ ఆహుతివలన, అన్నం=అన్నము, సమ్భవతి=కలుగుచున్నది.

తా॥ ఓ గౌతముఁడా! సముద్రపర్వతాదులతోఁ గూడుకొనిన ఈలోకమే అగ్ని. భూమియె సమిత్తు. అగ్నియె ధూమము. రాత్రియె జ్వాల. చంద్రుఁడే నిప్పులు. నక్షత్రములు మిణుగురులు, ఇట్లు అగ్నీం ధనజ్వాల ధూమాఙ్గార విస్ఫులింగములను పదార్థ షట్కముగల ఈ లోకాగ్నియందు దేవతలు వర్షమును హోమము చేయుచున్నారు. ఆ ఆహుతివలన అన్నము కలుగుచున్నది ఇట్లు లోకాగ్ని దర్శనమును చేయవలయునని ప్రవాహణరాజు పలికెను.

ఉ॥ పురుషోవా అగ్నిర్గౌతమ తస్య వ్యాత్తమేవ సమిత్ప్రాణో
ధూమో వాగర్చి శ్చక్షురఙ్గారా శ్శోత్రం విస్ఫులిఙ్గాస్తస్మిన్నే
తస్మిన్నగ్నౌ దేవా అన్నం జుహ్వతి తస్యా ఆహుత్యై రేతస్స
మ్భవతి. ॥12॥

ప॥ పురుషః-వై-అగ్నిః-గౌతమ-తస్య-వ్యాత్తం-ఏవ-సమిత్-ప్రాణః-ధూమః-వాక్-అర్చిః చక్షుః-అఙ్గారాః-శ్రోత్రం-విస్ఫులిఙ్గాః -తస్మిన్-ఏతస్మిన్-అగ్నౌ-దేవాః-అన్నం-జుహ్వతి-తస్యై-ఆహుత్యై -రేతః - సమ్భవతి.

ప్ర॥ హేగౌతమ=ఓగౌతముఁడా! పురుషోవై = పురుషుఁడే, (శిరఃపాణ్యాదులుగల ఈ పురుషుఁడే), అగ్నిః=అగ్ని, తస్య = ఆ

అగ్నికి, వ్యాత్తమేవ=తెఱవఁబడినముఖమె, సమిత్=సమిత్తు. (కట్టెలు), ప్రాణః=ప్రాణము, ధూమః=పొగ, వాక్=వాక్కు, అర్చిః=జ్వాల, చక్షుః=నేత్రము, అఙ్గారాః=అంగారములు, శ్రోత్రం=శ్రోత్రము, విస్ఫులిఙ్గాః=మిణుగురులు, తస్మిన్=అటువంటి, ఏతస్మిన్=ఈ, అగ్నౌ = అగ్నియందు, దేవాః=దేవతలు, అన్నం = అన్నము, జుహ్వతి = హోమము చేయుచున్నారు, తస్యాఆహుత్యై = ఆ ఆహుతివలన, రేతః=రేతస్సు, సమ్భవతి=కలుగుచున్నది.

తా॥ ఓ గౌతముఁడా! శిరఃపాణ్యాదులుగల ఈ పురుషుఁడే అగ్ని. ఆ అగ్నికి తెఱవఁబడిన ముఖమె సమిత్తు. ప్రాణమె ధూమము వాక్కే అర్చి. నేత్రమె నిప్పులు శ్రోత్రమె మిణుగురులు. ఇట్లు అగ్నింధన జ్వాలా ధూమాంగార విస్ఫులింగములను పదార్థషట్కము గల ఈ పురుషాగ్నియందు దేవతలు అన్నమును హోమము చేయుచున్నారు. ఆ యాహుతివలన రేతస్సు పుట్టుచున్నది. ఇట్లు పురుషాగ్ని దర్శనమును చేయవలయునని ప్రవాహణ రాజు పలికెను.

ఉ॥ యోషావా అగ్నిర్గౌతమ తస్యా ఉపస్థ ఏవ సమిల్లోమాని ధూమో
యోనిరర్చి ర్యద న్తః కరోతి తేఽ ఙ్గారా అభినన్దావిస్ఫులిఙ్గాస్తస్మి
న్నే తస్మిన్నగ్నౌ దేవా రేతో జుహ్వతి తస్యా ఆహుత్యై పురుష
స్సమ్భవతి స జీవతి యావజ్జీవ త్యథయదా మ్రియతే. ॥13॥

ప॥ యోషా-వై-అగ్నిః-గౌతమ-తస్యాః-ఉపస్థః - ఏవ-సమిత్-లోమాని-ధూమః-యోనిః-అర్చి-యత్ - అన్తః-కరోతి - తే - అఙ్గారాః-అభినన్దాః విస్ఫులిఙ్గాః-తస్మిన్-ఏతస్మిన్-అగ్నౌ - దేవాః - రేతః-జుహ్వతి-తస్యై - ఆహుత్యై-పురుషః - సమ్భవతి-సః - జీవతి-యావత్-జీవతి-అథ-యదా-మ్రియతే.

ప్ర॥ హేగౌతమ=ఓ గౌతముఁడా! యోషావై = స్త్రీయె, అగ్నిః=అగ్ని తస్యాః=ఆ స్త్రీయొక్క ఉపస్థఏవ=భగమె, సమిత్ = సమిత్తు, లోమాని=దేహమునందున్న వెంటుకలు, ధూమః=పొగ,

యోనిః=ఉపస్థయె, అర్చిః = జ్వాల. అంగాః = అంతఃకరణమునందు, యత్=ఏది. కరోతి=చేయుచున్నదో, (మైథునవ్యాపారములు), తే= అవి, అంగారాః=నిప్పులు, అభినన్దాః=ఆనందలేశములు, విస్ఫులిఙ్గాః= మిణుగురులు, తస్మిన్=అటువంటి, ఏతస్మిన్=ఈ, అగ్నౌ = అగ్ని యందు, దేవాః= దేవతలు, రేతః=రేతస్సును, జుహ్వతి=హోమము చేయుచున్నారో, తస్యా ఆహుత్యై = ఆ హుతివలన, పురుషః= పురుషుఁడు, సమ్భవతి=పుట్టుచున్నాఁడు. సః=ఆ పురుషుఁడు. (అస్మిన్ = ఈ శరీరమునందు), యావత్=ఎంతమట్టుకు, జీవతి=స్థితినిమిత్తకమైన జీవనకర్మను చేయుచున్నాఁడో, (తావత్ = అంతమట్టుకు), జీవతి = జీవించుచున్నాఁడు అథ=అనంతరము. యదా=ఎప్పుడు, మ్రియతే= జీవన కర్మను విడిచి మరణమును పొందుచున్నాఁడో, (తావత్ = అప్పుడు. మ్రియతే=మరణమును పొందుచున్నాఁడు).

తా॥ ఓ గౌతముఁడా! ఈ స్త్రీయె అగ్ని. ఆ స్త్రీయొక్క యుపస్థయె ఈ అగ్నిని ప్రకాశింపఁజేయునట్టి ఇంధనము దేహము నందలి వెంట్రుకలే ధూమము. యోనియె జ్వాల. అంతఃకరణము నందలి మైథునవ్యాపారములే అంగారములు. ఆనన్దలేశములే మిణుగురులు. ఇట్లు అగ్నీంధన ధూమాంగారవిస్ఫులింగములను పదార్థ మట్కుముగల ఈ స్త్రీ రూపమైన అగ్నియందు దేవతలు రేతస్సును హోమము చేయుచున్నారు. ఆ ఆహుతి వలన పురుషుఁడు పుట్టుచున్నాఁడు. ఈ ప్రకారము శ్రద్ధాశబ్దవాచ్యములైన ఉదకములు, ద్యు, పర్జన్య, లోకా, పురుష, యోషిత్తులను ఈ పంచాగ్నుల యందు క్రమముగా హోమము చేయఁబడినవై, సోమ, వృష్టి, అన్న, రేతోభావముతో స్థూలతారతమ్య క్రమమును పొందినవై పురుష శబ్దమును ఆరంభించుచున్నవి. ఈ ప్రకారము అయిదవదియగు యోషాగ్ని హోమము చేయఁబడు చుండగా రేతస్సైన ఉదకములు పురుష వాక్కులగుచున్నవి. ఇట్లు "ఆపః పురుషవాచో భూత్వా

సముత్థాయవద న్తి'' అను చతుర్థ ప్రశ్నార్థము నిర్ణయింపఁబడినది. ఆ పురుషుఁడు ఈ ప్రకారము పుట్టి ఎంతమట్టుకు ఈ దేహమునందు జీవన వ్యాపారమును చేయుచున్నాఁడో అంతవఱకు జీవించుచున్నాఁడు. అనంతరము మరణమును పొందుచున్నాఁడు ఇది యోషాగ్ని. ఇట్లు పంచాగ్ని దర్శనమును చేయవలయునని ప్రవాహణ మహారాజు గౌతమునితో చెప్పెను.

ఉ॥ అథైనమగ్నయే హర న్తి తస్యాగ్నిరేవాగ్నిర్భవతి సమిత్సమిద్ధూమో ధూమోఽర్చిరర్చిరఙ్గారా అఙ్గారా విస్ఫులిఙ్గా విస్ఫులిఙ్గాస్తస్మిన్నే తస్మిన్నగ్నౌ దేవాః పురుషం జుహ్వతి తస్యా ఆహుత్యై పురుషో భాస్వరవర్ణ స్సమ్భవతి. ॥14॥

ప॥ అథ-ఏనం-అగ్నయే-హర న్తి-తస్య-అగ్నిః-ఏవ - అగ్నిః-భవతి-సమిత్-సమిత్-ధూమః ధూమః-అర్చిః-అర్చిః-అఙ్గారాః-అఙ్గారాః-విస్ఫులిఙ్గాః-విస్ఫులిఙ్గాః-తస్మిన్-ఏతస్మిన్-అగ్నౌ-దేవాః - పురుషం-జుహ్వతి-తస్యై-ఆహుత్యై-పురుషః-భాస్వరవర్ణః-సమ్భవతి.

ప్ర॥ అథ=అప్పుడు, (ఋత్విజః = ఋత్విక్కులు), ఏనం = ఈ మరణమును పొందినవానిని, అగ్నయే=అగ్నికొఱకు. (కడపటి ఆహుతికొఱకు), హర న్తి=తీసికొనిపోవుచున్నారు. తస్య = ఆహుతియైన ఆ పురుషునికి, అగ్నిరేవ=అగ్నియే, అగ్నిః=అగ్ని, భవతి=అగుచున్నది. సమిత్=ఇంధనమె, సమిత్=ఇంధనము, ధూమః=పొగయె, ధూమః=పొగ. అఙ్గారాః=నిప్పులే, అఙ్గారాః=నిప్పులు. విస్ఫులిఙ్గాః = మిణుగురులే, విస్ఫులిఙ్గాః=మిణుగురులు, తస్మిన్=అటువంటి, ఏతస్మిన్=ఈ, అగ్నౌ=అగ్నియందు, పురుషం=అన్త్యాహుతిని, దేవాః = దేవతలు, జుహ్వతి=హోమము చేయుచున్నారు. తస్యై ఆహుత్యై=ఆ ఆహుతివలన, పురుషః=అన్త్యాహుతియైన పురుషుఁడు, భాస్వరవర్ణః=అతిశయమైన దీప్తిగలవాఁడు, సమ్భవతి=అగుచున్నాఁడు (నిషేకము మొదలైన అన్త్యాహుతియె కడపటిదిగాఁగల కర్మములచేత సంస్కారము

గలవాఁడు గనుక మిక్కిలి తేజోవంతుఁడగుచున్నాఁడు).

తా॥ ఇట్లు పంచాగ్నుల వలన క్రమముగా పుట్టి అగ్నియందే లయమును పొందుచున్న నేను అగ్నిస్వరూపుఁడనే అని ధ్యానసిద్ధి కలుగుటకు ఇప్పుడు అన్త్యాహుత్యధికరణమైన ఆఱవ ప్రకరణము చెప్పఁబడుచున్నది. మరణమును పొందిన తరువాత ఈ మరణమును పొందిన శిరః పాణ్యాద్యవయవములతోఁ గూడుకొనిన ఆకృతిరూప మైన దేహమును పురుషుని అగ్నియందు కడపటి ఆహుతిగా చేయుటకు ఋత్విక్కులు, తీసికొని పోవుచున్నారు. ఇట్టి కడపటి ఆహుతిని ఏ అగ్నియందు హోమము చేయుచున్నారనిన ఆ ఆహుతికి ఈ లోకమునందు ప్రసిద్ధమైన అగ్నియె అగ్ని. ఈ ప్రసిద్ధమగు సమిత్తులే ఇంధనములు. ఈ ప్రసిద్ధములగు ధూమాంగార విస్ఫులింగములను పదార్థ షట్కముగల ఈ అగ్నియందు దేవతలు శిరఃపాణ్యాది రూపమైన దేహమను అన్త్యాహుతిని హోమము చేయుచున్నారు. ఆ యాహుతి వలన శిరఃపాణ్యాదికముగల దేహమను పురుషుఁడు నిషేకము మొదలైన అన్త్యాహుతియె కడపటిదిగాఁగల కర్మములచేత సంస్కారము కలవాఁడు గనుక చెప్పఁబోయెడి కీటకాది దేహములకు వేఱైన అధిక తేజోవంతమైన దేహము కలుగుచున్నది.

ఉ॥ తే య ఏవ మేతద్విదుః యే చామీ అరణ్యే శ్రద్ధాగ్ం సత్య
ముపాసతే తేఽర్చిరభి సమ్భవన్తి అర్చిషోఽహ రహ్న ఆపూర్య
మాణపక్షమా పూర్యమాణ పక్షాద్యాన్ షణ్మాసానుదఙ్ఙాదిత్య
ఏతి మాసేభ్యో దేవలోకం దేవలోకా దాదిత్య మాదిత్యా
ద్వైద్యుతం తా న్వైద్యుతా త్పురుషో మానస ఏత్య బ్రహ్మ
లోకాన్గమయతి తేషు బ్రహ్మలోకేషు పరాః పరావతో వసన్తి
తేషాం న పునరావృత్తిః. ॥15॥

ప॥ తే యే-ఏవం-ఏతత్-విదుః-యే - చ-అమీ - అరణ్యే-శ్రద్ధాం-సత్యం-ఉపాసతే- తే-అర్చిః-అభిసమ్భవన్తి-అర్చిషః - అహః -

అహ్నః-ఆపూర్యమాణపక్షం - ఆపూర్యమాణపక్షాత్ - యాన్ - షణ్మాసాన్-ఉదఙ్-ఆదిత్యః-ఏతి-మాసేభ్యః - దేవలోకం - దేవలోకాత్-ఆదిత్యం-ఆదిత్యాత్ - వైద్యుతం - తాన్ - వైద్యుతాత్-పురుషః-మానసః-ఏత్య-బ్రహ్మలోకాన్-గమయతి - తేషు - బ్రహ్మలోకేషు పరాః-పరావతః-వసన్తి-తేషాం-న-పునః-ఆవృత్తిః.

ప్ర॥ యే=ఎవరు, ఏవం=ఈ ప్రకారము, ఏతత్=ఈపంచాగ్ని దర్శనమును, విదుః=తెలిసికొనుచున్నారో, తే=వారును, అరణ్యే = అరణ్యమునందు యేచామీ = ఏ ఈ వానప్రస్థులు, సన్యాసులు, శ్రద్ధాం=శ్రద్ధను, (ప్రాప్తాః=పొందినవారై), సత్యం=హిరణ్యగర్భాత్మను, ఉపాసతే=ధ్యానించుచున్నారో, తే=వారును, అర్చిః = అర్చిరభిమాన దేవతను, (అర్చిశ్శబ్దవాచ్యమైన = ఉత్తరమార్గలక్షణమైన దేవతను),అభిసమ్భవన్తి=పొందుచున్నారు.అర్చిషః=అర్చిహిరభిమాన దేవతవలన, అహః=అహస్సును, (అహరభిమాన దేవతను), అహ్నః =అహరభిమాన దేవతవలన ఆపూర్యమాణపక్షం = ఆపూర్యమాణ పక్షదేవతను, (అహర్దేవతచేత గడుపఁబడిన ఆపూర్యమాణపక్షదేవతను=శుక్లపక్షదేవతను), (ప్రతిపద్యన్తే=పొందుచున్నారు). ఆదిత్యః=సూర్యుఁడు, ఆపూర్యమాణపక్షాత్=నిండింపఁబడిన శుక్లపక్షమువలన, (శుక్లపక్ష దేవతచేత గడపఁబడిన), షణ్మాసాన్ = ఆఱుమాసములను, ఉదఙ్=ఉత్తరదిక్కును, ఏతి=పొందుచున్నాఁరు. (తే=వారు, తాన్=శుక్లపక్ష దేవతచే గడపఁబడిన ఉత్తరాయణ దేవతయగు ఆ ఆఱు మాసములను, ప్రతిపద్యన్తే=పొందుచున్నారు). మాసేభ్యః=మాసములవలన, దేవలోకం=దేవలోకాభిమాన దేవతనున్ను, దేవలోకాత్=దేవలోకమునుంచి, (దేవలోకాభిమాన దేవతనుండి), ఆదిత్యం = సూర్యునిన్ని, ఆదిత్యాత్ = సూర్యునివలన, వైద్యుతం=విద్యుదభిమాన దేవతనున్ను, (మెఱుపును), ప్రతిపద్యన్తే =పొందుచున్నారు. తాన్ = వారిని, (బ్రహ్మణా = బ్రహ్మచే),

మానసః=మనస్సుచేత సృష్టింపఁబడిన. (కశ్చిత్ = ఒకానొకఁడగు), పురుషః=పురుషుఁడు, ఏత్య=వచ్చి, వైద్యుతాత్ =విద్యుదభిమాన దేవత వలన, (విద్యుల్లోకమునుండి), బ్రహ్మలోకాన్ = బ్రహ్మలోకములను, (అధరోత్తర భేదముచేత బహువచనము), గమయతి = పొందించు చున్నాఁడు. (ఉపాసనా తారతమ్యముచే పొందించుచున్నాఁడు). (తే=వారు), తేషు=ఆ, బ్రహ్మలోకేషు = బ్రహ్మలోకములయందు, పరాః=శ్రేష్ఠులై, పరావతః=శ్రేష్ఠములగు అనేక సంవత్సరములును, వసన్తి=ఉంటున్నారు. తేషాం = వారలకు, పునరావృత్తిః = తిరిగి జన్మము, న=లేదు.

తా॥ ఈ పంచాగ్ని విద్యను తెలిసినవారి గతిని చెప్పుటకు ఇచ్ఛగలవాఁడై ఉత్తర గ్రంథము చెప్పుచున్నాఁడు. ఈ పూర్వము చెప్పిన ప్రకారము పంచాగ్ని విద్యను తెలిసికొని అగ్నిని ఉపాసించు వారును, అరణ్యమునందు వానప్రస్థులై శ్రద్ధతో హిరణ్యగర్భోపా సన చేయువారును, త్రిదండసన్యాసులై శ్రద్ధతో హిరణ్యగర్భోపా సన చేయువారును, వీరందఱును అర్చిశ్శబ్దవాచ్యమైన ఉత్తరాయణ లక్షణమగు దేవతనుపొంది, అర్చిరభిమాన దేవతవలన అహరభిమాన దేవతను, అహరభిమాన దేవతవలన అహర్దేవతచే గడుపఁబడిన శుక్లపక్ష దేవతను, పొందుచున్నారు. తరువాత శుక్లపక్ష దేవతలచే గడుపఁబడినదియును, సూర్యుఁడు ఉత్తర దిక్కునందుండెడి ఉత్తరా యణ దేవతలైనవియు నగు ఆఱు మాసములను పొంది, ఆఱు మాస ములను ఉత్తరాయణ దేవతలనుండి దేవలోకాభిమాన దేవతనున్ను దేవలోకాభిమాన దేవతవలన సూర్యునిన్ని సూర్యునివలన విద్యుదభి మాన దేవతనున్ను పొందుచున్నారు. ఇట్లు పొందిన ఆ యుపాసకు లనుగూర్చి బ్రహ్మచే మనస్సువలన సృష్టిచేయఁబడిన ఒక పురుషుఁడు వచ్చి విద్యుల్లోకమునుండి వారిని ఉపాసనా తారతమ్యముచే పొందఁ దగిన అధరోత్తర భేదములచే అనేకములగు బ్రహ్మలోకములను

పొందించుచున్నాఁడు. ఇట్లు పొందింపఁబడిన ఆ యుపాసకులు బ్రహ్మ లోకములయందు శ్రేష్ఠులై అనేక సంవత్సరములు నివసించి యుంటు న్నారు. వారలకు తిరిగి ఈ సంసారమునందు జన్మము లేదు. ఇదియె అర్చిరాది మార్గ మనఁబడును. అనఁగా ఉత్తరాయణ మార్గము. ధూమాది మార్గమేది యనిన, ఎంతిమట్టుకు గృహస్థులు పంచాగ్ని విద్యనుగాని బ్రహ్మవిద్యనుగాని తెలిసికొననివారై యజ్ఞాది కర్మలను చేయువారగుచున్నారో, అంతవఱకు, వారు, శ్రద్ధాద్యా హుతులతో క్రమముగా ద్యు పర్జన్యలోక పురుష యోషిత్తులను అయిదు అగ్నులయందు అప్సోమ వృష్ట్యన్న రేతో రూపములతో హోమము చేయఁబడి అయిదవదియగు రేతస్సుతో యోషాగ్నియందు హోమము చేయఁబడి యోషాగ్నివలన ఈ లోకమునందు పురుషు లుగాఁబుట్టి తిరిగి అగ్నిహోత్రాది కర్మను చేయుచున్నారు. ఆ కర్మ చేత ధూమాదిమార్గముద్వారా (దక్షిణాయన మార్గముద్వారా) ఎడతెగక ఘటీయంత్రమువలెనే రాకపోకలచే తిరిగితిరిగి జనన మరణ ములను పొందుచున్నారు. ఇదియె ధూమాది మార్గము. దక్షిణాయన మార్గము.

ఉ॥ అథ యే యజ్ఞేన దానేన తపసా లోకాఞ్జయన్తి తే ధూమమభి సమ్భవన్తి ధూమాద్రాత్రిగ్ం రాత్రేరపక్షీయమాణ పక్ష మపక్షీ యమాణ పక్షాద్యాన్ షణ్మాసాన్ దక్షిణాదిత్య ఏతిమాసే భ్యః పితృలోకం పితృలోకాచ్చన్ద్రం తే చన్ద్రం ప్రాప్యాన్నం భవన్తి తాగ్ం స్తత్ర దేవా యథా సోమగ్ం రాజానమాప్యాయ స్వాపక్షీయస్వేత్యేవమేనాగ్ం స్తత్ర భక్షయన్తి తేషాం యదా తత్పర్యవైత్యథేమ మేవాకాశమభి నిష్పద్యన్తే ఆకాశాద్వాయుం వాయోర్వృష్టిం వృష్టేః పృథివీం తే పృథివీం ప్రాప్యాన్నం భవ న్తి తే పునః పురుషాగ్నౌ హూయన్తే తతో యోషాఽగ్నౌ జాయన్తే తే లోకాన్ప్రత్యుత్థాయిన స్త ఏవమేవానుపరివర్తన్తే,

ఉభయ ఏతౌ సన్థానౌ న విదు స్తే కీటాః పతఙ్గా యదిదం దన్ద శూకమ్. 6॥

ఇత్యష్టమాధ్యాయే ద్వితీయం బ్రాహ్మణమ్.

ప॥ అథ-యే-యజ్ఞేన-దానేన-తపసా-లోకాన్ - జయన్తి - తే-ధూమం-అభిసమ్భవన్తి-ధూమాత్- రాత్రిం-రాత్రేః - అపక్షీయమాణపక్షం-అపక్షీయమానపక్షాత్-యాన్-షణ్మాసాన్-దక్షిణాం- ఆదిత్యః-ఏతి మాసేభ్యః-పితృలోకం పితృలోకాత్ - చన్ద్రం - తే- చన్ద్రం-ప్రాప్య-అన్నం-భవన్తి-తాన్-తత్ర-దేవాః-యథా-సోమం - రాజానం-ఆప్యాయస్వ-అపక్షీయస్వ-ఇతి-ఏవం-ఏనాన్ - తత్ర - భక్షయన్తి-తేషాం-యదా-తత్-పర్యవైతి అథ-ఇమం-ఏవ-ఆకాశం -అభినిష్పద్యన్తే-ఆకాశాత్-వాయుం-వాయోః-వృష్టిం - వృష్టేః - పృథివీం తే-పృథివీం-ప్రాప్య అన్నం-భవన్తి-తేపునః-పురుషాగ్నౌ - హూయన్తే-తతః-యోషాగ్నౌ-జాయన్తే-తే-లోకాన్-ప్రతి - ఉత్థాయినః-తే-ఏవం-ఏవ-అను-పరివర్తన్తే-అథ-యే-ఏతౌ-పన్థానౌ - న- విదుః-తే-కీటాః-పతఙ్గాః-యత్-ఇదం-దన్దశూకం.

ప్ర॥ అథ=అనంతరము, యే=ఎవరు, యజ్ఞేన=అగ్నిహోత్రాది కర్మముచేతను, దానేన=దానముచేతను. తపసా = కృచ్ఛ్రచాంద్రాయణాది తపస్సుచేతను లోకాన్=లోకములను, జయన్తి=జయించుచున్నారో, తే=వారు, ధూమం = ధూమమును, (ధూమ దేవతను), అభిసమ్భవన్తి=పొందుచున్నారు. ధూమాత్ = ధూమ దేవతవలన, రాత్రిం=రాత్ర్యభిమాన దేవతను, రాత్రేః = రాత్ర్యభిమాన దేవత వలన, అపక్షీయమాణపక్షం=క్షీణించుచున్న పక్షమును, (కృష్ణపక్ష దేవతను వారు పొందుచున్నారు). అపక్షీయమాణపక్షాత్ = కృష్ణ పక్ష దేవతవలన, ఆదిత్యః=సూర్యుఁడు, యాన్=ఏ, షణ్మాసాన్= ఆఱుమాసములను, దక్షిణాం = దక్షిణదిక్కును, ఏతి = పొందు చున్నాఁడో, (తాన్ = ఆ మాసరూప దేవతలను. ప్రతిపద్యన్తే =

పొందుచున్నారు). మాసేభ్యః=మాసరూప దేవతల వలన, పితృలోకం=పితృలోకమును, పితృలోకాత్=పితృలోకమువలన, చన్ద్రం=చన్ద్రుని, (ప్రతిపద్యన్తే=పొందుచున్నారు), తే = వారు, చన్ద్రం = చంద్రుని, ప్రాప్య=పొంది, అన్నం = అన్నము, భవన్తి = అగుచున్నారు. తత్ర=ఆ చన్ద్రలోకమునందు, దేవాః=దేవతలు, తాన్=ఆ చంద్రలోకమును పొంది అన్న రూపములైనవారిని, (యజ్ఞే = యజ్ఞమునందు, ఋత్విజః = ఋత్విక్కులు), రాజానం = రాజైన, సోమం=చంద్రుని, ఆప్యాయస్వ=తృప్తిని పొందించుమా! అపక్షీయస్వ=క్షీణించుమా! ఇతి=అని, యథా=ఏ ప్రకారము, (భక్షయన్తి=భక్షించుచున్నారో), ఏవం=ఈ ప్రకారము, తత్ర=ఆ చంద్రమండల మందలి, ఏనాన్=ఈ కార్మికులను, (దేవతలు), భక్షయంతి=భక్షించుచున్నారు. తేషాం = ఆ కార్మికులయొక్క, తత్ = ఆ కర్మము. యదా=ఎప్పుడు, పర్యవైతి = క్షీణించుచున్నదో, అథ = అప్పుడు, (తే=వారు), ఇమమేవ=ఈ సిద్ధమైనదిగానేయున్న, ఆకాశం=ఆకాశమును, అభినిష్పద్యన్తే=పొందుచున్నారు. తే = వారు, ఆకాశాత్=ఆకాశమువలన, వాయుం=వాయువును, వాయోః = వాయువువలన, వృష్టిం=వర్షమును,వృష్టేః=వర్షమువలన, పృథివీం=భూమిని, ప్రాప్య=పొంది, అన్నం=అన్నము, భవన్తి=అగుచున్నారు. తే = ఆ అన్నరూపమైన కార్మికులు, పునః = తిరిగి, పురుషాగ్నౌ = పురుషాగ్నియందు, హూయన్తే=హోమము చేయఁబడుచున్నారు. తతః=అందునుండి, యోషాగ్నౌ=స్త్రీ రూపమైన అగ్నియందు, జాయన్తే=పుట్టుచున్నారు. తే=వారు, లోకాన్ ప్రతి=లోకములనుగూర్చి, ఉత్థాయినః=లేచిపోయెడివారు, (భవన్తి=అగుచున్నారు). తే = వారు, ఏవమేన=ఈ ప్రకారముగా, అనుపరివర్తన్తే = అనుసరించి ప్రవర్తించుచున్నారు. (తిరిగి తిరిగి వచ్చుచు పోవుచు నున్నారు). అథ=అనంతరము, యే=ఎవరు, ఏతౌ=ఈ. పన్థానౌ=మార్గములను, (ఉత్తరాయ

ణ దక్షిణాయన మార్గములను), నవిదుః=తెలిసికొనరో, తే=వారు, కీటాః=పురుగులుగాను, పతఙ్గాః=పక్షులుగాను, ఇదం=ఈ, దన్దశూకం=ఈఁగలు. దోమలు, యత్=ఏవియో. ఏతత్=ఇవిగా, (భవన్తి =అగుచున్నారు).

తా॥ యజ్ఞదానతపస్సులచే పుణ్యలోకములను పొందెడివారు ధూమాది మార్గమను పేరుగల దక్షిణాయనముద్వారా రాత్రి దేవతను, రాత్రి దేవత వలన కృష్ణపక్ష దేవతను, కృష్ణపక్ష దేవత వలన దేవతారూపమైన షణ్మాసములను, షణ్మాస దేవతవలన పితృలోకమును, పితృలోకమువలన చంద్రలోకమును, పొంది, అన్నరూపమగుచున్నారు. లోకమునందు యజ్ఞకర్మయందలి ఋత్విక్కులు పితృదేవతలకును బ్రాహ్మణులకును రాజైన చంద్రుని, 'ఆప్యాయస్వ అపక్షీయస్వ' యను మంత్రముతో, హృదయమందలి జీవాత్మను తృప్తిపఱచుము, క్షీణించుము, అని చెప్పుచు, సోమపానరూపముగా భక్షించునట్లు దేవతలు ఆ చంద్రలోకమునందు అన్నరూపమైన వారిని ఉపకరణములనుగాఁ జేసికొని వారి కర్మానురూపమైన ఫలమును ఇచ్చుచు అనుభవించుచున్నారు. వారికి చంద్రలోక ప్రాప్తి సాధన కర్మ నశించునపుడు, వారు, ఆకాశమును పొంది, ఆకాశమువలన వృష్టిని, వృష్టివలన భూమిని, పొంది, అన్నమగుచున్నారు. అన్నరూపమైనవారు పురుషాగ్నియందు హోమము చేయఁబడి ఆ పురుషాగ్నినుండి స్త్రీరూపమైన అగ్నియందు హోమముచేయఁబడి, పుట్టుచున్నారు. వారు తిరిగి కర్మచేయుచు లోకములను పొందెడివారగుచున్నారు. వారు ఈ ప్రకారము జనన మరణములచే రాకపోకలు కలిగి వచ్చుచు పోవుచున్నారు, ఇట్లు ఉత్తరాయణ దక్షిణాయన మార్గములను తెలిసికొననివారు పురుగులుగాను పక్షులుగాను ఈఁగలు దోమలుగాను పుట్టుచున్నారు. ఇట్లు చెప్పుటచేత 'వేత్థో యథాऽసౌలోక ఏవంబహుభిః పునః పునః ప్రయద్భిర్నసంపూర్యతే' అను

మూడవ ప్రశ్నకుత్తరము చెప్పఁబడినది. పితృలోకమువలన చంద్రలోకమును పొందుచున్నారని చెప్పుటచేత పొందఁదగిన దేశమును గుఱించి చేసిన ప్రథమ ప్రశ్న కుత్తరము చెప్పఁబడినది. ఈ ఆకాశమును పొందుచున్నారని చెప్పుటచేత లోకాంతరమునుండి తిరిగి వచ్చుటను గూర్చి చేసిన రెండవ ప్రశ్న కుత్తరము చెప్పఁబడినది. వారు ఉత్తరాయణ మార్గమును దక్షిణాయ మార్గమును పొందుచున్నారని చెప్పిన గ్రంథసందర్భముల రెంటిచేతను దేవయాన పితృయానములను గుఱించి చేసిన పంచమ ప్రశ్నకుత్తరము చెప్పఁబడినది. ద్యు పర్జన్య లోక పురుష యోషిత్తులను అగ్నులయందు క్రమముగా హోమము చేయఁబడిన ఉదక చంద్రవృష్టి అన్న రేతస్సులను ఐదింటిచే పురుషుఁడు పుట్టుచున్నాఁడని, "అసౌ వై లోకో అగ్నిః" అను మంత్రము మొదలుకొని 'యోషావాఅగ్నిః' అను మంత్రము వఱకు చెప్పుటచే, ఎన్ని ఆహుతులు హోమము చేయఁబడుచుండగా ఉదకములు పురుషవాక్కు లగుచున్నవని చేసిన అయిదవ ప్రశ్న కుత్తరము చెప్పఁబడినది. ఈ ప్రకారముగా ప్రశ్నలన్నియు నిర్ణయింపఁబడినవి.

ఇట్లు అష్టమాధ్యాయమునందు ద్వితీయబ్రాహ్మణము సమాప్తము.

## అష్టమాధ్యాయము-తృతీయబ్రాహ్మణమ్.

ఉ॥ స యః కామయేత మహత్ప్రాప్నుయా మిత్యుదగయన ఆపూర్యమాణ పక్షస్య పుణ్యాహే ద్వాదశాహ ముపసద్వ్రతీ భూత్వౌదుమ్బరే కగ్ంసే చమసే వా సర్వౌషధం ఫలానీతి సమ్భృత్య పరిసమూహ్య పరిలిప్యాగ్ని ముపసమాధాయ పరిస్తీర్యా వృతాజ్యగ్ం సగ్ంస్కృత్య పుగ్ం సా నక్షత్రేణ మన్థగ్ం సన్నీయ జుహోతి । యావన్తో దేవా స్త్వయిజాతవేద స్తిర్యఞ్చోఘ్నన్తి పురుషస్య కామాన్ । తేభ్యోఽహం భాగధేయం జుహోమి తేమా తృప్తా

స్సర్వైః కామైః స్తర్పయన్తు స్వాహా । యా తిరశ్చీ నిపద్యతేఽహం విధరణీ ఇతి । తాం త్వా ఘృతస్య ధారయా యజే సగ్ంరాధనీ మహగ్ం స్వాహా. ॥1॥

ప॥ సః-యః-కామయేత-మహత్-ప్రాప్నుయామ్-ఇతి-ఉదగయనే- ఆపూర్యమాణపక్షస్య-పుణ్యాహే-ద్వాదశాహం - ఉపసద్వ్రతీభూత్వా-ఔదుమ్బరే-కంసే-చమసే-వా-సర్వౌషధం-ఫలాని - ఇతి-సమ్భృత్య పరిసమూహ్య-పరిలిప్య-అగ్నిం-ఉపసమాధాయ- పరిస్తీర్య-ఆవృతా-ఆజ్యం-సంస్కృత్య-పుంసా-నక్షత్రేణ-మన్థం - సన్నీయ - జుహోతి-యావన్తః- దేవాః-త్వయి-జాతవేదః - తిర్యఞ్చః - ఘ్నన్తి-పురుషస్య-కామాన్ - తేభ్యః-అహం-భాగధేయం - జుహోమి - తే-మా-తృప్తాః-సర్వైః-కామైః-తర్పయన్తు-స్వాహా-యా-తిరశ్చీ - నిపద్యతే-అహం-విధరణీ-ఇతి-తాం-త్వా ఘృతస్య-ధారయా - యజే - సంరాధనీం-అహం-స్వాహా.

ప్ర॥ యః=ఎవఁడు, (అహం = నేను), మహత్ = మహత్త్వముఁ, ప్రాప్నుయామితి=పొందుదునుగాక యని, కామయేత=కోరునో, సః=వాఁడు, ఉదగయనే=ఉత్తరాయణమునందు, ఆపూర్యమాణపక్షస్య=నిండుపక్షమైన శుక్లపక్షముయొక్క, పుణ్యాహే=పుణ్యదినమునందు. (ఉపక్రమ్య=ఉపక్రమించి), ద్వాదశాహం = పండ్రెండు రోజులు, ఉపసద్వ్రతీ=ఉపసదస్సులను నియమముగలవాఁడు, (యజ్ఞములయందు ప్రసిద్ధములైన ఉపసదస్సులను పయోభక్షణ రూపమైన నియమము గలవాఁడు), భూత్వా=అయి, ఔదుమ్బరే = మేడికట్ట రూపమైనదిగాని, కంసే=కంచుచే నిర్మింపఁబడినదిగాని యగు, చమసేవా=సోమపాన పాత్రయందైనను, సర్వౌషధం = సమస్త ఓషధుల యొక్క సమూహమునున్ను, ఫలానీతి=ఫలములనున్ను, సమ్భృత్య= సంపాదించి, పరిసమూహ్య=చిమ్మి, పరిలిప్య=గోమయముచే నలికి, (భూమిని ఇట్లు పరిశుద్ధముచేసి), అగ్నిం=అగ్నిని, ఉపసమాధాయ =

ఉంచి, (సమీపమందుంచుకొని), పరిస్తీర్య=దర్భలను పఱచి, ఆవృతా =స్మార్తపరిపాటితో, (స్థాలీపాకాదికముతో), ఆజ్యం = నేతిని, సంస్కృత్య=సంస్కరించి, పుంసానక్షత్రేణ = జ్యోతిశ్శాస్త్ర ప్రసిద్ధమైన పురుష నక్షత్రముతోఁగూడిన (శుభదినమునందు), మన్థం = సర్వౌషధి ఫల విశిష్టమైన దానినిగా, సన్నీయ=అగ్ని సమీపమును పొందించి, జుహోతి=హోమము చేయుచున్నాఁడు. (ఈ చెప్పెడి 'యావన్తో దేవా' అనునది మొదలైన మంత్రములచే మేడికొయ్యచేఁ జేయఁబడిన స్రువమను ఆజ్యమును గ్రహించెడి పాత్రచేత హోమము చేయుచున్నాఁడు). హే జాతవేదః=ఓ అగ్ని హోత్రుఁడా! దేవాః=దేవతలు, యావన్తః=ఎందఱో, (తే=వారు), త్వయి=నీయందు, అధీనాః =అధీనమైనవారై, తిర్యఞ్చః=వక్రమైన మతములు కలవారై, పురుషస్య=పురుషునియొక్క, కామాన్ =కోరికలను, ఘ్నన్తి=కొట్టివేయుచున్నారు. తేభ్యః=ఆ దేవతలకొఱకు. అహం=నేను, భాగధేయం= ఆజ్యభాగమును, జుహోమి = హోమము చేయుచున్నాను. తే = ఆ దేవతలు, తృప్తాః=తృప్తిని పొందనివారై, మా = నన్ను, సర్వైః కామైః=సమస్త కామములతో, తర్పయన్తు=తృప్తి పొందించుదురుగాక. స్వాహా=ఇది హోమమంత్ర సూచకమైనది! (హే జాతవేదః= ఓ అగ్నిహోత్రుఁడా! యా = ఏ దేవత, తిరశ్చీ = కుటిలమైనదై, అహం=నేను. విధరణీ ఇతి=సర్వమును ధరించుచున్నానని, త్వా = నిన్ను, ఆశ్రిత్య=ఆశ్రయించి), నిపద్యతే=ఉంటున్నదో, తాం=అటువంటి సర్వసాధనమగు, సంరాధనీం=పూజించఁదగిన దేవతనుగూర్చి, అహం=నేను, ఘృతస్య=నేతియొక్క, ధారయా=ధారచేతను, యజే =యాగము చేయుచున్నాను. (ఆరాధించుచున్నాను). స్వాహా=ఇది హోమమంత్రము తెలియఁజేయుచున్నది.

తా॥ మహత్త్వమును పొందవలయునని కోరెడివాఁడు, ఉత్తరాయణములో శుక్లపక్షమునందు అనుకూలమైన పుణ్యదివసము

నాఁడు ఉపక్రమించి పండ్రెండవ రోజులు పయోభక్షణ రూపమైన వ్రతమును చేయువాఁడై సంమార్జన గోమయ లేపనాదులచే భూమిని పరిశుద్ధముచేసి అగ్నిని ఉంచి దర్భలనుపఱచి ఓషధి సమూహములను ఫలములను సంపాదించి మేడికఱ్ఱతోఁ జేయఁబడిన సోమపానపాత్ర యందుగాని కంచుచే నిర్మింపఁబడిన సోమపాన పాత్రయందుగాని ఉంచి మథించి శుధించి సర్వౌషధిరసము కలదిగాఁ జేయఁబడిన ఆజ్యమును స్మృతియందు చెప్పఁబడిన రీతితో స్థాలీపాకాది క్రమముగా సంస్కరించి అగ్ని సామీప్యమును పొందించి, "యావన్తో దేవా" అనునట్టిన్ని "యాతిరశ్చీనిపద్యతే" అనునట్టిన్ని, ఈ మొదలైన మంత్రములతో హోమము చేయుచున్నాఁడు. దీనిలోని ఈ రెండు మంత్రముల కర్థమేమనఁగా, ఓ అగ్ని హోత్రుఁడా! నీకధీనులై యుండెడి దేవతలందఱు కుటిలస్వభావము గలవారై పురుషునియొక్క కోరికలను వినాశము చేయుచున్నారు. అట్టి దేవతలకొఱకు నేను వారి వారి భాగమును హోమము చేయుచున్నాను. ఆ దేవతలు తృప్తి పొందినవారై నన్ను సమస్త కామములతో తృప్తిపఱచుదురుగాక యని ప్రథమ మంత్రార్థము. ఓ అగ్ని హోత్రుఁడా! సర్వమును నేనే ధరించుచున్నానని కుటిలస్వభావము కలదై నిన్ను ఆశ్రయించి యుండెడి పూజింపఁదగిన ఆ దేవతనుగూర్చి నేను ఆజ్యధారచే ఆరాధించు చున్నాను అని రెండవ మంత్రార్థము.

ఉ॥ జ్యేష్ఠాయ స్వాహా శ్రేష్ఠాయ స్వాహేత్యగ్నౌ హుత్వా మన్థేసగ్ స్రవమవనయతి ప్రాణాయ స్వాహా వసిష్ఠాయై స్వాహేత్యగ్నౌ హుత్వా మన్థేసగ్ స్రవమవనయతి వాచే స్వాహా ప్రతిష్ఠాయై స్వాహేత్యగ్నౌ హుత్వా మన్థేసగ్ స్రవమవనయతి చక్షుషే స్వాహా సమ్పదే స్వాహేత్యగ్నౌ హుత్వా మన్థే సగ్ స్రవమవనయతి శ్రోత్రాయ స్వాహా ఆయతనాయ స్వాహేత్యగ్నౌ హుత్వా మన్థేసగ్ సవమవనయతి మనసే స్వాహా ప్రజాత్యై స్వా

హేత్యగ్నౌ హుత్వా మన్థే సగ్ స్రవమవనయతి రేతసే స్వాహే
త్యగ్నౌ హుత్వా మన్థే సగ్ స్రవమవనయతి. ।2॥

ప॥ జ్యేష్ఠాయ-స్వాహా - శ్రేష్ఠాయ - స్వాహా-ఇతి-అగ్నౌ - హుత్వా-మన్థే-సంస్రవం-అవనయతి-ప్రాణాయ-స్వాహా - వసిష్ఠాయై-స్వాహా-ఇతి-అగ్నౌ-హుత్వా-మన్థే-సంస్రవం - అవనయతి - వాచే-స్వాహా-ప్రతిష్ఠాయై-స్వాహా-ఇతి అగ్నౌ-హుత్వా-మన్థే- సంస్రవం-అవనయతి-చక్షుషే-స్వాహా-సమ్పదే-స్వాహా-ఇతి-అగ్నౌ- హుత్వా మన్థే-సంస్రవం-అవనయతి-శ్రోత్రాయ - స్వాహా - ఆయతనాయ - స్వాహా-ఇతి-అగ్నౌ-హుత్వా-మన్థే-సంస్రవం-అవనయతి - మనసే - స్వాహా-ప్రజాత్యై-స్వాహా-ఇతి-అగ్నౌ-హుత్వా-మన్థే - సంస్రవం-అవనయతి-రేతసే స్వాహా ఇతి-అగ్నౌ-హుత్వా-మన్థే సంస్రవం - అవనయతి.

ప్ర॥ జ్యేష్ఠాయ = జ్యేష్ఠత్వ గుణముతోఁగూడిన ప్రాణము కొఱకు, స్వాహా=ఇది సర్వత్రమంత్రమునకు హోమార్థమును సూచన చేయుచున్నది. (అంతటను ఈ ప్రకారము తెలిసికొనఁదగినది). శ్రేష్ఠాయ=శ్రేష్ఠత్వగుణముతోఁ గూడుకొనిన ప్రాణము కొఱకు, స్వాహా=హావిస్సును ఇచ్చుట, అగ్నౌ = అగ్నియందు, హుత్వా = హోమముచేసి, ప్రాణాయ = ముఖ్యప్రాణము కొఱకు, స్వాహా = హోమము, ఇతి=అని, మన్థే=అగ్నికి వెనుకభాగమునందుండెడి మథన పాత్రమునందలి, సంస్రవం = స్రవమను పాత్రను ఆశ్రయించి యుండెడి ఆజ్యమును, అవనయతి=పొందించుచున్నాఁడు. వసిష్ఠాయ స్వాహా=వసిష్ఠత్వ గుణముగల వాక్కుకొఱకు హోమము, ఇతి=అని, అగ్నౌ=అగ్నియందు, హుత్వా = హోమముచేసి, వాచేస్వాహా = వాక్కుకొఱకు హోమము, (అని), మన్థే = మథనపాత్రయందలి, సంస్రవం=స్రవమను పాత్రను ఆశ్రయించి యుండెడి ఆజ్యమును అవనయతి=పొందించుచున్నాఁడు. ప్రతిష్ఠాయైస్వాహేతి=ప్రతిష్ఠాత్వ

గుణముగల నేత్రముకొఱకు హోమముఅని, అగ్నౌ = అగ్నియందు, హుత్వా = హోమముచేసి, చక్షుషేస్వాహా = నేత్రముకొఱకు హోమము (అని) మన్థే=మథన పాత్రయందలి, సంస్రవం=స్రువమను పాత్రను ఆశ్రయించి యుండెడి ఆజ్యమును, అవనయతి = పొందించు చున్నాడు. సమ్పదేస్వాహేతి = సంపద్గుణ విశిష్టమైన శ్రోత్రము కొఱకు హోమమని, అగ్నౌ=అగ్నియందు, హుత్వా=హోమముచేసి, శ్రోత్రాయస్వాహా=శ్రావణము కొఱకు హోమము, (అని), మన్థే = మథన పాత్రయందలి, సంస్రవం=స్రువమను పాత్రను ఆశ్రయించి యుండెడి ఆజ్యమును, అవనయతి=పొందించుచున్నాడు. ఆయతనా యస్వాహేతి=ఆయతనత్వగుణ విశిష్టమైన మనస్సుకొఱకు హోమము అని, అగ్నౌ=అగ్నియందు, హుత్వా=హోమముచేసి, మనసేస్వాహా = మనస్సుకొఱకు హోమము (అని), మన్థే = మథనపాత్రయందలి, సంస్రవం = స్రువమను పాత్రను ఆశ్రయించియుండెడి ఆజ్యమును, అవనయతి=పొందించుచున్నాడు. ప్రజాత్యైస్వాహేతి = సంతానాది గుణవిశిష్టమైన రేతస్సుకొఱకు హోమమని, అగ్నౌ = అగ్నియందు, హుత్వా=హోమముచేసి, మన్థే= మథనపాత్రయందలి, సంస్రవం = స్రువమను పాత్రను ఆశ్రయించి యుండెడి ఆజ్యమును అవనయతి= పొందించుచున్నాడు. రేతసేస్వాహేతి= రేతస్సుకొఱకు హోమమని, అగ్నౌ=అగ్నియందు, హుత్వా=హోమముచేసి, మన్థే= మథనపాత్ర యందలి, సంస్రవం=స్రువమను పాత్రను ఆశ్రయించి యుండెడి ఆజ్యమును, అవనయతి=పొందించుచున్నాడు.

తా॥ ఆ మహత్వమును కోరెడివాడు ఈప్రకారము ప్రాణము మొదలైన వాగాదులన్నిటి కొఱకును వాటివాటి జ్యేష్ఠత్వ శ్రేష్ఠత్వాది గుణముల కొఱకును ఆజ్యాహుతిని పొందించుచున్నాడు.

ఉ॥ అగ్నయే స్వాహేత్యగ్నౌ హుత్వా మన్థే సగ్ స్రవమవనయతి
సోమాయ స్వాహేత్యగ్నౌ హుత్వా మన్థే సగ్ స్రవమవనయతి

భూ స్స్వాహేత్యగ్నౌ హుత్వా మన్థే సగ్ స్రవమవనయతి భువ స్స్వాహేత్యగ్నౌ హుత్వా మన్థే సగ్ స్రవమవనయతి సువ స్స్వాహేత్యగ్నౌ హుత్వా మన్థే సగ్ స్రవమవనయతి భూర్భువ స్సువ స్స్వాహేత్యగ్నౌ హుత్వా మన్థే సగ్ స్రవమవనయతి బ్రహ్మణే స్వాహేత్యగ్నౌ హుత్వామన్థేసగ్ స్రవమవనయతి క్షత్రాయ స్వాహేత్యగ్నౌ హుత్వా మన్థేసగ్ స్రవమవనయతి భూతాయ స్వాహేత్యగ్నౌ హుత్వా మన్థే సగ్ స్రవమవనయతి భవిష్యతే స్వాహేత్యగ్నౌ హుత్వా మన్థే సగ్ స్రవమవనయతి విశ్వాయ స్వాహేత్యగ్నౌ హుత్వా మన్థే సగ్ స్రవమవనయతి సర్వాయ స్వాహేత్యగ్నౌ హుత్వా మన్థే సగ్ స్రవమవనయతి ప్రజాపతయే స్వాహేత్యగ్నౌ హుత్వా మన్థే సగ్ స్రవమవనయతి. ॥3॥

ప॥ అగ్నయే-స్వాహా-ఇతి-అగ్నౌ-హుత్వా-మన్థే-సంస్రవం-అవనయతి-సోమాయ-స్వాహా-ఇతి-అగ్నౌ-హుత్వా-మన్థే-సంస్రవం-అవనయతి-భూస్స్వాహా-ఇతి అగ్నౌ-హుత్వా-మన్థే-సంస్రవం-అవనయతి-భువస్స్వాహా- ఇతి అగ్నౌ-హుత్వా-మన్థే-సంస్రవం-అవనయతి-సువస్స్వాహా-ఇతి-అగ్నౌ-హుత్వా-మన్థే-సంస్రవం-అవనయతి-భూర్భువస్సువస్స్వాహా-ఇతి-అగ్నౌ-హుత్వా-మన్థే-సంస్రవం-అవనయతి-బ్రహ్మణే-స్వాహా-ఇతి-అగ్నౌ-హుత్వా-మన్థే-సంస్రవం-అవనయతి-క్షత్రాయ-స్వాహా-ఇతి-అగ్నౌ-హుత్వా-మన్థే-సంస్రవం-అవనయతి-భూతాయ-స్వాహా-ఇతి-అగ్నౌ-హుత్వా-మన్థే-సంస్రవం-అవనయతి-భవిష్యతే-స్వాహా-ఇతి-అగ్నౌ-హుత్వా-మన్థే-సంస్రవం-అవనయతి-విశ్వాయ-స్వాహా-ఇతి-అగ్నౌ-హుత్వా-మన్థే-సంస్రవం-అవనయతి-సర్వాయ-స్వాహా-ఇతి-అగ్నౌ-హుత్వా-మన్థే-సంస్రవం-అవనయతి-ప్రజాపతయే-స్వాహా-ఇతి అగ్నౌ హుత్వా-మన్థే - సంస్రవం-అవనయతి.

ప్ర॥ అగ్నయే = అగ్నికొఱకు. స్వాహేతి = హోమము అని;

అగ్నౌ=అగ్నియందు, హుత్వా=హోమముచేసి, మన్థే=మథనపాత్రి యందలి, సంస్రవం = స్రువమను పాత్రిను ఆశ్రియించి యుండెడి ఆజ్యమును, అవనయతి=పొందించుచున్నాఁడు. సోమాయ=చంద్రుని కొఱకు, స్వాహేతి=హోమము అని, అగ్నౌ=అగ్నియందు, హుత్వా =హోమముచేసి, మన్థే=మథనపాత్రియందలి, సంస్రవం=స్రువమను పాత్రిను ఆశ్రియించి యుండెడి ఆజ్యమును, అవనయతి=పొందించు చున్నాఁడు. భూస్స్వాహేతి=భూస్స్వాహా అని, అగ్నౌ=అగ్నియందు, హుత్వా=హోమముచేసి, మన్థే=మథన పాత్రియందలి, సంస్రవం = స్రువమను పాత్రిమును ఆశ్రియించి యుండెడి ఆజ్యమును, అవన యతి = పొందించుచున్నాఁడు. భువస్స్వాహేతి = భువస్స్వాహా అని, అగ్నౌ=అగ్నియందు, హుత్వా=హోమముచేసి, మన్థే=మథనపాత్ర యందలి, సంస్రవం=స్రువమను పాత్రిను పొందియున్న ఆజ్యమును, అవనయతి = పొందించుచున్నాఁడు. సువస్స్వాహేతి = సువస్స్వాహా అని, అగ్నౌ=అగ్నియందు, హుత్వా=హోమముచేసి, మన్థే=మథన పాత్రియందలి, సంస్రవం=స్రువమను పాత్రిను పొందియున్న ఆజ్య మును, అవనయతి=పొందించుచున్నాఁడు. భూర్భువస్సువస్స్వాహేతి= భూర్భువస్సువస్స్వాహా అని, అగ్నౌ = అగ్నియందు, హుత్వా = హోమముచేసి, మన్థే=మథనపాత్రియందలి, సంస్రవం = స్రువమను పాత్రిను పొందియున్నఆజ్యమును, అవనయతి=పొందించుచున్నాఁడు, బ్రిహ్మణే=బ్రాహ్మణజాత్యధిష్ఠాన దేవతకొఱకు, స్వాహేతి=హోమ మని అగ్నౌ=అగ్నియందు, త్వా=హోమముచేసి, మన్థే=మథన పాత్రియందలి, సంస్రవం=స్రువమను పాత్రిను పొందియున్న ఆజ్య మును, అవనయతి=పొందించుచున్నాఁడు. క్షత్రాయ=క్షత్రియజాత్య ధిష్ఠాన దేవతకొఱకు, స్వాహా=హోమము, ఇతి=అని, అగ్నౌ=అగ్ని యందు, హుత్వా=హోమముచేసి, మన్థే=మథనపాత్రియందలి, సం స్రవం=స్రువమును పొందియున్న అజ్యమును, అవనయతి=పొందించు

చున్నాడు. భూతాయ=భూతకాలాధిష్ఠాన దేవతకొఱకు, స్వాహేతి =హోమమని, అగ్నౌ=అగ్నియందు, హుత్వా=హోమముచేసి, మన్థే =మథనపాత్రియందలి, సంస్రివం=సుృవమును పొందియున్న ఆజ్యమును, అవనయతి=పొందించుచున్నాడు, భవిష్యతే = భవిష్యత్కాలాధిష్ఠాన దేవత కొఱకు, స్వాహేతి=హోమము అని, అగ్నౌ=అగ్ని యందు, హుత్వా = హోమముచేసి, మన్థే = మథనపాత్రియందలి, సంస్రివం=సుృవమును పొందియున్న ఆజ్యమును, అవనయతి = పొందించుచున్నాడు. విశ్వాయ=ప్రపంచాధిష్ఠాన దేవతకొఱకు, స్వాహేతి=హోమమని, అగ్నౌ=అగ్నియందు, హుత్వా = హోమముచేసి, మన్థే=మథనపాత్రియందలి; సంస్రివం = సుృవమును పొందియున్న ఆజ్యమును. అవనయతి=పొందించుచున్నాడు. సర్వాయ = సర్వాధిష్ఠాన దేవతకొఱకు. స్వాహేతి=హోమమని, అగ్నౌ = అగ్నియందు హుత్వా=హోమముచేసి, మన్థే=మథనపాత్రియందలి, సంస్రివం = సుృవమును పొందియున్న ఆజ్యమును, అవనయతి = పొందించుచున్నాడు ప్రజాపతయే=సృష్టికర్తయగు బ్రహ్మకొఱకు, స్వాహేతి= హోమమని, అగ్నౌ=అగ్నియందు, హుత్వా=హోమముచేసి, మన్థే =మథనపాత్రియందలి, సంస్రివం=సుృవమును పొందియున్న ఆజ్యమును, అవనయతి=పొందించుచున్నాడు.

తా॥ మహత్వమును కోరెడి పయఃపానవ్రతమును చేయువాడు,- ఈ ప్రకారము అగ్ని మొదలుకొని ప్రజాపతి వఱకు నుండెడి దేవతలందఱి కొఱకును ఆజ్యాహుతిని చేయుచున్నాడు.

ఉ॥ అథైనమభిమృశతి భ్రమదసి జ్వలదసి పూర్ణమసి ప్రస్తబ్ధమస్యేకసభమసి హిఙ్కృతమసి హిఙ్క్రియమాణ మస్యుద్గీథమసి ఉద్గీయమానమసి శ్రావిత మసి ప్రత్యాశ్రావిత మస్యార్ద్రే సన్దీప్తమసి విభూరసి ప్రభూరస్యన్న మసి జ్యోతిరసి నిధనమసి సంవర్గోఽసీతి ॥4॥

ప॥ అథ–ఏవం–అభిమృశతి-భ్రమత్-అసి–జ్వలత్-అసి–పూర్ణం-అసి–ప్రస్తబ్ధం–అసి-ఏకసభం-అసి - హింకృతం-అసి - హింక్రియమాణం–అసి–ఉద్గీథం-అసి-ఉద్గీయమానం–అసి-శ్రావితం–అసి–ప్రత్యాశ్రావితం-అసి-ఆర్ద్రే-సన్దీప్తం–అసి–విభూః–అసి–ప్రభూః-అసి-అన్నం-అసి–జ్యోతిః–అసి–నిధనం–అసి–సంవర్గః-అసి-ఇతి.

ప్ర॥ అథ = అనంతరము, ఏనం = మథింపఁబడిన ఆజ్యాహుతి రూపమైన ద్రవ్యమును, అభిమర్శతి=విచారించుచున్నాఁడు. (ఇక్కడ మన్థ ద్రవ్యము ప్రాణదేవతాకమైన దగుటవలన దానిని ప్రాణముతో నైక్యముచేసి దానికే సర్వాత్మకత్వము 'భ్రమదసి' యను మంత్రముచే విచారింపఁబడుచున్నది), (ఓ మన్థద్రవ్యమా! నీవు, వాయు రూపముతో), భ్రమదసి=చలించెడి దానవగుచున్నావు, (అగ్నిరూపముతో), జ్వలదసి=ప్రకాశించెడిదాన వగుచున్నావు. (బ్రహ్మస్వరూపముచే), పూర్ణమసి = నిండినదాన వగుచున్నావు. (ఆకాశరూపముతో), ప్రస్తబ్ధమసి = కంపములేనిదాన వగుచున్నావు. (సమస్త జగత్తు అందఱిచేత విరోధింపఁబడినది - గనుక ఆత్మయం దంతర్భావ్య మగు అపరిచ్ఛిన్నతతో నుండెడి), ఏకసభమసి=అద్వితీయ పరమార్థ వస్తువగుచున్నావు. (యజ్ఞారంభమునందు ప్రస్తోత యను ఋత్విక్కు చేతఁ జేయఁబడిన), హింకృతమసి=హింకారస్వరూప మగుచున్నావు. (ఆప్రస్తోతయను ఋత్విక్కుచేతనే యజ్ఞమధ్యమందు చేయఁబడిన), హింక్రియమాణమసి = హింకారమును చేసెడి స్వరూప మగుచున్నావు (యజ్ఞారంభమునందు ఉద్గాత యను ఋత్విక్కుచేతఁ జేయఁబడిన), ఉద్గీథమసి=సామవేద ప్రణవ స్వరూపమగుచున్నావు. (యజ్ఞ మధ్యమునందు ఆ ఉద్గాతచేతఁ జేయఁబడిన), ఉద్గీయమానసి =సామగాన స్వరూప మగుచున్నావు (యజ్ఞమునందు అధ్వర్యుని చేత), శ్రావితం = వినిపింపఁబడినదానవు, అసి = అగుచున్నావు. (యజ్ఞమునందు అగ్నీధ్రునిచేత), ప్రత్యాశ్రావితం = తిరిగి వినిపింపఁ

బడిన దానవు, అసి=అగుచున్నావు. ఆర్ద్రే = మేఘోదరమునందు. సన్దీప్తమసి=ప్రకాశించుదాన వగుచున్నావు. విభూః = నానావిధమైన దానవు, అసి= అగుచున్నావు. ప్రభూః=సమర్థమైన దానవు. అసి = అగుచున్నావు. (భోగ్యరూపమైన చంద్రరూపముతో నుండుటవలన), అన్నం=అన్నము అసి=అగుచున్నావు.(భోక్తృరూపమైన అగ్నిస్వరూపముతో). జ్యోతిః=జ్యోతిస్వరూపము, అసి=అగుచున్నావు. (కారణమగుటవలన), నిధనమసి = లయరూపమగుచున్నావు. (అధ్యాత్మాధిదైవస్వరూపములగు వాగాదులను సంహరించుట వలన), సంవర్గః= సంవర్గరూపము, (ప్రాణవిద్యోపాసనము) అసి=అగుచున్నావు. ఇతి = అని, (అభిమర్శన మంత్రము యొక్క అర్థము).

తా॥ ఇప్పుడు ఈ ఆజ్యాహుతినే ప్రాణాగ్న్యాది సర్వస్వరూపముగా నిక్కడ అభిమర్శన మంత్రము వివరించి చెప్పుచున్నది.

ఉ॥ అథైన ముద్యచ్ఛత్యామగ్ స్యామగ్ హి తే మహి స హి రాజేశానోఽధిపతిః స మాగ్ రాజేశానోఽధిపతిం కరోత్వితి. ॥5॥

ప॥ అథ-ఏనం-ఉద్యచ్ఛతి-ఆమం-స్యామం-హి-తే-మహి-సః-హి-రాజా-ఈశానః-అధిపతిః-సః-మాం-రాజా-ఈశానః-అధిపతిం - కరోతు-ఇతి.

ప్ర॥ అథ = అనంతరము, (ప్రాణేనసహ = ప్రాణముతోఁగూడ పురుషుఁడు హస్తమునందు). ఏనం = ఈ ఆహుతిని, ఉద్యచ్ఛతి = గ్రహించుచున్నాఁడు. ఓ ప్రాణమా! నీవు సర్వము తెలిసికొని యున్నావు. (వయం=మేము), తే=నీయొక్క, మహి = అధికమైన రూపమును, ఆమంహి= తెలిసికొను చున్నాము. రాజా = రాజైన, ఈశానః=సర్వమును నియమించుచున్న, అధిపతిః = సర్వప్రభువైన, సహి=ఆ ప్రాణమె, (వయం=మేము), స్యామం = అగుచున్నాము. ఈశానః=సర్వనియామకమగు, రాజా=రాజైన. సః = ఆ ప్రాణము, మాం=నన్ను, అధిపతిం = సమస్తమునకు అధిపతినిగా, కరోత్వితి =

చేయునుగాక యని. (ఉద్యచ్ఛతి యను మంత్రముయొక్క అర్థము).

తా॥ ఉపసదనమను పయః పానరూపమైన వ్రతమును పొందిన పురుషుఁడు, ఓ ప్రాణమా! నీవు సర్వమును తెలిసికొని యున్నావు. మేము సర్వమునకు నియామకముగు సమస్తమున కధిపతియునగు ఆ ప్రాణమే యగుదుము. అట్టి ప్రాణము నన్ను సర్వమున కధిపతినిగాఁ జేయునుగాక యని ప్రణముతోఁగూడ హస్తమునందు ఈ ఆహుతిని గ్రహించుచున్నాఁడు. ఇట్లు ఉద్యచ్ఛతియను మంత్రము యొక్క అర్థము.

ఉ॥ అథైన మాచామతి తత్సవితుర్వ రేణ్యం మధు వాతా ఋతాయతే మధుక్షర న్తి సిన్ధవః మాధ్వీర్నః సన్త్వో షధీర్భూః స్వాహా భర్గో దేవస్య ధీమహి మధు నక్తముతో షసో మధు మత్పార్థివగ్ం రజః మధు ద్యౌరస్తు నః పితా భువస్స్వాహా ధియో యో నః ప్రచోదయాత్ మధుమాన్నో వనస్పతిర్మధు మాగ్ం అస్తు సూర్యః మాధ్వీర్గావో భవన్తు నస్సు వస్స్వాహేతి సర్వాం చ సావిత్రీమన్వాహ సర్వాశ్చ మధుమతీరహ మేవేదగ్ం సర్వం భూయాసం భూర్భువస్సు వ స్స్వాహేత్యన్తత ఆచమ్యపాణీ ప్రక్షాళ్య జఘనేనాగ్నిం ప్రాక్ఛిరాః స్సం విశతి ప్రాత రాదిత్య ము పతిష్ఠతే దిశామేకపుణ్డరీకమస్య హం మనుష్యాణామేపుణ్డరీకం భూయాసమితి యథేత మేత్య జఘనేనాగ్ని మాసీనో వగ్ం శం జపతి. ॥6॥

ప॥ అథ-ఏనం-ఆచామతి-తత్-సవితుః - వరేణ్యం - మధు - వాతాః-ఋతాయతే-మధు-క్షరన్తి-సిన్ధవః- మాధ్వీః-నః - సన్తు - ఓషధీః-భూః-స్వాహా-భర్గః- దేవస్య-ధీమహి-మధు-నక్తం-ఉత - ఉషసః-మధుమత్-పార్థివగ్ం-రజః-మధు-ద్యౌః-అస్తు-నః-పితా - భువః - స్వాహా-ధియః-యః-నః-ప్రచోదయాత్-మధుమాన్-నః-వనస్పతిః - మధుమాన్-అస్తు-సూర్యః-మాధ్వీః-గావః-భవన్తు - నః - సువః -

-స్వాహా-ఇతి-సర్వాం-చ-సావిత్రీం-అన్వాహ-సర్వాః-చ-మధుమతీః -అహం-ఏవ-ఇదం-సర్వం-భూయాసం-భూర్భువస్సువః-స్వాహా-ఇతి - అన్తతః-ఆచమ్య-పాణీ-ప్రక్షాళ్య-జఘనేన-అగ్నిం-ప్రాక్శిరాః - సంవిశతి-ప్రాతః-ఆదిత్యం-ఉపతిష్ఠతే-దిశాం-ఏకపుణ్డరీకం-అసి - అహం - మనుష్యాణాం-ఏకపుణ్డరీకం-భూయాసం-ఇతి-యథా-ఏతం - ఏత్య - జఘనేన-అగ్నిం-ఆసీనః-వంశం-జపతి.

ప్ర॥ అథ=అనంతరము, (సః=ఆయజ్ఞమునందు ఉపసదనమను వ్రతమును చేయువాఁడు). వాతాః=వాయువులు, మధు=సుఖముగా, ఋతాయతే=వహించుచున్నవి. సిన్ధవః=నదులు, మధు=మధురమైన రసములను, క్షరన్తి=స్రవించుచున్నవి. ఓషధీః = ఓషధులు, నః = మమ్మునుగూర్చి, మాధ్వీః=మధురమైన రసములు గలవిగా, సన్తు = అగునుగాక, (అని), సవితుః=సూర్యునియొక్క, వరేణ్యం = శ్రేష్ఠపదమును, (ధీమహి=ధ్యానించుచున్నాము. అని గాయత్రియొక్క ప్రథమ పాదమగు ''తత్సవితుర్వరేణ్యం'' అనుదానిని ఉచ్చరించుచు), భూస్స్వాహా=భూస్స్వాహాయని, (భూః అను వ్యాహృతితో), ఏనం= ఈ హవిస్సును, ఆచామతి = భక్షించుచున్నాఁడు. (సః = వాఁడు), నక్తం=రాత్రి, ఉత=మఱియు, ఉషసః=పగళ్ళు, మధు=ప్రీతికరమైనవి, (సన్తు=అగునుగాక), పార్థివం = పృథివీ సంబంధమైన, రజః = పరాగము, మధువత్=దుఃఖకరము కానిది, (అస్తు = అగునుగాక), నః=మాకు, పితా=తండ్రియైన, ద్యౌః = ద్యులోకము, మధు=సుఖమైనది, అస్తు=అగునుగాక, (అని), దేవస్య=ప్రకాశమానుఁడగు సూర్యునియొక్క. భర్గః=తేజస్సును, ధీమహి=ధ్యానించుచున్నాము. (అని గాయత్రియొక్క ద్వితీయపాదమగు ''భర్గోదేవస్యధీమహి''(అనుదానిని ఉచ్చరించుచు), భువస్స్వాహా=భువస్స్వాహాయని (భువఃఅను వ్యాహృతితో). ఏనం=ఈ హవిస్సును, ఆచమతి=భక్షించుచున్నాఁడు). (సః= వాఁడు) వనస్పతిః=తరుగుల్మలతాదికము, నః=మాకు, మధుమాన్ =

సుఖకరమైనది,(అస్తు=అగునుగాక)సూర్యః=సూర్యుఁడు,(నః=మాకు) మధుమాన్=సుఖకరుఁడు, అస్తు=అగునుగాక. నః=మాకు గావః = కిరణములు, లేక, దిక్కులు, మాధ్వీః=సుఖకరములైనవి, భవన్తు = అగునుగాక. (అని), యః=ఏ సూర్యుఁడు, నః=మాయొక్క, ధియః- బుద్ధులను, ప్రచోదయాత్ = ప్రేరేపించునో, (తస్య = ఆ సూర్యుని యొక్క, వరేణ్యం = శ్రేష్ఠమైన తేజస్సును, ధీమహి = ధ్యానించు చున్నాము. అని గాయత్రియొక్క తృతీయపాదమగు "ధియోయోనః ప్రచోదయాత్" అనుదానిని ఉచ్చరించుచు), సువస్స్వాహేతి=సువ స్స్వాహాయని) (సువః అను వ్యాహృతితో) (ఏనం=ఈ హవిస్సును, ఆచామతి=భక్షించుచు న్నాఁడు). సర్వాం=సమస్తమైన, సావిత్రీంచ= సవితృదేవతాకమైన గాయత్రిని, అన్వాహ = అనుసరించి చెప్పెను. సర్వాః=అన్నియున్ను, మధుమతీః=సుఖకరములైనవి. అహమేవ = నేనే, ఇదం=ఈ, సర్వం=అంతయు, భూయాసం = అయితిని. (అని గాయత్రి మంత్రము నంతయును ఉచ్చరించుచు), భూర్భువస్సువస్స్వా హేతి=భూర్భువస్సువస్స్వాహా అని, (భూః భువః సువః అను మూఁడు వ్యాహృతులతో, ఏనం = ఈ హవిస్సును, ఆచమతి = భక్షించు చున్నాఁడు) అన్తతః=కడపట, పాణీ = హస్తములను, ప్రక్షాళ్య = కడుగుకొని, ఆచమ్య = ఆచమనముచేసి. అగ్నిం = అగ్నినిగూర్చి, జఘనేన=వెనుక భాగముగా, ప్రాక్ఛిరాః=తూర్పు శిరస్సుగలవాఁడై, సంవిశతి = శయనించుచున్నాఁడు. ప్రాతః = ప్రాతఃకాలమునందు, ఆదిత్యం=సూర్యునిగూర్చి, (ఓ సూర్యుఁడా! నీవు), దిశాం=దిక్కు లకు, ఏకపుణ్డరీకం=ఒకటియగు శ్వేతచ్ఛత్రము, (సర్వాధిపతివి), అసి =అగుచున్నావు. అహం=నేను, మనుష్యాణాం = మనుష్యులకు, ఏక పుణ్డరీకం=ఒక్కటియగు శ్వేతచ్ఛత్రము, భూయాసమితి= అగుదును గాక యని, ఉపతిష్ఠతే=ధ్యానించుచున్నాఁడు. యథైతం = పోయిన ప్రకారము, ఏత్య=తిరిగివచ్చి, అగ్నిం = అగ్నినిగూర్చి, జఘనేన =

వెనుకభాగముగా, ఆసీనః=కూర్చున్నవాఁడై, వంశం=వంశబ్రాహ్మణమును, జపతి=జపించుచున్నాఁడు.

తా॥ ఆ పురుషుఁడు, వాయువులు నదులు ఓషధులును మమ్మునుగూర్చి సుఖకరములైనవి యగును గాక యని గాయత్రి ప్రథమపాదమును చెప్పుచు భూః అను వ్యాహృతితో ఆ హవిస్సునందలి ప్రథమ కబళమును భక్షించుచున్నాఁడు. అదే ప్రకారము రాత్రి పగళ్ళున్ను భూపరాగమును ద్యులోకమును ఇవి మమ్మును గూర్చి సుఖకరములగును గాక యని గాయత్రి ద్వితీయపాదమును చెప్పుచు భువః అను వ్యాహృతితో రెండవ కబళమును భక్షించుచున్నాఁడు. అదే ప్రకారము తరుగుల్మలతాదులును సూర్యుఁడును కిరణములు దిక్కులు మమ్మునుగూర్చి సుఖకరములైనవి యగును గాక యని గాయత్రి తృతీయపాదమును చెప్పుచు సువః అను వ్యాహృతితో మూడవ కబళమును భక్షించుచున్నాఁడు. తరువాత అన్నియు సుఖకరములైనవి. ఈ సమస్తము నేనై తినని మూడు పాదములుగల గాయత్రిని అంతయును చెప్పుచు భూః భువః సువః అను వ్యాహృతిత్రయముతో నాలుగవ కబళమును భక్షించుచున్నాఁడు. ఇట్లు భక్షించిన తరువాత కడపట హస్తములను కడుగుకొని ఆచమనముచేసి అగ్నికి వెనుక భాగమున తూర్పు శిరస్సుగలవాఁడై శయనించుచున్నాఁడు, తిరిగి ప్రాతఃకాలమునందు లేచి సూర్యుని గూర్చి ఓ సూర్యుఁడా! నీవు సమస్త దిక్కులకధిపతివి. యగుచున్నావు. నేను మనుష్యులందఱికిని అధిపతిని యగుదునుగాకయని స్తోత్రము చేయుచు యథాప్రకారము అగ్నియొక్క వెనుకభాగమునకు వచ్చి కూర్చుండి వంశబ్రాహ్మణమును జపించుచున్నాఁడు.

ఉ॥ తగ్ం హైతముద్దాలక ఆరుణిర్వాజసనేయాయ యాజ్ఞవల్క్యాయాన్తే వాసిన ఉక్త్వోవాచాపి య ఏనగ్ం శుష్కే స్థాణౌ నిషిఞ్చేజ్జాయేరఞ్ఛాఖాః ప్రరోహేయుః పలాశానీతి, ॥7॥

ప॥ తం-హ-ఏతం-ఉద్దాలకః - ఆరుణిః - వాజసనేయాయ - యాజ్ఞవల్క్యాయ-అన్తేవాసినే-ఉక్త్వా-ఉవాచ - అపి-యః - ఏనం-శుష్కే-స్థాణౌ-నిషిఞ్చేత్-జాయేరన్-శాఖాః-ప్రరోహేయుః-పలాశాని-ఇ

ప్ర॥ తం = ఆ ప్రసిద్ధమైన, ఏతంహ = ఈ ఆహుతినిగూర్చి, (స్రువమను పాత్రమునందు మంత్రముచే సంస్కరింపఁబడిన ఆహుతిని, ఆరుణిః=అరుణపుత్రుఁడగు, ఉద్దాలకః=ఉద్దాలకుఁడను ఋషి, వాజసనేయాయ=వాజసనేయ శాఖాధ్యయనము చేసిన, (శుక్ల యజుర్వేదమును చదువుకొనిన), అన్తేవాసినే=శిష్యుఁడగు, యాజ్ఞవల్క్యాయ=యాజ్ఞవల్క్యుఁడను ఋషికొఱకు, ఉక్త్వా = చెప్పి, అపియః = ఎవఁడైనను. ఏనం = ఈ సంస్కరింపఁబడిన ఆహుతిని, శుష్కే = ఎండిన, స్థాణౌ=మొద్దునందు, నిషిఞ్చేత్=ఉంచినయెడల, (తస్య = ఆహుతియొక్క, మహాత్మ్యాత్=సామర్థ్యమువలన, తస్మిన్=ఆ మొద్దునందు), శాఖాః=కొమ్మలు, జాయేరన్=పుట్టును. పలాశాని=ఆకులు, ప్రరోహేయుః=మొలుచును. ఇతి=అని, ఉవాచ=పలికెను.

తా॥ ఇట్లు ఆ ఆహుతిని అరుణపుత్రుఁడగు ఉద్దాలక ఋషి శుక్ల యజుశ్శాఖాధ్యయనమును చేసిన శిష్యుఁడగు యాజ్ఞవల్క్యుని కొఱకు చెప్పి, ఓ యాజ్ఞవల్క్యుఁడా! ఈ ఆహుతిని యెండిన మొద్దు అగు వృక్షమునందుంచినచు ఆ వృక్షము కొమ్మలు కలిగి చిగురించును. బ్రతికియుండెడి దానియందుంచెనేని యేమి చెప్పవచ్చునని ఈ కర్మను స్తుతించుటకుగా చెప్పెను.

ఉ॥ ఏతము హైవ వాజసనేయో యాజ్ఞవల్క్యో మధుకాయ పైఙ్గ్యా
యాన్తేవాసిన ఉక్త్వోవాచాపి య ఏనగ్ం శుష్కే స్థాణౌ నిషి
ఞ్చేజ్జాయేరన్ శాఖాః ప్రరోహేయుః పలాశానీతి. ॥8॥

ప॥ ఏతం-ఉ-హ-ఏవ-వాజసనేయః-యాజ్ఞవల్క్యః - మధుకాయ-పైఙ్గ్యాయ-అన్తేవాసినే-ఉక్త్వా-ఉవాచ-అపి - యః - ఏనం -

శుష్కే-స్థాణౌ-నిషిఞ్చేత్ - జాయేరన్ శాఖాః- ప్రరోహేయుః - పలాశాని-ఇతి.

ప్ర॥ వాజసనేయః=శుక్లయజుశ్శాఖాధ్యయనమును చేసియున్న, యాజ్ఞవల్క్యః=యాజ్ఞవల్క్యుఁడు, అన్తేవాసినే=శిష్యుఁడైన పైఙ్గ్యాయ=పింగఋషి పుత్రుఁడగు, మధుకాయ=మధుకుఁడనువానికొఱకు, ఏతముహైవ=దీనినె, (ఈఆహుతినిగూర్చియె), ఉక్త్వా=చెప్పి, అపియః=ఎవఁడైనను, ఏనం=ఈ ఆహుతిని, శుష్కే=ఎండిన, స్థాణౌ=మొద్దునందు, నిషిఞ్చేత్=ఉంచిన యెడల, (తస్మిన్=ఆ యెండిన వృక్షమునఁదు). శాఖాః=కొమ్మలు, జాయేరన్=పుట్టును. పలాశాని=ఆకులు ప్రరోహేయుః=మొలుచును. ఇతి=అని, ఉవాచ=పలికెను.

తా॥ దీనినే యాజ్ఞవల్క్యఋషి శిష్యుఁడగు మధుక ఋషి కొఱకు చెప్పి, ఓ మధుకుఁడా! దీనిని మొద్దుగా నుండెడి వృక్షము నందుంచిన యెడల ఆ మొద్దునందు కొమ్మలు పుట్టి చిగురించును అని ఆ యాహుతి ప్రభావమును చెప్పెను.

ఉ॥ ఏతముహైవ మధుకః పైఙ్గ్యశ్చూలాయభాగవిత్తయేఽన్తేవాసిన ఉక్త్వోవాచాపి య ఏనగ్ం శుష్కే స్థాణౌ నిషిఞ్చేజ్జాయేరఞ్ఛాఖాః ప్రరోహేయుః పలాశానీతి. ॥9॥

ప॥ ఏతం-ఉ-హ-ఏవ-మధుకః-పైఙ్గ్యః - చూలాయ - భాగవిత్తయే-అన్తేవాసినే-ఉక్త్వా-ఉవాచ-అపి యః - ఏనం - శుష్కే - స్థాణౌ-నిషిఞ్చేత్-జాయేరన్-శాఖాః-ప్రరోహేయుః - పలాశాని -

ప్ర॥ పైఙ్గ్యః=పింగఋషి పుత్రుఁడగు, మధుకః=మధుకుఁడను వాఁడు, భాగవిత్తయే=భగవిత్తి పుత్రుఁడగు, అన్తేవాసినే = శిష్యుఁడైన, చూలాయ=చూలుఁడను ఋషికొఱకు, ఏతముహైవ=దీనినే, ఉక్త్వా=చెప్పి, అపియః=ఎవఁడైనను, ఏనం=దీనిని, (ఈ ఆహుతిని), శుష్కే=ఎండిన, స్థాణౌ=మొద్దునందు, నిషిఞ్చేత్=ఉంచినయెడల,

శాఖాః=కొమ్మలు, జాయేరన్=పుట్టును. పలాశాని=ఆకులు, ప్రరోహేయుః=మొలుచును, ఇతి=అని, ఉవాచ=పలికెను.

తా॥ దీనిని మధుకుఁడనుఋషి, భగవిత్తిఋషికుమారుఁడగు శిష్యుఁడైనచూలుఁడను ఋషి కొఱకు చెప్పెను,తక్కినదిసమానము.

ఉ॥ ఏతము హైవ చూలో భాగవిత్తిర్జానకయే ఆయస్థూణాయాన్తేవాసిన ఉక్త్వోవా చాపి య ఏనగ్ శుష్కే స్థాణౌ నిషిఞ్చేజ్జాయేరఞ్ఛాఖాః ప్రరోహేయుః పలాశానీతి. ॥10॥

ప॥ ఏతం-ఉహ-ఏవ-చూలః-భాగవిత్తిః-జానకయే-ఆయస్థూణాయ-అన్తేవాసినే-ఉక్త్వా-ఉవాచ-అపి-యః-ఏనం-శుష్కే-స్థాణౌ-నిషిఞ్చేత్-జాయేరన్-శాఖాః-ప్రరోహేయుః-పలాశాని - ఇతి.

ప్ర॥ భాగవిత్తిః=భగవిత్తిపుత్రుఁడగు, చూలః=చూలుఁడను మహాఋషి, అన్తేవాసినే=శిష్యుఁడగు, జానకయే=జనక పుత్రుఁడగు, ఆయస్థూణాయ=ఆయస్థూణుఁడను వానికొఱకు, ఏతము హైవ=దీనినే, ఉక్త్వా=చెప్పి, అపియః=ఎవఁడైనను, ఏనం=దీనిని, శుష్కే=ఎండిన, స్థాణౌ=మొద్దునందు, నిషిఞ్చేత్=ఉంచినయెడల, శాఖాః=కొమ్మలు, జాయేరన్=పుట్టును. పలాశాని=ఆకులు, ప్రరోహేయుః = మొలుచును, ఇతి=అని, ఉవాచ=పలికెను.

తా॥ దీనినే చూలుఁడను మహాఋషి శిష్యుఁడగు జనక పుత్రుఁడైన ఆయస్థూణుఁడను వానికొఱకు చెప్పెను, తక్కినది సమానము.

ఉ॥ ఏతము హైవ జానకిరాయస్థూణః సత్యకామాయ జాబాలాయాన్తేవాసిన ఉక్త్వోవాచాపి య ఏనగ్ శుష్కే స్థాణౌ నిషిఞ్చేజ్జాయేరఞ్ఛాఖాః ప్రరోహేయుః పలాశానీతి. ॥11॥

ప॥ ఏతం-ఉహ-ఏవ-జానకిః-ఆయస్థూణః-సత్యకామాయ-జాబాలాయ-అన్తేవాసినే-ఉక్త్వా-ఉవాచ-అపి-యః-ఏనం-శుష్కే-స్థాణౌ-నిషిఞ్చేత్-జాయేరన్-శాఖాః-ప్రరోహేయుః-పలాశాని-ఇతి.

ప్ర॥ జానకిః=జనకపుత్రుఁడగు, ఆయస్థూణః = ఆయస్థూణుఁ

డనువాఁడు, అన్తేవాసినే=శిష్యుఁడగు, జాబాలాయ = జబాలపుత్రు డగు, సత్యకామాయ=సత్యకాముఁడను వానికొఱకు, ఏతము హైవ= దీనినే, ఉక్త్వా=చెప్పి, అపియః=ఎవఁడైనను, ఏనం=దీనిని, శుష్కే= ఎండిన, స్థాణౌ=మొద్దునందు, నిషిఞ్చేత్=ఉంచిన యెడల, శాఖాః= కొమ్మలు, జాయేరన్=పుట్టును. పలాశాని=ఆకులు, ప్రరోహేయుః =మొలుచును, ఇతి=అని, ఉవాచ=పలికెను.

తా॥ జనకపుత్రుఁడగు ఆయస్థూణుఁడను వాఁడు శిష్యుఁడైన జబాలుని పుత్రుఁడైన సత్యకాముని కొఱకు దీనిని చెప్పెను. తక్కినది సమానము.

ఉ॥ ఏతము హైవ సత్యకామో జాబాలోఽన్తే వాసిభ్య ఉక్త్వోవాచాపి య ఏనగ్ శుష్కే స్థాణౌ నిషిఞ్చేరఞ్ఛాఖాః ప్రరోహేయుః పలాశానీతి తమేతం నాపుత్రాయ వాఽనన్తే వాసినే వాబ్రూయాత్. ॥12॥

ప॥ ఏతం-ఉహ-ఏవ-సత్యకామః-జాబాలః - అన్తేవాసిభ్యః-ఉక్త్వా-ఉవాచ-అపి-యః-ఏనం-శుష్కే-స్థాణౌ-నిషిఞ్చేత్ - జాయేరన్ -శాఖాః- ప్రరోహేయుః-పలాశాని-ఇతి-తం-ఏతం-న-అపుత్రాయ - వా- అనన్తేవాసినే-వాబ్రూయాత్.

ప్ర॥ జాబాలః=జబాలపుత్రుఁడగు, సత్యకామః=సత్యకాముఁ డనువాఁడు, అన్తేవాసిభ్యః=శిష్యులకొఱకు, ఏతము హైవ = దీనినే ఉక్త్వా=చెప్పి, అపియః=ఎవఁడైనను, ఏనం=దీనిని, శుష్కే=ఎండిన, స్థాణౌ=మొద్దునందు, నిషిఞ్చేత్=ఉంచినయెడల, శాఖాః=కొమ్మలు జాయేరన్=పుట్టును. పలాశాని = ఆకులు, ప్రరోహేయుః = మొలుచును. ఇతి=అని, ఉవాచ=పలికెను. తం=ఆ ప్రసిద్ధమైన, ఏతం=ఈ మన్థరూపమైన హవిస్సును, అపుత్రాయవా = పుత్రుఁడు కానివాని కొఱకుగాని, అనన్తేవాసినేవా=శిష్యుఁడు కానివానికొఱకుగాని, నబ్రూయాత్=చెప్పఁగూడదు,

తా॥ ఉద్దాలకుఁడు మొదలుకొని సత్యకామునివఱకు నుండెడి ఋషులందఱు తమకు శిష్యుఁడుగా నుండెడి ఒక్కొ-కని కొఱకును క్రమముగాను మదనరూపమగు హవిస్సును ఉపదేశించుచు వచ్చిరి. సత్యకాముఁడనువాఁడు మాత్రము అనేకమంది శిష్యులకొఱకు దీనిని ఉపదేశించి, ఓ శిష్యులారా! దీనిని యెండిన మోడైన చెట్టునం పుంచినను అది కొమ్మలు కలిగి చిగురించును. దీనిని పుత్రుఁడు కానివాని కొఱకుగాని, శిష్యుఁడు కానివానికొఱకు గాని, చెప్పఁగూడదు. దీనిని పొందుటకు శిష్యుఁడును కుమారుఁడును మాత్రమే తగినవారు.

ఉ॥ చతురౌదుమ్బరో భవత్యౌదుమ్బరః స్రువ ఔదుమ్బర శ్చమస ఔదుమ్బరఇధ్మఔదుమ్బర్యావుపమన్థన్యౌదశ గ్రామ్యాణి ధాన్యాని భవన్తి వ్రీహియవా స్తిలమాషా అణుప్రియఙ్గవో గోధూమాశ్చ మసూరాశ్చ ఖల్వాశ్చ ఖలకులాశ్చ తాన్ పిష్ట్వా దధని మధుని ఘృత ఉపసిఞ్చత్యాజ్యస్య జుహోతి. ॥13॥

ఇత్యష్టమాధ్యాయే-తృతీయం బ్రాహ్మణమ్.

ప॥ చతురౌదుమ్బరః-భవతి-ఔదుమ్బరః-స్రువః-ఔదుమ్బరః-చమసః-ఔదుమ్బరః-ఇధ్మః-ఔదుమ్బర్యౌ - ఉపమన్థన్యౌ - దశ - గ్రామ్యాణి-ధాన్యాని-భవన్తి-వ్రీహియవాః- తిలమాషాః-అణుప్రియఙ్గవః-గోధూమాః-చ-మసూరాః-చ-ఖల్వాః-చ - ఖలకూలాః - చ-తాన్-పిష్ట్వా-దధని-మధుని-ఘృతే-ఉపసిఞ్చతి-ఆజ్యస్య-జుహోతి.

ప్ర॥ చతురౌదుమ్బరః=చతుర=నాలుగు విధములైన, ఔదుమ్బరః=మేడికఱ్ఱచేఁ జేయఁబడిన పాత్రములు, భవతి=కలుగుచున్నవి. స్రువః=స్రువమను పాత్రము, (హోమము కొఱకు ఆజ్యమును గ్రహించిన పాత్రము). ఔదుమ్బరః=మేడికఱ్ఱచేత చేయఁబడినది. చమసః=సోమపాన పాత్రవిశేషము, ఔదుమ్బరః=మేడికఱ్ఱచేత చేయఁబడినది. ఇధ్మః=ఇన్ధనము, (కట్టె). ఔదుమ్బరః=మెడికఱ్ఱ సంబంధమైనది. ఉపమన్థన్యౌ=ఉపమన్థనులను పాత్రలు రెండును, ఔదుమ

ర్యా=మేడికఱ్ఱసంబంధములైనవి. గ్రామ్యాణి=గ్రామములయందైన, ధాన్యాని=ధాన్యములు, దశ=పది, భవన్తి=అగుచున్నవి. (అవి యేవి యనఁగా, నిర్దేశింపఁబడుచున్నవి). వ్రీహియవాః=వడ్లును, యవలను ధాన్యమును, తిలమాషాః=నువ్వులును, మినుములును, అణుప్రియఙ్గవః=నల్లవడ్లును, కొఱ్ఱలును, గోధూమాశ్చ=గోధుమలును, మసూరాశ్చ=చిఱుసెనగలును, ఖల్వాశ్చ=అనుములును, ఖలకాశ్చ=ఉలవలును, తాన్=ఆ, పిష్టాన్=పిండ్లను, (పొళ్ళను), దధిని = పెరుగునందును, మధుని=తేనెయందును, ఘృతే = నేతియందును, ఉపసిఞ్చతి=తడుపుచున్నాఁడు. (తడిపి ముద్దచేసి), ఆజ్యస్య=అజ్యముతో, (ఇక్కడ షష్టికి తృతీయార్థము) జుహోతి = హోమము చేయుచున్నాఁడు.

తా॥ ఈ యాగమునందు, హోమపాత్రము, సోమపానపాత్రము. ఇంధనము మథించునట్టి పాత్రిలు రెండును, ఈ నాలుగును, మేడి సంబంధమైన కఱ్ఱచే నిర్మింపఁబడిన వగుచున్నవి. దీనియందు నియమముగా గ్రహింపఁదగిన పది విధములైన ధాన్యములు అవి యేవియనఁగా వడ్లు, యవలు, నువ్వులు, మినుములు, నల్లవడ్లు, కొఱ్ఱలు, గోధుమలు, చిఱుసెనగలు, అనుములు, ఉలవలు ఇవి. ప్రాణోపాసకుఁడు, ఈ ధ్యానములతోఁ జేయఁబడిన పిష్టములను పెరుగుతో తేనెతో ఆజ్యముతో కలిపి ముద్దచేసి నేతితో హోమము చేయవలయును.

ఇట్లు అష్టమాధ్యాయమునందు తృతీయ బ్రాహ్మణము సమాప్తము.

---

## అష్టమాధ్యాయము - చతుర్థబ్రాహ్మణము.

ఉ॥ ఏషాం వై భూతానాంపృథివీరసః పృథివ్యా ఆపోఽపామోషధయ ఓషధీనాం పుష్పాణి పుష్పాణాం ఫలాని ఫలానాం పురుషః పురుషస్య రేతః. ॥1॥

ప॥ ఏషాం-వై-భూతానాం-పృథివీరసః - పృథివ్యాః- ఆపః-అపాం-ఓషధయః ఓషధీనాం-పుష్పాణి-పుష్పాణాం-ఫలాని- ఫలానాం-పురుషః-పురుషస్య-రేతః.

ప్ర॥ ఏషాంవై భూతానాం=ఈ జంగమ స్థావరాత్మకములైన భూతములలో, పృథివీ=భూమి, రసః = శ్రేష్ఠమైనది. (సారమైనది). పృథివ్యాః=భూమియొక్క, (రసః=సారము), ఆపః = ఉదకములు. అపాం=ఉదకములయొక్క. (రసః=సారము), ఓషధయః=ఓషధులు, (తరు గుల్మ లతాదులు), ఓషధీనాం = ఓషధులయొక్క, (రసః = సారము), పుష్పాణి=పుష్పములు, పుష్పాణాం = పుష్పములయొక్క, (రసః=సారము), ఫలాని=ఫలములు, ఫలానాం = ఫలములయొక్క, (రసః=సారము), పురుషః=పురుషుఁడు, పురుషస్య=పురుషునియొక్క, (రసః=సారము), రేతః= రేతస్సు.

తా॥ ఇంతకు పూర్వము ప్రాణోపాసకునికి మన్థమను పేరుగల కర్మను చెప్పి ఈ బ్రాహ్మణమునందు పుత్రమన్థమను కర్మ చెప్పఁబడుచున్నది. జంగమస్థావరాత్మకమైన సమస్త భూతములయొక్క సారమైనది భూమి. భూమియొక్క సారము ఉదకములు. ఉదకముల యొక్క సారము ఓషధులు. ఓషధులయొక్క సారము పుష్పములు. పుష్పములయొక్క సారము ఫలములు. ఫలములయొక్క సారము పురుషుఁడు. పురుషునియొక్క సారము రేతస్సు.

ఉ॥ స హ ప్రజాపతి రీక్షాఞ్చక్రే హన్తాస్మై ప్రతిష్ఠాం కల్పయానీతి స స్త్రియగ్ం ససృజే తాగ్ం సృష్ట్వాఽధ ఉపాస్త తస్మాత్స్త్రియ మధ ఉపాసీత స ఏతం ప్రాఞ్చం గ్రావాణ మాత్మన ఏవ సముదపారయత్తే నైనామభ్యసృజత్ ॥2॥

ప॥ సహ-ప్రజాపతిః-ఈక్షాఞ్చక్రే-హన్త-అస్మై - ప్రతిష్ఠాం-కల్పయాని-ఇతి-సః-స్త్రియం-ససృజే-తాం-సృష్ట్వా-అధి - ఉపాస్త - తస్మాత్-స్త్రియం-అథ-ఉపాసీత-సః-ఏతం-ప్రాఞ్చం - గ్రావాణం -

ఆత్మనః-ఏవ-సముదపారయత్ - తేన-ఏనాం-అభ్యసృజత్.

ప్ర॥ సహ ప్రజాపతిః=ఆ బ్రహ్మ, హ న్త=ఇప్పుడు, అస్మై=ఈ రేతస్సు కొఱకు, ప్రతిష్ఠాం = స్థితిని, కల్పయానీతి = కల్పించెదనని, ఈక్షాంచక్రే=సంకల్పమును చేసెను. సః = ఆ బ్రహ్మ, స్త్రియం = స్త్రీని, ససృజే=సృష్టించెను. అథ = అనంతరము, తాం = ఆ స్త్రీని, సృష్ట్వా = సృజించి, (మైథునాఖ్యం కర్మ = మైథునమను కర్మను), ఉపాస్త=ఉపాసించెను, తస్మాత్=అందువలన, అథ=ఇప్పుడు, (ప్రజాః =ప్రజలు). స్త్రియం=స్త్రీని, ఉపాసీత = ఉపాసించుచున్నారు. సః= ఆ బ్రహ్మ. ప్రాఞ్చం=అధికమైన గతితోఁ గూడుకొని, ఏతం = ఈ, గ్రావాణం=(చంద్రకిరణమను పాషాణ స్థానీయమైన ) కఠినమగు ఉపస్థేంద్రియమును. ఆత్మనఏవ=ఆత్మవల్లనే, సముదపారయత్ =నిండించెను. తేన=దానితో, ఏనాం=ఈస్త్రీని, అభ్యసృజత్ = సంసర్గము చేసెను.

తా॥ సమస్త భూతములములయొక్క మిక్కిలి సారభూతమైనది రేతస్సు. కనుక ఆ బ్రహ్మదేవుఁడు, దీనికి తగిన స్థితిని చేయవలెనని యుద్దేశించి స్త్రీని సృష్టించెను. ఇట్లు స్త్రీని సృజించి మైథున కర్మను సేవించెను. కనుకనే ఇప్పుడును ప్రజలు స్త్రీలను సేవించుచున్నారు. ఆ బ్రహ్మ. అధిక గమనముగల చంద్రకిరణమను పాషాణ స్థానీయమగు ఈ ప్రజన నేంద్రియమును నిండించెను. అట్టి ఇంద్రియముతో ఈ స్త్రీ సంసర్గమును చేసెను.

ఉ॥ తస్యా వేదిరుపస్థో లోమాని బర్హిశ్చర్మాధిషవణే సమిద్ధో మధ్యతస్తౌముష్కౌ స యావాన్ హ వై వాజపేయేన యజమానస్య లోకో భవతి తావానస్య లోకో భవతి య ఏవం విద్వా నధోపహాసం చరత్యాసాగ్ స్త్రీణాగ్ సుకృతం వృఙ్క్తేఽథ య ఇదమ విద్వానధోపహాసం చరత్యస్య స్త్రియః సుకృతం వ ఞ్జతే.

ప॥ తస్యాః-వేదిః-ఉపస్థః-లోమాని-బర్హిః-చర్మ-అధిషవణే-

సమిధః–మధ్యతః–తౌ-ముష్కౌ–సః-యావాన్–హవై-వాజపేయేన - యజమానస్య–లోకః–భవతి–తావాన్–అస్య-లోకః–భవతి–యః–ఏవం -విద్వాన్ - అధోపహాసం- చరతి-ఆసాం-సః–స్త్రీణాం–సుకృతం–వృఙ్క్తే–అథ-యః–ఇదం – అవిద్వాన్ -అధోపహాసం–చరతి-అస్య- స్త్రియః-సుకృతం-వృఞ్జతే.

ప్ర॥ తస్యాః=ఆ స్త్రీ యొక్క, ఉపస్థః=యోని, వేదిః=యజ్ఞవేదిక; లోమాని=వెంట్రుకలు, బర్హి=దర్భ; చర్మ=రహస్య ప్రదేశమునందలి చర్మము, (తోలు), అధిషవణే = సోమఫలకమునందలి, (సోమఖండనము కొఱకు పలకయందుంచిన, అవడుహంచర్మ=వృషభ సంబంధమైన తోలు); మధ్యతః=మధ్యమునందున్న, తౌముష్కౌ = ఆ వృషణములు. (యోని పార్శ్వములయందలి కఠినమైన మాంస ఖండములు), సమిధః=అగ్ని, (ఇట్లుపాసించెడి వానికి), వాజపేయేన= వాజపేయమను యజ్ఞముచేత, యజమానస్య=యజమానునికి, సః = ఆ ప్రసిద్ధమగు, యావాన్హవై =ఎంత, లోకః=లోకము, భవతి = కలుగుచున్నదో, తావాన్ =అంత, లోకః = లోకము, అస్య = ఈ యుపాసకునికి, భవతి=కలుగుచున్నది. ఏవంవిద్వాన్ = ఇట్లు తెలిసి కొనిన, యః=ఎవఁడు, అధోపహాసం=మైథునమును, చరతి = చేయు చున్నాఁడో, (సః=వాఁడు), ఆసాం=ఈ, స్త్రీణాం = స్త్రీలయొక్క. సుకృతం=పుణ్యమును, వృఙ్క్తే=పొందుచున్నాఁడు. అథ = తిరిగి, యః=ఎవఁడు. ఇదం=దీనిని, అవిద్వాన్=తెలియనివాఁడై, అధోపహాసం=మైథునమును, చరతి=చేయుచున్నాఁడో, అస్య=వీనియొక్క, సుకృతం=పుణ్యమును, స్త్రియః=స్త్రీలు, వృఞ్జతే=పొందుచున్నారు.

తా॥ ఇట్లు సృజింపఁబడిన స్త్రీయొక్క సంసర్గమును చేసెడి సమయమునందు ఆ స్త్రీయొక్క ఉపస్థమె యజ్ఞవేదికగాను, ఆ ప్రదేశమునంతలి వెంట్రుకలే దర్భలుగాను, ఆ ప్రదేశమునందలి చర్మమెసోమఖండనముకొఱకుపలకయందుంచిన వృషభచర్మముగాను,

యో పార్శ్వముల యందలి కఠినమైన మాంస ఖండములే అగ్నిగాను భావించి యుపాసించెడి వానికి లోకమునందు వాజపేయయాగమును చేయువానికి ఎట్టి ప్రసిద్ధలోకము కలుగునో అట్టి లోకము కలుగు చున్నది. ఇట్లు తెలిసికొని మైథునము చేయువాడు, స్త్రీలయొక్క సుకృతమును పొందుచున్నాడు. తిరిగి ఇట్లు తెలిసికొనక మైథున ము చేయువానియొక్క సుకృతమును స్త్రీలు పొందుచున్నారు.

ఉ॥ ఏతద్ధస్మ వై తద్విద్వానుద్దాలక ఆరుణి రాహై తద్ధ స్మ వై తద్విద్వాన్నాకో మౌద్గల్య ఆహైతద్ధ స్మ వై తద్విద్వాన్ కుమార హారిత ఆహ బహవో మర్యా బ్రాహ్మణాయనా నిరిన్ద్రియా విసుకృతోఽస్మాల్లోకాత్ప్రయన్తి య ఇదమ విద్వాగ్ంసోఽధోపహాసం చరన్తీతి బహు వా ఇదగ్ం సుప్తస్యవా జాగ్రతో వా రేత స్కన్దతి, ॥4॥

ప॥ ఏతత్-హ-స్మ-వై-తత్-విద్వాన్-ఉద్దాలకః - ఆరుణిః- ఆహ-ఏతత్-హ-స్మ-వై-తత్-విద్వాన్-నాకః-మౌద్గల్యః - ఆహ ఏతత్-హ-స్మ-వై-తత్-విద్వాన్-కుమారహారితః-ఆహ -బహవః - మర్త్యాః-బ్రాహ్మణాయనాః-నిరిన్ద్రియాః - విసుకృతః - అస్మాత్ - లోకాత్-ప్రయన్తి-యే-ఇదం-అవిద్వాంసః-అధోపహాసం - చరన్తి - ఇతి-బహు-వా-ఇదం-సుప్తస్య-వా జాగ్రితః - వా- రేతః - స్కన్దతి.

ప్ర॥ యే = ఎవరు, ఇదం = ఈ వాజపేయయాగ సంపత్తిని, అవిద్వాంసః= తెలియనివారై, అధోపహాసం=మైథునమును, చరన్తి= చేయుచున్నారో, (తేషాం=వారిలోపల), సుప్తస్యవా = నిద్రించెడు వానికిగాని, జాగ్రితో వా= మేలుకొనినవానికిగాని, ఇదం=ఈ, రేతః= రేతస్సు, బహువా=అధికముగాగాని, (అల్పంవా=కొంచెముగాగాని), స్కన్దతి=జాఱినయెడల, (తే=అటువంటి), బహవః = అనేకులును, మర్త్యాః=మరణధర్మము గలవారునగు, బ్రాహ్మణాయనాః=బ్రాహ్మణజాతియే స్థానముగాగలిగినవారు, నిరిన్ద్రియాః=ఇంద్రియము లేని

వారును, విసుకృతః=పోయిన సుకృత కర్మకలవారునై, అస్మాత్ = ఈ, లోకాత్=లోకమునుండి, ప్రియన్తి=మరణము పొందుచున్నారు. ఇతి=అని, ఏతత్=ఈ, తద్ధస్మవై = ఆవాజపేయయాగమును, విద్వాన్=తెలిసిన, ఆరుణిః=అరుణపుత్రుఁడగు, ఉద్దాలకః = ఉద్దాలకుఁడనువాఁడు, ఆహ=చెప్పెను. ఏతత్=ఈ, తద్ధస్మవై=ఆవాజపేయ యాగమును, విద్వాన్=తెలిసిన, మౌద్గల్యః = ముద్గలపుత్రుఁడగు, నాకః=నాకుఁడను వాఁడు, ఆహ=చెప్పెను, ఏతత్=ఈ, తద్ధస్మవై = ఆ వాజపేయయాగమును, విద్వాన్ = తెలిసిన, కుమారహారితః = కుమారహారితుఁడను వాఁడు, ఆహ=చెప్పెను.

తా॥ ఈ వాజపేయ యాగమహిమను తెలిసిన అరుణ పుత్రుఁడగు ఉద్దాలకుఁడను, ముద్గల పుత్రుఁడగు నాకుఁడును, కుమారహారితుఁడును, ఈ ముగ్గురును, లోకమునందు అనేకులగు మరణమును పొందెడి వారైన బ్రాహ్మణ జాతివారు. వాజపేయయాగ సంపత్తు తెలియక మైథునమును చేసినను మేలుకొనియుండగా గాని నిద్రించియుండగా గాని రేతస్స్ఖలనమైనను ఇంద్రియము లేనివారై సుకృతము లేనివారై ఈ లోకమునుండి మరణమును పొందుచున్నారని చెప్పిరి.

ఉ॥ తదభి మృశేదను వామన్త్రయే తయన్మేఽద్య రేతః పృథివీమస్కాన్త్సీద్య దోషధీరప్య సరద్యదపః । ఇదమహంత ద్రేతఆదదే । పునర్మామైత్విన్ద్రియం పునస్తేజః పునర్భగః । పునరగ్ని ధిష్ణియా యథాస్థానం కల్పన్తా మిత్యనా మికాఙ్గుష్ఠాభ్యా మాదాయాన్తరేణ స్తనౌవా భ్రువౌవా నిమృఙ్జ్యాత్. ॥5॥

ప్ర॥ తత్-అభిమృశేత్-అను-వా-అమన్త్రయేత-యత్-మే-అద్య-రేతః-పృథివీం-అస్కాన్త్సీత్-యత్ - ఓషధీః - అప్యసరత్ - యత్-అపః ఇదం-అహం-తత్-రేతః-ఆదదే-పునః-మాం - ఏతు - ఇన్ద్రియం-పునః-తేజః-పునః-భగః-పునః-అగ్ని ధిష్ణియాః - యథాస్థా

నం-కల్పన్తాం-ఇతి-అనామికాఙ్గుష్ఠాభ్యాం-ఆదాయ-అన్తరేణ-స్తనౌ-వా-భ్రువౌ-వా-నిమృజ్యాత్.

ప్ర॥ తత్=ఆ రేతస్సును, అభిమృశేత్=స్పృశించవలయును. అను వామన్త్రయేత = అనుసరించి జపించవలయును. (ఈ ముందు చెప్పెడి మంత్రములచేతను రేతస్సును స్పృశించి తీసికొని జపించవలయును). అద్య=ఇప్పుడు, మే=నాయొక్క, యత్=ఏ, రేతః=రేతస్సు, పృథివీం=భూమిని, అస్కాన్త్సీత్ = జారెనో; (భూమియందు జారి పడెనో); యత్=ఏ రేతస్సు, ఓషధీః=ఓషధులనుగూర్చి, అప్యసరత్ =పొందెనో; యత్=ఏ రేతస్సు, అపః=ఉదకములనుగూర్చి, (అప్యసరత్=పొందెనో), తత్=ఆ, ఇదం=ఈ, రేతః=రేతస్సును, అహం =నేను, ఆదదే=గ్రహించుచున్నాను. (ఇదియె రేతస్సును స్పృశించి గ్రహించెడి మంత్రము). ఇన్ద్రియం=ఇంద్రియము, (బైట పోయిన రేతోరూపమైన ఇంద్రియము), పునః=తిరిగి, (మాం=నన్ను, ఏతు= పొందునుగాక). తేజః=కాంతి, పునః=తిరిగి, (మాం=నన్ను, ఏతు= పొందునుగాక), భగః=సౌభాగ్యము, లేక, జ్ఞానము, పునః=తిరిగి, (మాం=నన్ను, ఏతు=పొందునుగాక, రేతోనిర్గమనమువలన ఆ రేతో రూపముతో బైట పోయిన చర్మకాంతి జ్ఞానము ఇవి, తిరిగి నన్ను పొందునుగాక). అగ్నిధిష్ణియాః=అగ్నియె స్థానముగాఁగల దేవతలు, (తత్=ఆ రేతస్సును). పునః=తిరిగి, యథాస్థానం=దాని స్థానమును, కల్పన్తామితి=కల్పించునుగాక యని. అనామికాఙ్గుష్ఠాభ్యాం= అనామి కాంగుష్ఠములచేతను, ఆదాయ = తీసికొని, (రేతస్సును తీసికొని), స్తనౌవా=స్తనములనుగూర్చి గాని, భ్రువౌవా=కనుబొమలనుగూర్చి గాని, అన్తరేణ=మధ్యమునందు, నిమృజ్యాత్ = తుడువవలయును. (ఈ మంత్రముతో ఆ రేతస్సును స్తనమధ్యమునందును భ్రూమధ్యమునందును తుడువవలయును).

తా॥ ఇక్కడ రేతస్పర్శన మంత్రమును రేతస్సును అనుసరించి

జపించెడి మంత్రమును చెప్పుచున్నాఁడు. 'ఇదమహం' అనునది మొదలు 'ఆదదే' అనునది అంతముగాఁగల ఈ మంత్రముచే రేతస్సును స్పృశించుటయును, 'పునర్మామైత్విన్ద్రియ' మనునది మొదలు 'నిమృజ్యాత్' అనునది అంతముగాఁగల ఈ మంత్రముచే రేతస్సును గూర్చి జపించుటయును, చెప్పఁబడినది. పురుషుఁడు రాగాతిశయము వలన భూమిని ఓషధులను ఉదకములను గూర్చి స్ఖలితమైన ఈ రేతస్సును నేను గ్రహించుచున్నాను. ఈ రేతస్సు మరల నన్ను పొందునుగాక! ఈ రేతస్సును అనుసరించి బైటపోయిన ఈ నాచర్మము యొక్క కాంతియును జ్ఞానమును తిరిగి నన్ను పొందునుగాక. అగ్నియె అధిష్ఠానముగాఁగల దేవతలు ఈ రేతస్సును తిరిగి యథాస్థానమును పొందింతురుగాక యని అనామికాఙ్గుష్ఠములను రెండు వ్రేళ్ళతో రేతస్సును తీసికొని స్తనముల మధ్యమునందుగాని కనుబొమల మధ్యమునందుగాని తుడవవలయును.

ఉ॥ అథ యద్యుదక ఆత్మానం పరిపశ్యే త్తదభిమన్త్రయేత మయి తేజ ఇన్ద్రియం యశో ద్రవిణగ్ సుకృత మితి శ్రీర్హ వా ఏషా స్త్రీణాం యన్మలోద్వాసా స్తస్మా న్మలోద్వాససం యశస్వినీమభి క్రమ్యో పమన్త్రయేత. ॥6॥

ప్ర॥ అథ-యది-ఉదకే-ఆత్మానం-పరిపశ్యేత్-తత్ - అభిమన్త్రయేత-మయి-తేజః-ఇన్ద్రియం-యశః-ద్రవిణం-సుకృతం-ఇతి-శ్రీః-హ-వై-ఏషా-స్త్రీణాం-యత్-మలోద్వాసాః-తస్మాత్-మలోద్వాససం-యశస్వినీం-అభిక్రమ్య-ఉపమన్త్రయేత.

ప్ర॥ అథ=అనంతరము యది=ఒకానొకప్పుడు, ఆత్మానం=తన్ను, పరిపశ్యేత్=చూచిన యెడల, తత్=అప్పుడు, మయి = నాయందు, తేజః=తేజస్సును, ఇన్ద్రియం=ఇంద్రియమును, (రేతస్సును), యశః=కీర్తిని, ద్రవిణం=ధనమును, సుకృతం=పుణ్యమును, (దేవాః=దేవతలు, కల్పయన్తు=కల్పించుదురుగాక), ఇతి=అని, అభిమన్త్ర

యేత=అభిమన్త్రించవలయును. యత్=ఏ కారణమువలన, స్త్రీణాం =స్త్రీలలోపల, మలోద్వాసాః=రజస్వలయగు, ఏషా = ఈ స్త్రీ (ఈ నా భార్య). (శ్రీర్హావై=లక్ష్మీస్వరూపమైనదియో, తస్మాత్ = ఆ కారణమువలన, మలోద్వాససం = రజస్వలయగు, యశస్వినీం = యశోవంతురాలైన స్త్రీని, అభిక్రమ్య=పొంది, (మూడు రాత్రులు వెళ్ళిన తరువాత స్నానముచేసిన స్త్రీని పొంది), ఉపమన్త్రయేత = తలంచవలయును. (మా యిద్దటి చేతను పుత్రుఁడు పుట్టించఁదగిన వాఁడని తలంచవలయును).

తా॥ ఇంతకు పూర్వము అయోనియందు రేతస్ఖలనమైనందుకు ప్రాయశ్చిత్తము చెప్పఁబడినది. ఇప్పుడు యోనియందు రేతస్ఖలనమైన దానికి ప్రాయశ్చిత్తమును చెప్పుచున్నాఁడు. అనంతరము యోని యందు రేతస్సును చూచినయెడల=రేతస్ఖలనమైన యెడల, 'మయి తేజః' అనునది మొదలుకొని 'సుకృతమితి' యనునది అంతముగాఁ గల ఈ మంత్రముతో అభిమంత్రించవలయును. లోకమునందు స్త్రీల లోపల రజస్వలా స్త్రీ మిక్కిలి శ్రేష్ఠురాలు. అట్టి స్త్రీని పురుషుఁడు నాలుగవ దివసము స్నానానంతరము పొంది దేవతలు నాయందు తేజస్సును ఇంద్రియమును కీర్తిని ధనమును పుణ్యమును కల్పించు దురుగాక యని అభిమంత్రించవలయును.

ఉ॥ సా చేదస్మై న దద్యాత్కామ మేనామ వక్రీణీయాత్ సా చేద స్మై నైవ దద్యాత్కామ మేనాం యష్ట్యా వా పాణినా వోపహ త్యాతిక్రామేదిన్ద్రియేణ తే యశసా యశ ఆదద ఇత్యయశా ఏవభవతి. ॥7॥

ప॥ సా–చేత్–అస్మై–న–దద్యాత్–కామం–ఏనాం–అవక్రీణీ యాత్–సాచేత్–అస్మై–న–ఏవ–దద్యాత్–కామం–ఏనాం–యష్ట్యా– వా–పాణినా–వా–ఉపహత్యా–అతిక్రామేత్–ఇన్ద్రియేణ–తే–యశసా– యశః–ఆదదే–ఇతి–అయశాః–ఏవ–భవతి.

ప॥ సా=ఆ స్త్రీ, అస్మై=ఈ పురుషుని కొఱకు, (మైథునం= సంభోగమును), నదద్యాచ్చేత్=ఇయ్యని యెడల, కామం=మిక్కిలి, ఏనాం=ఈ స్త్రీని, (భూషణాదినా = భూషణములు మొదలైన వాని చేతను), అవక్రీణీయాత్ = ప్రేమను జ్ఞాపకము చేయవలయును. (స్వాధీనము చేసికొనవలయును). సా=ఆ స్త్రీ, అస్మై=ఈ పురుషుని కొఱకు, (మైథునం=సంభోగమును), నైవదద్యాచ్ఛేత్ = ఇయ్యకయే పోయిన యెడల, కామం=మిక్కిలి, ఏనాం=ఈ స్త్రీని, యష్ట్యావా= దండము చేతనుగాని, పాణినావా = హస్తము చేతనుగాని, ఉపహత్యా=కొట్టుటచేతను, యశసా=రజోరూపమైన, ఇన్ద్రియేణ=ఇంద్రియముతో, తే=నీయొక్క, యశః=రజస్సును, ఆదదఇతి=గ్రహించుచున్నానని, (ఈ స్త్రీని), అతిక్రామేత్ = అతిక్రమించి పొందవలయును. (ఆది మొదలుకొని, సా=ఆ స్త్రీ), అయశాఏవ = రజస్సు లేనిదిగానే, భవతి=అగుచున్నది.

తా॥ ఆ స్త్రీ సంభోగము కొఱకు యాచింపఁబడినదై పురుషుని కొఱకు సంభోగమును ఇవ్వకపోయిన యెడల మిక్కిలి భూషణములు మొదలైన వాటిచేత దానిని స్వాధీనపఱచుకొనవలయును. అప్పటికిని స్వాధీనురాలు కాకపోయిన యెడల ఆ పురుషుఁడు కొయ్యతోగాని హస్తముతో గాని ఆ స్త్రీని కొట్టుటచేత స్వాధీనముచేసికొని రజోరూపమైన నా యింద్రియముతో నీ రజస్సును గ్రహించుచున్నానని ఆ స్త్రీని అతిక్రమించి పొందవలయును. అట్లు పొందిన యెడల ఆ స్త్రీ అదిమొదలుకొని రజస్సు లేనిదిగానే యగుచున్నది.

ఉ॥ సా చేదస్మై దద్యాదిన్ద్రియేణ తే యశసా యశ ఆదధామీతి యశస్వినావేవ భవతః. ॥8॥

ప॥ సా-చేత్-అస్మై-దద్యాత్-ఇన్ద్రియేణ-తే-యశసా-యశః-ఆదధామి-ఇతి-యశస్వినౌ-ఏవ-భవతః.

ప॥ సా=ఆ స్త్రీ, అస్మై=ఈ పురుషునికొఱకు, (మైథునం =

సంభోగమును), దద్యాచ్చేత్=ఇచ్చినయెడల, (భర్తకు స్త్రీ స్వాధీనురాలైన యెడల), యశసా=రజోరూపమైన, ఇన్ద్రియేణ = ఇంద్రియముతో, తే=నీయొక్క, యశః=రజస్సును, ఆదధామీతి = ఉంచుచున్నానని, (పురుషః=పురుషుఁడు, ఏనాం=ఈ స్త్రీని, 'ఇంద్రియేణ తే యశసా యశ ఆదధామి, అను మంత్రమును చెప్పుచు, ఉపగచ్ఛేత్ =పొందవలయును). (తదా=అప్పుడు. (ఉభౌ=ఇద్దఱు), యశస్వినావేవ=యశోవంతులుగానే, (శ్రేష్ఠులుగా), భవతః=అగుచున్నారు.

తా॥ ఆ స్త్రీ పురుషునికి స్వాధీనురాలైన యెడల "ఇన్ద్రియేణ తేయశ సా యశ ఆదధామి" యను మంత్రమును చెప్పుచు పురుషుఁడు ఆ స్త్రీని పొందవలయును అట్లు పొందెనేని ఆ స్త్రీ పురుషులిద్దఱు శ్రేష్ఠులగుచున్నారు.

ఉ॥ స యామిచ్ఛేత్కా- మయేత మేతి తస్యామర్థం నిష్ఠాయ ముఖేన ముఖగ్ సన్ధాయోపస్థమస్యా అభిమృశ్య జపేత్ అఙ్గా దఙ్గాత్సంభవసి హృదయా దధిజాయసే । స త్వమఙ్గ కషాయోఽసి దిగ్ధవిద్ధామివ మాదయే మామమూం మయీతి. ॥9॥

ప॥ సః-యాం-ఇచ్ఛేత్-కామయేత-మా-ఇతి-తస్యాం అర్థం-నిష్ఠాయ-ముఖేన-ముఖం-సన్ధాయ-ఉపస్థం-అస్యాః-అభిమృశ్య-జపేత్ అఙ్గాత్-అఙ్గాత్-సంభవసి-హృదయాత్ - అధిజాయసే-సః - త్వం - అఙ్గకషాయః-అసి-దిగ్ధవిద్ధాం-ఇవ-మాదయ-ఇమాం-అమూం-మయి - ఇతి.

ప్ర॥ సః=ఆ పురుషుఁడు, (వాజపేయమను యాగమును చేసిన పురుషుఁడు), మా=నన్ను, కామయేతేతి=కోరునుగాక యని, యాం =ఏ స్త్రీని, ఇచ్ఛేత్ = ఇచ్ఛయించునో. తస్యాం = ఆ స్త్రీయందు, అర్థం = ప్రజన నేంద్రియమును. (మేఢ్రమును), నిష్ఠాయ = ఉంచి, ముఖేన=ముఖముతో,. ముఖం=ముఖమును, సన్ధాయ=కూర్చి అస్యాః =ఈ స్త్రీ యొక్క, ఉపస్థం=యోనిని, అభిమృశ్య=స్పృశించి, (హే

రేతః=ఓ రేతస్సా! త్వం=నీవు, మే=నాయొక్క). అఙ్గాదఙ్గాత్ = ప్రతి అవయవమునుండి, సంభవసి=పుట్టుచున్నావు హృదయాత్= హృదయమునుండి (ముఖ్యముగా), అధిజాయసే = (అన్న రసము ద్వారా) పుట్టుచున్నావు, సః=అటువంటి, త్వం=నీవు, అఙ్గకషాయః= అవయవములయొక్క రసము, అసి=అగుచున్నావు. (గనుక నీవు), దిగ్ధవిద్ధామివ=విషముచే పూయఁబడిన బాణముతో కొట్టఁబడిన లేడిని వలెనే, ఇమాం=ఈ నాసంబంధమగు, అమూం = ఈ స్త్రీని, మయి=నాయందు, మాదయేతి=స్వాధీనము చేయుమాయని, జపేత్ =జపింపవలయును.

తా॥ భర్తకు భార్యావశీకరణ రీతిని చెప్పి పురుష ద్వేషిణి యగు ఆ స్త్రీకి పురుష విషయమైన ప్రీతిని సంపాదించెడి రీతిని చూపించుచున్నాడు. ఆ వాజపేయ యాగ సంపత్తుగల పురుషుఁడు తనకు స్వాధీనురాలు కావలయునని ఏ స్త్రీని కోరునో ఆ స్త్రీయందు మేఢ్రమును ఉంచి ముఖముతో ముఖమును కూర్చి ఈ స్త్రీయొక్క యుపస్థను స్పృశించి "అంగాదంగాత్సంభవసి", యను మంత్రమును జపించవలయును. ఆ మంత్రార్థ మేమనఁగా, ఓ రేతస్సా! నీవు నాయొక్క సర్వావయవములనుండి పుట్టుచున్నావు. ముఖ్యముగా అన్నరసము ద్వారా హృదయమునుండి కలుగుచున్నావు. అట్టి నీవు అవయవములయొక్క రసమైతివి. కనుక నీవు విషముచే పూయఁబడిన బాణముతో కొట్టఁబడిన లేడిని వలెనే ఈనా సంబంధమగు స్త్రీని నాస్వాధీనము చేయుమా యని యభిప్రాయము.

ఉ॥ అథయామిచ్ఛేన్న గర్భం దధీతేతి తస్యామర్థం నిష్ఠాయ ముఖేన ముఖగ్ం సన్ధాయాభి ప్రాణ్యాపానాదిన్ద్రియేణ తే రేతసా రేత ఆదద ఇత్యరేతా ఏవ భవతి. ॥10॥

ప॥ అథ-యాం-ఇచ్ఛేత్-న-గర్భం-దధీత-ఇతి-తస్యాం- అర్థం -నిష్ఠాయ-ముఖేన-ముఖం-సన్ధాయ-అభిప్రాణ్య-అపానాత్-ఇన్ద్రియేణ

-తే-రేతసా-రేతః-ఆదదే-ఇతి-అరేతాః-ఏవ-భవతి.

ప్రి॥ అథ=అనంతరము, (సః=ఆ పురుషుఁడు), యాం = ఏ స్త్రీని, గర్భమును, నదధీతేతి=ధరించకపోవుచుగాక యని, ఇచ్ఛేత్ = కోరునో, తస్యాం=ఆ స్త్రీయందు, అర్థం = మేఢ్రమును, నిష్ఠాయ = ఉంచి, ముఖేన=ముఖముతో, ముఖం=ముఖమును, సన్ధాయ=కూర్చి, అభిప్రాణ్య=ప్రాణనవ్యాపారము చేసి. (నిశ్వాస వాయువును విడిచి), అపానాత్=అపానమువలన, ఇన్ద్రియేణ = మేఢ్రముతో, తే = నీ యొక్క, రేతసా=రేతస్సుతో. రేతః=రేతస్సును, ఆదద ఇతి=గ్రహించుచున్నానని. (జపేత్=జపించవలయును. త=అప్పుడు, సా=ఆ స్త్రీ), అరేతాఏవ=రేతస్సులేనిది గానే, భవతి=అగుచున్నది.

తా॥ అనంతరమా పురుషుఁడు స్త్రీనిగర్భమును ధరింపఁగూడదని కోరినయెడల ఆస్త్రీయందు మేఢ్రమును ఉంచి ముఖముతో ముఖము కూర్చి 'అభిప్రాణ్యాపానాదిన్ద్రియేణ తే రేతసా రేత ఆదదే' అను మంత్రమును జపించవలెను. ఈ మంత్రాభిప్రాయ మేమనఁగా, ముందు నిశ్వాసముచేసి అపానమువలన నా ఇంద్రియముతో నీ రేతస్సుతో కూడా రేతస్సును గ్రహించుచున్నానని అభిప్రాయము. ఇట్లు జపించిన యెడల అప్పుడే ఆ స్త్రీ రేతస్సులేనిదేయై గర్భమును ధరించనిది యగుచున్నది,

ఉ॥ అథ యా మిచ్ఛేద్దధీతేతి తస్యామర్థం నిష్ఠాయ ముఖేన ముఖగ్ం
సన్ధాయా పాన్యాభి ప్రాణ్యా దిన్ద్రియేణ తే రేతసా రేత ఆదధా
మీతి గర్భిణ్యేవ భవతి. ॥11॥

ప॥ అథ-యాం-ఇచ్ఛేత్-దధీత-ఇతి-తస్యాం-అర్థం-నిష్ఠాయ-ముఖేన-ముఖం-సన్ధాయ-అపాన్య-అభిప్రాణ్యాత్-ఇన్ద్రియేణ-తే-రేతసా-రేతః-ఆదధామి-ఇతి-గర్భిణీ-ఏవ-భవతి.

ప్రి॥ అథ=అనంతరము, (సః=ఆ పురుషుఁడు), యాం = ఏ స్త్రీని, (గర్భం=గర్భమును), దధీత ఇతి=ధరించవలయునని, ఇచ్ఛేత్ =

=కోరునో, తస్యాం=ఆ స్త్రీయందు, అర్థం=మేఢ్రమును, నిష్ఠాయ= ఉంచి, ముఖేన=ముఖముతో, ముఖం=ముఖమును, సంధాయ=కూర్చి, అపాన్య=అపానమునువిడిచి అభిప్రాణ్యాత్ =నిట్టూర్పువలన, ఇంద్రియేణ=ఇంద్రియముచేత (మేఢ్రముచేత), తే=నీయొక్క, రేతసా= రేతస్సుతో, రేతః = రేతస్సును, ఆదధామి ఇతి = ఉంచుచున్నానని, (జపేత్ =జపించవలయును. తదా=అప్పుడు, సా=ఆస్త్రీ), గర్భిణ్యేవ= గర్భముగలదే, భవతి=అగుచున్నది.

తా॥ అనంతరమా పురుషుడు స్త్రీని గర్భమును ధరించవలయునని కోరినయెడల ఆ స్త్రీయందు మేఢ్రమును ఉంచి ముఖముతో ముఖమునుచేర్చి ''అపాన్యాభిప్రాణ్యాదింద్రియేణ తే రేతసా రేత ఆదధామి'' అను మంత్రమును జపించవలయును. ఈ మంత్రమునకభిప్రాయమేమనగా, అపానమును విడిచి ప్రాణవాయువువలన మేఢ్రముచేత నీ రేతస్సుతో రేతస్సును ఉంచుచున్నానని భావము. ఇట్లు జపించినయెడల అప్పుడే ఆ స్త్రీ రేతస్సునుపొంది గర్భమును ధరించినదియగుచున్నది.

ఉ॥ అథ యస్య జాయాయై జారస్స్యాత్తం చేద్ద్విష్యాదామపాత్రేఽగ్నిముపసమాధాయ ప్రతిలోమగ్ం శరబర్హిస్స్తీర్త్వా తస్మిన్నేతాశ్శరభృష్టీః ప్రతిలోమాస్సర్పిషాక్తా జుహుయాన్మమ సమిద్ధేఽహౌషీః ప్రాణాపానౌ త ఆదదేఽసావితి। మమ సమిద్ధేఽహౌషీః పుత్రపశూగ్ంస్త ఆదదేఽసావితి। మమ సమిద్ధేఽహౌషీరిష్టాసుకృతే త ఆదదేఽసావితి। మమ సమిద్ధేఽహౌషీరాశాపరాకాశౌ త ఆదదేఽసావితి। స వా ఏష నిరింద్రియో విసుకృదస్మాల్లోకాత్ప్రైతి యమేవంవిద్బ్రాహ్మణశ్శపతి తస్మాదేవంవిచ్ఛ్రోత్రియస్య దారేణ నోపహాసమిచ్ఛేదుత హ్యేవంవిత్పరో భవతి. ॥12॥

ప॥ అథ-యస్య-జాయాయై-జారః-స్యాత్ - తం-చేత్ - ద్వి

ష్యాత్-ఆమపాత్రే-అగ్నిం-ఉపసమాధాయ-ప్రతిలోమం-శరబర్హిః-తీర్త్వా-తస్మిన్-ఏతాః-శరభృష్టీః-ప్రతిలోమాః - సర్పిషా - అక్తాః-జుహుయాత్-మమ-సమిద్ధే-హౌషీః ప్రాణాపానౌ-తే-ఆదదే-అసౌ-ఇతి-మమ-సమిద్ధే-హౌషీః-పుత్రపశూన్-తే-ఆదదే-అసౌ ఇతి-మమ-సమిద్ధే-హౌషీః-ఇష్టాసుకృతే-తే-ఆదదే-అసౌ-ఇతి-మమ-సమిద్ధే-హౌషీః-ఆశాపరాకాశౌ-తే-ఆదదే-అసౌ-ఇతి-సః-వై-ఏషః-నిరిన్ద్రియః-విసుకృత్-అస్మాత్-లోకాత్-ప్రైతి-యం-ఏవం-విద్వాన్-బ్రాహ్మణః-శపతి-తస్మాత్-ఏవంవిత్-శ్రోత్రియస్య-దారేణ-న - ఉపహాసం-ఇచ్ఛేత్-ఉత-హి ఏవంవిత్-పరః-భవతి.

ప్ర॥ అథ=అనంతరము, యస్య=ఎవనియొక్క, జాయాయై=భార్యకొఱకు, జారః=ఉపపతి, (అంకుమగఁడు), స్యాత్=కలిగెనేని, తం=వానిని, (పురుషః = పురుషుఁడు). ద్విష్యాచ్చేత్ = ద్వేషించిన యెడల, ఆమపాత్రే=పచ్చిదియైన మట్టిపాత్రయందు. అగ్నిం=అగ్నిని, ఉపసమాధాయ=ఉంచి, ప్రతిలోమం=కర్మకు ప్రతిలోమమగు, శరబర్హిః=రెల్లుదర్భను, తీర్త్వా=పఱచి, తస్మిన్=ఆ అగ్నియందు, (అవసథాగ్నియందు) సర్పిషా=నేతిచేత, అక్తాః=తడుపఁబడిన, ప్రతిలోమాః=విలోమముగానుండెడి, (వ్యత్యాసముగాఁ జేయు బడిన). ఏతాః=ఈ, శరభృష్టీః=రెల్లుసంబధములను. జుహుయాత్=హోమముచేయవలయును. ("మమసమిద్ధేహౌషీః" అను ఈ నాలుగు మంత్రములను చెప్పుచు హోమము చేయనలయును. ఆ మంత్రములయర్థము చెప్పఁబడుచున్నది). (సః=ఆ పురుషుఁడు), మమ = నాయొక్క. సమిద్ధే=ప్రకాశమానమగు, (యౌవనము మొదలైనవానిచేత ప్రకాశమానమగు, యోషాగ్నౌ = స్త్రీ రూపాగ్నియందు, రేతః = రేతస్సును), హౌషీః=హోమముచేసితివి. (గనుక), తే=నీయొక్క, ప్రాణాపానౌ=ప్రాణాపానములను, ఆదదే=గ్రహించుచున్నాను. (ఇతి=అని. జుహుయాత్ = హోమముచేయవలయును), అసావితి = వీఁడని, (ప్రత్యేక

ముగా శత్రువుయొక్క నామమును గ్రహించి చెప్పవలెను) మమ=నాయొక్క, సమిద్ధే=ప్రకాశమగు యోషాగ్నియందు, (రేతః=రేతస్సును), హౌషీః=హోమమును చేసితివి (గనుక), తే=నీయొక్క, పుత్రపశూన్=పుత్రులను పశువులను, ఆదదే=గ్రహించుచున్నాను, (ఇతి=అని, జుహుయాత్=హోమము చేయవలయును). అసావితి=వీఁడని, (ప్రత్యేకముగా శత్రువుయొక్క నామగ్రహణమును చెయవలెను). మమ=నాయొక్క. సమిద్ధే=ప్రకాశమానమగు యోషాగ్నియందు, (రేతః=రేతస్సును) హౌషీః=హోమమును చేయుచున్నావు. (గనుక) తే=నీయొక్క, ఇష్టాసుకృతే=శ్రౌతస్మార్తకర్మలను, ఆదదే=గ్రహించుచున్నాను. (ఇతి=అని, జుహుయాత్=హోమము చేయవలయును). అసావితి=వీఁడని, (ప్రత్యేకముగా నామమును చెప్పవలయును). మమ=నాయొక్క, సమిద్ధే=ప్రకాశమానమగు యోషాగ్నియందు, (రేతః రేతస్సును), హౌషీః=హోమమును చేసితివి. (గనుక), తే=నీయొక్క ఆశాపరాకాశౌ=ఆశాపరాకాశములను, (ఆశయనఁగా ప్రార్థన, పరాకాశమనఁగ=వాక్కుచే ప్రతిజ్ఞ చేయఁబడి కర్మచే ప్రతిపాదింపఁబడనిదానిని, నిరీక్షించుట). ఆదదే=గ్రహించుచున్నాను. (ఇతి=అని, జుహుయాత్=హోమము చేయవలయును). అసావితి=వీఁడని, (ప్రత్యేకముగాశత్రువుయొక్క నామమును చెప్పవలయును). ఏవం=ఈప్రకారము. విద్వాన్=విద్వాంసుఁడగు, బ్రాహ్మణః=బ్రాహ్మణుఁడు, యం=ఎవనిని, శపతి=శపించుచున్నాఁడో, సః=అటువంటి, ఏష వై=వీఁడే, నిరిన్ద్రియః=ఇంద్రియములేనివాఁడును, విసుకృత్=పుణ్యకర్మములేనివాఁడునై, అస్మాత్=ఈ, లోకాత్=లోకమునుండి, ప్రైతి=మరణమును పొందుచున్నాఁడు. తస్మాత్=ఆకారణమువలన, ఏవంవిత్=ఇట్లు తెలిసికొనినవాఁడు, శ్రోత్రియస్య=శ్రోత్రియునియొక్క, దారేణ=భార్యతో, ఉపహాసం=సంభోగమును, నేచ్ఛేత్=కోరఁగూడదు. ఉత=మఱియును, ఏవంవిత్=ఇట్లు తెలిసికొనినవాఁడు, పరః=శత్రు

వుఁడు, భవతిహి:=అగుచున్నాఁడు.

తా॥ అనంతరము వాజపేయయాగ సంపత్తుగల పురుషుఁడు తన భార్యతో జారత్వమును చేసెడి పురుషునియందు ద్వేషము కలిగినయెడల అప్పుడు అవసథ్యమను అగ్నిని పచ్చి మట్టిపాత్రయందుంచుకొని తల్లక్రిందుగా రెల్లు దర్భను పఱచి ఆ అగ్నియందు నేతితో తడుపఁబడిన ఈ రెల్లుయొక్క స్తంబములను ''సమిద్ధేహౌషీః'' అను నాలుగు మంత్రములచేతను హోమమును చేయవలయును. ఈనాలుగు మంత్రములకర్థమేమనఁగా, నీవు నా సంబంధమగు యోషాగ్నియందు రేతస్సును హోమము చేసితివి గనుక నాకు శత్రువవైన నీయొక్క ప్రాణాపానములను, పశుపుత్రాదులను, శ్రౌతస్మార్త కర్మములను, ఆశా పరాకాశములను, నేను గ్రహించుచున్నానని క్రమముగా నాలుగు మంత్రములతో కడపట శత్రు:నామమును ప్రత్యేకప్రత్యేకముగా నుచ్చరించుచు హోమమును చేయవలయును. ఈ ప్రకారము వాజపేయ యాగసంపత్తు గల పురుషుఁడు తన భార్యతో సంభోగమును చేసిన శత్రువును శపించినయెడల ఆ శత్రువు ఇంద్రియము లేనివాఁడును పుణ్యకర్మము నశించిన వాఁడునై ఈ లోకమునుండి మరణమును పొందుచున్నాఁడు. కనుక ఇట్లు తెలిసికొనినవాఁడు శ్రోత్రియునియొక్క భార్యతో పరిహాసమునగాని, సంభోగమునుగాని చేయఁగూడదు. అట్లు చేసినయెడల శత్రువై నశించుచున్నాఁడు. ప్రసంగసంగతిచే ఈ అభిచారి కర్మ ఇక్కడ చెప్పఁబడినదిగాఁ దెలిసికొనవలయును.

ఉ॥ అథ యస్య జాయామార్తవం విన్దేత్త్ర్యహం కꣳసేన పిబేద
హతవాసా నైనాం వృషలో న వృషల్యుపహన్యా త్త్రిరాత్రా
న్త అప్లుత్య వ్రీహీనవ ఘాతయేత్ ॥13॥

ప॥ అథ-యస్య-జాయాం-ఆర్తవం-విన్దేత్ - త్ర్యహం-కంసేన -
పిబేత్ -అహతవాసా:-న-ఏనాం-వృషల:-న-వృషలీ-ఉపహన్యాత్ -

త్రిరాత్రాన్తే-ఆప్లుత్య-వ్రీహీః-అవఘాతయేత్

ప్ర॥ అథ=అనంతరము, యస్య = ఎవనియొక్క, జాయాం = భార్యను, ఆర్తవం=ఋతుభావమ్ము, విన్దేత్ = పొందునో, (తదా = అప్పుడు), త్ర్యహం=మూడురోజులు, కంస్యేన = గిన్నెతో పిబేత్= పానముచేయవలయును. అహతవాసాః = కొట్టఁబడిన వస్త్రముకలది, (రజోదూషితముకాని వస్త్రముకలది), న=కాదు. ఏనాం=ఈ స్త్రీని, వృషలః=శూద్రుఁడును, వృషలీ=శూద్రస్త్రీయును, నోపహన్యాత్ =స్పృశించఁగూడదు. త్రిరాత్రాన్తే=మూడురాత్రులు వెళ్లిన తరువాత, ఆప్లుత్య=స్నానముచేసి, (నా=ఆస్త్రీ, అహతవాసాః = రజోదూషితముకాని వస్త్రముకలది. స్యాత్=అగుచు. తదా = అప్పుడు), వ్రీహీన్=వడ్లను,అవఘాతయేత్=దంపించవలయును.(స్నానముచేసిన ఆ స్త్రీని ధాన్యమును దంపుటకు నియోగించవలయును.)

తా॥ ఇట్లు ప్రసంగ సంగతిచేత ఆభిచారిక కర్మను చెప్పి పూర్వమందు చెప్పిన ఋతుకాలమును తెలియపఱచుచున్నాఁడు. వాజపేయయాగముచేసిన పురుషునియొక్క భార్య ఋతుమతియైన యెడల ఆ స్త్రీ గిన్నెతో ఉదక పానమును చేయవలయును. రజస్సుచే దూషితమైన వస్త్రము కలదియైయుండును. ఆ స్త్రీని శూద్రుఁడుగాని శూద్ర స్త్రీ గాని తాకఁగూడదు మూడురోజులు వెళ్లిన తరువాత స్నానముచేసి రజోదూషితముగాని వస్త్రముగల స్త్రీని వడ్లనుదంపుటకు నియోగించవలయును.

ఉ॥ స య ఇచ్ఛేత్పుత్రో మే శుక్లో జాయేత వేద మనుబ్రువీత సర్వ
మాయురియాదితి క్షీరౌదనం పాచయిత్వా సర్పిష్మన్త మశ్నీ
యాతా మీశ్వరౌ జనయితవై. ॥14॥

ప్ర॥ సః-యః-ఇచ్ఛేత్-పుత్రః-మే-శుక్లః-జాయేత- వేదం -అను బ్రువీత-సర్వం-ఆయుః-ఇయాత్-ఇతి-క్షీరౌదనం-పాచయిత్వా -సర్పిష్మన్తం-అశ్నీయాతాం-ఈశ్వరౌ-జనయిత-వై.

ప్ర॥ యః=ఏ, సః=ఆ పురుషుఁడు, మే=నాకు, శుక్లః= తెల్లని పుత్రః=కుమారుఁడు, జాయేత = కలుగునుగాక. వేదం = ఒక వేదము, అనుబ్రువీత=అనుసరించి చెప్పునుగాక, సర్వం=సమస్తమైన, ఆయుః=ఆయుస్సును, ఇయాదితి=పొందునుగాకయని, ఇచ్ఛేత్ =కోరిన యెడల, క్షీరౌదనం=క్షీరాన్నమును, పాచయిత్వా=వండించి, (స్త్రీ పురుషులు), సర్పిష్మన్తం=నెయ్యిగల దానినిగా, అశ్నీయాతాం= భక్షించవలయును. (తదా=అప్పుడు, తం=అటువంటి పుత్రుని), జనయితవై=పుట్టించుటకు, ఈశ్వరౌ=సమర్థులు, (స్యాతాం=అగుదురు).

తా॥ ఇట్లు దంపఁబడిన వడ్లవలన కలిగిన బియ్యముతో నేమి చేయవలయుననిన, ఆ వాజపేయయాగ సంపత్తుగల పురుషుఁడు తనకు తెల్లని దేహకాంతిగలవాఁడును నూఱు సంవత్సరములు ఆయుస్సు గలవాఁడును, ఒక వేదమును సాంగముగా చదువుకొనిన వాఁడు నగు పుత్రుఁడుకలుగవలయునని కోరినయెడల ఆ బియ్యముతో క్షీరాన్నమును వండించి స్త్రీ పురుషు లిద్దఱును భక్షించవలయును. ఇట్లు భక్షించిరేని వారు అట్టి పుత్రుని కనుటకు సమర్థులగుదురు.

ఉ॥ అథ య ఇచ్ఛేత్పుత్రో మే కపిలః । పిఙ్గళో జాయేత ద్వౌ వేదా
వనుబ్రువీత సర్వ మాయు రి యాదితి దధ్యోదనం పాచయిత్వా
సర్పిష్మన్త మశ్నీయాతా మీశ్వరౌ జనయితవై. ॥15॥

ప॥ అథ-యః-ఇచ్ఛేత్-పుత్రః-మే-కపిలః-పిఙ్గళః - జాయేత-ద్వౌ-వేదా-అనుబ్రువీత-సర్వం-ఆయుః-ఇయాత్-ఇతి-దధ్యోదనం - పాచయిత్వా-సర్పిష్మన్తం-అశ్నీయాతాం-ఈశ్వరౌ-జనయితవై.

ప్ర॥ అథ=అనంతరము, యః=ఏపురుషుఁడు, మే=నాకు, కపిలః=నానారంగులు కలవాఁడును, పిఙ్గళః=పచ్చని రంగుకలవాఁడునగు, పుత్రః=కుమారుఁడు, జాయేత=పుట్టునుగాక, ద్వౌ=రెండు, వేదా= వేదములను, అను బ్రువీత=అనుసరించి చెప్పునుగాక, సర్వం=సమస్తమైన, ఆయుః=ఆయుస్సును, ఇయాదితి=పొందునుగాక యని, ఇచ్ఛేత్

=కోరునో, (సః=వాఁడు), దధ్యోదనం = పెరుగు అన్నమును, పాచ యిత్వా=వండించి, సర్పిష్మన్తం=నేయిగలదానినిగా, (ఆ స్త్రీ పురుషు లిద్దఱు), అశ్నీయాతాం=భక్షించవలయును. (తదా=అప్పుడు, తౌ= స్త్రీ పురుషులిద్దఱు, తం=అట్టిపుత్రుని), జనయితవై = పుట్టించుటకు, ఈశ్వరౌ=సమర్థులు, (స్యాతాం=అగుదురు).

తా॥ కపిల వర్ణము కలవాఁడును పచ్చ కాంతిగలవాఁడును రెండు వేదములను చదువుకొనిన వాఁడును సంపూర్ణమైన ఆయుస్సు కలవాఁడునగు పుత్రుఁడు నాకు కలుగునుగాక యని కోరెడిజనుఁడు పెరుగు అన్నమును పచనము చేయించి నేతితో కలిపి స్త్రీ పురుషు లిద్దఱును భక్షించిరేని అట్టి పుత్రుని కనుటకు సమర్థులగుచున్నారు.

ఉ॥ అథ య ఇచ్ఛేత్పుత్రో మే శ్యామో లోహితాక్షో జాయేత త్రీన్వేదా ననుబ్రువీత సర్వమాయురి యాదిత్యు దోదనం పా చ యిత్వా సర్పిష్మన్త మశ్నీయాతా మీశ్వరౌ జనయితవై. ॥16॥

ప॥ అథ-యః-ఇచ్ఛేత్-పుత్రః-మే-శ్యామః - లోహితాక్షః - జాయేత-త్రీన్ - వేదాన్ -అను-బ్రువీత-సర్వం-ఆయుః - ఇయాత్ -ఇతి - ఉదోదనం-పాచయిత్వా-సర్పిష్మన్తం-అశ్నీయాతాం-ఈశ్వరౌ - జన యిత - వై.

ప్ర॥ అథ=అనంతరము, యః=ఎవఁడు, మే=నాకు, శ్యామః= నల్లని కాంతిగలవాఁడును, లోహితాక్షః = ఎఱ్ఱని నేత్రములు కల వాఁడునగు, పుత్రః=కుమారుఁడు, జాయేత=పుట్టునుగాక, త్రీన్ వే దాన్ =మూఁడు వేదములను, అనుబ్రువీత=అధ్యయనమును చేయును గాక, సర్వం=సమస్తమైన, ఆయుః=ఆయుస్సును, ఇయాదితి = పొం దునుగాకయని, ఇచ్ఛేత్=కోరునో, (సః=వాఁడు), ఉదోదనం=ఉద కాన్నమును, (శుద్ధాన్నమును). పాచయిత్వా=వండించి, సర్పిష్మ న్తం=నెయ్యికల దానినిగా, (స్త్రీ పురుషులు), అశ్నీయాతాం = భక్షించవలయును. (తదా=అప్పుడు, తౌ=ఆ స్త్రీ పురుషులిద్దఱు, తం

భక్షించిరేని ఆ స్త్రీ పురుషులు అట్టి పుత్రుని కనుటకు సమర్థులగుదురు.

ఉ॥ అథ య ఇచ్ఛే త్పుత్రో మే పణ్డితో విగీత స్సమితిం గమః శుశ్రూషితాం వాచం భాషితా జాయేత సర్వాన్వేదా ననుబ్రువీత సర్వమాయురి యాదితి మాంసౌదనం పాచయిత్వా సర్పిష్మన్త మశ్నీయాతా మీశ్వరౌ జనయితవా ఔక్ష్ణేన వార్షభేణవా. ॥18॥

ప॥ అథ-యః-ఇచ్ఛేత్-పుత్రః-మే-పణ్డితః-విగీతః - సమితింగమః-శుశ్రూషితాం-వాచం-భాషితా-జాయేత-సర్వాన్ - వేదాన్ - అను-బ్రువీత-సర్వం-ఆయుః-ఇయాత్-ఇతి-మాంసౌదనం - పాచయిత్వా-సర్పిష్మన్తం-అశ్నీయాతాం-ఈశ్వరౌ-జనయితవై - ఔక్ష్ణేన - వా-ఆర్షభేణ-వా.

ప్ర॥ అథ=అనంతరము, యః=ఎవడు. మే = నాకు, పణ్డితః= పండితుఁడును, విగీతః=ప్రసిద్ధుఁడును, సమితింగమః=సభను పొందెడివాఁడును, శుశ్రూషితాం = మనోహరమైన, వాచం = వాక్కును, భాషితా=పలికెడివాఁడునగు, పుత్రః=కుమారుఁడు, జాయేత = కలుగునుగాక, (ఆ పుత్రుఁడు) సర్వాన్=సమస్తములైన, వేదాన్=వేదములను, అను బ్రువీత=అనుసరించి అధ్యయనము చేయునుగాక. సర్వం =సమస్తమైన, ఆయుః=ఆయుస్సును, ఇయాదితి=పొందునుగాకయని, ఇచ్ఛేత్=కోరునో, (సః=వాఁడు), ఔక్ష్ణేనవా = వయస్సుగల యెద్దు మాంసముతోగాని, ఆర్షభేణవా=అధిక వయస్సుగల యెద్దు మాంసముతోగాని, మాంసౌదనం=మాంసాన్నమును, పాచయిత్వా=వండించి సర్పిష్మన్తం=నెయ్యికలదానినిగా, (స్త్రీ పురుషులు), అశ్నీయాతాం= భక్షించవలయును. (తౌ=ఆ స్త్రీ పురుషులు, తం = అట్టి పుత్రుని), జనయితవై=కనుటకు, ఈశ్వరౌ = సమర్థమైనవారు, (స్యాతాం = అగుదురు).

తా॥ సమస్త వేదములను అధ్యయనము చేసినవాఁడును సం

పూర్ణాయుస్సుకలవాఁడును, పండితుఁడును ప్రసిద్ధుఁడును సభను పొంది వాదించెడివాఁడును మనోహరమైన వాక్కును పలికెడివాఁడునగు పుత్రుఁడు నాకు కలుగునుగాక యని కోరెడివాఁడు వయస్సుగల వృషభముయొక్క గాని అధికవయస్సుగల వృషభముయొక్క గాని మాంసముతో పచనముచేయఁబడిన మాంసాన్నమును స్త్రీ పురుషులు భక్షించికేని వారు అట్టి పుత్రుని కనుటకు సమర్థులగుదురు.

ఉ॥ అథాభిప్రాతరేవ స్థాలీపాకావృతాజ్యం చేష్టిత్వా స్థాలీపాకస్యో పఘాతం జుహోత్యగ్నయే స్వాహా అనుమతయే స్వాహా దేవాయ సవిత్రే సత్యప్రసవాయ స్వాహేతి హుత్వోద్ధృత్య ప్రాశ్నాతి ప్రాశ్యేతరస్యాః ప్రయచ్ఛతి ప్రక్షాళ్య పాణీ ఉదపాత్రం పూర యిత్వా తేనైనాం త్రిరభ్యుక్షతి ఉత్తిష్ఠాతో విశ్వావసోఽన్యా మిచ్ఛ ప్రపూర్వ్యాం సజాయాం పత్యా సహేతి. ॥19॥

ప॥ అథ-అభిప్రాతః-ఏవ-స్థాలీపాకావృతాజ్యం - చేష్టిత్వా - స్థాలీపాకస్య-ఉపఘాతం-జుహోతి-అగ్నయే-స్వాహా - అనుమతయే - స్వాహా- దేవాయ-సవిత్రే-సత్యప్రసవాయ-స్వాహా-ఇతి - హుత్వా - ఉద్ధృత్య-ప్రాశ్నాతి-ప్రాశ్య-ఇతరస్యాః-ప్రయచ్ఛతి-ప్రక్షాళ్య-పాణీ - ఉదపాత్రం-పూరయిత్వా- తేన-ఏనాం-త్రిః-అభ్యుక్షతి-ఉత్తిష్ఠ-అతః - విశ్వావసో-అన్యాం-ఇచ్ఛ-ప్రపూర్వ్యాం-సంజాయాం-పత్యా- సహ- ఇతి.

ప్ర॥ అథ=అనంతరము. (సః=ఆ పురుషుఁడు), అభిప్రాతరేవ =మఱునటిదినముయొక్క ప్రాతఃకాలమునందు స్థాలీపాకావృతాజ్యం =స్థాలీపాకమునకొఱకు సంపాదింపఁబడిన ఆజ్యమును, చేష్టిత్వా=సంస్కా రమునుచేసి, స్థాలీపాకస్య=స్థాలీపాకమునకు, ఉపఘాతం = ఉపఘాత మునుచేసి, (పళ్ళెమందుంచి చరువును వండించి). (జుహోతి = హోమము చేయుచున్నాఁడు. అగ్నయే స్వాహా=అగ్నికొఱకు స్వాహాయని, అను మతయే స్వాహా = అనుమతికొఱకు స్వాహా యని, సత్యప్రసవాయ=

సత్యకారణుఁడగు, దేవాయ=ప్రకాశమానుఁడగు సవిత్రే=సూర్యుని కొఱకు, స్వాహేతి=స్వాహాయని, (ఈ మూఁడు మంత్రములతో అహుతులను), హుత్వా = హోమముచేసి, (చరుశేషం = మిగిలిన హవిస్సును), ఉద్ధృత్య=ఎత్తి, ప్రాశ్నాతి=భక్షించుచున్నాఁడు. (స్వయం =తాను), ప్రాశ్య=భక్షించి, (మిగిలిన ఉచ్ఛిష్టాన్నమును), ఇతరస్యాః=అన్యమగు తన భార్యకొఱకు, ప్రయచ్ఛతి=ఇచ్చుచున్నాఁడు. పాణీ=చేతులను, ప్రక్షాళ్య=కడుగుకొని, ఉదపాత్రం=ఉదకపాత్రను, పూరయిత్వా=నిండించి, తేన=ఆ ఉదకముచేతను, ఏనాం=ఈ స్త్రీని, త్రిః=మూఁడుసార్లు, (ఉత్తిష్ఠాతో విశ్వావసో అను ఈ మంత్రమును చెప్పి). అభ్యుక్షతి = ప్రోక్షించుచున్నాఁడు. (ఈ మంత్రార్థమేమనఁగా), హేవిశ్వావసో=ఓ విశ్వావసు అను గంధర్వుఁడా, (త్వం =నీవు), అతః=ఈ నా భార్యా సమీపమునుండి, ఉత్తిష్ఠ=లేచిపొమ్ము. అన్యాం = ఇతరమైనదియును, ప్రపూర్వ్యాం = వయోవంతురాలైనదియునగు, పత్యాసహ=పెనిమిటితోకూడా, సఞ్జాయాం=క్రీడించుచున్న భార్యను, ఇచ్ఛ=కోరుము, ఇతి=అని, (ఈమంత్రోచ్చారణను చేయుచు ప్రోక్షించుచున్నాఁడు),

తా॥ ఆ పురుషుఁడు స్థాలీపాకము కొఱకైన ఆజ్యమును మంత్రముచే సంస్కరించి వడ్లనుదంపించి చరువును వండించి ఆ చరువును "అగ్నయే స్వాహా, అనుమతయే స్వాహా, దేవాయసవిత్రే సత్యప్రసవాయ స్వాహా)', అను ఈ మూఁడు మంత్రములతో అగ్నియందు హోమముచేసి హోమశేషమైన చరువును తాను భక్షించి మిగిలిన ఉచ్ఛిష్టమును భార్యకొఱకు ఇచ్చుచున్నాఁడు. తదనంతరము హస్తములను కడుగుకొని ఉదకపాత్రయందు నిండించిన ఉదకముతో ఈ స్త్రీని మూఁడుసార్లు 'ఉత్తిష్ఠాతో విశ్వావసో' అను ఈ మంత్రమును 'పత్యాసహేతి' అనుకొనవఱకు చెప్పి మంత్రించి ప్రోక్షించుచున్నాఁడు. ఈ మంత్రము తాత్పర్యమేమనఁగా, ఓ విశ్వావసు అను

గంధర్వుఁడా! నీవు ఈ నాభార్యాసమీపమునుండి లేచిపొమ్ము. ఇతర మైనదియును వయస్సుకలదియునగు పెనిమిటితో కూడ క్రీడించు చున్న భార్యను కోరుమా యని అభిప్రాయము.

ఉ॥ అథైనామభిపద్యతే అమోఽహమస్మి సా త్వగ్ం సా త్వమస్య మోఽహం సామాహమస్మి ఋక్త్వం ద్యౌరహం పృథివీత్వం తావేహిసగ్ం రభావహై సహ రేతో దధావహైపుగ్ంసే పుత్రాయ విత్తయ ఇతి. ॥20॥

ప॥ అథ-ఏనాం-అభిపద్యతే-అమః-అహం-అస్మి-సా - త్వం - సా-త్వం-అసి-అమః-అహం-సామ అహం-అస్మి-ఋక్-త్వం-ద్యౌః-అహం-పృథివీ-త్వం-తౌ-ఏహి-సంరభావహై-సహ-రేతః-దధావహై-పుంసే-పుత్రాయ-విత్తయే-ఇతి.

ప్ర॥ అథ=అనంతరము, (సః = ఆ పురుషుఁడు), ఏనాం=ఈ స్త్రీని, అభిపద్యతే=కౌఁగిలించుకొనుచున్నాఁడు. అహం=నేను, అమః =ప్రాణము, అస్మి=అగుచున్నాను. త్వం = నీవు, సా=ఆ వాక్కు, అసి=అగుచున్నావు. అమః=ప్రాణస్వరూపుఁడనైన, అహం = నేను, సా=ఆ వాగ్రూపమైన, త్వం=నీవు, అస్మి = అగుచున్నాను. సామ= సామవేదము, అహం=నేను, అస్మి=అగుచున్నాను. ఋక్ = ఋగ్వేదము, త్వం=నీవు, (అసి = అగుచున్నావు). ద్యౌః = అంతరిక్షము, అహం=నేను; పృథివీ=భూమి, త్వం=నీవు; (కనుక, త్వం=నీవు), ఏహి =రమ్ము. తౌ=ఆ, (ఆవాం=మనమిద్దఱము), పుంసే=పుంస్త్వముగల, పుత్రాయ విత్తయే=పుత్రధనముకొఱకు, సంరభావహై= ప్రయత్నము చేయుదము. సహ=కూడా, రేతః=రేతస్సును, దధావహై =ధరించెదము, ఇతి=అని, (అభిపద్యతే=కౌఁగిలించుకొనుచున్నాఁడు).

తా॥ ఆ పురుషుఁడు క్షీరాన్నాది భక్షణమును చేసిన తరువాత ఈ స్త్రీని "అమోహమస్మి" అను మంత్రమును చెప్పుచు కౌఁగిలించుకొనుచున్నాఁడు. ఈ మంత్రాభిప్రాయమేమనఁగా, నేను ప్రాణము,

నీవు వాక్కువు. ప్రాణమునకు వాక్కు స్వాధీనమైనట్లు నీవు నాకు స్వాధీనమైన దానవు. నేను సామవేదము; నీవు ఋగ్వేదము. సామవేదమునకు ఋగ్వేద మాధారమైనట్లు నాకు నీవాధారమైయున్నావు. నేను అంతరిక్షము; నీవు భూమివి. భూమ్యంతరిక్షములు లోకమునకు తల్లిదండ్రులైనట్లు మనము పుత్రునకు తల్లిదండ్రులమైయున్నాము, కనుక నీవురమ్ము. అటువంటి మనమిద్దఱమును కూడి పుంస్త్వముగల పుత్రోత్పత్తి కొఱకు ప్రయత్నమును చేయుదము. రేతస్సును ధరించుదము. అని చెప్పి ఆ పురుషుఁడు స్త్రీని కౌఁగిలించుకొనుచున్నాఁడు.

ఉ॥ అథాస్యా ఊరూ విహాపయతి విజిహీథాం ద్యావాపృథివీ ఇతి తస్యామర్థం నిష్ఠాయ ముఖేన ముఖగ్ సన్ధాయ త్రిరేనామనులోమామను మార్ష్టి విష్ణుర్యోనిం కల్పయతు త్వష్టా రూపాణి పింశతు ఆసిఞ్చతు ప్రజాపతిర్ధాతా గర్భం దధాతు తే ॥ గర్భంధేహి సినీవాలి గర్భం ధేహి పృథుష్టుకే । గర్భం తే అశ్వినా దేవావాధత్తాం పుష్కరస్రజౌ ॥21॥

ప॥ అథ–అస్యాః–ఊరూ–విహాపయతి–విజిహీథాం - ద్యావాపృథివీ–ఇతి–తస్యాం–అర్థం–నిష్ఠాయ–ముఖేన-ముఖం–సన్ధాయ–త్రిః–ఏనాం–అను లోమాం- అనుమార్ష్టి –విష్ణుః–యోనిం–కల్పయతు–త్వష్టా–రూపాణి-పింశతు–ఆసిఞ్చతు–ప్రజాపతిః–ధాతా-గర్భం–దధాతు– తే–గర్భం–ధేహి-సినీవాలి–గర్భం–ధేహి–పృథుష్టుకే–గర్భం–తే–అశ్వినా–దేవౌ - ఆధత్తాం – పుష్కరస్రజౌ.

ప్ర॥ అథ=అనంతరము, (సః=ఆ పురుషుఁడు), ద్యావాపృథివీ =ఓ భూమ్యంతరిక్షములారా! (ఈ సంభోధనము ఊరువులకు, యువాం =మీరు), విజిహీథామితి = వియోగమును పొందుఁడీయని, అస్యాః= ఈ స్త్రీయొక్క, ఊరూ=తొడలను, విహాపయతి=విడదీయుచున్నాడు, తస్యాం=ఆ స్త్రీయందు, అర్థం = మేఢ్రమును, నిష్ఠాయ = ఉంచి, ముఖేన=ముఖముతో, ముఖం=ముఖమును, సన్ధాయ=కూర్చి, ఏనాం

=ఈ స్త్రీని, త్రిః = మూడుసార్లు, అనులోమాం = తల్లక్రిందుగా, (శిరస్సు మొదలుకొని), (విష్ణుర్యోనిం అను మంత్రమును చెప్పుచు), అనుమార్ష్టి =అనుసరించి స్పృశించుచున్నాడు. విష్ణుః = వ్యాపనశీలుఁడైన భగవంతుఁడు, (విష్ణువు), తే=నీకు, యోనిం = సంతానోత్పాదనమునకు సమర్థమైన భగమును, కల్పయతు=కల్పించునుగాక. త్వష్టా =త్వష్టయను సూర్యుఁడు, రూపాణి=దర్శనయోగ్యములైన ఆకారములను, పింశతు=చేయునుగాక. ప్రజాపతిః=విరాడాత్మ, (మదాత్మనా =నా రూపముతో, స్థిత్వా=ఉండి, త్వయి=నీయందు, రేతః = రేతస్సును). ఆసిఞ్చతు=ఉంచునుగాక, ధాతా = సూత్రాత్మ, తే = నీ యొక్క, గర్భం=గర్భమును, (త్వదాత్మనా = నీ స్వరూపముతో, స్థిత్వా=ఉండి), దధాతు = ధరించునుగాక. (లేక, కాపాడునుగాక). హేసినీవాలి=దర్శనార్హమగు ఓ దేవతా, గర్భం=గర్భమును, ధేహి =ధరించుము. హేపృథుష్టుకే=స్తోత్రరూపమైన ఓ దేవతా, గర్భం= గర్భమును, ధేహి=ధరించుము. పుష్కరస్రజౌ = అశ్వినీపుత్రులగు, దేవౌ=ప్రకాశమానులైన, అశ్వినౌ = అశ్వినీదేవతలు, (సూర్యాచంద్రమస్సులు), తే=నీయొక్క; గర్భం = గర్భమును, ఆధత్తాం= ధరించుదురుగాక.

తా॥ ఆ పురుషుఁడు ద్యావా పృథివ్యాత్మకములైన ఓ తొడలారా! అని సంబోధించి పిలిచి భగమునకు మఱుఁగైయున్న ఈ స్త్రీ యొక్క తొడలను వేఱుపఱచి ఆ స్త్రీయందు మేఢ్రమునుఉంచి ముఖముతో ముఖమును చేర్చి "విష్ణుర్యోనింకల్పయతు" అనునట్టిది మొదలైన ప్రతిమంత్రమును చెప్పుచు ఈ స్త్రీని శిరస్సు మొదలుకొని మూడుసారులు స్పృశించుచున్నాఁడు. ఈ మంత్రముల తాత్పర్యమేమనఁగా, వ్యాపనశీలుఁడైన మహావిష్ణువు సంతానమును పుట్టించుటకు సమర్థమైనభగమునుకల్పించునుగాక, ద్వాదశాదిత్యులయందలి త్వష్టయను సూర్యుఁడు దర్శనయోగ్యములైన రూపములను చేయునుగాక,

విరాట్స్వరూపుఁడగు పరమాత్మ నా స్వరూపముతోనుండి నీయందు రేతస్సును ఉంచుచుగాక. సూత్రాత్మ నీ స్వరూపముతోనుండి నీ గర్భమును ధరించునుగాక. దర్శనార్హమగు దేవతయును స్తుతి రూపమగు దేవతయును నీ రూపముతోనుండి నీ గర్భమును ధరించునుగాక. ప్రకాశమానులగు సూర్యచంద్రులిద్దఱు నీ స్వరూపముతోనుండి నీ గర్భమును ధరించుదురుగాకయని స్త్రీయొక్క శిరస్సు మొదలుకొని ప్రతి అవయవమును తాకుచు ఈ మంత్రములను చెప్పవలయునని తాత్పర్యము.

ఉ॥ హిరణ్మయీ అరణీ యాభ్యాం నిర్మన్థతామశ్వినా తత్తే గర్భం హవామహే దశమే మాసి సూతవే । యథాఽగ్నిగర్భా పృథివీ యథా ద్యౌరిన్ద్రేణ గర్భిణీ। వాయుర్దిశాం యథాగర్భ ఏవం గర్భం దధామి తేఽసావితి. ॥22॥

ప॥ హిరణ్మయీ-అరణీ-యాభ్యాం-నిర్మన్థతాం - అశ్వినౌ - తత్ - తే-గర్భం-హవామహే-దశమే-మాసి-సూతవే-యథా - అగ్నిగర్భా-పృథివీ-యథా-ద్యౌః ఇన్ద్రేణ-గర్భిణీ-వాయుః-దిశాం-యథా గర్భే-ఏవం-గర్భం-దధామి- తే అసౌ- ఇతి.

ప్ర॥ అరణీ=అరణులు, హిరణ్మయీ= తేజోరూపమైనవి. యాభ్యాం=ఏ అరణులచేతను, అశ్వినౌ = అశ్వినీ దేవతలు, నిర్మన్థతాం= మథింపఁబడిరో, తత్=అట్టి, తే=నీయొక్క, గర్భం=గర్భమును, దశమేమాసి=పదియవమాసమునందు, సూతవే=ప్రసవించుటకు, (అహం = నేను, త్వయి = నీయందు), హవామహే = హోమము చేయుచున్నాను. పృథివీ=భూమి, అగ్నిగర్భా = అగ్నిగర్భమునందుగలది, యథా=ఏప్రకారము, ద్యౌః=ద్యులోకము, ఇన్ద్రేణ=ఇంద్రునిచేత, గర్భిణీ=గర్భముగలది, యథా = ఏప్రకారమో, దిశాం = దిక్కుల యొక్క, గర్భే=గర్భమునందు, వాయుః=వాయువు, యథా=ఏప్రకారమో, ఏవం=ఈప్రకారము, తే=నీయొక్క, గర్భం=గర్భమును,

దధామి=ధరించుచున్నాను. అసావితి=ఇదియని, (స్త్రీయొక్క నామము నుచ్చరించి ఆ పురుషుఁడు, తన రేతస్సును స్త్రీయందుంచు చున్నాఁడు).

తా॥ సూర్యచంద్రులు తేజోరూపములైన అగ్ని మథన కట్టెలతో ఏ గర్భము మథించిరో అట్టి నీ గర్భమును నేను అగ్ని గర్భమందుగల భూమివలెనే ఇంద్రునిచే గర్భముగలది యగు అంతరిక్షమువలెనే దిక్కులయొక్క గర్భమునందు వాయువువలెనే ధరించి యున్నాను. అని స్త్రీయొక్క నామము నుచ్చరించి చెప్పుచు పదియవ మాసమునందు ప్రసవించుటకు తన రేతస్సును స్త్రీయను అగ్నియందు హోమము చేయుచున్నానని స్త్రీ గర్భమునందుంచు చున్నాఁడు.

ఉ॥ సోష్యన్తీమద్భిరభ్యుక్షతి । యథా వాయుః పుష్కరిణీగ్ం సమిఙ్గయతి సర్వతః । ఏవా తే గర్భ ఏజతు సహా వైతు జరాయుణా ఇన్ద్రస్యాయం వ్రజః కృతః సార్గళః స పరిశ్రయః । తమిన్ద్ర నిర్జహి గర్భేణ సావరాగ్ం సహేతి. ॥23॥

ప॥ సోష్యన్తీం-అద్భిః-అభ్యుక్షతి-యథా-వాయుః-పుష్కరిణీం-సమిఙ్గయతి-సర్వతః-ఏవా-తే-గర్భః-ఏజతు-సహ-అవైతు-జరాయుణా-ఇన్ద్రస్య-అయం-వ్రజః-కృతః-సార్గళః-సపరిశ్రయః-తం-ఇన్ద్ర-నిర్జహి-గర్భేణ-సావరాం-సహ-ఇతి.

ప్ర॥ (సః=ఆ పురుషుఁడు), సోష్యన్తీం = ప్రసవమునకు అభిముఖురాలైన స్త్రీని, అద్భిః=ఉదకములతో, అభ్యుక్షతి=ప్రోక్షించుచున్నాఁడు. వాయుః=వాయువు, యథా=ఏప్రకారము, పుష్కరిణీం=తటాకమును, సర్వతః = అంతటను, సమిఙ్గయతి = చలింపఁజేయుచున్నదో, ఏవా=ఈ ప్రకారముగానే, తే=నీయొక్క, గర్భః=గర్భము, ఏజతు=చలించునుగాక. జరాయుణాసహ = మావితోఁగూడ, (శిశువును చుట్టుకొనియుండెడి మాంసఖండము), అవైతు=వెలువడవచ్చు

నుగాక. ఇన్ద్రస్య=ప్రాణముయొక్క, అయం=ఈ, వ్రజః=మార్గము, సార్గళః=ప్రతి బంధముతోఁ గూడుకొనినదిగా, (అనఁగా). సపరిశ్రయః=జరాయువుతోఁగూడుకొనినదిగా, కృతః = చేయఁబడినది. హే ఇన్ద్ర=ఓప్రాణమా, తం=ఆమార్గమును, (ప్రాప్య=పొఁది), గర్భేణ సహ=గర్భముతోఁగూడ, నిర్జహి=బైలు వెడలుమా. (గర్భమునుండి బైలు వెడలిన తరువాత), సావరాం = గర్భమును చుట్టుకొనియున్న మావిని, (నిర్గమయ=బైటవచ్చునట్టు చేయుము). ఇతి=అని, (అభ్యుక్షతి=ప్రోక్షించుచున్నాఁడు).

తా॥ ఆ పురుషుఁడు ప్రసవసమయమునందు స్త్రీని "యథా వాయుః పుష్కరిణీం" అను మంత్రమునంతయు చెప్పుచు ఉదకములతో ప్రోక్షించుచున్నాఁడు. ఈ మంత్రమునకు తాత్పర్యమేమనఁగా, వాయువు స్వరూపమునకు హానిచేయకుండ నెట్లు తటాకము నంతటను చలింపఁజేయునో, ఈ ప్రకారముగానే గర్భము చలించునుగాక. మావితోఁగూడ గర్భము బైటవచ్చునుగాక. ప్రాణముయొక్క ఈ మార్గము గర్భాధానకాలమున మావితోఁగూడుకొనిన దానినిగాఁ జేయఁబడియున్నది. ఆ మార్గముద్వారా, ఓ ప్రాణమా! నీవు గర్భముతోఁగూడ బైలు వెడలిరమ్ము. తదనంతరము మావిని బైట వచ్చునట్లుచేయుమని భావము. ఈ మంత్రోచ్చారణమును చేయుచు ప్రసవాభిముఖురాలైన స్త్రీని ఉదకములతో ప్రోక్షించవలయును.

ఉ॥ జాతేఽగ్నిముప సమాధాయాఙ్క ఆధాయ కꣳసే పృషదాజ్యꣳ సన్నీయ పృషదాజ్యస్యోపఘాతం జుహోతి । అస్మిన్ సహస్రం పుష్యాసమేధమానః స్వేగృహే । అస్యోపసద్యాం మా చ్ఛైత్సీత్ ప్రజయా చ పశుభిశ్చ స్వాహా । మయి ప్రాణాꣳ స్త్వయి మనసా జుహోమి స్వాహా । యత్కర్మణాత్యరీరిచం యద్వా న్యూనమిహాకరం । అగ్నిష్టత్స్విష్టకృద్విద్వాం త్స్విష్టꣳ సుహుతం కరోతు న స్వాహేతి, ॥24॥

ప॥ జాతే-అగ్నిం-ఉపసమాధాయ-అఙ్కే-ఆధాయ - కంసే - పృషదాజ్యం-సన్నీయ-పృషదాజ్యస్య-ఉపఘాతం-జుహోతి-అస్మిన్ - సహస్రం-పుష్యాసం-ఏధమానః-స్వే-గృహే-అస్య-ఉపసద్యాం-మా -ఛైత్సీత్-ప్రజయా-చ-పశుభిః-చ-స్వాహా-మయి-ప్రాణాన్-త్వయి- మనసా-జుహోమి-స్వాహా-యత్-కర్మణా-అత్యరీరిచం-యత్ - వా- న్యూనం-ఇహ-అకరవం-అగ్నిః-తత్-స్విష్టకృత్-విద్వాన్ - స్విష్టం- సుహుతం-కరోతు-నః-స్వాహా-ఇతి.

ప్ర॥ (సః=ఆ పురుషుఁడు), జాతే=జాతకర్మమునందు, అగ్నిం =అగ్నిని, ఉపసమాధాయ=ఉంచుకొని. కంసే = గిన్నెయందు, పృష దాజ్యం = పృషదాజ్యమును, (నేతితోఁగలిపిన పెరుగు పృషదాజ్య మనఁబడును). సన్నీయ=పొందించి, (ఉంచి), అఙ్కే=తొడయందు, ఆధాయ=ఉంచుకొని, పృషదాజ్యస్య=పృషదమను పేరుగల ఆజ్యము నకు, ఉపఘాతం=హోమార్హమగు సంస్కారమును, (కృత్వా=చేసి), జుహోతి=హోమము చేయుచున్నాఁడు. అస్మిన్=ఈ, స్వే = స్వకీయ మైన, గృహే=గృహమునందు, (అహం=నేను, పుత్రరూపేణ=పుత్ర రూపముతో), ఏధమానః=వృద్ధిపొందినవాఁడనై, (మనుష్యాణాం = మనుష్యులయొక్క), సహస్రం=వేయింటిని, పుష్యాసం=పోషించుదును గాక. అస్య=ఈ నా పుత్రునియొక్క, ఉపసద్యాం = సంతతియందు, ప్రజయాచ=సంతానముతోటిన్ని, పశుభిశ్చ=పశువులతోటిన్ని. (శ్రీః =సంపద), మాఛైత్సీత్ = ఎడతెగకపోవునుగాక. స్వాహా = ఇది హోమము సూచించునది. మయి=నాయందలి, ప్రాణాన్=ప్రాణము లను, త్వయి=నీయందు, మనసా=మనస్సుతో, జుహోమి=హోమము చేయుచున్నాను స్వాహా=ఇది హోమమును సూచించునది. కర్మ ణా=కర్మతో, యత్=దేనిని, అత్యరీరిచం = అతిక్రమించి చేసితినో, ఇహ=ఇక్కడ, (ఈ కర్మయందు), యద్వా=దేనినైనను, న్యూనం =తక్కువగాను, అకరవం=చేసితినో, తత్=దానిని, విద్వాన్=విద్వాం

సుఁడగు, అగ్నిః = అగ్ని, స్విష్టకృత్ = మిక్కిలి ఇష్టమును చేయు వాఁడు, (భూత్వా=అయి), నః=మాకు, స్విష్టం=శుభకర్మనుగాను, సుహుతం=చక్కగా హోమము చేయఁబడినదానినిగాను, కరోతు= చేయునుగాక. స్వాహేతి = స్వాహాయని, (జుహోతి = హోమమును చేయుచున్నాఁడు).

తా॥ ఆ పురుషుఁడు జాతకర్మమునందు అగ్నిని ఉంచుకొని కంచుపాత్రమునందు ఆజ్యముతో మిశ్రమముచేసిన పెరుగును ఉంచి తొడయందు పెట్టుకొని మంత్రములతో దానిని సంస్కరించి, "అస్మిన్ సహస్రం" అను ఈ మొదలైన మంత్రములతో హోమము చేయు చున్నాఁడు. ఆ మంత్రములకు తాత్పర్య మేమనఁగా, ఈ నా గృహము నందు పుత్రరూపముతో వృద్ధి పొందిన నేను అనేకమందిని పోషించు వాఁడనగుదునుగాక. ఈ నా పుత్రునియొక్క సంతతి యందు సంతానముతోటిన్ని పశువులతోటిన్ని సంపద మెడతెగక యుండునుగాక. నాయందలి ప్రాణములను మనస్సుతోకూడా నీయందర్పించుచున్నాను. ఈ కర్మయందు నేను అతిక్రమించి చేసిన దానినిన్ని తక్కువగా చేసినదానినిన్ని విద్వాంసుఁడగు అగ్ని ఇష్టమును చేయువాఁడై ఆ సర్వమును మాకు అతిక్రమించని దానినిగాను తక్కువకాని దానిని గాను చేయునుగాక యని తాత్పర్యము.

ఉ॥ అథాస్య దక్షిణం కర్ణ మభినిధాయ వాగ్వాగితి త్రిః అథదధి మధు ఘృతగ్ సన్నీయానన్తర్హితేన జాతరూపేణ ప్రాశయతి। భూస్తే దధామి। భువస్తేదధామి । సువస్తే దధామి। భూర్భువస్సువ స్సర్వం త్వయి దధామీతి. ॥25॥

ప॥ అథ-అస్య దక్షిణం-కర్ణం-అభినిధాయ-వాక్-వాక్-ఇతి-త్రిః-అథ-దధి-మధు-ఘృతం-సన్నీయ-అనన్తర్హితేన - జాతరూపేణ-ప్రాశయతి-భూః-తే-దధామి-భువః-తే-దధామి సువః-తే - దధామి-భూః-భువః-సువః-సర్వం-త్వయి-దధామి-ఇతి.

ప్ర॥ అథ=అనంతరము, (సః=ఆ పురుషుఁడు), అస్య=ఈ పుత్రునియొక్క, దక్షిణంకర్ణం=కుడిచెవినిగూర్చి, (ముఖం=ముఖమును), అభినిధాయ=ఉంచి, (కుడిచెవియందు ముఖమునుంచి), వాగ్వాగితి=వాక్కు వాక్కు అని, త్రిః=మూఁడుసార్లు, (జపేత్ = జపించవలెను). అథ=అనంతరము, దధి=పెరుగును, మధు=తేనెను, ఘృతం=నేతిని, అన్తర్హితేన=సమీపముగాఁ జేయఁబడిన, జాతరూపేణ=బంగారము చేతను సన్నీయ=కలిపి, (పుత్రం=కుమారుని), ప్రాశయతి=భక్షింపఁ జేయుచున్నాఁడు. (తినిపించుచున్నాఁడు). భూః=భూః అను వ్యాహృతిని చెప్పుచు, తే=నీయందు, దధామి=ఉంచుచున్నాను. భువః=భువః అను వ్యాహృతిని చెప్పుచు, తే=నీయందు, దధామి=ఉంచుచున్నాను. సువః=సువః అను వ్యాహృతిని చెప్పుచు, తే=నీయందు, దధామి=ఉంచుచున్నాను. భూర్భువస్సువః=భూర్భువసువః అను వ్యాహృతులను మూఁటిని చెప్పుచు, సర్వం=సమస్తమును, త్వయి = నీయందు, దధామీతి=ఉంచుచున్నానని, (పుత్రం=పుత్రుని, ప్రాశయతి=భక్షింపఁ జేయుచున్నాఁడు).

తా॥ అనంతరమా పురుషుఁడు ఈ పుత్రుని కుడిచెవియందు ముఖమున్నుంచి వాక్కు వాక్కు అని మూఁడుసార్లు జపించి సమీపమునందున్న బంగారుతో పెరుగును తేనెను నేతిని ఈ మూఁటిని కలిపి దీనిని 'భూస్త్వదధామి' యనునది మొదలైన నాలుగు మంత్రములను చెప్పుచు పుత్రుని తినిపించుచున్నాఁడు.

ఉ॥ అథాస్య నామ కరోతి వేదోఽసీతి తదస్య తద్గుహ్య మేవ నామ భవతి. ॥26॥

ప॥ అథ-అస్య-నామ-కరోతి-వేదః-అసి-ఇతి-తత్-అస్య-తత్-గుహ్యం-ఏవ-నామ-భవతి.

ప్ర॥ అథ=అనంతరము, (సః=ఆ పురుషుఁడు), అస్య=ఈ పుత్రునికి, వేదః=వేదము, అసీతి=అగుచున్నావని, నామ = పేరు, కరోతి=

చేయుచున్నాఁడు, అస్య=ఈ పుత్రునియొక్క, తత్ = ఆ వేదమని పేరు. (యత్=ఏదిగలదో), తత్=అ, నామ=పేరు, గుహ్యమేవ=రహస్యమైనదిగానే, భవతి=అగుచున్నది.

తా॥ అనంతరమునందా పురుషుఁడు ఈ పుత్రుని వేదమని పేరు పెట్టుచున్నాఁడు. ఈ పుత్రునికి పెట్టిన ఆ వేదము అను పేరు మిక్కిలి రహస్యమైయున్నది. కనుక ఆ పేరుతో లోకమునందు వ్యవహారము లేదు.

ఉ॥ అథైనం మాత్రే ప్రదాయ స్తనం ప్రయచ్ఛతి యస్తే స్తన
స్సశయో యో మయో భూ ర్యోరత్నధా వసువిద్య స్సుదత్రః ।
యేన విశ్వా పుష్య సివార్యాణి సరస్వతి తమిహ ధాతవేఽకరితి. 27

ప॥ అథ-ఏనం-మాత్రే ప్రదాయ-స్తనం-ప్రయచ్ఛతి-యః-తే -స్తనః-సశయః-యః-మయోభూః-యః-రత్నధా-వసువిత్ - యః - సుదత్రః-యేన-విశ్వా-పుష్యసి-వార్యాణి - సరస్వతి - తం - ఇహ- ధాతవే - కరితి.

ప్ర॥ అథ=అనంతరము, (సః=ఆ పురుషుఁడు). ఏనం=ఈ పుత్రుని, మాత్రే=తల్లికొఱకు, ప్రదాయ=ఇచ్చి, స్తనం = కుచమును, ప్రయచ్ఛతి=ఇప్పించుచున్నాఁడు. హేసరస్వతి = ఓ సరస్వతీ, తే= నీయొక్క, సశయః=ఫలముతోఁగూడుకొనిన, స్తనః=స్తనము, యః =ఏదిగలదో, యః = ఏ స్తనము, మయోభూః = సుఖకరమైనదిగలదో, (ప్రాణులకు స్థితిహేతువైన అన్నమైనదో), యః=ఏ స్తనము, రత్నధా=అన్నమును పాలను సృజింపఁజేయునదిగలదో, యః = ఏ స్తనము, వసువిత్=కర్మఫలమును తెలిసికొనినదియై, సుదత్రః = సమస్త ఫలమును బాగుగా ఇచ్చునదిగలదో, యేన = ఏ స్తనముచేత, విశ్వాని = సమస్తములైన, వార్యాణి = శ్రేష్ఠములైన దేవాది భూతములను, పుష్యసి=పోషించుచున్నావో, తం = అట్టి స్తనమును, ధాతవే = (నాపుత్రునికి) పానముచేయుటకొఱకు, ఇహ=ఈ నా భార్యా స్తనము

నందు, కరితి=చేయుమాయని, (ఈ మంత్రమును చెప్పుచు, స్తనం=స్తనమును, ప్రయచ్ఛతి=ఇప్పించుచున్నాఁడు).

తా॥ అనంతరము ఆ పురుషుఁడు ఈ పుత్రుని తల్లి తొడమీఁద కూర్చుండఁబెట్టి ఈ కుమారునికి స్తనమును "యస్తేస్తనః" అను ఈ మంత్రమును చెప్పుచు ఇప్పించుచున్నాఁడు. ఈ మంత్రముయొక్క తాత్పర్యమేమనఁగా, ఓ సరస్వతీ! సమస్త ప్రాణులకు స్థితి హేతువైన అన్నమును క్షీరమును కలుగఁజేయునదియును, సమస్త కర్మ ఫలములను తెలిసికొని ఆ యా ఫలములను ఇచ్చునదియును, దేవాది సమస్త భూతములను పోషించునదియు నగు నీయొక్క స్తనమును ఈ నా పుత్రుఁడు పానముచేయుటకు నా భార్యయొక్క స్తనమునందుంచుమా యని చెప్పి ప్రార్థించుచు స్తనమును పుత్రునికి ఇప్పించుచున్నాఁడు.

ఉ॥ అథాస్య మాతర మభిమన్త్రయతే । ఇలాసి మైత్రావరుణీ వీరే వీరమజీ జనత్ । సా త్వం వీరవతీ భవ యాఽస్మాన్ వీరవతోఽకరదితి । తం వా ఏత మాహురతి పితా బతా భూరతి । పితామహో బతా భూః పరమాం బత కాష్ఠాం ప్రాపచ్ఛ్రియా యశసా బ్రహ్మవర్చసేన య ఏవం విదో బ్రాహ్మణస్య పుత్రో జాయత ఇతి. ॥28॥

ఇత్యష్టమాధ్యాయే చతుర్థం బ్రాహ్మణమ్.

ప॥ అథ-అస్య-మాతరం-అభిమన్త్రయతే-ఇలా-అసి-మైత్రావరుణీ-వీరే-వీరం-అజీజనత్-సా-త్వం-వీరవతీ-భవ-యా-అస్మాన్-వీరవతః-అకరత్-ఇతి-తం-వై-ఏతం-ఆహుః-అతిపితా-బత-అభూః-అతిపితామహః-బత-అభూః-పరమాం-బత-కాష్ఠాం-ప్రాపత్-శ్రియా-యశసా-బ్రహ్మవర్చసేన-యః-ఏవంవిదః-బ్రాహ్మణస్య-పుత్రః-జాయతే-ఇతి.

ప్ర॥ అథ=అనంతరము, (సః=ఆ పురుషుఁడు), అస్య=ఈ పు

త్రునియొక్క, మాతరం = తల్లిని, (''ఇలాసి') అను మంత్రమును చెప్పుచు), అభిమన్త్రయతే=అభిమంత్రించుచున్నాఁడు. హే మైత్రావరుణి=ఓ అరుంధతీ, వీరే=వీరుఁడనైన, (మయి=నేను నిమిత్తమగుచుండగా). వీరం=వీరుఁడగు పుత్రుని, అజీజనత్ = కంటివి. ఇలా = స్తుతించఁదగినదానవు, అసి=అగుచున్నావు. యా=ఏ, (త్వం=నీవు), అస్మాన్=మమ్ము‌ను, వీరవతః=వీరులైనపుత్రులు కలవారినిగా, అకరత్=చేసితివి. ఇతి=కనుక, సా=అటువంటి, త్వం=నీవు, వీరవతీ=వీరపుత్రులు కలదానవు, భవ = కమ్ము. తంవాఏతం = ఆ ఈ పుత్రుని గూర్చి, అతిపితా=తండ్రిని అతిక్రమించిన వాఁడవు, అభూః = అయితివి, బత=ఆశ్చర్యము. అతిపితామహః = అతిక్రమింపఁబడిన పితామహుఁడు కలవాఁడవు, అభూః=అయితివి. బత=ఆశ్చర్యము. (అని), ఆహుః=చెప్పిరి) ఏవంవిదః=ఇట్లు తెలిసిన, బ్రాహ్మణస్య = బ్రాహ్మణునికి, యః=ఏ, పుత్రః=పుత్రుఁడు, జాయతే = పుట్టుచున్నాఁడో, (సః=వాఁడు), శ్రియా=సంపత్తుచేతను, యశసా=కీర్తిచేతను, బ్రహ్మవర్చసేన=బ్రహ్మతేజస్సుచేతను, పరమాం=ఉత్కృష్టమైన, కాష్ఠాం =స్థితిని, (సంపత్తు మొదలైన వాటికి స్థానమును), ప్రాపత్=పొందినవాఁడు, (భవతి=అగుచున్నాఁడు. బత=ఆశ్చర్యము. ఇతి=సమాప్తము.

తా॥ అనంతరమా పురుషుఁడు ఈతన పుత్రుని తల్లిని ''ఇలాసిమైత్రావరుణి'' అను మంత్రమును చెప్పి అభిమంత్రించుచున్నాఁడు. ఆ మంత్రార్థమేమనఁగా, తన భార్యను వసిష్ఠభార్యయగు ఓ అరుంధతీ! యని సంబోధించి, నీవు వీరుఁడనగు నేను నిమిత్తమైయుండగా వీరుఁడగు పుత్రుని కంటివి. కనుక స్తుతించఁదగిన దానవగు చున్నావు. నీ విట్లు మమ్ము‌ను వీరపుత్రులు గల వారినిగా చేసితివి. కనుక నీవును ఆ యుష్మంతులగు వీరపుత్రులు గలదానవుకమ్ము బ్రహ్మవేత్తలు ఇట్టి పుత్రునిగూర్చి, ఓ పుత్రుఁడా! నీవు తండ్రిని తాతను అతిక్రమించిన వాఁడవైతివి ,ఆశ్చర్యమని పలుకుచున్నారు. ఇట్లు తెలిసిన

బ్రాహ్మణునికి పుట్టిన పుత్రుఁడు సంపదచేతను కీర్తిచేతను బ్రహ్మ తేజస్సు చేతను గొప్పస్థితిని పొంది స్తుతింపఁదగినవాఁడగుచున్నాఁడు.

ఇట్లు అష్టమాధ్యాయమునందు చతుర్థబ్రాహ్మణము సమాప్తము.

---

### అష్టమాధ్యాయము – పంచమబ్రాహ్మణము

ఉ॥ అథ వగ్ శః పౌతిమాషీ పుత్రః కాత్యాయనీ పుత్రాత్ కాత్యాయనీ పుత్రో గౌతమీ పుత్రా ద్గౌతమీ పుత్రో భారద్వాజీ పుత్రా ద్భార ద్వాజీ పుత్రః పారాశరీపుత్రా త్పారాశరీపుత్ర ఔపస్వస్తీపుత్రా దౌపస్వస్తీపుత్రః పారాశరీపుత్రా త్పారాశరీపుత్రః కాత్యాయనీ పుత్రా త్కాత్యాయనీపుత్రః కౌశికీ పుత్రా త్కౌశికీ పుత్ర ఆలమ్బీ పుత్రాచ్చ వై యాఘ్రపదీ పుత్రాచ్చ వై యాఘ్రపదీ పుత్రః కాణ్వీపుత్రాచ్చ కాపీ పుత్రాచ్చ కాపీ పుత్రః. ॥1॥

ఉ॥ ఆత్రేయీ పుత్రాదాత్రేయీ పుత్రో గౌతమీ పుత్రాద్గౌతమీ పుత్రో భారద్వాజీ పుత్రాద్భారద్వాజీ పుత్రః పారాశరీపుత్రాత్పారాశరీ పుత్రో వాత్సీ పుత్రాద్వాత్సీ పుత్రః పారాశరీపుత్రాత్పారాశరీ పుత్రో వార్కారుణీ పుత్రాద్వార్కారుణీపుత్రో వార్కారుణీపుత్రా ద్వార్కారుణీపుత్ర ఆర్తభాగీ పుత్రాదార్తభాగీ పుత్రః శౌఙ్గీ పుత్రాచ్ఛౌఙ్గీ పుత్రః సాఙ్కృతీపుత్రాత్సాఙ్కృతీ పుత్ర ఆలమ్బాయనీ పుత్రా దాలమ్బాయనీ పుత్ర ఆలమ్బీపుత్రాదాలమ్బీ పుత్రో జాయన్తీ పుత్రాజ్జాయన్తీ పుత్రో మాణ్డూకాయనీ పుత్రాన్మాణ్డూకాయనీ పుత్రో మాణ్డూకీ పుత్రః శాణ్డిలీపుత్రా చ్ఛాణ్డిలీపుత్రో రాథీతరీపుత్రా ద్రాథీతరీ పుత్రో భాలుకీ పుత్రాద్భాలుకీ పుత్రః క్రౌఞ్చికీ పుత్రాభ్యాం క్రౌఞ్చికీ పుత్రౌ వైదృభతీ పుత్రాద్వైదృభతీ పుత్రః కార్శకేయీ పుత్రాత్కార్శకేయీ పుత్రః ప్రాచీనయోగీ పుత్రాత్ప్రాచీనయోగీ

పుత్రః సాఙ్కృతీపుత్రాత్సాఙ్కృతీపుత్రః ప్రాశ్నీపుత్రా దాసురి వాసినః ప్రాశ్నీపుత్ర ఆసురాయణా దాసురాయణ ఆసురే రాసురిః. ॥2॥

ఉ॥ యాజ్ఞవల్క్యా ద్యాజ్ఞవల్క్య ఉద్దాలకా దుద్దాలకోఽరుణాదరుణ ఉపవేశే రుపవేశిః కుశ్రేః కుశ్రి ర్వాజశ్రవసో వాజశ్రవాజిహ్వావతో వాధ్యోగాజ్జిహ్వావాన్ వాధ్యోగో ఽసితాద్వార్షగణా దసితో వార్షగణో హరితాత్కశ్యపాద్ధరితః కశ్యపః శిల్పాత్కశ్యపాచ్ఛిల్పః కశ్యపః కశ్యపాన్నైధ్రువేః కశ్యపో నైధ్రువిర్వాచో వాగమ్భిణ్యా అమ్భిణ్యాదిత్యాదాదిత్యాత్తానీమాని శుక్లాని యజూంషి వాజసనేయేన యాజ్ఞవల్క్యేనాఖ్యాయన్తే. ॥3॥

ఉ॥ సమానమా సాఙ్కృతీపుత్రాత్సాఙ్కృతీపుత్రో మాణ్డూకాయనే ర్మాణ్డూకాయనిః మాణ్డవ్యాన్మాణ్డవ్యః కౌత్సాత్కౌత్సో మాహిత్థేర్మాహిత్థిః వామకక్షాయణా ద్వామకక్షాయణః శాణ్డిల్యాచ్ఛాణ్డిల్యో వాత్స్యాద్వాత్స్యః కుశ్రేః కుశ్రిః యజ్ఞవచసో రాజస్తమ్బాయనా ద్యజ్ఞవచా రాజస్తమ్బాయనస్తురాత్కావషేయాత్తురః కావషేయః ప్రజాపతేః ప్రజాపతిర్బ్రహ్మణో బ్రహ్మ స్వాయమ్భు బ్రహ్మణే నమః. ॥4॥

ఇత్యష్టమాధ్యాయే పఞ్చమబ్రాహ్మణమ్.

ప॥ అథ-వంశః-పౌతిమాషీపుత్రః - కాత్యాయనీపుత్రాత్ - కాత్యాయనీపుత్రః-గౌతమీపుత్రాత్-గౌతమీపుత్రః - భారద్వాజీపుత్రాత్-భారద్వాజీపుత్రః-పారాశరీపుత్రాత్ - పారాశరీపుత్రః-ఔపస్వస్తీపుత్రః-పారాశరీపుత్రాత్-పారాశరీపుత్రః - కాత్యాయనీపుత్రాత్-కాత్యాయనీ పుత్రః-కౌశికీపుత్రాత్-కౌశికీపుత్రః - ఆలమ్బీపుత్రాత్-చ-వైయాఘ్రపదీపుత్రాత్-చ-వైయాఘ్రపదీపుత్రః -కాణ్వీపుత్రాత్-చ-కాపీపుత్రాత్-చ-కాపీపుత్రః.

ప॥ ఆత్రేయీపుత్రాత్-ఆత్రేయీపుత్రః-గౌతమీపుత్రాత్

-గౌతమీపుత్రః-భారద్వాజీపుత్రాత్-భారద్వాజీపుత్రః - పారాశరీ
పుత్రాత్-పారాశరీపుత్రః-వాత్సీపుత్రాత్-వాత్సీపుత్రః - పారాశరీ
పుత్రాత్-పారాశరీపుత్రః - వార్కారుణీపుత్రాత్ - వార్కారుణీ
పుత్రః-వార్కారుణీపుత్రాత్-వార్కారుణీపుత్రః-ఆర్తభాగీపుత్రా
త్-ఆర్తభాగీపుత్రః-శౌఙ్గీపుత్రాత్-శౌఙ్గీపుత్రః - సాఙ్కృతీపుత్రా
త్-సాఙ్కృతీపుత్రః-ఆలమ్బాయనీపుత్రాత్-ఆలమ్బాయనీపుత్రః-
ఆలమ్బీపుత్రాత్-ఆలమ్బీపుత్రః - జాయన్తీపుత్రాత్ - జాయన్తీ
పుత్రః-మాణ్డూకాయనీపుత్రాత్-మాణ్డూకాయనీపుత్రః- మాణ్డూకీ
పుత్రాత్-మాణ్డూకీపుత్రః-శాణ్డిలీపుత్రాత్-శాణ్డిలీపుత్రః- రాథీతరీ
పుత్రాత్-రాథీతరీపుత్రః-భాలుకీపుత్రాత్-భాలుకీపుత్రః-క్రౌఞ్చికీ
పుత్రాభ్యాం-క్రౌఞ్చికీపుత్రౌ-వైదృభతీపుత్రాత్ - వైదృభతీపుత్రః-
కార్శకేయీపుత్రాత్-కార్శకేయీపుత్రః-ప్రాచీనయోగీపుత్రాత్-
ప్రాచీనయోగీపుత్రః-సాఞ్జీవీపుత్రాత్-సాఞ్జీవీపుత్రః-ప్రాశ్నీపుత్రాత్
-ఆసురివాసినః - ప్రాశ్నీపుత్రః - ఆసురాయణాత్-ఆసురాయణః -
ఆసురేః-అసురిః.

ప॥ యాజ్ఞవల్క్యాత్-యాజ్ఞవల్క్యః-ఉద్దాలకాత్ - ఉద్దా
లకః-అరుణాత్ అరుణః-ఉపవేశేః-ఉపవేశిః-కుశ్రేః-కుశ్రిః-వాజశ్రవ
సః-వాజశ్రవాః-జిహ్వావతః-వాధ్యోగాత్-జిహ్వావాన్ - వాధ్యోగః-
అసితాత్-వార్షగణాత్-అసితః-వార్షగణః-హరితాత్ - కశ్యపాత్-
హరితః-కశ్యపః-శిల్పాత్-కశ్యపాత్-శిల్పః-కశ్యపః-కశ్యపాత్ - వై
ధ్రువేః-కశ్యపః-వైధ్రువిః-వాచః-వాక్-అమ్భిణ్యాః - అమ్భిణీ- ఆది
త్యాత్-ఆదిత్యాత్-తాని-ఇమాని-శుక్లాని - యజూంషి - వాజసనే
యేన-యాజ్ఞవల్క్యేన-అఖ్యాయన్తే.

ప॥ సమానమాః-సాఞ్జీవీపుత్రాత్-సాఞ్జీవీపుత్రః-మాణ్డూకా
యనేః-మాణ్డూకాయనిః-మాణ్డవ్యాత్ - మాణ్డవ్యః - కౌత్సాత్ -
కౌత్సః-మహిత్థేః-మహిత్థిః-వామకక్షాయణాత్ - వామకక్షాయణః-

శాణ్డిల్యాత్-శాణ్డిలః-వాత్స్యాత్-వాత్స్యః-కుశ్రేః-కుశ్రిః- యజ్ఞవచసః-రాజస్తమ్బాయనాత్-యజ్ఞవచాః-రాజస్తమ్బాయనః-తురాత్-కావషేయాత్-తురః-కావషేయః-ప్రజాపతేః-ప్రజాపతిః - బ్రహ్మణః-బ్రహ్మ-స్వయమ్భు-బ్రహ్మణే-నమః.

ప్రి॥ అథ=ఇప్పుడు, వంశః=బ్రహ్మవిద్యాప్రవచనముచేయుచున్నవారియొక్క వంశము, (కథ్యతే=చెప్పఁబడుచున్నది.) పౌతిమాషీపుత్రః=పౌతిమాషియను స్త్రీయొక్క కుమారుఁడు, కాత్యాయనీపుత్రాత్=కాత్యానియొక్క పుత్రునివల్లను, కాత్యాయనీపుత్రః=కాత్యాయనీపుత్రుఁడు, గౌతమీపుత్రాత్=గౌతమీపుత్రునివల్లను, గౌతమీపుత్రః=గౌతమీపుత్రుఁడు, భారద్వాజీ పుత్రాత్ = భారద్వాజీయొక్క పుత్రుని వల్లను, భారద్వాజీపుత్రః = భారద్వాజీపుత్రుఁడు, పారాశరీపుత్రాత్ = పారాశరీ పుత్రునివల్లను, పారాశరీపుత్రః=పారాశరీపుత్రుఁడు, ఔపస్వస్తీపుత్రాత్=ఔపస్వస్తియొక్క పుత్రుని వల్లను, ఔపస్వస్తీపుత్రః=ఔపస్వస్తీపుత్రుఁడు, పారాశరీపుత్రాత్=పారాశరియొక్క పుత్రునివల్లను, పారాశరీపుత్రః=పారాశరియొక్క పుత్రుఁడు, కాత్యాయనీపుత్రాత్=కాత్యాయనీ యొక్క పుత్రుని వల్లను, కాత్యాయనీ పుత్రః=కాత్యాయనీ యొక్క పుత్రుడు, కౌశికీపుత్రాత్=కౌశికీయొక్క పుత్రునివల్లను, కౌశికీపుత్రః=కౌశికీయొక్క పుత్రుఁడు, ఆలమ్బీపుత్రాచ్చ = ఆలమ్బియొక్క పుత్రుని వల్లనున్ను, వైయాఘ్రపదీపుత్రాచ్చ = వైయాఘ్రపదియను స్త్రీయొక్క పుత్రునివల్లనున్ను, వైయాఘ్రపదీపుత్రః=వైయాఘ్రపదియొక్క పుత్రుఁడు, కాణ్వీపుత్రాచ్చ = కాణ్వీయను స్త్రీయొక్క కుమారుని వల్లనున్ను, కాపీపుత్రాచ్చ = కాపీయను స్త్రీయొక్క పుత్రుని వల్లనున్ను, కాపీపుత్రః=కాపీయను స్త్రీయొక్క పుత్రుఁడు.

ప్రి॥ ఆత్రేయీపుత్రాత్ = ఆత్రేయీ యను స్త్రీయొక్క

పుత్రునివల్లను, ఆత్రేయీపుత్రః=ఆత్రేయియను స్త్రీ పుత్రుఁడు, గౌతమీపుత్రాత్ = గౌతమి యను స్త్రీయొక్క పుత్రుని వల్లను, గౌతమీపుత్రః=గౌతమీ యను స్త్రీ పుత్రుఁడు, భారద్వాజీపుత్రాత్ = భారద్వాజీ యను స్త్రీ యొక్క పుత్రునివల్లను, భారద్వాజీ పుత్రః=భారద్వాజీ యను స్త్రీ పుత్రుఁడు, పారశరీపుత్రాత్=పారాశరీ యను స్త్రీయొక్క పుత్రునివల్లను, పారాశరీపుత్రః = పారాశరి యను స్త్రీ పుత్రుఁడు, వాత్సీపుత్రాత్ = వాత్సి యను స్త్రీయొక్క పుత్రునివల్లను, వాత్సీపుత్రః=వాత్సీ యను స్త్రీ పుత్రుఁడు, పారాశరీపుత్రాత్=పారాశరి యను స్త్రీయొక్క పుత్రునివల్లను, పారాశరీపుత్రః = పారాశరి యను స్త్రీయొక్క పుత్రుఁడు, వార్కారుణీ పుత్రాత్=వార్కారుణి యను స్త్రీయొక్క పుత్రునివల్లను, వార్కారుణీపుత్రః = వార్కారుణీ యను స్త్రీయొక్క పుత్రుఁడు, వార్కారుణీపుత్రాత్=వార్కారుణి యను ఇంకొక స్త్రీయొక్క పుత్రుని వల్లను, వార్కారుణీపుత్రః = వార్కారుణి యను స్త్రీయొక్క పుత్రుఁడు, ఆర్తభాగీపుత్రాత్ = ఆర్తభాగీ యను స్త్రీయొక్క పుత్రునివల్లను, ఆర్తభాగీపుత్రః=ఆర్తభాగీ యను స్త్రీయొక్కపుత్రుఁడు, శౌఙ్గీపుత్రాత్=శౌఙ్గీ యను స్త్రీయొక్క పుత్రునివల్లను, శౌఙ్గీపుత్రః = శౌఙ్గీ యను స్త్రీయొక్క పుత్రుఁడు, సాఙ్కృతీపుత్రాత్= సాఙ్కృతి యను స్త్రీయొక్క పుత్రునివల్లను, సాఙ్కృతీపుత్రః = సాఙ్కృతి యను స్త్రీయొక్క పుత్రుఁడు, ఆలమ్బాయనీ పుత్రాత్= ఆలమ్బాయని యను స్త్రీయొక్క పుత్రునివల్లను, ఆలమ్బాయనీ పుత్రః = ఆలమ్బాయని యను స్త్రీయొక్క పుత్రుఁడు, ఆలమ్బీపుత్రాత్=ఆలమ్బి యను స్త్రీయొక్క పుత్రునివల్లను, ఆలమ్బీపుత్రః =ఆలమ్బి యను స్త్రీయొక్క పుత్రుఁడు, జాయన్తీపుత్రాత్=జాయన్తి యను స్త్రీయొక్క పుత్రునివల్లను, జాయన్తీపుత్రః=జాయన్తి యను స్త్రీయొక్క పుత్రుఁడు, మాణ్డూకాయనీపుత్రాత్=మాణ్డూకాయని

యను స్త్రీయొక్క పుత్రునివల్లను, మాణ్డూకాయనీపుత్రః=మాణ్డూకాయనియను స్త్రీ పుత్రుఁడు, మాణ్డూకీపుత్రాత్ =మాణ్డూకి యనుస్త్రీయొక్క పుత్రునివల్లను, మాణ్డూకీపుత్రః = మాణ్డూకి యను స్త్రీయొక్క, పుత్రుఁడు, శాణ్డిలీపుత్రాత్ = శాణ్డిలి యను స్త్రీయొక్క పుత్రునివల్లను, శాణ్డిలీపుత్రః=శాణ్డిలి యను స్త్రీయొక్క పుత్రుఁడు, రాథీతరీపుత్రాత్ =రాథీతరి యను స్త్రీయొక్క పుత్రునివల్లను, రాథీతరీపుత్రః = రాథీతరి యను స్త్రీయొక్క పుత్రుఁడు, భాలుకీపుత్రాత్ =భాలుకి యను స్త్రీయొక్క పుత్రునివల్లను, భాలుకీపుత్రః=భాలుకి యను స్త్రీయొక్క పుత్రుఁడు, క్రౌఞ్చికీపుత్రాభ్యాం = క్రౌఞ్చికి యను స్త్రీయొక్క పుత్రులిద్దఱివల్లను, క్రౌఞ్చికీపుత్రౌ=క్రౌఞ్చికి యను స్త్రీయొక్క ఇద్దఱు పుత్రులు, వైదృభతీపుత్రాత్ =వైదృభతి యను స్త్రీయొక్క పుత్రునివల్లను, వైదృభతీపుత్రః=వైదృభతి యను స్త్రీయొక్క పుత్రుఁడు, కార్శకేయీపుత్రాత్ =కార్శకేయీ యను స్త్రీయొక్క పుత్రునివల్లను, కార్శకేయీపుత్రః=కార్శకేయి యను స్త్రీయొక్క పుత్రుఁడు, ప్రాచీనయోగిపుత్రాత్ =ప్రాచీనయోగి యను స్త్రీయొక్క పుత్రునివల్లను, ప్రాచీనయోగీపుత్రః = ప్రాచీనయోగి యను స్త్రీయొక్క పుత్రుఁడు, సాఞ్జీవీపుత్రాత్ =సాఞ్జీవీ యను స్త్రీయొక్క పుత్రునివల్లను, సాఞ్జీవీపుత్రః = సాఞ్జీవీ యను స్త్రీయొక్క పుత్రుఁడు, ప్రాశ్నీపుత్రాత్ = ప్రాశ్ని యను స్త్రీయొక్క పుత్రునివల్లను, ఆసురివాసినః=ఆసురివాసి యను వానివల్లను, ప్రాశ్నీపుత్రః =ప్రాశ్ని యను స్త్రీయొక్క పుత్రుఁడు, ఆసురాయణాత్ = ఆసురాయణుఁడను వానివల్లను, (ఇంతవఱకు స్త్రీ ప్రాధాన్యమువలన పురుషులు నిర్దేశింపఁబడిరి). ఆసురాయణః=అసురాయణుఁడనువాఁడు ఆసురేః=ఆసురియను వానివల్లను, ఆసురిః=ఆసురియనువాఁడు.

ప్ర॥ యాజ్ఞవల్క్యాత్ = యాజ్ఞవల్క్య మహాఋషివల్లను, యాజ్ఞవల్క్యః=యాజ్ఞవల్క్యుఁడు, ఉద్దాలకాత్ =ఉద్దాలకునివల్లను,

ఉద్దాలకః=ఉద్దాలకుఁడు, అరుణాత్=అరుణునివల్లను, అరుణః=అరుణుఁడు, ఉపవేశేః = ఉపవేశియను వానివల్లను, ఉపవేశిః = ఉపవేశియనువాఁడు, కుశ్రేః = కుశ్రియను వానివల్లను, కుశ్రిః=కుశ్రియనువాఁడు. వాజశ్రవసః = వాజశ్రవసుఁడను వానివల్లను, వాజశ్రవాః = వాజశ్రవుఁడనువాఁడు, జిహ్వావతః = జిహ్వావంతుఁడను వానివల్లను, వాధ్యోగాత్ = వాధ్యోగుఁడను వానివల్లను, జిహ్వావాన్=జిహ్వావంతుఁడును, వాధ్యోగః = వాధ్యోగుఁడును, అసితాత్=అసితుఁడను వానివల్లను, వార్షగణాత్=వార్షగణుఁడను వానివల్లను, అసితః=అసితుఁడనువాఁడును, వార్షగణః=వార్షగణుఁడనువాఁడును, హరితాత్=హరితుఁడను వానివల్లను, కశ్యపాత్ = కశ్యపుఁడను వానివల్లను, హరితః=హరితుఁడును, కశ్యపః=కశ్యపుఁడును, శిల్పాత్=శిల్పుఁడను వానివల్లను, కశ్యపాత్=ఇంకొక కశ్యపునివల్లను, శిల్పః=శిల్పుఁడును, కశ్యపః=కశ్యపుఁడును, కశ్యపాత్=ఇంకొక కశ్యపునివల్లను. నైధ్రువేః=నైధ్రువుఁడనువానివల్లను, కశ్యపః=కశ్యపుఁడు, నైధ్రువిః=నైధ్రువి యను వాఁడును, వాచః=వాక్కువల్లను, వాక్=వాక్కు, అమ్భిణ్యాః = అమ్భిణివలనను, అమ్భిణీ = అమ్భిణి, ఆదిత్యాత్=సూర్యునివల్లను, తాని = ఆ ప్రసిద్ధములైన, ఇమాని= ఈ, శుక్లాని=శుక్లములగు, యజూంషి=యజుస్సులు, వాజసనేయేన= వాజసనేయశాఖాధ్యేతయగు, యాజ్ఞవల్క్యేన = యాజ్ఞవల్క్యుని చేతను, ఆదిత్యాత్ = సూర్యునివలన, ఆఖ్యాయన్తే = చెప్పఁబడుచున్నవి.

ప॥ (ఈ వాజసనేయ శాఖలయందు బ్రహ్మమొదలు సాఞ్జీవి పుత్రునివఱకు ఒక వంశము). సమానమాః=సమానమాసుఁడనువాఁడు, సాఞ్జీవీపుత్రాత్ = సాఞ్జీవీ యను స్త్రీయొక్క పుత్రుని వల్లను, సాఞ్జీవీపుత్రః=సాఞ్జీవీయను స్త్రీ పుత్రుఁడు, మాణ్డూకాయనేః=మాణ్డూకాయని వల్లను, మాణ్డూకాయనిః = మాణ్డూకాయని

యనువాఁడు, మాణ్డవ్యాత్ =మాణ్డవ్యునివల్లను, మాణ్డవ్యః=మాణ్డవ్యుఁడు, కౌత్సాత్=కౌత్సునివల్లను, కౌత్సః=కౌత్సుఁడు, మహిత్థేః=మహిత్థియను వానివల్లను, మాహిత్థిః=మాహిత్థియనువాఁడు, వామకక్షాయణాత్=వామకక్షాయణుఁడను వానివల్లను, వామకక్షాయణః=వామకక్షాయణుఁడు, శాణ్డిల్యాత్=శాణ్డిల్యునివల్లను, శాణ్డిల్యః=శాణ్డిల్యుఁడు, వాత్స్యాత్ = వాత్స్యునివల్లను, వాత్స్యః = వాత్స్యుఁడు, కుశ్రేః=కుశ్రియను వానివల్లను, కుశ్రిః=కుశ్రియనువాఁడు, యజ్ఞవచసః=యజ్ఞవచసుఁడను వానివల్లను, రాజస్తమ్బాయనాత్ = రాజస్తమ్బాయనుఁడను వానివల్లను యజ్ఞవచాః = యజ్ఞవచసుఁడనువాఁడును, రాజస్తమ్బాయనః=రాజస్తమ్బాయనుఁడనువాఁడు, తురాత్=తురయను వానివల్లను, కావషేయాత్ = కావషేయుఁడనువానివల్లను, తురః=తురుఁడనువాఁడు, కావషేయః = కావషేయుఁడనువాఁడు, ప్రజాపతేః=హిరణ్యగర్భునివల్లను, ప్రజాపతిః = హిరణ్యగర్భుఁడు, బ్రహ్మణః=బ్రహ్మమువల్లను, (వేదము వలనను). బ్రహ్మ = వేదము, స్వయమ్భు=స్వకీయముగాఁ బుట్టినది. బ్రహ్మణే = నిత్యబ్రహ్మము కొఱకు, నమః=నమస్కారము.

తా॥ ఈ పరబ్రహ్మవిద్య ఈ ప్రకారము బ్రహ్మమొదలుకొని క్రమముగా అధికార తారతమ్యముతో భూమియందు ప్రవర్తించినది. తక్కినదంతయు సులభము. అట్టి పరబ్రహ్మవిద్యకొఱకు నమస్కారము. ఇట్లు అష్టమాధ్యాయమునందు పఞ్చమబ్రాహ్మణము సమాప్తము.

బృహదారణ్యకోపనిషత్తు సమాప్తము.



సుజనరంజనీ ముద్రాక్షరశాల, రాజమండ్రి



మహర్షి సద్గురు శ్రీమలయాళ స్వాములవారు